



# ఇరువదవ సంవత్సరాది సంచిక

౧౯౨౯—౧౯౩౦

[illegible]క్ల సంవత్సరము

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయబడిన

రాజకీయ [illegible] సారస్వతాది

విషయిక వ్యాసములును, దేశభక్తుల చిత్రములును గలవు

ఆంధ్రపత్రికా ముద్రాలయమున [illegible] ప్రకటింపబడెను
6-7, తంబుశెట్టి వీధి, జార్జిటవును, మద్రాసు
1929_వ సంవత్సరము ఏప్రిల్ నెల 10-వ తేదీ



# ది మైసూరు అగ్రికల్చరల్ డైరిఫారం కంపెనీ లిమిటెడ్

## లైఫ్‌స్టాకు కాంపెన్సేషను బ్యూరోతో కలిసియున్నది

**స్థాపితము 1924**

ప్రధానకార్యాలయము:—బసవనగుడి, బెంగుళూరు

వ్యవసాయదారులకు, జంతువులుగలవారికిని ప్రత్యేకసౌకర్యములుకలవు. కొని విశేషమైన లక్షణములు లేవనగా.

లైఫ్‌స్టాకు రిజష్ట్రేషను వడ్డీ తక్కువ
,, సర్టిఫికేటు హోల్డరులకు సులభమగు ఇన్‌స్టాల్‌మెంటు పద్ధతిని అప్పులుతీయుటకు హక్కు గలదు.
,, సర్టిఫికేటులు నాన్‌ఫార్ ఫెయిటబుల్
,, హక్కులు త్వరగ స్థిరపరచబడును

కావలెను:—హిందూదేశమందు ప్రతిచోటను, బర్మా, సిలోనులందును ఆర్గనైజింగు ఇన్‌స్పెక్టరులు, సూపర్‌వైజరులు, సబ్ ఏజంట్లు కావలెను.

పద్ధతులు:—జీతముగాని, కమీషనుగాని, లేక రెండునుగాని ఇవ్వబడును.

ఇతర వివరములకు:—మానేజింగు డైరెక్టరుకుగాని, యీక్రింద నుదహరించిన బ్రాంచీల ఆర్గనైజింగు ఇన్‌స్పెక్టర్లుకుగాని వ్రాయవలెను.

| | | |
|---|---|---|
| అమలాపురం | ఖుల్నా | నెల్లూరు |
| బరంపురం | కొప్పా | నౌగాంగు |
| కల్లికోట | కొట్టాయం | పుదుచ్చేరి |
| కోయంబత్తూరు | మచిలీపట్నం | రాణిపేట |
| గౌహతి | మధుర | సేలం |
| శిర్‌హాట్ | నంద్యాల | తిరుచనాపల్లి |
| | | విజయనగరం |

114

# ది బెజవాడ స్పిన్నింగు అండ్ వీవింగ్ మిల్స్ లిమిటెడ్, బెజవాడ.



ధర తక్కువ ! దేశీయము !! మన్నిక ఎక్కువ!!!

రిజిష్టర్డు ఆఫీసు:—మెయిను కెనాలురోడ్డు, బెజవాడ.

మిల్లుకట్టడములు:—కృష్ణాకెనాలుకు సమీపమున.

నియమించబడిన మూలధనము:—రు. **20,00,000.**

వాటా **1**-కి రు. **20** చొప్పున **1,00,000** వాటాలు.

(31-3-1929) చందా మూలధనము:—రు. **2,98140-0-0.**

(31-3-1929) వసూలుఅయిన మూలధనము:—రు. **272545-0-0.**

ప్రస్తుత కాలస్థితిలో విదేశవస్త్రములను కొనుటకంటె స్వదేశమిల్లుల బట్టలనే కట్టవలసినదని దేశీయనాయకుల యొక్క ముఖ్యోద్దేశము అయినది. సర్వసామాన్యమగు అందుబాటులోనుండి అనుదినము వాడుకకనుకూలమగు వస్త్రములన్నియు నాణ్యమైన దేశీయ నూలుతో తయారుకాబడు ధోవతులు, సైన్లు, జాకీనీదు, తువాళ్లు, పక్కదుప్పట్లు, చారలషర్టింగులు, చీరెలు మొదలయినవి విరివిగా అన్నిచోట్లను ప్రత్యేకము ఆంధ్రదేశమందంతటను అమ్మకము జరుగుచున్నవి. ఆంధ్రులందరు యీ మిల్లుబట్టలనే వాడుకలందులకు గోరుచున్నాము.

కావలయువారికి ఖరీదులపట్టీ పంపబడును. విరివిగా షేర్లుకొని యీ సంస్థను వృద్ధిచేయుట, మన దేశీయులకు ముఖ్యముగా ఆంధ్రులకు విధియైయున్నది. వివరములు తెలిసికొనుటకు చిరునామా:—

గూడూరి లక్ష్మణరావు బి. ఏ., మేనేజింగ్ ఏజంట్ అండ్ డైరక్టర్, బెజవాడ.



# ఆంధ్రదేశపు రాజాస్థానములు

## ఆయుర్వేదౌషధములకు ఆకరములు

అభ్రక భస్మము

క్షీరబలా తైలము

శ్రీ శ్రీ ముక్త్యాల సంస్థానాధీశ్వరులు, వైద్యసంస్థను నెలకొల్పి, ఇతరత్ర లభించని మందులనన్నిటిని, సామాన్యులు చేయజాలని మందులన్నిని, నమ్మకమైన గొప్ప ఆయుర్వేదౌషధములు, శ్రద్ధగా తయారుచేయించి వారి సంస్థానమున 'ప్రశస్తాయుర్వేదౌషధములు దొరుకును' అని పరంపరగా వచ్చుచున్న పేరును సార్థకము చేయుచున్నారు. ... ఎన్నటను లభింపవు. అనేకులు వాటిని మెచ్చుకొనుచున్నారు. చౌకధరలకు పోయి బూటకపుమందులు కొనవద్దు నమ్మకమును, శ్రేష్ఠతను జూచియే కొనవలెను. 'నమ్మకమే' మా ధ్యేయము. చౌకధరలుగల మాయపుమందులకంటె న్యాయమైన ధరలుగల నమ్మకమైన మందులను కొనుటే మంచిదిగదా! సమస్తాయుర్వేదౌషధములు మావద్ద లభించును. ఏ మందు కావలసినను మాకే వ్రాయుడు. కేటలాగు ఉచితము.

# ఆర్యరసాయనశాల

## ముక్త్యాల (కృష్ణా)

# డ్యాజ్‌లో డైమండు (రిజిష్టరు) నగలు

రత్నవ్యాపారస్థులుకూడ
డ్యాజ్‌లో డైమండులను చూచి
వజ్రములని భ్రమించుచున్నారు.



డ్యాజ్‌లో డైమండ్ల నగలు
నవరంబంగారుతో తయారు చేయబడి
పూచీగా పంపబడును.

గాజురాళ్లు కొని మోసపోవుదు.



వేలకొలది
ఖాతాదారులు
డ్యాజ్‌లో డైమండులను
చూచి తృప్తిచెంది, యోగ్యతా
పత్రములను, పెద్ద పెద్ద ఆర్డరులను
దినదినము హెచ్చుగా పంపుచున్నారు.

సుమారు
150 సం॥ లు
పరంపరగా ఈ
వ్యాపారమునందు
అనుభవము గలదు.

నగలు క్యాటలాగు ఇనాం! ఇనాం!! ఇనాం!!!

## డ్యాజ్‌లో డైమండు ధరలు రూ. 3, 4, 5.

# పి. గోపాలస్వామి నాయుడు అండు సన్,

సెంటుథామస్‌మౌంటు పోస్టు (మద్రాసు)

తంతివిలాసము :
"గారంటి"

**P. GOPALASWAMY NAIDU & SON,**

P. O. Saint Thomas Mount (MADRAS)

వీరిమన్య ఐ. సి. యస్. ప్యాసయిరి. మహమ్మదీయయువకులలో వీరి యిట్టి దానికి ప్రథములు.

కళ్యాణికుట్టి అమ్మగారు:—ఈ కన్య బి. యే.(ఆనర్సు) ప్రథమతరగతియందు త్తీర్ణురాలయ్యెను. చరిత్ర, అర్థశాస్త్రములందు చెన్నపురి మేరీరాణి కళాశాలయందు విద్యాభ్యాసము చేసినది.

కామేశ్వరరావుగారు, కొచ్చెర్లకోట:—వీరు చెన్నపురమునందలి ఆంధ్రగీర్వాణ సాహితీ సమాజమునకు చెందినవారు.

కేథర్‌వుడ్ కన్య, ఇ:—కనడా దేశపు మల్లురాలు. హైజంప్ (ఎత్తునకెగురుట) యందు బహుమతులందినది. ఆస్ట్రేలియాలో నంగు పందెములు జరిగినవి.

కేశవదేవజ్ఞాని దంపతులు; ఆంధ్ర ఆర్యన్ మిషన్, గుంటూరు:—వీరు శ్రద్ధానందస్వాములవారి ప్రియశిష్యులు. కాంగ్రీ గురుకుల పట్టభద్రులు. గుంటూరు, బెజవాడ, బందరు ప్రాంతములందు శుద్ధిఉద్యమప్రచార మొనర్చి యితర మతములవారిని కొందరిని హిందూమతమున చేర్చిరి.

కొలాంబునగ్ జలపాతము:— ఈ జలపాతము జయపురమునకు ౮ మైళ్ళదూరమునందున్నది. కొలాంబునది ౩౦౦౦ అడుగుల యెత్తుగల సింహభూమినుండి ౨౦౦౦ అడుగుల యెత్తునందున్న ప్రదేశమునకు దుముకుచున్న దృశ్యము. అచటినుండి జయపురమున కొకమైలు దూరమున నేలమట్టమునకు దింపి యచట విద్యుచ్ఛక్తిని జనింపజేయు ప్రయత్నములు జరుగుచున్నవి.

కోటయ్య చౌదరిగారు, పునుకొల్లు:—వీరు కృష్ణాజిల్లా పెదపారుపూడియందలి శ్రీసీతారామాలయమునకు చెందినవారు.

కొండిమెల కొండయ్యగారు:—వీరు ఇప్పటి దినములలో అతిథి అభ్యాగతులకు నిరాడంబరముగ పూజలొనర్చుటలోను, "ఈ పని నీవలన గావలె"నని అర్థించినవారి కోర్కెలీడేర్చుటలోను, దీనజనులఆర్తి బాపుటలోను, స్వచ్ఛందమైన జీవనమును ఆర్యసంప్రదాయానుసరణముగా నడపుటలోను కొండిమెల కొండయ్యగారు ప్రాచీన కాలపు ఆర్యులలో లెక్కింపదగియున్నారు.

కొండయ్యగారు ఉత్తమ తెలగాకులమున సత్ప్రవర్తనముచే పేరు వచ్చిన కోనేటిరాయుడుగారి కుమారులు. వీరితల్లి శతవృద్ధ కోటమ్మగారు సజీవులై పుత్రసేవగొనుచు భగవద్ధ్యానాసక్తయై విరాజిల్లుచున్నది. కొండయ్యగారి వయస్సు ౬౦ సంవత్సరములు. వీరి నివాసగ్రామము ఏలూరు. చిన్నతనమునుండియు పెద్దలయెడల భక్తి, హితులయెడ రక్తి, ఆడినమాటతప్పకుండుట, నమ్మినవారికి తలలోని నాల్కవలెనుండుటచే బహుజనులకు ప్రీతిపాత్రమై నేటికిని ఆరాధనీయుడై యలరుచున్నాడు.

గొప్పజమీందారు డగు నొక ప్రభు వొకసారి ప్రసంగవశమున "కొండయ్యవంటి పరోపకారిని, ధైర్యసాహసములు గలవారిని తెలుగులో జూడ"మని చెప్పెను.

అనేకులగు స్వదేశప్రభుల నివాసమై యొప్పు నూజవీటిలో కొండయ్యగారు పాంథజనుల కొకధర్మసత్రమును గట్టించియున్నారు.

జలముదొరలకు కొండయ్యగారియందు మిక్కిలి గౌరవము గలదు. చింతలపూడిలో నొక ధర్మసత్రమును గట్టించియున్నారు. ఆ యూరు నైజాము రాష్ట్రమునకు ముఖద్వారమనదగి దినదినాభివృద్ధి గాంచుచున్నది. ఉత్తరాదిలోని పేటేగ్రామమనదగిన ప్రగడవరములో స్కూలు భవనమును గట్టి తాలూకాబోర్డు వారి కొసంగియున్నారు. ఆనేడను వేలకొలది బాలబాలికలు విద్యావంతులై ప్రవర్ధమానులగుచున్నారు. రహదారియగు లింగపాలెమందు ఒకసత్రమును గట్టి ఆ ప్రతివసనుయము స్వహస్తోత్సర్జనము గావించియున్నారు.

ఎన్నైన నొకసత్రము, ఒకతోట, ఒకబావి నేయించి తృప్తిపడుదురుగాని కొండయ్యగారి కీవిషయమున కాంక్ష దీరలేదు. ముఖ్యముఖమనదగిన జంగారెడ్డిగూడెమున నొకసత్రమును, ఆసుపత్రిభవనమును గట్టించి బోర్డువారి కొసంగిరి. కైకలూరు స్కూలునకు వలయు సామగ్రినంతయు నుచితముగా నొసంగి విద్యార్థి జనములప్రీతికి పాత్రమైరి.

వ్యాపారము మాని, యథేచ్ఛముగా నింటగూర్చున్నను సుఖజీవనముగల కొండయ్యగారి నిపుడింట జూచుటయే సకృత్తు.

ఎప్పుడు విన్నను ఎవరికో యొకరి కుపకారము చేయుటకో, ఎవరో అతిథులకు ఆతిథ్య మొసంగుటకో, ఎక్కడనో సత్రము గట్టుటకై కొలుపగొనుటకో, కుటుంబయజమానుల ప్రార్థనముపై ఏ కోర్టులోనో యొకరికి స్థిరాస్తి వేలముకాకుండ జామీను నుండుటకో, మర్యాదస్థుల మానము కాపాడుటకై పూచీకత్తు నిచ్చుటకో వెళ్లియున్నారనువార్తలే వినబడుచుండును. కొండయ్యగారిని ఏలూరు నివాసులని చెప్పుటగూడ సాహసమే. వృత్తిపన్ను నియ్యదగినంతకాలమైనను ఏలూరులో నుండుటలేదు.

ఏలూరులో తమ తల్లిగారిపేర నొకసత్రమును నిర్మించుటకై ప్రయత్నించుచున్నారని తెలియుచున్నది. కొండయ్యగారు కొండ లేని గప్పించి యండలకిచ్చుచుందురు గాని తేనెకంటె వారితేనె పలుకు లెక్కువరుచికరముగా నుండును. మోసజూడగా సకృత్తుగా కొందరు పరోపకారపారీణు లిట్టివా రీకాలమునగూడ నుందురని కొండయ్యగారి నుదాహరణగా జూపుటకు భగవంతు డీతని నిర్మించెనాయనిపించును.

శ్రీ కొండయ్యగారికి శ్రీమదనంతకోటిలీలావిలాసుడగు భగవంతు డాయురారోగ్య సకలైశ్వర్యము లొనగూర్చి యితోధిక నిరంతర ప్రజాసేవాపరునిగా నొనర్చుగాత!

**కోమలం కన్య:**—దక్షిణభారతదేశమున నీమెయే మొదటి సినీమా నటకురాలు కావచ్చును. 'మోటారుకారుల పిచ్చి' యను ఫిల్ము నందు పాల్గొనుచున్నది.

**కృష్ణంరాజ, రామరాజ, నరసింహరాజ యోగీంద్రులు, పొత్తూరి:**—వీరు ఆయుర్వేదకుధానిధి బిరుదాంచితులు. క్షత్రియులు. వీ రిపుడు గోదావరిజిల్లా, పడమటి గోదావరిజిల్లా, నగసాపురంతాలూకా, ఏనుగువానిలంకయను గ్రామమున హాసగోపాగ్రశమున నున్నారు. తత్త్వలక్షణ్వాది గ్రంథములను రచించినారు. ప్రకృతితత్త్వపరిశోధకులు

**కృష్ణస్వామిగారు, యస్. వై:**—వీరు యస్. కె. యజ్ఞనారాయణయ్యగారి కుమారులు. ఐ. సి. యస్ పరీక్షయందు నెగ్గినవారు.

**కృష్ణాబాయి, యల్:**—చెన్నపురి యువకసంఘకార్యదర్శిని. అలహాబాదునం దొక కళాశాలలో గృహతంత్రోపాధ్యాయినిగా నియమింపబడెను.

**క్రిష్ణాబాయి కమలాబాయి సోదరీమణులు, రత్నాల:**—కూర్చున్న యామె కృష్ణాబాయి బి. ఏ., యల్. టి. వీరు రత్నాల అబ్బాయినాయుడు గారి పుత్రికలు. సంగీతము, చిత్రకళయందు ప్రవేశము కలవారు. ప్రస్తుతము శాంతినికేతనమున నందలాల్ బోసుగారివద్ద చిత్రకళా విద్యాభివృద్ధినిగావించుకొనుచున్నారు.

**కృష్ణన్‌గారు, కే.వి.,యమ్.బి.బి. యస్., డా॥:**—వీరు గిండీయందున్న కింగ్ ఇన్‌స్టిట్యూట్‌నకు సంబంధించినవారు. రాక్‌ఫెల్లర్ విద్యార్థి. కొన్ని అమెరికా విద్యాలయములందు చదివి డి. బి. పరీక్షయందు ప్రథమస్థానమున నుత్తీర్ణులైరి. వీరు (ఎడింబరో) యమ్. ఆర్. సి. పి. పరీక్షకును పోవనున్నారట.

**గంగరాజుగారు, కలిదిండి:**—వీరి నివాసము పడమటి గోదావరిజిల్లా, తాడేపల్లిగూడెముతాలూకా కేశవరము గ్రామము. కాంగ్రెసుపక్షమునకు చెందినవారు. ఆతాలూకాబోర్డుకు అధ్యక్షులు. సంపన్నులు. గ్రామసంస్కరణ ప్రారంభవిద్యాదులకు ప్రత్యేకము కృషి సేయువారు.

**గంగాధరరావు నాయుడుగారు, మాదిరెడ్డి.కీ॥ శే:**—వీరిది మచిలీపట్టణము. వీరు తహసీల్‌దారుగా పనిచేసి పింఛను పొందినవారు. 'సంగీత గోపీచందు' అను నాటకమును రచించినవారు.

**గణపతిశాస్త్రిగారు, ఉప్పలూరు, కాకినాడ:**—పూర్వోత్తర మీమాంసాశాస్త్రములందును, వ్యాకరణశాస్త్రమునందును చక్కని పాండిత్యముగలవారలు; శ్రౌతప్రయోగమునందు దిట్టలు. వేదాధ్యయనపరులు. విద్యారణ్యభాష్యసహితముగ వేదార్థము నుపన్యసింపగల నేర్పరులు. కృష్ణాజిల్లా గుడివాడతాలూకా నూంపలదీవియందు 20-2-29 తేదియందు జరుపబడిన కృష్ణాగుంటూరు మండల బ్రాహ్మణమహాజనసభకు అధ్యక్షులు.

**గురుస్వామిగారు, వి. యస్:**—వీరు మధురజిల్లాకు చెందినవారు, గణితశాస్త్రమున నపూర్వప్రతిభగలవారు. వర్గ, ఘన, వర్గమూల, ఘనమూలాది గణితముల నెంతటివానినైన నవలీలగ త్వరలో లెక్కించి చెప్పగలరు. పాపము, వీరికి మశూచికముచలన దృష్టి లోపించినదట.

**గురుస్వామి మొదలియారుగారు, యమ్. ఆర్:**—చెన్నపురి వైద్యకళాశాలయందు ఓషధీగుణతత్త్వశాస్త్ర పండితులగు వీరు వైద్యమునందు క్రొత్త పరిశోధనలనుగూర్చి తెలిసికొనుటకు విదేశములకు పంపబడిరి.

**గోపాలయ్యంగారు, కె.:**—వీరు 'హిందూ' పత్రికాధిపతులలో నొకరు. ఈసంవత్సర యీపత్రిక పంచాశద్వార్షికోత్సవము జరిగెను.

**గోపాలస్వామినాయుడుగారు, పి:**—వీరు పరంగిమలై యందు మణులవర్తకులు, నగలవర్తకులు.

**గోవిందకృష్ణయ్య నాయుడుగారు, పి:**—వీరు కీ॥ శే॥ గుంటూరు వేంకట కృష్ణయ్యనాయుడుగారి కుమారులు. వీరిని ప్రభుత్వమువారు వేతనమిచ్చి హైడ్రో ఎలెక్ట్రిక్ డెవలప్‌మెంటును గురించి అనుభవమును కలిగించుటకు గ్రేట్‌బ్రిటనునకు పంపించిరి.

**గోవిందరావుగారు, వి:**—వీరిది పాలసనపల్లి. సురభి ఫస్టు సంచారక నాటక కంపెనీ మేనేజరు, ప్రొప్రయిటరును.

**గౌతమీ వ్యాయామ కళాశాల, రాజమండ్రి.**

వీరు పద్మశాలీయులు, పరోపకార పరాయణులు, గ్రంథకర్తలు.

**చాందీగారు, కే:**—వీరు మైసూరు విశ్వవిద్యాలయమున వ్రజేంద్రనాథ శీల్‌గారి స్థానమున ఉపాధ్యక్షులుగ నియమితులైరి.

**చార్లెటీ సంజీవరావుసతిగారు:**—ఈమె విశాఖపట్టణపు జిల్లాబోర్డునకు సభ్యురాలు.

**జనార్దనస్వామిగారు, దావత్. వైద్యభూషణ:**—వీరు దక్షిణ హైదరాబాదు నివాసులు. పద్మశాలిప్రముఖులు. వీరి కుటుంబము ఆయుర్వేద వైద్యమునకు పేరుకన్నది. వీరుచక్కని ఆయుర్వేద ఫార్మసీని స్థాపించిరి.

**జయరామనాయుడుగారు, కోటా, మద్రాసు:**—ఆయుర్వేదభూపతి శ్రీయుత డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారిచే స్థాపింప

బడిన ఆంధ్రాయుర్వేదిక్ ఫార్మసి లిమిటెడ్ బ్రాడ్వే బ్రాంచియందు వీరు వైద్యులుగనున్నారు. పెక్కు అమూల్యమైన ఔషధములను స్వంతముగ తయారుచేసి బీదలకుచితముగాకూడ నొసగుచున్నారు. అధిక గనులు, అధికము వీటియందు ప్రత్యేక పరిశోధనలు సలిపి వైద్యసంబంధమైన వ్యాసములను పత్రికలకు వ్రాయుచుందురు.

జమదగ్ని నాయకర్, కడపేరి:— వాలాజా తాలూకా కాంగ్రెస్ కమిటీకి సంబంధించిన వీరును ఉత్తర ఆర్కాటు ఖైదు చేయబడిరి.

జయపురం మహారాజావారు గోల్డెన్ ప్రభువు గారికిచ్చిన విందు-బెజవాడ:— ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ప్రోఛాన్సలరుగ నియమింపబడిన జయపురము మహారాజావారు గవర్నరు గారికి విందిచ్చిన సందర్భమున తీయబడిన ఛాయాచిత్రము.

జాన్‌స్టన్ గారు, రెవ॥ ఎ. బి. యమ్. ఏ:— మచిలీపట్టణము నోబిల్ కాలేజి ప్రిన్సిపాలగు వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయపు సెనెటునందు సభ్యులైరి.

జానకిబాయమ్మగారు, దిగుమర్తి:— ఈమె విశాఖపట్టణజిల్లా విద్యాసంఘసభ్యురాలు. గోషా ఆసుపత్రి సిబ్బందియాసుపత్రుల నియమిత ప్రసంగకురాలు. సంఘసేవాపరాయణ.

జార్జికన్య, ఇ:— చెన్నరాజధానియందు యం. ఏ. పరీక్షయందు ప్రథమతరగతియందు ప్రథమురాలుగా నుత్తీర్ణయైనది. చెన్నపురి క్రిస్టియన్ కాలేజియందు తత్త్వశాస్త్రవిద్యార్థిని.

జ్యోతిర్మయీ గంగూలీకన్యగారు, యమ్. ఏ:— రెండవ మదరాసు రాష్ట్రీయ అస్పృశ్యతా నివారణప్రచార మహాసభాధ్యక్షురాలు.

డాహ్మోకిన్ కన్య, బి. యే., బి. యల్:— ఈమె బర్మా హైకోర్టునందు జడ్జిగా నియమింపబడినది.

తిరుమూర్తిగారు, డా॥ టి., రా॥ సా॥ బి. యే. యమ్. బి. సి. యమ్., డి. టి. యమ్. హెచ్.(లండన్):— డాక్టర్. లక్ష్మణస్వామి ముదలియారు గారి స్థానమున మదరాసు మెడికల్ కౌన్సిలునకు సభ్యులుగ నెన్నుకొనబడిరి. వీరు విశాఖపట్టణము మెడికల్ కాలేజియందు Pathology డిపార్టుమెంటు అధికారులు.

తిరువాంకూరు మహారాజావారు, చెన్నపురమున:— రాయపేటయందు తీయబడిన ఛాయాచిత్రమిందుగలదు. శ్రీ కొల్లం గోదురాజావారు, జూనియరు మహారాణీవారు, తిరువాంకూరు రాజావారు మొదలగువా రిందు కలరు.

తిరువాంకూరు మహారాజుగారు:— వీరి చిత్రమునందు బాలభటవేషమున నున్నారు.

తులసికోట ౨ చిత్రములు.

౧. ఇది తులసికోట-దానిపై కట్టినవిమానము. ఇట్లు అనువర్సగము కార్తికమాసమున తయారుచేయుచుందురు. ఈ తులసికోట మెట్లపైని పెట్టు రంగుల ముగ్గులు తివాచీపరచినట్లుండును.

౨. ఇది ఒక్క తులసికోటను మాత్రమే పెద్దదిగా కనబఱచు చిత్రము. ఇట్లు కార్తికమాస శుద్ధ ఏకాదశి మొదలు పౌర్ణమివఱకు అనుదినము రాత్రి జయపురము మహారాజావారికోటలో తులసికోటను ముగ్గులతో నలంకరించుచుందురు.

తేజుద్దీన్, డా॥:— చెన్నపురి శాసనసభా సభ్యులగును వీరు క్రొత్తగ కౌన్సిల్ కార్యదర్శియైరి.

దుర్గా మల్లికార్జునరావుగారు, కోగంటి:— వీరిది గుడివాడ తాలూకా, అంగలూరు గ్రామము. వీరు తెనుగున కవన మల్లగలరు. వీరి వ్యాసములను తెలుగు పత్రికలలో చూడవచ్చును.

దేవకీకన్య, ఎ. సి:— మేరీరాణీ కళాశాలయందు చదివి యీమె బి. ఏ. యందు చరిత్రవిద్యార్థినిగ ప్రథమ తరగతియందుత్తీర్ణయయ్యెను.

దేశికాచార్యులుగారు, దీవి:— వీరు చెన్నపట్టణము ఆయుర్వేదాశ్రమాధిపతులు. కీర్తిశేషులైన ఆయుర్వేదపరిశ్రమ్ని, భిషఙ్మణి దీవి పండిత గోపాలాచార్యులు గారి సోదరుడు. వారిచే స్థాపింపబడిన వైద్యశాలను మిక్కిలి సామర్థ్యముతో నిర్వహించి, వైద్యశాలకు గొప్పఖ్యాతిని,నన్నైను, దెచ్చుచున్నారు. బీదలకు ప్రతిదినము ఉదయమందు ఔషధమిచ్చుచుందురు. శాంత, ఉదార స్వభావముగలవారు. అనేక గుప్తదానములు చేయుచుందురు.

నరసింహంగారు, కొత్తపల్లి:— వీరు పశ్చిమ గోదావరిజిల్లా పాలమూరు వాస్తవ్యులు, సరస్వతీ గ్రంథాలయమును స్థాపించినవారు. కొన్ని ఆయుర్వేద గ్రంథములను ప్రచురించినవారు. సహాయనిరాకరణమం దభిమానులు.

నరసింహారావు గారు, కె. వి:— వీరు విజయనగరము కళాశాలయందు విద్యార్థులు. హాకీయాటయందు నిపుణులు. పతకముల బడసిరి.

నల్లముత్తు అమ్మాళ్ కన్య, సి. యన్:— లేడీ విల్లింగ్డన్ కళాశాలయం దధ్యాపకురాలుగ నుండిన యీమె ఉన్నత విద్యకొఱకు ఇంగ్లండున 4 సంవత్సరము లుండి తిరిగివచ్చి రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజి సూపరింటెండెంటుగ నున్నది. ఈమె డా. ముత్తులక్ష్మి అమ్మగారి చెల్లెలు.

నాగేశ్వరరావు గారు, దొంతంసెట్టి:—వీరు దేవాంగకులమునకు జెందినవారు. వీరిది కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా వెంట్రప్రగడ గ్రామము. వీరి కుటుంబమువారు వైద్యమునకు పేరు గన్నవారు. వీరు స్వసంఘోద్ధరణమునకయి 'దేవాంగజ్యోతి' యనుపత్రికను ప్రారంభించి తామే సంపాదకులుగనుండి నిరాఘాటముగా కొంతకాలము జరిపిరి. కాని సంఘము స్నిగ్ధము కామిచే కాబోలును నది కొంతకాలమునుండి ఆగిపోయియున్నది. ఇప్పుడు వీరు చెన్నపురమున భారతీ కార్యాలయమున సంపాదకవర్గమువారిలో నొకరుగ నున్నారు. వైద్యమున పరిచయము గలవారగుటచే 'అమృతరత్నాకరము' అను పేరనొక ఔషధాలయమును స్థాపించి తెనాలినందు యథాశక్తి ప్రజాసేవను చేయుచున్నారు పంచనామోద్ధరణమునకు పాటుపడుచున్నారు.

నారాయణదాసుగారు, వసమూలు. వైద్యానువైద్య గ్రాంటెడ్ హకీమ్:—వీరు పశ్చిమ హైదరాబాదు నివాసులు. ఆయుర్వేదవైద్యమున ప్రఖ్యాతి వహించిన పండితశాలీయులు. వైద్యాలయము నొకదానిని స్థాపించినవారు.

నారాయణరావుగారు, ఏ., బి. యల్:—పబ్లిసిటీ సెల్ సర్వీస్ మేనేజరు. భారతీయ సినిమా పల్లెలపరిశ్రమ సంబంధమున ప్రపంచయాత్రకు వెడలిరి.

నిరంజనశాస్త్రిగారు, వడ్డెపాటి:— శ్రీకృష్ణా గుంటూరు మండలద్వయ విశ్వబ్రాహ్మణసంఘమును స్థాపించియు, "ప్రబోధిని" యను పేరిట మాసపత్రికను నెలకొల్పియు వీరు అధునిక విశ్వకర్మసంఘమునందు నేటి యుత్సాహమునకు మూలకారకులైయున్నారు. గీర్వాణాంధ్రభాషలయందు పెక్కుగ్రంథములు రచించి సుప్రసిద్ధోపాధ్యాయులుగను, కవిశేఖరులుగను, కులోద్ధారకులుగను గౌరవింపబడుచున్నారు. విశ్వకర్మోద్ధారక సంఘపక్షమున పసిమలేటి గోదావరి జిల్లా పెనుగొండలో జరిగియుండిన 18 వ ఆంధ్రరాష్ట్రీయ విశ్వబ్రాహ్మణ మహాసభ వీరిచే ప్రారంభము చేయబడినది. వీరు అధునిక శాస్త్రానుగుణ్యముగ "విశ్వకర్మ" వంశాగమము అను చరిత్ర గ్రంథమును రచించుచున్నారు. వీరు ప్రకృతము గుంటూరు జిల్లాబోర్డు ఉన్నత పాఠశాలయందు ప్రధానపండితులుగ నున్నారు.

నైనియప్పపిళ్లె గారు:—చిదంబరము నివాసులగు వీరు కాంగ్రెసువాదులు; జైలున కంపబడిరి.

పాండలేగారు, మేజర్, కే.జి.:—అఖిలభారతీయ విజ్ఞానశాస్త్ర మహాసభ (చెన్నపురి) కు వీరు కార్యదర్శిగ నుండిరి.

పాయ్‌గారు, పి:— చెన్నపురి క్షయరోగ వైద్యాలయ సూపరింటెండెంటగు డా॥ యమ్. శేషపాయిగారి కుమారులు వీరు. ఐ. సి. యస్. పరీక్షయందు కృతార్థులైనారు.

పార్థసారథినాయుడు, కోశా, కీ॥ శే॥:—వీరు కాకినాడ నివాసులు. ఆదివెలమ కులమువారు. వీరు సుప్రసిద్ధాంగ్లవైద్యులని పేరుగాంచిరి.

పిళ్లెగారు డా॥ పి. పి:—అంతర్జాతీయ కార్మిక కార్యాలయమున ప్రధానాధికారిగ నియమింపబడిరి. ఈ కార్యాలయము ఇండియాలో శాశ్వతముగ స్థాపింపబడుటకు నిశ్చయింపబడినది.

పుదుకోట సూత్రిన మహారాజుగారు:— ఇందలి చిత్రము వీరి పట్టాభిషేకము తరువాత తీసినది.

పూనాసేవాసదనము చెన్నసగరశాఖ:—
ఈ శాఖాస్థాపన సందర్భమున చెన్నపురమున తీయబడిన ఛాయాచిత్రమిది. ఇందు ముఖ్యులు, అధ్యక్షులు గా॥ ముత్తా వెంకట సుబ్బారావు గారు, నాగరత్న, దేశ్‌ముఖ్ గారు, శ్రీమతి జానకీబాయిభోక్ గార్లు కలరు.

పెసారొటి, ప్రొఫెసర్:—కె. రామ పెసారొటి గారు తిరుపతి తిరుమలతిరుపతి శ్రీరామానుజ సంస్కృత కళాశాలాధ్యక్షులు. వీరిని నాగపుర విశ్వవిద్యాలయము వారు "కేరళమున మతము వేదాంతము" (ముఖ్యముగ శ్రీశంకరాచార్యుల వారితో సంబంధమున్నదంతయు) అను విషయముపై నుపన్యాసము లిచ్చుట కాహ్వానించిరి. ఇట్లు నాగపురమువారిచే మలయాళదేశీయులు సమ్మానింపబడుటకు ఇదియే మొదలు.

పైడితల్లి గారు, కె:—వీరు విజయనగర కళాశాల హాకీ ఇన్‌స్పెక్టరు, హాకీయందు పతకముల బడసిరి.

బజులుల్లా సాహెబుగారు, ఖాన్ బహాదూర్:—పరిశ్రమ శాఖాధికారిగ నుండిన వీరు ఎక్సైజు కమిషనరుగను, రెవిన్యూబోర్డుసందు సభ్యులుగను నియమింపబడిరి.

బలరామకృష్ణయ్యగారు, దు:—వీరు అంగలూరు వాస్తవ్యులు. 'ఆంధ్ర బౌద్ధవాఙ్మయబ్రహ్మ' బిరుదము నడసినవారు, బుద్ధపురాణ గ్రంథకర్తలు. మానవాదర్శ గ్రంథమండలి సంస్థాపకులు, సంపాదకులు; బహుభాషావిశారదులట. 'మనుష్యజీవిత' మను గ్రంథమును రచింపుచున్నారట. పేదవిద్యార్థులకు సాయము చేయుచుందురు.

బ్రాడ్‌ఫీల్డ్ గారు, లెఫ్॥ కర్నల్॥ ఇ. డబ్ల్యు.సి:—. చెన్నపురి జనరల్ ఆసుపత్రి సూపరింటెండెంటుగ నుండిన వీరు చెన్నపురి ప్రభుత్వ వైద్యశాఖ జనరలుగ నియమింపబడిరి.

భద్రాచల చిత్రములు:— శ్రీరామదాసాశ్రమమునందు శ్రీభగవద్గీతోపన్యాసకులు: గొట్టుపూళ్ల సీతారామానుజాచార్యులుగారు. వీరు జిల్లాబోర్డుసభ్యులు, ప్లీడరు, పెద్ద అర్చకులును. రామాలయజీర్ణోద్ధారకులు, కల్యాణి గ్రంథాలయపోషకులు.

ఆయుర్వేదోపన్యాసకులు: ఆయుర్వేద విద్వాన్ విద్వత్కవి కుంజర పండిత కామసముద్రం వెంకటకృష్ణమాచార్యులుగారు, శాయారు సన్నిధి నిర్మాతలు.

ఆశ్రమాధిపతి: పొడిచేటి సీతారామానుజాచార్యులుగారు.

శ్రీ॥ శ్రీ॥ మహాయోగి గోవిందస్వాములవారు ఆంధ్రదేశమున ౧౮ మఠములను నిర్మించి గోళ్లస్వామి, గొంగళ్లస్వామి, బోడిస్వామి మున్నగు ౧౧ నామములను పొంది భద్రాద్రిమఠములో ప్రభవ సంవత్సరము పరమపదించిరి.

ఆర్. ఆర్. శాస్త్రిగారు ఆంధ్రభాషార్ణవం మేనేజరు. కల్పవల్లీ గ్రంథనిలయ ప్రధానపోషకులు.

శ్రీరామదాసాశ్రమమువారిచేనిర్వహింపబడుచున్న శాఖలు:— గ్రంథనిలయశాఖ, గ్రంథమాలాశాఖ, పఠనమందిరశాఖ, విశ్వకళాప్రబోధకశాఖ, విజ్ఞానప్రచారకశాఖ, రాత్రిపాఠశాలశాఖ, పరిషచ్ఛాఖ.

భరతన్ కుమరప్పగారు, యమ్. ఏ., పి-హెచ్. డి. (ఎడింబరో), డా॥:— చెన్నపురి క్రైస్తవకళాశాలయందు వేదాంతశాస్త్రాధ్యాపకులుగ నుండిన వీరిపుడు ఉన్నత తత్త్వశాస్త్ర విద్యకై యింగ్లాండు కేగిరి.

భాస్కరసేతుపతిగారు:— వీరు తండ్రి యనంతర మిటీవలనే రామనాథపుర సింహాసన మధిష్ఠించినారు.

భాష్యాచార్యులుగారు, కందాడై:— వీరిది హిందూపురము. ఆంధ్రభాషాభిమానులు. శారదా గ్రంథపఠనాలయ స్థాపకులు.

మంగయ్య పంతులుగారు, యర్రమిల్లి, బి. యే. బి. యల్.:— బందరులోని ఆంధ్ర ఇన్సూ్యరెన్సు కంపెనీకి సెక్రటరీ. తొలుత వీరు రేలూరులో న్యాయవాదిగానుండి అసహాయోద్యమ సమయమున నావృత్తిని వీడిరి. అప్పటినుండి కొంతకాలము పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగ నుండి ఆంధ్రదేశమున చాలచోట్ల ప్రచారము చేయుచుండిరి. ౧౯౨౧ మొదలుకొని యిన్సూ్యరెన్సు పనియందున్నారు.

మాధవయ్యగారి కుమారిత, యమ్. బి. బి. యస్.:— సుప్రసిద్ధ గ్రంథకర్తలగు శ్రీ॥ శ్రీ॥ మాధవయ్యగారి ఆఖరు కుమారిత యీమె. గ్రేట్ బ్రిటన్ నందున్నత విద్యలనందుకొఱకు వాడియా స్కాలర్ షిప్ నందినది.

మార్జొరి విలియమ్సుగారి సతి:— గత వత్సరము యమ్. బి. బి. యస్. యందుత్తీర్ణురాలయిన స్త్రీ యీమె ఒక్కతెయే.

మీనాక్షి కాలేజి, చిదంబరము, ఆంధ్ర విద్యార్థి సంఘము:— ఇది ౧౯౨౮ సం॥ నవంబరునెలలో స్థాపితమైనది. ఈ కళాశాలయందు చదువు ఆంధ్ర విద్యార్థుల యభివృద్ధికొఱకు ఏర్పడినది.

మీరయ్యనాయుడుగారు, కోనాడ:— వీరు మాండలే నివాసులు. రంగూను ఆంధ్రజనసంఘమునకు చాలకాలము కార్యదర్శిగ నుండిరి. రంగూనులోని దయానంద్ ఆంగ్లవైదికోన్నత పాఠశాలయందు ప్రధానోపాధ్యాయులు.

మునుస్వామి అయ్యర్, యమ్. కె; యమ్. యే., బి. యల్:— 'బ్రిటిషు ఇండియాయందు గ్రామముల స్థానిక స్వపరిపాలనము' అను విషయముపై వీరు వ్రాసిన ఉత్తమవ్యాసమునకు కలకత్తా భారత వాణిజ్య సంఘమువారు ప్రథమ బహుమానమిచ్చిరి. వీరు మంచి చదువుకొన్నవారు. చాలా పత్రికలలో వ్యాసములను వ్రాసినవారు.

మునిస్వామినాయుడుగారు, బి; బి. ఏ., బి. యల్., యం. యల్. సి., రా॥ బ॥:— చిత్తూరుమండలములోని వేలంజేరి గ్రామము వీరి నివాసస్థలము. వీరు కమ్మవారు. ప్రజాహిత శీలురు. చిత్తూరులో న్యాయవాదిగ నున్నారు. 1923 న చిత్తూరుజిల్లా బోర్డు అధ్యక్షులుగ నియమింపబడిరి. తరువాతను వీరే ఎన్నుకొనబడిరి. చిత్తూరుమండలవాసుల కన్నియో సౌకర్యముల కల్పించిరి. మండల విద్యాసంఘమున కధ్యక్షులుగనుండి యా మండల విద్యాశాలలను మంచి స్థితికి దెచ్చిరి. చిత్తూరు పురపాలక సంఘమునకును అధ్యక్షులైరి. చెన్నశాసనసభకును వీరు మూడుమారు లెన్నుకొనబడిరి. ఇటీవల వీరు కాంగ్రెసులో చేరి ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీసభ్యులుగ నెన్నుకొనబడిరి. చిత్తూరుమండల కాంగ్రెస్ సంఘమునకు కార్యదర్శిగ నున్నారు.

ముఖర్జిగారు జే. యన్; ప్రొఫెసరు, యమ్. ఏ., డి. యస్ సి:— కలకత్తా విశ్వవిద్యాలయమున శ్రీ గురుప్రసాద్ సింగు గారి పేర వెలసిన పండితపదవి నున్నవారు. వీరు గత భారతీయ విజ్ఞాన శాస్త్ర మహాసభయందు రసాయనశాస్త్రశాఖ కధ్యక్షులు.

మూర్తిగారు, కె. యస్. యల్. యం. యస్. డాక్టరు॥ వీరిది రాజమహేంద్రవరము. వీరు హోమియోవిధానము ననుసరించి వైద్యముచేయుదురు.

మూర్తిగారు, హెచ్. డి; రాజవైద్య:— వీరు తొలుత బొంబాయిలో ఎలెక్ట్రికల్ ఎంజినీరుగ నుండిరి. అసహాయోద్యమకాలమున ఆ ఉద్యోగమును వదలి గోదావరిజిల్లాలో అసహాయోద్యమప్రచారమును కావించుచుండిరి. నాగపుర పతాక సత్యాగ్రహము కారణముగ మూడునెలలు కృష్ణజన్మస్థానమున నుండిరి. ఇపుడు వీరు భీమవరము గ్రామములో నివాస మేర్పరచుకొని వైద్యము చేయు

మన్నారు. నిరపాయకరములగు మూలికలతో వీరు సర్వరోగముల నివారణ చేయగలరట. మఱియు భూతచికిత్సయు చేయుదురట.

మెగాగారు, కర్నల్, సి. ఐ. ఇ. ఐ. యమ్. యస్.:—వీరు చెన్నపురికి క్రొత్తగా నియమింపబడిన సర్జను జనరలుగారు.

మెహతాగారు, కె. సి., యమ్. యస్‌సి. పి హెచ్. డి:—వీరు ఆగ్రా కళాశాలయందు పండితులు. భారతీయ విజ్ఞాన శాస్త్ర మహాసభయందు వృక్షశాస్త్రశాఖ కధ్యక్షులు.

రంగరామానుజంగారు, యస్. జి., బి. యే., బి. యల్:—వీరు చెన్నపురి పురపాలకసంఘసభ్యులు. పురపాలన విధానములను నేర్చికొనుటకు పాశ్చాత్యదేశముల కేగిరి.

రంగస్వామిగారు, వి. యన్., యమ్.ఏ.:—వీరు రా॥ సా॥ వి. యన్. నారాయణస్వామి అయ్యరుగారి కుమారులు. సాంకేతికవిద్యల నభ్యసించుటకు ప్రభుత్వమువారి వ్యయముపై మాంచెస్టరుకు వెళ్లిన 4 గురు విద్యార్థులలో వీరొకరు.

రాఘవదాసుగారు, వేణుగోపాల కృష్ణమూర్తిశర్మగారు, మానేపల్లి:—వీరిది ఒంగోలు తాలూకా సోమవారుగ్రామము. వీరు పితాపుత్రులు. తండ్రి తరంగభాగవతారు బిరుదుగడించినవారు. కొడుకు షోడశకర్మాధికారి.

రాజరత్నంగారు, కె. ఆర్.:—విశాఖపట్టణమున వీరొక ఆంధ్రవిద్యార్థులు. బొంబాయి యందుగల ఫిల్ముపరిశ్రమయందు శిక్షణనొందుచున్నారు.

రాజారామమోహనరాయల వర్ధంతి:—చెన్నపురమున వై.యమ్.సి.యే.యందు జరిగిన సభయందు శ్రీ పిఠాపురము రాజావారధ్యక్షత వహించిరి. రాజావారు, కుమారులు, మొదలగువారీపటమందుగలరు.

రాధాకృష్ణన్ గారి వీడ్కోలు విందు:—ఈ వేసవి గడచిన ఆక్స్‌ఫర్డువిశ్వవిద్యాలయమున 'Comparative Religion and Philosophy' (అనుషంగిక మత-తత్త్వముల)కు అధ్యాపకులుగా పోనున్న ప్రొ. రాధాకృష్ణగారికి కలకత్తాయందలి Post Graduate (బి. ఏ. పైతరగతుల) ఆంధ్రవిద్యార్థులీనడుమ నొక వీడుకోలు విందొసగిరి.

రామచంద్రభట్టుగారు:—బార్డోలీ సత్యాగ్రహము నందు పట్టుదలతో పాల్గొన్నవారిలో నొక్కరు. అది పరిసమాప్తి నొందుటకై భట్టుగారు ప్రభుత్వమువారు బార్డోలీ ప్రజలపైవేసిన మొదటిపన్నునకును రెండవపన్నునకును గల భేదపుమొత్తమును చెల్లింతు ననిరి. ఇందుకు బొంబాయి ప్రభుత్వమువా రంగీకరించిరి.

రామబాలభక్త పుస్తక భాండాగారము, రాజమండ్రి:—ఈ ఛాయాచిత్రము ఈ భాండాగారముయొక్క చతుర్థ వార్షికోత్సవ సందర్భమున తీయబడినది.

రామమూర్తిగారు, కాశి:—విజయనగరము నివాసులైన వీరు విశ్వకర్మోద్ధారకసంఘ ఉపాధ్యక్షులు. విశాఖపట్టణ మ్యునిసిపల్ సంఘసభ్యులు. స్వకులసేవ యొనర్చుచున్నారు. రాబోవు తృతీయ విశ్వకర్మ మహాసభాహ్వానసంఘమున కధ్యక్షులు.

రామమూర్తిగారు, గానాల:—రాజమహేంద్రవర నివాసులు. విశ్వకర్మోద్ధారకసంఘము యొక్క ప్రధానాధ్యక్షులు. స్వకీయవిశ్వబ్రాహ్మణకుల సేవయొనర్చుచున్నారు. వక్త. అనేక సభలకు అధ్యక్షత వహించి యుండిరి. "సమదర్శిని" సంపాదకులుగ నున్నారు.

రామవర్మగారు, రాజా, సర్, జి. సి. యస్. ఐ., జి. సి. ఐ. ఇ:—కొచ్చిను భూతపూర్వ రాజావారు. వీరు చెన్నపురమున జరిగిన వేదాంతమహాసభను ప్రారంభించినవారు.

రామానుజులుగారు శ్రీమతి యం. కె.:—గుంటూరు పురపాలక సంఘసభ్యురాలుగా ప్రభుత్వమువారిచే నియమింపబడినదామె.

రామారావు, తుంగల లేక మాస్టర్ శ్రీరామ రాయ వర్మగారు:—వీరు రాజమండ్రి వాస్తవ్యులు.

రాయచౌదరిగారు, డి. పి.:—దేవీప్రసాదరాయిగారు; సంగయుతకులు. వీరిప్పుడు చెన్నపురి ప్రభుత్వ చిత్రకళాశాలయందుపాధ్యాయులుగ నున్నారు.

రావుగారు, డా॥ కె. ఆర్., యమ్.ఏ.డి.యస్‌సి.:—వీరు విజయనగరము మహారాజావారి కళాశాల పరిశోధనాగారమునకు చెందినవారు. లండన్ ఇంపీరియల్ సైన్సుకాలేజిలో స్పెక్ట్రొస్కోపీ (కిరణతత్త్వపరిశోధనము)యందు పరిశోధనమును జరుపుటకు పోయిరి. ప్రభుత్వమువారు వీరికి వేతనమిచ్చుచున్నారు.

లక్ష్మన్న పంతులుగారు, గంటి:—వీరు పేరూరు ద్రావిడులు. హైకోర్టు న్యాయవాదులు. జననకాలము ౧౮౭౩ సంవత్సరము. జన్మస్థానము తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకా, పేరూరు గ్రామము. అత్యంత ప్రతిభతో ప్రతిపరీక్షయందుత్తీర్ణులైరి. ఆంగ్లభాషా పాండిత్యము అద్వితీయము. పంతులుగారు ఆంగ్లభాషయందు మాట్లాడునపుడు అమృతప్రాయ

ముగ నుండును. నిరాడంబరమూర్తి. ఉన్నతాశయపరులు. ఉదారభావోపేతులు. పరోపకారధురీణుడు. రాజమహేంద్రవరము పురపాలక సంఘసభ్యుడుగ ఒక పరి పనిజేసిరి. జిల్లాబోర్డు తాలూకాబోర్డు సభ్యులుగ ౯ సంవత్సరములు పైగానుండిరి. రాజమహేంద్రవరము చెఱసాల అనధికారసందర్శకులుగనుండి ప్రజాహితజీవనమున కడు శ్రద్ధతో కృషిసల్పిరి. కష్టమనక, రాత్రియనక పగలనక మానవసేవకై యావజ్జీవితమును ధారవోసిన మహాశయుడు. గోదావరిజిల్లాలో ప్రజాభిప్రాయమునకు ఈపురుషుడే ప్రమాణముగ నుండిరి.

తాలూకాబోర్డు యుపాధ్యక్షుడుగనున్న కాలమున పరిపాలనమున ఎన్నియో యభివృద్ధికరమగు మార్పులను గావించి ప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి. అడుగుటయే తడువనునటుల అసంఖ్యాకులుగ ఎందరికో యుద్యోగముల నిప్పించిన పుణ్యమూర్తి. ౧౦ మొదలు ౯౦ రూపాయలవరకు యుపాధ్యాయ పదవులనుగూడ ఎందరికో నిష్పాక్షికముగ కులకతీతులను పాటింపక యిచ్చిరి. గోదావరిజిల్లాలో ప్రతికుటుంబములోను రాముని పేరు తలచుకొనునటులే లక్ష్మన్నపంతులుగారి పేరును తలచుకొని చేయెత్తి మ్రొక్కనివారులేరు.

లక్ష్మన్నపంతులుగారి ఇల్లు ధర్మసత్రవు. ఇందలి అతిశయోక్తి ఇంచుకయు లేదు. నేటికిగూడ రాత్రియందుగూడ ఆగంతుకులు వారి ఇంట ఆతిథ్యమును బొందుచునేయున్నారు. నిరతాన్నప్రదాత. రాజమహేంద్రవరమున యున్నపుడు వీరియింట భుజించిన విద్యార్థులసంఖ్యను దెలుపుట ఎవరితరము గాదు. పండిత సత్కారములో మహానుభావుడు. లేదు అను పదము ఆయన వాఙ్మయమందు కన్పించదు. ప్రతిదినము వారిఇంట నేడుగూడ 30 మందికి తక్కువగాకుండ భుజించుచునే యున్నారు. విద్యార్థులకు అగవ ఆంగ్ల మను భేదమును పాటింపక, విద్యార్థివేతనముల నిచ్చుచున్నారు. ఇదిగాక విద్యార్థులకు భోజనమునుగూడ బెట్టుచున్నారు.

ఒప్పుచేయుటయే వీరి తప్పు. ఈ విషయమునే వీరిని గురించి దక్షిణ హిందూదేశపు విజ్ఞానసర్వస్వమున "చారిటబిల్ టూ ఎఫాల్టు" అన్నారు. ఆపద్బాంధవుడు. ఆంధ్రోద్యమమన్న వీరి కత్యంత ప్రీతి. ఆంధ్రులందరిని యుద్ధరించుటయే వీరి పవిత్రసంకల్పము. తిరసుముగ నిండు హైకోర్టు న్యాయమూర్తుల దగ్గరకు రాయబారమును నడిపి జిల్లామునసబుల పదవులను ఆంధ్రులకు ఎక్కువగా నిచ్చునటుల జేసిన పురుషోత్తముడు. చెన్నపురిలో న్యాయవాదులలో అరవసోదరుల గౌరవమును బడసిన వారిలో వీరే ప్రథములనుటలో అతిశయోక్తి ఏమియు లేదు. లక్ష్మన్నపంతులుగారు ఆధునిక ఆంధ్రభావనికి ఆదర్శప్రాయులని నిస్సందియముగ బలుకవచ్చు. కొంతకాలము రాజమహేంద్రవరములో పత్రిక ప్రాసిక్యూటరుపని చేసిరి. [మిత్రుడు]

**లక్ష్మణస్వామిగారు, దాసరి:**— వీరిది పిఠాపురము. వీరు నన్నయభట్టు మొదలుకొని, కందుకూరి వీరేశలింగము పంతులువరకుండు కవీశ్వరుల వివిధవిషయవర్ణన పద్యములను ఓపికతో ఏర్చి వర్ణనరత్నాకరము అను గ్రంథముగా ప్రకటించినారు. కొన్ని యితర గ్రంథములను కూడ రచియించిరి.

**లక్ష్మీనరసమ్మ సత్సంగినీగారు, పి. బి:**—ఈమె మాండలిక వేంకటేశ్వరరావుగారి సహధర్మిణి. ఈమె మంచి యోగాభ్యాసకురాలట. పరోపకార పరాయణ.

**లక్ష్మీనారాయణగారు, అప్పాద్వేదుల, డా॥ యమ్. ఏ. డి. యస్‌సి, యఫ్. ఐ. పి. (లండన్):**—వీరు విజయనగరవాస్తవ్యులు. వీరు భారతీయ ప్రభుత్వవాతావరణ శాస్త్రజ్ఞులుగ నియమింపబడియున్నారు. కార్యస్థానము కొడైకెనాలున నున్నది. కడచిన ౧౫ యేండ్లును వీరు విజయనగరమున భౌతికశాస్త్ర పండితులుగ నుండిరి.

**లక్ష్మీనారాయణ హరిశ్చందన జగద్దేవుగారు:**— వీరు తెక్కలి రాజావారు; యమ్. ఆర్. ఏ. యస్. యస్. బి. డి. యమ్. కావ్యవినోది, ఉత్కళసాహిత్యరత్న, విద్యావాచస్పతి, పురాతత్త్వవిశారద. చెన్నపురి రాజధాని ఉత్కళ సమ్మేళనసంఘమునకును, చెన్నపురి ఉత్కళసమాజమునకును అధ్యక్షులు.

**లూయిసాథియోబాల్డ్ సతిగారు, డబ్ల్యు. హెచ్:**— మైసూరు సంస్థానమున ముదటిసభ్యురాలుగా నియమింపబడినయామె.

**వరదగోపాలస్వామి ఆలయము, గోష్పదక్షేత్రము:**—కొవ్వూరు గౌతమీతీరము నందలి గోష్పదక్షేత్రమున తపమొనరించిన గౌతమ మహామునిచే ప్రతిష్ఠింపబడిన శ్రీ వరదగోపాలస్వామి వారి ప్రాచీనాలయము యొక్క చిత్రము.

**విజయనగరము మహారాజావారి సంస్కృత కళాశాల:**—పండితులును ౩వ, ౪వ తరగతుల విద్యార్థులును.

**విశ్వనాథ, ప్రొఫెసరు యస్. వి, యం. ఏ:**— వెనుక వీరు తిరుచినాపల్లి జాతీయకళాశాలయందు చరిత్ర పండితులుగ నుండిరి. ప్రస్తుతము చెన్నపురి సర్కిల్ నకు పురాతత్త్వ శాఖా కార్యాలయమున సూపరింటెండెంటుగనున్నారు.

**వీరభద్రుడుగారు, సరిదే:**—వీరు గోదావరిజిల్లా, పెద్దాపురం కాపురస్థులు. వీరు కళావంతుల కుటుంబములోనివారు. స్వపంఘోద్ధరణమునకై పాటుపడువారు. జిల్లా తాలూకా బోర్డులయందును, పురపాలకసంఘమునందును సభ్యులుగ నియమింపబడిరి.

**వీరేశలింగవర్ధంతి, చిట్టవరము:**—శ్రీ వాసుదేవగ్రంథాలయమువారిచే నీవర్ధంతి జరుపబడినది.

**వెంకటప్పగారు, రావుసాహెబ్, యమ్:**—ఖాన్ బహదూర్ ఖలీముల్లాగారి బదులు చెన్నపురికి సహాయ పోలీసుకమిషనరుగ నియమింపబడిరి. వీరు బ్రహ్మనుతిష్ఠులు.

**వెంకటరంగయ్య నాయుడు గారు, టి:**—మైసూరునందు వీరొక ఫిల్మును తయారు చేసియున్నారు ప్రస్తుతము కాశీయందు ఫిల్ముపరిశ్రమ చేయుచున్నారు.

**వెంకట్రామయ్యగారు, దోరగుడి:**—వీరు పల్లికొండయందలి ధర్మవివాహ ఉపనయన సంకీర్తనా కైంకర్యసభా సంస్థాపకులు అధ్యక్షులును.

**వెంకటరత్నంగారు, రేపాక:**—వీరిది పాలకొల్లు. వీరు వైశ్యులు. భాషాభిమానము గలవారు.

**వెంకటరత్నముగారు, మద్రాసువాద:**—వీరు చిత్రకారులు. ఇపుడు గుంటూరు శారదానికేతనమున చిత్రకళోపాధ్యాయులు. బందరు జాతీయకళాశాలయందు విద్యాభ్యాసము చేసిరి.

**వేంకటనరసింహంగారు, చెరుకువాడ:**—వీరు సుప్రసిద్ధ సహాయనిరాకరణ దీక్షాపరులు, తత్త్వప్రచారకులును, తమ్మాలమున శ్రీకృష్ణజన్మస్థలమున వాసము చేసినవారును. ఇపుడు వీరు ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ తరపున పని చేయుచున్నారు.

**వేంకటరమణమూర్తిగారు, బాకురుపండా:**—వీరి నివాసము విశాఖపట్టణమున. వీరు గౌడబ్రాహ్మణులు. ప్రసిద్ధిగన్న కుటుంబము వీరిది. మంచి శాస్త్రప్రయోక్తలు. వీరు లక్షరూపాయిలు విలువ చేయు భూముల నగ్రహారముగ దానము జేసియున్నారు. ప్రజోపయోగ కార్యములకై తమ ధనమును ఉచితముగ నిచ్చుచుందురు.

**వెంకటరత్నముగారు యద్దనపూడి:**—వీరిది పశ్చిమ గోదావరిజిల్లా, తాడేపల్లిగూడెము. దేశసేవాపరాయణులు. స్వానుభవమును పురస్కరించుకొని 'పులివేట' 'కోయల చరిత్ర' యను పుస్తకముల వ్రాసిరి. మఱియు 'ఇష్టాగోష్ఠి', 'ద్రవ్యశాస్త్రము' అను పుస్తకములగూడ వ్రాసిరి.

**వెంకట నారాయణ నాయుడు గారు, జే. దిబా:**—చెన్నపురి మునిసిపల్ కమిషనరుగ నుండిన వీరు ప్రభుత్వము వారిచే న్యాయశాఖా కార్యదర్శులుగ నియమింపబడిరి.

**వెంకట సుబ్బారావుగారు, గుండిమెడ:**—వీరిది గంజాముజిల్లా, ఛత్రపురము. వీరు కవులు, చిత్రకారులు. 'రాణాప్రతాప్' నాటకము మొదలగు గ్రంథముల రచించినవారు. 'కవిరత్న' బిరుదాంచితులు.

**వెంకటస్వామి రెడ్డిగారు, మాచిరెడ్డి:**—వీరిది నాగిరెడ్డిపల్లె. అనటి సహకారసంఘాధ్యక్షులు, ఫారెస్టుపంచాయతీ అధ్యక్షులును. శుద్ధఖద్దరువస్త్రధారి, కాంగ్రెసు సంఘాధ్యక్షులు, సేవాపరాయణులు.

**వెంకటసూర్యనారాయణరావు నాయుడుగారు, సామినేని విజయనగరం:**—వీరు కమిషన్ ఏజంటైనను, వీరికి సాముద్రిక శాస్త్రమునందుగల ప్రావీణ్యము అమోఘము. బొటనవ్రేలును కొన్ని నిమిషములు పరికించి, భూత, భవిష్యత్, వర్తమానములను వారు స్వయముగాచూచినట్లు తెలుపగలరట. వీరు దీనికై డబ్బు పుచ్చుకొనరు.

**వెంకట హనుమంతరావుగారు, పల్లె. కాకినాడ:**—వీరు నాట్యకళాభిమానులు. నేటి నాట్యసంఘములలో నొకటియగు ఆంధ్రసేవాసంఘము (రిజష్టర్డు) ను స్థాపించి కార్యదర్శిగను గంగాధ్యక్షులుగను నుండిరి. ఆసంఘమునకు సరస్వతీభవన మను నొకభవనమును కూడ గట్టించిరి. తరువాత ఆసంఘముతోడి సంబంధము వదలుకొని శ్రీ విజయభారత సభ యను పేరున నింకొక నాట్యకూటమును స్థాపించి వీరే కార్యదర్శులుగ నున్నారు. వీరు మొదటినుండియు నాటకములందు స్వయముగ పాత్రముల ధరించుచు, ఇతరులను క్రమశిక్షచేత నటకులుగ తయారుచేయుచునున్నారు. విశ్వామిత్రాది సాత్త్వికేతర పాత్రధారణమునందు వీరు పేరు గన్నవారట. వీరికి గాత్రమార్దవము కొంత తక్కువట. ఐనను రసాభినయము, పాత్రపోషణము వీరియందు వెలసియుండునట.

**వైదేహి కన్యగారు:**—ఈమె వయస్సు ౭ యేండ్లట. హిందూస్త్రీలక్ష్మీవిలాస సభకు అధ్యక్షురాలును, హరికథలు చెప్పుట కారంభించిన మొదటి నారీమణియగు శ్రీమతి యమ్.లక్ష్మీఅమ్మాళ్ గారి మనుమరాలీబిడ్డ. ఈమె చక్కగా హరికథాకాలక్షేపము చేయగలదు. ఈబాలిక తన ౫వ యేటనే చెన్నపురి యాంధ్రసభ దసరా ఉత్సవములలో ముద్దులొలుకునట్లు నాట్యముచేసి మెప్పునుగాంచి రజతపాత్రము నొకదానిని బహుమతివడసినది. హరికథాకాలక్షేపమున కీమె యొకబంగారుహారమును, పతకమును బహుమతి నొందెను.

**శంకరశాస్త్రిగారు, తాడేపల్లి, ఐ. యమ్. యస్., యమ్. డి:**—వీరు శస్త్రవైద్యమున ఎక్కువ సామర్థ్యమును సంపాదించుటకై యీమధ్య ఆస్ట్రియాయందలి వియన్నాకు పోయిరి. వీరు సుప్రసిద్ధాంధ్రులు. నెల్లూరుజిల్లా వైద్యశాఖాధికారిగ నుండిరి.

**శారదాబాయికన్య:**—గత వత్సరము మహారాష్ట్రిలలో పట్టభద్రయైన స్త్రీ యీమె ఒక్కతెయే.

**శర్మానందగారు, డా॥:**—వీరు ఆంధ్రులు. వీరిది ఇందుపల్లి. గుంటూరునందు వైద్యులు. భూతభవిష్యద్వర్తమానములను చెప్పగలవారట.

**శివరామన్‌గారు, ఎ:**—వీరు సదాశివయ్యరుగారి కుమారులు. బొంబాయిలోని పి ఫరీక్ అను పత్రికవారియందు శిక్షణనొందుటకు పంపబడిరి.

**శాంభవిబాయిగారు, ఆర్., బి. యే:**—ఈమె శ్రీ రఘునాథపుంజా, బి. యే., బి. యల్. గారి సతీమణి. బంటుకులస్థులలో నీమెయే ప్రథమ పట్టభద్రురాలు. దక్షిణకన్నడ జిల్లాబోర్డు సభ్యురాలుగా నున్నది.

**శివరామయ్యగారు, తేజోమూర్తుల:**—వీరిది గంజాం జిల్లా, లక్ష్మీనరసుపేట. వీరు ౬ సంవత్సరములుగ దేశాభివృద్ధికొఱకైన పెక్కుకార్యములందు నుత్సాహముతోను, శ్రద్ధతోను పనిచేయుచున్నారు.

**శివరావుగారిసతి, పి:**—శాసనసభాసభ్యులగు పి. శివరావుగారి భార్య. ఈమె బళ్లారి ప్రభుత్వబాలికా మాధ్యమిక పాఠశాలయొక్క సలహాసంఘమందు సభ్యురాలుగ నియమింపబడెను.

**శేషాద్రిగారు, యస్:**—వీరు లండనునందు ఐ. సి. యస్. పరీక్షయందు ఉత్తమ తరగతిలో నుత్తీర్ణులైరి.

**శ్రీనివాసగన్‌సతి, యల్. డి:**—పాలంకోటయందీమె ప్రసవశిశ్వారోగ్య సంఘ కార్యదర్శిని, భారత మహిళాసమాజ సహాయకార్యదర్శిని. ఈమె తమిళదేశప్రతినిధిగ పాట్నా స్త్రీవిద్యాసభకు వెళ్లినది.

**శ్రీనివాసభారతి, కె. వి:**—ఉత్తర ఆర్కాటునందు ఖైదుచేయబడిన కాంగ్రెసువాది.

**శ్రీనివాసయ్యగారు, వి:**—వీరిది తాటిపర్తి. అనటి ఉన్నతపాఠశాలలో చిత్రలేఖనోపాధ్యాయులు. వీరు మైక్రోటైపిస్టు, అనగా బియ్యపుగింజమీద పద్యములను వ్రాయగలవారు. ఇందుకై వీరు కొన్ని సువర్ణపతకములను పొందియున్నారు.

**శ్రీనివాసయ్యంగారు, కె:**—వీరు 'హిందూ'పత్రికాధిపతులలో నొకరు.

**శ్రీపతిగారు, మంకాల, విద్వాన్:**—వీరిది చిత్తూరు జిల్లా. ఆంధ్రబ్రాహ్మణులు. పాఠశాలల కుపయోగించు కొన్నిపుస్తకములను వీరు రచియించినారు. స్వయంకృషివలన పైకి వచ్చినవారు.

**శ్రీరామ రాత్రిపాఠశాల, విశాఖపట్టణము:**—ఇది అరుంధతీయవాలెంటరీ సోషల్ సర్వీసులీగువారిచే నడిపింపబడుచున్నది. కార్యదర్శి వి. సూర్యనారాయణమూర్తిగారు.

**శ్రీరాములు చౌదరిగారు, యేలెళ్ల:**—వీరిది కృష్ణా జిల్లా, అంగలూరు గ్రామము. రైతులకు మిగుల నుపయోగకరమగు 'పశువైద్య చింతామణి' అను పుస్తకము తెలుగున రచించినవారు. మరికొన్ని పుస్తకములనుగూడ రచియించియున్నారు.

**సంకీర్ణ జంతు చిత్రములు (Composite animal pictures):**—సంకీర్ణ జంతు చిత్రములనగా వివిధ జంతువులను ఒకదానితో మరియొకటిచేర్చి చిత్రించి తద్వారా ఒక జంతుస్వరూపమును చిత్రించుట. ఈచిత్రములు లక్నో నగరమున విశేషముగ తయారగుచుండెడివి. ఇట్టివి లిఖితచిత్రములే కాక శిల్పచిత్రములుగూడనుండెడివి. ఒకకాలమున నీచిత్రములు ఎక్కువ యాకర్షకములుగ నుండి బాగుగ ప్రసిద్ధినందినవి. కాని క్రమక్రమముగ ప్రజలకు వీనిపై నభిరుచి తగ్గిపోయినది.*

* ఈవివరణమంతయు 1896 సం. జనవరినెలనాటి 'ది జర్నల్ ఆఫ్ ఇండియన్ ఆర్టు అండు ఇండస్ట్రీ' అనుపత్రికలోని ఒకవ్యాసమునుండి గ్రహింపబడినది అందువ్యాసకర్త "......... కాని వాటిపై (సంకీర్ణచిత్రములపై) నభిరుచి తగ్గిపోవుచున్నట్లు తెలియుచున్నది" యని వ్రాసినాడు. దీనినిబట్టి 1896 సం. నాటికీచిత్రముల ప్రసిద్ధి పూర్తిగ నణగిపోలేదని తెలియుచున్నది. ఐన ప్రస్తుతమున నవి లక్నో నగరమున వ్యాప్తిలో నున్నవో లేవో తెలియదు.

ఈసంకీర్ణ జంతుచిత్రములను వినోదప్రదర్శనములకై తయారుచేసెడివారు. ఇవి రెండు విధములు—(1) వివిధజంతువుల వివిధ శరీరభాగములను ఆధారముగ దీసికొని వానిని నన్నిటిని గలిపి మరియొక జంతువుగా జిత్రించుట. (2) కొన్ని జంతువులయు, గొందరుమానవులయు సమావేశనముచే నొక జంతువును తయారుచేయుట.

ఇందుగల యేనుగుల బొమ్మ యీ రెండవ రకపు చిత్రణమున కుదాహరణము.

**సంగమేశ్వరకవి గారు, కొమ్మూరి:**—రాజామునివాసులు. శతావధాని, అష్టావధాని. "ఆంధ్రవిద్యావాచస్పతి". విశ్వబ్రాహ్మణులు. పూర్వపు "విశ్వకర్మ" సంపాదకులు. ఉపన్యాసకులు. విశ్వకర్మోద్ధారకసంఘ ప్రధాన ధర్మాధికారి.

**సత్యనారాయణగారు, రాయప్రోలు:**—వీరిది రాజమహేంద్రవరము. చింతామణి నాటక సంఘమునందలి నటకులలో నొకరు.

సత్యనారాయణ చౌదరిగారు, రావిపాటి:— ర్పు గోదావరిమండలమందలి దంగేరు గ్రామమునందు కమ్మగృహస్థులు వీరు. సంపన్నులు. అసహాయోద్యమ ప్రచారమందు ఒక సంవత్సరము ఖైదు ననుభవించిరి. తాలూకాబోర్డులందు కాంగ్రెసుసభ్యులుగ నుండిరి.

సత్యనారాయణమూర్తిగారు, మధునాపంతుల:— తూర్పుగోదావరిజిల్లా, పల్లెపాలెం వీరి నివాసము. వీరు సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు. వీరి స్వగ్రామమున నొక చిన్న వైద్యాలయమును పెట్టి బీదల కుచితముగ మందుల నిచ్చుచుందురు.

సరస్వతీ స్వాములవారు, జి. ఎస్. బి, పరమహంస:— నెల్లూరుజిల్లా యిందుకూరుపేట నివాసులైన వీరు బ్రాహ్మణ కులజులు. బ్రాహ్మణేతరులందు స్వకులయాజన మేర్పడునట్లు ప్రోత్సాహము చేయుచు ఆంధ్రరాష్ట్రమునందంతటను ప్రచారము సల్పి చాల ప్రబోధము నొనర్చినారు. శ్రౌతస్మార్తములందు గొప్ప విద్వాంసులు. ఆర్యధర్మప్రవర్తకులు. వీరి కాంధ్రదేశమందు చాలమంది శిష్యులున్నారు.

సర్వేశ్వరరావు పంతులుగారు, దొడ్డిపట్ల, కీ॥ శే॥ తణుకు:— వీరు సహాయనిరాకరణవాదులు. తాలూకా కాంగ్రెసు సంఘమునకు, జాతీయవిద్యాలయమునకు, కోఆపరేటివు భారత ఖద్దరు నిలయమునకు అధ్యక్షులుగ నుండిరి.

సాంబమూర్తిగారు, టంకాల:— వీరి నివాసము గంజాముమండల మందలి టెక్కలి గ్రామము. వీరు ఆర్యవైశ్యులు. స్వసంఘాభివృద్ధికిని జాతీయాభివృద్ధికిని తోడ్పడుచుందువారు. కాంగ్రెస్ సభ్యులు. గంజాం మండలమున పలాసలో జరిగిన ఆర్యవైశ్యసభ కధ్యక్షత వహించినవారు.

సినీమా అధికారులసంఘము:— సినీమాకమిటీ అధ్యక్షులగు దీ॥ బ॥ టి. రంగాచారియార్ గారికి రాయపేటయందు దీంసు సభ్యులు విందొనరించిరి.

సుందరవరదన్ గారు, వాలాజా:— కాంగ్రెసు వాదియగు వీరును జైలునకేగిరి.

సుబ్బారావుగారు, రాళ్లబండి, యమ్. ఏ:— ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘమునకు కార్యదర్శి. వీరు నాగపురమున జరిగిన ఇండియన్ హిస్టారికల్ రికార్డ్స్ కమిషన్‌నకు ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రతినిధిగ నియమింపబడిరి.

సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కె; దివాన్ బహాదరు కాకినాడ:— ఆంధ్రదేశీయుల పారిశ్రామిక వాణిజ్య సౌకర్యములకొఱకు చెన్నపురమున ఆంధ్రవాణిజ్య సంఘమను పేర నెలకొనిన యొక క్రొత్త ప్రత్యేక సంఘమునకు వీరధ్యక్షులు.

సోమసుందరంగారు, ప్రొఫెసర్:— ఆర్నల్డ్ సోమర్‌ఫీల్డుగారు చెన్నపురమున విశ్వవిద్యాలయమువారేర్పరచిన ఉపన్యాసముల నొసంగినారు.

స్వామినాథ ముదలియారు, గుడియాత్తం:— తాలూకా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు. ఉత్తరఆర్కాటున ఖైదులో నుంపబడిరి.

స్వామిబాబుగారు, పోట్నూరు:— గంజాంజిల్లా నరసన్నపేట యూనియన్‌బోర్డు అధ్యక్షులు. కాంగ్రెసువాది. వైశ్యకులోద్ధారకులు. సంఘసంస్కరణాభిమాని.

హిందీ ఉద్యమము, దక్షిణ ఇండియా:— చెన్నపురమునకు జమ్నాలాల్ బజాజ్ గారు వచ్చినపుడు జరిగిన ఒక సభ ఛాయాచిత్రమిందు గలదు. శ్రీనివాసయ్యంగారధ్యక్షులు. రాజగోపాలాచారిగారు మొదలగువారు ఇందు గలరు.

హిందీపాఠశాల, గండిగుంట:— ఈ సంఘవ్యవస్థాపకులు దండమూడి వెంకట రామబ్రహ్మం చౌదరిగారు. హిందీ ప్రచారకులు, కోడేటి వెంకటకృష్ణయ్యగారు.

హిల్టన్ బ్రౌన్ గారు, ఐ. సి. యస్:— స్థానికస్వపరిపాలనాశాఖకు మదరాసు ప్రభుత్వ కార్యదర్శిగ నియమింపబడినవారు.

---

రాజగోపాలరావుగారు, టేకుమళ్ల, బి. ఏ. :— వీరు చెన్నపురి క్రైస్తవ కళాశాలయందు దేశభాషాధ్యక్షక పదవి యందున్నారు. వీరు సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము గలవారు. భాషా, చారిత్ర పరిశోధకులు 'సౌత్ ఇండియన్ రిసర్చి' అనుమాసపత్రిక నొకదానిని కొంతకాలము నడిపినారు. ప్రాచ్యగ్రంథ నిర్ణయ సభయొక్క ఆంధ్రశాఖకు అధ్యక్షులుగా నున్నారు. అమూల్యములగు వీరి పరిశోధనఫలములు తరుచుగా వ్యాసరూపమున ఆంగ్లాంధ్రపత్రికల నలంకరించుచుండును. వీరు గ్రంథకర్తలు కూడను.

సత్యనారాయణగారు, అచంట:— వీరు బి. యే. పరీక్షయందుత్తీర్ణులై, యమ్. బి. (వైద్య)పరీక్షకు జదువుచు, సహాయ నిరాకరణోద్యమమున ప్రభుత్వవిద్యాలయమును బహిష్కరించిరి. పిదప తదుద్యమమున మిగుల ఆసక్తితో పనిచేసి, తుదకు 'ఖద్దరు' ఉద్యమమున దిగి తద్విషయమై ఎక్కువ పట్టుదలతో పనిసాగించిరి. తన్నిమిత్తమై అర్థమునేకాక ప్రాణములను గూడ దారవోసినవారు. అకలంక దేశారాధకులు.

రాజమ్మగారు, ఆకారపు:—ఈమె ఆకారపు చెన్నయ్యగారి ధర్మపత్ని. వీరు ఓరుగల్లునివాసులు. దానధర్మపరాయణులు. వీరు విభవసం. జ్యేష్ఠ శుద్ధ ౧౫ నాడు లింగైక్యమును చెందినారు. ఈమె సాధ్వీమణియని ప్రసిద్ధిని బడసినది. జీవితమంతయూను సకలసంపదలతోను సౌభాగ్యముతోను గడిపినది. ఈమె అంత్యేష్టి సమయమునందు గోదాన సువర్ణదాన వస్త్రదానాది సకలదానములు విశేషముగను చేయబడినవి. ఆకాలమునందు పండితులు, వేదాధ్యయనపరులు, కవులు దయచేసి యథావిధిగ కర్మకాండము నడిపించిరి. ఈమె జీవితకాలమునందు సకల జనులకును నుపకారమును జేసి ధన్యవాదములను బడసినది. ఆమె తన పుణ్యావశేమున శివ సాయుజ్యమును బడయుగాత! ఆకారపు నరసింహంగారు వీరి కుమారులు. ఈ నరసింహంగారు ఇప్పుడు చెన్నపురమున నొకసుప్రసిద్ధవర్తకులుగా నున్నారు.

వెంకటాచార్యులుగారు, అంగర, ఆయుర్వేదవైద్యులు:—వీరు శ్రీ వైఖానసులు. 40 సంవత్సరముల నుండి వైద్యము బీదల కుచితముగా జేయుచు 1920 సంవత్సరములో రాయవరం గ్రామంలో శ్రీ పట్టాభిరామవైద్యశాల స్థాపించిరి.

సత్యనారాయణగారు, ఉప్పల.:—అనకాపల్లి మ్యునిసిపల్ కౌన్సిలర్. 1928 అక్టోబరు నెలలో వచ్చిన వరదలలో బీదజనులకు బట్టలను అన్నములను విరివిగా దానము చేసినారు.

శ్రీనివాసయ్యంగారు,సి.ఆర్.,బి.ఏ.,యల్.టి.కీర్తనాచార్య. వీరు తంజావూరుజిల్లా మన్నారుగుడి తాలూకాలో ౧౮౭౬ వ సంవత్సరమున జననమొందిరి. సంస్కృత తమిళ భాషలయందును, చరిత్రయందును, సంగీతశాస్త్రమందును మంచిప్రవీణులు. పట్టభద్రులయినది మొదలు నలువదిసంవత్సరములు విద్యాసంబంధి సంస్థలయందు ప్రధానాధ్యాపకులుగనుండి నిరంతర సారస్వత సేవచేయుచున్నారు. వైదిక, మతవేదాంత సారస్వత పౌరాణిక చారిత్రకగ్రంథములను, కథలను, నాటకములను పెక్కిటిని తమిళమున రచియించి ప్రకటించినారు. ఆంగ్లమునను కొన్ని మతగ్రంథములను రచియించినారు. మరియు సంగీతశాస్త్రగ్రంథములను రచియించినారు. ఇన్ని విషయములను గూర్చి వీరు కావించిన విమర్శనలు పెక్కు ఆంగ్లతమిళపత్రికలయందు వెలువడినవి. సంగీతశాస్త్రాభివృద్ధికొరకు వీరు ఇపుడు చాల పరిశ్రమించుచున్నారు. విశ్వకళాపరిషత్తువారు వీరిని సంగీతవిద్యావిధాన నిర్ణయ సంఘమున నొక సభ్యునిగా నెన్నుకొనియున్నారు. చెన్నపురి ప్రభుత్వమువారు సంగీతవిద్యావిధానక్రమ నిర్మాణమునకు వీరిని నియమించినారు. వీరు పెక్కు సంగీత మహాసభలకు అధ్యక్షులుగ నుండిరి. పెక్కు కళాశాలలలో—సంగీతశాఖకు అధ్యక్షులుగ నున్నారు.

## அமிர்தாஞ்சன అమృతాంజన




పాండిచెరి ప్రదర్శనమునందు మదరాసు అమృతాంజనం డిపోవారు తమ ప్రదర్శనశాల స్థాపించుటకిదియే ప్రథమము. గవర్నరుదంపతులుచూచి మెచ్చుకొనిరి.

## డాక్టరు జీ. బీ. గారి

# సుగంధనశ్యము

అంగములయందెల్ల శిరస్సును, ఇంద్రియములయందెల్ల నయనములును, ప్రధానములను విషయము సర్వజనులకును తెలిసినవిషయమే కదా! ఈ రెండిటియందును కలుగు వ్యాధులు సాధారణముగా ప్రాణ




హాని కలిగించకున్నను అవి వ్యాధిగ్రస్తుని జన్మమును నిష్ప్రయోజకముగాఁ జేసి యా మరణాంతమును బాధించుచుండును. ఇట్టి వ్యాధులకు లోనికి తీసికొను మందు లనేక ముపయోగింపఁబడుచు వచ్చినవి గాని యవి యా వ్యాధులను నివారింప లేక పోవుటయే గాక రసవిషగంధకాదులు చేరినవిగా నుండుటచేత తుదకు దేహారోగ్యము నంతను చెడఁజేయునవిగాఁ గూడ నేర్పడినవి. తరువాత పై పూతలును పట్లును నవనాగరికులచేత మంచి వైద్యములుగా తీర్మానింపఁబడి యట్టి మందులు కూడ ననేక మిప్పు డుపయోగింపఁబడు చున్నవి గాని యవిగూడ నంత ప్రయోజనకరములుగా గ్రహింపఁబడుట లేదు.

ఈ సందర్భము లన్నియును యోచించి చిరకాలము పరిశ్రమచేసి యాయుర్వే దాంగిలేయ యూనానీవైద్యములం దారి తేరి లోకోపకారార్థమై తమసర్వస్వమును వినియోగించుచున్న డాక్టరు, **జీ. బీ. గారి సుగంధ నస్యమును** కనిపెట్టిరి. ఇది యిదవరకే లోకమందంతటను వ్యాప్తము చేయబడి సుప్రసిద్ధమైనది కాబట్టి దీనినిగురించి మేము విశేషించి శ్లాఘించవలసిన పని లేదు. ఒకసారి యుపయోగించిన యెడల దాని యుత్కృష్టగుణము నదికే స్థాపించగలదు. దీనిచే బాధానివృత్తి గాంచి కృతజ్ఞతా పూర్వకముగా గొప్పవారును కొలఁదివారును పంపిన యోగ్యతాపత్రికలు లెక్కకు మిక్కిలిగా నున్నవి. 1923-వ సంవత్సరమున డిశంబరుమాసములో బరోడాయందును, 1928-వ సంవత్సరమున ఫిబ్రవరిమాసములో సూరత్ నందును, జరిగిన భారత పారిశ్రామిక ప్రదర్శనములందు బంగారు పతకములను బహుమానముగా పొందనది.

ఈ సుంగధనశ్యము నుపయోగించుటవల్ల మెదడు, ముక్కు, కన్నులతో సంబంధించిన సమస్త వ్యాధులును సమూలముగా నశించును. పీనసము, ఒంటితలనొప్పి, గొంతులోనిపోట్లు, జలదోషములు, మొదలైన కంఠమునకు పైబడిన 66 వ్యాధులకును ఈ సుగంధ నశ్యము పెట్టినది బిక్షము.

సాధారణముగా పొడివేయువార లీ సుగంధ నశ్యమును కట్టి రెండు సారులుపయోగించిన యెడల, ఇది సాధారణపు పొడి 10, 15 సారు లుపయోగించినంత పనిచేయును.

**బుడ్డి 1-కి అ. 4. వి. పి. ఖర్చు అ 4. డజను 1-కి రూ. 2-8-0. వి. పి. ఖర్చు 0-8-0.**

**విలాసము:—గురుబసవ అండు కంపెని లిమిటెడ్,**

**పోస్టుబాక్సు 510, పార్కుటవున్, మద్రాసు.**

# The Bengal Insurance & Real Property Ltd.

**CULCUTTA.**

# ది బెంగాల్ ఇన్సూరెన్సు అండు రియల్ ప్రోపర్టీ కంపెని,

## నెం. 8, డల్హౌసీస్క్వేర్, కలకత్తా.

ఢిల్లీ ఎసెంబ్లీసభలో కాంగ్రెసుపక్ష ప్రధాననాయకులు శ్రీయుత సత్యేంద్రచంద్రమిత్ర, యం. ఏ. బి. యల్., యం. యల్. ఏ. గారును, వారి శక్తిసామర్థ్యములు గల, శ్రీయుత మనోరంజనగుప్త, బి. ఏ., (అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు) మొదలుగాగల వారి త్యాగము, న్యాయబుద్ధి, నిర్దుష్టజీవితము గలవారిచే నిర్వహింపఁబడుచున్నది.

సంపూర్ణముగా భారతీయుల పెట్టుబడిచేత నిర్వహింపబడుచున్న భీమాకంపెనీలో భీమాచేయించుకొని, అకాలమృత్యువు, అపాయము, వార్ధక్యమునుండి మీప్రియమైన దారాపుత్రాదులకు, జీవితాధారము కలుగజేయుడు.

ముఖ్యగమనిక:— శాశ్వత అసమర్థత; రెట్టింపుసొమ్ము తక్కువ ప్రమియమునకే యిచ్చుట; పూర్తి యగు హామీ కలదు. పాలసీలకు సకాలమునకే, ఎట్టి కష్టము లేకుండనే సొమ్ము యివ్వబడును.

చెన్నపురి రాజధానిలో, ముఖ్యపట్టణములలోను, ఇతరప్రదేశములందును, అనుభవము, శక్తి, సామర్థ్యము, పలుకుబడిగలవారు ఏజెన్సీలకు యీ దిగువ విలాసమునకు వ్రాయుడు:—

శ్రీయుత, దుర్భ వేంకటాద్రి, మైలాపూరు, చెన్నపురి.
,, టి. జయరాము మొదలియారు, 2, సుందరం పిళ్లె వీథి, పరుశువాకం.
,, యన్. సి. షా అండు కంపెనీ, 28, బీచ్ మొదటివీథి, చెన్నపురి.
,, కోపల్లె కృష్ణారావు, కొత్తపేట, బెజవాడ.
,, ద్రోణంరాజు చిన్నకామేశ్వరరావు, ఇస్సీసుపేట, రాజమండ్రి.
,, వల్లూరి గోపాలరావు, సూర్యారావుపేట, కాకినాడ.
,, హెచ్. యన్. బోసు, యూనియన్ మోటారువర్క్సు, విశాఖపట్టణము.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ శుక్ల సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.

## ఆంధ్రపత్రిక

దినపత్రిక

| | | | |
|---|---|---|---|
| చందా సం॥కు | | రు | ౨౪-౦-౦ |
| ,, | ౬ నెలలకు | ,, | ౧౨-౦-౦ |
| ,, | ౩ ,, | ,, | ౬-౪-౦ |
| ,, | ౧ ,, | ,, | ౨-౨-౦ |

వారపత్రిక

| | | |
|---|---|---|
| చందా సం॥కు | రు | ౪-౦-౦ |
| సంచిక సహా | ,, | ౫-౦-౦ |
| ప్రత్యేకము సంచిక | ,, | ౨-౦-౦ |



## భారతి

సచిత్ర మాసపత్రిక

ప్రారంభము ౧౯౨౪ సంవత్సరము.
అందఱు చదువవలసిన మంచి గద్య పద్య వ్యాసము లుండును.
త్రివర్ణ చిత్రములు
సాదాచిత్రము లనేకములు గలవి.

| | | | |
|---|---|---|---|
| చందా సం॥కు | | రు | ౬-౮-౦ |
| ,, | ౬ నెలలకు | ,, | ౩-౦-౦ |
| | విడిపత్రిక | ,, | ౦-౧౦-౦ |

ఈ పంచాంగము

శ్రౌతస్మార్తవిద్యాప్రశస్తులు, జ్యోతిష్యుల వంశాగ్రణి పూర్ణశశాంకులు నగు
బ్రహ్మశ్రీ మల్లయారాధ్యులవారి పుత్రులును, బ్రహ్మశ్రీ కుప్పా వేంకటకృష్ణశాస్త్రి,
యీ. నాగేశ్వరశాస్త్రిలుగార్ల ప్రియశిష్యులును నగు

## కనకయ్య సిద్ధాంతిగారు గణించినది

ఆంధ్రపత్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.

## సంవత్సర ఫలము

ఈ సంవత్సరమున చైత్రమాసమున కొద్దిగా వర్షమున్నూ, వైశాఖజ్యేష్ఠమాసములయందు మిక్కిలి యెండలు పడమరగాలి యెక్కువగా వీచుటయు స్వల్పవృష్టియు గలుగును. ఆషాఢమాసమునందు యెండలు గాడ్పులు యెక్కువగా నుండుటయు కొంచము తొలకరివానల కారంభమై శ్రావణభాద్రపదమాసములయందు మంచి వర్షములు కురియును. ఆశ్వీజకార్తీకమాసములయందు వాయు సహితవృష్టిగలుగును—అపరసస్యములున్నూ కందులు మొదలగు యెఱ్ఱధాన్యములున్నూ యెఱ్ఱనిభూములున్నూ బాగుగా ఫలించును. పశువులు క్షీరప్రదములు బాగుగా నగును. తెల్లధాన్యములున్నూ బాగుగా ఫలించును. చందనము, అగరు కస్తూరీ మొదలగు వస్తువులకు ధర లధికముగ నుండును. పశుపాలకుడు బలరాముడవుటచే పశువులు క్షేమముగ నుండును. ఈ సంవత్సరమున చైత్ర బ ౫ లు మొదలు వైశాఖ బ ౮ లు వరకు గురుమౌఢ్యము. చైత్ర శు ౭ లు మొదలు ఈ బ ౩ లు వరకు శుక్రమౌఢ్యము. మార్గశిర బ ౧౩ లు మొదలు ఫాల్గుణ బ ౨ లు వరకు శుక్రమౌఢ్యము. వైశాఖ శు ౭ బుధవారం నర్మదానదీ పుష్కరప్రవేశము. చైత్ర బ ౩౦ గురువారం అర్ధాధికసూర్యగ్రహణము. మూడుతూముల వర్షమున్నూ, తొమ్మిదివీసముల పంటయున్ను కలుగును.

స్వస్తి సర్వేజనాః సుఖినోభవంతు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

చేయుచున్నారు. నాదిరుఖానుగారు అంతఃకలహములను మాన్పి ఆఫ్ఘనుస్థాన క్షేమమును గాపాడుటకు సకలప్రయత్నములను జేయుచున్నారు. అమనుల్లాగారు రుష్యాసరిహద్దులందున్న హీరటునందు నివాసమును జేయుచు సంగ్రామసన్నాహములను జేయుచున్నారు. యూరపు రాజ్యముల ప్రలోభము ప్రాచ్యరాజ్యములం దంతఃకలహములకు దోహదంబు నొసంగుచున్నది. ఒకరాజ్య మొకపక్షమును వేరొకరాజ్య మింకొకపక్షమును లేవదీసి కలహాశనమును ముందుబెట్టి ఆత్మనాశనకరమైన పోరాటమును గల్పించుట యాచారమైనది. ఈ మిత్రభేదమును ఆఫ్ఘనుస్థాన మెన్నియొసాగు లనుభవించి మహాదుఃఖము ననుభవించినది. ఈ దుఃఖానుభవమువలన నైనను నాయకులకు జ్ఞానోదయము గలుగలేదు. నాదిరుఖాను చెప్పినటులు ప్రజానాయకుల లక్ష్యము దేశక్షేమమునందు లగ్నము గావలయునుగాని స్వప్రయోజనములందు లగ్నము గాజనదు. అమనుల్లాగా రీలక్ష్యముతోడనె రాజ్యాధికారమును వహింపనున్నటులు వారి ప్రవర్తనము విశదము చేయుచున్నది. అమనుల్లాగారు ప్రజాక్షేమమునకై రాజ్యమును గైకొనిరి; ప్రజాక్షేమమునకై రాజ్యమును విడనాడిరి; ప్రజాక్షేమమునకై తిరిగి రాజ్యసంపాదనమును జేయుటకు ప్రయత్నించుచున్నారు. ఆంగ్లేయరాజ్యతంత్రమునకును రుష్యారాజ్యతంత్రమునకును నడుమ చిక్కుకొనియున్న ఆఫ్ఘనిస్థానమునకు భగవంతుడు శాంతిని, స్వాతంత్ర్యమును ప్రసాదించుగాత! పాశ్చాత్యరాజ్యముల నడుమ సోదరరాజ్య మనుభవించుచున్న దుఃఖపరంపరలు ప్రాచ్యరాజ్యములకు ముఖ్యముగ భరతఖండమునకు గుణపాఠమును నేర్పుటకు దగియున్నవి. రుష్యా బ్రిటీషు రాజ్యముల నడుమను నలిగిపోకుండా నున్న ఆఫ్ఘను రాజ్యము శాంతిసౌఖ్యముల ననుభవించుటకును ప్రపంచ శాంతిని గాపాడుటకును భగవంతు డనుగ్రహించుగాత! ఐరోపా మహాసంగ్రామమునకు సర్వియా కారణభూతమైనటులు ఆసియామహాసంగ్రామమునకు ఆఫ్ఘనుస్థానము కారణముకాగల యోగము పట్టకుండుటకు భారతీయులు యావచ్ఛక్తిని వినియోగింతురు గాత!

రుష్యా పరివర్తనము ప్రపంచప్రవృత్తియందు పరమ విషాదమును గలుగజేయుచున్నది. రుష్యాయందు సోవియట్ ప్రభుత్వమును లెనిన్, ట్రాట్‌స్కీ నాయకులు ౧౯౧౭ సంవత్సరమునందు స్థాపించిరి. రుష్యా ౧౯౧౭-౨౧ లోపలను ౧౭,౬౬,౧౧౮ ప్రజలు వధింపబడినటులు నిర్ణయింపబడినది. ౧౯౨౧-౨౭లోపలను 3,౦౦,౦౦౦ జనులు వధలపాలైనటులు నిర్ణయింపబడినది. పదేండ్లలోపలను 3,౦౦,౦౦౦ జనులు వధింపబడిరి. ఈవధ్యులందు ఉపాధ్యాయులు, వైద్యులు, మతబోధకులు, రైతులు, పనివాండ్రు మొదలగునన్నితరగతుల జనులును కలరు. చేకా అను గూఢ రక్షకభటులు రక్తకేతువులనుబూని దండనభారమునువహించుచున్నారు. ౧౨౦ గూఢచారులతో నారంభమైన చేక అధికారవర్గమిపుడు ౧,౫౦,౦౦౦ అధికారులను, ప్రతినిధులను గల్గియున్నది. అన్ని దేశములందును సోవియటువర్గము సాంఘిక విధానమును స్థాపించుటకు విశ్వప్రయత్నమును జేయుచున్నది. సోవియటువిధానమును వ్యాపింపజేయుటకు నిర్బంధసైనికవిధానమును రుష్యాదేశ మవలంబించుచున్నది. రుష్యాసైన్యమునందు గతసంవత్సరమునందు ౬,౮౨,౦౦౦ సైనికులు గలరు. ఐరోపామహాసంగ్రామమునకు సంబంధించిన సంగ్రామపరికరములు రుష్యాయందు నిలువయున్నవి. ఈమహాసైన్యము, సంగ్రామపరికరములు మహాసంక్షోభమును గలుగజేయుటకు పరమావకాశములు గలవు. ఆఫ్ఘనిస్థానమునందు జరుగుచున్న సంగ్రామములు సహజముగా భయమును గలుగజేయుచున్నవి. అమానుల్లాఖానుగారు రుష్యాను ఆశ్రయించి రాజ్యాధికారమును బడయగోరుచున్నారు. హిందూదేశమునందు రుష్యాప్రాపకము నణచివేయుటకై నిర్బంధవిధానము వ్యాపకమును పొందుచున్నది.

ప్రపంచమునందు సంగ్రామసన్నాహములను ఆపుటకు ప్రయత్నములు జరుగుచున్నపుడు రుష్యామాత్రము సంగ్రామసన్నాహములను వృద్ధిచేయుట భయభ్రాంతులను గలుగజేయుచున్నది. రుష్యారాజ్యమును నిర్బంధిం

చుటకు బ్రిటీషుప్రభుత్వ మవలంబించిన మాయోపాయములన్నియు నిష్ఫలము లైనవి. చీనా, జపాను, పారసీకము, జర్మనీ, తుర్కీ, మొదలగు దేశములందు సాంఘికధర్మము వ్యాపకము గాంచుచున్నది. నిరంకుశాధికారమును నిర్మూలముచేసిన రుష్యా దేశము నిరంకుశమార్గమున సాంఘికపరిపాలనమును వ్యాపింపజేయుట నిరంకుశప్రాబల్యమునకు నిదర్శనముగ నున్నది. పశుబలాధారమున ధర్మసంస్థాపనము చేయబూనుట రాసురబలారాధనమును ప్రతిష్ఠించుటయై యున్నది. పశుబలమును మానవబలము జయించుచు ధర్మసంస్థాపనమునకు సాధనంబగుచున్నది. రావణ హిరణ్యకశిపుల బాహుబలమును శ్రీరామ ప్రహ్లాదుల ధర్మబలము జయించినది. సోవియటుబలములు బాహుబలాధారమునను సాంఘిక సిద్ధాంతములను సకలదేశములందును వ్యాపింపజేయబూనుట యసాధ్యముగ నున్నది.

విశ్వప్రవృత్తియందు కలిమిలేములు, సుఖదుఃఖములు, జయాపజయములు, లాభాలాభములు సంబద్ధపరిస్థితులు గాని నిత్యములు కావు. సంబద్ధస్థితులందు భావపరివర్తనమువలె విషయపరివర్తనము సాధ్యముగాదు. సోవియటు ప్రయోగానుభవములు మర్త్యలోకమును స్వర్గలోకము జేయజాలకపోయినను ప్రపంచమునం దంతటను భావపరివర్తనమును గలుగజేయుటకు సాధనము లగుచున్నవి. మానవులకు సర్వావస్థలయందును సమానస్థితి సాధ్యము గాకపోయినను సమానానందము ననుభవించుట సాధ్యమగుచున్నది. సోవియటుధర్మసందర్శనము విశ్వరూపసందర్శనమువలె భయంకరమై శాంతిని గోరుచున్నది. విశ్వరూప సందర్శనానంతరము విజయునివలె ప్రపంచ ప్రవృత్తియు శాంతప్రవృత్తిని గోరుచున్నది.

శ్లో.—

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే,
త దేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస.

—గీత అ. ౧౧.

రుష్యాపరివర్తనము ప్రపంచదృష్టి నాకర్షించుచున్నను విలయరూపమున చిరకాలము నిలువజాలదు. ఇటలీదేశమునందు ఫాసిస్టురూపమున, ముస్సోలినీగారు వ్యాపింపజేయుచున్న పరివర్తన మిందులకు ప్రబల నిదర్శనముగ నున్నది.

ఇటలీ

ఇటలీదేశమునందు స్వాతంత్ర్య వ్యాపనమునకై, గారిబాల్డీ, మాజినీ, మొదలగు దేశభక్తులు చేసిన ప్రయత్నములను ముస్సోలినీగారి ప్రయత్నములు ప్రతిఘటించుచున్నవి. శాసనసభలు, నియోజకగణము, నియోజకాధికారము, సంకుచిత స్వరూపమును దాల్చినవి. ప్రజాస్వాతంత్ర్యము సంకుచితమై నిరంకుశాధికారము వికసించుచున్నది. సంగ్రామసన్నాహము లభివృద్ధిని పొందుచు ప్రపంచ శాంతికి భంగము గలుగుచున్నది. రుష్యాయందు మితవాదులవలె ఇటలీయం దతివాదులకు దండనభయము గలుగుచున్నది. యూరపురాజ్యము లన్నియును తిరిగి సంగ్రామసన్నాహములను చేయుచున్నవిధము శాంతిస్థాపనమును దుర్లభము జేయుచున్నది.

అమెరికా సంయుక్త రాష్ట్రములు

ప్రపంచమునందు శాంతిస్థాపనమునకు అమెరికా సంయుక్తరాష్ట్రములు చేయుచున్న ప్రయత్నములు సంస్తవనీయములైనను, ప్రయోజనకరములు గాకున్నవి. అమెరికాదేశ మపారమైన సంపదలతో తులతూగుచున్నది. నౌకాదళమును, విమానదళమును, నిర్మించుట కపారమైన వ్యయమును జేయుచున్నది. యుద్ధనిషేధమును ప్రపంచమునకు బోధించుచు సంగ్రామసన్నాహములను జేయుట శాంతిస్థాపనమునకు సాధనభూతముగాదు. నానాజాతిసమితి యూరపురాజ్యముల సౌభాగ్యమున కేర్పడినను ఈ సంకుచిత ప్రయోజనమును నిరర్థకమైనది. స్వప్రయోజన సంరక్షణార్థము సకలజాతులును సంగ్రామసన్నాహములను జేయుచు నానాజాతిసమితి ప్రయోజనములను నిరర్థకము జేసినవి. నానాజాతిసమితి పెద్దజాతులసమితి; తెల్లజాతుల సమితి. నల్లజాతులకును చిన్నజాతులకును,

ఈసమితి స్వాతంత్ర్య సంరక్షణమునకును శాంతిస్థాపనమునకును నిరుపయోగముగ నున్నది. అయినను అమెరికా సంయుక్తరాష్ట్రములు నానాజాతిసమితిని స్థాపించి ప్రపంచమునకు మహోపకారమును జేసినవి. ఈ సమితి మూలముననె ఆయుధనియమనప్రయత్నములు కార్యమునందు గాకపోయినను భావమునందైనను సాగుచున్నవి. గత సంవత్సరమునందమెరికా యవలంబించిన కెల్లాగు యొడంబడిక దీని ఫలముగ నున్నది.

కెల్లాగు యొడంబడిక యుద్ధమును ప్రతిషేధించుచున్నది. ఈయొడంబడికను ౧౯౨౮ సంవత్సరము ఆగస్టు ౨౭ వ తేదిని వివిధరాజ్యముల ప్రతినిధులును నంగీకరించి ప్యారిసునగరమునందు సంతకము చేసిరి. దీనియందు మూడుముఖ్యమైన విషయములు గలవు. ౧. అంతర్జాతీయసమస్యలను నిర్ణయించుటకును, జాతీయ గౌరవమును గాపాడుటకును యుద్ధము ప్రతిషేధింపబడుచున్నది. ౨. ఈ యొడంబడిక నంగీకరించిన రాజ్యములకు గలిగెడి కలహములను విభేదములను నిర్ణయించుటయందవి యే కారణమువలన గలిగినను, నెట్టివైనను శాంతిమార్గము గాక వేరొకవిధమున నిర్ణయింపగూడదు. 3. ఈ యొడంబడిక ఆయా రాజ్యముల యవసరముల ననుసరించి ధ్రువపరుపబడును. ఆయా రాజ్యముల యంగీకారపత్రములయందు నిర్ణీతమైన స్థలమునందు వెంటనే యొడంబడిక ఆచరణమునకు రాగలదు. ౪. ఇతర రాజ్యములును నీయొడంబడిక నిలిచియున్నంతకాలమును దీని నవలంబింపవలయును. ఈ యొడంబడిక నంగీకరించిన రాజ్యములందు భారతసామ్రాజ్యమును జేరియున్నది. వివిధరాజ్యములును నంగీకరించిన నానాజాతిసమితినిర్ణయములను, లొకార్నొ యొడంబడికను కెల్లాగు యొడంబడిక కార్యరూపమున బలపరచుచున్నది. బ్రిటీషు రాజ్యాధికారు లారంభమునందు ప్రతికూల స్వభావమును వ్యక్తము జేసినను నంతమునందంగీకరించుట సమంజసముగ నున్నది. ఈ యొడంబడిక యింతవ్యాప్తంబైన బ్రిటీషుసామ్రాజ్యమునకు పరమోపకారమును జేయుచున్నది. స్వాతంత్ర్యరాజ్యముల స్వత్వములను సంరక్షించుటకును పరాధీనరాజ్యముల పారతంత్ర్యమును సుస్థిరము చేయుటకును నానాజాతిసమితియును, లొకార్నొ యొడంబడికయును, కెల్లాగు ఒడంబడికయును సాధనభూతములుగ నున్నవి.

కెల్లాగు యొడంబడిక

ఐరోపా మహాసంగ్రామమునకు ప్రపంచరాజ్యములు విశేషధనమును వ్యయము చేసినవి. సంగ్రామమునందు లక్షలకొలది మనుజులు నశించిరి. సంగ్రామానంతరమునందున యుద్ధజ్వర మన్ని రాజ్యములను పీడించుచున్న విధమును సైన్యములకును, విమానములకును, నౌకలకును వివిధ రాజ్యములు చేయుచున్న యపారమైన వ్యయమును, పరమవిషాదమును గలుగజేయుచున్నవి. సంగ్రామ వ్యయభారము తగ్గనంతవరకును ప్రపంచమునకు శాంతియును, తరణోపాయమును దుస్తరములు. పారతంత్ర్యరాజ్యములు దుఃఖవేదన ననుభవించినను స్వాతంత్ర్యరాజ్యములనైనను సంగ్రామజ్వరము వదలుట ప్రపంచక్షేమమునకు ప్రయోజనకరము. భారతసామ్రాజ్యము నానాజాతియందు జేరినది. కెల్లాగు ఒడంబడిక నంగీకరించినది; వ్యయభారమునందు సముచితభాగమును భరించుచున్నది. దేశమునందు స్వాతంత్ర్యము వికసించుటకుగాని, సైనికవ్యయము తగ్గుటకుగాని యవకాశములు గనుపడవు. అయినను అమెరికా యవలంబించిన మార్గము ప్రపంచశాంతికిని సౌభాగ్యమునకును సాధనంబుగ నుండగలదు.

గతసంవత్సరమునందమెరికా సంయుక్త రాష్ట్రములు చీనాదేశమునకు స్వాతంత్ర్య సంరంభమునందు జూపిన సానుభూతి ప్రశంసనీయముగ నున్నది. అమెరికా రాజ్యము చీనాయందు ప్రత్యేక స్వత్వములను వదులుకొని చీనారాజ్యమున కార్థికస్వాతంత్ర్యము నొసంగినది. అమెరికా సంయుక్తరాష్ట్రముల ధర్మప్రవర్తనము చీనా స్వాతంత్ర్యసిద్ధికి సకలవిధముల వినియోగపడినది. జపాను బ్రిటీషురాజ్యము లమెరికాప్రభుత్వపు మార్గము నవలంబించుట యవసరమైనది. అమెరికాప్రతిష్ఠ నీధర్మాచరణము ద్విగుణీకృతము చేసినది.

మద్యపాననిషేధమునకై అమెరికా సంయుక్తరాష్ట్రములు చేయుచున్న ప్రయత్నములు ప్రపంచకల్యాణమున కమెరికా చేయదలచిన ఘనకార్యములకు నిదర్శనముగనున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రములు పరాపేక్షలేక ప్రపంచకల్యాణమునకు స్వీయ బల సంపదలను వినియోగించుట కపారమైన యవకాశములు గలవు. దేశపరిస్థితులు, దేశసంపదలు, వాణిజ్య పరిశ్రమలు, విద్యావ్యాపనము, ప్రజాశయములు ప్రపంచకల్యాణమునకు వినియోగపడుటకు సకలవిధముల దగియున్నవి. ఇతరరాజ్యములు ముఖ్యముగ బ్రిటీషురాజ్యము ఈలబ్ధావకాశములను లోకకల్యాణమునకై వినియోగించుటకు భగవదనుగ్రహము గలుగు గాక! ఈసందర్భమునందు హెర్బర్టు హూవరు గారిని అమెరికా సంయుక్త రాష్ట్రములకు రాజ్యాధికారిగ నెన్నుకొనుటయు సముచితముగనున్నది. పరోపకారపరాయణుడైన హూవరుగారి పరిపాలనమునందు అమెరికాకును, నితరరాజ్యములకును, శాంతిసౌభాగ్యములు సమకూడుటకు భగవదనుగ్రహము గలుగు గాత!

వర్తమాన విషమపరిస్థితులందు బ్రిటీషు రాజ్యాధికారుల భారము దురారాధ్యముగ నున్నది. బ్రిటీషు ప్రజలు ౧౯౧౩-౧౪ సం॥నందు తల యొకటికి పౌ. ౩-౧౧-౪ చొప్పునను, ౧౯౨౬-౨౭ సం॥ము నందు పౌ. ౧౪-౧౧-౮ చొప్పునను పన్నులను చెల్లించిరి. గ్రేటుబ్రిటను ఆదాయము ౧౯౨౭-౮ నందు ౮౪,౨౮,౨౪,౦౦౦ సవరనులు, వ్యయము ౮౩,౫౫,౯౫,౦౦౦సవరనులు. ఈ ఆదాయమునందు ౩౭౫,౮౧౬,౦౦౦అప్పువడ్డీలకును౧౨,౪౦,౦౦,౦౦౦సవరనులు ఈసైన్యాదులకును వినియోగపడుచున్నవి. మద్యాదాయము ౧౩,౯౨,౦౦,౦౦౦సవరనులు. మద్యపానమునకై ౧౯౨౭నందు గ్రేటుబ్రిటనునందు ౨౯,౮౮,౦౦,౦౦౦ సవరనులు వ్యయమైనవి. దేశమునందు నిరుద్యోగుల సంఖ్య పెరుగుచున్నది. బొగ్గుపరిశ్రమ, దూదిపరిశ్రమ వికాసము లేకయున్నవి. ధనస్వాములకును, కార్మికులను సంఘర్షణము ప్రవర్ధమాన మగుచున్నది. పరిశ్రమలు సంరక్షణము లేక కృశించుచున్నవి. వ్యయభారమును తగ్గించుటకు అవకాశములు గనుపడవు. చర్చిలుగారు ప్రతిపాదించిన సిద్ధాంతములు మాటలరూపమును దాల్చక మాటలరూపముననె యున్నవి.

బ్రిటీషు రాజ్యము

ఐరోపామహాసంగ్రామమునందు గెలుపొందిన అమెరికాసంయుక్తరాష్ట్రములందును ఓడిపోయిన జర్మనీదేశమునందును గల శాంతిసౌఖ్యములు గ్రేటుబ్రిటనునం దపరూపముగనున్నవి. జర్మనీదేశాదాయము ౧౯౨౫వ సంవత్సరమునందు ౩౨,౫౦,౦౦,౦౦౦ సవరనులనుండి ౧౯౨౭వ సంవత్సరము నందు ౪౫,౦౦,౦౦,౦౦౦ సవరనులకు వృద్ధి అయినది. పరాజితమైన జర్మనుదేశమునందు గల స్థిరాభివృద్ధి గ్రేటుబ్రిటనునందు గోచరము గాకున్నది. గ్రేటుబ్రిటను అనుభవించుచున్న దురవస్థకు ప్రతీకారమును బ్రిటీషురాజ్యాధికారులు పరాధీనరాజ్యములందు బడయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. పరాధీనరాజ్యములను చిరకాలము శ్వేతాధికారబద్ధము చేయుటకు బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు పన్నుచున్న తంత్రములసహ్యముగ నున్నవి. భరతవర్షము, సింహళము, కెనియా మొదలగు పరాధీనదేశములందు బ్రిటీషు రాజ్యాధికారులు పన్నుచున్న రాజ్యాంగపాశబంధములును, చీనా మొదలగు స్వాధీనదేశములం దవలంబించుచున్న దుస్తంత్రమును రాజ్యాధికారుల నావహించిన స్వార్థపరత్వమును విశదము చేయుచున్నది.

బ్రిటీషురాజ్యాధికారులను ప్రాతవాసనలు విడువలేదు. సామ్రాజ్య ధురంధరత్వము, భోగాభిలాష, దురభిమానము బ్రిటీషురాజ్యాధికారులను స్వధర్మ పరాఙ్ముఖులను జేయుచున్నవి. బ్రిటిషురాజ్యాధికారులకు బ్రిటీషు ప్రయోజనములందు గల లక్ష్యము సామ్రాజ్య ప్రయోజనములందును, మానవధర్మ ప్రయోజనములందును గనుపడదు. సామ్రాజ్యాంతర్భాగముల క్షేమము బ్రిటీషు సామ్రాజ్య క్షేమమునకును, సామ్రాజ్యాంతర్భాగముల

గ్రేటుబ్రిటను



## మా "తెమిస్" సెమీ-ఫ్లాట్ గడియారములు
## అందము నందును, సరియైన కాలము
## తెలుపుటలో అసమానమైనది



**మిక్కిలి నాణ్యమైన**
**కీ లెస్ లివర్**
**గడియారములు**



రమ్యమైన మాదిరీలలో, అత్యంతమనోహరమైన వివిధ ఆకారములు మంచి నిగనిగ గలిగి యుండుటచూడ, కాలపరిమితిలెక్కించు శాస్త్ర నైపుణ్యమును, కుశాగ్రబుద్ధికి ఆశ్చర్యపడవలసి వచ్చుచున్నది. "తెమిస్" సెమిఫ్లాట్ గడియారములు మణికట్టుమీద సరిగా యిముడును. ధరించు వానికి సొగసును, సంతోషమును గలిగించును. డిస్ గడియారపు కేసులో ఒక భాగముగా యిమిడి పోయినవి.



"తెమిస్ లెన్సు"
అచ్చుపువెండిలో రు. 40.
18 క్యారెట్ గోల్డు రు. 85.

"తెమిస్ చదరం"
అచ్చుపువెండిలో రు. 42.
18 క్యారెట్ గోల్డు రు. 95.



"తెమిస్ బెవెల్డ్"
అచ్చుపువెండిలో రు. 40.
18 క్యారెట్ గోల్డు రు 85.

ఆకర్షనీయమును పలువిధములైన సైజులలోను, మాదిరీలలోను
తయారై మా కేటలాగునందు చిత్రించబడినది.
ఉచితముగా పంపబడు మా కేటలాగునకు వ్రాయుడు.

## వెస్టు ఎండు వాచ్ కంపెని, బొంబాయి అండు కలకత్తా.

# West End Watch Co

**BOMBAY AND CALCUTTA**

# అమరావతి స్తూపచిత్రములు




చిత్రము ౧



చిత్రము ౨

# AMRUTANJAN

## BEST INDIAN PAIN BALM.

**Annas 10 Only.**




அமிர்தாஞ்சன ಅಮೃತಾಂಜನ

అమృతాంజనము

अमृतांजन

അമൃതാഞ്ജനം

## Amrutanjan Depot,

**BOMBAY** AND **MADRAS**

కష్టములు బ్రిటీషుసామ్రాజ్యకష్టములకును సాధనభూతములు. ముప్పదిమూడుకోట్ల ప్రజలు దారిద్ర్యగ్రస్తులై కృశించుచున్నపుడు సామ్రాజ్యక్షేమము స్వప్నతుల్యము. బ్రిటీషు రాజనీతిజ్ఞులు పరాధీనరాజ్యములకు పరమోపకారమును చేయుచున్నటులు ప్రకటింపవచ్చును. లోకము మాయామాటలను నమ్మవచ్చును. సత్యముమాత్రము దాగక విజయమును పొందుట ధ్రువము. ప్రజల దారిద్ర్యము, దుఃఖానుభవము, సంతాపము మాటలవలన నుపశమింపదు. బ్రిటీషు రాజనీతిజ్ఞుల దురభిమానదురహంకారములు పరాధీనరాజ్యములకువలె బ్రిటీషుసామ్రాజ్యమునకును, ప్రపంచమునకును పరమానర్థదాయకములుగ నున్నవి. ఈపరమార్థమును బ్రిటీషుసామ్రాజ్యాధికారులు త్వరలో గ్రహించుట యావసరము. సమయ మతిక్రమించినపుడు పశ్చాత్తాపమువలన ప్రయోజనము గలుగదు.

బ్రిటిషు రాజ్యాధికారులు కన్సర్వేటివు పక్షమువారైనను, లిబరలు పక్షమువారైనను, లేబరు పక్షమువారైనను, పరాధీనరాజ్యములకు సమానాదరణమునే చూపుచుందురు. రాజ్యాధికారులకు స్వార్థపరత్వమునందు గల లక్ష్యము పరహితార్థమునందు లగ్నముగాకున్నది. కన్సర్వేటివు ప్రభుత్వము స్వార్థపరత్వమునకు ప్రసిద్ధిని బడసినది. గతించిన ఆరేండ్లయందును కన్సర్వేటివు ప్రభుత్వము పరాధీనరాజ్యములపట్ల, ముఖ్యముగా భరతఖండముపట్ల, జూపిన తిరస్కారభావము బ్రిటీషుసామ్రాజ్య క్షేమమునకు ప్రతిబంధక మగుచున్నవిధమును దేశమునందు ప్రవర్ధమానం బగుచున్న యసంతృప్తి విశదము చేయుచున్నది.

గ్రేటుబ్రిటనునందు మేనెల 30 వ తేదీని క్రొత్త యెన్నికలు జరుగనున్నవి. గత సంవత్సరమునందు నూతనముగా నిర్మింపబడిన శాసనము స్త్రీలకు పురుషులతో సమానముగా నియోజనాధికారమును గలుగజేయుచున్నది. ఈశాసనము ౫౨,౦౫,౧౦౦ స్త్రీలకు క్రొత్తగా నియోజనాధికారమును గలుగజేయుచున్నది. నియోజకవర్గమునందు క్రొత్తగా జేరెడు స్త్రీలవోట్లు నాయకుల ఊహలను తారుమారుచేయుట సహజము. రాగల ఎన్నికలయం దేపక్షమువారు విజయము గాంచెదరో ఊహించుట అసాధ్యమైనను, కన్సర్వేటివుపక్షము మాత్రము పూర్వమువలె బలమును కలిగియుండదని యూహింపదగియున్నది. సంయుక్తపక్షము రాజ్యాధికారమును వహింపవలసిన యావసరము గలుగవచ్చునని పరిస్థితులు విశదము చేయుచున్నవి. ఏపక్షము వచ్చినను భారతీయులు స్వరాజ్యసంరంభమునందు స్వయంసహాయము మీద నాధారపడుట శ్రేయస్కరము గాని లేబరుపక్షముమీద గాని, వేఱొకపక్షముమీద గాని యాధారపడుట నిరర్థకమని నిత్యానుభవము తెల్లము చేయుచున్నది.

భారతరాజ్యాంగముపట్ల బ్రిటిషు ప్రభుత్వ మవలంబించుచున్న నీతి కళంకమై యున్నపక్షమువారిచేతను నిరసింపబడుచున్నది. సైమనుసంఘ నియామకము, వారి సంచారము, విచారణ, బహిష్కారము బ్రిటిషు రాజ్యాధికారులకు భరతఖండము మీద గల నిరాదరణ స్వభావమును విశదము చేయుచున్నవి.

సైమను కమీషను

సైమనుకమీషను గతసంవత్సరమునందు రాజ్యాంగపరిస్థితులను విచారించుటకై ప్రధానప్రదేశములందు సంచారమును జేసినది. బొంబాయి, పునహా, లాహోరు, లక్నో, కలకత్తా, రంగూను, మద్రాసు, నాగపురం మొదలగు స్థలములందు సైమనుకమీషనునకు బహిష్కారోత్సవములు, నల్లజెండాలు, నిర్గమనఘోషలు ప్రత్యేకములైనవి. అన్నిస్థలములందును కమిషనుయొక్క గమనాగమనములు గోప్యముగ నుంచబడినవి. రక్షకభటుల సంరక్షణ సహాయములు కమిషను గమనాగమనముల కవసరమైనవి. రక్షకభటులు లాయుధపాణులై ప్రజానాయకులపట్ల జూపిన దౌర్జన్యనిరసనభావములు భారతీయుల నిస్సహాయస్థితిని వేనోళ్ల జాటుచున్నవి.

లాహోరునందు దేశభక్తాగ్రేసరుడు లాలాలజపతిరాయి సాండర్సుగారి దౌర్జన్యమునకు బలియై ప్రాణ

ములను గోల్పోయిన విధము భారత హృదయమునందు పరమసంతాపమును గలుగచేసినది. లక్నో, మద్రాసు మొదలగు స్థలములందు రక్షకభటు లవలంబించిన దౌర్జన్యవిధానము నింద్యమై పరమాసహ్యముగా నున్నది. సైమనుకమిషను ప్రదర్శనమును దేశమునం దంతటను జేయుటకై లక్షలరూప్యములు నిరర్థకముగా వ్యయమైనవి. రక్షకభటులు, సైనికులు ఆయుధపాణులై పురములందు సంచారము చేయుచు ప్రజాహృదయమునందు భయ భ్రాంతులను గలుగజేసిరి. ప్రజల సామాన్యస్వాతంత్ర్య మైన గమనాగమనములను నిరోధించిరి. దండధారులై రక్షకభటులు ప్రజలను తాడనము చేసిరి. ఇట్టి సందిగ్ధా వస్థయందు సైతము ప్రజలు నిర్భయముగా హరతాళము లను జరిపిరి. నాయకులు నల్ల జెండాలతో బహిష్కరణో త్సవములను జయప్రదముగ జేసిరి. ఈసందర్భమునందు చెన్నపురియందు జరిగినయుదంత మధికారి లక్ష్యమున కును, ప్రజాలక్ష్యమునకును సైమనుకమిషనుపట్ల గల భేద మును, ప్రజాసంకల్పమును విశదముచేయుచున్నది.

సైమనుకమిషను బహిష్కరణోద్యమమునందు దౌర్జన్యమునకు గాని, శాసనోల్లంఘన ప్రస్థానమునకు గాని అవకాశములు లేవు. కాంగ్రెసు నిర్ణయము సైమ నుకమిషను బహిష్కరణ ప్రదర్శనముగాని శాసనోల్లం ఘనప్రస్థానప్రదర్శనము గాదు. నిరాయుధులగు ప్రజలకు దౌర్జన్యప్రస్థానము దురారాధ్యము. సాయుధులగు భ టులు గూఢముగాను, బహిరంగముగాను గలుగ జేయ గల దౌర్జన్యము రౌద్రాకారము దాల్పగల విధమును లాలాజీ దుర్మరణము విస్పష్టము జేయుచున్నది. చెన్న పురి బహిష్కరణ ప్రదర్శనమునందు పాల్గొనిన నాయ కుల ప్రయత్నములు కపటములని సర్ ఉస్మాన్ సాహేబు గారు చెన్నపురిశాసనసభయందు బలుకు చెప్పుట కేవల మసత్యమైయున్నది. అధికార సింహాసనము భారతీయుల కును విచిత్రమైన ప్రవృత్తిని కలుగజేయుచున్నది. అధికార ములో భారతీయులు స్వధర్మనిర్వహణమును మరచి పర ధర్మనిర్వహణమునకు బూనుకొనుచున్నారు. అధికార వర్గము సైమనుకమిషనును కన్నులకు గంతలుకట్టి ప్రద ర్శనము చేయించిన విధమును వారి సంచారక్రమము విశ దము చేయుచున్నది. అధికారుల కన్నులు, చెవులు సైమ నుకమిషనుకు కన్నులు, చెవులు నైనవి. అధికారులు నియ మించిన సంఘములు, వ్యక్తులు వారి ఇష్టానుసారముగ విజ్ఞాపనలను, సంస్కరణవిధానములను సైమనుకమిషను నకు సమర్పించిరి. ఈ విన్నపములు, విధానములు స్వా ర్థపరుల ప్రయోజనమునకు, ప్రత్యేకసంఘముల లాభ ములకును నుపయోగపడినను, దేశప్రయోజనములకును, స్వరాజ్యమునకును నిరుపయోగములుగా నున్నవి.

సైమనుకమిషను ఈ ఏప్రిలుమాసమున స్వదే శమునకు మరలిపోయినది. భిన్న రాష్ట్రాధికారులు సంస్క రణవిధానములను సైమనుకమిషనునకు ఆయారాష్ట్రముల పరిస్థితుల కనురూపముగ సమర్పించిరి. శాసనసభలు నియమించిన కమిటీలును దీని కనుగుణ్యముగానే రిపోర్టు లను పంపినవి. ఈ రిపోర్టులన్నియును ద్వంద్వప్రభుత్వము నేకగ్రీవముగా నిరసించినవి; రాష్ట్రప్రభుత్వములందు స్వాతంత్ర్యస్థాపనావసరమును ప్రతిపాదించుచున్నవి. చెన్న పురి, బొంబాయి, పంజాబురాష్ట్రములందు రాష్ట్రీయ స్వాతంత్ర్యము నంగీకరించుటకు పరిస్థితు లనుకూలము గా నున్నట్లు వదంతు లేర్పడినవి. ఇతరరాష్ట్రములందు పూర్వపుద్వంద్వప్రభుత్వమే వికాసమును పొందుట కవ కాశము లేర్పడు నని వదంతులు ప్రబలినవి. సైమనుకమి షను విధాన మొకరాష్ట్రమునందువలెనే యన్నిరాష్ట్రము లందును జరిగినది. మద్రాసురాష్ట్రమునం దావిధానము విపరీతాకృతిని దాల్చినది.

చెన్నరాష్ట్రమునం దితరరాష్ట్రములందు లేని విభేద ము లధికముగ గలవు. ఇక్కడ నితరప్రాంతములందు గల హిందూమహమ్మదీయ విభేదములకు దోడుగ బ్రా హ్మణ బ్రాహ్మణేతరభేదములు, నిమ్నజాతులభేదములు, తమిళాంధ్రాదిభేదములు, జస్టిసుపక్షమునకు సైమనుకమి షనువిజృంభణమునకు దోడ్పడుట కవకాశములు గలిగించి నవి. నిమ్నజాతులుసమర్పించిన వినతిపత్రమునందు ప్రత్యేక

లాభములనుగోరిరి. జస్టిసుపక్షము వారితోడ్పాటువలన శాసనసభసహకారము నామోదించినది. చెన్నపురి కాంగ్రెసు పనుస్వాగతపత్రమును సమర్పించినది. సర్ అన్నామలచెట్టి, ఎ. రామస్వామి మొదల్యారు గారులు విందులను జేసిరి. మహమ్మదీయులు ప్రత్యేక నియోజకవర్గమును, ప్రత్యేక సాంఘికలాభములను గోరుచు విజ్ఞాపనపత్రముల నర్పించిరి. అధికారవర్గ మొక సంస్కరణవిధానమును, శాసనసభోప సంఘ మొకసంస్కరణవిధానమును సమర్పించిరి. స్వాగత పత్రములు, వినతిపత్రములుస్వప్రయోజనముల కేర్పడినవి. నిరంకుశ ప్రభుత్వము నిరంకుశాధికార రక్షణము నాకాంక్షించుచున్నది. జస్టిసుపక్షనివేదకము బ్రాహ్మణేతరనాయకుల ప్రయోజనములను గోరుచున్నది. ఈనివేదిక లన్నియును విభేదములను, ప్రత్యేక లాభములను వృద్ధిచేయుటకు వినియోగపడగలవు గాని జాతియైక్యమును వృద్ధి చేయుటకు వినియోగపడవు. ప్రభుత్వనివేదికయును, జస్టిసుపక్షనివేదికయును నిరంకుశాధికార సంరక్షణమునకు వినియోగపడగలవుగాని బాధ్యతాయుత పరిపాలనమును సమర్థించుటకు వినియోగపడవు. ఈ విందులు, నివేదికలు ప్రత్యేకపక్షమునకు సంబంధించినవిగాని భారతజాతికి సంబంధించినవి గావు. ఈప్రదర్శనములును అధికారాచ్ఛాదనమున జరిగినవి గాని స్వతంత్రముగ జరిగినవి గావు. చెన్నరాష్ట్రమునం దాడిన నాటకమె అన్ని రాష్ట్రములందును ఆడబడినది. దీనికి భిన్నముగ నెహ్రూనివేదిక జాతీయాశయములను, సంకల్పములను చాటుచున్నది.

గతసంవత్సరము హిందూదేశ రాజ్యాంగసంరంభమునందు ప్రముఖమైన వత్సరముగ నున్నది. బర్కెను హెడ్డుప్రభువు భారతనాయకులను రాజ్యాంగవిధానమును తయారుచేయు డని బెదరించెను. భారత

**నెహ్రూ నివేదిక**

నాయకులు బర్కెనుహెడ్డుప్రభువుగారి బెదరింపులను లక్ష్యముచేయకపోయినను దేశస్వాతంత్ర్య సౌభాగ్యములకు సాధనభూతమైన నెహ్రూనివేదికను చెన్నపురికాంగ్రెసు నిర్ణయమున కనురూపముగ గతసంవత్సరమునందు సిద్ధముచేసిరి. బొంబాయిలో ౧౯౨౮ సం. మే ౧౯ వ తేదీని అఖిలపక్ష మహాసభ గూడినది. ఆసభ నియమించిన సభ్యులు మోతీలాల్ నెహ్రూ, ఆలీఇమాం, తేజబహదూరు సప్రూ, ఎమ్.ఎస్. ఆనే, ప్రధాన్, సుభాషుచంద్రబోసు, జయకర్, జోషీ, సర్దారు మంగళసింగు, షూ ఆబు కురాషీగారులు గత సంవత్సర మాగష్టుమాసమునకు నెహ్రూనివేదికను తయారుచేసిరి. ఈసంఘమున కధ్యక్షత పండిత మోతీలాలు నెహ్రూగారు వహించి అచిరకాలముననే భారత రాజ్యాంగ విధానమును దేశమునకు సమర్పించిరి. ఈ నివేదికను ఆగస్టు ౨౮-౩౧ వరకును లక్ష్మణపురమునందు గూడిన అఖిలపక్షమహాసభ ఆమోదించినది. అఖిలపక్ష మహాసభయందు ౧. జాతీయమహాసభాకార్యనిర్వాహకవర్గము, ౨. మితవాదుల సభ, ౩. అఖిలభారత ముస్లిముసమితి, ౪. హిందూమహాసభ, ౫. కేంద్రఖిలాఫతు సంఘము, ౬. కేంద్రసిక్కుసంఘము, ౭. హోముఋలుసమితి, ౮. క్రైస్తవమహాసభ, ౯. జమైతుల్ ఉలేమా, ౧౦. సంస్థానప్రజలసభ, ౧౧. శాసనసభలకాంగ్రెసు పార్టీ, ౧౨. శాసనసభల జాతీయపక్షము, ౧౩. అయోధ్యా బ్రిటిషు ఇండియాసంఘము, ౧౪. కలకత్తా భారతసంఘము ౧౫. మహారాష్ట్రవాణిజ్యసంఘము, ౧౬. సింధుజాతీయసమితి, ౧౭. డక్కనుసభ, ౧౮. స్వాధీనభారతసంఘము, ౧౯. అజ్మీరు, ఆంధ్ర, బీహారు, బెంగాలు, బర్మా, హిందుస్థానీమధ్యపరగణాలు, మహారాష్ట్ర మధ్యపరగణాలు, డిల్లీ, కర్ణాటక, కేరళ, పాంచాల, సింధు, సంయుక్తరాష్ట్ర, ఉత్కళ రాష్ట్రసంఘములు చేరియున్నవి. ఈ సభల ప్రతినిధులకు మహమ్మదాబాదు మహారాజాగారు స్వాగతము నొసంగిరి. మహాసభకు డాక్టరు అన్సారీగారు ఆధిపత్యమును వహించిరి. సభ యామోదించిన తీర్మానములు భారత స్వాతంత్ర్య సిద్ధికి మూలాధారముగ నుండగలవు. స్వరాజ్యమునకు బాధ్యతాయుత ప్రభుత్వము. కీలకము తదనుగుణ్యముగా నఖిలపక్షసమావేశము లక్నోయందీక్రింది తీర్మానములను చేసినది.

(౧) సింధు ప్రత్యేకరాష్ట్రముగా చేయ బడవలెను.

(౨) పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానము ఇతర రాష్ట్రములతో పాటు పరిగణింపబడవలెను.

(3) పాంచాలమునందును, వంగదేశమునందును ప్రాతినిధ్యము జనసంఖ్యనుబట్టి యుండవలెను.

(౪) భారత శాసనసభ్యుల మొత్తముసంఖ్యలో మహమ్మదీయ ప్రతినిధుల సంఖ్య మూడవ వంతుకు తగ్గియుండరాదు.

"సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతీయుల గమ్యస్థానముగా నుండ దగునని వచించు రాజకీయ పార్టీల కృషికి ఆటంకము లేమియు కలుగ జేయకుండ ౧. భారతదేశములో స్థాపింపబడబోవు ప్రభుత్వము బాధ్యతాయుత ప్రభుత్వమై యుండవలెననియు, అనగా సంపూర్ణాధికారము గలిగిన ప్రజానియోజిత శాసనసభలకు బాధ్యత వహించిన ప్రభుత్వముగా నుండవలయుననియు, ౨. అధినివేశస్వాతంత్ర్యరాజ్యముల యందలి ప్రభుత్వవిధానమునకు ప్రభుత్వవిధాన మెన్నటికి కొరవడరాదనియును ఈ మహాసభవారు ప్రకటించుచున్నారు."

"భారతరాజ్యాంగవిధానము సంపూర్ణస్వాతంత్ర్యాదర్శముపై నాధారపడి యుండవలెనని ఈ ప్రకటనలో సంశయములు చేసినమేము అభిప్రాయపడుచున్నాము. అఖిలపక్ష సమావేశమువారిచే యొనుగుటనుండ బడిన రాజ్యాంగ విధానము నొప్పుకొనినవారు అధినివేశస్వాతంత్ర్యము నొప్పుకొని తీరవలెనని మాకు తోచుచున్నది. దీనినొప్పుకొనుటకు మేము సంసిద్ధులమై లేము. కావున మేమీతీర్మానము నంగీకరించుటగాని ఆమోదించుటగాని వలనుపడదు. తీర్మానముయొక్క అవతారిక సంపూర్ణ స్వాతంత్ర్యమునకై మా కార్యక్రమమును మేము సాగించుకొనుటకు హక్కునొసంగుచున్నదని యొప్పుకొందుము. కాని తీర్మానముయొక్క రెండవభాగమునందు అధినివేశస్వాతంత్ర్యము నంగీకరించి తీరవలెనని యున్న నిశ్చయమును అవతారిక యేవిధముగాను తగ్గించుటలేదు.

వినను ఈ మహాసభాకార్యక్రమమున కేవిధమైన యాటంకమును కలుగజేయుటకు మేము తలచలేదు కాని యీ సమస్యపై మా నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చి, అధినివేశ ప్రతిపత్తి నంగీకరించి తీరవలెనను ఈతీర్మాన భాగముతో మాత్రము మాకేసంబంధమును లేదని ప్రకటింప నిశ్చయించుచున్నాము. ఈ తీర్మానమునకు సంబంధించిన చర్చలోగాని, వోటింగులోగాని మేము పాల్గొనము. సంపూర్ణస్వాతంత్ర్యకార్యక్రమమును, ప్రచారమును కొనసాగించుటకు మాకుచితమని తోచిన పద్ధతుల నవలంబింతుము."

"భారత సంస్థానముల విషయమై సంఘమువారొసంగిన సలహాలను మహాసభవా రంగీకరించుచున్నారు."

"రాష్ట్రపునర్విభజనమును గూర్చియు, రాష్ట్రముల ప్రతిపత్తిని గూర్చియు నివేదికా నిర్మాతలొసంగిన సలహాలను సభవారు విచారించి ఆమోదింపబడిన రాజ్యాంగవిధానములో నంతర్భాగముగా వానిని చేర్చుకొనుట కంగీకరించుచున్నారు.

మరియు రాష్ట్రవిభజనమును గురించి యొసంగబడిన సలహాలలో ప్రతిపాదింపబడిన సూత్రముల ననుసరించియు, తమ కవసరమని తోచిన ఉపసంఘముయొక్కగాని, ఉపసంఘములయొక్కగాని సహాయము గైకొనియు, చిత్తురాజ్యాంగవిధానమునందు 72 క్లాజులో నేర్పరుపబడిన సంఘము ఈక్రింద నిర్వచింపబడిన కార్యములను నిర్వహింపవలెను.

(అ) కర్నాటకమును, ఆంధ్రదేశమును ప్రత్యేక రాష్ట్రములుగా విభజించుటకు అవసరమగు చర్యగైకొనుట.

(ఆ) వివిధరాష్ట్రములలో చెదరియున్న ఓఢ్రభాష మాట్లాడు భాగములను ఏకము చేసి, వారు నూతనరాష్ట్రనిర్మాణమున కవసరమగు వ్యయమును భరించుగలిగియున్నగాని, భరింప సంసిద్ధులైయున్నగాని, అట్లేకము చేసిన ప్రాంతముల నన్నిటిని ఒక్కరాష్ట్రముగా జేయుటకు చర్యగైకొనుట.

(ఇ) మధ్య పరగణాలు [హిందూస్థానీ] కేరళ, మరియు ప్రత్యేక రాష్ట్రముగా విభజింపబడ నిశ్చయించు యితర భాషా ప్రయుక్తవిభాగముల స్థితిగతులను నివేదించుట.

(ఈ) సంఘమువారు నివేదికయందు ప్రతిపాదించిన సూత్రముల ననుసరించి ఆసామ్ బెంగాల్ దేశములయొక్కయు, బీహారు ఒరిస్సాల యొక్కయు, మధ్యరాష్ట్రములు [హిందూస్థానీ] కేరళ, కర్నాటకములయొక్కయు సరిహద్దులను తిరిగి నిర్ణయించుట."

"నెహ్రూసంఘమువారొసంగిన సలహాలలో 87 క్లాజును సంఘమువారు మరల నాలోచించి, రాజ్యాంగవిధానమును సవరించు విషయమై భారతశాసనసభలో వివిధాల్పజనసంఖ్యాక సంఘముల హక్కులను శ్రేయములను రక్షించు విధమున దానిని మార్చవలసినదిగా మహాసభవారు నెహ్రూసంఘమువారిని కోరుచున్నారు."

"అఖిలపక్షసమావేశమువారిచే నియమింపబడిన సంఘము యీ క్రిందివిషయములను గూర్చి విచారించి సభవారికి నివేదకనంపవలెను.

(1) స్వభాషామూలకముగాను, వారికి అలవాటైన లిపిలోను తమ బాలురు పాఠశాలలయందు విద్యాభ్యాసము చేయుటకు అల్పజనసంఖ్యాకసంఘములకు గల హక్కును రక్షించుట.

(2) భారత ప్రజాసామాన్యభాష హిందూస్థానీగానుండి ఆభాషను ఉర్దూ లిపిలోగాని హిందీలిపిలోగాని వ్రాయుట; ఆంగ్లముగూడ వాడుటకు స్వేచ్ఛనిచ్చుట.

(3) ప్రతిరాష్ట్రమునందును ఆయారాష్ట్రభాష రాజభాషగా నుండుట. హిందుస్థానీభాషగాని, ఆంగ్లముగాని వాడుటకు స్వేచ్ఛ నిచ్చుట."

"ప్రజాస్వామ్యస్థాపన సమయమున న్యాయసమ్మతముగా సంపాదింపబడినట్టియు, భుక్తమగుచున్నట్టియు, స్వంత ఆస్తికి గల హక్కులు యిందుమూలకముగా గారంటీచేయబడినవి."

సార్వజనిక హక్కులలో 17వ క్లాజునందు "నిరుద్యోగమువలన గలిగిన దారిద్ర్యమును నివారించుటకు" అను వాక్యము తరువాత ఈ క్రిందిమాటలను కలుపవలెను.

"కవులుదార్లకు సరసమగు కవులును, స్థిరస్వమును యేర్పరుచుటకు భారత పార్లమెంటువారు తగిన చట్టములను చేయవలెను".

అఖిలపక్షసమావేశ మామోదించిన తీర్మానములు బాధ్యతాయుత పరిపాలనావసరమును, ఆపరిపాలనమును స్థాపింపవలసిన విధమును, స్వతంత్ర రాష్ట్రనిర్మాణ విధానమును, భాషాప్రయుక్తమైన రాష్ట్రపునర్విభజనమును ప్రజాస్వత్వములను నిర్ణయించుచున్నవి. సంపూర్ణస్వాతంత్ర్యవాదులును, ప్రత్యేకసాంఘికాభిమానులును పై తీర్మానములను ప్రతిఘటించినను, నధికసంఖ్యాకులాతీర్మానములనామోదించిరి. నెహ్రూనివేదిక స్వాభిమాన పరాయణులైనబర్కెను హెడ్డుప్రభృతులకును, బ్రిటిషు రాజ్యాధికారులకును, నిరంకుశాధికారులకును భారతజాతీయ సంయోగ బలసాధనములను విశదము చేయుచున్నది. నెహ్రూనివేదిక అధినివేశ రాజ్యాంగవాదులకును, సంపూర్ణస్వాతంత్ర్యవాదులకును సంఘర్షణమును కలుగజేసినది. సకల జాతులకును సంపూర్ణస్వాతంత్ర్యము సహజావస్థయై యున్నది. పారతంత్ర్యస్థితియందున్న దేశములకీసహజావస్థ దుర్లభముగ నున్నది. నిరాయుధులైన భారతీయులకు సంపూర్ణస్వాతంత్ర్యస్థితి దుర్లభమని సకలపక్షములవారును నంగీకరించుచున్నారు. చెన్నపురికాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యము భారతజాతీయాదర్శ మని నిర్ణయించినది. స్వాతంత్ర్య సిద్ధాంతము విషయమై కాంగ్రెసు పక్షమునందు భేదాభిప్రాయములు గనుపడవు. అఖిలపక్ష సమావేశమునందు జేరిన ఇతరపక్షములవారును, కాంగ్రెసును కలసి యొకతీర్మానమునే యంగీకరించుటకు వలన రాజ్యములరాజ్యాంగవిధానము నుపపాదించిన తీర్మానము నంగీకరించుట అవసరమైనది.

విశాలమైన భరతఖండమునందు స్వదేశసంస్థానములును, బ్రిటిషు రాష్ట్రములును చేరియున్నవి. బాధ్యతాయుత పరిపాలనము బ్రిటిషురాష్ట్రములందువలెను స్వదేశ సంస్థానములందును స్థాపించుట దేశక్షేమమున కత్యంతావసరముగా నున్నది. బ్రిటిషురాష్ట్రములందు ప్రజాధికారమును, సంస్థానములందు నిరంకుశాధికారమును మహూహాములు. భరతవర్షమంతయును స్వతంత్రముగల స్వదేశ సంస్థానములను, బ్రిటిషు రాష్ట్రములను గలిగి బాధ్యతాయుతమైన కేంద్రాధికారముచే బద్ధమై యుండుట దేశక్షేమమునకు సాధనమైయున్నది. ఆదికాలమునుండియు భరతవర్షమునందు కేంద్రాధికారమునకును, రాష్ట్రీయ స్వాతంత్ర్యమునకును సంప్రాప్తమైన సంరంభము దేశమును నిర్వీర్యము చేసినది. భారతదేశసౌభాగ్యమునకు సంయుక్త రాష్ట్ర పరిపాలనము శరణ్యముగ నున్నది. విశాలమైన దేశము, వివిధభాషలు, వివిధమతములు, సంస్కారములు, బ్రిటీషు స్వదేశ విభాగములు సంయుక్త రాష్ట్ర రాజ్యాంగమునకు బలీయమైన కేంద్రాధికారావసరమును విశదము చేయుచున్నవి. సంయుక్తరాష్ట్రరాజ్యాంగవిధానమునందు కేంద్రాధికారమును, ప్రాంతాధికారమును వైరుధ్యము లేక సంయోగసాహచర్యములను గలిగియుండుటయే రాజ్యాంగములకు ప్రయోజనము. మతమునకును మతమునకును, భాషకును భాషకును, దేశమునకును దేశమునకును, సంస్కారమునకును సంస్కారమునకును, జాతికిని జాతికిని, సంఘమునకును సంఘమునకును సహకారసాహచర్యములు ప్రయోజనకరములుగాని ప్రతిఘటన సంరంభములు ప్రయోజనకరములు గావు. నెహ్రూనివేదిక రెండువిధములైన రాజ్యాంగవిధానములకును నన్యోన్య సంబంధమును గల్పించుచున్నది. నివేదికయందలి ఒకటిరెండు షెడ్యూలు లీవిషయమును విశదము చేయుచున్నవి.

హిందూదేశము నావరించిన ప్రధానసమస్య-జాతిభేదములు, కులభేదములు, మతభేదములు మొదలగు నంతర్విభేదములు. అంతర్విభేదములు విదేశప్రభుత్వమును పోషిం

చుటకుసకలవిధములనుతగియున్నవి.స్వప్రయోజనమునకై సర్వసంహారమును జేయగల మహానుభావులు సర్వకాల సర్వావస్థలందును పుట్టుచుందురు.ఇట్టిమహానుభావులు సర్వసంహార మాత్మనాశనమునకు మూల మగునని గ్రహింప జాలరు. అసురబలసంపన్నులైన మహానుభావులు ప్రపంచస్థితి యంతయునుతమవలననె జరుగుచున్నదని సంభ్రమించుచు, విశ్వకల్యాణమున కాధారభూతమైన ధర్మమును నతిక్రమించుచు,లోకమును దుఃఖముపాలుచేయుచుందురు.

శ్లో. ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్.

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః.

లోకమునందు పారతంత్ర్యమస్వాభావికము, ధర్మవిరుద్ధము; స్వాతంత్ర్యము స్వాభావికము, ధర్మానుకూలము. పారతంత్ర్యజ్వాలలు జాతి మత కుల భేదములను పాటింపక అందరను సమానముగానె దహింప జేయుచున్నవి. స్వయంవికాసమునకు ప్రతిబంధకమైన పారతంత్ర్య మాత్మవికాసమునకువలెనే దేశవికాసమునకును ప్రతిబంధక మగుచున్నది. తన కవసరములేని స్వాతంత్ర్యమును దేశమునకు కోరుట అసంభవము. విదేశప్రభుత్వమునకు స్వార్థపరులైన ఆత్మవంచకులు పోషణమునుజేయుటకు దగియుందురు. దేశదాస్యముతో తన దాస్యమును, దేశస్వాతంత్ర్యముతో తన స్వాతంత్ర్యమును, నన్యోన్యాశ్రయములై యున్నవని, స్వార్థపరులు గ్రహింప జాలరు. హిందూమహమ్మదీయ విభేదములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు, ఉన్నత నిమ్నజాతి విభేదములు, పారతంత్ర్యమును పోషించుటకు వినియోగపడుచున్నవి. పారతంత్ర్య స్థితియందు స్వాతంత్ర్య స్థితియందు వలె నాత్మవికాసముగలుగక నాత్మవినాశము గలుగుచున్నది. విదేశీయప్రభుత్వము ప్రత్యేకలాభములను సమకూర్చినను దేశాభ్యుదయమునకు ప్రతిబంధక మగుచున్నది. దేశమునందు, సంఘములు లాభములు కలవుగాని సంఘములందు లాభములందు దేశములేదు. సంఘములను, జాతులను, మతములను విభజించి పరిపాలించుట బ్రిటిషు రాజ్యనీతి. ఈ విభేదములను సంరక్షించెడి రాజ్యాంగ సంస్కరణములు ప్రత్యేక ప్రయోజనములకు లాభదాయకములైనను, దేశమునకు, ధర్మమునకు లాభదాయకములుగావు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నిమ్నజాతులు, సిక్కులు, యూరపియనులు, మొదలగు వా రందరును సంకుచితములైన ప్రత్యేకలాభములను గోరుచు, విశాలమైన దేశ ప్రయోజనమునుమరచిపోవుచుందురు. దేశప్రయోజనముల ను విశాలము చేయుట రాజ్యనీతి గాని సంకుచితముచేయుట రాజ్యనీతి గాదు. సంయుక్తభారత రాజ్యాంగములందు సకల సంఘముల సంయోగమును పోషించుటవలన రాజ్యాంగమునకు బలమును, ప్రత్యేక సంఘములను పోషించుట వలన రాజ్యాంగములకు దుర్బలమును గలుగుచున్నది. హిందూమహమ్మదీయ విభేదముల నంతరింపజేయుటకై శాసనసభలు, హిందూ మహమ్మదీయసంఘములు, భారత జాతీయమహాసభ, యామోదించిన నిర్ణయములనే నెహ్రూ నివేదికయును నామోదించినది.

౧. సింధురాష్ట్రనిర్మాణము, ౨. పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రము,బెలూచిస్థానము నితరరాష్ట్రములతోపాటు రాజ్యాంగములను బడయవలయును, 3. పంజాబునందును, వంగదేశమునందును ప్రాతినిధ్యము జనసంఖ్యను బట్టి యుండవలయును, ౪. భారతశాసనసభయందు సభ్యులసంఖ్యలో మూడవవంతు తగ్గకుండా మహమ్మదీయప్రతినిధులసంఖ్య యుండవలయును.

ఈ నిర్ణయములవలన హిందువులు, మహమ్మదీయులు సాంఘికనియోజకవర్గవిధానమును విడచి సామాన్యనియోజకవర్గవిధానము నవలంబించుట కంగీకరించిరి. నెహ్రూసంఘ మీనిర్ణయముల యాధారమున నివేదికయందు సంయుక్తనియోజకవర్గమును సిఫార్సుచేసినది. లక్ష్మణపురమునందు కూడిన అఖిల పక్షసమావేశ మీ యేర్పాటులనే యామోదించినది. సింధురాష్ట్రనిర్మాణవిష

యమునను, సామ్రాజ్యసభయందు ప్రాతినిధ్యనిర్ణయ విషయమునను హిందువులకు మహమ్మదీయులకు భేదాభిప్రాయము లేర్పడి మహమ్మదీయనాయకులు ప్రతికూల వాతావరణమును గలుగ జేయుటకు బూనుకొనిరి. సుప్రసిద్ధమహమ్మదీయనాయకులైన షౌకతాలీ మహమ్మదాలీ గార్లు నెహ్రూనివేదికను ప్రతిఘటించుచు హిందూమహమ్మదీయ సంయోగమును శిథిలము చేయుట విషాదకరముగ నున్నది. హిందువులును, మహమ్మదీయులును, ప్రత్యేక సాంఘిక లక్ష్యములను విడచి భారతదేశలక్ష్యమును గ్రహింపనంతవరకు దేశస్వాతంత్ర్యము దుర్లభమును, పారతంత్ర్యము స్థిరమును నగుచున్నది. దేశారిష్టములకు మూలమైన ఈక్లిష్టసమస్యనునిర్ణయించుటకు నాయకులు ప్రజలకు మార్గదర్శకులగుట వివేకము. పారతంత్ర్యమునందు దేశము కృశించి క్షీణించుచున్నపుడు ప్రత్యేక లాభములు మహమ్మదీయులనుగాని, హిందువులనుగాని రక్షింపజాలవు. దేశసౌభాగ్య దౌర్భాగ్యములు ప్రత్యేక సంఘముల సౌభాగ్యదౌర్భాగ్యములకు మూలకారణములుగ నున్నవి. ఆసందర్భములను గ్రహించిన హిందూ మహమ్మదీయనాయకులు రెండు సంఘములకును లాభమునకు బదులు త్యాగమును బోధించి స్వసంఘక్షేమమును, దేశక్షేమమును రక్షించుట ధర్మము. డాక్టరు అన్సారి, ఆలిఇమాము, అబ్దులుకలముఅజాదు, మహమదాబాదురాజాగారులు మొదలగు మహమ్మదీయనాయకులు పూనిన దూరదృష్టి సంస్తవనీయముగనున్నది పండితమోతీలాలు నెహ్రూగారు సాంఘికవిభేదముల నంతరింపజేయుటకు బూనిన సంకల్పమును భగవంతుడు ఫలము చేయుగాత !

నెహ్రూనివేదిక నిరంకుశవర్గమునకు సమాధానము; అన్నిపక్షములవారును కలిసిచెప్పిన సమాధానము; దేశక్షేమమునకై పాటుపడెడి మహానుభావుల సమాధానము. సైమనుకమిషను నిర్ణయములు విదేశీయుల నిర్ణయములు; స్వప్రయోజనపరాయణుల ప్రార్థనలు. ఈ రెండు నిర్ణయములందును ఏ నిర్ణయము యుక్తమొ, సహజమొ, ప్రజాసమ్మతమొ, బాధ్యతాయుత పరిపాలన యోగ్యమొ కాలము నిర్ణయింపగలదు. భారతీయులందరునుస్వార్థారాధనలక్ష్యమును కొంతకాలమైనను మఱచి మాతృదేశారాధనలక్ష్యమును బూనుట స్వార్థమునకును, పరార్థమునకును ధర్మసాధనము.

ప్రజలను, ప్రభుత్వమును కలవరపరచుచున్న ప్రధానవిషయము రాజ్యాంగసంస్కరణము. మోంటుఫర్డుసంస్కరణము లారంభమై పదేండ్లు గావచ్చినవి. నియమానుసారముగ రాజ్యాంగము పునర్విమర్శనమును ముందుకో వెనుకకో నడుపవలసిన యవసరమును ప్రభుత్వమున కేర్పడినది. నిరంకుశాధికార శిబిరమునందు నిరర్థకమైన ద్వంద్వప్రభుత్వ విధానముపైతము బ్రిటీషు నిరంకుశత్వమును నిర్మూలము చేయుచున్నదను భయము గలిగినది. పారతంత్ర్యపాశములను సుస్థిరము చేయుటకు సైమను తెల్లకమిషనును, బ్రిటిషురాజ్యాంగ ప్రవీణులు నియమించిరి. బర్కెనుహెడుప్రభువు మొదలగు రాజ్యతంత్రజ్ఞులు పన్నిన తంత్రములు విఫలములైనవి. అన్నిపక్షముల నాయకులును తెల్లకమిషనుబహిష్కరణమును నిశ్చయించిరి. ఆంగ్లరాజనీతిజ్ఞులు తలచినట్లు వారిభేదోపాయములవలన బహిష్కరణోద్యమము శిథిలముగాక బలపడినది. బహిష్కరణోద్యమ ప్రాబల్యము ఇర్విను ప్రభువు, సైమనువర్గము, నిరంకుశాధికారవర్గము మొదలగువా రందరును అంగీకరించుచున్నారు. అధికారులు సైమనుకమిషను ప్రయోజనమును ప్రకటించుటకు పన్నిన చతుర్విధోపాయములును నిరర్థకములైనవి. ప్రజానాయకులను లాలనజేసిరి, దండించిరి, దురాశలను గల్పించి చీలదీసిరి. ఈయుపాయములన్నియును నిరుపయోగములైనవి. భారతీయులు యోజింపవలసిన విషయము విదేశీయకమిషను నిర్ణయించిన రాజ్యాంగవిధానము ప్రయోజనకరమొ, స్వదేశీయనాయకులు నిర్ణయించిన రాజ్యాంగ విధానము ప్రయోజనకరమో అయియున్నది. స్వయంనిర్ణయసూత్రమునకును, ఆత్మగౌరవమునకును, దేశావసరములకును ప్రతికూలమైన సైమనుకమిషను నిర్ణయములను

నిరాకరించుటయును, అనుకూలమైన నెహ్రూనివేదిక నామోదించుటయును స్వార్థమునకును,పరమార్థమునకును సాధనముగ నున్నది. కలకత్తాయందు గూడిన ౪౨వ భారతజాతీయ మహాసభ సైమనుకమిషను బహిష్కరణ మును, నెహ్రూ నివేదికాస్వీకారమును ఆమోదించి ప్రజాసంకల్పమును లోకమునకు సువ్యక్తము చేసినది.

కలకత్తాయందు గూడిన ౪౩ వ భారత జాతీయ మహాసభ భారతస్వరాజ్య సంరంభమునందు సకల విధ ములను గణనీయముగ నున్నది. పండిత మోతీలాలు

కలకత్తా కాంగ్రెసు

నెహ్రూగారిని రెండవసారి యధ్యక్షు నిగ నెన్నుకొనుట వారియందు ప్రజ లకు గల విశ్వాసమును విశదము చేయుచున్నది. కలకత్తా ప్రజలు, నాయకులు నెహ్రూగారికి కొసంగిన యపూర్వ మైన స్వాగతము ప్రజాహృదయమున ప్రజ్వరించుచున్న స్వాతంత్ర్యాగ్నిని సువ్యక్తము చేయుచున్నది. ముప్పది యారుగుర్రములు గట్టిన రథము, ప్రజల జయఘోషలు, స్వాగతతోరణములు, స్వచ్ఛందసైనిక దళములు, అశ్వ భట మహోత్సవములు ప్రజల స్వరాజ్యానురాగమునకు ప్రత్యక్ష నిదర్శనములు. మహత్తరమైన కాంగ్రెసుమండ పము, వివిధములైన సభలు, ప్రతినిధుల యుత్సాహము సర్వతోముఖమైన ప్రజాప్రబోధమును విశదము చేసినవి. పండిత మోతీలాలుగారి యాధ్యక్షోపన్యాసము ప్రజా హృదయము నావరించిన స్వరాజ్యాభిలాషను ప్రతిధ్వ నించినది.

నెహ్రూగారు వారి యుపన్యాసమునందు, మన మెచట నున్నాము? మన గమ్యస్థాన మేది? మన గమ్య స్థానము నెటులు చేరగలుగుదుము? అనెడి ప్రధానప్రశ్న లకు వారి స్వానుభవమునుబట్టి సమాధానములను నిర్ణ యించిరి. వివిధరాజ్యాంగరంగములందును భారతీయుల పారతంత్ర్యస్థితి నిత్యానుభవమునందున్న విషయము. దేశరక్షణమున కవసరమైన సైన్యవ్యవహారములు, పోష ణమున కవసరములైన వాణిజ్యార్థిక వ్యవహారములు, స్వాతంత్ర్యమునకు సాధనములైన న్యాయాంగ వ్యవహార ములు విదేశీయుల హస్తములందున్నవి. దేశారిష్టములకు మూలములైన పారతంత్ర్య పాశబంధముల నుండియును విముక్తులమగుటకు స్వాతంత్ర్యస్థాపన మత్యంతావసర ముగ నున్నది. స్వాతంత్ర్యపరిపాలనమునకు నామకరణ మేమి చేసినను బాధ్యతాయుత పరిపాలనము ప్రాణముగ నున్నది. ఆలక్షణస్వరూప స్వభావములను నెహ్రూగారు వారి యుపన్యాసమునందు విమర్శించి నెహ్రూనివేదిక నిర్ణ యించిన రాజ్యాంగవిధానమునే సమర్థించిరి. బాధ్యతా యుత స్వపరిపాలనమును అధినివేశముల రాజ్యాంగము లందు గలదు. ఆవిధానమునైనను వెంటనే స్థాపించుట యావసరమని నెహ్రూగారు ఇతరనాయకులవలె నభిప్రాయ పడుచున్నారు. అధినివేశ రాజ్యాంగవిధానమునకును, సంపూర్ణస్వాతంత్ర్యమునకును భేదము గలదని నెహ్రూ గారి నివేదికయును నంగీకరించుచున్నది. శ్రీయుత బులు సు సాంబమూర్తిగారు, శ్రీనివాసయ్యంగారు, జవాహరి లాలునెహ్రూ, సుభాసుచంద్రబోసుగార్లు మొదలగువారు సంపూర్ణస్వాతంత్ర్యమును గోరుచుండుట విఖ్యాతమైన విషయము. నెహ్రూగారు వారి నివేదికయందువలెనే వారి యుపన్యాసమునను సంపూర్ణస్వాతంత్ర్యమును గమ్యస్థాన ముగ నంగీకరించుచున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యాదర్శము ను బోధించుటకును స్వతంత్రపక్షమున కవకాశములను నెహ్రూనివేదిక యంగీకరించుచున్నది. కాంగ్రెసు సమా వేశమునకు పూర్వము గూడిన కన్వెన్షను సమావేశమును కొన్ని సవరణలతో దీనినంగీకరించినది. కన్వెన్షను నెహ్రూనివేదిక యందలి ప్రధానాంశముల నంగీ కరించినది. మహమ్మదాలిగారును, జిన్నాగారును కన్వె న్షనుసభయందు జూపిన తిరస్కార స్వభావమును, షౌక తాలిగారు కన్వెన్షనుపట్లను జూపిన నిరాదరణ స్వభావ మును ఆలిసోదరుల నావహించిన గాఢమైన సాంఘికాభి మానమును విశదము చేయుచున్నవి. ఇట్టి విషాదస్థితి యందు సర్ ఆలిఇమాము, అలము, అబులుకలాము ఆజాదు, అన్సారిగారులు మొదలగు మహమ్మదీయనాయ



చిత్రము 3




చిత్రము ౩

# ఆంధ్ర యిన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బందరు.

స్థాపితము—1925

## డాక్టరు, కోకా అహోబలరావుగారు, మేనేజింగు డైరెక్టరు.

## అ పూ ర్వ వి జ య ము.

## గత మూడు సంవత్సరముల క్రమాభివృద్ధి.

| వివరములు | మొదటిసాలు_1926 16 నెలలలో | రెండవసాలు 1927 | మూడవసాలు 1928 |
|---|---|---|---|
| కంపెనీకి వచ్చిన—— | | | |
| భీమాదరఖాస్తులసంఖ్య ... | 523 | 466 | సుమారు రు. 1000 |
| వాటి మొత్తం .. | రు. 8, 20, 000 | రు. 7, 78, 000 | ,, ,, 16, 00, 000 |
| జారీచేసినపాలసీలసంఖ్య ... | ,, 341 | 373 | ,, ,, 670 |
| వాటి మొత్తం ... | ,, 5, 21, 000 | ,, 6, 32, 000 | ,, ,, 11, 00, 000 |
| పాలసీప్రీమియంఆదాయం... | ,, 23, 400 | ,, 44, 300 | ,, ,, 80, 000 |
| భీమాఫండు ... | ,, 4, 761 | ,, 29, 182 | ,, ,, 56, 000 |
| గవర్నమెంటుహామీ ... | ,, 47, 750 | ,, 6, 4, 000 | ,, ,, 1, 25, 000 |

## అ పూ ర్వ సౌ క ర్య ము లు.

1 ప్రీమియములు సాలీనా ఒకాయిదాగా చెల్లించేవారికి నూటికి రూ. 2-8-0 చొప్పున ప్రీమియములో మినహాయింపు చేయబడును. Rebate of 2½% allowed if premiums are paid in Yearly instalments-

2 స్త్రీల జీవితములు భీమా చేయబడును. (యితర కంపెనీలలో అరుదు.)

3 శాశ్వత అంగవైకల్యము (Permanent Disability) కల్గినవారు ముందునుంచి ప్రీమియములు చెల్లించనక్కరలేదు. (Policies become paid up for the full amount of the Assurance on the happening of such disability)

4 తెలుగులో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొనవచ్చును.

5 సమస్తవిషయముల మీకు అందుబాటులో నుంచును.

## ఆంధ్రాభ్యుదయమునకు తోడ్పాటు.

1 యీ భీమాకంపెనీ నిల్వధనముతో రైతులయొక్క ఋణగ్రస్తతను నివారించుటకుగాను భూమితనఖా బ్యాంకులు పలుస్థలములలో ఏర్పాటు చేయుచున్నది.

2 ఆంధ్రయువకులకు గౌరవప్రదమైనవృత్తి కల్పించినవారమగుదుము.

3 కొంతవరకు నిరుద్యోగసమస్యను తొలగించు సాధనము.

మరియు సర్వవిధముల ఆంధ్రాభ్యుదయమునకు తోడ్పడును గాన ఆంధ్రులెల్లరు యిందులోనే తమజీవితములను భీమాచేసి యీ సంస్థను ప్రోత్సహింతురు గాక!

గ్రేసు దినములలో ప్రీమియములు దిగువ బ్యాంకులలో మా అక్కౌంటునకు చెల్లించవచ్చును. విజయనగరం; రామచంద్రాపురం; అమలాపురం; రాజమహేంద్రవరం; ఏలూరు; బెజవాడ; గుంటూరు; తెనాలి; కాకినాడ; నెల్లూరు కో-ఆపరేటివు సెంట్రలుబ్యాంకులు, సెంట్రలుబ్యాంకు ఆఫ్ యిండియా మద్రాసు, బొంబాయి.

మంచిపలుకుబడిగల ఏజంట్లు కావలెను.
వివరములకు కార్యదర్శికి వ్రాయవలెను.

యర్రమిల్లి మంగయ్య బి. ఎ. బి. ఎల్.
కార్యదర్శి.

కులు చూపినభక్తిశ్రద్ధావివేకములు ప్రశంసనీయముగ నున్నవి.

కన్వెన్షను సమావేశ మామోదించిన ప్రస్తావనలను భారతజాతీయ మహాసభ యామోదించి భారతజాతీయసంకల్పము లోకమునకు సువ్యక్తము చేసినది. విషయనిర్ధారణసభయందు భిన్నపక్షములును యోచించి యంగీకరించిన తీర్మానమును సుభాసుచంద్ర బోసుగారు మహాసభయందు ప్రతిఘటించుట దేశాభ్యుదయమున కవసరమైన క్రమశిక్షణమునకు భంగమును గలుగజేయుచున్నది. గాంధిమహాత్ముడు రాజ్యాంగరంగమునందు తిరిగి ప్రవేశించుటవలనను కలకత్తా కాంగ్రెసునకును, రాజ్యాంగపరిస్థితులకును మహాబలమును గలుగజేసిన విధమును దేశపరిస్థితులు విశదము చేసినవి. కలకత్తా కాంగ్రెసునందు గాంధిమహాత్ముడు ప్రతిపాదించిన తీర్మానము నధికసంఖ్యాకు లామోదించి నెహ్రూనివేదకయందును, కాంగ్రెసునందును, గాంధిమహాత్మునియందును భారతీయులకుగల విశ్వాసమును విశదము చేసిరి.

"నెహ్రూనివేదికలోని వివిధపరతులు పరస్పరసంబంధముగలిగి యున్నవి గనుక పైతీర్మానములలోని యొడంబడికలన్నియు, నెహ్రూనివేదిక ఆమోదింపబడినయెడల సంపూర్ణముగా నామోదింపబడవలెనను ఊహమీద నాధారపడియున్నవని ఈ సభవారు ప్రకటించుచున్నారు. మరియు నెహ్రూనివేదికను సంపూర్ణముగా నామోదించవముగాని, దానిలో నేదోఒక భాగమును మాత్రమే ఆమోదించమని ఈ అఖిలపక్ష మహాసభలో హాజరయిన అన్నిపక్షములవారము ఒప్పుకొనుచున్నాము.

అన్నిపక్షములవారును సమ్మతించినయెడల యీరాజ్యాంగవిధానమునం దేమార్పులైనను చేయవచ్చును."

"నెహ్రూనివేదికను ఈ మహాసభవారు విచారించి భారతదేశముయొక్క రాజకీయ, సాంఘికసమస్యలను పరిష్కరించుటకిది చక్కని పద్ధతులను సూచించుచున్నదని తలచుచున్నారు. మరియు సంఘమువారు ఏకగ్రీవముగా చేసిన సిఫారసులకు సభవారు నెహ్రూసంఘము నభినందించుచున్నారు. మద్రాసు కాంగ్రెసు మహాసభలో నామోదింపబడిన స్వాతంత్ర్య తీర్మానము నీ సభవా రంగీకరించుచు, నెహ్రూనివేదిక దేశములోనున్న ముఖ్య పార్టీలన్నియు నంగీకరించగలిగిన గరిష్ఠసామాన్యమును తెల్పుచున్నది గనుక రాజకీయాభివృద్ధిని సూచించు చున్నదనియే తలచుచు దాని నంగీకరించుచున్నారు.

రాజకీయపరిస్థితులకు లోబడి, ఆంగ్లపార్లమెంటు సభవారు డిసెంబరు 1929 సంవత్సరము లోగా నీరాజ్యాంగ విధానము నామోదించినచో, ఈమహాసభవారు ఈ రాజ్యాంగ విధానమును స్థాపింపగలరు. ఆతారీఖు లోగా నాంగ్లపార్లమెంటువారు ఆమోదించనిచో, లేక అంతకు పూర్వమే నిరాకరించినచో కాంగ్రెస్‌వారు దౌర్జన్యరహిత సహాయ నిరాకరణము నవలంబించి అప్పుడు నిర్ణయింపగల పద్ధతుల ననుసరించి పన్నుల నిరాకరణమునుగాని, మరియే సాత్విక పద్ధతిని గాని అవలంబింప వలసినదని దేశీయులను ప్రబోధించెదరు.

పైదానికి అనుగుణ్యముగా నున్నయెడల, కాంగ్రెస్ పేర సంపూర్ణ స్వాతంత్ర్య ప్రచారమును సాగించుట కేయభ్యంతరములును కలుగజేయబడవు."

"స్వదేశి సంస్థానములలో ఏకవ్యక్తిపరిపాలనను తొలగించి బాధ్యతాయుత పరిపాలన నేర్పరుప వలెనను తీర్మానము సభవారిచే నంగీకరింపబడెను".

నెహ్రూనివేదికను 1929 సంవత్సరముడిసెంబరు లోపుగా బ్రిటీషుపార్లమెంటు ఆమోదించిన పక్షమున నాయకు లీరాజ్యాంగవిధానమును పరిపాలించుటకు బూనుకొనియెదరు; వారు దీనిని నిరాకరించినపక్షమున శాసనోల్లంఘనప్రస్థానము నుచితరీతిని నిర్ణయించి యవలంబించెదరు. ఆనిర్ణయములు దౌర్జన్యరహితములైన శాసనతిరస్కారరూపమును దాల్పగలవు. సత్యాగ్రహ ప్రవరాయణుడు గాంధిమహాత్ముడు కాంగ్రెసు ప్రస్థానమును జేయుట కంగీకరించి భారతీయులకు ధైర్యమును, నిరంకుశవర్గమునకు భయభ్రాంతులను గలుగజేయుచున్న విధమును దేశవ్యవహారములు విశదముచేయుచున్నవి. భారతీయులు బాధ్యతాయుత పరిపాలనమును బడయుటకు ధర్మబలము నారాధించుట యవసరమని భారతీయ సంస్కారము బోధించుచున్నది. ఆదివ్యబోధనె గాంధిమహాత్ముడు సత్యాగ్రహరూపమున పునఃప్రతిపాదనమును జేయుచున్న విధమును ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

ఆత్మ బలము

వర్తమాన కాలమునందు ప్రపంచ మంతయును ధనార్జనమునకును, నధికారపదవులకును జేయుచున్న మహాప్రయత్నము లాత్మబలరహితములై సర్వసంహారమును జేయుచున్నవి. ఆత్మబలమును సాధించుటకై ప్రపంచమునందు నవధర్మానుష్ఠాన మవసర మగుచున్నది. నవధర్మారాధనము

రాజ్యాంగములందే కాక సకలాంగములందును నారాధ్యముగ నున్నది. నవధర్మారాధనమును భౌతిక విభవముతో గాక ఆత్మవిభవముతో జేయవలసి యున్నది. అహింస, సత్యము, దయ, త్యాగము మొదలగు సాత్త్విక గుణములు ఆత్మారాధనమునకు సాధనములుగ నున్నవి. సత్త్వగుణములు సత్యాగ్రహమున కంగములు. సత్యాగ్రహాంగములద్వారా గాంధిమహాత్ముడు స్వరాజ్యప్రస్థానమును జేయుటకు బూనుకొనిన విధమును కాంగ్రెసు నిర్ణయించిన కార్యవిధానము విశదము చేయుచున్నది.

స్వరాజ్యప్రస్థానమును జేయుటకు కాంగ్రెసు నిర్ణయించిన కార్యవిధాన మాత్మబలమును సమకూర్చుట కేర్పడినది. ఆత్మయోగమునకు ప్రతికూలములైన మద్యపానము, అంటరానితనము, విదేశవస్త్రధారణము మొదలగు పరధర్మములు నిరాకరించుటవలన ఆత్మయోగము సాక్షాత్కారమై విజయము గలుగుచున్నది. స్వరాజ్యప్రస్థానము విజయము గాంచుట కవసరమైన స్వరాజ్యసైన్యము సిద్ధము గావలసియున్నది. కాంగ్రెసుసంఘములు దేశమునందంతటను వెలయవలయును. గ్రామసంఘములు, ఫిర్కాసంఘములు, తాలూకా సంఘములు, మండల సంఘములు, దేశమునందంతటను వెలయవలయును. ఖద్దరుధారులయిన స్వరాజ్యసభ్యులు సర్వత్ర ప్రత్యక్షము గావలయును.

విశ్వమునందు జీవజాలములు తమతమ సంకల్పములను, కామ్యములను సఫలము చేసుకొనుటకు విశ్వమంతయును పరమసాధనముగ నున్నది. సంకల్పసిద్ధి సర్వత్ర సిద్ధముగ నున్నను విశ్వము ప్రత్యక్షమై కామ్యములను ప్రసాదించుట కనన్యమైన భక్తి సాధనముగ నున్నది. విశ్వము నెవ రేవిధమున నారాధింతురో వారల కావిధమైన ఫలము లభించుచున్నది. సాధకుల సంకల్పసామర్థ్యము ఫలసిద్ధికి మూలముగాని అనంతమైన విశ్వము మూలము గాదు. సాధకులసాధనకు దగిన ఫలము గలుగునుగాని సాధకుల కోరికనుబట్టి ఫలము గలుగజాలదు. చిన్ననోములను నోచుచు పెద్దఫలములను గోరుట నిరర్థకము. సాధకులు సాధనల కనురూపమైన యధికారు లగుచున్నారు. సామాన్యసాధనలకు సామాన్యఫలము, మహాసాధనలకు మహాఫలము సమకూర్చుట ప్రకృతిధర్మము. ప్రహ్లాద హిరణ్యకశిపులకు, వసిష్ఠవిశ్వామిత్రులకు, బ్రాహ్మణక్షత్రియులకు, శిష్టదుష్టులకు, పండిత పామరులకు వారి వారి సాధనసంపత్తి కనురూపమైన ఫలము గలుగుచున్నది. భారతీయుల స్వరాజ్యసంకల్పమునకును వారిసాధనలకును రూపమైన ఫలము గలుగుచున్నది. కాంగ్రెసు, స్వరాజ్యసంపాదనమునకు నిర్ణయించిన సాధనములు సర్వసామాన్యములుగ గనుపించినను ప్రాజ్ఞులకీసాధనముల మహత్త్వము గోచరము గాగలదు. భారతస్వరాజ్య సంపాదనమునకును, సిద్ధికిని ఖద్దరు మహాసాధనమని ఖద్దరుమహత్త్వము విశదము చేయుచున్నది. స్వదేశవస్త్రసేవ, విదేశవస్త్ర బహిష్కారణమును, దహనమును ఆత్మశుద్ధికిని, ఆత్మావలంబనమునకును సహజసాధనములుగ నున్నవి.

ఆత్మబలము లేని సంకల్పము సిద్ధికి మూలసాధనముగాకున్నది. దేహబలమున కాత్మబలమె బీజముగా నున్నది. దేహబలమునకు మూలమైన ఆత్మబలవికాసము సంకల్పములు సఫలమగుటకు సాధనముగ నున్నది. ఆత్మవికాసము లేని సంకల్ప మొకవేళను సఫలమైనను శుభప్రదము గాజాలదు. భారతజాతీయసంకల్పము పరిశుద్ధమగుటకును, జయప్రదమగుటకును గాంధిమహాత్ముని యుపదేశానుసారముగ కాంగ్రెసు నిర్ణయించిన నిర్మాణకార్యవిధాన మనుష్ఠానయోగ్యముగ నున్నది. మద్యపానము కోట్లప్రజలను దుర్బలులను, పశుప్రాయులను జేయుచున్నది. అస్పృశ్యత కోట్లప్రజలను భారతసంఘబాహ్యులను జేయుచున్నది. విదేశవస్త్రధారణము భారతజాతి మూర్ఛ నావరించి ఆత్మశక్తిని స్తంభనము చేయుచున్నది. భారతజాతి మూర్ఛ కాత్మస్వరూపము సాక్షాత్కారమగుటకు త్రికరణశుద్ధమైన స్వధర్మనిర్వహణము శరణ్యముగ నున్నవిధమును గాంధిమహాత్ముని యుపదేశములు స్ఫురింపజేయుచున్నవి. మహాత్ముని పవిత్రజీవితము సకలజనులకును ననుష్ఠానయోగ్యముగ నున్నది.

స్వధర్మ నిర్వహణమునకు బాహ్యాభ్యంతరలక్ష్యమైన ఖద్దరు రాజకీయార్థికనైతికధర్మములను సకలజనులకును ననుష్ఠానయోగ్యములుగ చేయుచున్నది. ఖద్దరు ద్వారా

జ్యమును, సంపదలను, సోదరత్వమును సమకూర్చుటకు సాధనంబుగ నున్న విధమును గతకాలానుభవము విస్పష్టము చేయుచున్నది. దేశక్షేమపరాయణు లందరును సేయుద్యమపోషణమునకు జేసిన త్యాగమె ఆత్మశక్తికి ప్రమాణముగ నున్నది.

భారతజాతీయసంకల్పమును ఫలప్రదము చేయుటకు జాతీయహృదయమును స్తంభింపజేయుచున్న శాసనసభలు నిరర్థకములు. రాష్ట్రీయశాసనసభలు సభ్యులను, ముఖ్యముగా, మంత్రులను, స్వధర్మపరాఙ్ముఖులను జేయుచున్నవి. అధికారాశాపిశాచము సభ్యులను స్వధర్మపరాఙ్ముఖులను జేయుచున్నది. ముత్తయ్య మొదలియారుగారును, నేషురత్నయ్యరు గారు మంత్రిపదవుల కాశపడి ప్రతిజ్ఞాభంగమును జేయుటయు, స్వధర్మపరిత్యాగమును జేయుటయు ప్రబలమైన నిదర్శనములుగ నున్నవి. ప్రబలమైన స్వరాజ్యపక్షముపైనను శాసనసభలయందు స్వధర్మనిర్వాహణమును జేయుట దుస్తరమైనది. శాసనసభల నిర్మాణమే ప్రభుత్వపక్షమునకు మహాశక్తిని గలుగజేయుట కనుకూలముగ నున్నది. దేశబంధు చిత్తరంజనదాసు ప్రతిపాదించిన ప్రతిస్తంభనము దుస్తరమైనది. సహాకారమో, సహాకారనిరాకరణమో సాధ్యముగాని మధ్యమార్గము సాధ్యముగాదని స్పష్టమైనది. శాసనసభలయందు నాయకుల శక్తిసామర్థ్యములు వాగ్వివాదములతో పరిసమాప్తిని బొందుచున్నవి. కార్యాచరణము దుస్తరముగ నున్నది.

శాసనసభలు

ప్రతిభావంతుడైన విఠల్‌భాయి పటేలుగారి ధర్మనిర్ణయములు నిరర్థకము లగుచున్నవి. సామ్రాజ్యశాసనసభయందు శాసనసభ నిరాకరించిన ఉప్పుపన్నును ఒకక్షణములో ఇర్విన్‌ప్రభువు పునరుద్ధారణ జేసెను. సభాధ్యక్షుడు పటేలుగారు దేశక్షేమ శాసనమువిషయమై చేసిననిర్ణయమును రాజప్రతినిధి ఒక క్షణములో భగ్నముచేసెను. ప్రతిభావంతు లగు నాయకుల శక్తిసామర్థ్యములు శాసనసభలయందు వ్యర్థము లగుచున్నవి. శాసనసభలు బ్రిటీషు రాజ్యాధికారమును గాపాడుటకు వినియోగపడుచున్నవి, స్వరాజ్యసంపాదనకును, భారతజాతీయవికాసమునకును వినియోగపడవని రాజ్యాంగసంస్కరణముల యనుభవము విశదము చేయుచున్నది. స్వరాజ్యసంపాదనము ప్రజాశక్తివలన సాధ్యము గాగలదు గాని శాసనసభలవలన సాధ్యము గాజాలదు. ప్రజాశక్తిని వికసింపజేయుటకు విదేశవస్త్రబహిష్కారము, స్వదేశవస్త్రస్వీకారము పరమసాధనములుగా నున్నవి. ఈసాధనలు కొందరికిమాత్రమే కాక, సకలజనులకును ననుష్ఠానయోగ్యములుగ నున్నవి.

కలకత్తాకాంగ్రెసు 1928 సంవత్సరాంతమునందు ప్రచారాత్మకమైన కార్యవిధానమును బూనుటకునిర్ణయించినది. ఆనిర్ణయములు సఫలములగుటకు దేశమునందంతటను కాంగ్రెసుసంఘములు బయలు దేరవలయును. ఆసంఘములందు వేలకొలది ఖద్దరువస్త్రధారులగు సభ్యులు చేరవలయును. ఉద్రేకముగా ప్రజాశక్తి విజృంభించినపుడు స్వరాజ్యము సహజముగా సంప్రాప్తము గాగలదు. ప్రజానాయకులు వారి శక్తిసంపదయును నిర్మాణకార్యవిధానమునందు వినియోగింపవలసిన యావశ్యకమును శాసనసభల వ్యవహారములు, స్వరాజ్యపక్షమును-నిర్మాణవ్యవహారములు సువ్యక్తము చేసినవి. నాయకులు వారి దుర్భరమైన యనుభవాసంస్కారముచేతనైనను జ్ఞానము గలిగి ప్రవర్తించుటకు భగవదనుగ్రహము గలుగుగాక!

ఆంధ్రోద్యమాదర్శములు కాలక్రమమున సఫలము లగుచున్నను, ఆంధ్రదేశస్థితి పరమవిషాదమును గలుగజేయుచున్నది. గాంధిమహాత్ముడు తెల్పినట్లు బహునాయకత్వము కార్యసిద్ధికి ప్రతిబంధకముగా నున్నది. బహునాయకత్వ మాంధ్రవిశ్వవిద్యాలయ నిర్మాణమును నిరర్థకము చేసినది. నాయకుల స్వస్థలాభిమానము, స్వాభిమానము విశ్వవిద్యాలయాదర్శములను భగ్నము చేసినవి. అనంతపురము, రాజమహేంద్రవరము, బెజవాడ, విశాఖపట్టణము స్వస్థలప్రయోజనములు సర్థించి విశ్వవిద్యాలయప్రయోజనములను సంకుచితము చేసినవి. రాయలసీమ ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారమునుండి విడిపోవుటయును,

మద్రాసు విశ్వవిద్యాలయాధికారమునందు జేరుటయును విషాదమును గలుగజేయుచున్నవి. ఆంధ్రదేశమునకు దూరస్థమైన వాల్తేరునందు సశిక్షణవిశ్వవిద్యాలయమును స్థాపించుటయును విశ్వవిద్యాలయ ప్రయోజనమును సంకుచితము జేయుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయము నీదర వస్థనుండి తొలగించి సకలాంధ్రప్రయోజనములను సార్థకము చేయుటకు విశ్వవిద్యాలయాధికారులు, నాయకులు, ప్రజలు పాటుపడుట పరమధర్మముగ నున్నది. ఆంధ్రత్వమునకు ప్రతికూలమైన విశ్వవిద్యాలయము స్వధర్మమునే మూలచ్ఛేదము చేయుచున్నది.

ఆంధ్రోద్యమమునకు ప్రాణమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును వెనుకబెట్టుటయును ఆంధ్రులనావహించిన దుర్దశకు నిదర్శనముగ నున్నది. నెహ్రూనివేదిక భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణమును, ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమును ప్రతిపాదించుచున్నది. మద్రాసుశాసన సభ ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము నామోదించినది. మదరాసు ప్రభుత్వనివేదికయును, మద్రాసు శాసనసభోప సంఘనివేదికయును ఆంధ్రరాష్ట్రనిర్మాణ విషయమును నిర్లక్ష్యము చేయుట ఆంధ్రుల దురదృష్టమునకు నిదర్శనముగ నున్నది. ఉపసంఘమున కధ్యక్షతను వహించిన ఆంధ్రప్రముఖులు సర్ పరశురామపాత్రోగారీవిషయము పట్లను చూపిన నిరాదరణభావము వారిద్వంద్వప్రవృత్తిని విశదము చేయుచున్నది. మద్రాసు రాష్ట్రమునందు సకలవ్యవహారములందును నాంధ్రవ్యవహారముల కాదరణము లేనివిధమును నిత్యవ్యవహారములు విశదముచేయుచున్నవి. విద్యావ్యవస్థలందును, జలాధారములందును, స్థానికసంస్థలందును ఆంధ్రుల పురోభివృద్ధికి దగినయవకాశములు వారికి లభింపకున్నవి. అన్నామలై విశ్వవిద్యాలయము, మెట్టూరు జలాశయనిర్మాణము, కావేరివంతెనలు మొదలగు కార్యములకు మద్రాసురాష్ట్రమునందు గల ప్రతిపత్తి ఆంధ్రదేశవ్యవహారనిర్మాణములకు లభింపకున్నది. ప్రభుత్వమునకును, ప్రజలకును లాభకరమైన నిర్మాణములు ప్రభుత్వాదరణములేక కృశించుచున్నవి. ఆంధ్రదేశప్రతిపత్తికి దగిన యవకాశములు ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణము మూలముననే గలుగగలవు. నాయకులును, ప్రజలును పరస్పరభేదములను విడనాడి ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమునకై యావచ్ఛక్తిని వినియోగించి కృతార్థులగుట వివేకము. విశాలమైన భరతఖండమునందు బాధ్యతాయుతపరిపాలనమును, సాంఘాతికరాజ్యాంగవిధానమును సాధ్యమగుటకు భాషాప్రయుక్తరాష్ట్రవిభాగములు శరణ్యములు.

శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి యకాలమరణ మాంధ్రలోకమును దుఃఖసముద్రమునందు ముంచినది. గోపాలకృష్ణయ్యగారి సర్వతోముఖమైన ప్రజ్ఞ ఆంధ్రహృదయము నాకర్షించి ప్రత్యభిజ్ఞానమును గలుగజేసినది. శ్రీపానుగల్లురాజాగారి యకాలమరణము మద్రాసు రాష్ట్రమున కపారమైన నష్టమును గలుగజేసినది. రామారాయణంగారు బ్రాహ్మణ ప్రతిఘటనమునకు పూనుకొనినను వారిసాహసధైర్యములు, పరిజ్ఞానము, ఆంధ్రత్వాభిమానము ప్రశంసనీయములై ప్రజాగౌరవమునకు పాత్రములైనవి. ఇతరనాయకులును వారిమార్గము నవలంబించుచు నాంధ్రరాష్ట్రమును, సాధించుటకు పాటుపడి కర్తవ్యమును నిర్వహింతురు గాత!

గాంధిమహాత్ముడు వారిసంచారములందు చేసిన హితోపదేశములను ఆంధ్రప్రముఖులును ప్రజలును, మననము చేసి, కార్యపరతంత్రులై కామితార్థమును బడయుట వివేకము. బుద్ధిబలమునందును, ఉత్సాహమునందును, ఔదార్యమునందును, సంభావనాశక్తియందును ఆంధ్రులకుగల ప్రతిభను గాంధిమహాత్ముడు విజయవాడ, బందరుమహాసభలయందు ప్రశంసించి, వారి కర్తవ్యమును సువ్యక్తముచేసెను. ఆంధ్రులకు సంయోగసామర్థ్యము లేకపోవుటయే వారి దైన్యస్థితికి కారణమని మహాత్ముడు చేసిన యుపదేశము నాంధ్రులు గ్రహించి ఆంధ్రాభ్యుదయమునకు పాటుపడుచు మాతృదేశాశీర్వాదములను బడయుదురు గాక!

సర్వతోముఖమైన యాంధ్రాభ్యుదయమునకు సకలరంగములందును ఆంధ్రవికాసము గలుగవలసిన యవసరమును దేశపరిస్థితులు విశదముచేయుచున్నవి. ఆంధ్రదేశము

గాంధిమహాత్మునకు సమర్పించుచున్న స్వాగతములు, కానుకలు, సన్మానములు వారియుత్సాహమును, ఔదార్యమును వెల్లడిచేయుచున్నవి. వివిధపక్షములవారును, వివిధసంఘములవారును భేదాభిప్రాయములను విడిచి గాంధిమహాత్మునకు సమర్పించిన స్వాగతములు భావిభాగ్యోదయమునకు శుభసూచనలుగ నున్నవి. గాంధిమహాత్ముని స్వాగతసందర్భములందువలెనే ఇతర సందర్భములందును దేశక్షేమమునకై ఆంధ్రప్రజానాయకులు భేదభావములను విసర్జించి మాతృదేశారాధనము జేయుటకు పాటుపడుదురుగాక! వర్తమానవిషాదస్థితియందు ప్రజలసంయోగసాహచర్యముల యావశ్యకము సర్వత్ర తెలిసిన విషయము. స్వరాజ్య సంపాదనమునకు సాధనభూతములైన సకలాంగములందును యథాశక్తిని ఆంధ్రప్రజానాయకులు పాటుపడి స్వధర్మనిర్వహణమును చేయుదురు గాక!

భగవదనుగ్రహమువలనను, ఆంధ్రమహాజనులసహాయపోషణమువలనను శుక్లసంవత్సరాదిసంచికను ఆంధ్రలోకమునకు సమర్పింపగలిగినందులకు వందనములర్పించుచున్నాము. సాధారణనామ సంవత్సరమునందు మొదటి సంవత్సరాదిసంచిక బొంబయినగరమునందు ప్రకటింపబడినది. శుక్లసంవత్సరమునందు దరువదన సంవత్సరాదసంచిక చెన్నపురియందు ప్రకటింపబడినది. గతించిన ఇరువది యేండ్లయందును ఆంధ్రదేశమునందును, భరతవర్షమునందును, ప్రపంచమునందును పర్యాప్తమైన మహాపరివర్తనమును సంవత్సరాదిసంచికలు విశదము చేయుచున్నవి. రాజ్యాంగములందును, సాంఘికవ్యవస్థలందును, సారస్వతమునందును, నైతికధర్మ సిద్ధాంతములందును, ఆర్థికపరిస్థితులందును వర్ధిల్లుచున్న పరివర్తనమును ప్రపంచపరిస్థితులు సహస్రముఖముల వ్యక్తము చేయుచున్నవి. ఐరోపా మహాసంగ్రామము సమకూర్చిన మహాసంక్షోభము పునర్నిర్మాణమును గోరుచున్న విధమును ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి. శుక్లసంవత్సరాది సంచికయందలి వ్యాసములు, చిత్రపటములు, ఛాయాపటములు, పద్యములు, పాటలు, ప్రపంచావృతమైన భావపరివర్తనమును వ్యక్తము చేయుచున్నవి.

సంవత్సరాదిసంచికయందలి వ్యాసములు రాజకీయము, సారస్వతము, కథలు, చరిత్ర, చిత్రకళ, సాంఘికము, వైద్యము, జ్యోతిషము, వేదాంతము, సంగీతము, ప్రకీర్ణకము, రసతరంగములు మొదలగు శీర్షికలందు విభజింపబడి ప్రచురింపబడినవి. ఆ శీర్షికలలోని వ్యాసములు దేశావ్యాప్తమైన ప్రబోధనమునకు నిదర్శనములైనను గాఢమైన విజ్ఞానమునకు నిదర్శనములు గాజాలవు. ప్రజాహృదయమునందు వ్యాసంగనాభిలాషవృద్ధిని పొందినటులు జిజ్ఞాసాభిలాష వృద్ధిని పొందకుండుట శోచనీయము. ప్రజలచిత్తవృత్తి స్వల్పవిషయములందు లగ్నమగుచున్నటులు మహద్విషయములందు లగ్నముగాకున్నది. సంచికయందు ప్రచురించిన వ్యాసములు సంఖ్యయందును, విషయవిభాగమునందును బహుళముగా నున్నను, విషయగ్రహణమునందు సామాన్యముగ నున్నవి. రాజకీయవిషయములందు కాంగ్రెసుసభాధ్యక్షుని యుపన్యాసము భావగర్భితమై, స్వాతంత్ర్యవాతావరణభరితమై యొప్పుచున్నది. 'రాజనీతి—రాష్ట్రా'ంగములు, ప్రజాస్వామికప్రభుత్వము ప్రవర్ధమానం' బగుచున్న ప్రజాస్వామ్యవ్యాపనమును విశదము చేయుచున్నది. సంస్కృతవాఙ్మయనిర్మాతలు దాంధ్రకవితకర్తల ప్రతిపత్తిని 'ఆంధ్రులు-సంస్కృతవాఙ్మయము' నిర్దేశించుచున్నది. 'సారస్వతజిజ్ఞాస' కవితకుగల విశ్వవ్యాపకత్వమును, సత్యసౌందర్యములనుజూడగల సావకాశము, సాధుమతిభావములను సమర్థించుచున్నది. 'శ్రీనాథుని నైషధాంధ్రీకరణము', 'ద్రౌపదిరోషము,' 'రాజశేఖరచరిత్రము' మొదలగు వ్యాసములు స్త్రీపురుషులందు ప్రవర్ధమానంబగుచున్న విమర్శన సామర్థ్యమును విశదము చేయుచున్నవి. 'ఉగాదికానుకలు', 'నిరంజనశాస్త్రి', 'సుప్తారకజాతకము', 'శీతలామందరము' అను కథలు ప్రవర్ధమానం బగుచున్న సాంఘికపరివర్తనమును, సంభావనాసామర్థ్యమును విశదము చేయుచున్నవి. సంగీత చిత్రకళలకు సంబంధించిన వ్యాసము లాంధ్రుల మృదుమధురప్రవృత్తిని విశదము చేయుచున్నవి. జ్యోతిషము, వైద్యము, చరిత్రము

మొదలగు భాగములు సలంకరించెడి వ్యాసములు వివిధకళలందును, శాస్త్రములందును ప్రవర్ధమానంబగుచున్న విజ్ఞాన వ్యాపనమునకు నిదర్శనములుగ నున్నవి. 'లోకములు-లోకాంతరములు', 'విశ్వసోదరత్వము', 'ముక్తివిచారణ' మొదలగు వ్యాసము లాంధ్రహృదయమునకు సహజమైన దైవసంపదను ప్రతిపాదించుచున్నవి. 'అమరావతీ స్తూపము' అనువ్యాసము బౌద్ధమతిమువలన నైన శిల్పకళాభివృద్ధిని, ఆంధ్రదేశమందు వెలసియున్న అమరావతి స్తూపమునందలి శిల్పసౌందర్యమును చక్కగ చాటుచు మహాత్తర పరిశోధనమునకు నిదర్శనముగ నున్నది.

రసతరంగములందు ప్రకటింపబడిన పద్యవ్యాసములు సర్వతోముఖమైన ఆంధ్రరస హృదయమును మనోహరముగ దెలుపుచున్నవి. భక్తిజ్ఞాన వైరాగ్యసంపన్నమైన యాంధ్రహృదయస్వరూపము నవి ప్రత్యక్షము చేయుచున్నవి.

సంచికయందు ప్రకటింపబడని వ్యాసములన్నిటిని ప్రచురింపజాలనందులకు చింతిలుచున్నాము. శ్రమచేసి వ్యాసములను వ్రాసి సంచిక ఉపయోగమును వృద్ధిచేసిన మహాజనుల కనేకవందనములు సమర్పించుచున్నాము.

ఆంధ్రదేశమునందు గడచిన దేండ్లలోపల చిత్రకళయందు గలిగిన యభివృద్ధిని శుక్లసంవత్సరాది సంచిక సూచించుచున్నది. ముఖపటము కాంగ్రెసు నాయకుడైన నెహ్రూ విజయమును చాటుచున్నది.

త్రివర్ణచిత్రములు దినదినప్రవర్ధమానంబగుచున్న చిత్రాకళాభినివేశమును విశదము చేయుచున్నవి. 'శరత్తు' అను చిత్రపటము వంగ చిత్రకళావైఖరిని దెలుపుచున్నది. దీనిని శ్రీ సురేంద్రనాథకరుగారు చిత్రించిరి. 'శ్రీకృష్ణలీల' ప్రాచీన రాజపుత్ర చిత్రకళావైఖరిని దెలుపుచున్నది. దీనిని కర్నూలుజిల్లా, కోవెలకుంట్లతాలూకా, నొస్సెం నివాసులు శ్రీ యం. వెంకటరెడ్డిగారు పంపిరి. ఇందులకు వారికి కృతజ్ఞులము. శ్రీ వెంకట సుబ్బారావుగారి 'నాగరాజు' ఆంధ్రకళానైపుణ్యమును చాటుచున్నది. శ్రీ వరదా వెంకటరత్నముగారి 'గోదావరి నీలాటిరేవు' ఆంధ్రకళా హృదయమును ప్రత్యక్షము చేయుచున్నది. శ్రీ కవుతా రామమోహన శాస్త్రిగారి 'చిత్రకారుడు' చిత్రకారుని స్వయం చిత్రనిర్మాణనైపుణ్యమును విశదము చేయుచున్నది. 'ఏనుగుల పోరాటము*' అను సంకీర్ణజంతు చిత్రము ప్రాచీన సంకీర్ణ చిత్రరచనా నైపుణ్యమును చాటుచున్నది. అమరావతి స్తూప చిత్రములు, అజంతాచిత్రములు ప్రాచీన చిత్రకళావైభవమును స్ఫురింపజేయుచున్నవి. సంచికయందుగల 70 పుటల భావనాచిత్రపటములందును సుప్రసిద్ధులైన స్త్రీ పురుష పటములును, సుప్రసిద్ధమైన సమావేశముల పటములును, భావనాఖ్యాయపటములును ననేకములు గలవు. ఈ పటములు ప్రత్యేకాకృతిని ముద్రింపబడిన విధమును సంచిక స్పష్టము చేయుచున్నది.

శ్రీ శుక్లసంవత్సరసంచికయందు విభవసంవత్సరమునందలి విశేషాంశములను, ప్రజలయాశయములను ప్రతిపాదించుటకు జేసిన పరిశ్రమను ఇందలి వ్యాసములు, పద్యములు, త్రివర్ణపటములు, ఛాయాపటములు, ముఖపటము మొదలగునవి విశదము చేయుచున్నవి. సంచికను ప్రచురించుటకు దోడ్పడిన మహాజనుల సంగతిని పేర్కొనుటయును, వారికి కృతజ్ఞతను దెలుపుటయును దుర్లభము. సంచికకు వ్యాసములు, చిత్రపటములు ప్రధానాంగములుగ నున్నవి. ప్రధానాంగములైన వ్యాసములకును, చిత్రపటములకును రూపరేఖావిలాసములను సమకూర్చిన పరిశోధకులు, చిత్రకారులు, ముద్రాపకులు మొదలగువారి సహాయసంపదలు సంచికకు సుందరమగు రూపరేఖావిలాసములను గల్పించుచున్నవి. వారందరును నిర్వాహకుల కృతజ్ఞతకు పాత్రులు. ప్రచురణభారము దినదినాభివృద్ధిని పొందుటవలన, లోపములును అభివృద్ధి పొందుట సహజము. ప్రచురణభారమువలన ప్రచురణము సకాలమునకు వెలువడక విలంబము జరిగినందులకు ఆంధ్రమహాజనుల మన్ననలను వేడుచున్నాము. గుణగ్రహణపారీణులు గుణములను గ్రహించి దోషములను మన్నించెదరుగాక! భగవంతుడు శుక్లసంవత్సరమునందు బుధాధిపత్యముక్రింద సకలజనులకును, సమస్త లోకములకును శాంతి సౌఖ్యములను ప్రసాదించుగాక!

* దీనినిగూర్చి చిత్రవివరణమున నొకింత విపులముగ గలదు.

# భార్యాభర్తలవివాదము

ట్రేడు




మార్కు



భర్త—ఇదిగో. ఏమిటి అన్నం ఇట్లా వుంటున్నది. రుచి పచి లేదే?

భార్య—అది తప్పే.

భర్త—ఎట్లాగూ! (కోపముతో)

భార్య—వెధవ ఇంగువ తీసికొని వచ్చి రుచికరముగా ఆహారము కావలెనంటే ఎట్లా వస్తుంది?

భర్త—అయితే ఎక్కడ తీసికొని రమ్మంటావు ఏమిటి?

భార్య—మన యింటి పొరుగు వారు ఎప్పుడున్ను "గాంధిమార్కు మిస్కీ—ఇంగువ" కొంటారు. అది చాల బాగా ఉంటుందని, దానికి మించినది మరేదిలేదని చెప్పినారు.

భర్త—ఇంకా నేనుకూడ గాంధి మార్కు మిస్కీ ఇంగువనే తెస్తాలె. పౌను రు. **2.** పోస్టేజి ప్రత్యేకము.

మేలైన కస్తూరి; కుంకుమపువ్వు, పచ్చకర్పూరం మొదలగునవికూడ మావద్ద దొరకును.

*Sole Importers:—*

## Messrs. GOPALJI CHAMPSHI & Co.,

**21 Govindappa Naick Street,**

**(Opp. Soundaya Mahal), Madras.**



చిత్రము ౫

# కామినియా నూనె

వేలకు వేల కుటుంబములయందు వాడబడుచున్నది




## ఎందువల్ల?

కామినియా వెంట్రుకలు రాలిపోకుండ కాపాడును.

కామినియా చుండును రానీకుండ కాపాడును.

కామినియా నూనె మెదడుకు చల్లదనము గలిగించును.

కామినియాయందు వెంట్రుకలను వృద్ధిజేయు దినుసులు చేరియున్నవి. మెదడుకు చాలా ఉపయోగమును గలిగించును.

కామినియా నూనె యింపైన సువాసన కలది.

ఈ సుగుణములన్నిటినిబట్టియే. వేలకు వేల కుటుంబములందు దీనిని కోరుచున్నారు.

కామినియా నూనెను ఉపయోగించువారలు దీనిని వెంట్రుకలకు జీవమేయని కొనియాడుచుందురు.

## హెచ్చరిక

మీరు మీ వర్తకులను సప్లయిచేయుమని కోరినయెడల ఎక్కువలాభమును పొందుట కుద్యుక్తులై, మట్టపురకము నూనెను యిచ్చుటకు ప్రయత్నించెదరు. ఈ మాయలకు మోసపోకుడు. కామినియా నూనెనే యిమ్మని కోరుడు. వెంట్రుకలకు సరియైన నూనెనే కోరినయెడల ఎల్లప్పుడు కామినియా ఆయిల్ (రిజిష్టర్డు) పేరును మరువకుడు.

| | | | |
|---|---|---|---|
| 1 సీసా | వెల రు. 1-0-0 | వి. పి. చార్జీలు అణాలు | 0-6-0. |
| 3 సీసాలు | 2-10-0 | ,, | 0-12-0. |

వేరొందిన స్టోరులన్నిటియందును కామినియా ఆయిల్ అమ్మబడును.

సోల్ ఏజంట్లు:—

ది ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

285, జుమ్మామసీదు, బొంబాయి—2.

# ప్రాణాయామము చేయుపద్ధతిని చూపు పటము




శ్రీపరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారు రచియించిన "జీవబ్రహ్మైక్యరాజయోగ సారామృత" గ్రంథములో చెప్పియుండు ప్రాణాయామమును గురువుయొక్క సహాయము లేకనే తెలుసుకొని అభ్యసించుటకు గాను ఈపటమువంటి పటము పెద్దసైజు ఆర్టుపేపరులో ముద్రింపబడినది. ఈపటము చిన్నదిగానున్నందున అక్షరములు బాగుగ కనుపించక యున్నది. పెద్ద పటములో అక్షరములు మిక్కిలిబాగుగ కనుపించును. ప్రాణాయామము నేర్చుకొనువారలకు యీపటము చాలా వుపయోగకరమైనది. వలయువారు క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

1. "జీవబ్రహ్మైక్యరాజయోగసారామృతము" రెండవ కూర్పు 1164 పుటలును 48 పటములును గలది.

వెల రు. 4-4-0

2. ప్రాణాయామము చేయుపద్ధతిని చూపుపటము. వెల రు. 1-0-0

టి. కె. సుందరం,

శ్రీసచ్చిదానందర్ కంపెనీ, పెరంబూరు బారక్సు, చెన్నపురి.

# షణ్ముగం  నశ్యము.



షణ్ముగనశ్యము దేశమునకుచేసిన జాతీయసేవ అపారమైనది, పలువిధములుగా గలదు. మీకుకూడ సేవ చేయుటకై షణ్ముగనశ్యమునకు అవకాశము నిచ్చెదరా. గడచిన 4 తరములనుంచి అగ్రస్థాన మలంకరించినది.



గాయకులు తమపనులు మిక్కిలి ఉత్సాహముతోను, రమ్యముగాను నిర్వహింపగలరు.



గుమాస్తాలు చురుకుగాను, త్వరితముగాను వారి పనుల నెరవేర్చగలరు.



అనేకగంటలకాలము పనిచేయ ఉపాధ్యాయునికి శక్తి నిచ్చును



న్యాయాధిపతికి నిర్మలమైనట్టి రమ్యామైన మనస్సును గలిగించును

షన్ముగం నశ్యము

| పలములు | ధర | | | పోస్టుఖర్చు | | | ప్యాకింగు | | | మొత్తం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
| 40 | 8 | 8 | 0 | 0 | 8 | 0 | 0 | 2 | 0 | 8 | 18 | 0 |
| 80 | 7 | 0 | 0 | 0 | 8 | 0 | 0 | 4 | 0 | 7 | 7 | 0 |
| 120 | 10 | 8 | 0 | 0 | 8 | 0 | 0 | 4 | 0 | 10 | 15 | 0 |

ఆర్. కె. పరిమళ నశ్యము

| | ధర | | | పోస్టుఖర్చు | | | ప్యాకింగు | | | మొత్తం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై | రు. | అ. | పై |
| 1 బుడ్డి | 0 | 4 | 0 | 0 | 4 | 0 | 0 | 1 | 0 | 0 | 9 | 0 |
| 8 బుడ్లు | 0 | 9 | 0 | 0 | 4 | 0 | 0 | 1 | 0 | 0 | 14 | 0 |
| 12 బుడ్లు | 2 | 4 | 0 | 0 | 8 | 0 | 0 | 1 | 0 | 2 | 18 | 0 |

హెడ్ ఆఫీసు:—షణ్ముగం నశ్యం కంపెని, లిమిటెడ్. పోస్టుబాక్సు నెం. 140, మద్రాసు.

౧

పిలిచిన పిలుపును పెడచెవి బెట్టక,
తలఁచినంత మము ధన్యులఁ జేయఁగ,
నడచి వచ్చితివె! వాత్సల్యముతో
తలఁప నగునె నీ దయ యెంతో, వే
గన్నులు చల్లఁగఁ గైసేయూ, నీ
చిన్ని కటాక్షము చెలఁగించూ, మా
కన్నతల్లి మము కరుణించూ, ని
న్నెన్నఁగలము దయ నెనయించూ.

౨

అమరావతి స్తూపాలయాందములు
అల నాగార్జును నార్యశిల్పములు
హంపీ ప్రాంతపు టందచందములు
శ్రీగిరి వెలసిన చిత్రసీమలూ
కాకతీయులఁ గల కమనీయతలూ
దివ్యస్థలముల తీరుపుమెఱుపులూ
తక్కిన స్థలముల మిక్కుటమై సొం
పెక్కిన రచనల టక్కుటెక్కులు
క్రొత్తపోకడల గూర్చికొని, తమ
చిత్రసీమలకు హత్తఁ జేసి మా
కన్నులు పెట్టిన పీఠములూ - వే
గన్నులు చల్లఁగ గైసేయూ, నీ
చిన్నికటాక్షము చెలగించూ, మా
కన్నతల్లి మము కరుణించూ, ని
న్నెన్నఁగలము దయ నెనయించూ.

3

పృథ్వీజాహ్నవిగ వెలసిన గోదా
సరి కృష్ణాదుల వారిపూరములు
చల్లఁగ కమ్మఁగ సంవాసింపఁగ
పాద్యార్ఘ్యాదులు పచరించుటకై
ఆద్యా! తెచ్చితి మఱియు మల్లవే!
ఆచమనోదక మాహరింపుమీ
మధుపర్కంబుల మాన్యతఁ గొనుమీ
జంకము లాడఁగ సరగున రా, వే
గన్నులు చల్లఁగ గైసేయూ, నీ
చిన్నికటాక్షము చెలఁగించూ, మా
కన్నతల్లి మము కరుణించూ, ని
న్నెన్నఁగలము దయ నెనయించూ.

౪

సన్నని తిన్నని చదునుపు గలవై
ఎన్నరాని సొం పెనయించునవై,
మన్నికలో పేర్మ్రోగినవై,
ఎన్నో తరాల్ ఖూ పెన్నిధులై నీ
కెన్న సొంపులను నెనఁగించెడి మా
సన్నని ఖద్దరు చలువ లివే, వే
కన్నులు చల్లఁగ గైసేయూ, నీ
చిన్నికటాక్షము చెలగించూ, మా
కన్నతల్లి మము కరుణించూ, ని
న్నెన్నగలము దయ నెనయించూ.

౫

ఘుమఘుమలాడెడి క్రొత్తగంధముల
గమగమమనమై గలయ నలఁదికొని,
చిఱుచేమంతులు చిన్ని మొల్లలును
మల్లెలు మున్నగు మంచి పుష్పములు
కొల్లలుగా నెఱికుఱులఁ గూర్చికొని
కలమాన్నాదుల కమ్మని కూరల
పలుపాయసముల పప్పుల పండ్లను
చెలఁగు నివేదన చేపట్టూ, వే
కన్నులు చల్లఁగ గైసేయూ, నీ
చిన్నికటాక్షము చెలఁగించూ, మా
కన్నతల్లి మము కరుణించూ, ని
న్నెన్నఁగలము మది నెనయించూ.

౬

హంసతూలికల నందం బౌ క్రొ
మ్మించు నుయ్యెలల నించెడి ముదమున

త్రిపురహరణములు తేఁటిగీతములు
కృష్ణునిచల్దులు గోపక్రీడలు
మొత్తుపుబాటలు మున్నగుపాటలు
కోట్లకొలఁదిగా గూర్చిపాడఁగల
గుణవతు లిదిగో కొలువంగా నిను
చేరియున్నవారి సేవింపా-వే-
కన్నులు చల్లఁగఁ గైసేయూ-నీ
చిన్నికటాక్షము చెలఁగించూ-మా
కన్నతల్లి మము కరుణించూ-ని
న్నెన్నఁగలము మది నెనయించూ.

౧౪

దేశికీర్తులఁజాటఁ [illegible]ఁగుపురాణము
పాటింపఁగల బారి[illegible]
ధాటిగ హరికథ సీటులు తెల్పఁగ
అజ్ఞా[illegible] అలయుము తల్లీ!
ఘనఘనసంఘముతో మనసులు తనియఁగ
వేదా[illegible] విప్పిచెప్పఁగా
బులుసువారి పే[illegible]గింపంగా
యుష్మ[illegible] రొ[illegible]కుప్పలు
వసిలి[illegible] సనజానసులూ
ఎవ్వరి[illegible] నెనయింతూ-నీ
కెయ్యది ఇంపుగ నెసఁగించూ-వే
కన్నులు చల్లఁగఁ గైసేయూ-నీ
చిన్ని కటాక్షము చెలఁగించూ-మా
కన్నతల్లి మము కరుణించూ-ని
న్నెన్నఁగలము మది నెనయించూ.

౧౫

వ్యాయామాంగముల వంతేగ సూడఁగ
రామమూర్తి నీటు రప్పింతూ
లలితకళల మద వలచిన నెంతో
లలితంబుగ నిట లాలింపఁగల
మఱునది నాలుగు మురువగు కళలను
మెఱయింతుము నీ మెచ్చున కొప్పఁగ
కుఱియింతుము గుణకోటి నమ్మృతముల
మెఱయింతుము మఱి మిసమిస వుట్టఁగ
ముఱియింతుము నిను మోదంబులతో
వరియింతుము నిను వాంఛలు తీరఁగ
తల్లీ! నీపదతామరసంబుల
ధరియింతుము మా తలల నిక్కముగ
తప్పము తప్పము తప్ప మిఁకా-వే
కన్నులు చల్లఁగ గైసేయూ నీ
చిన్ని కటాక్షము చెలఁగించూ-మా
కన్నతల్లి మము కరుణించూ-ని
న్నెన్నఁగలము మది నెనయించూ.

౧౬

ఆనందించితె! అమ్మా, అయినచో
ఆశీస్సుల నిన్నడిగెదము
హెచ్చుకుందు లేకెవ్వరు కోరిన
నింపుగ దర్శన మిప్పించూ నీ
సొంపుఁ జూపి మది సొక్కించూ, నీ
పెంపుఁ గల్గఁగా బెఱయించూ, మఱి
మచ్చరముల హరింపఁజేయించూ, యీ
యిచ్చకంబులను ఇంకించూ, మా
వత్సలు నిరతము వర్ధిల్లఁగ, నీ
వాత్సల్యం బిటు పారించూ, ధన
ధాన్యవిభవములు మాన్యగుణంబులు
మాతృప్రేమలు మలయఁగ. దేశ
క్షేమము భాషాక్షేమము లెప్పుడు
తామరతంపై తనరంగా, స
ద్ధర్మపథము మది తనరంగా-వి
జ్ఞానదీపికలు కడలుకొనంగా
తేజరిల్ల మము దీవించూ, వే
కన్నులు చల్లఁగఁ గైసేయూ, నీ
చిన్నికటాక్షము చెలఁగించూ, మా
కన్నతల్లి మముఁ గరుణించూ, ని
న్నెన్నఁగలము మది నెనయించూ.

## ౧. రాజకీయము

# ౪౩-వ భారతజాతీయమహాసభ, కలకత్తా—అధ్యక్షోపన్యాసము

**శ్రీ పండిత మోతీలాలు నెహ్రూ గారు, అధ్యక్షులు**

ఈ భారతజాతీయమహాసభకు నన్ను మీరు మరల రెండవపర్యాయము అధ్యక్షునిగా నెన్నుకొనినందులకు నేను మీకు మిక్కిలి కృతజ్ఞుడనుగా నున్నాను. ఇది అద్వితీయమగు గౌరవ మనుట కెట్టి సంశయమును లేదు గాని దానికి సంబంధించిన బాధ్యత కూడ మిక్కిలి అధికముగనే యుండును గావున యీ పదవిని వహించుటకు మనలో అత్యంత ధైర్యశాలు లగు నాయకులుగూడ జంకుచునేయుందురు. ఈ పదవిని స్వీకరించుటకు నే నెంత సంశయించితినో మీకే తెలియును. కాని అపారమగు కరుణతో మీరు రెండవసారిగూడ నాయందు సంపూర్ణ విశ్వాసమును బ్రకటించి సందున మీయానతికి తలయొగ్గి స్వాతంత్ర్య సమరమునందు ప్రవేశించియున్న భారత మహాజాతిని నడుపుటయను పెనుభారమును వహించుట తప్ప నాకు గత్యంతరము లేకపోయినది. కావున శక్తివంచనలేక నా విధిని నేను నిర్వర్తించుటకు ప్రయత్నించెదను. మీరు నాపై చూపిన కారుణ్యాతిశయమునుబట్టి మీరు విధించిన యీ ఘన కార్యనిర్వహణమునందు నాకు సర్వవిధముల తోడ్పడెద రనియు నాలోపములను మన్నింతురనియు ధైర్యము కలుగుచున్నది.

9 ఏండ్లక్రితము జాతీయమహాసభకు నే నధ్యక్షత వహించుట తటస్థించినది. దారుణఫలితములతోకూడిన సైనికశాసనము స్వేచ్ఛావిహారము నొనరించి అపుడే విరమించినది. విదేశీయు లగు పాలకులతో గొప్ప సంఘర్షణమునకు మనము సన్నద్ధుల మగుచుంటిమి. ఆసంఘర్షణము అటుపిమ్మట నేడు శీఘ్రముగనే తటస్థించినది. ఆసమరమునందు మనము విజయులము కాకపోయినను యుద్ధ గౌరవములన్నియు మనకే లభించినవి. భావిసమరమున విజయమునుగూడ మనకు నిశ్చయముగ వాగ్దానముచేయబడినది. మహాకాళీ స్వరూపిణియగు భారతమాత క్షణకాలము జాగ్రదవస్థకువచ్చినంతమాత్రముననే బ్రిటిషు పరిపాలనా మూలాధారములు కంపితములైనవి. మరల వెంటనే దేశము నందు నిరుత్సాహమును, అలసదనమును వ్యాపించినవి. కాని అంతకంటెను అధికమగు ఉద్బోధన మరల కలుగునట్లు సూచన లిపుడు స్పష్టముగ కన్పించుచున్నవి. భారతమాత సంపూర్ణముగ జాగ్రదవస్థకు వచ్చి ముందంజవేయ నారంభించినచో ఎవరు నిరోధింపగలరు? డయరుఒడయర్ల కఠినకార్యలవలన అసహాయోద్యమము తలయెత్తినది. ఇపుడు మరల ఆ నిరంకుశుల పద్ధతివంటి పద్ధతియే గోచరించుచున్నది కావున మరియొక గొప్పస్వాతంత్ర్యసమరమునకు మనము రణముఖంబున నిలువనున్నాము.



శ్రీ పండిత మోతీలాలు నెహ్రూగారు

వెనుకటి సమరమునందు మనలను నడిపించి హితకర మగు ఉపదేశముల నొసంగి సేనాముఖమున నిలువబడిన మన కత్యంత ప్రేమాస్పదులైన మహావీరులు పెక్కండ్రు మన దురదృష్టవశమున దివంగతులైరి. కనుక వారి సహాయము మన కిపుడు లభింపజాలదు. ఇట్టి విషమసమయమునందు ఒక్కవత్సరములోగా తనపుత్రులలో అత్యధికమగు మాతృభక్తిని, శత్రుభయంకరమగు శౌర్యమునుగల హకీం అజ్మలుఖాను, లాలా లజపతిరాయిగార్లను భారతమాత గోల్పోవుట తటస్థించినది. ఈ మహాసభకు అధ్యక్షత వహించిన నాయకులలో లాలాజీ హకీంజీగార్లు మాత్రమే గాక సింహప్రభువుగారు కూడ పరమపదించిరి. జాతీయసమరమున విఖ్యాతముగా పోరుసల్పిన యోధులలో దివంగతులైనవారిలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గోపబంధుదాసు, మగనలాలు గాంధిగార్లు ముఖ్యముగా పేర్కొనదగియున్నారు. ఈ మహాసభవారి పక్షమున యీదేశభక్తుల కుటుంబముల వారి కందరికిని నేను సగౌరవ మగు సానుభూతి నందిజేయుచున్నాను.

ఇకను నేను మనము ప్రస్తుతము చేయదగిన పనులనుగూర్చి నా యభిప్రాయమును దెల్పెదను.

మీ కాశాభంగము కలుగకుండుటకై తొలుదొల్త నేను మీకొక్క విషయము తెలుపగోరుచున్నాను. నేనొసంగనున్న యుపన్యాసము నందు ఆదర్శప్రాయమగు ప్రపంచమును గూర్చిగాక ప్రస్తుత ప్రపంచ స్థితినిగూర్చిమాత్రమే నేను నుడువబోవుచున్నాను. నేను చెప్పదలచినదానిని దాపరికము లేకుండ చెప్పునట్టి స్వభావము కలవాడను. నాయుపన్యాసమునందు సామాన్యవిషయములే యుండునుగాని విశేషవిషయము లేమియు నుండవని మీరు గ్రహింపవలెను. మహోన్నత భావకల్పనలను ఆకర్షకములగు పదజాలముతో నేను నుడివెదనని మీరు ఆశించితిరేని మీకు తప్పక ఆశాభంగము కలుగును. విశాలార్థమునందు భావకల్పనను నేను నిరసించువాడను కాను. దేశీయులు మహోన్నతాశయముల ననుసరించి ప్రవర్తించుటకు ప్రయత్నింపగోరుదురేని మహోన్నతాశయములను దృక్పథమున నిడుకొనుట ముఖ్యతమమని నమ్ముటచే నేను మరెవ్వరికిని తీసిపోను. కాని, ప్రస్తుతనిజస్థితితో కొంచెమైన సంబంధము లేనట్టి కేవలమగు భావరచనకు రాజకీయములందు తావు లేదు. ఇపుడో మఱియొకపుడో నిద్రాభంగము కల్గుటవలన అపారమగు ఆశాభంగము కలిగించునట్టి సుఖస్వప్నమునకును, కేవల భావరచనకును ఎట్టి భేదమును లేదు. ఆశయము ఎంత ఉన్నతముగానుండిన నంత మంచిది. ఎంతటి మహోన్నతాశయమును మన మేర్పరచుకొనినను, దానిని బడయుటకు మనము జేయు ప్రయత్నముమాత్రము ప్రస్తుతోపయోగమునకు అనుగుణముగానే యుండవలెను. ప్రస్తుతావసరములను బట్టియే మన కార్యవిధానమును మనము నిర్ణయించుకొనవలెను. మన యాశయమునకు మనలో కొందరు వేరువేరు పేర్లను పెట్టుచుండినను ఆశయమునుగూర్చి మాత్రము మనలో నెవరికిని భిన్నాభిప్రాయములు లేవనియే మనము రూఢిగా చెప్పగలము. దానిని బడయుటకు మనకు గల మార్గమెక్కటియే అను విషయమునను, ఆ మార్గస్వరూప నిర్ణయ విషయమునను గూడ నెట్టి భిన్నాభిప్రాయములునుగూడ లేవు. కాని ఎట్టి ప్రాముఖ్యత లేనివని నేను భావించుచున్న కొన్ని అల్పవిషయములనుగూర్చి మనకు కలిగిన అభిప్రాయభేదమును కొండంతలు చేయుటవలననే యథార్థస్వరూపమును మనము చూడజాలకున్నామనియే నేను చాల చింతిల్లుచున్నాను. మన ప్రయత్నములు ఫలింపకుండుటకు ఈ అభిప్రాయభేదములే కారణములై యున్నవి. దేశీయులందరు ఏకీభవించి పనిచేయుట కభ్యంతరములుగనున్న మన దేశమునందలి భిన్నపక్షములకు గూడ ఈ భిన్నాభిప్రాయములే ముఖ్యకారణములై యున్నవి. ప్రస్తుత రాజకీయస్థితియొక్క వైఖరులలో వేర్వేరుపక్షములవారు కొన్నిటికి అనవసరమగు ప్రాముఖ్యత నిచ్చుటవలనను, మరికొన్నిటికి సహజముగాగల ప్రాముఖ్యతను తగ్గించుటవలనను యీ వివాదము లన్నియు కల్గుచున్నవని నాబుద్ధికి తోచుచున్నది. ఒక పక్షమువారు మనకుగల లోపములను మిక్కిలి పెద్దగాజేసి, మనల నిపుడు పీడించుచు మనదేశమును కొల్లగొట్టుచున్న విదేశీయుల కటాక్షమును, అనుగ్రహమును లేకున్నచో మనమేకార్యమును నెరవేర్చజాలమని నిరుత్సాహపడుచున్నారు. మరియొకపక్షమువారు మనలోపములను, ప్రతిపక్షుల దార్ఢ్యములనుగూడ లెక్కసేయక దారితెన్నులు నిర్ణయింపబడిన మహాసముద్రమధ్యమున తెరచాపలను పూర్తిగా విప్పి నౌకను నడుపగోరుచున్నారు. ప్రస్తుతపరిస్థితులను దాపరికము లేకుండ సరిగా మీకు విన్నవించి అందులకు చేయవలసిన కర్తవ్యమని నాకు తోచినదానిని మీ కెరిగించుటకు యథాశక్తిని నేను ప్రయత్నింపదలచియున్నాను. తన దేశము నివాసయోగ్యముగా నుండునట్లు చేయుటకు శక్తివంచన లేక పనిచేయుటయును, పనిచేయువారికి తోడ్పడుటయును వివేకముగల మానవులందరికిని ముఖ్యకర్తవ్యమనియే నేను తలంచెదను. దేశస్థితిలో ఇపుడు కనబడుచున్న అనర్థకములను తొలగించి లాభకరమగు స్థితిని కలిగించుటకు జరుగవలసిన పని స్థితిగతులను బట్టి యుండును. ఆ పరిస్థితులు అన్ని దేశములందును, అన్నికాలములందును ఒక్కరీతిగనే యుండవు. ఆదర్శప్రాయములగు ముఖ్యవిషయములలో భేదముండదుగాని ఒక్కొక దేశములో ఒకవిధమగు ప్రత్యేకస్థితి యేర్పడుచుండును. అట్టివానివిషయమున ఒక సమానధర్మమునుగాని, ఇతరు లవలంబించిన పద్ధతులనుగాని అప్రత్యేకదేశీయు లనుసరించుటకు వీలుండదు. ప్రపంచమునందు ఒకే కేంద్రమునుండి ప్రారంభించి ఒక్కపద్ధతినే అనుసరించిన దేశములు ఒకటికంటె హెచ్చుగా ఎచ్చటను గనుపింపవు. ఒక దేశమువారే ఒకసారి అవలంబించిన పద్ధతిని మరియొకసారి మార్చుకొనవలసిన యవసరముగూడ గలుగుచుండును. ఏలనన పరిస్థితు లెల్లపుడు మారుచునే యుండును. కావున పరిస్థితులనుబట్టి మనవిధానమునుగూడ మార్చుకొనవలసియే యుండును. ఇతరులు ఒకపద్ధతి ననుసరించి కార్యసాఫల్యము బడయజాలకపోయినచో మనము దానిని గ్రహించి ఆపద్ధతిని అవలంబింపకుండుటకు మనకు వీలగునుగాని మరియొక దేశమువారు మరియొకపద్ధతి నవలంబించి కార్యసిద్ధిని బడసిరనుకారణమున ఆపద్ధతినే మనముగూడ అనుసరించినచో వారివలెనే మనకుగూడ కార్యసిద్ధిగలుగుననుట కెట్టినమ్మకమును లేదు. దీనికి కారణము విదితముగుచునేయున్నది. మన దేశస్థితిలో సమానస్థితిగల ఇంకొక దేశమువారు చేసినతప్పలను మనము చేయకుండ జాగ్రతపడవచ్చునుగాని మరియొక దేశమున ఒకపద్ధతివలన కార్యసిద్ధి కలిగినపుడు అందులకు ముఖ్యాధారములగు విషయము లన్నియు మనదేశమున లేకున్నయెడల వాని నన్నిటిని మనము కల్గించుట అసంభవము. కావున కార్యసిద్ధికై వా రనుసరించిన పద్ధతులనే మనముకూడ బడయుటకు వీలులేదు. ప్రస్తుతము మనదేశమునందున్న పరిస్థితులలో మనకు లభించియున్న సామగ్రులతో సాధ్యమైనంత తక్కువయగు వ్యయప్రయాసలతో మనము ఫలసిద్ధిని బడయుటెట్లు? అనునదియే యథార్థమగు ప్రస్తుత సమస్యయై యున్నది. ఇతర దేశములనుండి కృత్రిమోపమానములను కొనితెచ్చినచో మన సమస్యను మరింత విషమమొనరించుటయే యగును. మనము చేయ

వలసిన పనియొక్క యథార్థస్వరూపమును నిర్ణయించుటకు మూడు ప్రశ్నలకు మన ముత్తర మొసంగవలసియున్నాము.

(1) మన మెచట నున్నాము?

(2) మన గమ్యస్థానము?

(3) దానిని మన మెటుల చేరగల్గుదుము?

ఈ మూడుప్రశ్నలకును పాండిత్య విశేషమునుబట్టి గాక స్వానుభవమునుబట్టియే సర్వశక్తులను వినియోగించియే నేను సమాధాన మొసంగుటకే ప్రయత్నించెదను.

మనము విజయయాత్రను ప్రారంభించిన పిమ్మట మనస్థానము యొక్క ఆనవాళ్లను గుర్తింపజాలక కలవరము జెందునట్టి దుస్స్థితి కలుగకుండుటకు తొలుదొల్త మనప్రస్తుతస్థానమును గుర్తించుట కర్తవ్యమై యున్నది. ఈవిషయమునకు రెండుభాగములును గలవు. మొదటిది: ప్రభుత్వమునకు మనకు గలసంబంధము. రెండవది దేశీయులలో గల సంబంధము. ప్రభుత్వమునకును మనకును గల సంబంధమునుగూర్చి మన కిపుడు ఏదైన రాజకీయస్వాతంత్ర్యములుగాని, పౌరస్వాతంత్ర్యములుగాని యుండినచో అవి మనకు తాత్కాలికముగ నొసంగబడినవి మాత్రమేయనియు మనపై పాలకుల కనుగ్రహ మున్నంతకాలమే మన మవి యనుభవింపగలమనియు మన కందరకును బాగుగా తెలిసియే యున్నది. వానిని వారు చిత్తానుసారముగా రద్దుచేయవచ్చును. వారి చేతులలో నిరంకుశాధికారము అపారముగ నున్నది. వారికి బుద్ధిపుట్టినదే తడవుగా ఎట్టికారణమును చెప్పియు చెప్పకయే ఏసమయమందయినను వారు వానిని రద్దుచేయుట కెట్టి అభ్యంతరమైనను చేయగలరు. ఇదివరకు వారటుల పెక్కువేల జనుల స్వాతంత్ర్యములను రద్దుచేసియే యున్నారు. అనవరతమును మీరు వినుచుండిన ఈ వృత్తాంతములను చర్వితచర్వణముగ మరల నుడువగోరను. చట్టముల యొక్కయు కార్యనిర్వాహక పరిపాలక వర్గముల ఉత్తరువులను బట్టియు రాజకీయ ఆర్థికరంగములయందు దొరతనమువారెటుల తమ బలమును వృద్ధిచేసికొనినదియు మీకు తెలిసియేయున్నది. మన దేశమునందు బ్రిటిషు పరిపాలన ప్రారంభమైనది మొదలు నేటివరకును వారు మనదేశమందు విధించిన అసంఖ్యాక మగు కఠినశాసనములను నేను మరల నిచట నేకరువుపెట్టుటవలనను మనలను పూర్తిగా వికలాంగులను గావించిన పిమ్మట మరల మనము అంగసౌష్ఠవమును బడయుటకు వీలులేకుండుటకు వారెటుల ద్వారమును బంధించినదియును నే నిపుడు మీ కెరింగించుట వలనను ఎట్టి ప్రయోజనమును కలుగదు. ఆత్మస్వరూపమును గ్రహించుటకును, స్వీయ అభివృద్ధికిని, జీవితోద్దేశమును సార్థకము నొందించుటకును మన కెట్టి అవకాశమును కలుగకుండజేయుటకు వారు పట్టుదలను వహించియున్నారు. దేశబంధు చిత్తరంజన దాసుగారు యీ మూడింటికొరకే తమ జీవిత చరమదశయందు అత్యధిక ధైర్యస్థైర్యములతో పోరాడియున్నారు. మన దేశముయొక్క అంతరంగ, బహిరంగ విషయములను ఈషణ్మాత్రమైన మనము గ్రహించుటకు వీలులేకుండ ప్రభుత్వమువారు గట్టి నిరోధమును గల్గించియున్నారు.

## సైమను సంఘము

మనకు బాధ్యతాయుత ప్రభుత్వము నొసంగెదమని దైవ సాక్షిగా వాగ్దాన మొసంగినందులకు ఫలితముగా యిప్పు డేమి జరుగుచున్నది? అతి దారుణమగు మోసమే దాని ఫలితము. సైమను సంఘము మన దేశమునకువచ్చి మన పట్టణములయందలి రాజమార్గములలో రక్తసిక్తములగు తలలను శిథిలములగు శల్యములనువదలి మహా వేగముతో పరుగిడుచుండుటయే యీవాగ్దానముయొక్క ఫలితము. నిరంకుశోద్యోగుల నిర్దాక్షిణ్యమును, మనదేశీయుల కేవల అసహాయతను బాగుగా వెల్లడించుటకు సైమను సంఘమువారి సంచారము తోడ్పడినట్లు మరేదియునుగూడ తోడ్పడియుండలేదు. ఇదివరకు మనము బాగుగా గ్రహించిన ప్రభుత్వముయొక్క కార్యనిర్వహణ సామర్థ్యరాహిత్యము మాత్రమేగాక, అతిదారుణమగు అంటువ్యాధి సర్వాంగములకును వ్యాపించిన లక్షణములుగూడ యీ పరిస్థితులవలన నాకు పొడకట్టుచున్నది. వారి అంతరంగిక ఆర్థిక సమస్యయందు పయర్వేషము వ్యాపించినట్లు కన్పించుచున్నది. ఆ వ్యాధి లోపల బాగుగా వేరూనియుండెననియు, లాహోరునందును, లక్నోయందును గోచరించిన దౌర్జన్యములు ఆవ్యాధి స్వల్పముగా పైకుబుకుటకు మాత్రమే సూచనలనియు నాయభిప్రాయము. కలకత్తా నగరమున ఆంగ్లేయులచే ప్రకటింపబడుచున్న యొక వార్తాపత్రికయొక్క ప్రత్యేక వికేళిరి బుద్ధిమాంద్యమువలన సైమనుసంఘమువారి నిజమగు చిత్తవృత్తిని యీషణ్మాత్రముగా మనము గ్రహింపగల్గుట కవకాశ మేర్పడినది. దానిని బట్టి ప్రభుత్వమువారి చిత్తవృత్తిగూడ యిదియే యని నాయభిప్రాయము. డిల్లీ నగరమున జరిగిన దౌర్జన్యదృశ్యముల వలన మనోరంగమున ఏర్పడిన భావములకు కాన్పూరునందలి దృశ్యములవలన సంపూర్ణ స్థిరత్వమేర్పడినది. ఇట్టి దౌర్జన్యములు కలుగుట కవకాశములు కలిగించినందులకు సైమను సంఘమువారికి కలిగిన యాగ్రహమును సైమను సభ్యులలో కొందరు వెల్లడించుచునే యున్నారు. సైమను సంఘ సభ్యులలో కొంతమంది యీవారములో నిజమగు తమ యభిప్రాయమును వెల్లడించుచు నివేదికను వ్రాయుట కవకాశ మియ్యబడినచో, వెనుక ఒక సందర్భములో సాలిస్బరీ ప్రభువు విధించినట్లు

## ఇరువ దేండ్లపాటు కఠిన పరిపాలన జరుగుటయే మా యభిప్రాయము

గాని యొట్టిరాజకీయాభివృద్ధిని మే మాపాదింపజాలమనియే వీ రా నివేదికలో వ్రాసియుందురని నేను నమ్ముచున్నాను అని ఆ విలేఖరి వ్రాసెను. కావున, మనము మన దేశమునకు బాధ్యతాయుత ప్రభుత్వమును బడయగోరుదుమేని మన నిజాభిప్రాయమును మరుగుపరచుకొని పయిమనుసంఘమువారి పైన మనకెట్టి విశ్వాసమును లేకపోయినను వారియెడల సంపూర్ణవిశ్వాస మున్నట్లు నటించుచు, వారి నాశ్రయించుచు ముఖస్తుతులను చేయుట యొక్కటియే సాధనమని తోచుచున్నది. అటులగాక, మనకు నిజముగా వారి యందు కలిగిన అవిశ్వాసమునే మనము వెల్లడించుచుండు నెడల యీ విలేఖరి వ్రాసినట్లు ఇరువదేండ్లపాటు కఠిన పరిపాలనమే కర్తవ్యమని వారు తమ నివేదికలో తప్పక వ్రాయుట తటస్థించును. బాధ్యతాయుత ప్రభుత్వమును బహుమానమును వారివలన బడయుటకు వారి యడుగులకు మడుగులొత్తుటకు భారతదేశ మెన్నటికిని అంగీకరింపజాలదు. వారు కఠిన పరిపాలనమునే సూచించేయెడల దానికే సంసిద్ధమగునని మాత్రమే నేను చెప్పవలసియున్నది.

భావికాలమందు జరుగనున్న అతిదారుణములును బీభత్సములు నగు దృశ్యములు నా మనోనేత్రమున కిపుడు గోచరించుచున్నవి. అపుడు విడలిపోవుచున్న మనుష్యుల అడుగుల చప్పుడుగూడ నా మన శ్శ్రోత్రమునకు వినబడుచున్నది.

అని ప్రవచించుటగూడ శకునపక్షియగు యీ జ్యోతిష్కుడు సూచించెను.

సైమను సంఘమువారు కొన్నూరు వచ్చినపుడు బహిష్కరణ ప్రదర్శనములు, అత్యధికముగా జరుపబడిన కారణమున యితడిట్లు వ్రాయవలసిన యావశ్యకత కల్గినది. ఈ దుస్స్వప్నమును యీవిలేఖరి యొకవంక నిటుల పత్రికలకు వ్రాసియుండగా కొన్నూరునాయకులు కావించిన ప్రయత్నములు చాల ప్రశంసనీయములనియు ఎట్టి అల్లరులను జరుగకుండ వారు బహిష్కరణమును సాగించినందులకు తాసంతసయు కృతజ్ఞుడననియు కొన్నూరు పోలీసు సూపరింటెండెంటు కొన్నూరు నాయకులకు వ్రాసియుండెను. ఆ లేఖ పత్రికలలో ప్రకటింపబడెనని కూడ నే నమ్మెదను. ఈ విలేఖరి వ్రాసిన దుస్స్వప్న వార్తలు పత్రికలలో ప్రకటించుచు విలేఖరి పవిత్రంబై తనపదవి యున్నతమని సూచించుటకు గాబోలు పత్రికాసంపాదకుడు అత్యధికమగు దురాగ్రహమును వెల్లడించుచు కొన్నూరు నాయకులను నిరసించుచు సంపాదకీయవ్యాసమున తన విజ్ఞానాతిశయములను వెల్లడించెను. "బ్రిటిషు దొరతనమువారికి ఆయుధసంపద యెంతవరకు కొరత పడకయుండునో అంతవరకు భారతీయులకు స్వపరిపాలన మొసంగబడదని" గూడ సంపాదకుడు వ్రాసెను. ఈవిలేఖరికిగాని, యీసంపాదకునకుగాని లేశమైన ఉచితానుచితపరిజ్ఞానముండినచో ఉద్యోగములకు సంబంధించిన యీరహస్యమును వారు వెల్లడించియుండరనియే నాయభిప్రాయము. కాని సకాలమున వారు నిజస్థితి నిట్లు తెలియజేసినందులకు మనకృతజ్ఞతను మనము వారికి తెలియజేయుచు మనము సంసిద్ధులముగా నున్నామని తెలియ జేయుచున్నాను. ఇప్పటి పరిస్థితులలో ఫలితము శీఘ్రముగా తేలవలెననిన కఠిన పరిపాలనముకంటె యుక్తనుసాధన మరేదియు నుండదు.

## రాజప్రతినిధి ప్రసంగము

సైమను సంఘమును బహిష్కరించుటకు మన దేశీయులిట్లు ప్రదర్శనము గావించుటవలన తమకు చాల అసహ్యము గలుగుచున్నట్లుగా మన ఆంగ్లేయ మిత్రులు నటించుచుందురు. వారు కావించుచున్న అవివేకపు సంభాషణలను నేను లెక్కచేసియే యుండనుగాని యీ విషయమునుగూర్చి యీనగరమునందే యిటీవల రాజప్రతినిధియే బహిరంగముగా ముచ్చటించి యుండుటచే అవిమర్శకు నేను ప్రత్యుత్తర మొసంగుట ముఖ్యావసరమయినది.

బహిష్కరణ ప్రదర్శనముల సందర్భమున అల్లరులు జరుగుట సంతాపకరమే యైనను ప్రజలకు ప్రబలమైన ప్రాతికూల్యభావము జనించినపుడు శాంతియుతముగా నిట్టి ప్రదర్శనములను జరుపుటకు వారికి హక్కు కలదను విషయమును ఎవరును ఎన్నడును శంకించి యుండలేదు. రెండవసారి సైమను సంఘము మనదేశమునకు వచ్చిన పిమ్మట జరిగిన ప్రదర్శనములు అమర్యాదకరములు ఆగ్రహాకరములు నని వారనిరి. ఎవరినిగూర్చి ఇట్టి ప్రదర్శనములు ప్రజలు చేయుదురో వారి కిది ఆగ్రహాకరములుగా నుండుట సహజమే. ప్రతికూలభావముగల ప్రజాసమూహము వినమ్రతతో ప్రవర్తించుట ఎన్నటికిని సంభవింపదు. ఇట్టి ప్రదర్శనములను జరుపు నాయకులు యెంతగా నిరసించుచుండినను క్రియవచ్చినప్పుడు తమ యుపదేశముల వలన ఉద్రేకమును జెందియున్న ప్రజలను అదుపులోనుంచుటకు తరచుగా అశక్తులే యగుచుందురు. అదియును "ఇంత అపాయకరమును, యింత వివేక రహితమును, యింత మొరటుతనమును గల పద్ధతిని బుద్ధిపూర్వకముగా అవలంబించువారు వీనివలన ఎట్టి లాభములును కలుగునని పొరబాటుగా భావించుచుండినను అత్యధికమగు బాధ్యతలకు వీరు గురిగాక తప్పదు" అని రెండు ధర్మపన్నములను రాజప్రతినిధి ఏకరువు పెట్టెను. అంతటితో నూరకుండక "అపఖ్యాతికరములగు నిట్టి చర్యలు మరల జరుగకుండ అవసరమని తోచిన పద్ధతులను అవలంబించుట దొరతనమువారికి ముఖ్యకర్తవ్యమై యున్నది" అని యొక బెదరింపుమాటను గూడ రాజప్రతినిధి నుడివెను.

మొదటివాక్యమును గూర్చి నేను రాజప్రతినిధితో ఏకీభవించుట కెట్టి అభ్యంతరమును లేదు. రెండవ వాక్యమునందు, "ఇంత వివేక రహితమును, ఇంత మొరటుతనముగల" అను మాటలకు బదులుగా "ఇంత సహజముగ" అనుమాటలను రాజప్రతినిధి వాడుచో నపుడు రెండవ వాక్యమునుగూడ నేను ఆమోదించెదను. రాజప్రతినిధి చేసిన బెదరింపును గూర్చి అతఁడిట్లు చెప్పగలడని వారము రోజులకు పూర్వమే ఆంగ్లేయ వార్తాపత్రిక సూచించియుండెను. కఠిన పరిపాలనము త్వరలోనే ఏర్పడగలదనుటకు ఈ బెదరింపు సూచకమయియున్నది. దీనినిగూర్చి నాయభిప్రాయము నిదివరకే తెలియజేసియున్నాను గాన ఇపుడు క్రొత్తగా తెలుపవలసిన దేమియు లేదు. మొదటి రెండువాక్యములగూర్చి యీప్రదర్శనములలో జరిగిన దౌర్జన్యము లన్నియును పోలీసువారి వలననే ప్రారంభింపబడినవి. ఒకటి రెండుచోట్ల పోలీసువా రొనర్చిన దౌర్జన్యమునకు ప్రజలు ప్రతీకారము చేయబోగా నాయకులు వెంటనే వారించిరి. అను విషయము యథార్థమని బాధ్యతగల నాయకులు చేసిన ప్రకటనలవలన నాకు గట్టి నమ్మకము గల్గినది. ఎట్టి శాఖాసంబంధమగు విచారణయైనను గూడ నానమ్మకమును తొలగింపజాలదు అనియే నేను చెప్పవలసియున్నది. ఎచటనో యొకచోట యొక మోటారుకారులో యొక స్త్రీకూడ నుండగా యొకరాయి ఆబండిపై బడిన దనుకొనినను, వేలకొలది ప్రజలు గల జనసమూహములో ఎచటనో ఎవరో కొందరు సయిమను సంఘసభ్యుల మోటారుకారుకు మిక్కిలి దగ్గరగా నిలువబడి వారి మొగములపై బడునట్లు నల్లజెండాలను ఊగులాడించి రనుకొనినను, వీనిని గూర్చి పెద్ద రాద్ధాంతము చేయుట కివి తగిన విషయములగునా? ఆంగ్లదేశమునందే ప్రజలు తమ యసమ్మతిని వెల్లడించుట తటస్థించినచో ఇంతకంటె చాల దారుణములగు పనులే జరిగియుండెనని నేను చెప్పగలను. లాహోరు, లక్నో, కాన్పూరు, పట్టణములలో జరిగిన చర్యలనుగూర్చి సత్యాగ్రహము చెందినట్లు నటించుచున్నవారిని నే నైదుప్రశ్నలడుగగోరుచున్నాను.

1. ఐరోపాఖండమునందే దేశమునందైనను – ముఖ్యముగా ఆంగ్లదేశమునందు–ప్రజలు తమ కవమానకరమని తలచి నిరసించుచున్న యొకవిచారణసంఘమువారు ఇపుడు భారతదేశమున సర్ జాను సయిమనుగారును, వారి తోడిసభ్యులును సంచారము చేయగల్గుచున్నట్లు ఇంత నిరుపద్రవముగను ఇంత హాయిగను సంచారము చేయగల్గుదురా?

2. భారతీయులకు సయిమను సంఘమువారియందు కలిగినంతటి అసమ్మతి ఆంగ్లదేశమునందలి ప్రజలకు ఏసంఘము యెడలనైన కలిగినచో అట్టి సంఘసభ్యులను బహిరంగముగా బహిష్కరించుటకు ఆదేశమునందెవరైన ప్రయత్నించియున్నయెడల అట్లు గౌరవింపగోరువారు, బక్లరు పార్కులో పట్టుజెండాలకు బంగారు బుటేదారీ పనిగల తోరణములను అమర్చి వివిధ విచిత్రవర్ణములుగల విద్యుద్దీపములను వేలకొలది వెలిగించియున్నచో ప్రజలు ఆ దీపకళికల నన్నిటిని పగులగొట్టి ఆ పట్టుజెండాల నన్నింటిని చించివేసి, ఆ తోరణముల నన్నిటిని త్రెంపివేయకుండ యున్నకుందురా?

3. ఆంగ్లదేశమున ఒక కుటుంబమువారు తమ యింటికప్పుపై నిలువబడి శాంతముగా అయిష్టతను వెల్లడించినందులకు పోలీసువారు ఆ యింటితలుపులను పగులగొట్టి లోనజొరబడి ఆ యింటికివచ్చిన మిత్రులనుగూడ బాదగొట్టి వారి నందరిని ఆ రాత్రియంతయును కారాగృహమున బంధించియున్నచో ఏ ఆంగ్లేయుడైన సహించునా?

4. ప్రభుత్వమునకు ప్రతికూలమగు అభిప్రాయములను కలిగియున్నందులకు ఒక ఆంగ్లేయుని అతని యింటియందే అత్యల్పకాలమే బంధించియుండినచో అతడు మిన్నకుండునా?

5. మూడు నాలుగు ప్రశ్నలలో తెలుపబడిన దౌర్జన్యములు జరుగుటకు ఆంగ్లదేశమునందు ప్రభుత్వమువా రంగీకరించినచో ఆప్రభుత్వ మెంతకాలము నిలువగలదు?

అయోధ్యాపట్టణమునందు గొప్పజమీందారుడును జాతీయవాదియునగు మహమ్మదాబాదు మహారాజాగారి తోటలో దాస్యప్రవృత్తిగల మహమ్మదీయులు కొందరు, సయిమను సంఘమువారికి విందు చేయుచుండగా మహారాజావారి యింటిచుట్టును పోలీసువారిని కావలియుంచిన సంగతి మాకు తెలియక పోలేదు. సయిమను సంఘమును బహిష్కరింపవలెనని మహారాజాగారు నిర్భయముగా ప్రకటించియున్నారనియు ఆ సంఘమువారిని గౌరవించుటకు చేయబడిన ఏకార్యమునందును పాల్గొనుటకు ఆయన అంగీకరింపలేదనియు అందరకును తెలిసియేయున్నది. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ కార్యనిర్వాహక సంఘమునందు వెనుక హోంమెంబరుగా నుండినట్టియు, దొరతనమువారిచే ఎక్కువ బిరుదములను, గౌరవములను పొందినట్టియు, అయోధ్యజమీందారులలో అగ్రగణ్యుడైనట్టియు మహారాజుగారు సయిమను సంఘముపట్ల చూపిన ప్రతికూలభావము ప్రభుత్వమువారికి రుచింపనంతమాత్రమున ఆయన స్వగృహమునందే ఆయనను బందీకృతుని గావించినపుడు ఇక సామాన్య పౌరుల స్వాతంత్ర్యము మాట చెప్పవలసిన దేమున్నది? ముందెన్నడో ఏర్పడగలదని రాజప్రతినిధియును ఆంగ్లేయవార్తాపత్రికయును సూచించిన కఠినపరిపాలనమునకును దీనికిని భేద మేమైన నున్నదా? ఆకఠిన పరిపాలనము ఇపుడే ఏర్పడినది.

జాతీయశక్తులను నిర్మూలించుటకు అదివరకే కృతనిశ్చయులైన ప్రభుత్వ సంబంధులు నూతనములగు ఆయుధమును నిర్మించుటకు ఇటీవల లాహోరులో నెవరో యొక పోలీసు ఉద్యోగిని హత్యచేయుట వలన తగిన యవకాశ మిపుడే కలిగినది. ఈయుద్యోగిని హత్యచేసినందులకు మేము మిక్కిలి చింతిల్లుచున్నామని వేరుగా చెప్పనక్కర

లేదు. సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరువారైనను, అధినివేశ స్వాతంత్ర్యమును కోరువారైనను కాంగ్రెసువారందరును ఎల్లప్పుడును దౌర్జన్యరాహిత్యపద్ధతిని మిక్కిలి పట్టుదలతో అనుసరించుచున్నారు అనుటకు ఎట్టి సంశయమును లేదు. ఇది యథార్థమనుటకు వారు పెక్కుసార్లు పెక్కునిదర్శనములను చూపించియే యున్నారు. మరల నిటీవల లాహోరు, లక్నో, పాట్నానగరములందుకూడ దౌర్జన్యముపట్ల వారికి గల నిరసనము వీరు బాగుగా వెల్లడించియే యున్నారు. లాహోరు హత్య రాజకీయ సంబంధమయినదో కాదో చెప్పుటకిపుడెట్టి అవకాశమును లేదు. అది రాజకీయమే అని అంగీకరించినను ఇట్టి దౌర్జన్యములకు నిజమయిన బాధ్యత దొరతనమువారి మీదనే యున్నదను విషయమును గమనింపకుండుటకు మేము మాకన్నులకు గంతలు కట్టుకొనజాలము. ఇట్టి దౌర్జన్యములు కలుగుటకు కారణమయిన పరిస్థితులు, ప్రభుత్వపద్ధతి పూర్తిగా మారవలెనుగాని ప్రభుత్వమువారు కఠినశాసనములను ప్రయోగించుటవలన లాభముండదు. అట్టి కఠినచర్యలను ప్రతిఘటించుటకు ప్రజలు సర్వశక్తులను వినియోగించెదరు. ప్రభుత్వోద్దేశములను భంగపరచుటకే యిట్టి చర్యలు సాధనములగును అని చరిత్రవలన మనము తెలిసికొనగలుగుచున్నాము.

కాని, ఇట్టి చారిత్రకవిషయములు నిరంకుశోద్యోగుల తలకెక్కవు. కఠినశాసనప్రయోగము పంజాబులో ఇదివరకే ప్రారంభమైనది. త్వరలోనే యితరరాష్ట్రములకుగూడ వ్యాపింపగలదు.

సైమను సంఘమునుగురించి యింతసేపు మాట్లాడినందులకు మీరు నన్ను క్షమింప గోరెదను. మనము చేయబోవు ముందు పనికిని, యీ సంఘమునకును ముఖ్యసంబంధ ముండుట బట్టియే నేను ఇంతసేపు ముచ్చటింపవలసి వచ్చినది. కాని లేనిచో యీ సంగతి నేను ముచ్చటించియే యుండను. ఈ సంఘము మహానర్థకరమనుట నిశ్చయమే గాని యెట్టి అనర్థకమునందైనను కొంతలాభముండుట సహజము గాన అట్టి లాభము దీనివలనగూడ కలుగక మానదు. మన దేశీయులకు గల శ్రేష్ఠమగు ధైర్యము ముఖ్యముగ మన విద్యార్థుల మనోబలము అత్యధికమగు నాగ్రహకారణము కలిగినపుడుగూడ శాంతము వీడకుండుటకు వారికిగల మనోబలము పోలీసువారు వారిని క్రూరముగ బడితలతో బాదుచుండ చేతులను రొమ్ముల గీలించి శాంతముగ నిలువబడుటకు వారికి గల సహనశక్తి, తమకు దెబ్బలు తగులుచున్నను లెక్కచేయక తమనాయకులను, తనతోడి దేశారాధకులను కాపాడుటలో వారు చూపించిన స్వార్థవిరహితమగు స్వార్థము మున్నగునవి యీ సైమను సంఘసంచారమువలన బాగుగా విదితమైనవి. ఈరీతిగా మన దేశీయులు నిరుపమానమగు దౌర్జన్యరాహిత్యభావమును వెల్లడించుట అంతయును పిరికితనమువల్లనే యని నిరంకుశోద్యోగులు భావించెదరని వారుద్దేశించినట్లు కఠిన పరిపాలనమును సాగింపనిండు. అపుడు త్వరలోనే వారు నిజస్థితి గ్రహింపగలవారగుదురు. నిరపరాధులును ధీరులును నగు ప్రజలను గోడలకు చేర్చి నిలువబెట్టి రొమ్ములపై బట్టలను తొలగించి తుపాకిగుండ్లను వదలి కాల్చివేయగల సంతృప్తి వారికి లభింపగలదు.

## మన ఆర్థికస్థితి

ఇక మనము మన ఆర్థికస్థితినిగూర్చి యోచింతము. మన దేశమునందు నిరంతరాయముగ జరుగుచున్న ధనాపహరణమును సరిగా గుర్తించుటకును నష్టములవల్లను ఇతరవిధములను ఆంగ్లదేశమువారు మన దేశమునందు ఆర్థిక విషయములలో బడసిన అత్యధికమగు జనవశీకరణశక్తిని సరిగా గ్రహింపవలెనని బ్రిటిష్‌వారు మనదేశమున అడుగుపెట్టినది మొదలు నేటివరకును జరిగిన విషయముల నన్నిటిని సింహావలోకనము చేయవలసి యుండును. ఈ విషయములు నిజమగునా కాదాయని ఎవ్వరును సంశయించుటకు వీలులేనట్టి చారిత్రక విషయములను నేనిపుడు తెలుపగోరెదను. తాము మన మేలును గోరునట్టి ధర్మకర్తలమని చెప్పుకొనునట్టి బ్రిటిష్‌వారు ప్రపంచమందు అత్యధికమైన జయమునకు కారణముగుచున్న సివిలు మిలిటరీ యుద్యోగి బృందమును ఏర్పరచుటయే గాక ఆంగ్లదేశమునందు తయారు చేయబడిన వస్తువులను విక్రయించుటకు మనదేశమున అవకాశమును కలిగించుటయందే ముఖ్యముగా శ్రద్ధబూనియున్నారు.

అనేకములగు ప్రత్యక్ష పరోక్ష విధానములచే నీ యుత్తమార్థము సాధింపబడినది. ఈయుపన్యాససందర్భమున అసంఖ్యాకములగు నావిధానముల నన్నిటిని గూర్చి తృప్తికరముగ వివరింపసాధ్యము గాదు. ఢక్కా కళాకుశలులపై సలిపిన ప్రసిద్ధములగు క్రూరచ్ఛేదముల కాలము మొదలుకొని, క్రమముగ నవీనములగు కొల్లగొట్టు విధానముల నవలంబించుచు వచ్చి తుదకు దేశీయవాణిజ్యపరిశ్రమల నెల్ల హతమొనరించి కుక్షినింపుకొనుచున్న శక్తిమంతములగు బ్యాంకులు, వాణిజ్య, పరిశ్రమాది సంఘము లేర్పడిన నేటివరకును నిది యంతయు నొక దీర్ఘమగు కథయై యున్నది.

కాని శాసనములద్వారాను, తదితరముగను నీదేశముపై ప్రభుత్వమార్థికస్వాధీనత నేర్పరచుకొనినది అత్యధికముగ కరెన్సీ పద్ధతిద్వారానే మిక్కిలి సాంకేతికమగు నీ సమస్యయొక్క చరిత్రనుగూర్చి నిపుడు వివరింపబూనుట చాలా విసుగుదలగా నుండును. కాని ప్రస్తుతము భారతీయ వాణిజ్యపరిశ్రమలయందున్న క్షీణదశయున్ను, వ్యవసాయదారుని అల్పమగు కొనుగోలు శక్తియున్ను; రూప్యమునకు ఒకషిల్లింగు ఆరు పెన్నులకు హెచ్చించిన ప్రభుత్వమువారి చర్యవలననే ఏర్పడినవి. ఇందువలన ఈ వరకే అధికమగు పన్నుల భారమున క్రుంగియున్న వ్యవసాయదారులు పైవారిచే తయారు జేయబడు ముడిపదార్థముల నుండి నూటికి 12½వంతు లాగుకొనుటయు, భారతదేశమునకు తన సరకుల నంపెడు విదేశీయవర్తకులకు నూటికి 12½ వంతున

...నను నొసగుటయు ఏర్పడినది. ప్రభుత్వమువారికి భారత ప్రజాక్షేమ మేమాత్రమైనను దృష్టిసమందుండినచో భూమిసిస్తును నూటికి 12½ సెంతులు తగ్గించి దిగుమతియగు సరకులపై 12½ సెంతు సుంకమును విధించియుండెడివారే.

## సర్ గాడ్ ఫ్రేగారి అభూతకల్పనలు

బ్రిటిషువా రీదేశమున కడుగిడుటకు పూర్వము భారతదేశ వర్తకవ్యాపారాభివృద్ధినిగూర్చిన సప్రమాణము లగు వ్రాతలన్నియును కేవలము పుక్కిటిపురాణము లని నేటికిగాను కనుగొనిన ప్రప్రథమములు. బెంగాలు వాణిజ్యసంఘమునకు చెందిన సర్ జార్జిగాడ్ ఫ్రేగారు సంయుక్త వాణిజ్యసంఘ యాజమాన్యమున జరిగిన కడపటి సమావేశమందు వారు గావించిన ప్రసంగములో భారతీయులకు జెందిన ప్రతివిషయమును ఆక్షేపించుచు కల్పిత విషయమును సత్యముగ నుపయోగించుచు బ్రిటిషువారు భారతదేశమును కొల్లగొట్టు విధానమును వారు సమర్థించిరి. "లాంకషైరు భారతదేశమును క్షీణదశకు గొనివచ్చెనని నిందింపబడుచో, ఇంగ్లీషుదేశమందలి గ్రామప్రదేశములనుగూడ లాంకషైరు క్షీణదశకు దెచ్చెను" అని వారు వ్రాక్రుచ్చిరి. ఆహా! ఎట్టి యుపమానము? పాశ్చాత్యుల సాక్ష్యములవలననే రుజువుజేయబడినట్లు ఉన్నట్టు యుండెడియూ కంపెనీవారిచే భారతీయ నేతపనివారలపై విధింపబడిన శిక్షలు అపరాధములకు ఇంగ్లీషు గ్రామప్రదేశములవారు లోనైయుండిరనియు స్వయముగ నింట నేసుకొనిన వస్త్రములకు బదులు లాంకషైరు గుడ్డలను కొనుటకు ఇంగ్లీషు గ్రామవాసులు నిర్బంధింపబడిరనియు విదేశీయ సరకు లన్నియు సుంకము లేకుండగనే దిగుమతి జేయబడుచుండ లాంకషైరు నేతపరిశ్రమవారిచే ప్రత్తి ఎక్సైజుపన్ను విధింపబడెననెడి నూతన విషయములను స్థాపించు చరిత్ర గాడ్ ఫ్రేగారికి తప్ప మిగత ప్రపంచమున కింతవరకును తెలియనట్టి ఇంగ్లండుదేశచరిత్రయొకటి సర్ జార్జిగాడ్ ఫ్రేగారి చేజిక్కి యుండవచ్చును.

నావిక వ్యాపారములను గూర్చి వారు గావించిన సూచనలు నేతపరిశ్రమను గూర్చి నుడివినట్టులే కల్పిత విషయాసక్తిని తెల్లము చేయుచున్నవి. ఈ విషయమయి యథార్థము తెలిసికొన గోరిన నిగపాయమును, సముద్రానుకూలమునగు బిల్లునుగూర్చి హాజీగారు ప్రచురించియున్న ఉత్తమ విషయమును మీరందరును గాడుఫ్రేగారును గ్రహింపవలెను. హిందూదేశపు మహత్తర గృహపరిశ్రమ ఎటులో అటులే భారతదేశ నావిక పరిశ్రమయున్ను ఆంగ్లేయుల లాభముసకై బహిరంగముగ అంత మొందింపబడెను. భారతీయ నావిక పరిశ్రమకు ఆంగ్లేయ సర్వాధికారులచే గావింపబడిన అకృత్యమును, తీవ్రాపకారమును ఇప్పటికే అలస్యమయిపోయినను, కొంతవరకయినను ఆపుటకుగాను శాసనసభయందు ప్రవేశపెట్టిన బిల్లునుగాంచి, జాతి వివక్షత గావించుచున్నా మని మనల నిందించుచు, ఆ బిల్లును తీర్మానించుటకు శాసనసభకు అధికారము లేదని సర్వాధికారబృందము పెనగులాడుచున్నది.

చరిత్రను తల్లక్రిందులు జేయుటతో తృప్తిజెందక, నీ యాంగ్ల వర్తక సార్వభౌముడు ప్రస్తుతము దేశమందున్న స్వరాజ్య రాజ్యాంగ విధానమును తయారుచేసినవారలు బ్రిటిషువారికి ఓటు హక్కులు లేకుండ చేయ ప్రయత్నించిరను అపవాదును మోపిరి. సందేహించుటకేమియు గాదని కమిటీవారు తెలిసికొనిన వెనువెంటనే సర్ గాడ్ ఫ్రేగారు తమ యపూర్వగ్రంథోపన్యాస ప్రదర్శనమును గావింపక పూర్వమే కమిటీవారు తమ యనుబంధనివేదికయందా సంశయమును తొలగించియుండిరని గాడ్ ఫ్రేగారు తెలిసికొని యుండవలసినది.

నేను పైన దెలిపిన విషయములనుబట్టి మనలను శాశ్వత దాని సత్వమందు ముంచుంగజేయుటకై నూతన శృంఖలముల నిర్మించు నీవిధానము మన భౌతిక సంపదల కొల్లగొట్టు సంకుచితమును దీర్ఘమునగు పద్ధతులతోపాటు పూర్వమునుండియు వచ్చుచునే యున్నది. మనము ప్రస్తుతస్థితి కరుదెంచుటకు ప్రభుత్వమువారు చాలభాగము బాధ్యులై యున్నను మనమును ఇందులకు బాధ్యులము గామని మనఃపూర్వకముగ చెప్పజాలము. ఏజాతియొక్క శక్తిగాని, బలహీనతగాని ఆజాతియందలి అంతర్భాగములలో గల అనుకూల్యతపైనను సన్నిహిత సంబంధముపైనను ఆధారపడి యుండును.

మన విషయములో కొన్ని శతాబ్దములుగ నీయానుకూల్యము సుస్థిరమై యుండలేదు. నవీనపరిస్థితులక్రింద అదివర కేమైన నున్న నో అట్టి స్థిరశక్తి యావంతయుగూడ సడలిపోయినది. మన మందరము పెద్దవియు, చిన్నవియునగు దాదాపు కట్టుబాటు లేని, నానాసంఘములుగ విభజింపబడినారము. జనసామాన్యమునందు వ్యాపించియున్న అజ్ఞాన, దారిద్ర్యములకు నిస్సంశయముగ ప్రభుత్వమువారే బాధ్యులై యున్నారు. ఉన్నత తరగతులందు నానాటికి పెరిగిపోవుచున్న అసూయకును వారే బాధ్యులుకాని, మనతో నన్నివిధముల సమానులగు లక్షలకొలది కొందరు ప్రజలను అస్పృశ్యులుగను, అంత్యజాతులుగను వెనుకకు నెట్టినట్టియు, అనేకము లగు సహజహక్కులను గోల్పోవజేయుటయే గాక, జాతీయసేవ యొనరించుటకును గూడ మన స్త్రీలను అర్హురాండ్రుగ గావించిన మనసాంఘిక విధానదౌష్ట్యమునకు మాత్రము ప్రభుత్వమువారిని నిందింపజాలము. మనజీవితకాలమునందే ఇటీవల జరిగిన చరిత్రకు కళంకయుత మగు అన్యాయమును సమకూర్చిన సాంఘికవిభేదములకు గూడ ప్రభుత్వమువారే సంపూర్ణముగ బాధ్యులు గారు.

### “ప్రజాజీవితము - మతము”

అఖిలపక్ష సమావేశపు సంఘమువారు తమ నివేదికయందు భారతదేశములోని సాంఘిక సమస్యను గూర్చి సమగ్రముగ విమర్శించి

యుండిరి. వారు సూచించిన పరిష్కారవిధానము నీ కాంగ్రెసువారు ఆమోదింతు రని నమ్ముచున్నాను. సాంఘికవిభేదములను సమయజేసి కొనుటకంటెను మనయెదుట నుండు సమస్య మిగుల ప్రధానమును, విశాలమునైనది. అ దేదన? ప్రస్తుతము అనుసరింపబడుచు, మత మను పేర వ్యవహరింపబడుచున్నట్టిది. మన ప్రజాహితజీవితమం దుండవల సినచో నేస్థానము నాక్రమింపవలెను?

మతముయొక్క ఉత్కృష్టోన్నతాదర్శ మెట్టిదైయైనను, నేటి మన నిత్యజీవితమందు మాత్ర మయ్యది మూఢవిశ్వాసము, ఉన్మాదము, అసహనము, హ్రస్వదృష్టి, కుటిలవర్తనము, స్వార్థపరత్వము, వేయేల? సుసంఘనిర్మాణమున కావశ్యకము లగు సుగుణములకు విరుద్ధము లగు గుణముల ప్రోవుగ పరిగణింపబడుచున్న దనుట సత్యదూరము గాదు. మతముయొక్క ముఖ్యతాత్పర్యము ఆ మతమునకు చెందనివారిని ద్వేషించుటగ మారినది. పవిత్రమగు మతముపేరిట తదితర సామాన్య కారణములకంటెను అధిక మగు అకార్యములు గావింపబడుచున్నవి. హిందూమహమ్మదీయులమధ్యను, లేక ఒకసంఘము వేరొకసంఘము మధ్యను జనించు అల్పములును, హాస్యాస్పదములు నగు విభేదకారణముల నాలోచించి, ఏ మాత్రము జ్ఞానముగలవాడైనను వానికి లోబడె ననిన, ఆశ్చర్యము జెందని అజ్ఞు డుండునా?

సర్వవిద్యలయొక్కయు, అభివృద్ధియొక్కయు ఉద్దేశము మానవునియం దుండు సైజగుణసముదాయమును పెంపొందించుటయు, తన పొరుగింటివానితో పొత్తుగలిసి యుండుమని బోధించుటయు, సంఘ మంతటియొక్క క్షేమముపైననే స్వాభివృద్ధికూడ నాధారపడి యుండు నని గ్రహింపజేయుటయునై యున్నది. ఆ విధముగనే మానవుని స్వార్థ, వ్యక్తిగత సైజగుణములు నిరోధింపబడి, మానవశక్తి పరస్పరసంఘర్షణము నుండి అశేషజన సౌభాగ్యమునకై సహకారము నకు మరల్పబడును. ఒకప్పు డెట్లున్నను ప్రస్తుతమనుసరింపబడు మతము మాత్రము స్వలాభపరాయణత్వమునకు ప్రధాన సాధనమై యున్నది. మనుజునకు, మనుజునకు మధ్య కృత్రిమకుడ్యముల నిర్మించి, నిర్మలమును అన్యోన్యానుకూలము నగు జాతీయజీవితాభివృద్ధికి భంగమును కలుగజేయుటకు మతము హేతువగుచున్నది. సాంఘికవిషయములపై ప్రతికూలశక్తుల నిట్లు విజృంభింప జేయుటతో తనివిజెందక, మతము రాజకీయార్థికములపై దండయాత్ర సలిపి మనజీవితమందలి వివిధదశలకును వర్తించి యున్నది. మతమును రాజకీయములతో జోడించుటవలన రెంటికిని చేటు చేకూరినది. మతము హీనదశకు గొనిరాబడినది. రాజకీయములు మాలిన్యపంకమున ముంచబడినవి. మతమును రాజకీయములనుండి సంపూర్ణముగ విడదీయుటయే ఏకైకతరణోపాయము.

అంతమాత్రముతో ముగియదు. అతిశైశవస్థితినుండియు, మన రాజకీయ ప్రయత్నముల నొక యాశ్చర్యకరమగు సంహారక విధానము వెంటాడుచున్నది. హృదయపూర్వకముగ మనదేశమును పారతంత్ర్యస్థితినుండి తప్పించుటకై దేశభక్త్యుత్సాహములతో కార్యమునకు గడంగినవారలయందు తీవ్రములగు విభేదము లుండక తప్పుటలేదు. ఈ విభేదములే అభివృద్ధిని వెనుకకు నెట్టి, అనర్థదాయకములగు శక్తుల నాహ్వానించుచున్నవి. దాదాపు అభివృద్ధికరమగు ప్రయత్నము గావించినప్పుడెల్లను నాయకులందు జనించిన తీవ్రభేదములు అత్యద్భుత, విద్యుల్లతాగమనముతో అనుయాయులకెల్ల వ్యాపించినవి. అందుచే మన పూర్వానుభవము వలన నీతిని నేర్చుకొని బాగుపడుట యుక్తము. లేనిచో గత 20 సంవత్సరములనుండియు మనలను వెంటాడుచున్న దుర్విధియే మరల మనల ననుసరింపగలదు. సాంఘిక సమత్వ మను ఉద్యమరూపమున (సోషలిజము) అపుడే యీదుర్విధి మనయడుగుల నంటివచ్చుచున్నది; ఇంకను దానిని దరిజేరనిచ్చినచో సంపూర్ణస్వాతంత్ర్యమును, అధినివేశప్రతిపత్తిని రెంటిని కబళింపగలదు.

“ రెండువిధము లగు ననర్థహేతువులు ”

నేను పైన సంగ్రహముగ వివరించిన విషయమువలన ప్రస్తుతము మనము దట్టమగు అరణ్యమధ్యమున నిలిచియున్న టుల తెలియగలదు. విదేశీయ పరిపాలనవలన మనపై విధింపబడినట్టియు, మనమే చేజేత కల్పించుకొనినట్టియు రెండువిధము లగు ననర్థములక్రింద క్రుంగిపోవుచున్నారము. విదేశీయుల నెదుర్కొనుటకు ఐకమత్యము లేకుండిన కార్యమును సాధింపజాలము. విదేశీయులు మన సమక్షమందే యుండి, మనపై నెక్కి స్వారీజేయుచున్నంతదనుక ఐకమత్యముతో వారిని నిరోధించుటయు సులభసాధ్యము గాదు.

ఈ యుభయానర్థక హేతువులు జతజేరి మనచుట్టును వలయముగ నేర్పడియున్నవి. మనము వలయము మధ్యనున్నారము. ఒకదానినుండి విముక్తిబడయగోరి మరొకదానిచే తగుల్కొనుచున్నారము. ఈ దుర్గమారణ్యమును దాటి బయటపడుటకు ముందుగ నీవలయమును భేదించుకొని పోవలసియున్నది.

మన మేస్థితి యందున్నామను ప్రశ్నకు నా సమాధాన మిదియే.

మన గమ్యస్థాన మేమి?

నా రెండవ ప్రశ్న ఏమనగా మన గమ్యస్థాన మెయ్యది? అందులకు సులభమును, నిర్వక్రమునగు నాసమాధాన మేమనగా మీరద్దానికి ఏమి పేరిడినను స్వరూపమందేకాక, స్వభావమందును (నిజమైన) స్వాతంత్ర్యమే. మదరాసు కాంగ్రెసు ఆదర్శము సంపూర్ణస్వాతంత్ర్యముగ ప్రకటించి యుండెను.

లోకమున నున్నత పదవి—జీవశక్తి—కార్యసిద్ధి—మహత్వము—.
మర్యాద—గౌరవము—పూజ్యత—ఆధిక్యత—మొదలగునవి లభిం
చునట్టి యపూర్వ రహస్యములను తెలిసి యనుష్ఠింప గోరునెడల—

లోకోపకారముకొరకు
స్వామి ప్రేమానందగారు వ్రాసిన **వశీకరణతంత్రము**

అను అత్యద్భుత గ్రంథమును తక్షణమే వెలకుతీసి చదివి లాభము పొందుడు. ఇందు కోరినపిల్లను పెండ్లియాడుట, మనసులేనిపెండ్లి మంగళ మగుట, ప్రేమాభివృద్ధి, పెండ్లికిముందు పెండ్లికూతురి ప్రేమను సంపాదించుట, స్త్రీల వశ్యముచేయుట, స్త్రీసమాజమున గౌరవము పొందుట, వియోగదంపతులైక్యమగుట, భార్యప్రేమను భర్తపొందుట, స్త్రీభర్తను వశీకరించుట, మగని చెడునడకను దిద్దుట. కావలసిన సంతతిని కనుట; అధికారిదయను సంపాదించుట, అసాధ్యములైన వ్యాధుల నివర్తించుట, దయ్యములుతోలుట, శూన్యములు తీవ్వుట, ఉన్మాదము పోగొట్టుట, మానవ వశ్యము, జీవజంతువుల వశ్యము, ధనాకర్షణము, జనాకర్షణము, కళాకర్షణము, మోహనము, స్తంభనము, ఉచ్చాటనము, విద్వేషణము, మారణము, శాంతి మొదలగు ౧౦౦ ప్రయోగములు సులభమైన మాటలతో పద్ధతులతో లిఖింప బడినది. స్త్రీపురుషులకు—బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు—హిందూ మునల్మానులకు—క్రైస్తవులు సమస్తజాతి మతముల వారలకే గాక, బీదలు, ధనవంతులు, కార్మికులు యజమానులు, మతిమంతులు మతిహీనులు, భక్తికలవారు భక్తిలేనివారు అను విచక్షణలేక యెల్లరును తీసిచదివి యనుష్ఠింపతగిన తంత్రము లిందుకలవు. వెల రు. 3-౦-౦ మాత్రమే.

**M. S. Ramulu & Co.,**
PUBLISHERS & BOOK-SELLERS,
**Rayapuram, Madras.**

సహాయమునకు తగిన గ్రంథము!

**ముద్దులమర్మము**

సరసులకు తగిన రహస్యశాస్త్రము!!

గ్రంథకర్త్రి ప్రభావతీ కుమారి.

సంసారమును ఆనందమయముగ చేయుటకై యపేక్షించు భార్యాభర్తలు తక్షణమే యీగ్రంథమును కొని చదువుడు.

ముద్దులు! ముద్దులనగ దాని రుచి తెలియనివా రెవరు? దాని యింపైన యమృతమును గ్రోలనివా రెవరు? ముద్దులపుట్టుక ముద్దులవలన గలుగు లాభనష్టము, తపాలు-తంతి-టెలిఫోనుద్వారా ముద్దులుపంపుట, మొదలగు మర్మము లెన్నియో కలవు. ముద్దుల రాసి! ముద్దులధార!! ముద్దులమాల!!! ముద్దులమర్మము!!!! యౌవనదంపతులు సంతసముతో సుఖముల ననుభవించుటకును, తమ జీవితముల స్వర్గతుల్యముగ గడపుటకును, వలయు రహస్యము లిందు కుప్పతిప్పలుగ నున్నవి. శోభనపుగది రహస్యము, ప్రేమమును పెంచు దారులు, యేకాంతస్థయువతీయువకుల తలంపులు, లజ్జగల స్త్రీపురుషుల సంభాషణములు, ప్రేమపరీక్షలు, ముద్దులరుచి గ్రహించు దారులు, పడకటింట సఖీసఖులు విజయముపొందు విధములు, శోభనపుగది సింగారము, లజ్జతోగల సౌందర్యము మొదలగు సుమారు 100 అపూర్వ రహస్యములు యిందు వివరింపబడెను. నీతికి, ధర్మమునకు, పుణ్యమునకు విరుద్ధముగాకుండ వ్రాసిన గ్రంథ మగుటవలన స్త్రీపురుషులు, వయోధికులు సందరును చదువుటకొరకు కేర్పరిచిన

వెల రూపాయి **1-0-0**

ఎం. ఎస్. రాములు అండు కంపెని,
రాయపురం, మద్రాసు.



శ్రీ పండిత మోతీలాలు నెహ్రూ

అధ్యక్షులు, ౪౩-వ భారత జాతీయ మహాసభ-కలకత్తా



శ్రీ మహాత్మా గాంధీగారు
అధ్యక్షుడు, రాష్ట్రభాషా సమ్మేళనము–కలకత్తా



శ్రీ పండిత
జవాహరలాల్ నెహ్రూగారు
అధ్యక్షుడు, భారత సోషలిస్టు యువజన
మహాసభ–కలకత్తా



శ్రీ యస్. శ్రీనివాస అయ్యంగారు
అధ్యక్షుడు, భారత స్వాతంత్ర్యసమితి–కలకత్తా

# అన్ని సబ్బులు సంతృప్తి గలిగించవు




మీ సబ్బును మేలిమినందు, నాణ్యమునందు, విలువయందు శ్రేష్ఠమైనదియో లేదో పరీక్షింపుడు.

## డ్రేల్సు మాలటైన్ గ్లిసరిన్ సబ్బును పరీక్షింపుడు

అన్ని విషయములందు సర్వోత్కృష్టమైనది.

సంతృప్తిని కలిగించుటకే ఏర్పడినవి. మీరు తప్పక సంతృప్తి నొందెదరు.

## నేడే ఒక సబ్బును కొనుడు.

సోల్ ఏజంటు:—అన్ని షాపులందును దొరకును.

**ఏ. వి. ఆర్. ఏ. అడికప్ప చెట్టి**

52, బందరువీధి, మద్రాసు.

---

# కార్నిక్స్ ఏగ్ మిక్శ్చర్




మలేరియా ఇన్ఫ్లుయంజా, నడుమ నడుమ తగ్గుచు హెచ్చుచుండు మన్యజ్వరములకు 30 వత్సరములనుండి పేర్వడసినది. ఇతర మందులేవియు పనిచేయలేని చోట్ల యిది గుణమివ్వగలిగెను.

కార్నిక్ మిక్శ్చర్ శరీరమునందుండు జ్వర దుడుకుతనమును తగ్గించి త్వరలో ఆరోగ్యమును చేకూర్చును.

ఎల్లచోట్లను దొరకును.

**KARNIK BROS., No. 4 Bombay.**

---

# నాణ్యము రు 1350 బహుమతి

ఈ రెండును లభించుటకేమి మార్గము?

పై ట్రేడుమార్కుగల మా శకుంతలాపట్టుచీరలను గొనుటయే. ఏలన పైవాటిని గొనినన విచాల నేర్పుతో పురిపెట్టబడిన పట్టుతో నేయబడి నాణెముగా నుండును.

శాశ్వతముగా మాశకుంతల పట్టువస్త్రములను గొనుచున్నచో పైబహుమతి గూడ మీరు పొందవచ్చును. అన్ని శుభకార్యములయందును మా శకుంతలను ఏల పిలుపించుకొన కూడదు.

నేడే వివరములకు వ్రాయుడు.

**డి. కె. నారాయణస్వామి,** మేనేజింగ్ డైరెక్టరు.

శుద్ధపట్టు ధర్మవరం చీరలు తయారుచేయు కంపెని లిమిటెడ్,

ధర్మవరం.

అఖిలపక్ష సమావేశసంఘము అధినివేశ పరిపాలనను శిఫార్సు గావించెను. నా యభిప్రాయము నిదివరకే పలుమారులు తెలిపియుంటిని. మీ యనుమతితో సాధ్యమయినంత విశదముగ మరల విన్నవించుకొనియెదను. దానియొక్క సారాంశమియ్యది. సంపూర్ణ తమ మగు సంపూర్ణ స్వాతంత్ర్యమునకే నేను అనుకూలుడనే. కాని నేడు అధినివేశ రాజ్యముల వా రనుభవించుచుండిన అధినివేశమునకేమాత్రముగాని కొరతపడని సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తికిని ప్రతికూలుడను గాను. కాని దానియొక్క ఆకర్షణయంతయు గోల్పోవుటకు ముందుమాత్రమే దానిని బడయవలెను. నేడు అనుభవించుచున్న బ్రిటిషుసంబంధమును తెగనాడుట నాకు సమ్మతమే కాని అధినివేశములతో బ్రిటిషువారి కిపుడుగల సంబంధమునకు ప్రతికూలుడనుగాను.

నా యభిప్రాయము నింకను విశదము గావించెదను. శృంఖలాబద్ధము గానట్టియు, వికారవిరహితము నగునట్టి జాతీయ స్వేచ్ఛయే మానవహృదయముయొక్క సహజకామ్యము. అట్టి స్వేచ్ఛను ప్రేమింపనట్టియు, దానిని పొందగోరనట్టియు, భారతీయు డొక్కడైనను, స్త్రీగాని, పురుషుడుగాని, ఏపక్షమునవాడుగాని, తెగవాడుగాని జెందినవారైనను, ఎందును చెందనివారుగాని ఒక్కడైనను భారతీయుడు గలడని నేను నమ్మజాలను. స్వేచ్ఛను బడయుటయును, దానిని కాపాడుకొనుటయును సాధ్యమా యను విషయ మరుదెంచి నపుడే అభిప్రాయభేదములు జనించును. ఈ ప్రశ్నకు "ఔను" అని సమాధానము చెప్పుటకు తమయందును, తమ దేశీయులందును విశ్వాసముగలవారు గలరు— అట్టి వారిలో నే నొకడనని వెంటనే చెప్పగలను. కాని కొందరు నమ్మకముతోడను, వారికొందరు సంశయముతోడను ప్రతికూలముగ తల నాడించువారుగూడ గలరు. మొదటివారి (అనగా "ఔన"ని సమాధానమొసంగువారి) యాదర్శము సంపూర్ణస్వాతంత్ర్యము. రెండవవారిది అధినివేశస్వాతంత్ర్యము. స్వాతంత్ర్యము, అధినివేశరాజ్యాధికారములకుగల సంబంధమునుగూర్చిగాని, సంబంధరాహిత్యమునుగూర్చిగాని నిష్ఫలమగు విచారణ నిచట నేను గావింప నుద్యుక్తుడగాను. సిద్ధాంతపూర్వకముగ నీ రెండును ఒక తెగకే చెందినదా లేదా యను విషయముగాని, ఒకదానికొకటి అన్యోన్య ప్రతికూలమా కాదా యను విషయముగాని విచారణీయాంశముగాదు. నాకు ముఖ్యమగు విషయ మేమనగా సంపూర్ణస్వాతంత్ర్యమునకు సన్నిహితమగు స్వేచ్ఛ అత్యధికముగ అధినివేశరాజ్య పరిపాలనమం దిమిడియున్నది. అందుచే సంపూర్ణ పారతంత్ర్యమునకంటె అయ్యది సర్వదా వాంఛనీయము. ప్రస్తుత పరాధీన స్థితికి బదులు అధినివేశ పరిపాలన మొసంగబడుచో ఆ యధినివేశ పరిపాలనమం దెంత స్వేచ్ఛ ఇమిడియున్నప్పటికిని హీనమగు పారతంత్ర్యమునకు బదులు దానిని స్వీకరింతును. కాని అధినివేశ రాజ్యాధికారమునే నా గమ్యస్థానముగ నేర్పరచుకొనజాలను. ఏవనగా అది ఇతరపక్షమువలన రావలెను. ఆ పక్షముపై నాకధికారము లేదు. అట్టి యధికారమును బడయుటకు మార్గము సంపూర్ణ స్వాతంత్ర్యమునకై మనఃపూర్వకముగ పనిజేయుటయే. "మనఃపూర్వకముగ" నని ఏల చెప్పుచున్నాననగా కేవ లాడంబరము నన్ను ముందుకు గొంపోజాలదని నే నెరుగుదును. సంపూర్ణస్వాతంత్ర్యము కనుచూపుమేరయం దున్నపుడే అధికారమునందున్న పక్షము అంతకంటె తక్కువదానికై బేరమాడును. ఓటిమాటలు, శుష్కాడంబరములు మనల నాస్థితికి గొంపోజాలవు. స్థిరమగుకృషియు, వెనుకముందుజూడని, త్యాగముమాత్రమే దానిని సాధింపజాలును. ఆపని నిర్వర్తింపబడి, త్యాగము గావింపబడినచో బలయుతమగు పక్షముయొక్క మాట చెల్లును. అది అధినివేశస్వాతంత్ర్యమా, సంపూర్ణ స్వాతంత్ర్యమా యను విషయము అప్పుడు దేశమందుండు పరిస్థితులు నేడు ఇంగ్లండు దేశ మనుభవించుచున్న స్వాతంత్ర్యమును బడయు సమయమున ఆ దేశపు పరిస్థితులకు సమమైయుండెనా లేక అమెరికా సంయుక్తరాష్ట్రములు తన స్వాతంత్ర్యమును బడసినపుడు ఆ దేశమందలి పరిస్థితుల బోలియుండెనా యనువిషయముపై నాధారపడియుండును. ఈ లోపల ఒకవంక బ్రతుకు చావుల నిర్ణయించు దీర్ఘమగు సంఘర్షణమును, మరొకవంక నిర్నిరోధమగు నిర్బంధ విధానమును తప్ప మనయెదుట మరేమియు నుండదు. అందుచే మనగమ్యస్థానమేదియైనను దానిని జేరవలసిన కంటకభూయిష్ఠమగు ఒకేమార్గమును మన మనుసరింపవలెనని తేలుచున్నది. అందుకు మనము సంసిద్ధులముగామేని సంపూర్ణ స్వాతంత్ర్య మెన్నటికిని స్వప్నదర్శనమైయుండగలదు. అధినివేశ పరిపాలన మాకాశకుసుమము గాగలదు.

నే నిదివరకు సూచించియున్న రాజప్రతినిధిగారి యుపన్యాసమందలి మరొక భాగమునుగూర్చి ఇచట పేర్కొనవలసియున్నది. "సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యమును బాడువభూమికి భారతదేశమును గొంపోయెడి బూటకపుమిత్రుల చేతులలో" భారతవర్షము పొందగల నష్టమునుగూర్చి ఆశాభంగకరముగ వారు వర్ణించిరి. సంపూర్ణస్వాతంత్ర్యమును "బాడువభూమిగ" వర్ణించుటలో వీరి ఉపజ్ఞమాత్రము ఎన్నదగినది. స్వాతంత్ర్యమును బడయుటకుముం దట్టి బాడువను మనము దాటి వెళ్లవలయునని జెప్పు టింకను యొప్పిదమైయుండును.

కాని ఈ బాడువ మనల నలువంకలను పరివేష్టించియున్నది. అందుచే దానిని దాటి యావలకు బోయిననేగాని మన మెచ్చటకుగాని చేరజాలము. అది యిటులౌట ఈ యుపన్యాసమును బలపరచు మన మిత్రు లేమనెదరనగా? 'బ్రిటిషువారి దయాధర్మముపై నాధారపడియుండు అధినివేశరాజ్యాధికారమునకై ప్రాకులాడుటకుబదులు, మార్గమెంతదీర్ఘమైనను, కష్టమయినను స్వప్రయత్నముపై, స్వయంకృషిపై, నాధారపడెడి నిర్మలము, నిష్కలంకమునగు స్వాతంత్ర్యముల కేల పాటుబడరాదు' అనెదరు. మొట్టమొదట అధినివేశ పరిపాలనమునకై బాడువయందుబడి కొట్టుకొని, అంతట మీమార్గము నిరోధింపబడినట్లు తెలిసికొనినపిమ్మట బయలుదేరిన తావుకుమరలివచ్చి, తిరిగి బాడువలో నేదుమికి స్వాతంత్ర్యమునకై పోరాడుట కాలమును, శక్తిని, త్యాగమును

పృథక్పుచ్చుటయని వారు వాదింతురు. ఇర్విన్‌ప్రభువుయొక్క దృష్టితో చూచిన నీవాదమునకు సమాధానము లేదు. నా దృష్టితో వాలోచించిన, స్వాతంత్ర్యమునకై గావించెడి యాత్రయందు అధినివేశరాజ్యమును మార్గమధ్యమున దాటెదము. దానిని నిరాకరించునెడల యిరుమాటాడక ఎల్లపుడును మా రాశింపదగిన స్వాతంత్ర్యాదర్శమును సమీపించుటయే. సార్వభౌముని ప్రభుభక్తిపై నాధారపడచిన ఇర్విన్‌ప్రభువు వాదన మతిశయోక్తిగ ఉత్తమమైనదే. కాని ప్రభుభక్తి సహింపగల భారము మాత్రము అనంతముగాదు.

కాని స్వాతంత్ర్యమనిన ప్రపంచమును వీడి చనుట కాదనుట మాత్రము స్పష్టము. ప్రపంచములో నుండుట నిక్కమయినచో అదే ప్రపంచమందు నివసించెడి ఇతరులతో కలసి తిరుగవలసియుండును. ప్రస్తుత ప్రపంచపరిస్థితులందు దేస్వాతంత్ర్య దేశముగాని ఇతర దేశములతో రాజకీయ, ఆర్థిక, సాంఘికాది సంబంధముల తెంపుకొను టావశ్యకముగాని, సాధ్యముగాని కాజాలదు. కావున బ్రిటిషుసంబంధమును వదలుకొనుటయని మన మనునపుడు పారతంత్ర్య మనుభవించు దేశమును స్వతంత్ర దేశముగ జేయుటకు తగినమార్పుల ప్రస్తుత పరిస్థితులందు కలిగించుటయే గాని సర్వ సంబంధముల నింతటితో త్రెంపుకొనుటయనిగాదు.

మనము సాధింపగల స్వేచ్ఛనుబట్టి మార్పుయొక్క పరిణతి ఆధారపడియుండును. అది అధినివేశ రాజ్యాధికారమైనచో పారతంత్ర్యమునుండి బ్రిటిషు కామనువెల్తుయొక్క జాతులస్వాధీన, సమాన సభ్యత్వమునకో, స్వతంత్రజాతిగ నుండగలదు. అట్లుగాక అది సంపూర్ణ స్వాతంత్ర్య మయ్యెడిపక్షమున హిందూదేశము బ్రిటిషు కామనువెల్తునకు చెందియుండనిదై యుండును. భారతదేశమునకును, గ్రేటు బ్రిటనుకును గల సంబంధముల స్వభావము సంధిచేతను, పరస్పర విశ్వాసముచేతను నిర్ణయింపబడును. ఏవిధముగనైనను, వసుధైకకుటుంబత్వమును, ప్రపంచ భ్రాతృత్వమును నిర్మించుటలో మనము తగిన కృషి సలుపవలెనని ఇతర దేశములతో కొంత సంబంధ ముండవలెను. బ్రిటిషుదేశముగూడ వానిలో చేరియుండవచ్చును.

గాంధిమహాత్ముడు శెల్గాము కాంగ్రెసు సభలో అధ్యక్షోపన్యాసమున ఇట్లు చెప్పిరి. "బ్రిటిషు ప్రభుత్వమువారు చెప్పినట్లు చేయ వలపెట్టి మనఃపూర్వకముగ సమత్వమునకు గొంపోవుటకు మనకు తోడ్పడెడిపక్షమున బ్రిటిషు సంబంధమును సంపూర్ణముగ విడనాడుటకంటె నదియే ఉత్కృష్టమగు విజయమని నా యభిప్రాయము. అందుచే నేను సామ్రాజ్యాంతర్గతమగు స్వరాజ్యమునకై కృషి సలిపెదను. కాని బ్రిటిషువారి స్వయం కృతాపరాధమునవలన అట్టి విడబాటు అవసరమగుచో అందుల కించుకమాత్రమును వెనుదీయను. విడబడుటవలన గల బాధ్యతను పైవిధముగ బ్రిటిషువారిపైనే వేయబడును"

ఇదంతయు జరిగి నాలుగు సంవత్సరము లైనది. ఈలోపున ఎన్నియో వ్యవహారములు జరిగిపోయినవి. సామ్రాజ్యమునందుండియే స్వరాజ్యము ననుభవింపవలయునని మనము శక్తివంచనలేక పనిచేసితిమి. కాని సామ్రాజ్యమునందలి స్వతంత్రదేశములతో సమానమగు స్థానమును మనకు లభింపజేయు విషయమున ప్రభుత్వమువారు కొంచెమైనను శ్రద్ధ చూపియుండలేదు. పైపెచ్చు బ్రిటిషువారు మనకు ప్రతిపక్షులుగ మారిపోయిరి. భారతదేశము డొమినియను హక్కులు పొందుటకు ఇంకను ఎంతో కాలము గడపవలయునని సామ్రాజ్యమంత్రులు ఎన్నియో పర్యాయములు బహిరంగముగ ప్రకటించియున్నారు. కావున మనవారిలో అనేకులు విసుగుజెంది బ్రిటిషుసామ్రాజ్యసంబంధమును పూర్తిగ వదలుకొనవలయునని కోరుచున్నారు. వారిపట్ల నాకత్యంత సానుభూతిగలదు. కాని గాంధిమహాత్ముని మాటల అర్థమేమో మనము గ్రహింపవలసియున్నది. డొమినియను హక్కుల నిచ్చుటకు బ్రిటిషువారు సంసిద్ధత చూపకున్న మనశక్తి సామర్థ్యములను, బలాబలములను గణించుకొనక మనము స్వాతంత్ర్యమును ప్రకటించవలయునని మహాత్ముడు చెప్పలేదు. మహాత్ముని ఉపన్యాసమునందలి ఈ క్రిందివాక్యములను సభ్యులు శ్రద్ధతో వినవలయుననికోరుచున్నాను.

"ఎల్లపుడు పోరాటము సలుపుచుండు స్వతంత్రరాష్ట్రము లేర్పడవలయునని ప్రపంచమునందలి ఆలోచనాపరు లెవ్వరు కోరుటలేదు. పరస్పరసంబంధము కలిగి స్నేహభావముతో కలిసిమెలసి వ్యవహారములు జరుపుకొను రాష్ట్రసముదాయము లేర్పడవలయునని రాజకీయవేత్త లభిప్రాయపడుచున్నారు. మన దేశమునకుగూడ ఈ ఆదర్శమే చాలును. ప్రపంచమునందలి అన్ని రాష్ట్రములు ఒకటిపై ఒకటి ఆధారపడియున్నపుడు సంపూర్ణస్వాతంత్ర్యమును మనము కోరనక్కరలేదు. ఈ పరస్పరసంబంధమును మనముగూడ అంగీకరించవచ్చును. భారతదేశముతో మాకెట్టి సంబంధము నుండనక్కరలేదని బ్రిటిషువారు చెప్పిన చెప్పనిండు."

## సామ్రాజ్యమునందుండి సమానహక్కులు అనుభవింపవలెను

గాంధిమహాత్ముడు పలికిన భావగర్భితమగు ఈ క్రిందివాక్యములను మీరు శ్రద్ధతో గమనింపవలయునని కోరుచున్నాను—

"స్వాతంత్ర్యమును ప్రకటించుకయే స్వాతంత్ర్యము అనుభవించు శక్తి అర్హత మనకు ఏర్పడవలయునని నేను కోరుచున్నాను. సామ్రాజ్యమున భారతీయులకు సమానమగు హక్కులు ఇవ్వవలయునను ఆదర్శమును బ్రిటిషువారు పాటించునంతకాలము నేను బ్రిటిషుసామ్రాజ్య సంబంధమునే కోరుదును. రాజ్యాంగ నిర్మాణవిధానమును నేను తయారుచేయవలసివచ్చిన బ్రిటిషు సామ్రాజ్యసంబంధములేని స్వాతంత్ర్యమును నేను సూచింపను."

బ్రిటిషుమంత్రుల ప్రవర్తనము ఏవిధముగ నున్నను భారతీయులకు ఇతర దేశీయులతోపాటు సామ్రాజ్యమున సమానమగు హక్కులుండవలయు నను ఆదర్శమును ఇప్పటికిని బ్రిటిషువారు ప్రకటించుచున్నారు. కావున అఖిలపక్షమహాసభవారు తయారుచేసిన నిర్మాణము గాంధిమహాత్ముని అభిప్రాయములకును, సూచనలకును అనుగుణముగ నున్నదనియే నా అభిప్రాయము.

నిజ మేమనిన, మనము మనశక్తిని చూపినగాని బ్రిటిషువారి వద్దనుండి ఏమియు పొందజాలము. మన శక్తిసంపదను వృద్ధిచేసికొనుటకు నిర్మాణమే ప్రధానము. డొమినియను హక్కులను కోరువారికి ఎట్టి నిర్మాణబలము అవసరమో, సంపూర్ణస్వాతంత్ర్యము కోరువారికి కూడ అట్టి నిర్మాణబలము అవసరము. ఇట్టి పరిస్థితులలో మనలో వెనుక నుండవలచినవారు ఎంతదూరము రాగలరో అంతవరకు అందరు కలసి పోవుచుండవలయును. అప్పుడు కొందరు ముందంజ వేయ భయపడినవారిని అంతటితో విడచి మనము మనలక్ష్యము చేర ప్రయత్నింపవచ్చును.

## డొమినియను హక్కులు పొందగనే బ్రిటిషు సంబంధము వదలుకొన భారతీయులు ప్రయత్నించెదరా?

భారతీయులకు డొమినియను హక్కులు ఇవ్వబడగనే వారు బ్రిటిషు సంబంధమును త్రెంచుకొన ఆహక్కుల నుపయోగించెదరని భయపడువారికి నే నొకమాట చెప్పుచున్నాను.

ఇర్విను ప్రభువుగారు ఇటీవల ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి. "బ్రిటిషు సామ్రాజ్యసంబంధమును సంపూర్ణముగ త్రెంచుకొను సాధనముగ నుపయోగించుకొనుటకు మాత్రమే భారతీయులు డొమినియను హోదా కోరుచున్నారని బ్రిటిషుప్రజలకు అభిప్రాయమేర్పడిన భారతీయులకు డొమినియను హక్కుల నివ్వవలయు నని కోరు ఆంగ్లేయులకు మొగము చెల్లదు."

ఇదంతయు కేవలము పిచ్చిభ్రమ. ఈ విధముగ భయపడుటకు అవసరమే లేదు. ఇతరడొమినియనులకున్న హక్కులు భారతదేశమునకు ఇవ్వబడిన బ్రిటిషుసంబంధమును వదలుకొనవలయునని కోరుటకు కారణముండదు. ఇతర డొమినియనులకున్న హక్కులు సంపూర్ణముగ మనకు లేకున్న అది డొమినియను హోదా కాజాలదు. ఇమిటేషను డొమినియనుహక్కులను భారతీయులు అంగీకరింపజాలరు. కావున సంపూర్ణ అధికారములతోను, సంపూర్ణబాధ్యతలతోను కూడిన డొమినియనుహోదాను బ్రిటిషువారు ఇవ్వవలయును. మహాత్ముడు చెప్పిన విధమున "బ్రిటిషువారి కపటమువల్ల సామ్రాజ్య సంబంధము వదలుకొనవలసిన అవసరము ఏర్పడిన అట్లుచేయుటకు మన మెవ్వరము ముందువెనుక చూడగూడదు." డొమినియనుహోదా ఇవ్వబడినను బ్రిటిషువారి విపరీతప్రవర్తనమువల్ల బ్రిటిషు సంబంధము విసర్జనీయమని తోచవచ్చును. అప్పుడు మన హక్కులను స్థాపించుకొనుటకు ఇతర డొమినియనుల వారికున్న అధికారము మనకు ఏర్పడును. "నేను సంపూర్ణ స్వాతంత్ర్యము కోరుచున్నాను. అయినను డొమినియను హక్కులకు ప్రతికూలముగ లేను" అని నేను గావించినప్రకటనకు అర్థము సుబోధమైనదని నమ్ముచున్నాను. సందిగ్ధసమయములందు సారథ్యము ఎవరిచేతియందుండునో చెప్పుటకు వీలులేదు. నేడు బ్రిటిషువారు సారథులైయున్నారు. డొమినియను హక్కులను మీ కిచ్చెదమని బ్రిటిషువారు చెప్పుటకును, అంగీకరించెదమని భారతీయులు చెప్పుటకును ఇది సమయము. ఈసమయము తప్పిన, బ్రిటిషువారు ఈ అవకాశమును దుర్వినియోగముచర్చిన రేపు భారతీయులు సారథ్యము వహించెదరు. బ్రిటిషువారిని సాధించి సంపూర్ణస్వాతంత్ర్యము పొందుసమయము ఆనాడు ఏర్పడును. అప్పుడు డొమినియను హక్కులను అంగీకరించువారే దేశమునందుండరు.

## రాజ్యాంగనిర్మాణవిధానమును తయారుచేయుట తప్పా?

మీకు డొమినియను హక్కుల నిచ్చెదము అని చెప్పవలసినది బ్రిటిషువారి బాధ్యతయనియు, డొమినియను హక్కులు మనకుకావలయునని కోరుట తప్పనియు, అందుచే డొమినియను హక్కులతోకూడిన రాజ్యాంగనిర్మాణవిధానమును తయారుచేయుట సరసముగ లేదనియు కొందరు ఆక్షేపించుచున్నారు. ప్రస్తుతము డొమినియను హోదా అనుభవించుచున్న దేశములవారు సంపూర్ణస్వాతంత్ర్యమునకై పోరాటము సలిపిరని, ఆసంగ్రామసందర్భమున బ్రిటిషువారు రాజీకివచ్చి డొమినియను హక్కుల నిచ్చిరని ఈ వాదము సమర్థింపబడుచున్నది. భారతదేశమునకు డొమినియను హోదా వచ్చుటకు పూర్వము ఒకధర్మయుద్ధము జరుగవలయుననియే నాకు తోచుచున్నది. బ్రిటిషువారు మనకు రాజీషరతులు అందజేయుట న్యాయమైనదో మనమే రాజీషరతులను సూచించుట ఏవిధముగ తప్పగునో తెలియకున్నది. రాజీసూచనలు ఉభయపక్షములవారికి గౌరవకరమైనవి యగుచో, సూచించి వారు అంగీకరింపువారు అను విమర్శ యుండనక్కరలేదు.

## దేశబంధు ఫరిద్పూరుసందేశము

స్వాతంత్ర్యయోధులలో చిత్తరంజనుదాసుకన్న ఎక్కువత్యాగము, సాహసము వహించిన దేశభక్తుడు, మరొకరుండరని నా అభిప్రాయము. ఆస్వాతంత్ర్యసంగ్రామయోధుడు ఫరిద్పూరునందు ప్రకటించిన సందేశమును మీ స్మరణకు తెచ్చుచున్నాను. ఆత్మవిజ్ఞానవికాసాభివృద్ధులను అనుకూలావకాశముల నిచ్చిన భారతీయులు తృప్తిపడెదరని దాసుగారు చెప్పియుండిరి. ప్రభుత్వమువారు తమ వైఖరిని మార్చుకొని ఇట్టి అవకాశమును కలుగజేసిన ప్రభుత్వమువారితో కలసి పనిచేయుటకు దాసుగారు సంసిద్ధత చూపిరి. దాసుగారి రాజీషరతులు దౌర్బల్యమును సూచించుటలేదు. దేశబలమును సంపూర్ణముగ గ్రహించియే వారీరాజీని సూచించిరి. దాసుగారు చెప్పినమాటలను మరిగువ నుదా

హరించుచున్నాను:—ప్రభుత్వమువారు ఈరాజీని అంగీకరింపనిచో కడచిన సంవత్సరములనుండి మనము జరుపుచున్న కార్యక్రమము ననుసరించి పనిచేయుదుము. ప్రభుత్వమువారు అన్ని విషయములందును తమ ప్రత్యేకాధికారముల నుపయోగించియే పరిపాలనము కొనసాగింపవలసినట్లు మనము చేయుదుము. అట్టి సమయమువచ్చిన ప్రత్యేకాధికారములతో పరిపాలనము జరుపుచున్న ప్రభుత్వమువారికి పన్నులను చెల్లింపగూడదని ప్రజలకు మనము బోధచేయుదుము." రాజతంత్ర ప్రవీణుడును, రాజతత్త్వవేత్తయు, స్వాతంత్ర్యసైనికులలో పన్నెగాంచిన యోధుడును, ఆత్మవిశ్వాసపరుడును అగు ఏ మహానాయకుడు పలికిన ఈవాక్యములను మీరు గమనింపవలయునని కోరుచున్నాను. ఒకగొప్ప సంగ్రామము జరుపుటకు పూర్వము రాజీమరతులను సూచించుటవల్ల ఆత్మగౌరవమునకు భంగము కలుగదని వారు నిరూపించిరి. ఇండియా ప్రభుత్వచట్టపు ఉపోద్ఘాతమునందు బ్రిటిషువారు తమరాజీ సూచనల విసరించియున్నారు. ఈసూచనలు అసంతృప్తికరముగ నుండుటచే ముఖ్యము మన సూచనలను తెలుపుట అవసరము. అఖిలపక్ష సమావేశమువారు చేసిన పని ఇదియే.

## ఆదర్శములను సాధించుటకు ప్రజాశక్తి

మన ఆదర్శములను సాధించుటకు అవసరమగు ప్రజాశక్తిని అభివృద్ధిపరచు విషయమై అందరు మాట్లాడుచున్నారు. ఈ నివేదికను విమర్శించుచు గాంధిమహాత్ముడు గావించిన విమర్శనను ఈదిగువ నుదాహరించుచున్నాను:—"ఇంకను తంత్రమెంతయో జరుగవలెను. కాని అన్నిటికంటెను ముఖ్యమైన కార్యము ఆదర్శములను సాధించుటకు ప్రజాశక్తిని వృద్ధిచేయుట యని నా అభిప్రాయము. డొమినియను హక్కులైనను సరే, స్వాతంత్ర్యమైనను సరే జాతీయాదర్శములను సాధించవలయుననిన ప్రజాశక్తి వృద్ధిచెందవలెను. దౌర్జన్యరహితశక్తి కావలయునని మీకు బార్డోలీ దారి చూపినది. దౌర్జన్యరాహిత్యము కాంగ్రెసుమతము. బార్డోలి సమరమునకు పూర్వము దౌర్జన్యరాహిత్యమును గురించి తలచువారే లేకుండిరి. అన్నిపక్షములవారు ఆమోదింపతగిన నిర్మాణ విధానము నెహ్రూకమిటీవారు సాధించిన విధముననే బార్డోలి సమరము దౌర్జన్యరహితపద్ధతులపై విశ్వాసమును మరల కలుగజేసినది. ప్రజాశక్తిచే వృద్ధిచెందిన డొమినియను హక్కులే స్వాతంత్ర్యముకన్న ఎక్కువ అధికారము నివ్వగలవు. ప్రజాశక్తి లేని సంపూర్ణస్వాతంత్ర్యము పరిహాసాస్పదముగ నుండును. రోజాపువ్వునకు ఏపేరు పెట్టినను ఆపరిమళము పోవునా? అసలు సరుకున్న, పేరుతో ప్రమేయమేమి? రాజ్యాంగ నిర్మాణ విధానమును తయారుచేయు పనిని రాజతంత్రప్రవీణులకు వదలెదము. మనము ప్రజాశక్తిని వృద్ధిచేయుటకు పూనుకొనెదము."

నేను సూచించిన రెండవ ప్రశ్నకు నాప్రత్యుత్తర మిదియే!

"స్వాతంత్ర్యము మన లక్ష్యము. దాని రూపము పరిమాణము దేశకాలపరిస్థితులపై ఆధారపడియుండును."

స్వాతంత్ర్య స్వరూపము ఏవిధముగ నుండవలయునో చింతించక స్వాతంత్ర్యము సంపాదించుటకు తగు శక్తిని ప్రజలయందు వృద్ధిజేయ యత్నించుట ప్రధానకర్తవ్యము.

## మద్రాసు కాంగ్రెసు తీర్మానము

సంపూర్ణస్వాతంత్ర్యము భారతీయుల ఆదర్శముగ నుండవలయునని ప్రకటించిన మద్రాసు కాంగ్రెసువారే, కాంగ్రెసు కార్యసంఘమువారు అన్నిపక్షముల వారితో సంప్రతించి అందరు ఆమోదింపదగిన భారత రాజ్యాంగనిర్మాణ విధానమును తయారుచేయుదురని ఒకతీర్మానమును ఆమోదించిరి. కాంగ్రెసు మహాసభవారు ఆమోదించిన ఆదర్శమునే అన్నిపక్షములవారు ఆమోదించెదరని తలచుటకు వీలులేదు. ఇతర పక్షములవారితో సంప్రతించి అందరును అనుకూలమగు కార్యక్రమమును తయారు చేయవలయునని కాంగ్రెసువారు తీర్మానించినప్పుడు వివిధపక్షములవారికి భిన్నాదర్శము లుండునను విషయమును మరచియుండుట అసంభవము. సంపూర్ణస్వాతంత్ర్యము ఆదర్శము లేక సత్వరముగ సాధించవలసిన లక్ష్యమయినచో, ఇతర పక్షములవారితో సంప్రదింపవలయునను తీర్మానమునకు అర్థములేదు. తమాషాకొరకు మద్రాసు కాంగ్రెసువారీ తీర్మానమును గావించలేదు. ఈ సాధకబాధకముల నన్నిటిని కాంగ్రెసువారు ఆలోచించియుండవలెను.

కాంగ్రెసు కార్యసంఘమువారు మద్రాసు కాంగ్రెసు తీర్మానము ననుసరించి అఖిలపక్షసభను సమావేశపరచిరి. అందరు అంగీకరింపదగిన రాజ్యాంగనిర్మాణమును తయారుచేయుటయందు అఖిలపక్ష సభవారు విజయవంతముగ పనిచేసిరను విషయము ఎల్లరకు తెలియును. ఇంతకు మున్నెన్నడు రాజకీయ, సాంఘిక, కార్మిక, మత సంస్థలు ఒక్కటిగ చేరియుండలేదు. ఇట్టి అనుకూల పరిణామమునకు డాక్టరు అన్సారిగారిని అభినందింపవలసియున్నది. అఖిలపక్ష సమావేశమువారు ఆమోదించిన తీర్మానములు కాంగ్రెసు మహాసభయందు చర్చకు తేబడును. మద్రాసు కాంగ్రెసునందు ప్రారంభించిన కార్యమును పూర్తిచేయుట మీ బాధ్యత. మీరు మీ బాధ్యతను ఎంతవరకు నిర్వర్తింతురో దానిపై భారతభావిదశ ఆధారపడియుండును.

## అఖిలపక్ష మహాసభ

అన్ని పక్షములవారు అంగీకరింప తగిన కార్యక్రమమును తయారుచేయ అఖిలపక్ష మహాసభవారు పాటుపడిరి. కాంగ్రెసు మహాసభకూడ నిజముగ అఖిలపక్ష మహాసభయని నా అభిప్రాయము. దేశమున కంతయు క్షేమకరమగు కార్యక్రమమును నిర్ణయించుట

కాంగ్రెసువారి బాధ్యత. ఇంతవరకు ఇతరపక్షములవారితో సంప్ర దించక కాంగ్రెసువారు ఈ ధర్మమును కొనసాగించుచుండిరి.

ఇప్పుడు కాంగ్రెసు ఇతరపక్షములకు గౌరవస్థాన మొసగి వాటిని ఆహ్వానించి వాటితో సంప్రతించినది. ఆసహాయోద్యమ దినములనాడు కోట్లకొలది ప్రజలు కాంగ్రెసు నిశ్చయమును శిరసావహించుచున్నను కాంగ్రెసు మహాసభ నిర్ణయములను ఆక్షేపించు సంస్థ లెన్నియో యుండును. కాంగ్రెసువారు సమావేశపరచిన అఖిలపక్ష మహాసభకు పేరుపొందిన అన్నిసంస్థలు ప్రతినిధులను పంపినవి. అందరు వివిధపక్షములకు సమన్వయము కుదురవలయునను ఉద్దేశముతో వ్యక్తి అభిప్రాయములను కొంతవరకు వదలుకొనినారు. ఇది గొప్పకార్యమని మనము గర్వపడవచ్చును. అఖిలపక్ష సమావేశము వారి తీర్మానములు మీకు సమర్పింపబడును. మీరు అంగీకరించెదరా లేక నిరాకరించెదరా? ఇతరపక్షములవారిని ఆదరింపవలయునని మీరు కోరినట్లయిన, మీకిష్టము లేకున్నను మీరు ఆతీర్మానములను నిరాకరించుటకు వీలులేదు. అన్ని పక్షములవారు ఈతీర్మానములను ఆమోదించుచున్నారు. ఆక్షేపించుచున్న వారెవ్వరు? ప్రత్యేక సాంఘికవాదులు కొందరు ఆక్షేపించుచున్నారు. వీరు ఒకవంక సంపూర్ణ స్వాతంత్ర్యము కోరుచున్నారు. తమకు కొన్నిస్థానములను ప్రత్యేకించవలయు ననియు లేక సాంఘిక నియోజకవర్గములే యుండవలయు ననియు వీరు కోరుచున్నారు. వీరి ఆక్షేపణ లంతముఖ్యమైనవి గావని నా అభిప్రాయము.

## రాజప్రతినిధి ఉపన్యాసము

రాజప్రతినిధిగారు ఇటీవల నొసగిన ఉపన్యాసమును ఖండించుచు నేనింతవరకు మాట్లాడితిని. కాని వారి ఉపన్యాసమునందలి ఒక భాగమును మాత్రము ప్రశంసింపవలసియున్నది. వివిధసంఘముల భిన్నాదర్శములగురించి మాట్లాడుచు వా రిట్లు చెప్పియుండిరి:—

"భారతదేశమునందలి వివిధసంఘములవారికి వివిధజాతుల వారికిని భిన్నాదర్శము లుండుట సహజము. భిన్నాదర్శములు నష్టప్రదమైనవి కావు. కాని ఆదర్శములు భిన్నము లైనప్పుడు ఒక సంఘమువారు మరియొక సంఘమువారిని సంపూర్ణముగ రూపుమాపవలయునని గాని లేక తన వ్యక్తిత్వమును కోల్పోవలయునని గాని చెప్పుట తప్పు. ప్రతిసంఘము తనవ్యక్తిత్వమును కాపాడుకొనుచు,తనహక్కులను కాపాడుకొనుచు ఇతర సంఘములతో సంఘర్షణము లేక వృద్ధిచెందవచ్చును. ఈ భిన్నాదర్శములకు సమన్వయ మొనర్చుట అవసరము."

రాజప్రతినిధిగా రట్టి ఉద్దేశముతో ఈ మాటలు చెప్పినను భావము ఉత్కృష్టమయినది. ఈ విధమున ప్రత్యేక సాంఘికవాదులు తాత్కాలికలాభమును పాటింపక దేశక్షేమమును దృష్టియందుంచుకొని ఈ సమయమున ప్రవర్తింపవలెను. అఖిలపక్ష మహాసభవారు ఆమోదించిన తీర్మానములు దేశమునకు లాభకరమైనవా కావా అను విషయము ఆలోచించి మీరు మీనిర్ణయ మొసగవలెను. అంతే కాని మీవ్యక్త్యభిప్రాయములను ప్రమాణముగ పరిగణింపగూడదు.

## నెహ్రూ నివేదిక

ఈ నివేదికసూచనలు అన్నివిధముల ఉత్కృష్టమైనవని మేము చెప్పుటలేదు. కొన్ని సందర్భములయందు మేము మా అభిప్రాయములకు వ్యతిరేకమగుసూచనలను గావించియున్నాము. ప్రత్యేక ప్రాతినిధ్యము అల్పసంఖ్యాకుల కుండగూడదని మా అభిప్రాయమయినను మేము ప్రస్తుతపు పరిస్థితుల ననుసరించి యిట్టిసూచన గావించవలసి వచ్చెను.

కాబట్టి, యీ కాంగ్రెసుసభ జవాబుచెప్పవలసిన ప్రశ్న యొక్కటి మాత్రమే గలదు. ఈ సిఫార్సులు, యీ తీర్మానములు, మొత్తముమీద, దేశముయొక్క సామాన్యాభిప్రాయమున కనుకూలముగా నున్నప్పటికిని, వీనిని నిరాకరించుటయే తనకు ధర్మ మని యీ కాంగ్రెసు అభిప్రాయపడవలసినంత లోపభూయిష్ఠముగను, దేశముయొక్క శాశ్వత శ్రేయమునకు ప్రత్యక్ష విరుద్ధముగను, గాన్పించుచున్నవా? అట్లుకానిచో, యీ కాంగ్రెసు వీనిని ఆమోదించియే తీరవలెను.

ఈ సిఫార్సులు రెండు ముఖ్య శీర్షికలక్రింద విభజింపబడవచ్చును. (1) సాధారణమయినవి. (2) సాంఘిక సంబంధమయినవి. ఈ రెంటికిని గల అన్యోన్య సంబంధముబట్టి వీనిలో నొకదానిని మీ రామోదించి, రెండవదానిని నిరాకరింపజాలరు. ప్రతి పార్టీవారును గూడ యావత్తురిపోర్టు నామోదించుటకును, అందేయొక్క భాగము నయినను, తక్కిన భాగము లన్నిటికిని గూడ సంపూర్ణ సహాయ మొసంగకుండ, నామోదింప కుండుటకును, అన్ని పార్టీలవా రంగీకరించుచు గావించిన తీర్మానమును మనము ద్రోసివేయజాలము. కొన్ని సంఘములు అధినివేశ స్వాతంత్ర్యమునే గోరుచు, తాము ప్రత్యేక పార్టీలుగా సాంఘిక సమాధానములలో పాల్గొనుట మాత్రమేగాక, యెల్లరిచేత నంగీకరింపబడిన రాజ్యాంగవిధానము కాపాడబడుటకుగాను తమ స్వంతహక్కులను విడిచిపెట్టుకొని యున్నవి. పందలకొలది బహిరంగసభలు దేశమంతటను జరుపబడినవి. అందు నానావిధాభిప్రాయములుగలవా రెల్లరును పాల్గొనిరి. ఈ సభ లన్నియుగూడ సిఫార్సులను మొత్త మామోదించియే యున్నవి. అధినివేశ రాజ్యాంగ విధానమునుబట్టి సాంఘిక సమస్యాపరిష్కారము నామోదించినవారెందరో, సాంఘికసమస్యా పరిష్కారమును బట్టి అధినివేశరాజ్యాంగ విధానము నామోదించినవా రెందరో చెప్పుటకు సాధ్యపడదు. అందరి యెడలగూడ మనము విశ్వాస ముంచవలెను.

ప్రస్తుత స్థితి నా కట్లు గోచరించుచున్న దనగా, కాంగ్రెసుచేత పిలువబడిన వివిధ పార్టీలచేతను తయారుకాబడి యామోదింపబడిన యొకరాజ్యాంగవిధాన మిచ్చట నున్నది. సంపూర్ణస్వాతంత్ర్యమే

కాంగ్రెసుయొక్క గమ్యస్థానమని యీ పార్టీలకు దెలియును. తన గమ్యస్థానమును మార్చుకోవలెనని కాంగ్రెసును వీరు గోరుట లేదు. కాని, తమ ప్రయత్నములయొక్క ఫలితమును ఉన్న దున్నట్టుగా కాంగ్రెసు యెదుట బెట్టుచున్నారు. తాము అంతవరకు నడుచుటకు, సిద్ధముగా నున్నామనియు, ప్రస్తుత మంతకంటె నధికదూరమునకు బోజాలమనియు, వా రనుచున్నారు. తాముబోవ సిద్ధముగా నున్నంత దూరమువరకును, తాము, కాంగ్రెసు, ఉభయులును గలిసి చేరుకొన గలుగుటకుగాను, తాము కాంగ్రెసునకు సాయపడెద మనుచున్నారు. అందుకు కాంగ్రెసుగూడ తమకు సాయపడవలెనని వారు గోరు చున్నారు. ఈ హద్దు చేరుకొనిన పిమ్మట, ఇంక నెంతవరకు అడుగు పెట్టవలెనోయను విషయ మాలోచించుటకు తమకును కాంగ్రెసున కును సంపూర్ణస్వేచ్ఛ నొసగుచున్నారు. ఈ సహాయమును, ఈ స్వేచ్ఛను, వీరికి నిరాకరించుటకే కాంగ్రెసు ఉద్దేశించు కొను చున్నదా? వీ రందరి నొక్కటిగా గలిపినపిమ్మట మరల వీరిని విడి విడిగా యెవరి మార్గమునంకకు వారి నంపివేసి, వారి వారి యాదృష్ట ములకు విడిచిపెట్టుటకును, సంపూర్ణస్వాతంత్ర్య, అధినివేశస్వాతంత్ర్య ములయొక్క బలాబలములగూర్చి, కాలాంతమువరకు తాను తగవులాడు కొనుచుండుటకును, కాంగ్రెసు బూనుకొనుచున్నదా? అట్లేయగుచో, కాంగ్రెసు భారతజాతిని తనగమ్యస్థానమునంకకు నడిపించు బాధ్యతను, విడిచిపెట్టుకొనును. ఈ సంధిగ్ధావస్థలో, మన కత్యావశ్యక మయి యున్నది సమయోచిత నాయకత్వముకాని, యేవంకకునుగూడ మనలను నడిపింపజాలని వాగ్వివాదము గాదు. భారతజాతి కాంగ్రెసు తలుపులను గ్రుద్దుచున్నది. మీరు వానిని విశాలముగా తెరవవలెను. ప్రతివారును జొరబడుటకు వీలగునంత విశాలముగా తెరువవలెను. లేదా మీ రాక్రమించియున్న ఉన్నతాధికారపదవిని మీరు పోగొట్టు కొనవలెను. ఈ సహాయమును గైకొనుడని మీకు నేను సలహా నొసగు చున్నాను. మీ రట్లు గావించుచో మీ గమ్యస్థానమునకు మార్గము సరిగా తెరవబడి యున్నదనుకొనుడు.

అన్నిపార్టీలవారును గలిసి యిప్పుడు చేరియున్న స్థానమునుండియే మీరు బయలుదేరుడు. వా రెంత దూరము బోయెదరో అంతవరకు వారితో గలిసి మీరు గూడ ముందుకు నడువుడు. అచ్చట ఆగిన పిమ్మట మీ శక్తిసామర్థ్యమును పునర్విచారించుకొనుడు. తుట్టతుదకు గమ్యస్థానమును చేరుకొనుటకు ఒక్కపెట్టున మీ యావచ్ఛక్తిని ప్రయోగింపుడు.

మనగమ్యస్థానము నెట్లు చేరుకొనగలము అనుప్రశ్న కిదియే నా ప్రత్యుత్తరము.

మన స్వగృహమును సవరించుకొనుటయే మన మొట్టమొదటి కార్యము. ఇందుకొరకు అన్ని పార్టీలను కాంగ్రెసు ధ్వజముక్రిందికి చేర్పుడు. వారితో భుజములుగలిపి మన సామాన్యమార్గముయొక్క చిట్టచివర స్థానమువరకు నడుచుటకు తయారగుడు. ఇదియే మనప్రయాణముయొక్క ప్రారంభభాగ మగును. దీనికొరకు యీ క్రింది కార్య క్రమమును నేను సూచించుచున్నాను:—

1. పత్రికలలో ప్రకటించుట, సభలలో నుపన్యసించుట, ప్రతిగ్రామమునందును ఉపన్యాసముల నొసంగుట, మున్నగు పద్ధతుల వలన దేశమునందు తీవ్రమగు ప్రచారమును గావించి అఖిలపక్ష మహా సభలో ఆమోదింపబడిన మత సాంఘికసమస్యాపరిష్కారమును ప్రజలకు బాగుగా తెలియజేయుట.

2. ఢిల్లీ ఐకమత్యసభలోను, చెన్నపురి కాంగ్రెసుసభలోను ఆమోదింపబడిన మత సాంఘిక సంబంధములగు తీర్మానములను గూర్చి ఆసభలలో చేయబడిన సూచనల మాత్రమే గాక యీ కాంగ్రెసు మహాసభవారు యిపుడు చేయనున్న సూచనలనుగూడ ప్రజలకు తెలియ జేయుటకు సయితము పైన వివరింపబడినరీతిని ప్రచారము గావించుట.

3. అస్పృశ్యులను, నిమ్నజాతులను ఉద్ధరించుటకు పనిచేయుట.

4. వ్యవసాయ సంబంధమునను, పరిశ్రమలలోను, పనిచేయు కార్మికులలో కట్టుబాటును కలుగజేయుట.

5. గ్రామములలో కట్టుబాటును కలుగజేయుట.

6. ఖద్దరునుగూర్చియు, విదేశవస్త్ర బహిష్కారముగూర్చియు ప్రజలకు బాగుగా బోధించుట.

7. జాతీయాభివృద్ధిని నిరోధించుచున్నట్టి, సాంఘిక దురాచారములను, స్త్రీల యభివృద్ధికి నిరోధకము లయియున్న ఘోషాపద్ధతి మున్నగు దురాచారములను రూపుమాపుటకు ప్రయత్నించుట.

8. కల్లు, సారా, నల్లమందు, మున్నగు నిషాద్రవ్యముల ఉపయోగమును రూపుమాపుటకు తీవ్రమగు ప్రచారము చేయుట.

9. ఎప్పటికప్పుడు విషయములను పత్రికాముఖమునను, కరపత్రములమూలమునను ప్రకటించుచుండుట.

ఈ విధానమునందు సాంఘికవిషయములే అత్యధికముగా నున్నవని స్పష్టమగుచునే యున్నది. దీనిలో, మొదటి విషయము తప్ప తక్కిన వన్నియును, ఇంకను పెక్కువిషయములుగూడ, పెక్కువత్సరములనుండి కాంగ్రెసు వాదులును, దేశీయులునుగూడ చర్చించుచునే యున్నారు. దీర్ఘమగు ఆ పట్టికనుండియే ముఖ్యమయినవానిని కొన్నిటిని నే నిందు పొందుపరచితిని. కాని యిందు నేను క్రొత్తగా చేసిన సూచన యేదియు లేదు. నిర్మాణవిధానమునకు చేరిన యీ కార్యములను నెరవేర్చుటకు యిప్పటివరకును మనము చేసినపని లెక్కింపబడదగినదిగా నుండలేదని నేను నుడువవలసి వచ్చినందులకు మీరు మన్నిం

త్రులుగాక. ఈ విధానములోని విషయములు మామూలు విషయములుగనే కనబడినను, సంపూర్ణస్వాతంత్ర్యమునుగోరు గొప్ప పండితులును అధినివేశ స్వాతంత్ర్యమును గోరు భక్తులును గూడ, స్వరాజ్య సౌధమును నిరుపద్రవముగా నిర్మించుటకు సాధనభూతములని నమ్మియున్న మూలాధారములు యివియే అయియున్నవి. సంపూర్ణస్వాతంత్ర్యమును బడయుటకు మొదటి మజిలీ ప్రయాణమును వారు ప్రారంభింపవలసినపుడు ఆ మజిలీకోరునట్టి మహాత్యాగమునకు వారికి గల శక్తి పరిమితి, నిరాడంబరముగ పైకి గన్పించుచున్న యీ విధానమును జయప్రదముగా కొనసాగించుటయే యయియున్నది, అని నేను స్వరాజ్యవాదులకు విన్నవించుచున్నాను. ఈ విధానమును పూర్తిగా కొనసాగించుటయందే ఎన్నటికయిన అధినివేశ స్వాతంత్ర్యమును బడయుటకు గల అద్వితీయ మగు నవకాశము కలదని అధినివేశస్వాతంత్ర్యమును గోరు వారికి నేను దెలుపుచున్నాను.

ఈ వ్యవహారములను సరియైన దీక్షతో మనము ప్రారంభింపవలెనన్న, దేశమందంతటను మంచి కట్టుబాటును, అంగనిర్మాణమును, చాలా ధనమునుగూడా అవసరమగును. ఇది ఏదో యొక సంఘము గాని వ్యక్తిగాని చేయగల పనిగాదు. మన దేశమునకు స్వాతంత్ర్యము కావలెనను కోరికగల అన్ని సంఘములును అందరు వ్యక్తులును కలసి కొనసాగించిననే గాని యీ పని నెరవేరునదిగాదు. అఖిలపక్షసభలో మన దేశమందన్ని పక్షముల ప్రతినిధులును పాల్గొనియున్నారు. కోటీశ్వరులు, సంపన్నులు, నిరుపేదలునుగూడ గలరు. కోటీశ్వరులు అధిక మొత్తము లొసగవలెను. సంపన్నులును తమ వ్యయములు పోను మిగులుదాని నొసగవలెను. బీదలు అత్యల్పముగ నయిన నొసగవలెను. మన దేశమందలి సంస్థానాధిపతు లందరును గొప్పరాష్ట్రములు గల వారును, కొద్దిరాష్ట్రములు గలవారును గూడ, స్వదేశముపైని తమకు గల యభిమానమును వెల్లడించుటకును, తాము స్వదేశాభివృద్ధిని గోరుచున్నామని పలికెడు వాక్యములను ధ్రువపరచుకొనుటకును, భూరి విరాళము నొసగవలెను. ఈ విధానములో సాంఘికము లగు కార్యములను నెరవేర్చుటలో ప్రభుత్వోద్యోగులు సయితము పాల్గొనవచ్చును. కాని దొరతనమువారు అటుల అనుమతినిచ్చెదరా? ఆంగ్ల దేశమందును మనదేశమందును బ్రిటిషు రాజనీతిజ్ఞులు యిదివరకు వెల్లడించి యుండిన సద్భావములయొక్క యాథార్థ్యమును స్థిరపరుచుటకు ఇది యొక గొప్ప పరీక్షయే యగును. దొరతనమువారు చెప్పుచున్న విషయములు మనఃపూర్వకమే యయినచో, ఈ విధానమునందలి సాంఘికకార్యములను నెరవేర్చుటకు సంస్థానాధిపతులు, వర్తకులు, యంత్రశాలలయజమానులు, గొప్పజమీందారులు, ప్రభుత్వోద్యోగులు నగు వారందరును సర్వవిధముల తోడ్పడవలెనని బహిరంగముగా ప్రకటింపవలెను. బహిరంగముగా నటుల ప్రకటించుచు వెంటనే రహస్యముగా సాంకేతిక లిపిలో యిందులకు విరుద్ధముగా లకోటా యుత్తరములలో ఆజ్ఞలను పంపగూడదు. ఈ సాంఘికనిధికి ధన మొసంగిన వర్తకులకును, పరిశ్రామికులకును బదుళ్లనిచ్చుటకు ఇంగ్లీషు బ్యాంకులవారు తిరస్కరింపకూడదు. ఈ మూడుపనులును జరిగినచో మనవిధాన మంతయు సమగ్రముగా నెరవేర్చుటకు కావలసినంతధనమును అతి శీఘ్రముగా లభించునట్లు నేను చేయగలను.

బ్రిటిషు నిరంకుశోద్యోగుల యొక్కయు, ఆనిరంకుశోద్యోగుల అధికారమును నిలువబెట్టుటయందే కృషిసలుపుచున్న వారియొక్కయు, నిరర్థక సద్భావముల పైననే కాంగ్రెసువారు గాని మనము ఆధారపడి యుండకూడదు. దేశమునందున్న వివిధపక్షములలో దేశాభివృద్ధిని గోరుచున్న పక్షములయొక్క సహాయముతోనే నిజమగు పనిని కాంగ్రెసువారు జరుపవలసి యున్నది.

ఈ విధానమునందలి తొమ్మిది యంశములను కాంగ్రెసు వారి దృష్టికై నేను మరల పరీక్షింపగోరెదను.

ఒకటి, రెండు, విషయములకట్టి సమాధానమును అవసరము లేదు. అవి కేవలము మత సాంఘికసమస్యల ననుసరించినవి గావున వానిగూర్చి యెట్టి యభిప్రాయభేదమును గలుగుట కవకాశమే లేదు. వానినిగూర్చిన పని ముఖ్యావసరమని స్పష్టమగుచున్నది.

అస్పృశ్యతానివారణమును గూర్చి చెప్పబడినది చాల మెండుగనే యున్నదిగాని, జరిగినపని చాల తక్కువగనే యున్నది.

ఈ విషయమున సర్వశక్తులను వినియోగించి పనిచేయుట కాంగ్రెసువారి ప్రధానకర్తవ్యమని నా యభిప్రాయము. కాంగ్రెసు వారికి సంబంధించినంతవరకు అస్పృశ్యత పూర్తిగా తొలగిపోవలెను. అస్పృశ్యులతో కలసియుండుటకు అంగీకరింపని యే వ్యక్తినేని కాంగ్రెసు సంఘమునందును చేర్చుకొనగూడదు. ఈ రెండు విషయములలోను భారత తంతుకారక సంఘమువారు చాలశ్లాఘనీయముగనే పనిచేయుచున్నారు. కాని గ్రామపారిశుద్ధ్యమును గూర్చియు గ్రామములలో సహకారము కలిగించుటను గూర్చియు, కాంగ్రెసువారు ఉపన్యాసము లొసగుచుండవలెను.

6 వ విషయము ప్రత్యేకముగా స్త్రీలకు సంబంధించినది. కావున స్త్రీలు కాంగ్రెసునకు తోడ్పడవలెనని నేను కోరెదను.

ఏ విధానమైనను జయప్రదముగా కొనసాగవలెనన్న, జాతీయాభివృద్ధిని నిరోధించుచున్న సాంఘిక దురాచారము అడుగంటవలెను. కాని, యీ విషయమున యిప్పటివరకును మన పెట్టిప్రయత్నమును చేసియుండలేదు. ఘోషాపద్ధతి మున్నగు స్త్రీలకుగల నిరోధములను తక్షణమే మనము అంతమొందింపవలెను. స్త్రీ పురుషునకు అర్ధాంగి లేక ఉత్తమార్ధభాగము అను మాట నిజమే యయినచో జాతీయోద్ధరణమునందు శ్రేష్ఠమగు కార్యమును స్త్రీలు నెరవేర్చుటకు పురుషులు వారికి తోడ్పడవలెను. ఘోషాపద్ధతిని తొలగించుటకును,

కుటుంబజీవనమును సంస్కరించుటకును చాలధనము కావలెను. ప్రతి వ్యక్తియును శక్తివంచన లేకుండా తనవిధిని నెరవేర్చవలెను.

ఇతరవిషయములను యీ యుపన్యాసమునందు వివరించుట కవకాశము లేదు. కావున భారతజాతీయోపసంఘ సభ్యులను వేరు వేరు ఉపసంఘములుగా విభజింపవలెను. ఒక్కొక్క ఉపసంఘమునకు కార్యనిర్వాహకసభ్యులలోను వీరు అధ్యక్షులుగా నుండవలెను. ఈ పైని వివరింపబడిన తొమ్మిది విషయములలోను ఒక విషయమును గాని హెచ్చు విషయములను గాని నెరవేర్పవలసిన భారమును ఒక ఉపసంఘమువారు వహించుచుండవలెను. రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు గూడ ఇట్టి ఉపసంఘములను ఏర్పరుపవలెను. ఈ రాష్ట్రీయోపసంఘములవలననే నిజముగు పని జరుపబడవలసియుండును. భారత కాంగ్రెసుసంఘమువారిచే నియమింపబడిన ఉపసంఘమువారు ఒసంగునట్టి సూచనల ప్రకారము రాష్ట్రీయోపసంఘమువారు పనిచేయుచుండవలెను. తక్కిన వివరము లన్నిటిని భారత కాంగ్రెసు సంఘమువారు పూర్తి చేయవలెను.

ఇది అన్ని పక్షములవారును కలిసి నిర్వహింపదగినవిధాన మయి యున్నది. ఈ విధానము కాంగ్రెసుపక్షమువారి దృక్పథమునుండియు, నితరపక్షములవారి దృక్పథమునుండియు అవసరమైనదేయగుటచే దానిని నెరవేర్చుటకు యితరపక్షములవా రందరును మనఃపూర్వకముగా తోడ్పడరనియే నేను నమ్ముచున్నాను. అన్ని పక్షములవారును నిష్కపటముతోను అధికదీక్షతోను యీ విధానమును అనుసరించు నెడల స్వపరిపాలనము మనకు శీఘ్రముగనే లభింపగలదు. ఏ కారణముననైన అనుకొనినట్లు పూర్తిగా యీ విధానమును మనము కొనసాగింపజాలనిచో యితర పక్షములవారి సహాయమును నిలుపుకొనగలిగినను, నిలుపుకొనజాలక పోయినను, కాంగ్రెసువారికి దౌర్జన్యవిరహితమగు అసహాయోద్యమము ముఖ్యకర్తవ్యమే యయియున్నది ఇంతకంటె శ్రేష్ఠమగు ప్రతిఘటనవిధాన మొకటి యేర్పడిననే తప్ప కాంగ్రెసుకు అసహాయోద్యమమును కొనసాగించుటకు వెనుకంజ వేయకూడదు. ఎట్టి దౌర్జన్యమును చూపకుండా సత్యాగ్రహమును జయప్రదముగా జరుపుట సాధ్యమేయని బార్డోలీలో సర్దారు వల్లభాయి పటేలుగారు మనకు చూపించియే యున్నారు. గ్రామములో ఓరిమితో పనిచేయుటవలన కలుగు గొప్పలాభమును గూడా పటేలుగారు మనకు కనబరచి యున్నారు. సర్దారుగారిని, ఆయనకు సహాయముచేసిన వీరపురుషులను, వీరవనితలను, మీ పక్షమున నేను మనఃపూర్వకముగా అభివందించుచున్నాను.

విదేశములోనున్న భారతీయులను కనుపరుపజాలము. దక్షిణాఫ్రికాలో శ్రీనివాసశాస్త్రిగారు చేసిన గొప్ప పనివలన అచట నున్న మనవారికి కొంత అనుకూల మేర్పడినమాట నిజమే, కాని జరుగవలసిన పని యింకను హెచ్చుగనే యున్నది. కాని కెన్యాలో నున్న భారతీయుల స్థితిమాత్రము నానాటికి దుర్భర మగుచున్నది. అచట భారతీయులు నివసించుటకే ఉపద్రవము కలుగున ట్లున్నది. కెన్యా దేశమునకు పాశ్చాత్యు లెవ్వరుగాని వెళ్లుటకు పెక్కువత్సరములకు పూర్వమే మనదేశీయు లచటికి వెళ్లి అచటి ఆఫ్రికాదేశీయులతో మైత్రిని సంపాదింపగలిగిరి. ఫిజీ, బ్రిటిషు గయానా, దేశములలో గూడ, అచటికి పోయియున్న మనదేశీయులకును, ఆ దేశములలో అనాదిగా నుండువారికిని గూడా, బ్రిటిషువారి ధనాపహరణపద్ధతి వలన చాలనష్టము కలుగుచున్నది. వినుక సర్ ఫిరోజిషా మెహతాగారు చెప్పినట్లు మొదట మనదేశమునకు స్వాతంత్ర్యమును చేకూర్ప గలిగిననే గాని వారి కట్టిసహాయమును చేయజాలము.

ప్రస్తుత స్థితియందు ఏది ప్రధానమని నేను తలచితినో దానిని మాత్రమే నేను వివరించితిని. అటులు చేయుటలో, యీ విషమస్థితిలో నా దేశముపట్ల దేనిని నా కర్తవ్యమని నేను భావించితినో దానిని నెరవేర్చుటకే నేను ప్రయత్నించితిని. నా భావములు మీ కందరికిని ముఖ్యముగా యువజనులకును ఆమోదకరములుగా నుండకపోవచ్చును. యువజనులకు ఓరిమి తక్కువగా నుండుట సహజ మని నే నెరుగుదును. మనకు సహనమును అసహనమును గూడ అవసరమే. స్వవిషయమున అసహనమును, మనలో నేకీభవింపనివారితో సహనమును మనము చూపుచుండవలెను. యువజనుల ఆశయములతోను, వారు నిర్ణయించుకొనిన కార్యవిధానముతోను నా కట్టి వివాదమును లేదు. సామ్రాజ్యవ్యయమును ధనాపహరణమును పూర్తిగా అంతరింపవలె ననుటలో, నేను వారితో పూర్తిగా నేకీభవించెదను. కాని, దానిని నెరవేర్చుటకు గల సాధనము కష్టతరమును, దీర్ఘతరము నయియున్నది.—అను విషయమును యువజనులే వెల్లడించియుండుటచే దానిని వారు గ్రహించియే యున్నారని స్పష్టమగుచున్నది. వృద్ధులును యువకులును చేయదగినపనిలో భేద మేమియు లేదు. యువజనులచిత్తవృత్తిలో మాత్రమే భేదము గలదు. యువజనులు తమ చిత్తవృత్తిని మార్చుకొనక్కరలేదు. ఏ మాతృదేశమునకు వారు సేవజేయగోరుచున్నారో అట్టి మాతృదేశాభివృద్ధికొరకు యిదివరకు మనదేశమునం దున్న పక్షములకంటె, యింకను పక్షములు అధికమగునట్లు మాత్రము వారు చేయకుందురు గాక యనియే నేను వారిని గోరుచున్నాను. పెద్దవారి విషయమున గూడ యీ విధముగనే నేను విన్నవించుచున్నాను. నేను పైని వివరించియున్న రీతిని మహాత్మా గాంధి, దేశబంధు దాసుగా రొసంగిన సదుపదేశమును మరువవలదని మరొకసారి నేను మిమ్ములను గోరుచున్నాను. నా యుపన్యాసము ముగిసినది. నాపట్ల మీరు చాల ఓరిమిని చూపించితిరి. అత్యల్పమగు నాసేవను నేను మీకు వశపరచితిని. దానివలన మీ కేమైన ప్రయోజన మున్నచో దాని నుపయోగించ గోరెదను. మనలో గల అభిప్రాయ భేదముల నన్నిటిని వదలుకొని మనమందరమును ఏకీభవించి దేశసేవకు గడంగుచో మనకు విజయము చేకూరుట నిశ్చయము.



శ్రీ సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్ దాస్‌గారు
అధ్యక్షుడు, భారత వాణిజ్యమహాసభ-కలకత్తా



శ్రీ కే. నటరాజన్‌గారు
అధ్యక్షుడు, భారత పత్రికానాయకులసభ, కలకత్తా



శ్రీ డాక్టరు యం. ఏ. అన్సారిగారు
భారతీయవస్తుప్రదర్శనోత్సవ ప్రారంభకుడు-కలకత్తా



శ్రీ కే. యఫ్. నారిమన్‌గారు
అధ్యక్షులు, భారత యువజనసభ-కలకత్తా

బెజవాడ శ్రీ వేంకటేశ్వ రాయుర్వేద కళాశాలాధ్యక్షులును, అఖిల భారతాయుర్వేద విద్యాపీఠ పరీక్షకులును, మద్రాసు



ప్రభుత్వ భారతీయవైద్య పాఠశాలాపరీక్షకులును, చతుర్థాంధ్రాయుర్వేదవైద్య సమ్మేళనాధ్యక్షులును అగు

## ఆయుర్వేద భూషణ నోరి రామశాస్త్రి, ఎ. కె. ఎ. సి. వారిచే

**సిద్ధమకరధ్వజ**

నరముల పటుత్వము, బుద్ధి, తీక్ష్ణత, దేహదార్ఢ్యములను పెంపొందించును.







**వసంతకుసుమాకరము**

అతి మూత్రము, మధుమేహము, క్షయ, స్త్రీ వ్యాధులు మున్నగువానికి సుప్రసిద్ధ రసాయనౌషధము.

## శాస్త్రప్రకారము సిద్ధపఱపబడిన ఆయుర్వేదౌషధములు

**క్షీరవర్ధని**

తల్లిపాలను వృద్ధిచేయును. వెల రు 1-8-0

పునహా, లాహోరు, కొలంబో, మద్రాసు మున్నగు పట్టణములలో జరిగిన అఖిలభారతాయుర్వేద ప్రదర్శనములలో ఉత్తమ యోగ్యతాపత్రములను బంగారు పతకములను బడసినవి. కేట్లాగుకై వ్రాయుడు.

**మేహారి**

సమస్తమేహవ్యాధులకు. 40 మాత్రల సీసా వెల రు 2-8-0

## యోగ్యతాపత్రికలు

మ.రా.రా.శ్రీ కోలా కేశవరెడ్డిగారు, గురిజాల తాలూకాబోర్డు ప్రెసిడెంటు, దాచేపల్లి, పల్నాడు తాలూకా నుండి 20-4-25 వ తేదీన యిట్లు వ్రాసిరి:—

అయ్యా, నేను మాయింటిలో కావలసి క్షీరవర్ధనిని 3, 4 పర్యాయములు తెప్పించి వాడితిని. దానిగుణముఅద్భుతము, దానిని వాడిన మరురోజే క్షీరములు వృద్ధి కనుపించును. క్షీరములు తక్కువగల బాలింతలు క్షీరవర్ధనిని వాడినచో పాలు లేవనే భయములేక పిల్లలను వృద్ధి పర్చుకోవచ్చును.

మ.రా.రా.శ్రీ విష్ణుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు అనంతవరమునుండి 19-11-28 వ తేదీన యిట్లు వ్రాసిరి:—

క్షీరవర్ధని తల్లి యొక్క శరీరమును కూడా ఆరోగ్యముగా చేయుచు పిల్లకు పాలను కలుగచేయుచున్నది .........దీని గుణము నుపట్టి పిల్లతల్లులకు సాక్షాత్ దైవస్వరూపులుగా నున్నారని తలచుచున్నాను.

మ.రా.రా.శ్రీ మహమ్మదు ఖాదర్ సామరిక్యాయర్ సాహెబు బహదూర్ గారు భీమునిపట్నము నుండి 3-8-25 వ తేదీన యిట్లు వ్రాసిరి:—

క్షీరవర్ధని యిదివరలో మీకంపెనీలో తెప్పించియుంటిని. పగంబుడ్డి యివ్వగానె పిల్లడికి పాలులావుగా యుండుటచేతను తల్లికి మరి యివ్వలేదు. యీదినమువరకు పాలు విస్తారముగా వున్నవి.

## ఆయుర్వేద నిలయము, బెజవాడ.

# తీర్మానములు

## ౧

### మహానాయకుల మరణమునకు సానుభూతి

జాతీయమహాసభాధ్యక్షులును సుప్రసిద్ధభారతనాయకులును అగు శ్రీయుత లాలాలజపతిరాయి, హాకీం అజ్మల్‌ఖాన్, సింహ ప్రభువుల మరణమునకై విషాదమును, కుటుంబములకు సానుభూతియు తెల్పు తీర్మానము జాతీయమహాసభాధ్యక్షునిచే ప్రతిపాదింపబడెను. సభికులందరు భక్తిపురస్సరముగా నిలువబడి తీర్మానము నామోదించిరి.

## ౨

### కాంగ్రెస్ విదేశీయశాఖలు

నూతనముగా లండన్ న్యూయార్కు నగరములయందు స్థాపింపబడిన కాంగ్రెస్ శాఖలను అంగీకరించుచు జవహర్లాలు నెహ్రూగారు తీర్మానము నుపపాదించిరి. గోవా కాంగ్రెస్ సంఘమును కూడ కాంగ్రెస్‌వారొప్పుకొనిరి. ఆయా దేశములలో నింకను కాంగ్రెస్ సంస్థలను స్థాపించి ప్రచారము చేయవలసినదని తీర్మానము కోరెను. కోచ్ కాంగ్రెస్ సంఘమువారి దరఖాస్తును విచారింపవలెనని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారిని తీర్మానము కోరినది.

## ౩

### అస్వతంత్రజాతులతో సంబంధము

సామ్రాజ్య నిరంకుశత్వమునకు లోబడి అనేక విధముల ఇబ్బందుల నొందుచున్న అస్వతంత్రజాతులతో మైత్రి చేసికొనవలెనని మూడవతీర్మానము కోరెను. మరియు ఈ విషయమై వ్యవహారము జరుపుటకు విదేశాంగశాఖ స్థాపింపవలెనని కూడ తీర్మానము కోరెను.

## ౪

### యుద్ధ భయము

మద్రాస్ కాంగ్రెస్ మహాసభవారు యుద్ధభయమును గురించి యామోదించిన తీర్మానమును ఈసభవారు మరల నామోదించుచున్నారు. మరియు ప్రస్తుత భారత ప్రభుత్వము భారతీయుల యభిప్రాయమును సూచించనిదనియు, భారతదేశముయొక్క సరిహద్దులను రక్షించుటకుగాక భారతదేశమును తన యధీనముననుంచుటకే యాంగ్లేయ రాజనీతి యేర్పడియున్నదనియు ఈ మహాసభవారు తలచుచున్నారు. ఇరుగుపొరుగు రాజ్యములతోగాని, ప్రపంచములోనే యితర రాజ్యములతోగాని భారతీయులకు తగాదా లేదనియు, సామ్రాజ్య కాంక్షకై ఆంగ్లేయులు భారతీయుల కనర్థదాయకముగా ప్రవర్తించుటకు భారతీయు లొప్పుకొనిరనియు, ఈసభవారు ప్రకటించుచున్నారు.

## ౫

### బ్రిటిష్‌వస్తు బహిష్కరణము

విదేశవస్త్రములను, విదేశవస్తువులను బహిష్కరింపవలెనను తీర్మానము సభలో నత్యధిక సంఖ్యాకులచే నామోదింపబడెను.

## ౬

### బార్డోలి సర్దారు నభినందించుట

బార్డోలీ సత్యాగ్రహోద్యమమును కడు సమర్థతతో నడిపి విజయలక్ష్మిని చేగగొనిన ధీరుడు బార్డోలీ సర్దారుగారి నభినందించు తీర్మానము సభికులచే నుత్సాహ పూర్వకముగా నంగీకరింపబడెను.

## ౭

### ప్రభుత్వగౌరవముల నిరాకరణ

విజాతీయ పరిపాలనమును బలపరచి విదేశీయ ప్రభుత్వమును వారి యుద్యోగీయులను గౌరవించుట కొసంగబడు విందులు మొదలగువానికి వెళ్లుట జాతీయగౌరవమునకు హానికరమును భారత స్వాతంత్ర్యస్పృహకు ఆటంకమును అని సభవా రభిప్రాయపడుచున్నారు. కావున ప్రభుత్వోద్యోగీయుల గౌరవార్థమై యొసంగబడు లీవీలు, పార్టీలు, విందులు మున్నగువానికి భారతీయులు ముఖ్యముగా కాంగ్రెస్ సభ్యు లెవ్వరును పోరాదు.

## ౮

### ప్రాచ్యజాతుల సమితి

ఆసియా ఖండములోని యితర దేశముల ప్రతినిధులతో సంప్రదించి అఖిల ఆసియా జాతీయ సమితి సభను ౧౯౩౧ సంవత్సరమున భారతదేశములో జరుపవలసినదని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వారిని ఈ సభవారు కోరుచున్నారు.

## ౯

### చీనా, ఈజిప్టు మొదలగు జాతులకు సందేశము

౧. సంపూర్ణస్వాతంత్ర్యమును, సంపూర్ణ జాతీయస్వత్వములను గడించి చీనాదేశములో నిరంకుశాధికారమును అంతము చేసినందులకు ఈ భారతజాతీయ మహాసభ చీనాదేశస్థులకు స్నేహపూర్వకమగు సద్భావమును వెల్లడిచేయుచున్నది.

౨. ఈజిప్టు, సిరియా, పాలస్టయిన్, ఇరాక్ దేశములకు ఈ భారతజాతీయ మహాసభ వాత్సల్య పూర్వక సందేశము నంపును భారతదేశ స్వాతంత్ర్య పోరాటమున కాటంకమగు పాశ్చాత్య సామ్రాజ్యశృంఖలములనుండి వారును తప్పక విముక్తి యగుదురని కోరుచున్నది.

3. సామ్రాజ్యవిచ్ఛేదకసంఘముయొక్క సమావేశమును భారతదేశమున కాహ్వానించుచు, ఈ సభవారి పక్షమున సామ్రాజ్య విచ్ఛేదకసంఘసభలో పాల్గొనుట కొక ప్రతినిధి నేర్పాటుచేయవలెనని కాంగ్రెస్‌వర్కింగ్ కమిటీవారిని సభవారు కోరుచున్నారు.

## ౧౦
## రాజీ తీర్మానము

నెహ్రూ నివేదకను ఈ మహాసభవారు విచారించి భారతదేశముయొక్క రాజకీయ, సాంఘిక సమస్యలను పరిష్కరించుట కది చక్కని పద్ధతులను సూచించుచున్నదని తలచుచున్నారు. మరియు సంఘమువారు ఏకగ్రీవముగా చేసిన సిఫారసులకు సభవారు నెహ్రూ సంఘము నభినందించుచున్నారు. మద్రాసు కాంగ్రెసు మహాసభలో నామోదింపబడిన స్వాతంత్ర్యతీర్మానము నీ సభవా రంగీకరించుచు, నెహ్రూనివేదిక దేశములోనున్న ముఖ్యపార్టీలన్నియు నంగీకరింప గలిగిన గరిష్ఠ సామాన్యమును తెల్పుచున్నది గనుక రాజకీయాభివృద్ధిని సూచించుచున్నదనియే తలచుచు దాని నంగీకరించుచున్నారు.

రాజకీయపరిస్థితులకు లోబడి, ఆంగ్లపార్లమెంటు సభవారు డిసెంబరు 1929 సంవత్సరము లోగా నీరాజ్యాంగ విధానము నామోదించినచో, ఈ మహాసభవారు ఈ రాజ్యాంగవిధానమును స్థాపింపగలరు. ఆతారీఖులోగా నాంగ్ల పార్లమెంటువారు ఆమోదింపనిచో, లేక అంతకు పూర్వమే నిరాకరించినచో కాంగ్రెస్ వారు దౌర్జన్యరహిత సహాయ నిరాకరణము నవలంబించి అప్పుడు నిర్ణయింపగల పద్ధతుల ననుసరించి పన్నుల నిరాకరణమును గాని, మరియే సాత్వికపద్ధతినిగాని అవలంబింపవలసినదని దేశీయులను ప్రబోధించెదరు.

పైదానికి అనుగుణ్యముగా నున్నయెడల, కాంగ్రెస్ పేర సంపూర్ణస్వాతంత్ర్యప్రచారమును సాగించుట కేయభ్యంతరములును కలుగజేయబడవు.

## ౧౧
## సైమన్ సంఘ బహిష్కరణ

సైమన్‌సంఘ బహిష్కారమును మునుపటికంటె తీవ్రముగా కొనసాగింపవలెనను తీర్మాన మీక్రింది విధముగా నున్నది. సైమన్ సంఘమును జయప్రదముగా బహిష్కరించిన భారతీయులను, పోలీసు దౌర్జన్యములను లెక్కజేయక శాంతమును నిగ్రహమును ప్రకటించి అధికారుల పశుత్వమును అన్యాయమును జయించిన లాహోర్ లక్నో వారలను ఈ మహాసభవా రభినందించుచున్నారు.

ఐనను సైమన్ సంఘమును బహిష్కరించుటకు భారతీయులు చేసికొనిన కృతనిశ్చయమునకు విరుద్ధముగా కొందరు భారతీయులు ప్రవర్తించుచున్నారని సభవారు గమనించుచున్నారు. మరియు కొందరు భారతీయోద్యోగీయులును ఆంగ్లేయోద్యోగీయులును లాహోర్ లక్నో నగరములలో పోలీసు దుండగములలో పాల్గొనిరి. సాధ్యమైనంతవరకు ఈ వ్యక్తులతో భారతీయులు సాంఘిక సంబంధము లేవియు పెట్టుకొనకుందురు గాక యని మహాసభవారు కోరుచున్నారు.

ఇట్టి వ్యక్తులకు విందులు చేయరాదనియు, వారి గౌరవార్థమై చేయబడు విందులకైనను వెళ్లరాదనియు సభవారు కోరుచున్నారు.

హరతాళములను ఇతర ప్రదర్శనములను జరిపించి సయిమన్ సంఘము ఇకమీద పర్యటించు రాష్ట్రప్రజలు సయిమన్‌సంఘ బహిష్కారమును జయప్రదముగా కొనసాగింపవలెనని యీ సభవారు ఆయా రాష్ట్రములను ప్రబోధించుచున్నారు.

## ౧౨
## భారతసంస్థానములలో బాధ్యతాయుత పరిపాలనాస్థాపన

స్వదేశసంస్థానములలో ఏకవ్యక్తిపరిపాలనను తొలగించి బాధ్యతాయుతపరిపాలన నేర్పరుపవలెనను తీర్మానము సభవారిచే నంగీకరింపబడెను.

## ౧౩
## కాంగ్రెస్ నిర్మాణమున మార్పులు

కాంగ్రెస్ నిర్మాణ ప్రణాళికయందు గావింపవలసిన మార్పుల విషయమై విషయ నిర్ణయసభవా రామోదించిన తీర్మానము మహాసభవా రంగీకరించిరి. కాంగ్రెస్ ముగిసిన పిదప ఖర్చులు పోగా ఆహ్వాన సంఘము వారివద్ద మిగిలిన మొత్తములో సగభాగము జాతీయోపసంఘమువారి కొసంగవలెనని యిందులో నొక సవరణ కోరుచుండెను. ఇది రాబోవు సంవత్సరమునుండి అమలులోనికి వచ్చును. కాంగ్రెసు కార్యక్రమమును నిర్వహించుటకీ మొత్త మవసర మని జవహర్లాలు గారు నుడివిరి.

## ౧౪
## మరణించిన రాజకీయ నిర్బంధితులు

ఈ సంవత్సరమున కారాగారముల యందు మరణించిన ఐదుగురు రాజకీయ నిర్బంధితుల కుటుంబములకు సంతాపము దెలుపుచు విజయకృష్ణబోసుగారు ప్రతిపాదించిన తీర్మాన మంగీకరింపబడెను.

యందు ప్రవేశపెట్టి 1 వ వర్గముచే నామోదింప జేయించుటయు ఇత్యాది విధ్యుక్తములు పాలకవర్గమునకు గలవు. దీనిని బట్టియే (Official bills) అనగా మంత్రివర్గీయ చట్టములు శాసనసభలయందు పాలకవర్గాధిపతులచేతనే ప్రవేశపెట్టబడును. ఇట్లే 2, 3 వర్గములకును సంబంధము గలదు. న్యాయవర్గపుతీర్పులు విరుద్ధముగాను విపరీతముగాను పరిణమించుపక్షములో అవసరము వెంబడిని చట్ట నిరూపణచేయుట, క్షమార్పణ హుకుములను జారీచేయించుట మొదలైన విధ్యుక్తములు పాలకవర్గమునకు గలవు. మఱియు కొన్ని దేశములందు 2, 3 వర్గముల యధిపతి ఒక్కడే యగుటయు సంభవించును.

పాలకవర్గనిర్మాణము

రాష్ట్రపాలనయంతయు నీవర్గముందే యాధారపడి యున్నది. కొన్ని ప్రాచీనరాజ్యములందును కొంతకాలమువరకు అధునికపరాసురాజ్యమందును కూడ శాసనవర్గము లేకయే పాలకవర్గనిర్మాణముతో రాష్ట్రపరిపాలన యథావిధిగా జరుగగల్గినది. కాబట్టి పాలకవర్గము అతిజాగరూకతతో నిర్మింపబడవలెను. శాసనవర్గము ప్రజాహితమైనప్పుడు పాలకవర్గము కూడ నట్లే యుండవలెను. మఱియురాష్ట్రవిధ్యుక్తములు మెండైనప్పుడు పాలకవర్గముయొక్క బాధ్యతకూడ మెక్కువగును. కొన్ని దేశములందువలె పారిశ్రామికాదులు రాష్ట్రవిధ్యుక్తములు కానప్పటిలో పాలకవర్గపుబాధ్యత తగ్గుచున్నది. ఏది యెట్లున్నను బాహ్యాంతరశాంతిస్థాపనకును ప్రథమవర్గ కార్యక్రమనిరూపణకును, అంతర్జాతీయదృక్పథమందు, రాష్ట్రప్రతిష్ఠస్థాపనకును, ఇత్యాది పాలకవర్గ సాధారణ విధ్యుక్తములకు తగునట్లు 2 వ వర్గనిర్మాణము గావింపవలెను.

వర్గస్వభావము:

పై కార్యనిర్వహణమునకు బూనుకొను పాలకవర్గమున ముఖ్యముగా చురుకుదనము గల్గియుండవలెను. అనగా కార్యసాధనమున నిమేషములో గావించు శక్తి గల్గియుండవలెను. దండయాత్రలు, అంతఃకలహములు ఇత్యాదుల నివారణమార్గముల నన్వేషించి యాచరణలో పెట్టుటకు సంసిద్ధముగా నుండవలెను. ఈ వర్గమునకు కల్గిన బాధ్యతను స్వాతంత్రబుద్ధితో నిర్వహించుచు, నంత్యమున శాసనవర్గమున కుత్తరవాదియై యుండవలెను. ఈ వర్గమున కైకత్వము ముఖ్యమైన గుణము. పెద్దరాష్ట్రములందు పాలకవర్గము భిన్నభిన్నములుగా నిర్మింపబడినను, కార్యాచరణమునం దొక్కవ్యక్తివలె ప్రవర్తింపవలెను. ఈ విషయములో నీవర్గము ఒక్కనియందే (రాజు) ఆధారపడినవర్గమే ద్వంద్వవర్గముకంటెయుత్కృష్టమైనది. లేదా ద్వంద్వవర్గము అమెరికా సంయుక్తరాష్ట్రమందువలె నొక్కనిపై నాధారపడి సర్వాధికార మాతని కొసంగవలెను. ఎట్టిస్థితిలోను రాజ్యపాలన ఒక్కనియం దాధారపడుట దుర్లభమైనందున రెండు పక్కీలలోకూడ ఆయా అంతర్భాగాధిపతులు వర్గాధిపతికుత్తరవాదులైయుందురు.

ఈ వర్గస్వభావము సాధారణముగా దీని నిర్మాణపద్ధతి ననుసరించియుండును. ప్రజారాజ్యములం దీవర్గము ఎన్నికలపద్ధతి ననుసరించి యుండును. అనగా ప్రజలెన్నుకొనిన శాసనసభా ప్రతినిధుల నుండి యీ వర్గాధిపతులేర్పాటుచేయబడుదురు. పోటీపరీక్షల మూలముగా అంతర్భాగాధిపతు లేర్పరుపబడుదురు. కొన్ని దేశములందు ప్రజలే యీ వర్గాధిపతి నెన్నుకొందురు.

పాలకవర్గాధిపతి:

ఈతడు కొన్ని రాజ్యములందు ఎన్నికల ప్రకారమున్ను, మఱికొన్నిటి యందు వంశపారంపర్య హక్కుప్రకారమున్ను ఏర్పరుపబడును. రెండవ పక్షములో రాజ్యమందు స్థిరత్వమున్ను, ప్రతిష్ఠయున్ను స్వతంత్రతయున్ను, రాజకీయ సాంప్రదాయమున్ను సమకూరును. కాని రాజే రాష్ట్రవర్గాధిపతియైనచో అసమర్థతకును, నిరంకుశత్వమునకును అవకాశము కల్గును. ఎన్నికలవలన వర్గాధిపతి ద్వివిధములుగా నిర్మింపబడును. మొదటిది అమెరికా యందువలె ప్రజలే వర్గాధిపతి నెన్నుకొందురు. రెండవది యింగ్లాండునందువలె ప్రజ లెన్నుకొనిన శాసనసభ్యుల నుండి వర్గాధిపతు లేర్పరుపబడుదురు.

**పాలకవర్గ తరహాములు :**

**ఇవి 3 విధములు.**

**1.** ప్రతినిధిసభాసంబంధమైన వర్గము. ఉ॥ ఆంగ్ల క్యాబినేటు. ఇది శాసనవర్గముచే నియమింపబడును. కాబట్టి యీ రెంటి సంబంధమందును అనుకూలతయు, సమయానుకూలమైన మార్పులకు తగినట్లు ప్రజాహితముగా ప్రవర్తించుటకు తగు వశ్యతయు, కార్యక్రమవిమర్శన కవకాశమును, ప్రతినిధులతో సంబంధము కల్గియుండుటచేత ప్రజల సాధకబాధకములను తెలిసికొనుట కవకాశమును సమకూరును. కాని ఆయావర్గముల యొక్క స్వాతంత్రతకు భంగము కలుగనచ్చును. మఱియు శాసనసభలయొక్క తాత్కాలిక మార్పులకు లోనగుట చేత క్రియాపదములకు కూడ మాటిమాటికి మార్పులు కల్గుచుండుట సంభవించును.

**2.** ప్రతినిధి సభాసంబంధములేని వర్గము. ఉ॥ అమెరికా ప్రెసిడెంటు- దీనికిని శాసనసభలకును జోక్యముండదు. ఇందువలన స్వతంత్రత కార్యదీక్ష సమకూరును: కాని ద్వంద్వపరిపాలన సాధకబాధకములను గూర్చి యుభయవర్గములమధ్య చర్చలు జరుగకపోవుటయు సంభవించును.

**3.** పై రెంటికిని మధ్యస్థమైన వర్గము. ఉ॥ స్విడ్జర్లాండు బుండెస్‌రాత్. పై రెంటి మంచిచెడుగులను గల్గియున్నది. శాసనసభ్య లెన్నుకొనబడగానే వారి నుండి పాలకవర్గసభ్య లేర్పరుపబడి వారు నియమితకాలము వరకు పనిచేయుదురు గాని ఈ నియమితకాలమందిక ప్రతినిధి సభలతో సంబంధములేకయే యుందురు.

వర్గాంతర్భాగము:

ఇది పాలకవర్గమున కవయవముల వంటిది. పాలకవర్గాధిపతులు ప్రజాప్రతినిధులనుండి ఎన్నుకొనబడుచున్నందున వీరు ఆయాకార్యక్రమములలో ప్రవీణులైన యుద్యోగులను సహాయులుగా దీసికొని వీరిని అంతర్భాగాధిపతులుగా నేర్పరిచెదరు. ఇందువలననే సివిలుసర్వీసు కొలోనియల్ సర్వీసు ఇత్యాదులకు పరీక్షలు పెట్టబడినవి. మరియు పోస్టుమాస్టరు జనరలు, రెజిష్ట్రేషను శాఖకు ఇన్‌స్పెక్టరుజనరలు, దళనాయకులు, కోశాధిపతులు, ఇత్యాదులు ఆయాశాఖల కుత్తమోద్యోగులుగాను శాఖల సెక్రెటరీలుగాను నియమితు లగుచున్నారు. వీరలు దినచర్య నడపుటకు నియమితులు కాని వీరు ప్రవీణులగుట చేత మంత్రివర్గపు మాట పొసగకుండ జేయగలుగుదురను భయము కలదు. కాని యీ పద్ధతి ప్రజారాజ్యము లందు తప్పని విధిగా పొడసూపుచున్నది. ఆధునిక ప్రజారాజ్యములం దీ బ్యూరాక్రెసీ అత్యవసరమైపోయినది. పాలకవర్గ మేకార్యమును బూనుకొన్నను, నిపుణులయొక్క అభిమతమును అంచనాలను తీసికొననిదే పనిచేయుట దుర్లభమగుచున్నది. కార్యాచరణయందలి వివరములను గూర్చి వితర్కించుటకు సమర్థతయు అవకాశమును లేకపోవుటచేతను, రాష్ట్ర విధ్యుక్తములసంఖ్య అధికమైన కొలది శాఖలసంఖ్య అధికమగుచుండుటచేతను యీ బ్యూరాక్రెసీయొక్క ప్రాముఖ్యత యెక్కువ వగుచున్నది.

# ప్రజాస్వామిక ప్రభుత్వము

వల్లూరి సూర్యనారాయణరావు గారు, బి.ఏ., బి.యల్.

ప్రపంచములో ప్రజాస్వామికప్రభుత్వము లన్నియు ఒక్కరషియాలో తప్ప, స్వల్పజనాధిపత్యము క్రిందనే నడపబడు చున్నవి. రషియాలో మాత్రము, కృషీవలుల కార్మికుల సంఘములనుండియే మెట్టుమెట్టుకు ప్రతినిధు లేర్పడి రాజ్యాంగవిధానమును నడుపుకొను చున్నారు. పార్లమెంటులోని ఆరువందల ప్రజాప్రతినిధులలో అనేకమంది ధనము వెచ్చింపగలిగినవారే ప్రాతినిధ్యమును బడసినవారు. వీరి నందరినీ యే పండ్రెండుగురు బుద్ధిచాతుర్యముగలవారో తమతమ కక్షలక్రిందకు లాగుకొనెదరు. ఇట్టి ప్రజాస్వామికప్రభుత్వమైనను ప్రస్తుత సాంఘికపరిస్థితులలో మనము నెలకొల్పగలమా యను సమస్య పరిష్కరించుకొనవలసియున్నది. నెహ్రూకమిటీ రిపోర్టు కాగితముమీద బాగుగానే కనుపడును. దీని నందరు ఆమోదించతగినదే; కాని దీనిని జయప్రదముగ ఆచరణలో పెట్టుటకు మన మనోవీథిలో మొట్టిమార్పులు కలుగవలెనను ప్రశ్నకు సమాధానమిచ్చుట సుకరము కాదు. కాలక్రమముగ సాంఘిక రాజకీయ సంస్కరణలే కాక అప్పుడప్పుడు విప్లవములు కూడ రావలసిన యోగము మన దేశమునకు పట్టనైయున్నది. కాబట్టి యిప్పటినుండియు, వాని నెదుర్కొనుటకు ప్రయత్నించినగాని, యితర నాగరికసంఘములకు మనము వెనుకబడిపోవుదుము. ఇదిగాక, మనకిష్టమున్నను, ఇష్టములేకపోయినను మన సంఘముకూడ యితరసంఘమువలన ముందుకు త్రోయబడక తప్పదు. చుట్టును అగ్నిహోత్రముండగా మధ్యనున్న దారువు అంటుకొనకమానునా? "గతానుగతికో లోకః" యనునట్లు, యీయంత్రయుగములో మనముకూడ చిక్కుబడి ముందుకు నెట్టబడుదుము. కనుక మన మిప్పుడు కోరు పాశ్చాత్యరాజ్యాంగతంత్రమునకు అర్హులము కావలెనన్న మనలో నెట్టిసాంఘిక మార్పులు కావలయునో కొంచమాలోచింతము.

మనకు సంపూర్ణస్వాతంత్ర్యము (Full independence) కావలెనని మనలో ప్రతివానికిని అభిలాషకలదు. కాని దానిని సంపాదించుకొనుటకు శక్తిలేకపోవుటచే ప్రస్తుతము ఆంగ్లేయసామ్రాజ్యములో ఒకభాగముగా నుండి అధినివేశరాజ్యాంగ తంత్రము (Dominion status)ను మనము కోరవలసివచ్చినది. ఇదియైనను రెండుమూడు విషయములలో తప్ప తక్కినవానిలో ప్రజల కుత్తరవాది యగు బాధ్యతాయుతప్రభుత్వమే (Responsible government) మనమేర్పరచుకొన్న ప్రతినిధులలోనుండి మంత్రు లేర్పడుటయు వారియందు మన ప్రతినిధులలో అధికసంఖ్యాకులకు నమ్మకములేదని తీర్మానించినపుడు వారందరు ఒక్కుమ్మడిగా తమ పదవులకు రాజీనామా లిచ్చుటయు సంభవించును. మన ప్రజా ప్రతినిధి సంఘముల ప్రెసిడెంట్లుగా ఆంగ్లేయదేశపురాజుగారు, గవర్నరులను పంపుచుందురు. పైకి యీ రాజ్యాంగవిధానము సులభముగా కనుపడినను లోపలికి పోయినకొలది కొన్ని క్లిష్ట సమస్యలు బయలుదేరును. నెహ్రూరిపోర్టు ప్రకారము, మన హిందూమహమ్మదీయ ప్రతినిధులు నియోజకవర్గము వారందరిచే కలసి యెన్నుకొనబడినను, కొన్ని అన్యూనసంఖ్యగల స్థానములు కొన్ని రాష్ట్రములలో మన మహమ్మదీయసోదరుల కొసంగబడినవి. మరికొన్ని రాష్ట్రములలో బ్రాహ్మణ బ్రాహ్మణేతరసమస్య యిదివర కుండినను యిప్పటికి నియోజకవర్గమును బట్టి బ్రాహ్మణేతరులే అత్యధికముగ యెన్నుకొనబడెదరు. కనుక యీ సమస్య

సమసిపోయెనని కొందరెంచెదరు. కాని, బ్రాహ్మణేతరులలోనే వందలకొలది ప్రత్యేకకులము లుండుటచేత స్పర్థలకు కారణమగుచున్నది. కనుక మన మెన్నుకొను ప్రతినిధులు వర్ణవిభేదమును, మతభేదములను పాటించక దేశక్షేమమునే మనములం దిడుకొనెదరా యనుసందేహము బాధించుచున్నది. వీనిని మన మనస్సులనుండి పారద్రోలి యేకజాతీయతను ప్రజాక్షేమమును మాత్రమే పాటించినగాని మనము రాజ్యపరిపాలనను చేయజాలము.

మన హిందూదేశములో పూర్వము ప్రజాస్వామిక ప్రభుత్వములు లేవాయని కొందరు ప్రశ్నింపవచ్చును. లేకేమి? అప్పుడు ప్రతిగ్రామము నిజముగా ప్రజాస్వామిక ప్రభుత్వమే. కాని, దానిని నడపుకార్యనిర్వాహకులు, యిప్పటి నవనాగరిక వోటర్లవంటి వారిచేత నియమింపబడలేదు. సాధారణముగా రాజుగారుగాని, ఆయన యేజెంట్లగు గవర్నరులుగాని బాగుగా ఆలోచించి రాష్ట్రపరిపాలనకు తగిన మంత్రివర్గములను, పంచాయతీవర్గములను యేర్పరుచుచుండేవారు. వారివారి విద్యనుబట్టియు, వ్యవహారిక జ్ఞానమునుబట్టియు, నైతికప్రవర్తననుబట్టియు, ఆయా కులములనుండి పెద్దల నేర్పాటుచేసి వీరికి అనేకవిధములైన యధికారముల నిచ్చుచుండిరి. ఇప్పుడది యిట్టి పెద్దదేశములో, యీ వ్యక్తిస్వాతంత్ర్యేచ్ఛగల యీకాలములో సాగునా? నెహ్రూరిపోర్టులో మేజర్లయిన అందరు స్త్రీపురుషులకు వోటధికార మీయబడినది— దుర్మార్గులైన ధనికులు విరివిగా లంచములనిచ్చి మనకు ప్రతినిధులు కావచ్చును. ధనికులగు శుంఠ లనేకులు శాసనసభలకు రావచ్చును. ముఖ్యముమీద ఇంగ్లాండు, అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములలోవలెనే విద్యయు బుద్ధియు గల ప్రథమతరగతి రెండవతరగతుల వారికంటె అనేకవేలు ఖర్చుపెట్టి మూడు నాల్గవతరగతులలో చేరిన దుర్మార్గులు, శుంఠలు యెక్కువగ మన శాసనసభలలో చొరబడుదురు. ఇదిగాక, యిట్టివారిలో వర్ణభేదజాడ్యము ప్రబలి తమవారికిని తమకును గొప్ప ఉద్యోగములు సంపాదించుటకు తమ పదవుల నుపయోగించి, తమ రాష్ట్రమును పరదేశీయుల కమ్మివేసెదరు. మంత్రిస్థానములు మొదలుకొని చిన్నయుద్యోగములవరకు తెలివితేటలనుబట్టి కాక, వర్ణాభిమానము బంధుత్వములనే చూచి ప్రజాపరిపాలనలో యుద్యోగీయుల నియమింతురు.

పాశ్చాత్యదేశములలో యిప్పుడు శాసనసభలలో రెండుమూడుకక్షులకంటె యెక్కువకక్షు లేర్పడుచుండుటచే శాసనసభలు తరుచుగా ఛిద్ర మగుచున్నవి. (Dissolution) మంత్రివర్గము తరుచు మారిపోవుచున్నది. ఇట్టిస్థితిలో మనదేశమందు మతవర్ణవిభేదములు మెండై వివిధకక్షులు పెరిగి, నిర్దిష్టన్యాయ సూత్రములకు (Definite political principles) లోనుగాక, యేవియో ఒకటి రెండుకక్షులు తాత్కాలికముగ కలసి మంత్రివర్గమును బడద్రోయుదురు. ఇట్లు అతిత్వరితముగ మంత్రివర్గము మారుచున్నపుడు, ప్రజోపయోగకరములగు కార్యములను చింతింపక తమ పదవుల నెట్లు నిలబెట్టుకొనెదమా యను చింతయే మంత్రివర్గమువారి నెల్లపుడు వేధించుచుండును. కాబట్టి యిప్పటి పరిస్థితులలో గవర్నమెంటువారు మన నెహ్రూరిపోర్టునందలి కోరికలను సఫలపరచినను కార్యవిధానములో ఈ క్రిందిమార్పులుచేయుట మిక్కిలి అగత్యమని నాకు తోచుచున్నది.

1. వర్ణభేద మతభేదములను, రాజకీయపరిపాలనలో, యెంతమాత్రము చొప్పించమని ముందుగా ప్రమాణము చేసినవారే అభ్యర్థులుగా (Candidates) నుండవలయును.

2. అయిదు సంవత్సరముల కొకసారి నూతనప్రజాప్రతినిధిసంఘము కూడినపుడు వారిలోనుండి గవర్నరుగారు మంత్రుల నేర్పాటు చేయవలెను. ఆ యైదు సంవత్సరములలో సదరు మంత్రులను తీసివేయుటకు శాసనసభవారి కధికార ముండకూడదు. ఏమంత్రియైనను సరిగా నడచుకొనుచుండుట లేదని అతనిని యోజకవర్గములో మెజారిటీవారు తీర్మానించినయెడల, అతను తనపదవికి రాజీనామాపెట్టి తిరిగియెన్నుకొనబడుటకు ప్రజల కప్పీలు



శ్రీ జయపురం మహారాజుగారు
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రోఛాన్సిలరు



శ్రీ॥ శే॥ ఆంధ్రరత్న
దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు



శ్రీ॥ శే॥ పంజాబుకేసరి లాలా లజపతిరాయిగారు



శ్రీ। శే। సర్ పానుగల్లు రాజాగారు

చేసుకొన వచ్చును. తక్కినమంత్రులు రాజీనామా యీయ నక్కరలేదు.

3. ప్రతిభాషాప్రయుక్తరాష్ట్రమునకును వేరు వేరు శాసనసభ లున్నపుడు ప్రతితాలూకాకును కనీసము ఒకసభ్యుడైన నుండవలెను. అప్పుడు వోటర్లందరికిని అభ్యర్థుల యోగ్యతాయోగ్యతలు వారివారి కార్యవిధానములు, వాగ్దానములు వెల్లడియగుచుండును. వోటర్లందరును సులభముగా తాలూకాపట్టణములో కలుసుకొని తమప్రతినిధుల చర్యలను బాగుగా ఖండించి తగుసలహాల నీయవచ్చును.

4. పోటీపరీక్షలను బట్టియే అన్ని డిపార్టుమెంటులలోను యుద్యోగీయులు నియమింపబడవలెను.

5. ఆర్థికవిషయములలో యంత్రసహాయమే మిక్కిలి యావసరము. వేదాంతము, నిరాడంబరజీవనముకంటె మానవసేవ కుపయుక్తమైన కార్యములకు గడంగవలెను.

ఒకవేళ యీ అఖిలదేశరాజ్యాంగతంత్రమునైనను గవర్నమెంటువారు ప్రవేశపెట్టుటకు నిరాకరించినయెడల మనము సంపూర్ణస్వాతంత్ర్యమునకే పాటుపడవలెను. మనము వర్ణభేదములను, మతభేదములను రాజకీయ విషయములనుండి వేరుచేయుటయేకాక, ఆ భేదములను సంఘములో నుండకుండునట్లు మనము నడుచుకొనవలెను. దేశస్వరాజ్యాహింసాత్మకమైన అసహాయోద్యమము ప్రారంభించి స్వార్థత్యాగము కనబరచి, రాజకీయయుద్ధములో దిగక తప్పదు. ఇదితప్ప మన స్వాతంత్ర్యసంపాదనకు వేరు మార్గములేదు. దీనినికూడ బానిసలై మన ప్రజ లవలంబించనివారలైనయెడల, మనలోని ధనికు లందరు సాంఘిక రాజకీయవిప్లవములకు సిద్ధముగాక తప్పదు. రక్తపాతముతో కూడిన సమిష్టివాదులవిప్లవము బయలుదేరునని గట్టిగ నమ్మవలెను.

ప ఘా వ రు లు



నిన్న నేడు రేపు

# రసతరంగములు—౧

## గణపతి

కీ. శే. అనంతపంతుల వేంకటేశ్వర్లు, బి.ఎ., బి.యల్. గారు


వ్యాసకర్త.

భావకవిత్వ మట్లు బహుభంగిని దోఁచెడు పూజ్యభావరూ
పావధిచేఁ గళానిధికి హాసముఁ గొల్పెడు విఘ్నకార్యదీ
క్షావశునిన్, గిరాతసుతు, సామజవక్త్రుని వక్రహస్తునిన్
పావను, నేకదంతుని, తృణప్రియు, మూషకసాది నేమనన్.

తను బ్రార్థించినవారి కీఁగల పదార్థస్ఫూర్తి లే, దేల యీ
తని గొల్వన్ మఱి కొల్వకుండిన బ్రమాదం బౌనో యేమో యటం
చును నిష్కాముఁడనై కరంబు లెపుడున్ జోడింతు నావిఘ్న నా
థునకున్, కేవలనిర్గుణాత్మకునకున్, దోషాకరోపాధికిన్.

తెగఁ బూజించి యనేకదైవతములన్ తాపత్రయీబంధముల్
బిగియన్ గోరెద "రీయరే" యని జనుల్ వీరందరున్, మోక్ష మొం
దగ నిష్కామత "వద్దు, వద్ద" ని సదా ధ్యానింపఁగాఁ జేయు దే
వగణారాధ్యము నావినాయకపరబ్రహ్మంబు నే నెంచెదన్.

దూర్వాంకురములు, మధురమోదకంబులు-సమములు పొట్ట పోషణకు ననఁగ
కడు నల్పమౌ మూషకం బాదిగా నేన్గు-వరకు బ్రహ్మస్వరూపంబు లనఁగ
విష మమృతం బొక విధమెపో ద్వంద్వభే-దంబు లన్నియు నసత్యంబు లనఁగ
పామరజనము నిష్కామత సగుణమౌ బ్రహ్మము నేకొల్చి పరము నొందు
ననఁగఁ బర తత్త్వబోధక మైన రీతిఁ-బొలుచు తృణమోదకాహ్లాది, మూషసాది
కరిముఖు, విషాహిమేఖలాభరణు, మౌళిధృతసుధాకరసుము, గణపతిఁ దలంతు.

# స్వాతంత్ర్యయాత్ర

గుఱ్ఱప్పడియ ఆంజనేయులుగారు

కర్ణానందకరంబుగా పటహభాంకారాదినాదంబు లు
త్తీర్ణంబై మహిఁ బ్రాకి మింటి కెగయన్ దివ్యజ్జయద్దుందుభు(?)
ల్పూర్ణామోదముతోడ మ్రోగె వినవేమో! లెమ్ము! రా! రమ్ము! దా
స్యార్ణోరాశిని దాటు వేళ యిది మిత్రా! భారతీపుత్రకా!

కన్నులవిప్పి నల్గడలఁ గానవు, నీసరివార లెల్ల వే
నక్కన్నిను డించి, చిత్తబలనౌకను దాటెద రల్లదే! జయో
త్పన్నలతాలవిత్రపరతంత్రమహాంబుధి, నింత మాంద్య మే
తెన్నున గల్గె నీకు? చనుదెమ్మిఁకనైన జయంబు గల్గెడుఁన్.

పిల్లల గోడుఁ జూచి; దురపిల్లుచుఁ; జెక్కుటఁ జేయిఁ జేర్చి; పె
న్వెల్లిగ శోకబాష్పములు నేత్రయుగంబునఁ జార, విన్నన౦
తల్లికి సంతసం బొసఁగి, దైన్యము వాపుము; సాటివారిలో
నెల్ల ఘనుండవై నడుపుమీ జయనావిక నేర్పుసంపునన్.

చంద్రగుప్తాదిరాజన్యప్రాజితమైన జయపతాకము మింట సంచలింప,
చాణక్యముఖనీతిసాంద్రకల్పితమైన తెఱచాప గరిమ చూపరులఁ దనుప,
ప్రాచీనమునిరాజపరిశోధితంబైన మూలపీఠిక డాలుఁ గీలుకొలుప!
గీతాపదార్థభావాతినిర్మితమైన లలితంపుఁ జుక్కాని తళుకులీన
ఘోరతరదాస్యజలనిధి తారకముగ-వేల కేతెంచె నదిగో రత్నాలనౌక!
జాగుసేయక, వేగ నీ జడిమ నుడిగి-పాత్రుఁడవు గమ్ము! స్వాతంత్ర్యయాత్ర కిపుడు.

వలదోయీ! సఖ! భూమిభృజ్జలచరవ్యాఘాతశంకాభయా
కులతాలేశము, నావికాధిపునిఁ గన్గొంటే జగద్వెల్లితా
మలసత్యాగ్రహనీతిశాలి, చరకామంత్రాధినాథుండు, నేఁ
డెలమిన్ జేరెదు తత్కృపాగరిమచే స్వేచ్ఛాంతరీపానన్.

ఆధివ్యాధులఁ బాసి లేమి కెడఁబాసి, క్షామభూతంబు వి
స్వీథిన్ జేరఁగ మీటి మాంద్యగరిమన్ భేదించి, సిచానుదా
స్యాధారంబును జెండి దేవతలయ ట్లాద్వీపమున్ జేరి, శ్రీ
నాథున్గొల్తము వీతకల్మషులమై నౌకాసహాయంబునన్.

గమనవేగమున భంగపరంపరలు డింది చన్నీటితుంపురల్ చదల కెగయ
ఇరుచక్కి నాడు గ్రొవ్విరి టెక్కెముల నాని పిల్లగాడుపు లుల్ల మొల్లవీవ
పాదపీడన కుబ్బువారు పెన్నీటిపైఁ గనులువిందుగ మత్స్యగణము లలర
అనుకూలయానచిహ్నము లుల్లసిలు దిశాష్టకముతో నభము గౌతుకము నింప
త్రికరణములు సేదఁదేరి తుష్టినిబొందఁ-గా నపూర్వసౌఖ్యగరిమ నొంది,
ప్రకృతిఁ గనుచు "డెక్కు" పై, నిచ్చమెయి-విహారము నొనర్త మిటకు రాఁగదోయి!

నాఁడు వోఁడిఁ గిల్గు సోదరుల పోరులు చిక్కఁబడగావు, దాస్యదు
ర్భరకలుషుంపవై జనని పాదయుగంబులఁ గొల్వరాదు, నీ
కేలుక రవరా లేదె? విజయేందిరఁ గైకొను వీలుగల్గు నీ
తిరుణముఁ జూరపుచ్చెదవు, పజ్జులు నవ్వరె? యిట్టి చేఁతకున్.

కోరకంబుల దాఁటి కొదమ పుష్పోదిపిండు వినహరించు నదె పుష్పవిలాసుండా!
కాకసంభృతి మాని లోకమోహనగీతిఁ బైకరాజములవె పాడఁదొడఁగె!
తరుశాఖలను చేరి చెలఁసాలను బాసి చిగురాకులవె నిక్కఁబోసె హెచ్చి!
హిమరోధ మడఁగించి సుముకీర్ణసీమముఁబై భువనాపుఁ జెచె! కాంతిఁ బొడవుసూపె.
సమయ మారసి, గాంధీప్రశస్తశక్తి-నిర్మితంబగు నొక యీ నెలవుఁ జేరు
వేగ నాగోహ ముసరించి, విపులదాస్య-వనముఁ దరియింపు మిఁకనైన, భరతపుత్రి!

మాఁటలక్ గాలము చాల సేవగకే; పేర్మిఁ గూయఁగాసాగె; నా
కారాజం బదె! సాత్త్వికంబులగు యోగ్యస్వీయవస్తువ్రజం
బారూఢిన్ వెనువెంటఁ జేకొనుచు రమ్మా! జన్మసాఫల్య మిం
పారన్ గ్రోలి సుఖింతుగాని, యట స్వేచ్ఛామూల్యవాతాంబువుల్.

అదను వేచి, యరిగి రాజ్వాపసీమకు-నాటివారు మున్నె జననిఁ గొలువ,
చనదు నీకు నిలువ, స్వాతంత్ర్యయాత్రకై-పలుగువారు మోయి! భారతీయ!

---

# నిర్వేదము

దుర్గమహంతి సోదరకవులు

సకలకామ్యప్రదాయకమైన కల్పవృక్షము వోయె ననెడు విచారముననో!
కలుషహారిణి వియద్గంగాతరంగిణిన్ విడచి చన్నట్టి నిర్వేదముననో!
సురభిప్రసూనసంభరితమౌ నందనోద్యానముం బాసెడు దైన్యముననో!
అర్థిసౌఖ్యనిధాన మగు కామధేనువుం గోలుపోయినయట్టి కోపముననో!
సకలభోగాశ్రయంబైన స్వర్గరాజ్య-రమ పరాధీన మగుచు విరాజిలుటనో!
దానవానీకకృతదుఃఖితస్వహృదయు-లగుచు; మొఱవెట్టుచున్నార లమరవరులు.

సుమసుకుమారాంగు లమరరామామణుల్ బలుబాములం జిక్కువడుదు రనుచు
సముచితోపాయవిశారదుండగు గురు కౌశల్యమున మేలు కలుగ దనుచుఁ (?)
గొండరెక్కలు గుండపండి సేయగఁజాలు కులిశధారాశక్తి కుంగు ననుచు

సంతతభోగనిస్తంద్రుండు దేవేంద్రుఁ డిష్టకష్టములపా లగుచు నటంచు
రామణీయకమగు స్వర్గరాజ్యలక్ష్మి దనుజాలకుఁ జిక్కి శోభను దక్కె ననుచు
నిన్ని యుగచాటు లొదవునం చెవ్వఁ డెఱుఁగుఁ-గాలముం గర్మముం బ్రబలమైన
నెంతటి మహాత్ములకుఁ గూడ నెగ్గు లొదవు.

క్రతుకర్మరచనానియతులైన సోమపానులకు భోగ్యంబైన సుకృతభూమి
హర్యక్షవిక్రమఘనుల్ సంగ్రామ-శూరులు నివసించు వీరభూమి
నిగ్రహానుగ్రహసమర్థులౌ సత్కవి-పుంగవుల్ మెలఁగెడు పుణ్యభూమి
ముల్లోకముల నేలు ముఖ్యుండు మఘవుండు-పరిపాలన మొనర్చు భాగ్యభూమి
కామధేనుమందాకినీకల్పతరువి-రాజితంబగు స్వర్గసామ్రాజ్యభూమి
సురవిరోధిసమూహవశీకరణ మయ్యె ననుచు శోకింపుచున్నార లమరవరులు.

---

అసమాన సాంగత్యము



# ౨. సారస్వతము

## సువర్ణ యుగము

**శ్రీ శేషాద్రిరమణ కవులు**

ఆంధ్రవాఙ్మయమునకుఁ బ్రాణభిక్షపెట్టిన చాళుక్య రాజులు భాషాసేవకులకు వందనీయులు. ఆంధ్రభాషలోఁ గవిత్వమువ్రాయుటకుఁ బండితులను బ్రోత్సహించి ప్రత్యేకవ్యక్తిత్వమును భాషకు వీర లొసంగుట చేతనే నిరవలంబనముగా నున్నను బ్రాకృత మాంధ్రసారస్వత మిన్నివిధముల వికాసవంతముగ నలరార నవకాశము లభించినది. చాళుక్యకాలములో బయలువెడలిన గ్రంథరాజములలో మొదటిది మన మెఱింగినంతలో భారతము; చివరది కావ్యాలంకారచూడామణి. మహదైశ్వర్యముతో విపులసామ్రాజ్య భారముతో నిరవకాశుఁడయ్యు రాజరాజు నన్నయ్యభట్టారకుని భారత రచనమునకుఁ బ్రేరేపి వాకొన్న అమృతప్రాయ వాక్యములు ప్రాతస్స్మరణీయములు.

"ఇవి యేనుఁ సతతంబు నాయెదఁ గరం
బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ మహీ
యఃప్రీతియుఁ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదా
బ్జధ్యానపూజామహో
త్సవముఁ సంతత దానశీలతయుశ
శ్వత్సాధు సాంగత్యముఁ"

చాళుక్యరాజ్యము ఛిన్నభిన్నమై పరాధీనమైన కాలమునఁ జిన్నరాజ్యములతోఁ గాలముగడుపుచుఁ దమ వంశపరంపరాగతమగు భాషాభిమానమును బురస్కరించుకొని లక్ష్యలక్షణ సమన్వితముగఁ గావ్యాలంకార చూడామణియను దొమ్మిదియుల్లాసముల గ్రంథమును విన్నకోట పెద్దనచే వ్రాయించిన చాళుక్యాభరణుఁడగు విశ్వేశ్వర భూపతి ఈ వంశజుల వాఙ్మయచరిత్రమునకుఁ గడపటివాఁడు. నన్నయ్యభట్టారకుని కవిత నిసర్గమనోహరము. సమకాలికుఁడగు నారాయణభట్టు ఆంధ్రభాషలోఁ గవియే కాని యాతని గ్రంథములకు మనము నోఁచికొనమైతిమి. ఈ యిరువురియనుంగు చెలికాఁడగు పావులూరిమల్లన ప్రౌఢకవి. కాని యాతఁడు వ్రాసినది గణితశాస్త్రము గావునను, కవితాకళ కంత సంబంధము లేనిది గావునను వాఙ్మయమున నాతనికి స్థిరముగుదావు లభింపకపోయెను. తరువాతికవులలో నెవరికివారు ప్రత్యేకవీరులు. పాలకురికి సోమనాథుఁడు, తిక్కనసోమయాజి, ఎఱ్ఱాప్రగడ, నన్నెచోడుఁడు, నాచనసోమనాథుఁడు, భాస్కరాదులు మున్నగుకవు లొకరికొకరు దీసిపోవరు. తారతమ్యచర్చకుఁ గడంగితిమేని యగ్రస్థానము ఇందుఁ దిక్కనసోమయాజికె. ఇది పదియవ శతాబ్దినుండి పదమూఁడవ శతాబ్దము వఱకుఁ గల వాఙ్మయ చర్చాలేశము. ప్రకృతమునకు నత్తము.

ఆంధ్రవాఙ్మయచరిత్రమున సువర్ణయుగమని చెప్పదగినది సర్వవిధములఁ బదునేనవశతాబ్దమని మావిశ్వాసము. ఆంధ్రులలో నిక్కమగు పౌరుషము, ఆంధ్రకవులలో మహత్తరమగు నుపజ్ఞ ఆంధ్రవీరులలో నపూర్వమగు నుత్సాహశక్తి, ఈశతాబ్దముననే వెల్లివిరిసెను. ఆనాటి యాంధ్రజాతీయతావికాసములు, ఈనాఁడు లక్ష్యమునం దుంచుకొనుట భవిష్యదభివృద్ధిసూచకము.

### రాజకీయ పరిస్థితులు

పదునేనవశతాబ్దమున ఆంధ్రదేశమున రాజకీయ పరిస్థితులు మిగులదుర్భరముగా నుండెను. ఆంధ్రులపాలిటి పెన్నిధియనఁదగు ఆంధ్రసామ్రాజ్య మస్తమించెను. ఆంధ్రత్వమునకు సర్వస్వము ధారబోసిన ప్రతాపరుద్ర చక్రవర్తిని యవనులు బంధించి కొనిపోయిరి. చిరకాలోపార్జితమగు నాంధ్రసామాజ్యముతో నాంధ్రులసంపద, ఉత్సాహము కార్యదీక్ష కడబట్టెను. గ్రంథభాండారములు తగులఁబెట్టఁ బడెను. దేవళములు నేలమట్టమయ్యెను. ఇంతయేల? కడుపులోఁ జల్లఁ గదలక సురక్షితముగ నున్న ఆంధ్రులు కాకతీయసామ్రాజ్య విచ్ఛిన్నముతోఁ జెల్లాచెదరైరి. హరిహరరాయాదులు నూతనరాజ్యస్థాపనమునకు విద్యానగరప్రాంతముల కేగిరి.

కాటమరెడ్డి ప్రభృతులు కృష్ణా గోదావరీమధ్య భాగమున నూతనరాజ్యము స్థాపించిరి. పతనమైనయాంధ్రసామ్రాజ్యమును బునరుద్ధరించి రేచర్లగోత్రుఁడగు అనపోతనాయకుఁడు జాతీయపతాకమును నిలువబెట్టెను ఈ పరిస్థితులలో నీముగ్గురు రాజ్యనిర్మాతలకును, బొత్తులు కుదురలేదు. పరస్పర ద్వేషములు, సంగ్రామములు. ఈయవకాశములలో యవనుల దండయాత్రులు, ఎల్లప్పుడు అశాంతియే. పరిపాలనవిధానమున నెట్లున్నను కవుల కీయుగమునుండియే వికాస మంకురించెను. ఆంధ్ర సామ్రాజ్యమహావృక్షము యవనమారుతనుచే మొదలంట విరిగిపడెను. వేళ్లబలముచే మూలమున నీమూఁడు శాఖలు బయలువెడలెను. మూఁడును అభివృద్ధికివచ్చెను. కవికోకిలముల కీశాఖాత్రితయము సర్వవిధముల శరణ్యమయ్యెను. ఈముగ్గురు స్వతంత్ర రాజుల కుటుంబములలో జనించి భాషాభిమానులగు సమకాలికరాజులు ముగ్గురు గలరు. విద్యానగర రాజ్యమునుండి ప్రౌఢదేవరాయలును ఓరుగల్లు రాజ్యమునుండి సర్వజ్ఞసింగ భూపాలుని, కొండవీటిరాజ్యమునుండి పెదకోమటి వేమభూపాలుని గైకొని ఈసమకాలిక రాజత్రితయము గావించిన వాఙ్మయసేవ గమనింతము. విరాగశీలుఁడగు బమ్మెరపోతరాజు దక్క మిగిలిన కవిరాజులందఱు నీయుగమున నీమూఁడు రాజ్యముల నేలుప్రభువులనో, రాజప్రతినిధులనో, రాజకీయోద్యోగులనో యాశ్రయించి జీవితము గడిపిరి.

### పదునేనవ శతాబ్దిలోని కవులు

అమరేశ్వరుఁడు, మడికిసింగన, జక్కన, శ్రీనాథుఁడు, బమ్మెరపోతరాజు, గణపతిదేవుఁడు, వల్లభరాయఁడు, నిశ్శంకకొమ్మన, గౌరనమంత్రి, దగ్గుపల్లిదుగ్గన, పినవీరభద్రుఁడు, నందిమల్లయ్య ఘంటసింగయ్యలు, నాగనాథుఁడు, భైరవుఁడు, నారాయణకవి మొదలగువారీశతాబ్దిలోని యాంధ్రకవులు. అరుణగిరినాథుఁడు, పెదకోమటివేముఁడు, కుమారస్వామి, వామనభట్టబాణుఁడు, నరసింహకవి, విశ్వనాథకవి, కోలాచల మల్లినాథుఁడు, మామిడిసింగన, సర్వజ్ఞసింగభూపతి, విశ్వేశ్వరుఁడు, ముమ్మడి దేవరాయలు, బొమ్మకంటి అప్పలాచార్యులు, మున్నగువారీశతాబ్దములోని సంస్కృతకవులు. వీరల ప్రజ్ఞాప్రతిభాదులను వర్ణించుట కిది తావుగాదుగాన విడువక తప్పదు.

పదునేనవ శతాబ్దమునందుఁ గవులు పలువురు గలరు. విప్లవములలో నాఁటిగ్రంథము లెన్నియో నశించుటచే లక్షణగ్రంథములవలన వానినామములుమాత్రమే వినవచ్చుచున్నవి. ఆంధ్రసాహిత్యగృహమును వివిధవస్తుసంపూర్ణమొనరించిన కవులను, ఇందులకుఁ బ్రోత్సహించిన రాజులను మనము మఱువఁజనదు.

### కవుల ప్రతిభాదికములు

ఈశతాబ్దిలోనున్న కవులందఱిలో సమష్టిదృష్టితోఁ జూచినమేని శ్రీనాథకవి గొప్పవాఁడు. సంస్కృతాంధ్రములలో సమానముగఁ గవితఁజెప్పఁ జాలుదిట్ట. అత్యద్భుత మేధాశాలి. శాస్త్రపరిజ్ఞానమునం దీతఁడు అసాధారణుఁడు. తనకావల నాంధ్రవాఙ్మయము సర్వతోముఖముగాఁ బ్రకాశించుట కీతఁడే కారకుఁడు. దుగ్గనకవి శ్రీనాథునకు బావమరది. కానఁ దాను స్వయముగా నెఱింగినవాఁడు గాన శ్రీనాథు నిట్లు వర్ణించినాఁడు:

సీ. సంస్కృతప్రాకృత శౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతిసార్వభౌమ భాషితమహా
భాష్యవిద్యాసమభ్యాసబలము
అక్షపాదకణాద పక్షిలోదీరిత
న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమ స్మృతిసాంఖ్యసిద్ధాంత
కబళితస్ఫూర్తి గౌరవంబు
పూర్వకవిముఖ్య విరచితాపూర్వకావ్య
భావరససుధా చర్వణప్రౌఢతయును
కందళింపంగఁ గాశికాఖండమనెడు
నప్రముఖ వివిధప్రబంధము లొనర్చి.

— నాసికేతోపాఖ్యానము.

శ్రీనాథునికవిత కఠినముగనున్నను అన్వయసరళముంటచే సులభముగా బోధపడును. ఆతనివచనములం దొకవింత సొంపుగలదు. సీసపద్యకల్పనమున నితఁడప్రతిమానుఁడు. మూలానుసరణముగు నాంధ్రీకరణమునకుఁ ద్రోవదీసినవాఁ డితఁడే. ఇంకనేల! వాఙ్మయమునఁ గల యన్నిశాఖలలో నితఁ డప్రతిమానుఁడే.

ఈశతాబ్దమునను ద్విపద యనాథముగ స్పర్థక వచ్చినది. ఆంధ్రభాషలో గౌరనహరిశ్చంద్రచరిత్రమును మించిన ద్విపదకావ్యము లేదు, ఇందలికరుణరసము, కవితాధోరణి, మనోహరభావములు, కల్పనాసౌష్ఠవము అప్రతిమానము. ఈతని నవనాథచరిత్రముగూడ నిట్టి యోగ్యతగలదె! పదునేనవ శతాబ్దిలోని లక్షణగ్రంథములలో విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణి, భైరవుని కవిగజాంకుశము, గౌరనలక్షణదీపిక, సర్వజ్ఞునిరసార్ణవసుధాకరము పేర్కొనఁదగిన గ్రంథములు. రసార్ణవసుధాకరము సంస్కృతగ్రంథమైనను సులభముగ, సుబోధముగ నున్నది. సంస్కృతవచనరచనమున బాణుని తరువాత మరల నంతవాఁడు జనింపలేదట. ఆకొఱంతదీర్చినాఁడనని సగర్వముగాఁ జెప్పుకొన్న వామనభట్టబాణుఁ డీకాలమునఁ గొండవీటనున్నవాఁడు. భావసామ్యము శ్రీనాథుని గ్రంథములకు, నీతని గ్రంథమునకుఁ గానవచ్చును. ఈయుభయులలో నొకరు ఆస్థానకవి. వేఱొకరు విద్యాధికారి. వీరలను బోషించిన కోమటిపేమారెడ్డి వ్యాఖ్యాతృశిరోమణి యేగాదు; సర్వజ్ఞచక్రవర్తి. వీరలు మువ్వురు మూర్తిత్రయమునకుఁ దీసిపోనివారలు. అమరేశ్వరునికవిత అమృతస్యంద. ఈతనివిక్రమసేన మింతవఱకును లభింపలేదు. ఉపలభ్యములగు నుదాహృతపద్యములవలన నితఁడు ప్రౌఢకవియనియు, మాళవదేశాధీశ్వరుఁడగు విక్రమసేనునికథను బ్రబంధముగ వ్రాసియుండుననియుఁ దెలియుచున్నది. ఆంధ్రకవులలో ననంతామాత్యునికవితలో నొకవిం[illegible] మిమిడియున్నది. తేటతెనుఁగుమాటలను గూర్చుటలో నితఁడు మిగుల నేర్పరి. కవితలోఁ గఠినపదము గానరాదు. శ్రీనాథునికవిత యెంత జటిలముగనుండునో యనంతునికవిత యంత మృదులముగ నుండును. ఈతని భోజరాజీయ మాంధ్రభాషకపూర్వమగు నలంకారము. కథలు చిత్రములుగ నీతిదాయకములుగ నుండును. ఇందలి యుపాఖ్యానములు సమ్మోహనము చాలవఱకు పంచతంత్రమును బోలియుండును. ముఖ్యముగ నిందలి అనుమతికథయు, గోవ్యాఘ్రచరిత్రము ఎన్నిమార్లు చదివినను దనివితీఱదు. దగ్గుపల్లిదుగ్గన, మల్లయసింగయులు, పినవీరభద్రుఁడు విద్యానగరసంస్థానాశ్రయులు. కవులలో నీమువ్వురివి మూఁడుత్రోవలు. మధురశైలిలో సరళధారతో సరసభావములతోఁ గవితఁ జెప్పువాఁడు దుగ్గన. ఈతఁడు ప్రబంధయుగమార్గదర్శకుఁడుగ నున్నాఁడు. పినవీరఁడో! వాణినారాణియన్న గండరగండఁడు. కవితలో, ధారలో, కల్పనాశక్తిలో నీతఁడు గడుసరి. ఈతని శృంగారశాకుంతలము స్వతంత్రగ్రంథమని చెప్పఁదగినది. సింగయమల్లనలు ప్రబంధకవితకుఁ ద్రోవదీసినవారు. వరాహపురాణము వీరలు ప్రౌఢముగఁ దెనిఁగించిరి. ప్రబోధచంద్రోదయనాటకమును మిగులశ్రమజేసి నాటకమును బ్రబంధముగఁ గూర్చువిధమును వీరు దొలుత ప్రకటించిరి. గణపతిదేవుఁడు శివయోగసారము రచించిన కవిరాజు. ఈయనకవిత సర్వ

అత్తరులన్నింటిలోకెల్ల రాజస్థానమాక్రమించిన

# ఓ టో దిల్ బ హా ర్ నే (రిజిష్టర్డు)

## వాడుడు. మట్టపురకముల వాడవద్దు.

కొన్ని చుక్కలు జేబురుమాలమీద గాని, మీదుస్తుల మీందగాని చల్లిన, అప్పుడే వికసించిన పరిమళమైన పుష్పములుగల తోటనుండి వచ్చు సువాసనలను పొందగలరు.

పండగలయందును, పర్వములందును, ఓటోడిల్ బహార్ నే వాడుడు.

వివాహాది సమయములందును వాడదగిన వరమని చెప్పవచ్చును. మీరు వ్యయపర్చు డబ్బునకు పూర్తిగా సంతృప్తి నొందెదరు.




కొనునప్పుడెల్లను

## ఓటో దిల్ బహార్

(రిజిష్టర్డు)

పేరును జ్ఞాపక ముంచుకొనుడు. లేనియెడల మట్టపురకములనిచ్చి వర్తకులు ఎక్కువ లాభమును పొందజూతురు.

## ఓటో దిల్ బహార్

సుగంధ ద్రవ్యములమ్ము వారందరి వద్దను దొరకును.

| | | | |
|---|---|---|---|
| $\frac{1}{2}$ ఔన్సు సీసా 1-కి | రు 2 0 0 | $\frac{1}{4}$ ఔన్సు సీసా 1-కి | రు 1 4 0 |
| 1 డ్రామ్ సీసా 1-కి | రు 0 12 0 | $\frac{1}{2}$ డ్రామ్ సీసా 1-కి | రు 0 8 0 |

నమూనా సీసా 1-కి రు. 0-2-0 సువాసనకార్డు వెల 1-కి అణా 1.

ప్రతిదానికి వి. పి. చార్జీలు ప్రత్యేకం. రు 0-6-0

సోల్ ఏజెంట్లు:—

# ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెని

**285, జుమ్మామసీద్ మార్కెట్, బొంబాయి 2.**



శ్రీ ఉప్పల సత్యనారాయణగారు, అనకాపల్లి.



శ్రీ అంగర వెంకటాచార్యులుగారు



శ్రీ దొంతంశెట్టి నాగేశ్వరరావుగారు



శ్రీ ఏనుగు తమ్మిరాజు గారు



శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రి గారు



కీర్తనాచార్య శ్రీ సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు



శ్రీ మత్పరమహంస జి. యస్. బి. సరస్వతీస్వాములవారు



శ్రీ దంతులూరు శ్రీరామచంద్ర రాజుగారు



శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారు



శ్రీమతి ఆకారపు రాజమ్మ గారు.



శ్రీయుత కొడిమెల కొండయ్యగారు

ఉచితము. ఉచితము.

## అందరకు నుచితముగా పంపబడును




ఈ గ్రంథమునందు శరీరవ్యాయామ విషయములు పూర్తిగా చర్చింపబడినవి. ఇందు నాయొక్కయు, నా శిష్యులయొక్కయు, పెక్కు పద్ధతులను సూచించు ఛాయాపటములుగూడ కలవు. దీనిని సమగ్రముగ పఠించితిరేని నా వ్యాయామ పద్ధతి మీకు బాగుగా బోధపడగలదు. ప్రతి భారతీయునకును దీని జదివిన మాత్రమున నూతనోత్సాహమును శరీరవ్యాయామాసక్తియు కలిగి తీరును. తపాలా ఖర్చులకు మాత్రము రు. 0-2-0 ల స్టాంపులు పంపితిరేని యీ గ్రంథము వెంటనే పంపబడును. దీన, మీ జీవయాత్రయందు నిస్సంశయముగ మార్పు గలిగితీరును. ఈ సమయము పోగొట్టుకొనకుడి. ఈ విషయము మీ మిత్రులకుగూడ తెలుపుడు. దీనిని జదివి ఆయురారోగ్యబలముల ననుభవింతురు గాక

ప్రొఫెసర్ యం. వి. కృష్ణారావు, అఖిల భారతీయ శరీర వ్యాయామమార్గదర్శి, పోష్టు బసవనగుడి, బెంగుళూరు సిటి.

## త్వరపడుడు! త్వరపడుడు!

ఆంధ్రగ్రంథమాల 10-వ గ్రంథము వెలువడినది

# ఆత్మకథ

## (గాంధిమహాత్మునిస్వీయచరిత్రము.)

ప్రథమ సంపుటము

క్రౌన్ సైజు, పుటలు ౩౫౦

మేలయిన కాగితము ముచ్చటలు గూర్పు అచ్చు.

అమూల్యమైన ఈగ్రంథమునకు వెంటనే ఆర్డరులు పంపుడు.

శతావధాని వేలూరి శివరామ శాస్త్రిగారు తెనిగించినది

వెల ఒక రూపాయ మాత్రమే.

తపాలాఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్రగ్రంథమాల,
నెం. 7, లింబుశెట్టివీథి మద్రాసు,

# వనౌషధిశబ్దార్థనిఘంటువు.

మూలికలయొక్క 38000 సంస్కృత శబ్దములకు తెలుగు అర్థములు కలవు. క్యాలికో బైండు వెల రు 2-4-0

## "భస్మ ప్రదీపిక"

ఇందు సమస్త ఖనిజములు శుద్ధిచేసి భస్మములుగ చేయు యూనానీ ఆయుర్వేద విధానములు కలవు. తులం 1 కి రు 500 లు కిమ్మత్తుచేయు భస్మములు కలవు. కాలికో బైండు వెల రు 2 లు.

## మహాభారత విమర్శన

పాండవులు భారతీయులు గాక త్రివిష్టపదేశీయులనియు, కౌరవరాజ్యార్హులు కారనియు, ద్రౌపది పంచభర్తృక కాదనియు, ద్రౌపది వస్త్రాపహరణగాథ యసత్యమనియు, శ్రీకృష్ణుడు లోకోత్తర వ్యక్తి యనియు ఇంకననేకవిషయములు చేర్చి "మహాభారత చరిత్రము" అను పేరులో నీవిమర్శగ్రంథము పండిత పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే వ్రాయబడినది ఇందు భారతకాల భరతఖండపటము ప్రత్యేకము అచ్చొత్తించి చేర్చబడినది. అందరును చదివి తీరవలెను. 260 పేజీల గొప్పగ్రంథము వెల రు 1-4-0 లు మాత్రమే.

రెడ్డిబదర్సు, రాయవరం తూర్పుగోదావరి జిల్లా.

# మదనకళ

వీర్యవృద్ధికి ఇది చాల నమ్మకమైన మందు. అనేక కారణములవలన అనేక విషయములలో సంభవించే ఇంద్రియ దౌర్బల్యమును, నీరసమును పోగొట్టి ఉత్సాహము చాకచక్యము, పూర్తియైన సంసారసుఖము కలిగించుటకిది ప్రఖ్యాతి పొందినది. స్త్రీలకు బుతుదోషముల తగ్గించి సంతానము నిచ్చును, మధురమైన మంచి రసాయనము. వెల డబ్బా రు 3 లు.

ఆనంద ఫార్మసీ, రాయవరము, గోదావరి.

విషములఁ బ్రౌఢముగా హృద్యముగా నుండును. మొన్నటి వఱకీకవి యత్యంతాధునికుఁ డని విశ్వసించితిమి. చిలుకూరి వీరభద్రరావుగారి యపూర్వపరిశోధనముచేఁ గవి ప్రాచీనతరుఁడనియు శ్రీనాథుని సమకాలికుఁ డనియు వ్యక్తమయ్యెను. మడికిసింగన బహుగ్రంథరచయిత. వల్లభరాయఁ డోరుగంటి వైభవ మకురరూపమునఁ బ్రతిష్ఠించిన దిట్ట. కొమ్మన వీరశైవకవిమణి, భైరవుఁడు లాక్షణిక వసంతము. వీరిగ్రంథములన్నియు సుప్రజ్ఞావిలసితములు; భావమనోహరములు; కల్పనాభూషితములు. ఇందఱికవు లొకకాలమునందుంట సుకృతము.

ఈకవులందఱును నొకయెత్తు; బమ్మెర పోతరా జొకయెత్తు. పోతరాజు గర్భదరిద్రుఁడు. బహుకుటుంబ భారవహుఁడు, నిరాధారుఁడు. ఇట్టివిపరీత దుర్గతులలోఁ దగుల్కొని భాగవతమంటి మహాగ్రంథము నెట్లురచింపఁ గల్గెనో తోఁచదు. సమకాలిక కవులందఱు, భోగభాగ్యములతోఁ దులతూఁగుచుండఁ దాను హృదయపూర్వకముగా దరిద్రమును బ్రేమించి తన బాహ్యదేహమును అష్టకష్టములపాలు జేసెను. సమకాలికులు రాజకీయావాగురములలోఁ దగుల్కొనియుండఁ దనకు రాముఁడు దక్క రాజు వేఱొకఁడు లేఁడని చెప్పినవాక్యము అభిమానశీలుఁడగు కవి నిత్యము పఠింపఁదగినది.

ఇమ్మనుజేశ్వరాధముల
 కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని
 చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతి
 శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు
 భాగవతంబు జగద్ధితంబుగన్.

మహాకవియగు పోతన భాగవతమున నితరులు చేయిజేసికొనవలసినస్థితి తటస్థింపక గ్రంథమంతయు సురక్షితముగ నున్న ఆంధ్రుల సుకృతమునకు మేరయే లేకుండెడిది. ఏమికర్మమొగాని భారతము, రామాయణము, భాగవతము అను నీమూఁడుగ్రంథములు బహుకర్తృత్వమునకుఁ బాలైనవి. భారతమునకుఁ గుదిరినట్లుఁ దక్కిన గ్రంథములకుఁ దగినకవులు లభింపకుంట గొప్పకొఱంత. పదునేనవశతాబ్దమున అయ్యలార్యుఁడు, ఫణిభట్టు, నాగనాథుఁడు, చెన్నమరాజు, వెన్నెలకంటి సూరనార్యుఁడు మున్నగు మహాకవు లింక నెందఱో కలరుగాని, వారిగ్రంథము లిపుడు మాటుమణఁగియున్నవి. ఈయమూల్యగ్రంథరత్నము లెపుడు లభించునో ఆంధ్రులపుణ్య మెపుడు ఫలించునో. సంస్కృతకవులఁగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. ఈశతాబ్దమునఁగల సంస్కృతకవులలో డిండిమభట్టు వామనభట్టబాణుఁడు మిగులఁ బ్రసిద్ధులు. అందఱికంటె మిగులఁ బ్రసిద్ధుఁడు కోలచలము మల్లినాథుఁడు. ఈతఁడు మహావిద్వాంసుఁడు. సమస్తవిద్యలీయనకు ముఖస్థము. మూలగ్రంథములోని భావము వెల్లడించి రసపరిణామముల నెఱింగించుటలో నీతనికిఁగల చతురత యేవ్యాఖ్యాతకును లేదు. కాళిదాసునిగ్రంథరత్నములకుఁ గువ్యాఖ్యాత లొనరించిన దోసఁగుల నీతఁడు తొలఁగించుటకై నూతనముగా వ్యాఖ్యలు రచించినాఁడఁట.

"భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యా విషమూర్ఛితా;
ఏషా సంజీవనీవ్యాఖ్యా తా మద్యోజ్జీవయిష్యతి"

ఈమల్లినాథుఁడు సర్వజ్ఞసింగభూపాలునిచేఁ గనకాభిషేకాది సత్కారముల నొందెనఁట. సంస్కృతభాషాప్రపంచమున మల్లినాథునకు నమస్కరింపనిమానవుఁడే లేఁడు. కుమారస్వామి సోమయాజియు వ్యాఖ్యాతలలో నెన్నఁదగినవాఁడు. పెదకోమటి వేమనృపాలుని వ్యాఖ్య మనోహరముగా నున్నది. అమరుకమునందలి శృంగారభావము నీతఁడు మనోహరముగాఁ జెప్పినాఁడు. ఉన్నవ్యాఖ్యలన్నింటిలో నీతనివ్యాఖ్యయే సరసమైనది. కాటయవేముఁడును వ్యాఖ్యాతలలోఁ బ్రసిద్ధుఁడే. ఇంక నీశతాబ్దిలో నెందఱెందఱో వ్యాఖ్యాతలు గలరు.

చాళుక్యులు, కాకతీయులు సమకూర్చిన సామ్రాజ్యములు భిన్నములు కాఁగానే రాజులు పునరుద్ధరించినట్లు మతవిప్లవములు దండయాత్రలమూలమున గ్రంథసముదాయము నశింపఁగనే కవులు పునరుద్ధరించిరి. ఇందఱుమహాకవు లొకశతాబ్దములోనుండి యాంధ్రసారస్వతమునకు సర్వతోముఖముగఁ గావించిన సేవకతననే ఆంధ్రవ్యక్తిత్వము నేఁటిదనుక నిలచినది. ఆకాలపురాజులో కావ్యకవితావినోదులు. విద్వాంసులో మహామేధాశాలురు, గ్రంథరచనాకౌశలురు. ఇన్నివిధముల వాఙ్మయమున కుపకరించిన యీపుణ్యకాలమును వాఙ్మయచరిత్రములో సువర్ణయుగమని చెప్పవచ్చును. ఈయుగమున బయలువెడలినదే నిజమైనకవిత. కవులలో నుద్రేకము భావనాశక్తి, ఉపజ్ఞ, ఔచితి నిజముగా నీ శతాబ్దముననే యున్నది. మనదురదృష్టవశమున నీశతాబ్దమున రచింపఁబడిన గ్రంథము లెన్నియో యంతరించినవి. ఎడతెగనిసంగరములలోఁ దొలుత మన దేవళములు, పిదప మనగ్రంథములు బలియయ్యెను. హతశేషములగు గ్రంథము లెందేనియున్ననేమో శోధించి సర్వాంగసుందరమగు నాంధ్రభాషను అలంకరించుటకు ఆంధ్రసోదరులారా, మన మొక్కమా ఆసువర్ణయుగమును స్మరించి ప్రాచీనగ్రంథ సంపాదనమునకు బయలుదేఱుదమా!




ఉపన్యాసధోరణి

# ఆంధ్రులు—సంస్కృతవాఙ్మయము

అమరవాది హనుమచ్ఛాస్త్రి గారు, యం. ఏ.

ఆంధ్రవాఙ్మయచరిత్రను గూర్చి సంపూర్ణముగాఁ దెలిసికొనఁ గోరినచో, దానికిని ఇతరవాఙ్మయములయొక్క చరిత్రకును గల సంబంధ మెట్టిదో, మన ఆంధ్రులు వాఙ్మయాభివృద్ధి కెంతవరకుఁ దోడ్పడిరో తెలిసికొనుట అగత్యము. ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి సంబంధించిన యితర వాఙ్మయములలో ముఖ్యమైనవి సంస్కృత కన్నడ వాఙ్మయములు. ఇందులో మొదటిదానికిని తెలుగువాఙ్మయమునకును, అత్యంతసన్నిహితసంబంధము—సాక్షాత్తు జన్యజనకసంబంధమే అనుచున్నారు—ఉండుటచే, అనేకవిధముల మనవాఙ్మయమునకు మాతృస్వరూపముగ నున్న దీ గీర్వాణవాఙ్మయము. అందుచే, ఈగీర్వాణ వాఙ్మయరచనయం దెంతవరకు, ఆంధ్రులు పాల్గొనిరో తెలిసికొనినఁ గాని, ఆంధ్రవాఙ్మయచరిత్రను గురించి సమగ్రమయిన జ్ఞానము మనకు లభించినట్లు తలంచుటకు వీలు లేదు.

వాఙ్మయచరిత్రకారులు గీర్వాణవాఙ్మయమునంతను, ద్విధావిభజించిరి. మొదటిది వైదికవాఙ్మయము. రెండవది లౌకికవాఙ్మయము. ఇందు మొదటిదానిలోఁ దెలుఁగువార లెంతవరకు కృషి సల్పిరో తొల్త విచారింతము గాక.

వేదవేదాంగాదు లన్నియుఁ జేరి వైదికవాఙ్మయ మగుచున్నది. ఈవైదికవాఙ్మయ మంతయు, ఆర్యులు సింధునదీప్రాంతములను గంగాతీరమందునను వసియించియున్నప్పుడు రచియింపఁబడిన దని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇట్టి వాఙ్మయభాగములో ఆంధ్రులు పాల్గొనినది లే దనియే చెప్పవలసియున్నది. అయితే మనవారు ఈ పవిత్రవాఙ్మయమును జక్కఁగాఁ బోషించి రక్షించిరి.

“ఆంధ్రదేశమునందలి వేదవిదుల యాచారములు, మతము, వేదస్వరము, దయాసత్యశౌచములు భరతఖండమునం దెందైన మరియొకచోటఁ జూచుట దుర్లభము” అని విద్యాధికు లొకరు మన యాంధ్రావనినిఁ బొగడియున్నారు.

ఇది నిజముగ మనము గర్వింపవలసిన విషయము గదా.

ఈరీతిగ, మనబ్రాహ్మణోత్తములు వేదరక్షణము మాత్రమే గాక, వేదాంతమీమాంసాదిశాస్త్రములు, కావ్యనాటకాదులు, తరచి చూచి విశేషస్వతంత్రగ్రంథ నొనరింపకపోయినను, అనేకవ్యాఖ్యానగ్రంథముల రచించి గీర్వాణభాషను బోషించి కీర్తి నొందిరి.

వేదత్రయికి భాష్యము రచియించిన విద్యారణ్యస్వామి యాంధ్రుఁ డగుచున్నాఁడు. అప్పుడట నేగదా నేటివరకు నీయన యధివసించిన పీఠము, ఆంధ్రలోకమునకుఁ జెందియున్నది. ఆంధ్రమున బసవపురాణము రచించిన పాల్కురికి సోమనాథుఁడు ‘సోమనాథభాష్య’ మను పేరిటి వ్యాఖ్యానమును రచించి వేదవాక్కును సేవించినాఁడు.

* ఇంతియేల, సుప్రసిద్ధబౌద్ధాచార్యుఁ డగు నాగార్జునుఁ డాంధ్రుఁడు. విచారించినచో వీరివలె వైదికవాఙ్మయసంబంధమైన గ్రంథరచన మొనర్చిన తెలుఁగువార లనేకులు లేకపోలేదు.

చరిత్రకారులు విభజించిన రీతినిబట్టి సంస్కృతభాషలోని కావ్యనాటకాదులు, తర్కవ్యాకరణాదిశాస్త్రములును లౌకికవాఙ్మయమను పేరుతోనే వ్యవహరింపఁబడుచున్నవి. కనుక లౌకికవాఙ్మయమందలి, ఆంధ్రు లొనర్చిన కృషిని జూడఁదలచినచో, పైన పేర్కొన్న వివిధ వాఙ్మయభాగములందలి తెలుఁగువారు రచించిన గ్రంథములఁ బరిశీలింపవలసియున్నది.

గీర్వాణకావ్యచయమంతయు నుత్తరదేశీయులచేతను దాక్షిణాత్యులచేతను రచింపఁబడినది. కాళిదాసు, మాఘుఁడు, భారవి మున్నగు కావ్యకర్తలౌత్తరీయులు భాసుఁడు, విశాఖదత్తుఁడు మున్నగు నాటకకర్తలుఁగూడ నాంధ్రేతరులే యగుచున్నారు. కాని యింత మాత్రముచే నాంధ్రదేశీయులైన కవులు లేరని తలఁపఁజనదు. * ఉత్తరరామచరితము వ్రాసిన భవభూతి యాంధ్రుఁడే యని కొందర నుచున్నారు. *ఇట్లే కృష్ణకర్ణామృతము రచించిన లీలాశుకులు, కృష్ణలీలాతరంగిణి వ్రాసిన నారాయణతీర్థులుగూడ దెలుఁగువారే యని

* 1 See Buddhistic reports, published by Satischandra Vidyabhushan of Calcutta.

* ఆంధ్రవాఙ్మయచరిత్రము page 409.

* ఆంధ్రవాఙ్మయచరిత్రము Page 409.

గొందరియాశయము. ఈవిషయమున నిదమిత్థ మని నిశ్చయించుట మాత్రము కష్టము.

గీర్వాణసారస్వతమందుఁ బనిఁజేయ నారంభించిన మొట్టమొదటి యాంధ్రులలో సుప్రసిద్ధుఁడు విద్యానాథుఁడు. ఈతని నిజనామము "అగస్త్యుఁడు" సంస్కృతమున 14 నాటకము లీతనిచే రచింపఁబడినట్లు తెలియుచున్నది. ఈమహాకవి కావ్యాలంకారసంగ్రహమను నలంకారశాస్త్రగ్రంథమును రచించి ఓరుగంటి వీరప్రతాపరుద్రున కంకితమిచ్చి ప్రతాపరుద్రయశోభూషణ మని పేరిడినాఁడు. అప్పటినుండియే యితనికి 'విద్యానాథమహాకవి' యను బిరుద మబ్బినది.

ఈవిద్యానాథుఁడేగాక ఓరుగంటియాంధ్రరాజులకాలములో మరికొందరు కవులు సంస్కృతమున గ్రంథముల రచియించిరి. పైనిఁ జేర్కొనఁబడ్డ పాల్కురికి సోమనాథుఁడు గూడ నిక్కాలములోనివాఁడే. సంస్కృతమునకు వ్యాసుఁ డెట్లో, ఆంధ్రభాష కితఁ డట్టివంటివాఁడు. వీరశైవమునకల్పకుఁడైన యీకవి, ఆంధ్రమున నేకాక, సంస్కృతకన్నడములందుఁ గూడఁ బెక్కుకావ్యముల రచించెను. ఈతని సంస్కృతకృతులలో ముఖ్యమయినవి. "అనుభవసారము" 'బసవపంచగద్య' "సోమనాథభాష్యము."

ఏకశిలానగర్యు నాదరించి పోషించిన ప్రథమప్రతాపరుద్రదేవమహారాజుగూడ, సంస్కృతభాష నాదరించెను. కవులను బ్రోత్సాహపరచుటయేగాక తాను స్వయముగా కర్ణాటకాంధ్రసంస్కృతభాషలందుఁ బాండిత్యము కలిగి విద్యాభూషణుఁ డను బిరుదు నంది, కొన్ని కావ్యములఁగూడ రచించెను. సంస్కృతమున నీరాజు నీతిసారమను గ్రంథము వ్రాసె నని బద్దెనకవి యను ఆంధ్రకవి యొకఁడు తన గ్రంథములోఁ జెప్పుకొనియున్నాఁడు.

సంస్కృతవాఙ్మయములోఁ దెలుఁగువా రొనర్చిన కృషి యెక్కువగా శాస్త్రరచనయందే గన్పట్టుచున్నది. ముఖ్యముగా వ్యాఖ్యానరచనయందును, అలంకారగ్రంథరచనయందును మిక్కిలి పేరుగాంచినా రాంధ్రులు. పంచకావ్యములకును సమగ్రమైన, వ్యాఖ్యానములఁ జేసి యశోధనుఁడైన మల్లినాథసూరియుఁ ఆంధ్రుఁడే. తెలగాణ్యబ్రాహ్మణశాఖకుఁ జెందినవాఁడనియు పెద్దిభట్టను పేరిట చిన్నతనమందుఁ బిలువఁబడియెడి వాఁడనియుఁ జెప్పుచున్నారు. ఒక్కకావ్యములకేగాక 'ఏకావళి' యను నలంకారగ్రంథమునకు గూడ 'తరళ' యను వ్యాఖ్యానమును వ్రాసినాఁడు. అన్ని శాస్త్రములయందును నమూలంకషమైన పాండిత్యము గలిగి మహామహోపాధ్యాయుఁడై వెలసినాఁడు. 14 వ శతాబ్ద మీయన జీవించియున్నకాలము. నాఁడుమొదలు నేఁటివరకు ఈతని వ్యాఖ్యానములే సర్వజనశరణ్యములై యొప్పుచున్నవి.

ఈమల్లినాథసూరి పుత్రుఁడగు కుమారస్వామియే ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యానము వ్రాసినవాఁడు. రత్నాపణ మని దీనికిఁ బేరు.

సంస్కృతాలంకారశాస్త్రమునందు, అదివర కున్న సిద్ధాంతములన్నియుఁ దలక్రిందు చేసి, తనమతమునే సిద్ధాంతీకరించి చిరయశోభూషితుఁడైనవాఁ డాంధ్రుఁడు. అతఁడే జగన్నాథపండితుఁడు. అదివరకు నొకరీతిగాఁ బరిణామము జెందియున్న అలంకారశాస్త్ర మంతయు నొక్కసారిగా ఖండించి తన రససిద్ధాంతమును నిల్పినాఁడు. ఒక్కయలంకారశాస్త్రముననే కాదు, అన్ని శాస్త్రములందుఁ గూడ స్వతంత్రించి క్రొత్తతెన్నుల త్రొక్కినాఁడు. భట్టోజిదీక్షితులు రచించిన మనోరమ యను వ్యాకృతిగ్రంథమునకు 'మనోరమాకుచమర్దన' మను ఖండనగ్రంథమును జేసినాఁడు. అప్పయదీక్షితులుగారి 'చిత్రమీమాంస' యను అలంకారగ్రంథమునకు "చిత్రమీమాంసాఖండనము"ను జేసినాఁడు.

కేవలశాస్త్రరచన మేకాక అతిమనోహరమైన కావ్యములనుగూడఁ జెప్పినాఁడు. ఇతని కవిత్వము మిక్కిలి రసవంతమైనదై విరాజిల్లుచున్నది. భామినీవిలాస మను గ్రంథములో, తాను ప్రేమించిన 'లవంగి' యను సుందరి విషయమై చెప్పుకొన్నాఁడు. 'జగదాభరణ'యను గ్రంథమునందు ఢిల్లీపాదుషాయగు దారాప్రభువును స్తుతించినాఁడు. 'అసఫవిలాసము' నందు షాజహాన్ దర్బారులోనున్న 'నవాబ్ ఆసఫ్ ఖాన్', అనునాతఁడు తనకొనర్చిన యుపకృతిని కృతజ్ఞతతోఁ గీర్తించినాఁడు. ఇవిగాక 'కరుణాలహరి' 'గంగాలహరి' 'సుధాలహరి' 'లక్ష్మీలహరి' 'యమునావర్ణనచంపు' 'ప్రాణాభరణము' అను నీలోనుగాఁగల పెక్కుగ్రంథముల ననేకముల రచించి నంఖ్యుఁడై వెలసినాఁడు. ఈతని కీర్తి యాచంద్రతారార్కము నిలచిపోయినది. ఈతని జీవితమునుగూర్చి యనేకములు విచిత్రగాథలు గలవు. అవన్నియుఁ దెలిసికొనఁదగినవే యైనను విస్తరభీతిచే వదలవలసివచ్చె.

ఈజగన్నాథకవి తన రసగంగాధరమునఁ దాను లక్ష్మీపేరుభట్టుల పుత్రుఁడ నని చెప్పుకొన్నాఁడు. విచారించగా, ఇతఁడు వేగినాటిబ్రాహ్మణుఁ డనియు నింటిపే రుపద్రష్టవా రనియు జన్మస్థలము కోనసీమలోని ముంగొండ యను గ్రామ మనియుఁ దెలియుచున్నది. ఈకవి ఢిల్లీపాదుషా యగుఁ 'షాజహాన్' ఆస్థానమున నుండి యచ్చటనే పండితరాయ లను బిరుదమును గాంచినాఁడు.

ఈవిద్యానాథజగన్నాథులేగాక, అలంకారశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడిన తెలుఁగువార లింక ననేకులు గలరు. కొందరు స్వతంత్రముగా నలంకారగ్రంథముల రచించియు, కొందఱు సుప్రసిద్ధాలంకారగ్రంథములకు వ్యాఖ్యానములు జేసియు వాఙ్మయసేవ నొనర్చినారు.

అచ్యుతరాయ లనునాతఁడు సాహిత్యసార మను నలంకారగ్రంథమును తద్వ్యాఖ్యానమైన సరసామోదమునుగూడ రచించినాఁడు. ఈయనకే 'అచ్యుతశర్మ' యనియునుఁ బేరు. ఈగ్రంథకర్త శాలివాహనశకము 1758 నాటి వాఁడు. అనేకకారణములచే నీయనయును, జగన్నాథుని భామినీవిలాసమునకు ప్రణయప్రకాశవ్యాఖ్యను వ్రాసిన

చ్యుతరాయఁడును ఒక్కరే యని తేలుచున్నది. అచ్యుతరాయ కృతమని "భగీరథచంపు" అనునది కలదు. అదియు నేతత్కవికృతమే.

శింగరాచార్యుని పుత్రుఁడగు అనంతరాయఁడు గూడ తెలుఁగు నాటివాఁడే. ఈతని గ్రంథమునకును గవిసమయకల్లోల మని వ్యవహృతి. ఇందులో నరసింహునియొక్క 'నంజరాజయశోభూషణ' మునుగురించి యు, విద్యానాథుని ప్రతాపరుద్రీయముఁ గూర్చియు, ధర్మసూరియొక్క సాహిత్యరత్నాకరముఁ గూర్చియును, ప్రసక్తి కలదు గాన, ఆకవులకుఁ దరువాతి వాఁడనకఁ దప్పదు. కాఁగా 14వ శతాబ్దివాఁడు. కృష్ణరాయయశోడిండిమ మను గ్రంథమును గూడనీకవియే రచించినాఁడు.

అలంకారశాస్త్రమందు ముఖ్యమైన సాహిత్యరత్నాకరగ్రంథమును రచించిన ధర్మసూరి గూడ నాంధ్రుఁడనియే తెలియుచున్నది. కొన్నిచోట్ల నాతనికి ధర్మసింహుఁ డనియు వ్యవహృతి యగుపడుచున్నది.[1] ఈతఁడు కాశీ బ్రాహ్మణకుటుంబమునకుఁ జెందినవాఁ డని కొందరనుచున్నారుగాని యది సమ్మతింపదగినది గాదు. ఇటీవల నీయన యింటిపేరు వారణాసివారని గూడ దెలియవచ్చుచున్నది. ఈయన యీయలంకార గ్రంథము లేగాక 'నరకధ్వంస' మను వ్యాయోగమును గూడ రచియించెను.

ఈకవి విద్యానాథునకుఁ దర్వాతివాఁడు. ఇట్లు చెప్పుటకుఁ గారణము విద్యానాథునిచేఁ జెప్పఁబడిన కొన్ని విషయముల నీతఁ డాక్షేపించుటయే. ఈగ్రంథమునకు 'నౌక' యను వ్యాఖ్యానముఁ జేసిన వేంకటసూరి గూడ నాంధ్రుఁడే. ఆతనివంశ మిట్లు తెలియుచున్నది. తండ్రి లక్ష్మణసూరి. తల్లి సూరమాంబ. తాత బ్రహ్మంతరవాణి. గురువు వేంకటాచార్యుఁడు.

విశ్వనాథకవి యను మఱియొక యాంధ్రుఁడు గూడ సంస్కృతమునఁ గొన్ని కృతుల నొనర్చినాఁడు. ఇతనిజన్మస్థలము గోదావరీతీరస్థమగు 'ధారాసురనగరము'. తండ్రి పేరు తిరుమలదేవుఁడు. తాత పేరనంతుఁడు. 1602 ఏ. డి. నాటివాఁ డీకవి. ఈతఁడు సాహిత్యసుధాసింధు వను నలంకారగ్రంథమును 'మృగాంకలేఖ' యను నాటకమును వ్రాసి పండితలోకమున కర్పించినాఁడు.

తెలుఁగునాట జన్మించిన లక్ష్మీధరదీక్షితులు 'అలంకారముక్తావళి' రసమంజరి యను గ్రంథముల రెంటిని వ్రాసెను.[2] ఈకవిజన్మస్థానము "కృష్ణాతీరస్థమైన చెరుకూర"ని చెప్పబడియున్నది నేటిబాపట్లతాలూకాలోని పెదచెరుకూరుగ్రామము, యిదియే యగుచున్నది. ఈలక్ష్మీధరకవియే 'షడ్భాషాచంద్రిక' యను ప్రాకృతవ్యాకృతిని అనర్ఘరాఘవప్రసన్నరాఘవములకు వ్యాఖ్యానములను రచించెను. దక్షిణామూర్తికింకర' అను బిరుదనామము ఈతని గృహనామముగా మారినది. సర్వాంబికాయజ్ఞేశ్వరు లీతని మాతాపిత లనియుఁ దిమ్మయసోమయాజి పితామహుఁ డనియుఁ దెలియుచున్నది. ఈలక్ష్మీధరసూరి విజయనగరప్రభువైన తిరుమలరాయనిచేఁ బోషింపబడి శ్రుతిమంజరి యను గీతగోవిందవ్యాఖ్య నంకిత మొనర్చెను. ఈకవి యన్నగారును గురువు నైన చెరుకూరి కొండుభట్టుని కుమారుఁడు యజ్ఞేశ్వరదీక్షితులు 'అలంకారరాఘవము' 'అలంకార సూర్యోదయము' 'సాహిత్యరత్నాకరము' రచించుటయేగాక మమ్మటుని కావ్యప్రకాశికు వ్యాఖ్యానము గూడ వ్రాసినట్లు తెలియుచున్నది. 'శృంగారసారావళి' కర్తయగు వేంకటనారాయణదీక్షితుని యింటిపేరు గొడవర్తివారు. తండ్రి పేరు కామేశ్వరవైదికుఁడు. తల్లి పేరు లక్ష్మీదేవి. ఈతఁ డెనిమిది భాషలలో గవిత్వము చెప్పినట్లు జెప్పఁబడియున్నది.

వీరలేగాక మఱికొందరు ఆంధ్రులైన యాలంకారికులు గలరు. వారినిజనామములు వారిగ్రంథనామములు తప్ప వారినిగూర్చి విశేషము లెవ్వియుఁ దెలియవచ్చుట లేదు. వామనసూత్రవృత్తికి 'కామధేను' వ్యాఖ్యానమును, వృత్తివార్తికవ్యాఖ్యానమును రచించిన తిప్పభూపాలుఁడును, 'నంజరాజయశోభూషణమును' రచించిన నరసింహకవియు, అలంకారేందుశేఖరము వ్రాసిన వేంకటనరసింహకవియు, రసనిరూపణకారుఁడైన నరహరిసూరియు, నాట్యశాస్త్ర సంబంధమైన గ్రంథము వ్రాసిన (గ్రంథము పేరు తెలియవచ్చుట లేదు.) శాతకర్ణియు వీరలలో ముఖ్యులు.

రెడ్డిప్రభువుల కాలములో నాంధ్రులచే గీర్వాణవాఙ్మయ మెక్కువగాఁ బోషింపఁబడినది. అప్పుడు రచింపఁబడిన వాటిలో ముఖ్యమైన కావ్యములు రసవత్తరములై మనోహరములుగా నున్నవి. వ్యాఖ్యానములు కూలంకషములై సుబోధకములుగా నున్నవి.

రెడ్డిరాజులలో సంస్కృతభాషను బోషించుట కారంభించినవాఁడు అనవేమారెడ్డిభూపాలుఁడు. ఈతఁడు సంస్కృతాంధ్ర భాషలయందు దక్కని పాండిత్యము గల్గి దానాదిసత్కార్యములచేఁ బండితుల రావించి, వారల బోషించి గీర్తిఁ గాంచినాఁడు

అనవేమారెడ్డి చనిపోయిన తర్వాత వెంటనే కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు రసికేంద్రుఁడు, నిత్యశృంగారప్రియుఁ డునేగాక కవియుఁగూడ నై యున్నాఁడు. సంస్కృతములోని 'వసంతరాజీయము' నాట్యశాస్త్రగ్రంథమును రచించిన దీయనయే. దీనినిఁ గూర్చి కుమారస్వామి తన రత్నాపణమునందును, మల్లినాథుఁడు మాఘవ్యాఖ్యానమునందును, సర్వానందుఁ డమరకోశవ్యాఖ్యానమునందునుఁ బలికియున్నారు. కావున నీగ్రంథము 14 వ శతాబ్దమునకుఁ దరువాతిది కానేరదు.

కుమారగిరిరెడ్డి ప్రభువునకు బావమరదియగు కాటయవేమన సంస్కృతమున కొన్నికృతు లొనర్చినాఁడు. కాటయవేమన కూరుఁడు

1 History of poetics by S. K. De, Page 299.
2 History of Poetics, by S. K. De-Page 310.

విద్వద్గోష్ఠీప్రియుఁడు, స్వతః విద్వాంసుఁడు. అట్టివాఁడు కాళిదాసకృతనాటకత్రయమునకు వ్యాఖ్యానముల రచించుటలో నాశ్చర్యము లేదు. ఈవ్యాఖ్యానములఁ గుఱించినట్టి యొక శ్లోకము ఇట్లుదాహరింపఁబడుచున్నది.

శ్లో॥ సోఽయం వేమవిభోః కుమారగిరిణా రాజ్ఞా నియుక్తః కృతీ। నాట్యానాం త్రితయం కృతం కృతధియా శ్రీ కాళిదాసేన యత్। తస్యోద్దీప్తరసార్ద్రభావ్యరసికశ్యాపుస్తులాదేశస్వయం। వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాడ్వేమాఖ్య మస్మై హితమ్॥

వీటిలో మొదటిదగు శాకుంతల వ్యాఖ్యలోని యీక్రింది శ్లోకము వసంతరాజీయమునుగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజాం। శాస్త్రాణి సమ్యగాలోక్య నాట్యవేదార్థవేదినామ్। ప్రోక్తం వసన్తరాజేన కుమారగిరిభూభుజా। నామ్నా వసన్తరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్॥

కుమారగిరిరెడ్డికి ప్రాఁత కొండవీటిరాజ్య మొసఁగినవాఁడు మనకు చాల ముఖ్యుఁడు. అతఁడే పెదకోమటివేమారెడ్డిభూపాలుఁడు. ఈతఁడు మిక్కిలి విద్యారసికుఁడును విద్వాంసుఁడు నగుటచే, ప్రఖ్యాతకవీశ్వరుల నాదరించి పోషించెను. ఇదిగాక స్వయముగ కవీశ్వరుఁడై ప్రాకృతసంస్కృతాంధ్రభాషలయందు గ్రంథరచనఁ గావించి 'సర్వజ్ఞచక్రవర్తి' యనియు 'వీరనారాయణుఁ' డనియు బిరుదు లంది శాశ్వతమైన కీర్తి వెలయించుకొన్నాఁడు. ఇతఁడొనర్చిన గీర్వాణభాషాసేవన మపారమైనది. సంస్కృతశృంగారకావ్యలక్ష్మీపట్టభద్రుఁడైన అమరుకునకు విపులమైన చక్కని వ్యాఖ్య రచించినాఁడు. అమరుకశతకము, మేఘసందేశము, ఋతుసంహారము ఇవన్నియు నొకతెగలో జేరినవి. ఉత్తమరసవత్కావ్యములు, అని పేరుగాంచినవి. ఇట్టి రసవత్తరశృంగారకావ్యమైన అమరుకమునకు శృంగారదీపికయను వ్యాఖ్యను రచించినాఁడు. ఎన్ని వ్యాఖ్యలున్నను శృంగారదీపికకే ప్రచారము మెండు. ప్రాకృతభాషలో రచింపఁబడిన శృంగారప్రబంధమైన 'శాలివాహన సప్తశతి'లోని నూరుముఖ్యగాథలకు వ్యాఖ్యఁ జేసినాఁడు. తన వ్యాఖ్యానారంభమున

శ్లో. హాలః ప్రాక్సప్తశతీం గాథాకోటేః వ్యధత్త సంప్రతి తు.
సోఽయం వేమనృపాలస్తస్యాపి శతక మాహరత్ సారమ్.

అనియు గద్యయందు 'ఇతి శ్రీ పెదకోమటివేమభూపాలేన కృతా సప్తశతీసారటీకా సమాప్తా' అనియుఁ జెప్పినాఁడు. ఈరాచకవియొక్క మూఁడవకృతి సాహిత్యచింతామణియను నలంకారగ్రంథము. ఈగ్రంథములోని గద్యయందు వీరనారాయణవిరచితమని యున్నది. ఆవీరనారాయణుఁడు మన కోమటివేమభూపాలుఁడే కావచ్చును. కావ్యప్రకాశవలెనే సమగ్రమైన గ్రంథ మిది. ఇందులో ధ్వని, శబ్దార్థము, ధ్వనిభేదము, గుణీభూతవ్యంగ్యము, దోషము, గుణము, అలంకారము అని సప్తాధ్యాయములుగలవు. వృత్తివార్తికములోను రత్నాపణవ్యాఖ్యలోను తలపెట్టబడిన సాహిత్యచింతామణి యిదియే. ఈగ్రంథములో కవి తన యితరకృతులఁ గూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు, 'యథా మమైవ భాణే,' 'యథా మమైవ కావ్యే వీరనారాయణచరితే' ఈవీరనారాయణచరిత్ర మాత్రము వామనభట్టబాణుని వీరనారాయణచరిత్రము కాదు. ఏలయన ఈరెండవది గద్యగ్రంథము. ఇందలి నాయకుఁడు వేమభూపాలుఁడు కావున సాహిత్యచింతామణిలోని లక్షణోదాహరణశ్లోకములు వీరనారాయణ పెదకోమటివేమభూపాలునియొక్క ప్రశస్తిని ప్రస్తావించునవియగుటచే ఈరాజే గ్రంథరచయిత కాదేమో యని శంక గలుగుచున్నది. కాని యట్లుగాదు. తనను గుఱించిన యితరుల శ్లోకము లీరాజకవి చేకొన్నాఁడు. ప్రతాపరుద్రీయ, రసగంగాధరాదులందలి లక్షణోదాహరణరీతి యట్టిదే. విషయద్వితీయములోని పీఠికాపద్యరచన మట్టిదే.

"యథా కాదంబరీనాటకే" యని పెక్కుచోట్ల శ్లోకము లుదాహరింపఁబడియున్నవి. ఈకాదంబరీనాటకకర్త యగు నరసింహకవి వెల్ల కాలములోని వాఁడే యని తెలియుచున్నది. ఈతనియన్న యగు విశ్వనాథకవియు ఈతఁడును గంగాధరకవిపుత్రులు. అగస్త్యకవి (విద్యానాథుఁడు) మేనల్లుఁడును. ఈవిశ్వనాథకవి సౌగంధికాపహరణ మను నాటకమును రచించెను.

పెదకోమటివేమభూపాలుఁడు "సంగీతచింతామణి" యను గ్రంథమును చేసి తనసంగీతపాండిత్యమును వెలిబుచ్చుకొన్నాఁడు. 'వీరనారాయణచరిత భాణము' అనునది సాహిత్యచింతామణి యుదాహృతి కావ్యమునకు నామాంతర మేమో? పెదకోమటివేమభూపాలుని కృతు లిట్టి వింకనెన్ని యున్నవో?

ఇట్లు తాను స్వయముగా రచించుటయేగాక ఆస్థానకవీశ్వరులచేగూడ రచింపించి గీర్వాణభాషాపోషణను గై సేసినాఁడు. ఈయాస్థానకవీశ్వరులలో వామనభట్టబాణుఁడు సుప్రసిద్ధుఁడు. హర్షచరితకాదంబరీకర్తయగు బాణుని తర్వాత గద్యకావ్యము లేవనియెడి కొఱత దీర్చుటకు వేమభూపాలచరిత మను గద్యకావ్యము రచించెను. ఇంతేకాక రఘునాథాభ్యుదయము, నలాభ్యుదయము అను కావ్యములను పార్వతీపరిణయము, శృంగారభూషణము, అను రూపకద్వయమును, హంససందేశ మను ఖండకావ్యమును, శబ్దరత్నాకరశబ్దచంద్రికానామక నిఘంటుద్వయమును మరికొన్నిగ్రంథములను రచియించి చిరకీర్తి గనెనని తెలియుచున్నది. ఇందు శబ్దచంద్రికలో నారంభమునందు తననుఁ గూర్చి "కోమటియజ్వపుత్రుఁడును వత్సవంశశిఖామణియునైన వామనభట్టబాణుఁడను" అని చెప్పికొని యున్నాఁడు.

వేమభూపాలుని యాస్థానమున గల భిషగ్వరులు, దైవజ్ఞశిఖామణులు గ్రంథముల రచించుటయేగాక యాతని మంత్రిసత్తముఁడగు

నామిశిసింగయయుఁ గూడ జ్యోతిశ్శాస్త్రగ్రంథమైన సోమసిద్ధాంతమునకు వ్యాఖ్య రచించినాఁడని ఈక్రింది శ్లోకపాదములవల్లఁ దెలియుచున్నది.

"పెదకోమటివేమేంద్ర మంత్రిణా సేన ధీమతా.........

.................................................

సింగయామాత్యరత్నేన ధీమతా లోకహితైషిణా, క్రియతే సోమసిద్ధాన్త వ్యాఖ్యా గూఢార్థదీపికా"

ఈరాజోత్తముని కాలమున, విద్యాశాఖాధికారిగానున్న మన కవిసార్వభౌముఁడు విద్యాసనాథుఁడు శ్రీనాథుఁడుఁ గూడ గీర్వాణభాషామతల్లిని సేవించి తనకృతజ్ఞత నెఱనేర్చుకొనినాఁడు. ఈతఁడు తెనిగించిన శ్రీహర్షనైషధమునకుఁ గలవ్యాఖ్యలలో మూఁడు ప్రసిద్ధములుగా నున్నవి. ఆమూఁడును తెలుఁగువారొనర్చినవే యగుచున్నవి. మొదటిది మల్లినాథసూరి రచించినది. రెండవ వ్యాఖ్యాత నరహరి నామాలంకృతుఁడు. విద్యారణ్యుల శిష్యుఁడననియు త్రిలింగదేశీయుఁడననియుఁ దాన చెప్పికొనియున్నాఁడు.[1] మూఁడవ వ్యాఖ్యాత శ్రీనాథుఁడు. గద్యయందు, "ప్రకాశనం యథాప్రజ్ఞం శ్రీనాథేన విధీయతే" యనియు. "ఇతి శ్రీమహోపాధ్యాయ శ్రీనాథాచార్య విరచితే నైషధప్రకాశే........." యనియు నున్నది. దీనినిబట్టి యీ శ్రీనాథుఁడు మన కవిసార్వభౌముఁడే నేమో యని సందియము. అనుగాముల నిర్ణయించుట యసాధ్యము.

ఇటుగాక శ్రీనాథుని సమకాలికులగు కొందఱు సంస్కృతకవులు తెలుఁగువారు గలరు. విశ్వేశ్వరకవిచంద్రుఁడు, బొమ్మకంటి అప్పయాచార్యుఁడు, నాదెళ్ల గోపన్న మంత్రి మొదలగు వారందఱు సంస్కృతమునఁ గృతుల నొనర్చిరి. తెలుఁగు కవులలో నొకఁడైన రావిపాటి త్రిపురాంతకుఁడు అను పేరుగల తిప్పనార్యుఁడు సంస్కృతమున 'ప్రేమాభిరామ' మను రూపకవిశేషమును వ్రాసినట్లు దానిని దెలిఁగించిన వల్లభరాయకవి చెప్పుచున్నాఁడు. ద్విపదకవి యగు గౌరన లక్షణదీపిక యను సంస్కృతాలంకారగ్రంథమును వ్రాసెను,

పై వర్ణించినరీతి, కొండవీటి రెడ్డిప్రభువులే కాక, ఆనెగొంది విజయనగరరాజ్యలక్ష్మిని బరిపాలించిన తెలుఁగు రాయలు కూడ సంస్కృత వాఙ్మయము నెక్కుడుగా నాదరించి పోషించిరి. ఆంధ్రభోజుఁడను శ్రీకృష్ణదేవరాయలు తెలుఁగునందే కాక సంస్కృతకన్నడములందు చక్కని గ్రంథముల రచించినట్లు విష్ణుచిత్తీయమునం దిట్లు వివరింపఁబడియున్నది.

"పలికితు త్ప్రేక్షోపమలజాతి పెంపెక్క
రసికులౌ నన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగ జై
వృతిని సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘనవృత్తులు విన్పుగ రచించితి సూక్తి
నైపుణిజ్ఞానచింతామణికృతి.
మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష......"

ఇట్లు శ్రీకృష్ణదేవరాయలే గాక, అతనిపూర్వులు గూడ సంస్కృతభాష నాదరించి పోషించిరి. విద్యానగరరాజ్యలక్ష్మిని స్థాపించిన బుక్కరాజే గీర్వాణభాష నాదరించి పోషించుట కారంభించెను. తొలుత నీరాజ్యస్థాపనకుఁ గారకుఁడైన విద్యారణ్యస్వామియే పైన వైదికవాఙ్మయమునకు పేర్కొనఁబడిన భాష్యకారుఁడగు విద్యారణ్యుఁడు. సన్యాసమునకు ముందీతని నామము మాధవాచార్యుఁడు. ఈయన జన్మస్థలము తుంగభద్రాతీరస్థపంపానగరము. బుక్కభూపాలుని కులగురువులును భారద్వాజసగోత్రులయిన తెలుఁగు బ్రాహ్మణులనియుఁ దెలియవచ్చుచున్నది.[2] ఈమాధవుఁడే వేదభాష్యము రచించి అన్నగారైన సాయణాని పేరు బెట్టెను. మాధవాచార్యకృతములైన గ్రంథములెవ్వి యన, పరాశరమాధవీయమను వ్యాఖ్యానము, కాలమాధవీ శంకరవిజయము, విద్యారణ్యము (భాష్యము) 108 ఉపనిషద్వ్యాఖ్య సర్వదర్శనసంగ్రహము, మాధవనిదానము ననునవి. ఇట్లు సాయణమాధవు లాంధ్రు లగుటచేతనే ఆంధ్రలోకము ధన్యమయినది.

పూర్వప్రభువులలో నొకఁడైన ప్రౌఢదేవరాయలు గీర్వాణభాష నెక్కుడుగాఁ బోషించి కీర్తిగాంచెను. ఇమ్మడిదేవరాయలకృతమని మహానాటకసుధానిధి యను కావ్య మొకటి కలదు. ఇమ్మడిదేవరాయలు, ప్రౌఢదేవరాయలు, ప్రతాపరాయ లనియు నొకరికే పేరు. ఈతని ఆస్థానమం దున్నవారిలో[3] డిండిమకవిసార్వభౌములు గొప్ప సంస్కృతకవులు. ఈ కవిసార్వభౌములు నలుగురుగా నున్నారు. మొదటివాఁడగు అరుణగిరినాథుఁడు యోగానందప్రహసనకారుఁడు. 2. డిండిమకవి పేరు రాజనాథదేశికుఁడు. సాళ్వాభ్యుదయము రచించెను. ఈతనికొడుకు 3. అరుణగిరినాథుఁడు, వీరభద్రవిజయమను డిమము రచించెను. ఈనలుగురిలో నొకరెవ్వరో విభాగరత్నమాల రచించిరి. వీరిచే వ్రాయఁబడిన సంస్కృతకావ్యవ్యాఖ్యలు—సౌందర్యలహరీవ్యాఖ్య-సత్యభామాపరిణయవ్యాఖ్య—సుప్రసిద్ధగ్రంథములు.

శ్రీకృష్ణదేవరాయల తరువాత రాజ్యముచేసినవారలలో సదాశివరాయలు ముఖ్యుఁడు. ఇతనికాలములోనే అనఁగా 1564 సంవత్సర

1. చూ. శృంగార శ్రీనాథము పు. 102.
2. కవిజీవితములు (వీరేశలింగకృతము) Vol 11 7 వ పేజీ.
3. Domicile andhras:—జన్మతః గాదుగానీ అయినను ఆంధ్రదేశనివాసులు కాబట్టి ముఖ్యాంతిక ఆంధ్రులే.

ప్రాంతములో జీవించియున్నాఁడు మహానుభావుఁడైన అన్నంభట్టు ఈతనితపోమహిమ యింతయని చెప్పుటకు వీలు లేనట్టిది. ఆసేతుహిమాచలపర్యంతము, న్యాయశాస్త్ర మభ్యసింపఁగోరువారు ప్రప్రథమమున, అన్నంభట్టుగారి పేరు తలపనిదే జరుగదు. భారతదేశములో నెచ్చటనైననుసరే మొదట తర్కసంగ్రహము చదువనిదే మరియొక న్యాయగ్రంథము ముట్టుకోరు.

అన్నంభట్టుగారు తెలగాణ్యబ్రాహ్మణులనియు, గుంటూరు మండలములోని గరికపాడుఅగ్రహారము ఈయనచే సముపార్జితమనియు, ఆనంశికులు పలుకుచున్నారు. "తర్కసంగ్రహాముఖోద్గ్రంథకర్త" అని అన్నంభట్టుగారిని స్తుతించియుండుటచేత, తర్కసంగ్రహముకాక ఇంకేమైనగ్రంథములు వ్రాసెనేమో యను ఊహ కలుగుచున్నది. విచారింపఁగా, పాణినీయాష్టాధ్యాయిసూత్రపాఠమునకు వ్యాఖ్య రచించినట్లుగూడఁ దెలియవచ్చుచున్నది.

ఇట్లు గీర్వాణవాఙ్మయమునందు, తెలుఁగునాటివారికృషి యెంతయో చూడనగుచున్నది. ఇది యింటితో ముగియలేదు. పూర్వకాలమునందే కాక, ఆధునికయుగమునందుఁగూడ, ఆంధ్రులహస్తములనుండి గీర్వాణకృతులు వెలువడుచునేయున్నవి. నాఁడు మొదలు నేటివరకుఁగూడ, మనవారు సంస్కృతకావ్యముల రచించుచునేయున్నారు. గతశతాబ్దమునందు, వర్తమానశతాబ్దమునందును గ్రంథరచనయున్నది. గతశతాబ్దములో గ్రంథరచనసలిపినవారలలో ములుగుపాపయ్యశాస్త్రిగారను ఆరాధ్యబ్రాహ్మణు లొకరు సుప్రసిద్ధులు. 1 ఈయన సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు కృతు లొనర్చియుండెను. అమరావతిలో రాజ్యముచేసిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి ఆస్థానకవి.

2 కోరాడ రామచంద్రకవి సుప్రసిద్ధుడైన సంస్కృతాంధ్రకవి యని తెలియవచ్చుచున్నది. ఈకవి సంస్కృతభాషయం దొనర్చిన కృషి యపారము. కుమారోదయమను చంపూకావ్యము ఘనవృత్తమును కాళిదాసకృతి మేఘసందేశోత్తరకథాభాగరూపము మొదలుగాగల 22 కృతుల నీతఁడు సంస్కృతభాషయం దొనర్చెను. 9 గ్రంథములు తెలుగులో రచించెను. ఇందువలన నీకవియొక్క శక్తి బయల్పడకమానదు.

కొంతకాలముక్రింద స్వర్గీయుఁడైన చెల్లంకొండ రామరాయకవి సంస్కృతమునఁ జక్కనికావ్యకర్త. అపారమయిన పాండితీపటిమతో, ఈకవిరచించిన గీతాభాష్యము నిరుపమానము. కోనసీమవాసి యగు వెంకటాధ్వరియు, నర్ల వెంకటసూరియు సంస్కృతమున గ్రంథముల రచించిరని తెలియుచున్నది. మొదటికర్త రచించినది కాలనిర్ణయచంద్రిక యను జ్యోతిషగ్రంథము. సూరిగారు వెంకటాద్రిగుణరత్నావళి యను అలంకారగ్రంథమును రచించిరి.1

ఇట్లు విచారించినచో, గతశతాబ్దములో, సంస్కృతకృతుల నొనర్చినవారు పెక్కుమంది కలరు. వార లందరినిగూర్చి విపులముగా వచించుటకు ప్రకృత మసాధ్యము.

వర్తమానశతాబ్దిలోఁ బలువురు కవు లున్నారు. మొన్ననే స్వర్గీయులైన కిడాంబి రామానుజాచార్యులవారు సంస్కృతాంధ్రములయందు కావ్యరచన సలిపెనని తెలియనగుచున్నది. వీరుకాక ప్రకృతము సజీవులుగా నున్నవారలలోఁ బెక్కుమంది సంస్కృతకావ్యముల రచించినవారును, రచించుచున్నవారును గలరు.

పూర్వులగు ఆంధ్రులు వ్యాకరణశాస్త్రములోఁగూడ గ్రంథరచన సలిపిరని వినుముకాని, అది యంతయుఁ గాలములోనున్నదనియు, అముద్రితస్వరూపమున నున్నదనియుఁ దెలియవచ్చుచున్నది. ఆలోటును దీర్చుటకై, ఇక్కాలమున, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు "గురుప్రసాదము" అను పేర నొక వ్యాకరణవ్యాఖ్యానగ్రంథమును, సమగ్రమయినదానిని రచించి యశోభూషితులయిరి. కుడిభుజము కూలిపోయియున్న తిరుపతివెంకటకవీశ్వరులుగూడ తెలుఁగులో రచించినన్ని కాకపోయినను, కొన్ని చక్కనికృతుల నొనర్చి గీర్వాణభాషను సేవించియున్నారు. అందు ధాతురత్నాకరము, కాశీసహస్రము ముఖ్యమయినవి. ఇట్లే కాశీకృష్ణకవిగురువరేణ్యులుగూడ కొన్నికృతుల నొనర్చి పాఠకలోకమున కర్పించిరి. ఇటీవల వారు రచించిన బాలబోధిన్యాదిగ్రంథములచే విద్యార్థిలోకము ధన్యమైనది.

ఇట్లు, పరిశీలింప మొదలిడినచో, వర్తమానయుగమునందు, గీర్వాణభాషయందుఁ గృతియొనర్చిన కవులు మనవారలు పెక్కుమంది లేకపోలేదు. వారల నందరిని గుర్తెరింగి, యిటఁ బ్రశంసించుట దుస్తరము కాకపోదు. కావున ఈవ్యాసముయొక్క శీర్షిక కతివ్యాప్త్యవ్యాప్తి దోషములు, పట్టకుండఁజేయుట, సాధ్యము గానిపని. నాశక్తికొలఁది పూర్వయుగములోని వారి నందరినిగూర్చి యిటఁ బ్రస్తావించితిని కాని దీనితో సరిపోయినదను నమ్మకము నాకే లేదు.

ఇట్టి వ్యాసరచన నాబోఁటివానికి శక్తిమించినపని. పరిశోధనలో నారితేరిన వేటూరి ప్రభాకరశాస్త్రి, సోమశేఖరశర్మ మున్నగు అనుభవజ్ఞులు పూనుకొనవలసినట్టిదిది. నాకుఁ గల అధికాసక్తియే, నాయీ కూర్పునకుఁ గారణము. వర్తమానకాలములోని సంస్కృతకావ్యకర్తలెవరైన నిందుఁ జేర్పఁబడకపోయిరేని, వారినిగూర్చి నా యెఱుఁగమియే కారణమని తలఁచి మన్నింతురుగాక!

1. 'కళ్యాణచంపు' అనుచంపువును, ఒకనాటకమును, ఒకకావ్యమును వ్రాసినాఁడు.

2. See Introduction do ఘనవృత్తి.



భక్తవిజయము చదువక మనుపు.

ఆది

పాండురంగ

# భక్తవిజయము

ఐదు భాగములు

కోయిల్ ధనాల దేవరాజ దాసువారిచే

రచియింపఁబడినది

రాయల్ సైజులో మొత్తం 880 పుటలు గలది. గ్లేసుకాగితములపై ముద్రింపఁబడి కలికొ బైండు చేయఁబడి 21 ఆఫ్‌టోన్ పటములు చేర్చబడ్డది.

వెల రూ. **6-0-0**] [పోస్టేజి ప్రత్యేకము.



భక్తవిజయము చదువని మనుప.

ఈ భక్తవిజయగ్రంథము మహారాష్ట్రదేశంబునఁ దవతరించిన మహామహిమఁగల జ్ఞానులగు కవీశ్వరులచే రచింపఁబడిన మహాభక్తుల చరిత్రముల నన్నిటిని గైకొని సకల జనులకును సులభముగ బోధపడునట్లు తెనుఁగున వచనముగా వ్రాయఁబడినది. ఈభక్తుల చరిత్రములలో నొక్కొక భక్తుని చరిత్రమును ఒక్కొకవిధమైన విషయమునఁ దెలియఁజేయును. ఇందు సంస్కృతిభాషలోని అత్యుత్తమమైన భగవద్గీత, పాండవగీత, ముకుందమాల, భాగవతము, విష్ణుపురాణము మొదలగు గ్రంథములనుండి యనేక ఉదాహరణము లుదహరింపఁబడి యున్నవి. ఎట్టివారికిని, ఏస్థితియందుండువారికిని, యీపుస్తకము మహోపకారి యగును. ఎట్లు? భక్తియేకదా ప్రాధాన్యము. కావున భక్తిలేనివానికి, వివేకికిని, అవివేకికిని నీతి, జ్ఞానము, ధర్మాధర్మ వివేచనము, సన్మార్గ దుర్మార్గలక్షణమును బోధించుటంబట్టి యిది సకలమైవారికిని పఠనమాత్రము చేతనే పరమ ప్రయోజనము నొసంగును. ఈపుస్తకమును జదువువారికి మనశ్శాంతికల్గును. ఇట్టి పురుషార్థ సాధనమైన యీ మహా గ్రంథమును జదివినయెడల, పుణ్యపాప వివేచనము విస్పష్టముగాఁ దెలియఁబడును. కాన, మనోబలము లేనివారుసూడ సులభముగా సన్మార్గమునందుఁ బ్రవేశించుటకును, దుర్మార్గమునందుఁ బ్రవేశింపకుండుటకును ఇదియొక రాజశాసనమువలెనున్నది. మఱియు, అనేకస్త్రీలు దైవభక్తియు, పతిభక్తియు, ఆచార్యభక్తియు గలవారై యున్నారు. అట్టి ఉత్తమస్త్రీల చరిత్రములును దీనియం దుండుటచే, స్త్రీలుసూడ నీ గ్రంథమును జదివిరేని భూలోకమునందు సరస్వతీ పార్వతులనంటి శ్రేష్ఠ గుణములు గలవారై, తాము కన్న బిడ్డలను మహాత్ములుగఁ జేయఁగలవారై, సకల జనులచేతను కొనియాడఁబడువారై, మంచి వివేకము నొందినవారై మెలఁగుదురు.

**ఆదిత్యాగరాజస్వామి కీర్తనలు:**— విష్ణు, శివసంబంధ కీర్తనములు 600 ఉన్నవి. మంచి కాలికో బైండు చేయబడియున్నది. స్వాములవారి చరిత్రయున్నువారియొక్క ఫోటో యున్ను ఉన్నవి.
వెల 3-0-0

**శ్రీ త్యాగరాయహృదయము**— 530 పుటలుగల 3 సంపుటములుగ మంచి గ్లేజుకాగితముపై ముద్రింపబడి మేలుబైండు చేయబడియున్నది. ఇందలివిషయములు:— మహనీయులగు శ్రీత్యాగరాజ అయ్యగారిచే రచియింపబడిన కీర్తనములలో 225 కీర్తనములను చక్కబరచి వానికి అవతారిక, మూలము, ప్రతిపదార్థము, విశేషార్థము, రాగలక్షణము, స్వర, సాహిత్యములును వ్రాయబడి యున్నవి. 3 సంపుటములు సెట్టు 1-కి ధర రు. 10. సంపుటము 1-కి రు. 4.

**ఆది సంగీతసుధాంబుధి:**— ఇందు సంగీతలక్షణములును, ప్రథమాభ్యాసపద్ధతులును, వాడుకయందున్న అనేక రాగములకు అరోహణాద్రిక్రమములును, త్యాగయ్య, దీక్షితులు, శ్యామాశాస్త్రులు, ఘనం సీనయ్య, కన్నకుడి కృష్ణయ్య, సుబ్రహ్మణ్యయ్య, గోవిందసామయ్య, గర్భపురివాసులు, పురంధరవిఠలు, నారాయణతీర్థులు, తిరంగంబాడి పచ్చనాథయ్య, సదాశివరావు మొదలగు సుమారు 35 పూర్వ ప్రసిద్ధ వాగ్గేయకారక విరచితంబులైన వర్ణములు, కీర్తనలు, జావళ్లు మొదలగునవియును, తత్కాలరుచ్యమైన హిందూస్థానీలు, పార్సీలు, ఇంగ్లీషునోటు, తిల్లానా మొదలగు (Delicious Miscellany) లలిత మిశ్రమములును, స్వరములతో నున్నవి. ఇందు వీణ, హార్మోనియ పటములును అమర్చబడియున్నవి. మంచి గ్లేజుకాగితములో ముద్రితమై, మేలుబైండు చేయబడినది.
వెల 3-0-0.

**ఎమ్. ఆది అండు కంపెని,** పుస్తకవ్యాపారులు, అప్పాబిల్డింగ్స్, 11/286 ఎస్ప్లనేడ్, మద్రాసు.
39, చిన్నతంబివీధి, మద్రాసు.

# PROFITS



## డాడ్జి. డి. ఇ. యఫ్. బస్.

స్వంతదారులకు బాగుగా పనియొనర్చుటకు, నవీనమాదిరి బండ్లు చాల ఉపయోగమైనవి. స్వంతదారులకు డబ్బును చేకూర్చునవిగా నుండవలయును. డాడ్జి ట్రక్కులు, బస్సులు యీ విషయములలో చాలవత్సరములనుండి సంతృప్తిని గలిగించుటకు ఖ్యాతిగాంచినవి. దక్షిణఇండియాలో డబ్బు సంపాదించుటకు బస్ సర్వీస్ యొనర్చుటకు తగుమైనదిదియే. బస్ సర్వీస్ నడుపదలచినవారలకు, డాడ్జి కమర్షల్ బస్సుల విషయములు తెలుపబడును. ఇవియే. డబ్బువిలువకు సరిగా పొందదగినవి.

డాడ్జి బండ్లు వివరములు తెలుపుచు ఒకపద్ధతిని ప్రచురించుచుంటిమి. అందు ఎక్కువ అభిరుచికలవారలు, వెంటనే వ్రాయవచ్చును.

నేడే మీరు ఎందుకు వ్రాయకూడదు.

Addison & Co Ld

మద్రాసు, బెంగుళూరు, కల్లికోట, తిరుచునాపల్లి.

# సారస్వత జిజ్ఞాస

కవికొండల వేంకటరావు గారు, బి. ఏ., బి. యల్.

భగవంతుడు చరాచరసృష్టి నిర్మాణమొనర్చి మానవునితో నీనుండి ఊహానిర్మాణము చేయమన్నాడు. ఒకపెద్దమేఘము నాకాశమునందు రంగురంగులతో వానచినుకుల మూటగా, చల్లనిచలువపందిరిగా నడపింపసాగినాడు. అది యెట్లు వచ్చినదో, ఏల వచ్చినదో, ఎప్పుడు వచ్చునో మానవునకు తెలియదు. కాని వచ్చినప్పుడు మానవుడు దానినిగూర్చి పాడుచున్నాడు. ఓ! ఇంద్రుడా, అనిచెప్పి వేద ముద్ఘోషించుచున్నాడు. మానవుని కంటబడనంతవఱకు ఆ మేఘ మొకానొక పదార్థమాత్రముగ నుండి మానవుని కంటబడునంత నొకానొక యద్భుతదివ్యవ్యక్తిగ మారుచున్నది. ఒకానొకఊహ దానినుండి నిర్మాణింపబడుచున్నది. ఈప్రకారము సమస్తమైన చరాచర సమూహమును మానవుని అనంతమైన ఊహానిర్మాణముచే దివ్యవ్యక్తి పుంజములుగ మారుచు లోకమునెల్లను జీవనవంతముగను, సచేతనముగను చూపుచున్నది. మానవునియొక్క యూహానిర్మాణమే లేకపోయిన భగవంతునియొక్క సృష్టి కేవలము జడమై మూకీభావము వహించవలసియుండును.

తోయము లూరక ప్రవహించి సముద్రమునం గలసిపోయెడివేకాని మనకు గంగమ్మతల్లిగను, గోదావరమ్మతల్లిగను, కృష్ణవేణిగను, అంతర్వాహిని సరస్వతిగను గోచరింపకపోయియుండును. పర్వతము లూరకే మిన్నుముట్ట బెరిగియుండెడివే కాని హిమవంతునిగను మేరువుగను, వింధ్యగను, వెలసియుండకపోయెడివి. మానవులు నయితము కేవల మాహారనిద్రాదులకు లోనగు జంతుమాత్రులుగ నుండియుండెడివారలే కాని రామునిగ, కృష్ణునిగ, అర్జునిగ, కర్ణునిగ, బలి దధీచి శిబి హారిశ్చంద్రులుగ మారియుండకపోదురు. జీవనమొక్క అర్థకామములకు లోనయి నిరర్థకమగుచు చనవలసియుండెడిదే కాని సచ్చిదానంద స్వరూపమున లీనమగుచు ముక్తిని బడసియుండకపోయెడిది. ఏదేమి? మానవుని యూహానిర్మాణముచే దేవుని సృష్టినిర్మాణమున కొకవింతైన తేజము వింతైనవన్నె, వింతైన విలాసము, వింతైన వికాసము, వింతైన ఆశయము, వింతైన అవకాశము, వింతైన శక్తిప్రభ, వింతైన సరళ స్వభావము కల్పింపబడుచున్నవి.

నిజమైన మానవుని ఊహానిర్మాణము భగవంతుని సృష్టి కుద్దీపనము చేకూర్చుచు నాశ్చర్యము గొల్పునదే కాని ఎట్లువచ్చిన దేలవచ్చిన దద్దాని ప్రయోజనమేమి యను ప్రశ్నములకు ప్రత్యుత్తరము లిచ్చునట్టిదిగ నుండదు. ఆ ప్రశ్నలను మనము వేసి పరిశీలింపనెంతుమా ఆయూహయొక్క నిసర్గప్రవృత్తిని మనము పాడుచేసినవారల మగుదుము.

టాల్‌స్టాయిఅన్నట్లు If we reason about love we desrtoy love అని. అంటేనేమి? "ప్రేమనుగుఱించి మనము హేతువాదముసేయుదుమా ఆప్రేమనే మనము నశింపచేతుము." అదేప్రకారముగా భగవంతునియొక్క సృష్టినిగుఱించిగాని, మానవునియొక్క యూహానిర్మాణమునుగుఱించిగాని మనము 'కిం'అని ప్రశ్నింతుమా మనము దానియందలి యందము, నొయ్యారము, నాశ్చర్యము నర్థము నన్నింటిని గోల్పోదుము. ప్రేమను ప్రేమఅనే ప్రేమింపుము. సృష్టిని సృష్టిగనే పరిశీలింపుము. ఊహానిర్మాణము నూహానిర్మాణముగనే యుద్బోధించుకొనుము. అంతియే కాని ప్రేమనుకోసికొని దానికాకరమైన ప్రేయసి మంచి

పాటపాడునా, మేలైన యాట యాడునా, చక్కని సపర్య సేయునా యని ప్రయోజనమ్ముల ప్రేశ్శ లెక్కించుకొనుచు ప్రేమింప మొదలిడుదుమా...నిజమైన ప్రియుఁడట్లు సేయఁ జాలఁడు. ఆమెనుగుఱించి యోజింపనే యోచింపడు. ప్రేమతత్వవికాసము తన ప్రోలఁ దోలకాడ తపలో మంద స్మితస్విన్నుఁ డగుచుండు. అనంతవ్యక్తినూహించు.

భగవత్సృష్టియొక్క విశ్వతోముఖ ప్రసక్తియు, మానవుని యూహానిర్మాణముయొక్క పురాణసదుక్తియు నట్టివియ-ప్రశ్న సేయకుడు-ఏల యీ చీపురుపుడక సృజింపఁబడినది? దీనియుపయోగ మేమియని ప్రశ్నవేయకుడు. ప్రశ్నవేయకు డేల యీ తుపాను వచ్చినదని. భయపడకుడు ప్రళయమునుగుఱించి. ఊహానిర్మాణము లేని మానవుని కీజిగుప్సయు, నీభయభ్రాంతులును. ఆశానిరాశాడోలికాందోళనమును—.ఊహానిర్మాణమే పరమావధిగ గనుగొను మానవునకుఁ బ్రళయరంగమున నటరాజు గనిపించు. వియోగమున సంస్మృతియాశ్వాసించు. బాష్పకలికాపరశాఖులలో దిఙ్మండల రేఖాసముదితంబగు ముక్తి వికసించు. ఆతని శక్తి నిరంతరము నిర్మాణశక్తియే.

ఒకానొక వ్రాయసకాడు ఈ క్రిందిప్రశ్న వైచుకొన్నాడు. ఏమనీ? ఒకానొక దేశముయొక్క నాగరికత దేనివల్లను గొప్పదగుచున్నదని. అతనిజవాబేమని వచ్చినది. Its refinement, its spiritual power and creative flowering in arts and thought.“దానియొక్క సరళిస్వభావమువల్లను, దానియొక్క ఆధ్యాత్మికపుశక్తి వల్లను, కళాశాఖను, ఊహాశాఖను దానికుండు నిర్మాణ సామర్థ్యమువల్లను”

పెరికిల్స్, సోక్రటీస్,డిమాస్థనీస్, సిసిరో వంటి మానవులయొక్క ఐహికశరీరములు నశించినవి. నశించినవి. రోమ్, పోంపే. కృష్ణదేవరాయల విజయనగరము మున్నగు పురవరంబులయొక్క వీథీసౌధమ్ములు భూగర్భమ్మున లయమొందినవి. లయమొందినవి. ఎచ్చో నశించిన వెచ్చో లయమొందినవి? ఊహానిర్మాణము లేనివాని మానసమున. ఊహానిర్మాతలకో అవి నేటికిని చిరంజీవములే. వారు నేటికిని చిరంజీవులే.

ఊహానిర్మాతకు భూతకాలమును, వర్తమానకాలము, భావికాలము, మూడునుంగూడ చేతనాభావములనే కొల్పుచుండును. అతనికి మృత్యువనునది వినాశనమనునది లేనేలేదు.

మఱియొక విచిత్రము. అతఁడు చేయునదేమి? పదార్థమును భావముగ నుద్దీపింపజేయు. భావమును పదార్థముగఁ బ్రతిష్ఠించు. భావార్థములు రెండును అభేదాస్వరూపంబులై యాతనియందు తాండవించు. సామాన్యుఁడు ప్రేమస్వరూపమును సాక్షాత్కరించుకొనునప్పుడొక చక్కని వాని, పెద్దనయనంబులవాని, ఎగుబాజంబులవాని, బంగరువన్నెవాని, వాని,వాని అని నిరూపించుకొనుచుండు. కాని ఊహానిర్మాతయో మన్మథుని మన్మథుని భస్మీభూతునిగ జేసి నిరాకారునిగఁ జూసి అతనికళను ప్రతి ప్రాణియందును జీవింపఁ జేయు. సామాన్యుఁడు, అనఁగా సర్వసామాన్య వేదాంతి, భగవంతునిగుఱించి యోచించునప్పుడు నిరాకారబ్రహ్మంబను. ఊహానిర్మాత యా నిరాకారబ్రహ్మమ్మునే నీలమేఘచ్ఛాయబోలు దేహమువాఁడు అని సాక్షాత్కరింపఁ జేయు.

ఒకపుస్తకమునం దీపరివర్తన మిట్లు వర్ణింపబడినదనవచ్చును “Real objects are modified in form by the internal visions. They resemble, so that the real objects may seem to be materialisations of the visions. (Poets do this)” “ఆంతరంగిక సందర్శనంబులవల్ల బాహ్యారూపము లాంతరంగిక సందర్శనంబుల కనురూపంబులగు రూపంబులు దాల్చుచున్నవి. అందుచే నేనుగుచున్నవి? బాహ్యస్వరూపము లాయాంతరంగికసందర్శనంబులయొక్క ప్రత్యక్షగోచరమూర్తులేమో అన్నట్లు అనుకొనుచున్నాము.” (ఇది కవులు సేయుపని) మఱియొక దృక్పథము.—పైపుస్తకమునందే కనవచ్చు—“A picture suggests to us a sentiment or a memory. We feel that the picture is the cause, the occasional cause of the memory or the senti-

ment; something has been stirred in the depths of our personality." "ఒకానొకమూర్తి మన కొకసం స్మృతినో యూహనో పుట్టించు. ఆ మూర్తివిలోకనమే ఆ తాత్కాలికపు సంస్మృతికిఁగాని ఆతాత్కాలికపు టూహకుఁగాని కారణ మనుకొందుము. ఆత్మీయవ్యక్తికుహర మున నెదో సంస్ఫురించు. మఱియొకచో నిట్లున్నది. "Emotion is the main cause of the majority of spontaneous suggestions. Function of art is to suggest sentiments by giving them expression." "రసము ఇచ్ఛాసంస్ఫురణమ్ములు బెక్కింటికి మూలము. కళయొక్క-ప్రవృత్తి యేమిటన: ఆ సంస్ఫురణమ్ములను వ్యక్తీకరించుటయే."

ఇట్లు చూడచూడ నాంతరంగికకారణము బాహ్య దృష్టి యగుఁగాక లోకలిమాడ్కి యగుగాక—కళ యొక్క ముఖ్యప్రవృత్తి లోకమున కొకకొన్ని యూహలను సంస్మృతులను సమకూర్చుటయని తేలుచున్నది. ధన లాభముఁగాని, పదార్థలాభముగాని మనకొడఁగూర్చునది కాదు కళ. తక్కిన మానుషప్రవృత్తులనుండి కళాప్రవృత్తి నిట్లు మనము వేఱుపఱుపవచ్చును. మనము వర్తకము చేయుదుమా లాభముపొందవచ్చు, నష్టముపొందవచ్చు. వ్యాజ్యము నడుపుదుమా గెలువవచ్చు,నోడవచ్చు. లాభాలాభములు జయాపజయములు ఆ ప్రవృత్తితోఁ గూడఁ బుట్టుచున్నవి. కాని కళోపాసన చేయువానికి లాభాలాభములతోఁగాని జయాపజయములతోఁగాని ప్రసక్తియుండదు. ప్రసక్తియుండుటయేకాదు. లాభాలాభములకుఁగాని, జయాపజయములకుఁగాని అవకాశమే లేదు. అతనియొక్క విలాస మెట్లుండుననన—ఒక రుపమించినట్లు 'I have found something wonderful. I want to share it with others' 'నేను వింతనొకదానిని విలోకించినాను. అందు మీరందఱును పాల్గొంట నాకోరిక' అని అనువాఁడు.

ఇట్టి అమాయకపు, టలౌక్యపు టచ్చెరుపాటువలని ప్రయోజనమేమి?—ప్రయోజన మడుగరాదని తొలుదొల్తనే వ్రాసితికాని అడుగకమానరు. ఈ మధ్యను హిందూపత్రికలోఁ గాబోలు చదివినాను Gould 'గోల్డు' అను ఆయన్ని అడిగినారట-కవిత్వమువలని ప్రయోజన మేమని. దానికాయన వ్రాసినారు. ప్రేమ, స్నేహాభావము ఎట్టివో అట్టివే సంగీతమును, సాహిత్యమూనని. కాని యుపయోగ మిట్టిదని సూచించలేకపోయినారు. చివరమాత్ర మేమన్నారన Anything which introduces us to beauty introduces us to truth. It is an old belief but I know of no new one that superseded it." "ఏదయితే మనలకు సౌందర్యముచూపునదియో అదియే మన ముందు సత్యమును ప్రతిష్ఠించు. ఈ న్యాయము ప్రాఁబడ్డ న్యాయమయ్యు దానినతిక్రమించిన న్యాయము మఱొండు నేటికిని ప్రకచింపఁబడియుండలేదు." ఒకానొకగొప్ప కవి కూడ ఆ వేమాదిరి అర్థమిచ్చు ముక్క అన్నజ్ఞాపకము. Beauty is truth, truth is beauty. 'సౌందర్యమే సత్యము. సత్యమే సౌందర్యము' అని. కాని అక్కడే చిక్కు.

సత్యమనున దెప్పుడును నిరాడంబరమైనది, విశ్వసమ్మతమైనది, తిన్నగఁదోఁచునది కా. సౌందర్యమనున దట్టిదాయని నా సమస్య.సౌందర్యమనునది పరికరములతో కూడినది, స్వార్థముగలది, చుట్టుదారిగలది కా—రంగు, రాగము, రహస్యము, లేనటువంటి సౌందర్యమున్నదా? ఇది నాకంద మైనది, ఇది నా కందముగానిది యని యనిపింపని సౌందర్యమున్నదా? అనపేక్షితంబుగలభించు సౌందర్యమున్నదా ? లేదనుకొందును. కాని సత్యమునుగురించి విచారింతుమా సత్యమునకు వన్నెచిన్నె లుండవు. అది అందఱు నొప్పుకొనవలసినదే, అందఱికి స్వతస్సిద్ధము. ఇంతటి తారతమ్యములు గల సత్యసౌందర్యముల కభేద స్వరూపము కల్పించుటలన్న యొకింతసాహస మనఁజెల్లు. జిజ్ఞాస కవకాశమున్నదనుకొందు. అది సర్వసామాన్య సౌందర్యము కాదని యనుకొనవలసి యుండు.

వర్ణించిన సుందరవర్ణనమునుండి మనకొను పరికరాదులు తీసివేయ నింకను మిగులుననుకొందు నెదో సౌందర్యము, నిరాడంబరమగు సౌందర్యము, విశ్వసమ్మతమగు సౌందర్యము, తిన్నగఁదోఁచు సౌందర్యము. దానిని

గురించి తఱిమితఱిమిచూతము. అట్లు తఱచుటచే సత్యమైనసౌందర్యము ఎట్టిదో మనకు గోచరించుటయేకాక సుకవిచేయు లోకోపకారముగూడ మన కవగాహనమగు.

ఆ విమర్శనము సేయఁగడంగుముందు లోకమందు నందమయ్యు నిరాడంబరమగునవి, స్వార్థపరత్వము గల్గిన వయ్యు విశ్వతోముఖములైనవి, క్రీడాభావము గల్గియు యథేచ్ఛ లభించున వెవ్వియైన నున్నవేమో చూతము. అట్టి వున్నయెడల వానిని మనము సత్యసుందరపదార్థములని పిలువవచ్చును. నా బుద్ధికి, పువ్వులు, చెట్లు, ఆకులు, కొండలు, నదులు, పక్షులు, మున్నగు సృష్టిజాలమెల్ల యట్టిదిగనే తోఁచు. పువ్వులున్నవా యవి రంగు రంగులతో, సువాసనతో, మెత్తందనముతో నొప్పుచుంటవి. కాని వాని యందము నిరాడంబరమైన యందము. ఏమందురా అంత పరికరసౌందర్యమును మట్టినుండి పుట్టుచున్నది. మరి ఫలాభిముఖులై స్వార్థము నపేక్షించునవయ్యు అవి తుమ్మెదలకు మకరందమిచ్చుచున్నవి. ఎక్కడున్న తుమ్మెదలూ వాని నాశ్రయించుచున్నవి. ఎంత ముగ్ధములయ్యు మనము వెళ్లి నిలుచున్నమీఁద రాలుచున్నవి. నిజముగాఁ బువ్వులు నిరాడంబర సుందరపదార్థములు. ఆకులు, చెట్లు, కొండలు, నదులు నంతియే. కవిత్వము వానివంటి కవిత్వమయిన, అది వో సత్యసౌందర్యము గల కవిత్వము. అంటే నైజసృష్టి లాగుండవలెనుగాని కవిత్వము మానవుడు తెచ్చిపెట్టుకునే కృత్రిమస్వభావముతోఁ గూడినట్టిదిగా నుండకూడదని తాత్పర్యము. అయితే కవిత్వ మొక్క సృష్టికి సంబంధించినదేనా. మానవునకు సంబంధించినది కూడానా అని యోజింపవలసియున్నది. మానవులను, మానవుల చెయువులను వర్ణించడూ కవి? ఆ వర్ణించేటప్పు డేలాగున నుండవలసియుండునూ కవిత్వము? మానవునియొక్క. సత్యసౌందర్య మెటిది? అని గమనించవలయు.

ఈ సందర్భమును మనము అర్థము చేసికోవలెనంటే తిరిగి సృష్టినే పరిశోధించి చూడవలెను. ఒకచెట్టునుఁగాని, యొక తీవనుగాని మనము పరికింతుమా, ఏ యది బాహ్యప్రపంచము నాకర్షించుచు బాహ్యప్రపంచము నుత్తేజితము గావించు? ఆ చెట్టుయొక్క చిగుళ్లు, పువ్వులు, ఫలములు. అంతేగాని ఆ చెట్టుపైకెగబీల్చుకొను నీళ్లు కావు. ఆ చెట్టు మొదటవేయు పెంట కాదు. దాని కాపుకొఱకు పాతిన కంచె కాదు. ఏదో రంగు ఏదో సువాసన ఏదో రుచి గల ఫలములు. బాహ్యప్రపంచమునకు వలసినవివే. అట్లే మానవుని సత్యసౌందర్యమును. అది మానవుడు తనకొఱకై యేవే గణించుకొను రూపాయలణాలపైసలందుఁగాని, తన పొట్టనింపుకొను నాహారపదార్థములందు గాని లేదు. వానితో బాహ్యప్రపంచమునకుఁ బ్రసక్తియే లేదు. ఎంతవఱకొకమానవుని చర్యలు, చెయ్వులు సత్కృతులు, మహదాశయములు, ఆ చెట్ల పువ్వులవలె, ఆ చెట్ల ఆకులవలె, ఆ చెట్లఫలములవలె లోకము నాకర్షించుచు లోకమునకు దేజస్సు, ఒయ్యారము, శశ్వత్కళ నొడగూర్చునవియో అంతవఱకమ్మానవుని సత్యసౌందర్యము చాటఁబడుచున్నది. అందుచేతనే సుకవితానాయకులయొక్క ఆహారనిద్రాదులు వర్ణింపఁబడక వారి స్వార్థ విరహితములగు ప్రేమ, పరిపాలన, శిష్టరక్షణ, దుష్టశిక్షణ ఇత్యాదులే వర్ణింపఁబడుచుండు.

అట్లగుచో మఱి కవి సృష్టియందు, మానవునియందు గనవచ్చు నీసత్యసౌందర్యమును ఉన్నదున్నట్టు ప్రతిపాదించునా; లేక వేఱే సత్యసౌందర్యము నొకదానిని తెచ్చిపెట్టునా; లేక ఉన్నదానిని అనుకరించునా?

నాకు తోఁచే దేమిటన అతగా డివేమీ చేయడని. అతఁడు సృష్టినుండి మానవునినుండి తనకుఁదోఁచిన యర్థము నొకదానిని దీయుచు అది వానియొక్కయో దానియొక్కయో పరమార్థముగా నిరూపించు. తనయొక్క పరమార్థముగాఁ గనఁబఱుపడు. అట్లు కనబఱచెనా అంత సొంపు చెడిపోయిన దన్నమాటయే. అతఁడు దూరదూరముగానే యుండు. అందులోనే కవియొక్క చమత్కారము. మఱియొక చమత్కార మేమిటంటే-నిజమైనకవిత తెలిసికొనేవరకు తెలియనిదిగా నుండునుగాని తెలిసిన వెనుక సర్వసామాన్యమైన విషయముగానే తోఁచును.

మంచి కవితను గుఱించి ప్రతివాఁడూ అనుకొనకమానఁడు. అది నాకు అనుదినము తోఁచే సంగతే. నేను ఆఁగాఁగున చెప్పలేకపోతినని చదువుతూవుంటే అంతఃకరణం నోట్లో ఆల్లలాడే విషయములాగు పరుగిడుతూ వుండును సరస మైన కవిత.

ఈమధ్య చదివిన ఒక సంచికలో ఒకవ్యాసమందు చూచితి నిట్లు: Poetry is the very stuff of life. It belongs to the wharf, the mart and the tumult of life. Whenever a true thought shapes itself before the intellect of or a sincere emotion makes its irresistable appeal to the heart of man, there is the possibility of Poetry. 'కవిత జీవలోకము లోనిది. అది అంగడులందు, పడవల రేవులందు, సంసార సాగరమందు కననగు. ఎప్పుడొక సత్యభావము ఒకానొక మానవుని మనస్సునకు దట్టిగాని ఒక నిజమైనరసము హృదయమునుండి ఉబికిగాని పైకి వెలువడునో అక్కడల్లా కవితకు అవకాశమున్నది'

కావునఁ గవితయన నేదోయని, ఛందోనిబద్ధమని, అలంకార విశృంఖల పరికల్పితమనీ, మడిగట్టుకొన్నదని యూహింపఁ జనదు. అది ప్రతి మానవునియందును గలదు. ప్రతిచోటను గలదు. సత్యసౌందర్యముల జూడఁగల సావకాశము, సాధుమతి మనకుండవలెను. అంతే.

అజంతాచిత్రములు



౧. వనవిహారము



౨. తామరకొలను

# హర్షనైషధము - శ్రీనాధుని యాంధ్రీకరణము

శ్రీమతి బిక్కిన సుదర్శన రామలక్ష్మీకాంతమ్మ గారు

శ్రీహర్షుఁడు నైషధకావ్యరచనాప్రారంభమున

శ్లో. నిపీయ యస్య క్షితిరక్షిణః కథా
స్తథా ద్రియంతే న బుధా స్సుధా మపి;
నల స్సితచ్ఛత్రితకీర్తిమండల
స్సరాశి రా సీ న్మహసాం మహోజ్జ్వలః.

అని వ్రాసెను.

అభిప్రాయము:—

భూపాలకుఁ డగు నే నలమహారాజు కథలను మిక్కిలి యాస్వాదించి, బుధులు (దేవతలు, పండితులు) అమృతమునుగూడ నలకథలనువలె (పూర్వమందువలె) నాదరించుటలేదో, శ్వేతాతపత్రమైన కీర్తిమండలము గల యా నలమహారాజు మహోత్సవములచే వెలుగొందుచుఁ దేజోరాశియై యొప్పుచున్నాఁడు.

పిమ్మట:—

శ్లో. రసైః కథాయస్య సుధావధీరిణీ
నల స్స భూజాని రభూ ద్గుణాద్భుతః;
సువర్ణదండైకసితాతపత్రిత
జ్వలత్ప్రతాపావళికీర్తిమండలః.

అభిప్రాయము:—

ఏ నలునికథ రసములచే నమృతమును నిరసించుచున్నదో యాభూనాథుఁడగు నలుఁడు తనదుకీర్తిమండలమనెడు తెల్లగొడుగునకు వెలుగొందు తనప్రతాపపంక్తి యనెడు బంగరు దండము నమర్చి యద్భుత గుణంబుల నొప్పుచుండెను.

అనంతరము:—

శ్లో. పవిత్ర మత్రా తనుతే జగద్యుగే
స్మృతా రసక్షాళనయేవ తత్కథా;
కథం న సా మద్గిర మావిలా మపి
స్వసేవినీ మేవ పవిత్రయిష్యతి.

అభిప్రాయము:—

ఈ కలియుగమున స్మరింపఁబడి లోకమును రసక్షాళనము చేసినువలెఁ బవిత్రమైనదిగఁ జేయు నా నలునికథ కలుషమైన దైనను, ఎల్లపుడు తననే సేవించు నామాట నేల పవిత్రము చేయదు? అనఁగాఁ దప్పక పవిత్రము చేయునని యాశయము. ఇందులకుఁ బ్రమాణము.

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ;
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్.

అనుసరయే.

ఇక శ్రీనాథరచితమగు నాంధ్రశృంగారనైషధమును బరికింతము.

పూర్వము సింగనమంత్రి శ్రీనాథకవిం జూచి నాకు నొక్క ప్రబంధంబు పుణ్యశ్లోకపురాతనరాజర్షిచరితానుబంధబంధురంబుగా రచియింపుము.

గీ. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితము పొంటె
నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ, యొనరింపు నాపేర నంకితముగ.

చ. పనివడి నారికేళఫల
పాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభములు
సోమరిపోతులు కొందఱయ్యలో
ననికొనియాడనేరరు—

అని సాహిత్యగోష్ఠీవినోదప్రసంగంబునఁ గవిసార్వభౌముండగు శ్రీనాథకవితో శ్రీహర్షకవిచే రచింప

బడిన సంస్కృతనైషధము నాంధ్రభాష నొనర్చి, తన కంకిత మిమ్మని నుడివెనట.

అప్పుడు శ్రీనాథుఁడు శృంగారనైషధమును రచించుచు నిష్టదేవతాస్తుత్యాదుల నొనర్చి, యభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన యిమ్మహాప్రబంధమునకుం గథానాయకుండు :

సీ. తపనీయదండైకధవళాతపత్రితో
ద్దండ తేజఃకీర్తిమండలుండు
నిర్మలనిజకథానిమిషకల్లోలినీ
క్షాళితాఖిలజగత్కల్మషుండు
వితతనవద్వయద్వీపనానాజయ
శ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు
నిఖిలవిద్యానటీనృత్యరంగస్థలా
యతనాయమానజిహ్వాంచలుండు
తే. ప్రస్తుతింపంగఁ దగు సముద్భటకఠోర
చటులగుణటంకృతిధ్వాన స్తనిత ఘోష
చాపనీరదభవశరాసారశమిత
బలవదహిత తేజోదవానలుఁడు నలుఁడు

అని ప్రారంభమున వ్రాసెను.

ఈ సీసపద్యమువలన సంస్కృతనైషధములోని మొదటిసర్గయందలి 1,2,3,4,5,7, శ్లోకముల యందలి యభిప్రాయములు స్పష్టముగ వివరింపఁబడినవి.

1,2,3 శ్లోకములలోని యభిప్రాయమును ఈ సీసపద్దెమున మొదటి రెండు పాదములలోనే నుడివెను.

పై రెండుపాదములకు సరియైన అర్థము:—

బంగారముయొక్క కామయు, ముఖ్యమైన తెల్లనిగొడుగునుం గాఁ జేయఁబడిన పొడుగైన పరాక్రమమును, కీర్తిమండలమును గలవాడును, నిర్మలమైన తనచరిత్రమనెడి దేవనదిచేతఁ గడుగంబడిన సకలలోకముల యొక్కయు, పాపములు గలవాఁడునై నలుఁడున్నాఁడు.

అనఁగా మూఁడు లోకములలో దేవనది ప్రవహించి, వాని నెట్లు పవిత్రీకరించుచున్నదో యా ప్రకారమే నలునిపుణ్యచరిత్రము లోకములయందు వ్యాపించి, వానిని బవిత్రము చేయుచున్నదని భావము.

శ్రీహర్షకవి నైషధప్రారంభమున భూపాలకుఁడగు నే నలునికథలను బుధులు చవిఁజూచి సుధ (అమృతము)నుగూడ నావిధముగ నాదరించుటలేదో యనియు, రెండవశ్లోకమునఁగూడ ఏ నలునికథ రసములచే సుధ(అమృతము)ను మీఱుచున్నదో యనియుఁ జెప్పెను. ఇట్టి స్థితిలో కవిసార్వభౌముఁడగు శ్రీనాథుండు సింగన మంత్రి కోర్కెచొప్పున హర్షనైషధము నాంధ్రభాష నొనర్పం బూని మొదటి సీసపద్యముననే రసవిశేషపోషకంబగు హర్షకవిసమ్మతంబగు నమృతసామ్యమును నలచరిత్రమునకుం జెప్పక దేవనదీసామ్యమును జెప్పెను. ఒకవేళ

శ్లో. పవిత్ర మత్రా తనుతే జగద్యుగే
స్మృతా రసక్షాళనయేవ తత్కథా—

అను మూడవశ్లోకమందలి రసక్షాళనాపవిత్రత్వమును వెల్లడించుటకై యమృతసామ్యమును జెప్పక, దేవనదీసామ్యమును నలకథకుఁ జెప్పెనన్నచో నిట్టిసామ్యమును శ్రీహర్షుఁ డొక్కసారియైనను నుడువక పోవుటయే గాక మొదటిరెండు శ్లోకములలోఁగూడ నమృతము నేలఁ బేర్కొనవలెను ?

రసాత్మకమగు మహాకావ్యమునకు నమృతసామ్యమునువీడి, దేవనదీసామ్యమును జెప్పుటలో రసవిశేషము పొసంగి యున్నదా ?

లోకమునందుఁ జూడఁ బంచకావ్యములను బఠించి పిమ్మట విద్వదౌషధమైన నైషధకావ్యమును జదువుచుండిరి.

సాహిత్యదర్పణమునందు "వాక్యంరసాత్మకం కావ్యం" అని చెప్పఁబడుటచేతను ప్రతాపరుద్రీయమున రసస్వరూపనిరూపణమునందు "అథ సర్వేషాం ప్రబంధానాం జీవితభూతస్య రసస్య స్వరూపం నిరూప్యతే" అని యుండుటచేతను, కావ్యము రసాత్మకమైనదనియుఁ బ్రబం

ధములన్నిటికిని రసమే ప్రాణమై యున్న దనియు స్పష్ట మగుచున్నది గదా!

"శ్లో. రసతే స్వాదనార్థత్వా ద్రస్యంత ఇతి తే రసాః"-

అనుటచే ననుభవింపఁబడుటవలన రసములనఁ బరగుచున్నవి.

ఇట్టి రసము పెక్కు తెఱంగులై యున్నది.

హర్షకవి రసభరితమగు తన కథలో రసపోషకము గఁ బవిత్రత్వాస్వాద్యత్వములు ప్రకాశించుసట్టుల నుపమానమును జెప్పఁదలంచి, నలకథ సర్వరసోత్తమం బగు సుధనుగూడ మీఱుచున్నదని బుధజన సమ్మతంబుగాఁ జెప్పియుండెను.

శ్రీనాథకవి యాంధ్రమున నలకథకు దేవనదీసామ్యమును గల్పించెను. దేవనదీసామ్యము పవిత్రత్వాపాదకమున నమృతమును మించుచుండినను, బుధకవి సమ్మతంబగు రసపోషణమున లోపస్ఫురణము గల్గెఁ గన్పట్టక మానదు.

శ్రీహర్షుం డినుమాఱు నలకథకు సుధోపమానంబు జెప్ప నీకవిసార్వభౌముఁడు దానిని తీసివైచుటలో గడించిన నైపుణ్య మెద్ది?

గంగ విష్ణుపాదమున జనియించినది. పరమేశ్వరుని శిరమున ధరింపఁబడుచున్నది. మహాతప మొనర్చిన భగీరథుని ప్రయత్నమున దివినుండి భూపాతాళలోకములకుఁ దేఁబడినది.

శ్రీమద్భాగవత దశమస్కందమున:—

శ్లో. వాసుదేవకథాప్రశ్నః పురుషాన్ స్త్రీన్ పునాతిహి
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ తత్పాదసలిలం యథా.

అని యుండుటచే నారాయణకథాప్రశ్నము, నారాయణపాదసలిలమువలెఁ జెప్పువానిని, నడుగువానిని, వినువారిని బవిత్రము చేయుచున్నదని నుడువుటం బట్టి, గంగకు పవిత్రత్వాతిశయము కలదనుటలో సందియ ముండఁజాలదు.

ఐనను అమృతమున కపవిత్రత్వము లేకుండుటయే గాక పవిత్రత్వమును, విశేషరసాస్వాద్యత్వమును కలవని నిస్సందేహముగఁ జెప్పవచ్చును.

ఎట్లనిన, సురాసురలు మిక్కిలి వాంఛతో క్షీర సముద్రము మథనముచేయుచుండ హాలాహల విషంబు మున్నగు నిక్కట్టులెన్నియో యుత్పత్తిల్లినను, బట్టువిడునక, వెనుదీయక తమ కభీష్టమగు నమృతమును సాధించిరి గదా!

అమృతసాధనార్థమై మందరగిరిని శ్రీమన్నారాయణుండు మున్నుగా కూర్మరూపమున ధరించెను. సుధ క్షీరసాగరమునఁ బుట్టినది. తోఁబుట్టువులుఁ జూడ కౌస్తుభము పారిజాతము కామధేనువు చంద్రుఁడు లక్ష్మి మున్నగువారలు.

అమృతము పుట్టినంతనె దేవతలు తనివిఁజెందిరా? లేదులేదు. ఆ యమృతమును శ్రీమహావిష్ణువు లోకపవిత్ర కరకమలముతో నిచ్చుచుండఁ బంక్తులు దీర్చి కూర్చుండి, దేవతల్లెల్లరు తనివిదీరఁ గ్రోలియుండిరి.

నారాయణుని పాదస్పర్శగలది గంగ; నారాయణుని కరస్పర్శగలది సుధ. అమృతపానముచే సురలు జరామరణవర్జితులై త్రిదశత్వ మొందిరి.

అమృతఘటమును స్వర్గములో నింద్రాదులు మిక్కిలి భద్రముగఁ గాపాడుచుండిరి.

పూర్వము కద్రువగూడ గరుడుని సురను దెచ్చి యొసకిచ్చినఁ దల్లియగు వినతకు దాస్యవిముక్తని జేసెదనని చెప్పియుండెను.

పై వానిని జూడ నమృతమునకుఁ బవిత్రత్వముండుటయే గాక దేవలోకపూజ్యమగు రసవిశేషము గలదనుట నిర్వివాదము.

వేయేల! పురాణోత్తమమగు భాగవత మహిమను వివరించుచు:

శ్లో. నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతమ్;

# కతియవారు ట్రేడింగు కంపెనీ

## జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు అత్తరులు

మీరుకోరిన సువాసనలు మీకు లభించగలవు

**మనోహరపరిమళముగల తలనూనెలు**

కుసుమాల్ హెయిరాయిలు (రిజిస్టర్డు):—తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది. వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్‌రోజ్ హెయిరాయిలు నెం. 777 (రిజిస్టర్డు):—గులాబీపువ్వుల నిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తిగలవారి కామోద మొసగును. వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. 777 (రిజిస్టర్డు):—టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధముచేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ 777 నెం॥ రులో (రిజిస్టర్డు) చేసిన యీ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 1 కి 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిస్టర్డు):—మాలతీపుష్పసువాసనతో అతిమనోహరమై హృదయరంజకమై యొప్పు తలనూనె యిది. వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిస్టర్డు):—ఇది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసన గల తలనూనె. వెల సీసా 1 కి రు. 0-9-0

**సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు**

ఆటో మధుకర్ నెం. 777:—ఈఅత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది యీఅత్తరును తమ యభిమానసౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో స్వర్గ ... నెంచిచెప్పగలరు. ½ ఔ. సీసా 1 కి 1-12-0

| | | | |
|---|---|---|---|
| ¼ | ” | ” | 1-0-0 |

ఓటో ... మాల్ (రిజిస్టర్డు) పరిమళములం దపూర్వచిత్రములు:—... కు కోసిన పూవులవాసన యీఅత్తరునందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరఖులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసుగుచెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. నిది సుకుమారమైన సూక్ష్మసౌరభము వెదజల్లును. వెల ½ ఔన్సు సీసా రు. 2-0-0

| | | | |
|---|---|---|---|
| ¼ | ” | ” | 1-0-0 |




పాకింగు పోస్టేజీ ప్రత్యేకము

మాదిరి సీసాలు:—రెండణాలు చీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరిసీసా ఉచితముగా పంపబడును.

రెండణాలచీట్లు పంపినచో కోరినతలనూనెలు ఏరెంటి నైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

| | | |
|---|---|---|
| ఓటో జాస్మిన్ | నెం. 777 | |
| ఓటో హీనా | ” | |
| ఓటో రోజ్ | ” | |
| ఓటో లిలీబ్లాజం | ” | |
| ఓటో మస్క్ | ” | |
| ఓటో నీరోలీ | ” | |
| ఓటో బహార్ | ” | |
| ఓటో సురంగి | ” | |

వెల ½ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0

| | | | |
|---|---|---|---|
| ¼ | ” | ” | 1-0-0 |

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికి బదులుగా వేనినైనను అంగీకరించకుడు

ఘరానా గల ఔషధముల దుకాణము లన్నింటియందును దొరకును. లేదా,

## కతియవారు ట్రేడింగుకంపెనీ బొంబాయి (నెం. 4)

మధురలో ఏజంట్లు:—కాదర్ సాహెబు అండు సన్సు.

# ఆంధ్రపత్రిక శుక్ల సంవత్సరాది సంచిక



నాలవ భారతీయ వేదాంతమహాసభ



శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారి రాక



కాశీ ఈతపందెములో గెలిచినవారు



ఆదిమాంధ్రబాలుర పాఠశాల–బందరు



ఆంధ్రస్నాతకులకు విందు–చెన్నపురి





ఆదిమాంధ్ర ఉద్ధరణసంఘము–నెల్లూరు

# ఆంధ్రపత్రిక శుక్ల సంవత్సరాదిసంచిక



ఆంధ్రవిశ్వకళా పరిషత్తు–పట్టప్రదానసభ



శ్రీమతి ఆర్యగారికి స్వాగతము



కె. ఏ. బి. జాన్స్టనుగారు, యం. ఏ. యం.



జగద్గురు ప్రతికృతిని బహిరంగపరచిన వైదికబృందము



యం. యస్. యం. ఆర్. ఉద్యోగీయుల కేవసమావేశము

పిబత భాగవతం రస మాలయం
ముహు రహో రసికా భువి భావుకాః.

శుభచరితులగు నో రసికులారా! శుకముఖస్పర్శమున నమృతద్రవముతో నిండిన వేదమను కల్పవృక్షము నుండి పడిన పక్వఫలమగు భాగవతమును, లయావస్థ వచ్చువఱకు ననుభవింపుఁ డనుటచే నమృతమహత్వ మిందుఁ జక్కఁగ వివరింపఁబడినది.

శ్లేషయమకచక్రవర్తి యగు వేంకటాధ్వరి కవి యిట్లు చెప్పెను.

శ్లో॥ అసావపగుణోపి మే హరికథా సుధాధారిణీ;
కృతి ర్గనుజభిర్గుణగ్రహణలాలసై ర్గృహ్యతే.

నా కృతి గుణభూయిష్ఠ మైనది గాకుండినను, హరికథ యనెడు సుధను ధరించినది గావున హరిగుణసంకీర్తనాసక్తులచే స్వీకరింపఁబడు నని నుడివెను. ఇందుఁ జక్కఁగ హరికథ సుధారూపముగనే చెప్పఁబడినది.

శ్లో. రుచిరకవివాక్యే ష్వనవధి ర్నవానందః కోపి స్ఫురతి తు రసో సౌ నిరుపమః—

సుకవి వాక్యములందు మితిలేని నూతనానందంబు గల్గించు చెప్పశక్యముగాని రసము గలదను బాణోక్తిచే రసమే కావ్యమునకు ముఖ్యమని తేలుచున్నది.

శ్లో. సుధామయానీవ సుధాం గళంతి
విదగ్ధసంయోజన మంతరేణ;
కావ్యాని నిర్వ్యాజమనోహరాణి—

అనుటచేఁ గావ్యములు సుధామయము లైనవని విదితమగు చుండెను.

పరమేశ్వరావతార మనఁదగిన ధూర్జటికవివరుఁడు

శా. నత్కీరాదికవీంద్రులన్ దివిషద
న్నప్రాయవాగ్గుంభసం
పత్కావ్యప్రతిపాదకప్రతిభులం
బన్నిద్దఱన్ శైవసం
విత్కాసారమరాళరత్నములఁ ద
ద్విద్యారసాపేక్షు భూ
భృత్కంఠీరవుఁ డుంచె సంపదరిఁ దృ
ప్తిం బొందఁగాఁ జేయుచున్.

అని కాళహస్తిమాహాత్మ్యమున నమృత తుల్య [illegible] వాగ్గుంభ[illegible] నగు కావ్యములను జేయు నారని నుడివియుండెను.

కవి బ్రహ్మ యని పేరెన్నిక గన్నవాఁడును, శ్రీనాథకవికిం బూర్వికుఁడు నగు తిక్కనయజ్వ భారతాంధ్రీకరణమునకుఁ దొడఁగొని విరాటపర్వరచనారంభమున

ఉ. కావున భారతామృతము
కర్ణపుటంబులనారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు
నట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన
చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షా విధి నొంది పద్యముల
గద్యములన్ రచియించెదన్ గృతుల్.

అను పద్యమున భారతామృతమని చెప్పియుండెను. సహజ పాండిత్య మండితుండగు బమ్మెర పోతనామాత్య కవివరుఁడు:

మ. పరగోవిందకథాసుధారసమహాప్లోరుధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర! ఇతరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్గాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే?

అనుచు భాగవతరచనంబున గోవిందకథను సుధారసమని చెప్పియున్నాఁడు.

ఆంధ్రనైషధమున "మధురాక్షరములైన మాటలు వినంగ నమృతాంధసులై యోగ్యు లనుపమాంగి" అమృతరసమును గ్రోలిన యా దేవతలే మామాటల రసమును పరికింప నర్హులని శ్రీనాథుఁడే నుడివి యున్నాఁడు. కావున నో విమర్శకాగ్రగణ్యులారా!

శ్రీహర్షకవి తొలుత నిషధమును నలకథ సుధారసమును పోయుచున్నదని చెప్పిన దానిని శ్రీనాథకవీంద్రుఁడు శృంగారనైషధరచనారంభమున నుడుచుట పాడిగాదనియు, మహాకావ్యరచనకు రసపోషణమునం గొంత యనియు నా మదికిం దోచుటచే నిట్లు విన్నవించితిని.

ఇందలి యుక్తాయుక్తములను బుధలోకమే పరిశీలించునని వినయమున నుడువుచుంటిని.

అజంతా చిత్రము




3. హంసగ (హంసజాతకము)

# ద్రౌపదిరోషము, వ్యాసుఁడు—తిక్కన

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీకృష్ణుఁడు సంధికిఁ బోవునప్పుడు పాండవులెల్లఁ దమ యభిప్రాయములను జెప్పినపిమ్మట ద్రౌపది సాత్యకి సహదేవుల యాలోచనములను మెచ్చుకొనుచు భీముని శాంతిని జూచి మిగులఁగినియుచుఁ గన్నుల నశ్రువులు నించి శ్రీకృష్ణభగవానునితో ననుమాటలలో ముఖ్యము లివి. "ఏమియు నీయక సంధి నొప్పకొననిచో సృంజయసహితులై పాండవులు వారిని గెల్వఁగలరు. సామదానములచే సాధింపఁదగినది వారియెడ లేదు. వారియెడఁ గృప సూపవలదు. సామదానములచే సాధ్యులుగానివారిని దండించుట జీవితము గాపాడుకొనువారికి ధర్మము. నీవును పాండవులును గలసి యుద్ధము సేయుట యుక్తము. సర్వక్షత్రియసభా సమక్షము. లోభాక్రాంతులైన క్షత్రియులను, దదితరులను గూడ క్షత్రియుఁడు హింసము సేయునటె. చంపఁదగినవానిని జంపకపోవుటచేఁ గల్గుదోసము, చంపఁదగనివానిని జంపిన దోసమునంటిదే. నా దుఃఖము నీవెఱుఁగుదువు. నీసొమ్మైన నేను భీష్మద్రోణాదులుండఁ గోడలను గాజాలను. భీమార్జునులు కృపణులై సంధిగోరిరేని వృద్ధుఁడైన మాతండ్రి మహారథులైన పుత్రులతో వచ్చి పోరఁగలఁడు. నా యేవురు కొమరులు మహాబలు లభిమన్యుని ముందిడుకొని కౌరవులతోఁ బోరుదురు.

"పదుమూఁడేండ్లు కోపము లోనిడుకొని నిరీక్షించితి. ఇప్పుడు ధర్మమునే చూచుచున్న భీముని వాక్శల్యముచే హృదయము బ్రద్దలగుచున్నది" ఇట్లని బాష్పసన్నకంఠముతో నెలుంగు దొలుఁకఁ బలుకుచు గ్రిక్కిరిసియున్న వక్షోజయుగమును గన్నీటితోఁ దడుపుచు ఏడ్చెను. లోపలి వేడి ద్రవీభవించెనోయన వెచ్చని కన్నీరు గారుచుండె.

ఈ ప్రసంగమున ద్రౌపదిని శ్రీకృష్ణపాండవులకు ధైర్యము జెప్పుదానిగను, కౌరవులను జంపుడని స్పష్టముగా జెప్పుచున్న కుపితచిత్తురాలినిగను, కోపాతిశయముచే భర్తలను ధిక్కరించుచున్నదానినిగను, దుర్యోధనదుశ్శాసనులను రణహతులను జేయకపోతిరని మహాతాపముఁ బొందుచున్నదానినిగను వ్యాసుఁడు చూపెను.

తిక్కన యీ ద్రౌపదిని జాల మార్చివేసినాఁడు. ఈయన ద్రౌపది రోషమును గడు నిగూఢముగ వెల్లడించుచున్నాడు. పాండవులను అననట్లు అనుచున్నది. లోకము వారు తనభర్తలను బరిహసింతురేమో అను భయము తనకుఁ గలిగినట్లు పల్కుచు యుద్ధప్రోత్సాహమును జేయునట్లు చేయుచున్నది. "వారివలన గలిగినయవమానము వలన నాకుఁ బిచ్చియెత్తినది, నేను కారులు ప్రేలుచున్నాను. నా మాటలు పాటింపక పాండవులయొక్కయు నీయొక్కయు సౌజన్యమునకు భంగము లేకుండఁ గార్యమును సర్దుకొనుఁడు" అని యుపసంహరించుచున్నది. మాటలలో నెంతటిధ్వని యున్నదో చూడుడు. "లోకమున సహనశీలురని కీర్తిసంపాదించుకొనుటకే నీవును బాండవులును యత్నించుచున్నారు కాని నా బన్నములను గూర్చియు, నా దుఃఖమునుగూర్చియు మీరేమియు గణన సేయుటలేదు" అని యెత్తిపొడుచుచున్నది. ఇచ్చట వ్యాసుడు రసభావప్రధానకవిగను తిక్కన ఔచిత్యదృష్టియగు కవిగను గన్పట్టుచున్నారు. కోపము, భీముని శాంతిని సంధిప్రయత్నములను జూపుటచేతఁ బెచ్చుపెరిగి ద్రౌపదిని అనశురాలినిగాఁ జేసి గాంభీర్యమును బాఱఁదోలినదని తెల్పుట కామెను లోపలఁగలభావమును స్పష్టముగా వెళ్ళఁగక్కుచున్న యధీరనుగాఁ జూపినవాఁడు వ్యాసభగవానుఁడు.

శుద్ధాంతములనుండు రాజ్ఞికి సహజమైన గాంభీర్యమును బోఁద్రోలక ధీరతను గాపాడుచు భావమును నిరుపమానముగాఁ బోషించినవాఁడు తిక్కనమహాకవి.

ద్రోవది బొమ్మను వేయుట మున్నగువానిచేత నసామాన్యభావనిర్మాణదృష్టి వ్యాససూక్తులలో గగుర్పాటు గల్గించుచున్నది. రాణికి సముచితమైన భావసూచనా చాతురి తిక్కన నుడికారములు నాహా పుట్టించుచున్నది.

## వ్యాసుడు

ఉ. ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విప్పి
వెండ్రుకల్, దా నంచేతఁబూని యసితచ్ఛవిఁ
బొల్చు మహాభుజంగమో, నా విలసిల్లి వ్రేఁగ
మనంబునఁ బొంగు విషాదరోషముల్, గావఁగ
లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై.

వ. గోవిందు ముందటం బెట్టి యిట్లనియె.

క. ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత, వీనిన్.

సీ. ఈవెండ్రుకలు వట్టి యీడ్చిన యా చెయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింత లింతలు తునియలై చెదరి యా
పడియున్నఁ గని యుడుకాఱఁగాక
యలుపాలఁ బోనుపడునట్టి చిచ్చె యిది
పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బొటించి గాండీవ
మను నొకవి ల్లెవ్వడును సహించు

తే. కట్ట్రి విక్రమంబు గాల్పనే? యిట్లు బ
న్నములువడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయ మైతిమేనిఁ గృష్ణ!

ఉ. నెట్టన ఇట్టియల్క మది నిల్పితి రక్కసితాల్మిఁ జి
చ్చొప్పడిం, గట్టినయట్లు పెద్దయును గాలము నీనికి
నారు టున్నఁడుం, బుట్టదు దుష్టనిగ్రహము పూని
జగంబులు గాచినట్టి తోఁ,బుట్టువు నీవుఁ దేజమునఁ
బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా!

## తిక్కన

ఉ. అంతలు సేసి పోనడచి యక్కట! సంజయుచేతఁ
జెప్పిపు,త్తెంతురె? యిట్టిమాటలట మదిం బ్రియ
మందె యుధిష్ఠిరుండు దా, నంతన యూళు లేవురకు
నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ! యీ, కంత
కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్న
దమ్ములన్.

ఈ పద్యమున 'అన్నదమ్ములన్' అనుమాట ద్రాపది కసిని అపారముగాఁ దెల్పుచున్నది.

చ. తన మునుపడ్డబన్నములు దమ్మునిపైఁ గల కూర్మి
పేర్మి నీ, జనపతి సైఁపఁడున్నె? అది సక్కన రాజ్య
ముపాలు లేని తీ,ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి
పెట్ట ? చాలరైరి వీ,రనరొకొ! నానలేమి యని
యాడరె? లోకమువారు కేశవా!

ఈ పద్యములో 'తమ్మునిపై' అనుమాట కసికొద్ది వచ్చినది.

శా. పెంపేదం దమ కిట్టి తక్కువలు రూపింపంగ నేరం!
విచా,రింపన్ వారిక మేలు సంధి దమ వారిం జూ
చినన్ దారు సా,ధింపం జాలరో కాక పోరఁ దగ
మర్దింపం దలంపేని శం,కింపం బట్టరొకొ వారు బ్రా
హ్మణులె యేకీడైన సైరింపగన్.

ఉ. ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు
లేదు నీ, మాటలఁబోవునే దురభిమానమ మెక్కు
డు పూనుఁగాక య,చ్చోటన సంగరంబులగు
చొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్, పోటున కిచ్చ
గింతురొకొ! పోదురా! కానలనుండ నచ్యుతా!

'కానలనుండఁ బోదురా' అనుమాటలలో ఎంత భావ ధ్వని గలదో చూడుడు.

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె న
మ్మహా,పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరల
తోన యేను జె,చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయు
దునో! అటుగాక పాడిమై, పరవుడ మోపిచేయు
దునో! వారికి మాధవ, నిశ్చయింపుమా.

# మాదయ్యగారి మల్లన–రాజశేఖరచరిత్రము

### బండారు తమ్మయ్యగారు

ఉ. ఆదరణీయమై మృదుపదాంచితమై, లలితార్థభావన
మ్మోదకమై ప్రసాదరసపూరితమైన స్వతంత్రకల్పనా
పాదితరాజశేఖరనృపాలచరిత్రము గూర్చినట్టి మా
మాదయగారి మల్లనను మానితభక్తిని సంస్మరించెదన్.

ఆంధ్రభాషాపోషణరక్షణములకయి దీక్షగొని, యాంధ్రకవికల్పభూజమయి, యాంధ్రభోజుఁడని వినుతిగాంచి, దిగంతవిస్తారితకీర్తిసాంద్రుఁడయిన శ్రీకృష్ణదేవరాయమహీమహేంద్రుని రాజ్యకాల మాంధ్రవాఙ్మయమునకు స్వర్ణయుగమని కొందరు చెప్పెదరు. నన్నెచోడుఁడు, పాల్కురికి సోముఁడు మున్నగు నేకొలఁది మంది శైవకవులో రచించిన కృతులు తప్పఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వమాంధ్రభాషలో వెలువడిన కావ్యము లన్నియు సాధారణముగా సంస్కృతపురాణేతిహాసాదుల కాంధ్రీకరణములయి యున్నవి. ఎఱ్ఱాప్రెగ్గడ శ్రీనాథుఁడు మున్నగువారి కృతులలోఁ బ్రబంధవాసనలింపుగు గుణములు కొన్నను గేవల ప్రబంధరచనమనునది కృష్ణరాయలకాలమున నాంధ్రభాషాపోషకుఁ గలిగిన భూషావిశేషమై యున్నది. మనుచరిత్రాద్యుత్తమప్రబంధరత్నము లీకవిరాజగ్రుని పోషణమున వెలువడి యాంధ్రభాషయొక్క భావ్యభివృద్ధికి సహాయకములు, మార్గదర్శకములు నయినవి. కాని యివికూడ స్వతంత్రవర్ణనావిశేషములతో విస్తృతములయి నూత్నరూపమును దాల్చిన పౌరాణికకథానకములే కాని వేఱు కావు. స్వకపోలకల్పితములయిన కేవలస్వతంత్రకావ్యము లప్పుడు గూడ నంతగాఁ గూర్పబడినట్లు కానరాదు. ఆంధ్రకవితాపితామహుని మనుచరిత్రము, సాహిత్యరసపోషణుఁడగు రామరాజభూషణుని వసుచరిత్రము, ముద్దుఁబలుకుల ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణము, స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము, పదగుంభనచాతురీధురీణుఁడగు రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము.—ఇత్యాదు లన్నియుఁ బౌరాణికగాథాగ్రథితములే కాని స్వకపోలకల్పితకథావిలసితములు గావు. పరికించి చూడ మాదయ్యగారి మల్లన రచించిన రాజశేఖర చరిత్రమొక్కటియే యాకాలమున రచింపఁబడిన స్వతంత్రగ్రంథముగాఁ గాన్పించెడిని. మల్లనార్యుఁడు కృష్ణరాయల విద్వత్సభ నలంకరించిన కవిదిగ్గజములలో నొక్కఁడు. కుమారధూర్జటికృతమయిన కృష్ణరాయవిజయములోని యీ క్రిందిపద్యముల వలన నీతఁడు పెద్దనాదులతో సమంబుగ రాయల వలన గౌరవాంకముల నందియుండునని తలంచుట కావంతయు సందియ ముండదు.

గీ. అటులు జయలక్ష్మిఁ గైకొని యరుల కరుల
హరుల ధనపంక్తులను దన పరముచేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవగరిమ
కాంచి కన్నులపండువు గాఁగ నపుడు.

గీ. సరససాహిత్యరచనవిస్ఫురణ మెఱయు
సారమధురోక్తి మాదయగారి మల్ల
నార్యుఁ డల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైన ముఖ్యకవులు.

క. వినిపించి రపుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనత నొసఁగి యా
జనవరుఁ డప్పాజిఁ గనుం
గొని యిట్లని పలికె నపుడు కుతుకం బలరన్.

పాండిత్యశౌండీర్యమున గాని ప్రతిభాతిశయంబునగాని యీతఁడు తన తోడిదిగ్గజముల కించిన్మాత్రము తగ్గుఁజూపెడివాఁడు కాఁడు. కాని రసైకపరతంత్రుఁడై గ్రంథరచనమున నీతఁడు వారందఱికంటెఁ బ్రత్యేకప్రతిభాస్వాతంత్ర్యములఁ బ్రకటించియున్నాఁడు. ఈవిషయ మీతని రాజశేఖరచరిత్రమును, ఆకాలముననే వెలువడిన తత్తోద్వర కవుల ప్రబంధములను సవిమర్శముగ బరికించినఁ దెలియఁ గలదు. కేవలకల్పనాకథల విషయమయి యప్పటి కవివరుల కొక సరణి నిరసనభావమే యుండినట్లు రామరాజభూషణుని యీ క్రింది పద్యమును బట్టి యూహింప దగియున్నది.

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
హావిరిఁబుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
కావున నట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

కాని మన మల్లనార్యుఁ డట్టి యభిప్రాయమును ద్రోసిరాజని కేవలస్వకపోలకల్పితముగానే తన కృతిని విరచించినాఁడు. మఱియు నీతఁడు దీర్ఘసమాసాడంబరములకు శ్లేషయమకాద్యలంకారములకు, గూఢార్థభావములకుఁ బ్రాధాన్య మొసంగక ముద్దులొలుకు జానుతెనుంగుఁ బలుకులను జాలువాఱ జాలువార్చి, తన నవ్వైకపారతంత్ర్యమును బ్రకటించి, యత్యంతసంగ్రహముగనే పుణితోడఁ దనకావ్యమును మూఁడాశ్వాసములలో రచించి ముగించి యున్నాఁడు. ఈ రాజశేఖరచరిత్రమందలి కథఁ దానెందుండి గైకొనినది కవి తెలిపియుండలేదు. అందుచే నిది కేవల మతని స్వకపోలకల్పిత మనియే నాతలంపు. గ్రంథమందలి పాత్రముల నామములఁ జూచినను నీయూహయే బలపడుచున్నది. కేవల కల్పనాకథను నితివృత్తముగాఁ గైకొనుట, అనవసరవర్ణనములతో గ్రంథమును బెంచకుండుట, పాండిత్యప్రదర్శనమునకై దీర్ఘసమాసాదులకు శ్లేషాద్యలంకారములకుఁ జోటువడక రసోచితములగు లలితంపుఁ దెలుఁగుఁ బలుకులకుఁ బ్రాధాన్య మొసంగుట— ఇవియే యీ కవివరుఁడు తనతోడికవులకు విలక్షణముగాఁ జూపిన వ్యక్తిస్వాతంత్ర్యమును బ్రకటింపఁజాలును.

## కవివృత్తాంతాదికము

మాదయ్యగారి మల్లనయను వాడుకయేగాని యాతని గృహనామ మేదియో సరిగాఁ దెలియవచ్చుటలేదు. "అయ్యంకిపురాగ్రహారవిభవాకర" అని కృతిపతి తన్నుఁగూర్చి పలికినట్లుగా వ్రాసికొనిన విశేషణమునుబట్టి యీతఁ డయ్యంకిగ్రామమునకుఁ గరణమో శ్రోత్రియముదారో యైయుండు ననియు, గ్రామనామమునుబట్టి యీతని యింటిపేరుగూడ, అయ్యంకివారై యుండవచ్చుననియుఁ దలంప నవకాశము కల్గుచున్నది. అయ్యంకి కృష్ణామండలములో దివితాలూకాలో నున్నది. ఈతఁడు శైవబ్రాహ్మణుఁడు; మాదయామాత్యుని పుత్రుడు; అఘోరశివాచార్యుల శిష్యుఁడు; పారిజాతాపహరణకర్తయగు నంది తిమ్మనయు, నాతని మేనమామయు మలయమారుతాభిధానుఁడు నగు ఘంటసింగయయుఁ (వరాహపురాణకృతికర్తలలో నొకఁడు) గూడఁ దామీ యఘోరశివాచార్యుల శిష్యులమని, వ్రాసికొనినారు. కావున నీకవివరులు మువ్వురు గూడ నఘోరశివాచార్యులవద్ద శైవదీక్ష నందినవారని తలంపవచ్చును. "శ్రీమదఘోరశివాచార్యగురుకరుణావశేషలబ్ధసారస్వత" అని మల్లనార్యుఁడు గద్యమందు వ్రాసికొనిన విశేషణమును బట్టి యాశివాచార్యుఁ డీతనికి విద్యాగురువుకూడ నై యుండునేమోయని తలంప నను వగుచున్నది.

## కృతిపతి

మల్లనార్యుఁ డీకృతిని కృష్ణరాయలకు సచివసత్తముఁడయిన సాళువ తిమ్మరుసుయొక్క యల్లుఁడు మేనల్లుఁడు నగు నాదిండ్ల యప్పయామాత్యుని కంకిత మొనరించినాఁడు. కృష్ణరాయలు పూర్వదిగ్విజయయాత్రలో గుత్తి, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి మొదలగు దుర్గముల జయించి వానికి విశ్వాసపాత్రులగు తన యనుచరులను బరిపాలకులుగా నియమించియున్నాఁడు. వారిలో సాళువ తిమ్మరుసు మేనల్లుఁడగు నాదిండ్ల యప్పయయు, గోపయయు ముఖ్యముగఁ బరిగణింపఁబడియున్నారు. వీరిలో అప్పయ గుత్తికిని, గోపయ కొండవీటికిని దుర్గపరిపాలకులుగా నియమితులయినట్లు తెలియవచ్చుచున్నదని నామిత్రులు శ్రీముద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు తమ "కొండవీటి సామ్రాజ్యము"లో వ్రాసిన కొండవీటిదండకవిలెలో నుదాహృతములయిన గోపయమంత్రి శాసనములను గొన్నిటి నుదాహరించిరి. వీనిలో గొండవీటి శ్రీయజ్ఞవాటికారఘునాయకస్వామి యాలయమునకు శిఖరప్రతిష్ఠాదులు సెలకొల్పుచు గోపయమంత్రి శా 1442 (1520 A D సంవత్సరమున లిఖించిన శాసనము ముఖ్యమయినది. ఈశాసనములో మనకృతిపతియగు నప్పయమంత్రి కీర్తిప్రతాపము లీక్రిందివిధమున గీర్తింపబడినవి.

శ్లో. జంభద్వేషిప్రజృంభికుంభిద్వయసవిపశిచీనారువక్షోజకుంభ
న్యక్కృవ్యాపృతానుప్తప్రసృమరమసృణాశ్లోపకర్పూరపూరా
యత్కీర్తిః కార్తికేందుం పరిహసతి నిజైశ్వర్యసంప్రీతధీమాన్
సోయం నాదెండ్లయప్పప్రభుమణి రఖిలస్తుత్యకీర్తిప్రతాపః.

శ్లో. యద్ధాటీఘోటకోటీఖరఖురదళితాన్మోత్తలోద్ధూతధూళీ
పాళీపాతాళకేళీకృతధరణితలే ఖడ్గయుగ్మస్య బాహుః
జిహ్వాలాభీలఘూర్ణద్భుజగపరివృతః లక్ష్యతే సిద్ధసంఘైః
సోయం నాదెండ్లయప్పప్రభు రవనిభరాధారబాహుప్రతిష్ఠః.

కాని యీతఁ డేదుర్గమునకుఁ బరిపాలకుఁడో యందు స్పష్టపఱుపఁబడలేదు. కొండవీటిపాలకత్వము మాత్రము గోపయమంత్రి కొసంగఁబడినటులు శాసనమందలి యీక్రిందిశ్లోకములవలన సువ్యక్తమగుచున్నది.

శ్లో. శ్రీకృష్ణక్షితిపాలమౌళిసచివః శ్రీసాళ్వతిమ్మప్రభుః
జామాతృప్రవరే ధురంధరవరే శ్రీగోపమంత్రీశ్వరే
ప్రాదత్తాఖిలకొండవీటినగరీసామ్రాజ్యధౌరేయతాం
మత్తేభాశ్వపదాతిసైన్యకరితాం పల్యంకికాం చామరీం.

శ్లో. శ్రీకృష్ణరాయనరనాథశిరఃప్రధానః
శ్రీసాళ్వతిమ్మసచివేశ్వరభాగినేయః
నాదెండ్లగోపసచివో నయతత్త్వవేదీ
శ్రీకొండవీటినగరైకధురంధరోభూత్.

కాని మన మల్లనార్యుఁడు రాజశేఖరచరిత్రావతారికలో నీగోపయమంత్రిని గుత్తిదుర్గపరిపాలకునిగా వర్ణించినాఁడు.

ఉ. ప్రాపితరాజ్యవైభవనిరాకృతపాకవిరోధియైన యా
గోపనమంత్రి ధర్మనవగోఘనసమ్మతి గుత్తిదుర్గల
క్ష్మీపరిపాలనక్రమసమృద్ధభుజాబలశాలి యూపరే
ఖాపరమత్స్యలాంఛనుఁ డయాపహకార్యధురంధరుండిలన్.

ఈవ్యత్యాసమునకుఁ గారణము తెలియకున్నది. అప్పయమంత్రి యేదుర్గపాలకుఁడో మల్లనకూడ దన గ్రంథమున వివరించియుండ లేదు. కాని యాశ్వాసాంతపద్యములలోని "పుంభావపూర్వభూభృద్దిశానారీమన్మథా" అను విశేషణముచేత నీతఁ డుదయగిరిదుర్గరక్షకత్వమున నియుక్తుఁడయి యుండునేమో యని నేఁ దలంచుచున్నాను. ఈయప్పయమంత్రి శా. శ 1438 (క్రీ. శ. 1516) సంవత్సరమున వినుకొండసీమలో భర్తిపూండి యను గ్రామమును స్వనామాంకితముగ రాయనిభాస్కరుఁడను విద్వాంసునకు దానమొసంగిన శిలాశాసన మున్నది. (ఈభాస్కరుఁడు మంత్రిమానాటిశాసనములలో నుదాహృతుఁడయిన రాయనిభాస్కరుఁడు కాఁదగును.) ఇందుచే నప్పయమంత్రి యధికారము వినుకొండసీమలోఁగూడఁ జెల్లుచుండినట్లు తెల్లమగుచున్నది. మల్లనార్యుని యాశ్రితపద్యమువలన నీతఁడు గోపనయు వేర్వేఱు దుర్గములకుఁ బరిపాలకులుగా నియమింపఁబడినను, అన్యోన్యప్రీతితో నిరువురు తమ రాజ్యభాగముల నించుమించుగ నేకముగనే కలిసి పాలించుచుండినట్లూహింపవచ్చును.

క. ఆయనుగుంపప్పఁడు విన
యాయతమతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడున్
బాయక యన్యోన్యప్రియు
లై యలరిరి రామలక్ష్మణాకృతులగుచున్.

## కథాసంగ్రహము

ఆనందికయను పురమును హేమప్రభుఁడను రాజచంద్రుఁడు పాలికయను కులపాలికామణీసహితుఁడయి పాలించుచుండెను. సకలైశ్వర్యసంపన్నులయ్యు నాదంపతులు సంతానసంపద లేమికి సంతాపించి భక్తార్తిహరుండగు రాజశేఖరు నారాధించి తత్ప్రసాదమున రాజశేఖరుఁడను పుత్రునిఁ బడయుదురు. దినదినప్రవర్ధమానుఁడయి యారాజసూనుఁడు యువరాజపదంబు నంది రాజులనెల్ల జయించి తండ్రికి ముదంబు గొలుపుచుండ నొకనాఁడు వరతంతుమహామునిశిష్యుఁడు జటిలకౌశికుఁడను తాపసుడు హేమప్రభుని పేరోలగమున కేతెంచి మందరాచలప్రాంతవాసియగు విశంకటుఁడను దానవుఁడు కాళికానుగ్రహప్రసాదదత్తమగు లోహమయాశ్వమును బడసి గర్వాతిరేకమునఁ గన్నుగానక తన రాణివాసమునఁ గూడిగమొనర్చుటకయి మునికుమారికల నపహరించుచు బదరికాశ్రమతాపసుల నలయించుటెఱింగించి వానిచే ముచ్చిలింపఁబడిన యేడేండ్లబాలిక తనకొమరిత భానుమతిని విడిపింప నీశ్వరప్రసాదజనితుండయిన రాజశేఖరకుమారునిఁ దనవెంటఁ బంపుమని ప్రార్థించును. కానకకన్న యాసుకుమారుని భీకరనిశాచరునిపైఁ బంపుటకు వెనుకాడియు మునీశ్వరనిరోధమున నెట్టకేలకొడంబడి యానృపవరుండు బలయుసైన్య మిచ్చి కుమారు నాతనికొసంగును. దనుజమాయల మాయించు మాయాభేదిని యను విద్య నామునివరునివలన నుపదేశమంది రాజశేఖరుఁడు తనమాయల సాగనీయక యవక్రవిక్రమక్రమంబు నెఱపి యాగ్నేయాస్త్రమునఁ దనలోహహయంబును నీఱుసేయ విశంకటుఁడు భయంపడి రణరంగమునుండి పాఱిపోయి కాళికాదేవి మఱుఁగు సొచ్చెను. అంత నామహాదేవి రాకుమారునకుఁ బ్రత్యక్షమయి తనకయి యారక్కసుని క్షమింపుమనియుఁ దాఁగోరినప్పుడ మునికన్యక నొకతెను గొనివచ్చి యాతనికి సమర్పించుననియు వెలువిచ్చి సకలాభీష్టప్రదమ్మగు రత్నమొక్కం డాతనికిఁ బ్రసాదించి యంతర్హిత యగును. అంతలో నాతని ప్రేమాలకుఁ గాళికాసేవకురా లొకనాగిని వచ్చి తన గృహమునకుఁ గొనిపోయి విశంకటుని చెఱనుండి తానదివఱకే తప్పించి ప్రోదిసేయుచుండిన భానుమతీకుమారిక నాతని కప్పగించి సకలశాస్త్రజ్ఞానసంపన్నమగు శుకరాజము నొకదాని నాతనికిఁ బసవన మొసంగును. అనంతర మాతఁ డాబాలిక నామె తలిదండ్రుల కొసంగి, చారుల మూలమునఁ దనవిజయమును దండ్రికి వార్తనంపి బదరికాశ్రమమున కేఁగి యచ్చటిమునివరుల దీవనలఁ బడసి నిజరాజధానికి మరలుచు మార్గమధ్యమున నొకసరోవరతీరమున విశ్రమించును. కామోద్దీప్తమగు రతనమ్ము మహిమమ్మువలన నొనగూడిన యిష్టమృష్టాన్నముల సంతృప్తుఁడయి తత్పరిభావమును బ్రశంసించి యారాకుమారుఁడు శుకముఖ్యునితో ముచ్చటించుచుండ సింధురాజపుత్రి కాంతిమతి వసంతసమయ మగుటచే నెచ్చెలులతో జలకేళి కచ్చటి కేతెంచును. అప్పుడు వారిరువుర కన్యోన్యావలోకనమున ననురాగ మంకురించును. కందర్పుఁ డందు పయి ముందుపని సాగించును. విరహాతురుండయి రాజపుత్రుఁడు రాకుమారిసౌందర్యమును వర్ణింప శుకవరుండును "ఆమె సామాన్యమానవస్త్రీ కాదు. తొల్లి పుష్పవతీపురం బేలు నందకుఁడను గంధర్వనృపతి సుతలతయను బాలికయు, మహేంద్రనగరాధినాథుఁడు చిత్రవాహనుఁడను యక్షాధ్యక్షుని తనయ కనకమంజరియు యమునాతీరమునఁ బుష్పాపచయకేళి యొనర్చుచు నొకక్రొన్ననఁ గూర్చి తగవులాడి పోటుమాటల నొకరి నొకరు తూలనాడికొనిరి. అప్పుడు కనకమంజరి తత్సమీపమున శ్రీహరినిగూర్చి పంచాగ్నిమధ్యమునఁ దపమొనర్చెడి యరుణపురవాసి యగుణాఢ్యుఁడను విప్రవరునిఁ జూపి హావభావవిలాసవిభ్రమంబుల నాతని మనంబును గలంచుటయే జాణతనమని లతాకన్యకతోఁ బలికి పన్నిదము వైచును. అందుల కాలత మదాతిరేకమున నెల్లెయని యొడంబడి యాతనిప్రేమాల విహరించి తత్తపోపాసలమునకు గురియై మర్త్యకాంతయయి జన్మింపుమని యాతనిచే శపింపఁబడియెను. వేఱొకకారణమున మైంధవుఁడను నిందువంశ్యునకుఁ గుమారుఁడయి యవతరించిన కంబుఁడను యక్షరాజునకుఁ దనయుఁడయిన సింధుఁడను రాజోత్తంసుని గర్భమం దాగంధర్వకన్యయే శాపవశమునఁ గాంతిమతీరూపమున జననమొందినది. ఈమె రూపాతిశయ మపురూపము. ఆమెయ తనకనురూపమగు సతీతిలకము" అని యామె పూర్వవృత్తాంతమును విన్నవించును. అనంతర మా శుకతంసము నెఱపిన దౌత్యమువలనఁ గాంతిమతీరాజశేఖరుల వివాహమహోత్సవ మతివిభవముతో జరగును. పలయు నీతులను గఱపి తలిదండ్రులు కాంతిమతిని భర్త

వెంట నత్తవారింటికిఁ బంపుదురు. హేమధన్వుఁడు నాతనిసతియు నమందానందమంది శుకవరుని గొనియాడి కొడుకును గోడలిని నాశీర్వదింతురు. రాజశేఖరుఁడు కాంతిమతీసహితుఁడయి సకలసౌఖ్యము లనుభవించుచు సుఖంబుండును.

## కావ్యవిశేషములు

మల్లనార్యుని రచనమందలి ముఖ్యవిశేష మసామాన్యపదలాలిత్యము. ఇతఁడు రసైకపరతంత్రుఁడని వెనుకనే చెప్పియుంటిని. కావున సంస్కృతాంధ్రములలో నేది పలికినను నీతఁడు కోమలములు శ్రవణపేయములు నగు మృదుమధురపదములతోడనే గూర్చుచుండును. అందుచే నీతని కవితాధార కౌశికీవృత్తి నలరారి, వైదర్భీరీతిఁ బెంపెసలారి, ద్రాక్షాపాకమునఁ జవులూరుచుండును. రసప్రాధాన్యమును హెచ్చరించుచు నీతఁడు చెప్పిన పద్యముం గనుఁడు.

క. చెప్పఁదగుఁ గవిత రసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యన లేదా
యెప్పుడుఁ జెప్పకయుండుట
యొప్పుసుమీ సుకవి యెంత యుచితజ్ఞుఁడొకో.

ఏమి యీతని యుచితజ్ఞత! రసము చిప్పిలునట్లు కవిత చెప్పనేరనిచో నెప్పుడు చెప్పకుండుటయే యొప్పుఁట! ఎంత సత్యసమ్మతమయిన సంగతి! మఱియుఁ గవిత్రయమునకుఁ గయిమోడ్పొసరించుచు జెప్పినపద్యమే యీతని యుచితజ్ఞతారసజ్ఞతలను వేనోళ్లఁ బ్రకటింపఁజాలియున్నది.

గీ. సరససంస్కృతపుష్పగుచ్ఛప్రభూత
మగు తెనుంగను నెత్తావి కఖిలదిశలఁ
దరుణపవమానమగు కవిత్రయవిశేష
చతురవాచానిరూఢి కంజలియొనర్చి.

ఎంత సరసోపమానము! ఎంత సంగ్రహనైపుణ్యము!! కవిత్రయమువారి వాగ్విశేషము మాట యెట్లున్నను నీ తెనుంగు నెత్తావికి కవివరునివాణిగూడఁ దరుణపవమానమయిన దనుటలో నతిశయోక్తి లేదు. మచ్చునకీ క్రింది పద్యములు చూడుఁడు.

ఉ. కాఁకరపండువంటి జిగి గల్గిన మేలిపసిండి ధాత్రికిన్
ప్రేఁకము ద్రవ్వి పోసినను వేయియుగంబులు చెల్లు ధాన్యముల్
పోఁకకుఁ బుట్టెఁడమ్మినను బో నొకకల్పము పట్టుఁ జూడ్కికే
శేఁకటితీఱ వైశ్యపతు లిండ్లు గనుంగొన నొప్పు నప్పురిన్
(అ 1, ప 50)

ఉ. మచ్చికతోడఁ బాలులు కుమారుని నక్కునఁ జేర్చి వీధికిన్
వచ్చి సుఖోపలాలనము నన్ మునిమాపులు ముద్దుసేయఁగా
నిచ్చలు నిచ్చలుం గని యొకించుక యేనియుఁ బాయ లేనటుల్
ముచ్చటదీఱ నింక మనముం గయికొందుమె యట్టిభాగ్యముల్.
(అ 1, ప 61)

ఉ. పంగురువంటి నెమ్మొగము చక్కటిఁ దూలఁగఁ బుట్టు వెంట్రుకల్
గందలిరాకు పాదములఁ గీల్కొనఁ జేసినయట్టి చిన్నిపైఁ
డందెలు గల్లుగల్లుమన నాడుచు నల్లన చేరవచ్చి నా
ముందఱ నాడ నెన్నఁడొకో ముద్దియ ముద్దుఁగుమారుఁ గాంచుటల్.
(అ 1, ప 63.)

సీ. కడుఁపారఁగాఁ బచ్చికలి మేసి తముదామె
యావులు చేఁపి పన్నవసి పిదుకఁ
దతికాల మొక్కింత తప్పనీక మొగుళ్లు
నెల మూఁడువానల నెలమిఁ గురియు
వెరిఁగి దట్టంబులై చీడుపోక పనర్చి
సకలసస్యములు దుర్నికయ పండఁ
దలపూవువాడక తామరతంపరై
ప్రజలు సుఖింత్రును జరితమింత్రు.
గీ. మునుల తపములు నిర్విఘ్నముగఁ జెలంగ
నెంచుఁ గలిదోష మావంత చెందనీక
క్రతుఫలంబుల సురల యాకండ్లు దీర్చి
ధరణిఁ బాలించె నా హేమధన్వనృపతి.
(అ 1, ప 57.)

సీ. చిగురాకులే కత్తు లగునేని నింతకు
దగర కోయిలనోరు తెగకయున్న
యలరుఁదేనియ వేఁడి యగునేని నింతకుఁ
గందుఁదు మ్మెదముక్కు కములకున్న
యుగవిరులే నిప్పు లగునేని నింతకుఁ
బూవిల్తు నఱచేయి పొక్కకున్న
యసదుగాలియె వెట్ట యగునేని నింతకుఁ
గములవనం బెల్లఁ గ్రాఁగకున్న
గీ. భామ యేటికిఁ జిగురుకై వాడఁబాఱు
వనిత యేటికిఁ దేనెకై వడియఁబాఱు
నెలఁది యేటికి ననలకై వెల్లఁబాఱఁ
బొలఁతి యేటికి సురటిగాడ్పులకుఁ బాఱు.
(అ 3, ప 111.)

జిలిబిలిపలుకులతో రసము చిప్పిలఁజేయుచుఁ బెద్దపెద్దభావములను జిన్నిచిన్నిపద్యములలో నిముడ్చుటయం దీతఁడు మిగులజాణ.

క. అన్నగరి చిఱుతయేనుఁగు
గున్నలపై నెక్కి నిక్కి కోయఁగ వచ్చున్
మిన్నేటి పసిఁడితామర
లన్నన్ మఱి యేమి చెప్ప నందలి కరులన్. (అ 1, ప 51.)

గీ. నీలకంఠుని శిరసుపై నీళ్లు చల్లి
పత్తిరిసుమంత యొన్నఁడు పాఱవైచుఁ



డాక్టరు అన్సారీగారికి స్వాగతము–చెన్నపురి



లజపతిరాయిగారి స్మారకదినము–చెన్నపురి



గా॥ పటేలుగారికి స్వాగతము–చెన్నపురి



షణ్ముఖం చెట్టిగారికి సన్మానము-చెన్నపురి



కెల్లాగు సంధిపత్రమున సంతకములు చేయుట-ప్యారిస్

గామధేనువు వానింటి గాడిపసర
మల్ల సురశాఖి వానింటి మల్లెచెట్టు. (ఆ 1, ప 65.)

వేయేల! కాళిదాసాదుల సంగ్రహసైపుణి యీ కవివరునకుఁ గూడఁ గల దనుట కల్ల కానేరదు.

నానారూపణవైచిత్ర్యము మెఱయఁ బ్రతిపాద్యవస్తువును మనస్సున కెక్కునట్లు హృదయంగమముగ వర్ణించుటయం దీతఁడు చాల నేర్పరి. కలిమిలేముల ప్రాభవమును వర్ణించిన పద్యములఁ దిలకింపుఁడు.

సీ. నెమ్మేనితిమిరంబు-నేత్రగోళంబుల
పరకర్ణపుటముల-ప్రస్తి నోరి
వాకట్టుమందు గ-ర్వలతాలవాలంబు
వినయకృత్యంబుల-వేరువిత్తు
కరుణారసంబు తె-క్కలికాఁడు మదిగొట్కు
పాతకంబులపా-లి పట్టుఁగొమ్మ
మొగమాటపుమగని-పగరాజసంబుల
యిక్కన సుగుసే-కెదురుముక్క
గీ. పసుమనర్తన కునికి లోభంబు పెంకు
బాంధవస్నేహసింహరపాలకంబు
కలశపాథోధి పుత్రి క్రేఁగంటిమాడ్కి
గాని రాజులనేగమి కాదు సువ్వె. (ఆ 1, ప 21.)

మ. కులనిర్మూలనకారణంబు ప్రతిభా కుట్టాక ముద్యోగకో
పలతాదోహద మాజనంజనసుఖప్రత్యూహ మాత్మన్యథా
జ్వలనజ్వాలిక కామినీనయనవీక్షాపాతసంరోధి ని
త్యలఘుత్వాశ్రయభూమి లేమి యని యాహా! యేమి గావింపదే. (ఆ 3, ప 14)

దీర్ఘములగు సంస్కృతసమాసము లీతనిగ వనమం దంతగాఁ గానరావు. క్వాచిత్కముగ నందందుఁ గూర్చఁబడినను నవి సుగుమధుర పదఘటితములయి యర్థాన్వయసులభములయి వీనులకు విందుగొలుపు చుండును. చూడుఁడు.

ఉ. విందువుబోలె నోవిమతవీరభయంకర! రాజలోకసం
క్రందన! నీవు రా నెదురురాఁ జనుదెంచె నిలింపకామినీ
బృందలతాంతకాంతకబరీభరసౌరభసారసన్నిభ
మ్మందరకందరాసవిధమంథరబంధురగంధవాహముల్. (అ 2, ప 45.)

పాత్రముల రూపవర్ణనాదుల నచ్చునగుద్దినట్లు చిత్రించు విన్నాణమునఁగూడ నీతఁడు మిన్నయని యెంచవచ్చును.

సీ. అలికంబుపై రక్తతిలకంబు తెలిగన్నుఁ
గవయందుఁ గాటుక కర్ణపాళి
ములఁ బటికంపుఁ గుండలములు గళమున
సంకుప్రాపల కంఠసరులు గుబ్బ
చనుదోయి వన్నెకుచ్చలిగంత దాపలి
కరమునందు విభూతి కత్తుపాల
పాణిపద్మంబున మాణిక్యమయవీణ
పదయుగంబునఁ జెండిపాదుకలును
గీ. నుదరబంధంబు లాతంబు దోయోగపట్టె
సింగినాదంబు జెత్తంబు చెన్ను మెఱయ
నుట్టిపడ్డట్టు యోగిని యోగుపచ్చి
లీల నారాజశేఖరు ప్రోల నిలిచి (అ 2, ప 94.)

శ్లేషయమకాద్యలంకారములకయి యీరసికకవివతంసుఁ డంతగాఁ బెనఁగులాడువాఁడు కాఁడు. ఎడనెడఁ బ్రయుక్తములయి నను నవిగూడ శ్రవణసుభగములయి రసవిస్ఫురణమునకుఁ దోడ్పడునవి గనే తనరుచుండును. పూమొగ్గలవోలెఁ దామే విరియు శబ్దశ్లేష లేగాని యర్థశ్లేష లీతని రచనమున నసలే గానరాకుండును.

క. కని కరము మోడ్చు పగరం
గనికరమునఁ బ్రోచు లేక కలహించెన నే
నని లోనఁ జలము పూనిన
నవిలో నిజకోపవహ్ని కాహుతి సేయున్. (అ 1, ప 56.)

క. ................మిహికా
సారము నెననెడు మిహికా
సారము చేరంగఁ జనిరి సారస్యమునన్. (అ 2, ప 151.)

మ. జటిసంఘాతసమీపసంఘటితగజ్యద్వాలుకాలింగసం
స్ఫటమల్ జన్మపగంపరాఘులతికామాలచ్ఛిదాపాదనో
ద్భటముల్ ముక్తినధూపచాగ్రసటముల్ భాస్వత్తనూసంభవా
తిలముల్ వానికపిన్ పసించు నగు చెంతం జేర వేచింతలున్. (అ 3, ప 83.)

చ. ప్రచురవివేకసార! యల బాలిక నేసుని చెప్పునాఁడ వా
గ్రసలు గావు మే నమరుఁ గల్పకవల్లి మతల్లి తల్లియై
కసనిసయంబు సొల్పుమరుఁ గాఁగ్నను తుమ్మెదచాయ చాయయై
కునలికుసంబు లింపెసఁగుఁ గ్రొవ్విరిబంతుల మేలిబంతులై. (అ 3, ప 74.)

కల్పనాశిల్పమునందుఁగూడ నీకవివరుని ప్రతిభ యనల్పమే.

క. తరుణపవమానమదకేసరిపోతము విటపికుంజసామజకుంభాం
తరములు గ్రొవ్వినఁ దొరిగెఁడుగురుమౌక్తికభాతి రాలెఁ గ్రొవ్విరులవిగో. (అ. 2, ప 118.)

గీ. సవిధకీర్ణపరాగాగ్ని సాక్షిగాఁగ
దమ్మివిందు కరగ్రహణ మ్మొనర్పఁ
బొలుచు పద్మినికిని నల్ల పూసవండ
గట్టినాఁడన నెలదేఁటిగములు పొదలె.

(ఆ 2, ప 69.)

క. పడఁతులకన్నులఁ గనుఁగొని
యడిదియాసలఁ బోవుఁ దల్లులని శిఖరంబుల్
నిడుదలౌ యటువలె నవి కడు
వెడఁదలౌ జఘనతుల కావివేకము గలదే. (ఆ 2, ప 158)

గీ. సవిధతరుజాలపుష్పగుచ్ఛములఁ జూచి
యువిసదముగోయి కోసి పైనమిసె సనఁగ
గగనగాయితనిర్మలతారహార
వల్లికాకాంతిపుంజంబు వెల్లు గాసె. (ఆ 2, ప 180.)

చక్కని లోకోక్తులు, జాతీయములుగూడ నంసంగు సందర్భోచితముగ నుపయుక్తములయి యీతని కవనమునకు వన్నె గూర్చుచున్నవి.

క. అల్లారుచెల్లమై గలు
గల్లున నందియలు మొరయఁగా వేడుక పె
న్వల్లి ముసిఁగించె ధరణీ
వల్లభనందనుఁడు చూచువారల చూడ్కుల్. (ఆ 2, ప 5.)

క. కొఱవిం దలఁగోకికొనుటకుం దలపెట్టెన్. (ఆ 2, ప 23.)

సీ. పులినోరికండయైపోయిన మన భాను
మతిఁ గ్రమ్మఱించిన యతఁ డితండు.

(ఆ 2, ప 112.)

క. పూచిన తంగేడుగతి వి
ద్యాచతురుం డతని సోమిసమ్మ ... (ఆ 3, ప 22.)

క. ...కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికినవారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా.
(ఆ. 3, ప 25.)

ఉ. నూదిపిటెందిదాగమయి
చొచ్చినచోటులు చొచ్చి... (ఆ 3, ప 26.)

క. మూసినముత్యమువలె కడు
వాసియు వన్నెయును గలిగి వరుఁ డౌనఁగా
నీ సకలబంధుకోటికి
బూసలలో దారమగుచుఁ బొసఁగ మెలఁగుమీ.

(ఆ 3, ప 198.)

గుణరసైకతత్పరుఁడగు నీకవివరుని రచనయందలి గుణముల నిట్లెన్నియైన నుడువవచ్చును గాని గ్రంథవిస్తరభయంబున నింతటితో విరమించెద. ఈతని కించుక యర్వాచీనుఁడయి కవిత్వనిర్వహణమున నీతనివలెనే ప్రత్యేకప్రతిభాస్వాతంత్ర్యముల నెఱపిన పింగళి సూరనార్యకవివర్యుఁ డీగ్రంథమందలి శుకపాత్రమును జూచియే తన శుచిముఖీపాత్రమును దీర్చి దిద్ది లెస్స వెలయించినాఁడేమో యని నాయభిప్రాయము.

## రసాదికము

ఈకావ్యమందలి ప్రధానరసము శృంగారము. స్త్రీలు బాలురు గూడ నిరాతంకముగఁ జదువఁ దగినంత సరసముగను, సుసితముగను, నది నిర్వహింపఁబడినది. ఆంధ్రప్రబంధములలో శృంగారరస మింత యుచితజ్ఞతతోఁ బరిపోషింపఁబడినవి చాల నరుదుగ నున్నవి. విళింకటుని వలని బాధలను వర్ణించు పట్టునఁ గరుణారసమును, విళింకటరాజశేఖరుల యుద్ధవర్ణనమున వీరరసమును నిట్లే పలుసినచోట్ల నితరరసములును నానాంగికముగఁ గూర్పఁబడినవి.

## వ్యాకృతిదోషములు

మల్లనార్యుఁడు లాక్షణికుఁ డయిన కవి. అప్పకవి యీతనికబ్బమునుండి లక్ష్యముల నుదాహరించినాఁడు. శ్రీవీరేశలింగముగారుగూడ నీతనిని లాక్షణికునిగాఁ జేర్కొనినారు. కాని కేవలవ్యాకరణసూత్రములచే సాధింపరానివి, ప్రామాణికకవుల కృతులలోఁగూడ సామాన్యముగ నెలకొనినవి యగు స్వల్పదోషము లీతని కవనమునఁగూడఁ గ్వాచిత్కముగఁ గానవచ్చుచున్నవి.

## షష్ఠీగేత్వసంధులు

వానింటి (వాని + యింటి) మల్లెచెట్టు (ఆ 1, ప 65.)

వానిల్లాలై (వాని + యిల్లాలై) విహరించు (ఆ 2, ప 90.)

## త్వార్థకసంధులు

ఎఱఁగాఱఁగియుండి (ఆ 2, ప 23)

షష్ఠీసమాసమందు నుగాగమము రామి

రత్నమేపారె నారాజరత్నమెదుట (ఆ 2, ప 133.)

తెలుఁగు క్రియలమీఁద "కొని" కిమారుగా "క" కూర్చుట.

ఈడ్చుకవచ్చి (ఆ 2, ప 56.)

గుచ్చుక పాళినేసె (ఆ 2, ప 171.)

రేఫఱకారమైత్రి యీతనికి సమ్మత మగునో కాదో రూఢిగా జెప్పఁజాలము.

ఉ. వీఱిడిమాట లేల వినవే యలవాఁడె కళిందకన్యకా
తీరమునన్ వసించి

(ఆ 3, ప 52.)

అని యొకచోట మాత్రమే యిందు శేషఱకారములకుఁ బ్రాసము గూర్పఁబడినది. కాని యీగ్రంథమును బ్రకటించిన శ్రీవీరేశలింగము పంతులుగా రీశబ్దమును "వీరిడి" యని లఘురేఫయుతముగానే ప్రకటించిరి. అందుచే మల్లనార్యుని మతములో నీశబ్ద మొకవేళ సాధురేఫాన్విత మేమో యని శంకింపఁదగియున్నది.

కవితాప్రసాదమాధుర్యముల కాకరమయి, గుణరత్నభాసుర మయిన యీప్రబంధరత్నమును శ్రీ వీరేశలింగముపంతులుగారు 1899 సంవత్సరములోఁ బ్రకటించి యాంధ్రసారస్వతమునకు మహోపకార మొనర్చిరి. అప్పటినుండియు నిది మరలఁ బ్రకటితమయినట్లు కానరాదు. ఆంధ్రసోదరులు దీనిని దగు ప్రాచుర్యమునకుఁ దెచ్చి యిందలి గుణగణములను గ్రహించి యానందింతురు గాక!

## అజంతాచిత్రములు




౮. పాదకమలములు




౯. సంభాషణము

# అల్లసాని పెద్దన

జనమంచి శేషాద్రిశర్మ గారు

"నిందతు నందతు వా సన్నసూయా రసనూయా రత్ర కిం తేన, యత్సన్మానసగమనాయైవేనం మమ తు పాథేయమ్" కురవి రామకవి.

మహాశయులారా! సత్యాన్వేషణతత్పరులారా!

వసుచరిత్రమును రచించిన యాంధ్రకవితాపితామహునిం గూర్చి నాలుగుమాటలు వ్రాసి యాంధ్రత్రిలింగభాషాసంశిత కవిశేఖరులకుఁ గానుకఁ బెట్టఁదలంచితిని. కాని యామహాకవింగూర్చి యొకఁడన్ని నాసమయంగూర్చియు వ్రాయుటకుం దగిన సామర్థ్యము నాకు లేదని యెఱుంగుదును. రాగిరేకులను, పాషాణాక్షరములను బరిశీలించి యవియే త్రికాలసంధ్యానంచిన మనియు నవియే మోక్షదాయక మనియు భావించు నలవాటును నాకు లేదు. ఈమహాకవిని సేతురొకచోటికి మార్చి తాటియాకులచేయుపలయుసను నూహాయు నాకులేదు. ఏమియు లేకున్న నెట్లు వ్రాయుదునన్నచో యని యనుగుదురేని కింవదంతి ననుసరించియు, దాని కనుగుణ దృష్టాంతముల ననుసరించియుఁ జరిత్రకారకులింతకుముందు వ్రాసినవిషయమునం దెంతమాత్రము ప్రమాణమని నాయంతరాత్మకుం దోఁచునో యంతమాత్ర మంగీకరించి దానిసాయమునను, గ్రంథమును శిరసావహించియు వ్రాసెదనని విన్నవించెదను. ప్రధానముగా గ్రంథప్రాశస్త్యములగూర్చియే వ్రాసెదను. వారి జననమెప్పుడో యేయూరనో, యేగృహాంగణముననో నెనుకుము గునపములు పుచ్చుకొని త్రవ్వఁబూనినవారు గలరు గాన వారి సత్కృత్యమున నేను బాల్గొనను. నాకుఁదోఁచినవి వ్రాసెదను. అందున సంగతివిషయములున్న వారు నన్నుఁ బుత్త్రివాత్సల్యమున మన్నింతురుగాక. నోటి కసితీఱఁ దిట్టకుందురుగాక. ఇదియే నేనును వారిని ప్రార్థించునది. నన్నుదూషించుటయే సగముపుణ్యసార్థమని వారు తలంపకున్నం జాలును. కోమలసువాగ్ధారి నాపైఁ బ్రవహింపఁజేసినను నేను వారి యాశీస్సును శిరసావహించెదను. బహులబహులను నట్లు వ్రాయఁబూనను. ఇది సత్యము. వారు నీమార్గమునే యవలంబించినచో శ్రేయంబని నాయూహ.

## అల్లసానివారి కుటుంబము

బళ్ళారి మండలమున దూపాటి సీమలోనుండు దోరాల యను గ్రామ మాతని జన్మస్థలమని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. వారు కవిజీవితమును సంస్కరించి మరల వ్రాసి ముద్రించునిమిత్తము చెన్నపురికి దయచేసినపుడు నేను కొన్నిప్రశ్నములు వ్రాసి పంపితిని. వానికి బదులిడక వారి కుశలమును వ్రాయుచు నన్నాశీర్వదించిరి. మరల నీకవిగూర్చి వ్రాసితిని. ఆవిషయము చర్చించునపుడు మీప్రశ్నములను దిలకింతునని వ్రాసిరి. మఱి కొలఁది దినములకే వారు తనువును త్యజించిరి. కాన వారి మహాకవినిగూర్చి విశేషించి చర్చింప నలను పడసనైతిని. దూపాటిసీమ యిప్పుడు కందనూలుమండలమునకుఁ జేరినది. దోరాల యను గ్రామము నేను చెప్పఁగలను. ఏమండలమునకుఁ జేరిన నేమి యాభాగమునఁ దెనుఁగు మాటలాడువారు తక్కువ. ఒకటి రెండు కుటుంబములవారుండు గ్రామము లుండుండవచ్చును. దోరాల పెద్దన్నగారి జన్మస్థల మనుసడియు లోకప్రవాదమునుబట్టి చెప్పినమాటయే గాని శాసనమునుబట్టి చెప్పినది కాదని యోఁచెదను. కింవదంతి లేకయున్న నెట్లు శ్రీపంతులుగారు వ్రాయుచున్నారు? అల్లసానివారి కుటుంబము కూడ నందుండవచ్చును. ఆకుటుంబమునఁ బెద్దన్న జన్మించెనో లేదో దైవ మెఱుఁగును. ఇప్పటి మీయూరనున్న నల్లసానివారుండిరేని వారిని బ్రశ్నింతుమేని మాపెదతాతగారు పెద్దన్నగా రందురు. ఇది లోక స్వభావమేకదా. కావున దానిం జర్చింపక మఱియొక కింవదంతిని గల్పెదను.

కడపమండలమునఁ గమలాపురమను నుపమండలము (తాలూకా) గలదు. దానిచెంత నొక గ్రామము కలదు. "పెద్దనపాడు" అని దాని కిం బేరు. ఇపుడుకూడ నున్నది. దానికి సమీపమునందే పెద్దనచెఱువు కలదు. అది యిపుడు పశ్వాదులు జలము త్రాగుట కుపయోగించుటకై కట్టింపఁబడిన జాడఁ దెల్పును. దానిక్రిందఁ బొలములు లేవు. పుణ్యసమార్జనము నిమిత్తమది కట్టింపఁబడి యుండనోపు. "పెద్దనపాడు" అను గ్రామమునఁ బెద్దనగారి పేర తాంబూల మెత్తుదురు. వివాహాది శుభకార్యములయం దన్నిజాతులవారును మొదటితాంబూలము పెద్దనగారిదని యెత్తి యెవరికే నిత్తురు. ఆయూర నిపుడు బ్రాహ్మణకుటుంబమే లేదు. దానికి సమీపముననే కోకటిగ్రామ మున్నది. ఆయూర వరిపైరు ఫలింపదు. జొన్నమొదలగు పైరులు పండును. పినాకిని చెంత నున్నదిగాని కుండలతో నీరు తెచ్చుకొన్నఁ గాని యానదీజల మాయూరును స్పృశింపదు. నదివలన నాగ్రామమునకుఁ గల సహాయ మంతమాత్రమే. అట్టిగ్రామమును మహాకవి యేల కోరెనో తెలియఁజాలను.

వారిగురువులగు శఠకోపస్వాము లందుండిరనియు వారికి నీయఁదలఁచి కోకటమును గోరెననియుఁ గొందఱు పల్కుదురు గురువులకుఁ గోకటమునకుఁ బ్రక్క నున్న గ్రామములు కేదారసంభృతము లుండఁగా వానిని గోరక జొన్నపండు గ్రామమును గోరెననుట యుక్తియుక్తము కాదు. కాఁబట్టి యీపైమూఁడుగుణములను బట్టి యూహింపఁగాఁ గోకటి ప్రాంతమున నున్నవాఁడనియు, నందును బ్రత్యమతాంబూలము క్రొత్త యూరి కిచ్చు నాచారమే లేదు గాన పెద్దఁపాడు గ్రామమున జన్మించినవాఁడనియు నూహించుట పొరపాటు గాదు. ఈ క్రింది కారణమునుబట్టియు నీసిద్ధాంతమును దృఢపఱపవచ్చును.

మనుచరిత్రమునఁ బురవర్ణనమున సీసపద్యపు టెత్తుగీత.

"అపటి వెలయాండ్రు రంభాదు లైన నొరయఁ
గా సెకొంగున వారించి కసపఁగేరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నపట బట్టిన చిగురుకొమ్మైనఁ జేవ."

యని యున్నది. అందు చిగురుకొమ్మైనన్ = అనుదానికి, చిగురు=చిగురుచెట్టుయొక్క కొమ్మైనన్ = కొమ్మయైనను, చేవ=సారమైనది. సారము గలదని భావము. చిగురుచెట్టనఁగ కడపమండలమున, ననంతపురమండలమునఁ గలదు. దానికిఁ జేవయే యుండును. చాలకాల ముండినఁ జెడిపోవును. అంతియగాని చెదలే దానికి లేదు. బళ్లారిప్రాంతమున నందును బళ్లారియందు ప్రతియింట నీచిగురుచెట్లు గలవు. కాని వానినాయూరవారు సికరచెట్లందురు. అనంతపురమండలమున విశేషించి యాచెట్లను వంటకట్టెయల కుపయోగింతురు. ఈకారణమునుబట్టి యీప్రాంతములనున్నవాఁడని యూహింప నవకాశము గలదనవచ్చు. చిగురుకొమ్మయను పదము . . . ల ముద్రించువారు చిగురుఁగొమ్మయని దిద్దిరి. చిగురు అనుపదమును విశేషణముగా భావించి భ్రమమునుగల్పించి పిడపద్రుతకార్యమునుజేసి చిగురుఁగొమ్మ యని చేసినారు. అది మిగులఁ బొరపాటు. 1879 సం॥ భారతీనిలయ ముద్రాక్షరశాలయందు పిళ్లారుసెట్టి రాఘవయ్యనాయడుగారిచే ముద్రింపఁబడిన మనుచరిత్రమునందు "చిగురుకొమ్మైన" అనియేకలదు. కాని యర్థమునమాత్రము లేతకొమ్మ యనియే వ్రాసిరి. మొత్తముమీఁద నీయర్థము వ్యాఖ్యానముచేసినవారు వ్రాయలేదనుట సత్యము. చిగురుచెట్టుయొక్క కొమ్మకుంగూడఁ జేవఁగలదనుట సరసము. ఈ పద్యమునందుఁ బేర్కొన్న విషయముల కీయర్థము సరిపడియుండును.

ఈ పేర్కొన్న కారణములంబట్టి కడపమండలమునఁ బెద్దన పెద్దనపాడునందో, కోకటమునందో యున్నవాఁడనుటకుఁ బై కారణములు కొంతవఱకుఁ జాలియుండును. కాని యిదియేసత్యమనియు వచింపఁజాలక యున్నాను. ఇతరస్థలవాసుఁ డనుట కింతకంటె నెక్కుడు కారణము లుండిన నీయూహలు నిలువఁజాలవుకదా. వినను నాకుం దోఁచిన వానిని దెల్పితిని. దీనఁ దప్పేమియు లేదు. పెద్దనపాడునందుఁ గల ప్రథమ తాంబూల మాగ్రామవాసుఁడే కావున్నఁ బుట్టదని మాత్రము చెప్పగలను. అల్లసాని పెద్దన్నగారు మఱొక యుండఁగూడదా యన్నఁ గూడదని యెట్లు చెప్పవచ్చును? అది యంత యుక్తియుక్తముగు ప్రశ్నము కాదనవచ్చును. ఈమహాత్ముఁడు కవితల్లజుఁడు మాత్రమే కాక సగారుఁడనియు, దక్షిణదేశదండయాత్రలయందుఁ బోల్గొనెననియు నం నొక్క గ్రామము రాయలవారీయన కొసంగిరనియు స్పష్టము గుచున్నది. కావున భారతమున ద్రోణాచార్యులం బోలి యీపెద్దన శ్రీకృష్ణదేవరాయల కాలమున నన్నివిధముల నాప్రభుహితంపమునకుఁ దోడ్పడుచుండె ననియుఁ, గాబట్టియే "పల్లకితన కేలఁబట్టియెత్తె" నని చెప్పుకొనెననియుఁ దక్కఁగల కవుల కిట్టిగౌరవ మందు లేదనియుఁ గన్పడును. కోకటము మాత్రమే కాక యింక ననేకాగ్రహారముల నడిగిన సీమలయందెల్ల రాయ లిచ్చినట్లు చెప్పుకొనుట సుసంగతముగా నున్నయది. ఇన్నివిధముల రాజమాదారుని తన్నాదరించుచున్నందుననే "కృష్ణరాయలతో నవి కేగలేక బ్రతికియున్నాఁడ జీవచ్ఛవం బనఁగుచు" అని చెప్పుకొనినాఁడు. దీనింబట్టి యీమహాపురుషుఁడు మిగులఁ గృతజ్ఞుఁ డనియుఁ గన్పట్టును. ఇంక నీ విషయమును బెంచి వ్రాయక కృతివిషయమును గూర్చి కొలఁది మాటలు వ్రాసెదను.

## కృతివిషయము.

ఈ కృతియందుఁ బెక్కు లోపములు గలవనియు, నిరంకుశముగాఁ గవిత్వము జెప్పెననియు, నీతని కాలమున నన్యదేశ్యపదములు విచ్చలవిడి నిందుఁ జొచ్చెననియుఁ గొంద ఱుద్ఘోషించు చున్నారు. కాని పాప మాభూసురుఁడు తెలిసిగాని తెలియకగాని నాలుగుపద్యముల నల్లెను. అంతకంటె సొగసుగాఁ బద్యముల నల్లి వ్రాసిన బాగుండును. ఆపని చేతగాక యూరక యాక్షేపించిన లాభమేమి? ఆంధ్రకవితాపితామహుఁ డన్న పేరు నెవ్వరును మార్పఁజాలరు కదా!

"పణినసూనుకణాద బాదరాయణ సూత్ర ఫక్కి విద్వాంసు లుపన్యసింప" అనుచో నీ "పణినసూను" పద మసాధువని కొందఱు పల్కుదురు. పాణినసూనుఁడు పాణినియని శబ్దకల్పద్రుమమునందును, వాచస్పత్యమునందును గలదు. శ్రీనాథుఁడు, పెద్దనగారును "పణినసూనుఁడనియే" వ్రాయుట యంధపరంపరాన్యాయమా యని యాలోచింపవలయును. మహాకవి నన్నయభట్టారకుఁడు "ధారుణి" యని ప్రయోగించెను. కవిబ్రహ్మయగు తిక్కన సభ్యపరముగా సభికశబ్దమును బ్రయోగించెను. త్రియంబక శబ్దమును గాళిదాసు ప్రయోగించెను. కాని "ప్రమాదో ధీమతామపి" యన్నవాక్యమే దీనికిఁ బరిహారము. "లుక్సంశ్లేషా నాచి" అను సూత్రమునకు విరుద్ధముగా,

"మనసాగ్గముకేళిషు వనాశ్వాసితగుణిరితే మనసి సర్వ మసహ్యామనా నెఱుంగవే"

అను పద్యభాగమును "సర్వ మసహ్యమన న్నెఱుంగవే" అని యేలాకో మార్పఁబడినది. మజ్జనకుఁ డిందలి పద్యముల నాకు వ్రాసి యిచ్చినేర్పెను. నాకిట్లే నాడుకద్దైనది.

'శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బర్వెం బక్షులు.'

అనుదానికి బదులుగా "నభోంతరాళమునఁ బాఱెం బక్షులు" అనియు మార్పఁబడినది. ఏటికో తెలియరాకున్నది. ఇట్టి వెన్నియో ముద్రణమునందు మార్పు చేయఁబడినవి. ఇక్కాలమున ముద్రణకాలమున నిచ్ఛానుసారము పాఠములు మార్పఁబడుచునే యున్నవి.

'తేఁకువలేక పుత్తెంచిన యప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపుగాఁగ.'

అను తాటియాకుల పాఠమును "పుత్తెంచిన యప్పాండవాగ్రజునకుఁ దలవంపుగాఁగ" అని మార్పఁబడుట మనము చూచుచున్నాముగదా. ఇక్కాలమున "నిరంకుశాః ముద్రాక్షరశాలాస్థానపండితాః" అని మార్పవలసి యున్నది. ప్రమాణబుద్ధిగలవా రరుదుగ నున్నారు. కావున నీమహాకవి గ్రంథమునందును బెక్కుమార్పులు చేయఁబడి యుండునని నాభావము. ఇంతమాత్రము పుస్తకమునైన నిల్పినారు. చాలు నన్న భావము నాకుఁ గలదు.

## పెద్దనకు సందర్భశుద్ధి తక్కువ

'వినుమొక నాఁడు కుతపకాలమునందున్.'

అనుచోఁ గవి తక్కువగా వ్రాసెనని కొందఱందురు. దినమానమును బదునేను భాగములు చేయఁగా నందెనిమిదవభాగము కుతపకాల మనంబడును. దినమానము ముప్పదిగడియ లనుకొన్నను నందుఁ బదునాలుగు గడియలమీఁదఁ బదునాఱుగడియలవఱకు నాకాల ముండును. అప్పుడు సిద్ధయోగి వచ్చెను. ఇష్టకథాలాపములు, భోజనాదులు ముగించి యాసిద్ధుఁడు పోవుతఱి నొక పసరు పూసి పోయెను. ప్రవరుఁడు హిమాలయమునకుం బోయెను. అందుఁ గొన్ని మహాస్థలములను జూచెను. పిదపఁ బ్రవరుడు,

మ. తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న నే నీయెడం
గలచోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి నేఁ డేగెదన్
నళినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళమాత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్.

అని భావించెను. ఇది పొసఁగునా! హిమాలయమున దివ్యస్థలములను జూచుటకే కొలఁదిగడియలు పట్టియుండవా? కావున సందర్భశుద్ధి పెద్దనకుఁ దక్కువ యందురు.

ఆర్యావర్తదేశమున నరుణాస్పదమను పట్టణము గలదు. అది వరణానదియొడ్డున నున్నది. అందుండి హిమాలయమున కరిగెను. పుణ్యస్థలములం గాంచెను. ఖరకిరణసంస్పర్శమున నందలి గండోపలములఁ గప్పియున్న హిమాని పరుసఁగా కరఁగుచుండెను. మధ్యాహ్నకాలమైనది. ఇఁక నింటికిం బోయి కాల్యకృత్యములం దీర్చి పదంపడి రే పరుదెంచెద అని తలపోసెను. కాని హిమానీస్పర్శమునఁ దనపాదలేపము కరఁగి పోయెనని యెఱుంగఁడు.

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి
బెరసి తత్పాదలేపంబు కరఁగిపోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁ డా ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె.

అన్నకథసాగెను. ఇందు సందర్భశుద్ధి యెట్లు చెడినదో యెఱుంగఁజాలను. అరుణాస్పదపురముననే మధ్యాహ్న మతిక్రమించెఁగదా. హిమాలయమును జూచిన పిదప మరలువేళఁగూడ మధ్యాహ్న మెట్లయ్యెనని కాఁబోలు వారి శంక. పాపము! హిమాలయమునందు నుత్తరభాగమున సిద్ధాశ్రమము చెంతఁ బగటికాల మెంతయో రాత్రిపరిమాణ మెంతయో యూహించిన నీశంక కలుగదు. రామేశ్వరమునకు వారాణసికిని దినమానమున నెంతభేదముగలదో నందుండి హిమాలయమునకు నంతకంటె మించిన భేదము గలదు. దానియం దెంతయో దూరమున నించుమించుగా కైలాసస్థానము చెంత దినమాన మెక్కుడుగ నుండును. కాన నెంత తక్కువపక్షముగా నాలోచించినను యామ ముండును. పాదలేపప్రభావమున క్షణమాత్రమున హిమాలయము చేరుట యసంగత మన్నచో నపుడు సమాధానము చెప్పవలసిన పద్ధతి వేఱు. క్షణకాలమున నెంతదూరమైనను గొనిపోవఁగల శక్తి యాలేపన పదార్థమున కుండినపు డీకాలమున నసంగతవిషయము లేదు. కాఁబట్టి పెద్దనగారికి సందర్భశుద్ధి తక్కువయని చెప్పుట సాహసము.

ఈ కవిశిరోమణికి నాంధ్రకవితాపితామహుం డను బిరుదము మనుచరిత్రము రచించిన తర్వాతనే యియ్యఁబడినది. ఐనచో గ్రంథాదియందే కవి,

క. హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్.

అని చెప్పుకొనుట పొసఁగునా యనవచ్చును. కృతికర్తలు తొలుదొలుత గ్రంథమును రచించి పిదపఁ దొలిపద్యముల వ్రాయుట యాచారము. ప్రథమమున దేవతాప్రార్థనము మాత్రము పద్యరూపముననో ధ్యానరూపముననో రచించి గ్రంథము నారంభించుట కవుల యాచారము. అట్లే పెద్దనయు గ్రంథమును రచించి వినిపించి యుండును. దాని ప్రౌఢిమకు మెచ్చుకొని రసికజనచూడామణి యగు ప్రభుశేఖరుఁ డాంధ్రకవితా పితామహ బిరుదము నిచ్చియుండును. దానిని దన తొలిపద్యములలోఁ గవి చేర్చియుండును. అంతియకాని యీగ్రంథమునకంటె ముందు కొన్ని గ్రంథముల వ్రాసి యాబిరుదము గాంచి పిదప నీమహాకావ్యమును రచింపఁ బూనె ననుట కుయుక్తిగాని వేఱుగాదు.

ఇట్లేయైనచో నీగ్రంథమున నింతకుమున్ను బెన్ని గ్రంథముల రచించితి నని పేర్కొనియే యుండును. ఇట్లనుటచే నింతకుమున్ను దొక్కపద్యమైన నాకవి నోటినుండి యూడిపడలేదని భావింపరాదు. ఈయన కవిత్వశక్తి ప్రభుచంద్రునకు బోధపడి యుండకపోదు. కాని యాంధ్రకవితాపితా మహాబిరుద మిట్టి యుత్కృష్టగ్రంథరత్నమును గైకొని ప్రతిఫలముగా నిచ్చియుండు ననుటయే సరసము:

## కృతి.

పెద్దన మార్కండేయపురాణమునఁ గల కథాభాగమును గైకొని తదనుగుణముగా మార్పులను గల్పించి తన చమత్కృతిం జూపెను. స్వభావవర్ణనమున నీమహామహున కెక్కుడు పాండితి గలదు. దాని కుదాహరణముగా నొక్క పద్యమును వ్రాసెదను.

సీ. తతసితంబాభోగఘనశితాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగుఁ గలస
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ
గాయ లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
నరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుగనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
తే. బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమకరపంకరుహరత్నకటకఝణఝణ
ధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయించుచుండి.

ఈ యొక్కపద్యమే భావప్రకటనమునకు, స్వభావమును గోమలముగఁ దెలుపుటకును జాలును. విశేషించి వ్రాయనుగాని యిట్టి పద్యరత్న మిక్కువ తరువాతివారి గ్రంథములలో దఱచుగఁ జూడనగునా యని మాత్రము ప్రశ్నించెదను. ప్రవరుఁడు వరూథినిం గాంచునపు డామె యేమిచేయుచున్నది? అని యూహించినఁ బ్రవరు నాతనిఁ గాంక్షించుట విపరీతమా యని తోఁచును. ఇందు నాల్గవపాదమును బరికింపుఁడు. సంగీతవిద్యాప్రౌఢిమ తెల్లమగును. వరూథిని పద్మినీజాతి కాంతామణి యనియు నత్యున్నతభావసమన్వితయనియు, సంగీతవిద్యాపారావారపారంగతయనియు నీపద్యము వెల్లడించును. జిలిబిలి పాటయనుచోఁ గల భావగాంభీర్యము పరిశీలింపఁదగినది. ఈ యొక్క పద్యమును విన్నంతనే రసికశిఖామణియగు శ్రీకృష్ణరాయలు కవిఁ గౌఁగిలింపకుండునా. ఏవిషయమునఁ బరికించినను సమయానుగుణము లగు వర్ణన లిందు గలవనుట సుహృదయులకు స్పష్టమే. స్వభావవర్ణనమునఁ గవికిం గల ప్రౌఢిమ యీక్రింది యొక్కపద్యమును జదివినంతనే తెల్లమగును.

సీ. పసిఁడితోరముతోడి బాహు వల్లన నెత్తి
సారెకుఁ బొదలపైఁ జాఁచి సాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యన విపం
చీస్వరంబున జటు చెప్పి చెప్పి
దిశల మూర్ధాన్వేష దీర్ఘలోచనదీప్తి
గణముచేఁ దోరణ కట్టి కట్టి
కమనీయతనుకాంతికనకద్రవంబున
నారామరంగంబు నలికి యలికి
తే. యానితంబవిలంబికాలాహికల్ప
ఘనకచగ్రంధి నటిటి భృంగముల కసిమి
దీధితులు వడ్డికొసఁగుచు దేవపూజ
విరులు నిదిమెడి కపటభూసురునిఁ గనియె.

(3 ఆ. 88 ప.)

ఇందుఁ గపటభూసురత్వ మెట్లు వర్ణింపఁబడినదో పరికించిన దేహమున గగుర్పాటు పొలయకయుండునా. ఇట్టి పద్యములఁ జూపఁ బూనినఁ బుస్తకమంతయు వ్రాసి చూపినట్లగును. సందర్భశుద్ధిలోనగు కావ్యసద్గుణములన్నియు నీగ్రంథమున నమరియున్న వనుట నిస్సందేహము. ఇట్టిమహాత్మునకు నాంధ్రకవితాపితామహబిరుదము లభించుట యొకగొప్ప గాదు. శ్లేషకవిత్వమునం దీమహానుభావునకు, పాండితి తక్కువ యనియు, నెట్లో శ్రమించి యీక్రింది యొక పద్యము వ్రాసెననియుఁ జెప్పుదురు.

సీ. తొలుదొల్తఁ గమలమిత్రునివంక రూపాట
దక్షాధ్వరధ్వంసి తన్నుఁ గనుటఁ
బరివేషమిషమునఁ బాశంబుఁ దాల్చుటఁ
గప్పు దేహమునందుఁ గానఁబడుటఁ
గాలవశంబునఁ గాని తోఁపకయుంట
సతతనిష్ఠురగదాన్వితుఁడౌ వగుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుట
బ్రకటానురాగతారకుఁడౌ వగుట
తే. నంతరం బెద్ది యాత్మలో నరసి చూడ
రాజ, నీకును సల ధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాగలఁ బఱచునపుడు
ధర్మపద మొక్కఁ డెక్కుడా ధన్యసందు (3 ఆ. 37 ప.)

ఈయొక్కపద్యముచేతనే యాయన శ్రమంపడెననియుఁ గావు ననే మరల నాజోలికిఁ బోవలేదనియుఁ జెప్పుదురు. కాని యాలంకారికులు వ్యంగ్యకావ్య ముత్తమ మనిరి. కావ్యమునకు వ్యంగ్యము ప్రాణ మనిరి. శ్లేషకావ్య మాకోటియందుఁ జేర్పఁబడదయ్యెను. శబ్దచాతుర్యము ప్రధానము కాదని పూర్వులమతము. ఎప్పటికి నదియే సిద్ధాంతము.

శ్లో. ఇదముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వని ర్బుధైః కథితః. ర

కావ్యం బుధైః వైయాకరణైః ప్రధానభూతస్ఫోటరూపవ్యంగ్యవ్యంజకస్య శబ్దస్య ధ్వనిః ఇతి వ్యవహారః కృతః. తతస్తన్మతానుసారిభిః అన్యైరపి న్యగ్భావితవాచ్యవ్యంగ్య వ్యంజనక్షమస్య శబ్దార్థయుగళస్య.' —కావ్యప్రకాశము.

శ్లో. వాచ్యాతిశాయి వ్యంగ్యం యదుత్తమం తద్ధ్వనిశ్చ సః
వీక్ష్య రామం ఘనశ్యామం సీతా జాతా నచున్మనీ. ౫

యత్ర కావ్యే వ్యంగ్యం వాచ్యాత్ ఆలంకారికమతేపదార్థస్యాపి వాచ్యతయా పదార్థా ద్వాక్యార్థాద్వా అతిశాయి ప్రకృష్టం తదుత్తమం కావ్యమ్. —కావ్యదర్పణము. ౧ ఉల్లాసము.

శ్లో. శబ్దార్థ మూర్తి రాఖ్యాతో జీవితం వ్యంగ్యవైభవమ్
హారాదివ దలంకారా స్తత్ర స్యు రుపమాదయః. ౨

శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః
ఆత్మోత్కర్షావహా స్తత్ర స్వభావా ఇవ రీతయః. ౩

శోభా మాహార్యకం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా
పదానుగుణ్యవిశ్రాంతిశయ్యా శయ్యేవ సమ్మతా. ౪

రసాస్వాదప్రభేదా స్స్యుః పాకాః పాకా ఇవ స్థితాః
ప్రఖ్యాతా లోకవ దియం సామగ్రీ కావ్యసంపదః. ౫

—ప్రతాపరుద్రీయము.

ఇట్లు సకలాలంకారశాస్త్రకర్తలును వ్యంగ్యకావ్య ముత్తమ మనియే సిద్ధాంతము చేసిరి. కావున మనుచరిత్రము వ్యంగ్యప్రధానము. శ్లేష కవిత్వము చేతఁగాక పెద్దన మానలేదు. ఇందుల కొక నానుడి కలదు.

పెద్దనగారు స్వర్గమున కరుగ భట్టుమూర్తి యరుదెంచి వారిపుత్రు నాశ్వాసించుచు నింకను గొంతకాలము పెద్దనగారుండి విద్యాబుద్ధులు తెల్పిన బాగుండునని పల్కెనఁట. ఆమాటలు విని పెద్దన భార్య లోపలనుండియే వారుండి ప్రౌఢకవిగాఁ జేసియున్న బాగుండెడిది. అది తప్పినది. ఐనను జీవికకై శ్లేషకవిత్వమునైనఁ జెప్పుకొని బ్రదుకవచ్చునని బదులిడెనఁట. ఆమాటలు విని సిగ్గుపడి భట్టుమూర్తి తనదారిఁ బోయెనని చెప్పుదురు. ఇదెంత నిజమో చెప్పఁజాలను గాని శ్లేషప్రధాన కావ్యముత్తమ కావ్యముల గుసలోఁ బరిగణింపఁ బడదని మాత్ర మూహింప నవకాశ మీకథ యిచ్చుచున్నది.

మనువు వేఁటకుంబోవు సందర్భమున వేఁటకాండ్ర మాటలుగా జెప్పిన సీసపద్య మనుపమానము. కవికిఁ గల లోకానుభవ మెంతయో యది తెల్పఁజాలు.

సీ. పటలెత్తుకొనియొత్తు కిటినైన మోకాలఁ
బడి యేయఁబోదుము నీపాదమాన
కలగుండుపడఁజెండు కరినైనఁ జెవిపట్టి
బలిమిమైఁ దెత్తు నీపాదమాన
సెలసెప్పుకొని రొప్పు పులినైనఁ దీకించి
పడవైతుఁ జొచ్చి నీపాదమాన
తెరదూటి పెఱఁబాఱు గురుపోతుపైనైనఁ
బడి యెక్కిపోదుము నీపాదమాన

తే. ఇతరగుర్వులమృగపంక్తు లేమిలెక్క
కంటెగరునంపుమాటలు గావుసుమ్ము
చూడు మమ్మనిపంతంబు లాడుకొనుచు
నవ్వరూధినిసుతుఁ గొల్చి యరిగిరపుడు. 4 ఆ. 84 ప.

కవితాధారాశుద్ధికై యొకపద్యము వ్రాసి ముగించెదను.

సీ. జంభారిభీకరసంరంభంబుఁ జీకించి
జగమునంజనమహాశైలమునఁగ
నింపుపుఝంఝాప్రభంజనాస్ఫాలనంబునమల్కి
యదరుసంపర్తకాలాభ్రమునఁగ
గఠినకంఠేకాలకంఠమూలము వాసి
వెస నెచ్చు నుజ్జ్వలక్ష్వేళమునఁగ
గలువమూర్వాహ్నలో తక్కరముపైఁ బొఱలెంచు
దండధరకఠోరదండమునఁగ

తే. ఘుర్ఘురారావసంఘాతఘూర్ణమాన
సప్తపాథోధిపాథఃప్రపంచనక్ర
తిమితిమింగిలనంఘమ నభ్రమునుమహాయుఁ
గ్రమ్మకొనివచ్చు నొకయేకలమ్ము గనిరొ. 6 ఆ. 88 శ్రీప.

ఈమహాకవి యిట్టి యుత్కృష్టమహాప్రబంధమును రచించి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్చెను. కృతజ్ఞులలోఁ గృతజ్ఞుఁడు; రసికులలో రసికుఁడు, విద్వాంసులలో విద్వాంసుఁడు, భక్తులలో భక్తుఁడు. శూరులలో శూరుఁడు; దాతలలో దాతయునగు నీమహాకవి విఖ్యాతి యాచంద్రతారకముగ వెలయును. ఈమహాపురుషుని యశఃకాయము, ఆంధ్రలోకముపై సర్వదా వెలుపఁగొందుచుండును. తదారాధనము కవులకెల్లఁ బ్రధానము. ఇట్టి కవీంద్రుఁడు మరలబుట్టునాయను నంతదశ యీనాటికిం గల్గినది. మహాత్ము లాంధ్రలోకమున నుదయించి యుందురు. వారెల్ల రిట్టి మహాకావ్యముల నొనరించి తెనుఁగుబాసను బెంపొందింతురుగాక. నీరసకావ్యములకుఁ జోటీయకుందురుగాక. మహాత్ములు శ్రమించి కాపాడిన భాషకుఁ దోఁచినట్లెల్ల మార్పులుకలిగించి పాడుచేయక ప్రాక్సమాగతనిర్మలయశస్సును బెంపొందింతురుగాక. ఇంతకంటె విశేషించి వ్రాయశక్తియు నవకాశము చాలకయున్న నే నీవ్యాసమును ముగించుచున్నవాఁడను.



ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రథమపట్టభద్రులు



అన్నపూర్ణాదేవి బాలికాపాఠశాల-ఏలూరు



చెన్నపురి శారదాసమాజ సభ్యవర్గము



8 వ ఆంధ్రరాష్ట్ర స్త్రీవిద్యావిషయసంస్కరణసభ-కాకినాడ



స్త్రీల జాతీయారోగ్యవారము-చెన్నపురి



శ్రీమతి రామానుజాలుసెట్టి



స్త్రీలసభ, స్త్రీ విశ్వవిద్యాలయమునుగూర్చి కార్వేగారి ఉపన్యాసము



బెజవాడ ఆరోగ్యప్రదర్శన స్త్రీశాఖ



శ్రీ పి. నారాయణాచార్యులుగారు



శ్రీమతి కోమలాంబగారు



నాటకములయందు పాల్గొనుచున్న స్త్రీలు



శ్రీ కె. ఆర్. రామరత్నంగారు



శ్రీ టి. వెంకటరంగయ్యనాయుడుగారు

# *భక్తచింతామణి పద్యములు

వడ్డాది సుబ్బరాయుడు గారు

నానాప్రాణిసమూహముల్ మఱిఁగిఁ గ్రిందన్ మీఁద విశ్వంపుఁ జె
న్నా నందం బగు, నభ్రపత్రవితతిన్ నక్షత్రపుష్పావళిన్
భానుస్వచ్ఛమయూఖసత్ఫలములన్ బ్రస్ఫారదిక్శాఖలన్;
ధ్యానింతున్ నిను మూలకందము ముకుందా, భక్తచింతామణీ!

వింటిం జుక్కలగుంపు గేసెలుఁగు నేనెల్గిం గనుంగొంచు, పిం
టింటన్ వేడి వెలుంగుఁ గన్గొనుచు, నే నీ వెల్గులన్నింటికిం బై
కంటన్, వానికి మూలమౌ వెలుఁగులోకంటన్ నినుం జూతు నం
చుంటిన్; సల్పు మభీష్టసిద్ధిని స్వయంభూ, భక్తచింతామణీ

ప్రాతఃకాలమునందు సాయముతఱిం బ్రాచీప్రతీచీనము
న్నభ్రతారుణ్యము నెంచెదం, బగలు రే భూముఖ్యలోకా లనం
ఖ్యాతంబుల్ నెఱఁ బ్రోచు యుష్మదనురాగద్యోతకాపాంగదృ
గ్ద్యోతితం బం, చరుణాక్షపారమణచక్షూ, భక్తచింతామణీ!

నన్నుం గంచును మన్ను మిన్నుఁ గనుచున్ నానాచరస్థావరో
త్పన్నత్వస్థితిసంహృతుల్ గనుచుఁ దత్తత్కార్యవైచిత్ర్యముల్
గన్నారం గనుఁ గొంచు, నిన్నటులు నేఁ గాంచంగ లేకున్నఁ, గం
చున్న ట్టెల్లము వొంగు విశ్వమయ, విష్ణూ, భక్తచింతామణీ!

పిడికింటన్ రతనంబు నుంచుకొని, యావేశింపఁగా నిద్ర, రే
యెడ లీయెల్లప్రపంచమున్ మఱచి, ప్రత్యూషంబునం దెల్వి రాఁ
బడుకింటన్ మణి వాఁ డెటుల్ దడవు మున్, భక్తుండు మేల్కాన్న వెం
బడి నిన్ రక్షకు నట్టు లారయును దేవా, భక్తచింతామణీ.

అణువుల్ వాయువు నంటి యాకసమునం దల్లాడు నె ట్లట్లను
క్షణ మేవో యిహలోకవాసన లనేకంబుల్ హృదిం దోఁచు; ర
క్షణముం గోరి యనన్యభావమున మోక్షశ్రీవిభున్ నిన్ను ని
ర్గుణు ధ్యానింప విశుద్ధబుద్ధి నిడు నాకున్ భక్తచింతామణీ!

గతమౌ కాలము ప్రాణరక్షకము; రాఁగా నున్న కాలంబునం
బ్రతిసూక్ష్మాంశ మతిక్రమించుదనుకం బ్రాణాంతకం బే, సుని

* గ్రంథమున జేరనివి; క్రొత్తగా రచియించినవి.

శ్చిత హార్తన్ మృతి మర్త్యమం; దనిశముం జీవింప యుష్మత్పద
స్మృతి గల్గింపు మనుక్షణం బమృతదాయీ, భక్తచింతామణీ!

ఆపం జెప్పఁడుఁ జాలుఁ బల్లమున కే; నైనన్ సహస్రాంశుచేఁ
బ్రాపించుం గద యూర్ధ్వభాగ మది; దుష్ప్రాపంచికార్థంబులం
దీర్పన్ వర్గిలు నాహ్లాదిం దినమునం దీపించు తేజోనిధీ,
నీపాదం బెనయించి నిల్పు మటఁ దండ్రీ, భక్తచింతామణీ!

పదముల్ నే ననుకోని చారుతర భావంబుల్ ధ్వనింపంగల
ట్లు దయాళూ! పలుభక్తపద్యములఁ గ్రాల్పన్ మాలరాలుంబలెన్;
బదకంబుల్ గద యీసుపద్యములు దేవా, నీకుఁ; దత్ప్రేమ సాం
పాదవన్ వాసి క పీప పో పొదివె ద ట్లో భక్తచింతామణీ!

జ్ఞానంబంతయు స్వామ్యధీన; మది నానారూపమై తోఁచు; నే
జ్ఞానం బైన, భవత్ప్రసాదముననే సంధిల్లెడుం దేహికిన్;
దీనత్వంబున మోఁకరిల్లి నినుఁ బ్రార్థింతుం; దయం దండ్రి! యీ
సూనుం జేయు కుశాగ్రబుద్ధిని సుశిష్యుం భక్తచింతామణీ!

నీయందుం దుది నైక్య మొందుటకుఁ దండ్రీ! యిందు సత్కర్మముల్
చేయం జీవనయాత్ర సాధనముగాఁ జిత్రంబు సృష్టించి యీ
కాయం బాత్మ కొసంగి; తీశ, కడదాఁకం జక్క సాగింపు, మే
హేయార్తిం బడకుండ నీనిఁ గరుణాబ్ధీ, భక్తచింతామణీ!

పరమాత్మా, శిరసుండ నేమిటికి నల్పం బూజ మోఁకాలికిన్?
మొఱలాలించు మహాప్రభుండవు జగత్పూర్ణుండ వీ వుండఁగాఁ
బరుఁ బ్రార్థింపఁగ నేల యక్కఱఁ దీర్పన్? నిన్ను వేఁడం జరా
చరముల్ సాయపడుం దమంత భవదాజ్ఞన్ భక్తచింతామణీ!

ఆసన్నప్రసవం దనూజను, రుజం బ్రాణప్రయాణోత్కటా
యాసాయత్తను నత్తె నింటఁ గని, నిన్నార్తిం బ్రభూ, వారి కే
మోసమ్మున్ ఘటియిల్లకుండఁగ శుభంబుం గూర్పరే వేఁడుకోఁ
గా, నీల్గుం దొలఁగించి మే లిడితి వేగన్ భక్తచింతామణీ!

కలిగింపం దొలఁగింప సౌఖ్యములు దుఃఖంబుల్ నిన్నున్ వేఁడుదా
సులకున్ నీసుముఖత్వముం గరుణమై సూచింతు, తద్దృగ్భుజా
చలనాద్యాంగిక సన్నిమిత్తముల; నోసర్వాత్మ, నీసేవకున్
దులనో యన్యుల సేవ? దైన్యదివిపద్ద్వారి, భక్తచింతామణీ!

గ్రహచారంబునఁ జేసి కష్టసుఖముల్ ప్రాప్తంబు లౌ దేహి కీ
యిహమం దంద్రు; సమస్తలోకములకీ వీశుండ; వర్కాదిక
గ్రహసంచారము సామిశాసనమునం గా కేమిటన్? నీయను
గ్రహ ముగ్రాగ్రహ మే శుభాశుభనియోక్తల్ భక్తచింతామణీ!

భువి యే కాదు, జయించి మూఁడు భువనంబుల్ గూడఁ బాలించు నా
రవ రేణ్యుండును, దీనవృత్తి నతుఁడై ప్రార్థించుప ట్లైన నీ
సవిధంబందున తక్క, నొండువలనన్ స్వామీ, స్వదైన్యంబు వె
ల్చువిప త్రోందనిమాని ధన్యుఁడని తోఁచున్ భక్తచింతామణీ!

గాలిం బట్టపగల్ సభంబునఁ గనుల్ గానంగరాకుండ మే
ఘాలెం దుండియొ మూఁగి, యవ్వి మరలం గాలిం బటాపంచ లౌ
లీలన్, హాయిగ నుండుచో నదరి బల్ క్లేశంబు లాకస్మికం,
బౌలన్ మాయ మగున్ భవన్మహిమ దేవా, భక్తచింతామణీ!

సూరుం డస్తమితుండు గా, జగతికిన్ సోముం బ్రసాదింతు; నీ
హారాంశుం డరుదేనిచో, ననుతు తారాళిన్; సదా యుం తిరుల్
వారింపన్ శిఖి; నిట్లు భక్తులనెగుల్ వాపంగఁ జూపింతు వా
ధార, మ్మొక్కఁడు వోమఱొక్కఁడు; మహాత్మా! భక్తచింతామణీ.

మధువుం ద్రాక్షరసాల మిశ్రమువు భుజింపం, దోఁచెడున్ నోరికిన్
మధురత్వం; బటు మూఢభక్తిన భజింపన్ నిన్ను నాసక్తితో
సధికానంద సుఖానుభూతి పరమాత్మా! ప్రాప్తమా నాత్మకున్;
బుధుఁడో యజ్ఞుఁడు, లేక భేదము లపంబున్ భక్తచింతామణీ!

నరు లే యెన్బదినాల్గులక్షలను నిన్ లక్షించువా; రో మహే
శ్వర, తక్కుంగల లక్ష లెన్బదియు నజ్ఞప్రాణులే; వారు నెం
దఱో నీవంకకె రారు; వచ్చుసుతులన్ బహ్వల్పసంఖ్యాకులన్,
గరుణన్ దగ్గఱఁ దీయ నీకు భర మౌనా? భక్తచింతామణీ!

# సృష్టి—మానవుడు

పెనుమర్తి వెంకటరత్నము గారు

౧

సృష్టి తొలినాళ్లలో జగజ్జీవదాత
జంగమస్థావరం బగు జంతుకోటిఁ
దనయెడకుఁ బిల్చి భిన్నజీవనము లిచ్చి
అనుభవింపుఁడు! హాయిగా నని వచించె!

మానవుఁ డనేకరమ్యహర్మ్యములతోడ
పట్టణంబులు వేనవేల్గట్టినాఁడు!
ఆకసమునంటు సౌధాగ్ర మధిగమించి
"సృష్టి నాదాననే" యని తుష్టి పొందె!

కామనీయక యౌవనోద్గారిమధువు
త్రావి యున్మాదియై, యమృతంపుకుంభ
మీనడించెను; భూలోకమే దివంబు
దేవతలు క్షుద్రులంచు నర్తించె తాను!

అబ్ధిగర్భాన రత్నాల నాహరించి
భూమిఁ ద్రొచ్చి సువర్ణంబు ప్రోగుపెట్టి
పేదవారి నిట్టూర్పుల పెరిగి బలిసి
నేనె ప్రభువని గర్వించి నిలిచినాడు!

౨

స్థావరములైన భూరివృక్షముల త్రెళ్లు
నవనవ లతాంతవల్లరీభవనములును
సృష్టినగ్న సౌందర్యముల్ చిలుకరించు!

దక్షిణమునందు మలయకందరములోన
వాంశికశ్రుతు లల్లెడు వాయుపుత్రు
డేవొ గుసగుస లాడు!– తారావితాన
మచట శబ్దాలులేని కావ్యములు పాడు!

అచట, దుఃఖమ్ము నెఱుఁగని యా నిరంత
దీపితానందమధురమాధ్వీమధూళి
గ్రోలి ఝమ్మని తుమ్మెదకోడెగాడు
ప్రసవకన్యల నలవంత పాటపాడు!

౩

దినము లీరీతి గడచిపోయినవి! జీవ
కోటి కందని కాలంపు కుహరమందు
సృష్టికర్త, యోగ ముండి చేరఁ బిలిచె
జంగమస్థావరంబైన సర్వసృష్టి.

ఏమి తెస్తివి! మానవా? యేనొసంగి
యున్న జీవనవాటి యెట్లున్నదోయి!
ఏమి ఫలసాయ మిప్పు డర్పింపఁగలవు?—

*          *          *          *

మానవుఁడు, తీవ్రదుఃఖములోని మలిన
బాష్పపుటములు, నైరాశ్యభారభుగ్న
దేహకాష్ఠము, దప్పికతీరకున్న
తీవ్రతృష్ణ, దేవుని ముందు తెచ్చియుంచె!

౪

తలిరుతీవెల కౌగిలింతలకు సొలసి
పాదపప్రభుఁ డంజలిబట్టి, తరుణ
దివ్యవాసంతయామవీథీకిసాల
మోహనసుమాశ్రుకళికలు ముందుఁ బెట్టి!

తేఁటి గ్రోలని కమ్మపూఁదేనె లొలికి
పాడు టెఱుఁగని చిగురుమవ్వములు రువ్వి
రమ్యవాసంతమాకందరాజధాని
సృష్టికర్తనే పరవశుఁ జేసె నగుర!

ప్రతిదిగంతుదోన్నలో మధుస్మితము లూగె
ప్రతికుసుమమూర్తిలో హర్ష బాష్పమొలికె
(?) ప్రతిపదకుహూకుహూపరభృతకుమారి
త్రెంచుకొనియె రసస్రవంతికలగట్లు!

౫

ఆమహావిశ్వపీఠమునందు నిల్చి
ఆజగన్నేత మానవు నోజ చూచి
ఒక్కనిట్టూర్పు, నొక్కయశ్రూదకళిక
వెలికిఁజార్చి విషణ్ణుఁడై కలకవాఁ౦దె!

ఆమహావిశ్వపీఠమునందు నిల్చి
ఆజగద్ధాత స్థావర స్మరసి యరసి
స్వస్థభావసజ్జ్యోత్స్నశోచ్ఛాయ లెగయ
నా స్మితమ్ముల తనమూర్తి విస్మరించె!

---

# స్వప్న శారద (మంజరి)

డాక్టరు సందూరు శివరావుగారు

పద్మకర్ణిక దిగంబరవేష మూని
యసురుసు రనెడి దివ్యాంగిన యెవరు?
ఆంధ్రశారదయొక్కొ - ఔ - కాదు - ఔను
ఇదమిద్ధ(?)మని వచింపఁగా రాదు.

*　　*　　*　　*

గీర్వాణభారతికిం బుట్టి తొల్త
వాగనుశాసనువలన పెర్గాంచి
బాలవయ్యును ప్రౌఢవాక్యార్థగరిమ
రాజరాజనరేంద్రు రచ్చ మెప్పొంది
యజ్వ వాగ్ధారామృతాసేచనమున
తల్లికన్నను మిన్న తనయ యటన్న
యనిరతలభ్యమౌ యశము గడించి
శ్రీనాథు ప్రతిభావిశేషసంపత్తి
కనకాభిషేకంబుఁ గావింప మించి
లలితరసోచితాలంకార నగుచు
రాజు చేయూత రహి మీర గాంచి
దిగ్గజేంద్రము లిరుదెసలఁ గొల్వఁ౦డ
వెలిగొరుపై నెక్కి విహరించినట్టి
ఆంధ్రశారద! భవదాకార మిదయా?
ఔనంచుఁ దలవంచి తదయేమి టమ్మ,
పోలుచుకొన నేమి వీలు గాకుండె.

*　　*　　*　　*

సకలకళాపూర్ణసౌకుమార్యంపు
వదనమిూ యిద కళానష్టమయ్యె
జ్ఞానరశ్ములు వెనజల్లెడి మోము
సుమనోజ్ఞభావంబు చూపింప దేల?

కరుణాకటాక్షవీక్షణములఁ బఱపి
విబుధుల నానందవివశులఁ జేయు
కనుదమ్ములా మూసికొనిపోయె నయయో
శ్రీశారదవిస్ఫూర్తిఁ జెలువారు చెవులు
మోటుదుద్దులభారమున వ్రేలుచుండె
వలపులుగులుకు కెంగలువ యేమయ్యె?

సంగీతసాహిత్యసద్మమ్ము లయయో
బట్టబయలుగ నిట్టు పెట్టుదు రమ్మ
అరచాటుగాఁ జేసి యానపుట్టించు
చలిచెలువలు జిలుగుదువ్వలును
నెవ్వాఁడు తొలఁగించె నెఱిఁగింపుమమ్మ?

విశ్వకల్యాణంబు వెలయించు కోర్కె
విజ్ఞానమయగీతి వినుపించువేళ
పలుకుతోడుగ నవ్వు పలికించునట్టి
వీణ కన్పింపదు విడిచితి వేల?
నవరసాలంకారనవకోశమైన
పొత్త మెచ్చట పడిపోయెనే యంబ?

యతిమాలయు శుకమ్మగపడ వేమి?
సాహిత్యమను మానససౌకమ్మునెక్కి
నాఖిలఖండితపామరాత్మసామ్రాజ్య
మిచ్ఛమై విహరించి యేలుచు సచ్చి
దానందమున లీనమైయుండు నీవు
తమ్మిమొగ్గరమందుఁ దవిలి ప్రబంధ
ములఁ బారిఁ బడి వినిర్మలతనూవల్లి
మలినభూయిష్ఠ(?)గా మాఱురూపమున
ప్రస్తుతస్థితిని పూర్వంపు టున్నతిని
సిగ్గున చేసన్న చేఁ జెప్పుచుండి
నీరసమ్ముగ నట్లు నిలిచితి వేల?

సరసవాగర్థసంభరితభావములు
జాతీయముగ తేనె జాలువాఱంగ
పలుకుచుండెడి నీవు తెలియనిబాస
నూరకే ప్రలపించుచుంటి వేమమ్మ
ఆంధ్రశారద! నాకు నానతీ వమ్మ.

తొంగలిఱెప్పల దొట్టు బాష్పముల
కడుపు చుమ్మలుచుట్ట కడలేని వనట
కటకటంబడు(?) నిన్నుఁగనుకొద్ది కడుపు
తఱుగుకుపోయెడి-తల్లి! యేమందు
ఆర్తువా తీర్తువా యనె దేల నమ్మ?
దుఃఖభారము కొంత తొలఁగుగ దమ్మ
ఆప్తబంధుల కింత యంత దెల్పినను
అవధానముగ నుంటి నార్తిహేతువును
ఆంధ్రశారద నాకు నానతీ వమ్మ.

* * * *

విను మనుంగుకుమార, వినుము నాపాట్లు
సత్పుత్రకులు తొల్లి సహజలాలిత్య
మునకు వన్నెలువెట్టు భూషణాదులను
గైసేసి నవరసకావ్యఖాద్యముల
బోషించి, భావనాపుష్పకమ్మందు
స్వేచ్ఛావిహారంబు సేయించినారు.

నా కుమారకు లిప్డు నాకు మారకులె
ద్వేషాన కా దతిప్రేమచే నిజము
ఆపాదమస్తక మంగ మొక్కింత
కనఁబడకుండంగ ననవసరంపు
కర్కశాలంకృతుల్ కడు పేర్చినారు
పైపూఁత మెఱుఁగు పో వాసిదొఱంగి
మకిలిచేఁ దెల్లని మై నల్లనయ్యె.

అందచందముమాట లాదైవమెఱుఁగు
బరువునఁ దను వెట్లు వంగెనో కనుమ
రాజ్యవైభవముఁ గూర్పగ నెంచి నన్ను
మొఱకుల కిడి యంతిపురములం దుంచి
పద్మబంధాదుల బంధించినారు.

చిలువారు పలుకుల చెలికత్తె చిలుక
వజ్రపంజరమందుఁ బడవైచినారు
పొత్తమందలి సృష్టి మూలతత్త్వంబు
చెఱసాల జపియింప వెఱ నేది చెపుమ.

వీణ వాయింపంగ త్రాణ లేకుంట
శ్రుతులెల్లఁ జెడెను తంత్రులు త్రుప్పప
అమృతంపుతేటల నలరు నోష్ఠంబు
పేరు లేకుండంగ విరసమైపోయె
నాలుక తడఁబడ సంగిమాటలను
నే పల్కు భావంబు నేన యెఱుంగ.

తిరుపతివేంకటేశ్వరు ప్రసాదమున
నిట్టిరూపం బైన నేర్పడెఁగాని
యప్పటిదురవస్థ నయ్యయో తనయ,
తలఁపువచ్చిన నిప్డుఁ దనువు కంపించు.

* * * *

అకట నీ బన్నము లాలకింపంగ
గుండె నీరైపోవుచుండెనే యంబ
కష్టదుర్దశ లెప్డుఁ గాపురమున్నె
విరియవే చీకట్లు వెన్నెల రాదె
వందురకమ్మ మై వాడిపోయెడిని.

బంధమ్ములం ద్రెంపి పలుపోకడలను
స్వైరవిహారమ్ము సమకూర్పనున్న
తనయు లాత్మీయస్వాతంత్ర్యమ్ముకొఱకు
తనువు లర్పింప సిద్ధమ్ముగా నున్న

వా రెందఱో యున్నవా రమ్మ తల్లి
వారిప్రాపున పూర్వవైభవోన్నతిని
ఆంధ్రశారద నీవు నలరారఁ గలవు
ఊరడిల్లుము తల్లి! యూరటఁ గనుము.

## కవి: ఆతిధ్యము

అప్పల వీరవెంకటభోగయ్యాశాస్త్రి గారు

అలసితివేమొ ఘోరవిపినాంతరసీమలఁ బాదచారివై
కలయఁదిరుంగుటన్ మొగముఁ గందెను మేనున ఘర్మబిందువుల్(?)
పొలిచెను, పాదపద్మములఁ, బొక్కులు కానఁగనయ్యెఁ గాన నీ
వలయకఁ గొమ్ము మా యతిథివై పరిచర్యల సంతసంబునన్ !

ఉ. అల్లదె కొండయేటిదరి, నంచిత చారుమనోజ్ఞమాధవీ
వల్లరిపొంత మల్లికల పార్శ్వమునన్ సురసాలజాలన
త్పల్లవకాంతి దిక్కులను బర్విన చెంతను బర్ణశాలలో
చల్లగ విశ్రమించి మఱి సాగుము పైనము సేయ నింటికిన్ !

ఉ. ఇమ్ముగ రమ్యహర్మ్యముల నిందుశిలామయవేదికావితా
నమ్ముల భర్మడోలికల, నంచితలీల మెలంగి వాని సౌ
ఖ్యమ్ము నెఱింగి తీవు గహనాంతరపర్ణకుటీరమందు వా
సమ్మునరించి యొక్కత్రుటి సమ్మతి దాని సుఖమ్ము గాంచుమీ.

చ. కుడిచితి షడ్రసాన్నములఁ, గూరిమితోడ సువర్ణపాత్రలన్
గడిగితి చేయి, తల్పములఁ గాయముఁ జేర్చితి వింక తేనెతోఁ
దడిపిన చాఱపప్పుఁ గొని, దంజిగ చప్పరమందు పండి త
ల్లడ మడుగంట నెయ్యది ధరాధిప! బాగొ వచింపు మిచ్చటన్.

*

గీ. మది జనాకీర్ణసామ్రాజ్యపదవి నీయ, చెలిమితోఁ దాళపత్రసంకులవిశాల
లలితకవితాదిసామ్రాజ్యకలన మాది, కాన నీక్ష్వర మిచట సమాన మధిప!

క. కావున నా యాతిథ్యం, బీవును గ్రహియింప వచ్చు నే నర్హుఁడ నీ
కీవిధి నొసఁగగ నూరక, భావంబున సంశయింపవలదు నృపాలా !

*    *    *    *    *    *

చ. వనజములెల్ల భీతిఁగొన భాస్వరతేజముతోడ వైరి భే
దనమొనరించుచున్ దినముఁ దాఁ గడుదవ్వుల కేగి యెంతయున్
జనసముదాయమున్ విడిచి సంస్థితిఁ జూచుచు డస్సి యొంటిమై
వనములఁ జేరె నీసగిద, భాస్కరుఁ డల్లదె చూడు పార్థివా!

క. కరులకు గన చటులనిశా,కరులకు గహనాళి ఘోరకరులకు మృగసం
హారులకు హరులకు నిలయము, పరవర యోపగిన రాత్రి నడచెదు చెపుమా!

## ఆత్మజిజ్ఞాస

అనంతపంతుల రామలింగస్వామి గారు

సీ. నమే జీవపుటాది—మిత్తి తుదయన్ భ్రాంతి న్బహింజోకు మా
నవుఁడా! నీ కొకమాట—జీవము ప్రబంధం, బందు నాశ్వాస స
న్నిహితాంబా, నొక జీవపు న్మొదలు కాన్, యంతమే కాని యొం
డవు నాశ్వాసపు టాదియున్ దుదయు నొకన్ సూక్తియే సత్యమా.

చ. మరణభయంబదేల యిఁక మానవుఁడా! భవనీయజీవభా
స్వరతరభారతాన నొకపర్వపు టంత మెసంగునంట నీ
వెఱిఁగియు, నింకఁ బర్వము లవెన్నియొ యుంట యెఱింగియున్న నీ;
కెరియఁగఁ బర్వ మంతమగునంతన భారత మంతమౌనొకో?

మ. తిరురాజాగ్రనిబద్ధనీడము నిజస్థానంబుగా నుండి తా
నెరకై నేఁడును వ్రాలి కామితము నొం డీడేర్చుకొన్నంతఁ గ్ర
మ్మరఁ దన్నీడముఁ జేరు పుల్గువలెఁ గర్మప్రాప్తభుక్త్యర్థము
ర్వర జీవాత్మ చరించపోయెడును నిర్యాణార్థిత్వంబిదే!

నీవే యుండనికాల మెందు కలదే నీ బూర్వ, మాకాలమం
దీవారా! జనియింప నందులకుఁ జింతింపంగ నూహింపఁబో;
నీవే యుండని కాల మెక్కఁ డిఁకముం దేనాఁటనో వచ్చునం
చీ వావేదన ముందు దేల? జనజీవీ! సంతతాజ్ఞానివై.

శా. ఈ విద్యాత్రిని జన్మమొందుటకు ము న్నేరీతి నారీతినే
యీ విశ్వాద్భుతలీల లెల్లఁ దగు నోయీ! జీవి, నీ పిల్గినన్
నీ నేహేతువుచేత జా వనినఁ గన్నీ ర్నించి జీర్ణించెదో?
భావింపందగునయ్య! శాంతసుమనఃపద్మాసనస్థుండవై.



శ్రీమతి ఈ. దాక్షికన్యగారు



శ్రీమతి యల్. కృష్ణాబాయిగారు



శ్రీమతి యల్. శ్రీనివాసన్ సతిగారు



శ్రీమతుల్ కమలాబాయి కృష్ణాబాయి సోదరీమణులు



శ్రీమతి శారదాబాయి రనడేగారు



శ్రీమతి శివరావు సతిగారు



శ్రీమతి మార్జొరి విలియంస్ సతిగారు



శ్రీమతి ఏ. సి. దేవకీకన్యగారు



పూనా సేవాసదనము-చెన్నపురీశాఖ



సర్ కె. వి. రెడ్డినాయుడుగారికి విందు



రాజా రామమోహనరాయ వర్ధంతి



చెన్నపురిలో తిరువాంకూరు మహారాజుగారు



ఏలూరు అన్నవస్త్రదానసమాజపు వార్షికవర్ధంతి



సినీమాకమిటీ అధ్యక్షునకు విందు



దక్షిణభారత హిందీప్రచారముకొరకయిన సభ-చెన్నపురి

శా. నీ జాయామణి, తోడునీడలు, సుతుల్, నీ బంధుమిత్రాదులున్
రాజద్గేహము లాదిగాఁ గలుఁగు సర్వంబు న్విసర్జింప లే
కో జీవీ! యిటు లోట నొందెద వదేమో! యెంత విభ్రాంతియో
పైజన్మంబున లేనివానియెడలన్ వ్యామోహ మింతొప్పనే?

శా. ఆదిన్ గల్గెడు సర్వ మంతమగు, సత్యంబిద్ది, నీ కాదియే
లేదేనిన్ లయమొంద వీవు—మనుజా!—లేకున్న నంతంబు దా
రాదా యెంతటిజాగ్రదాప్తిమనినన్—రారామి పోఁబోవునే?
ఆదే యంతము, నంత మాది యను నయ్యార్యోక్తి నూహింపుమా

మ. సగుణబ్రహ్మ హిరణ్యగర్భ కవిరాట్సద్రూపముల్ సక్రమం
బుగ నీవొంది, యనంతరంబున మహావ్యోమానిలాగ్న్యంబు భూ
నగ తిర్యక్పరిణామ మొంది తుదిమానవ్యంబౌ మనుష్యాకృతిన్
దగినా వీవిఁక సిద్ధినొందఁగఁ బ్రయత్నం బూనుమో మానవా!

మ. పశుపక్ష్యాది నికృష్టజన్మముల నీపాపానుసారంబు దు
ర్దశ లీవొందెదవన్నమాట మనుజా! తథ్యంబు గా దింతయున్
వశమే మామిడి వేముగానగుట—నిర్భాగ్యుండవై, రోగివై
యశము స్వీడి కృశించుచుందువు, మనుష్యాకార మీ వొందుచున్

ఉ. ఇంతకు నీకు నంత మది యింతటఁ గల్గదు, కర్మ సద్గురు
ప్రాంతము జేరి యొక్కొకభవంబున నొండొక మోక్షసాధనో
దంత వినూత్నపాఠమును దద్దయు నేర్చినఁగాని ప్రత్యగా
త్మాంతము సంఘటిల్లదుసుమా! యొకజన్మమె మోక్షమిచ్చునే?

---

# కవితాస్వయంవరము

వఝ్ఝల కాళిదాసు కవిగారు

కలకలమని నిత్య కళ్యాణమునుఁ బచ్చ-తోరణంబనంగఁ దోఁచుచుండి
పెండ్లియిల్లురీతి వెలయుచునుండును-ఘనతమీర నొక్క-కాననంబు.

వల్లవుఁ డల్లనల్ల నల పశ్చిమవారిధి యందుఁదూలుచోఁ
జల్లఁగఁ జూతవృక్షమున శాఖపయిన్ పదయుగ్మమానిత

త్పల్లవజాలము ల్తిని శుభస్వరముల్ తనరారు చుండఁగన్
గొల్లగఁ గోకిలంబు లటఁ గూయుఁ బ్రతిధ్వను లుప్పతిల్లఁగన్.

కమ్మతావులు ఘుమ్ము ఘుంఘుమ్మురనుచుఁ-జిమ్ము వాతపోతమ్ముల సమ్మదమ్ము
నెమ్మనమ్మునఁ గ్రమ్మ పాదమ్ములెత్తి-నెమ్మియచట నిత్యమ్ము నృత్యమ్ము సేయు.

వరలు నట నొక పచ్చికబయలు, దాని-నడుమఁ బోవుచుండెడు నొకనడకదారి;
సొగసుకన్నియ శిరమందు నెగడునట్టి-సన్నపాపటయో యనఁ జెన్నుమీరి.

అం దొకమఱ్ఱిచెట్టుకడ నందము చందము సందడింప, సొం
పొందఁగ యౌవనంపు బిగి యుబ్బుచు నుండఁగ నూయల న్మహా
నందము మీర నూఁగు నొకనాతి, పికంబులు కీరశారికల్
ముందట నిల్చి యెప్పుడుఁ జెలుల్వలె సేవలఁ జేయుచుండఁగన్.

చిరునవ్వు మోమునం దం-కురించుచుండంగ నెపుడుఁ గోమలకరముల్
కిరమున్ బెనవైచుచు నా-వరవర్ణిని పూవుఁదీవఁ బట్టుక యూఁగున్.

బంగారుతీవపై రంగు లీనుచు దుగుడంబైన మేల్పవడం బనంగ, (౧)
తామరయాకు మధ్య నెసంగియాడుచు ముద్దు లొల్కెడు నీటిబొట్టనంగ
నిమ్నగాజలములన్ నెగడెడు చంద్రబింబంపుఁ జిన్ని ప్రతిబింబం బనంగ(౨)
గాలిమధ్యమున ఱెక్కల నార్చుచు న్విహారం బొనర్చెడి విహంగం బనంగ,
వారినిధియందుఁ దేలెడి పడవయనఁగ, వాతమునకుఁ జలించు పుష్పంబనంగ,
మిన్నుపై జిగేల్మనియెడు మెఱపనంగ, పూవుటుయ్యాల నూఁగు నా పూవుఁబోఁడి.

లోకంబంతయు నిద్రఁ జెందునెడ, కల్లోలంబులన్ దగ్గుచో,
రాకాచంద్రుఁడు మింటినంటి కరముల్ రమ్యంబుగా నంపుచో
ఆకాంతారమున న్మయూరపికకన్య ల్దన్ను వెన్నాడ స
స్తోకామోదముతోడఁ ద్రిమ్మరిలు నా శుభ్రాంగి నిర్భీతియై.

పేరు కవితయంద్రు పెండ్లియింకను లేదు, యౌవనంబుకూడ నంకురించె;
అడవియందు కాయు నట్టివెన్నెలరీతి-నామె యౌవనంబు వ్యర్థమయ్యె;—

మతిమాలినట్లు వేమరు నెటుఁజూడక పాటల నొకమారు పాడుచుండు,
ఉన్మత్తయైనట్టు లొకమారు పాడుచుఁ దూఁగుటుయ్యెలలోన నూఁగుచుండు,
కోపించినట్టు లూఁగుచు దిగి యొకమారు సెలయేట స్నానంబుఁ జేయుచుండు.
భ్రమచెందినట్లు స్నానముఁ జేయు చొకమారు వడి నిటు నటు పర్వులిడుచునుండు

పరుగులిడుచు నొక్కపరి యాగుఁ బొదరింటి-లోనఁదూరు నంతలోన మరలు
మరలి యంత నేల నొరగు, నంతటలేచి-తరలు నెచటికో, కవితాలతాంగి.

ఒకనాఁ డూయలనూఁగుచుం గవిత యెంతో వింతఁ జెల్వొందఁగన్
శుకముల్ గోకిల మాదిగాఁగలుగు పక్షుల్ దగ్గఱం జేరి "యో
సకియా యేటికి నిట్టిజీవన మిఁకన్ జాలింపుమా కన్ని, ను
త్సుకతం బొందుమ, సర్వసౌఖ్యములు కాంతున్ గూడి యిక్కానలో.

మత్తేభములతోడ మాటలాడుటకాని పల్లెవాక్కుల నేమి పల్కవలె?
ఉత్పలంబులతోడ నుల్లసిల్లుటకాని మంజులుంగూర్పు మానెదేల!
మత్తకోకిలతోడ మసలియాడుటకాని భావగీతంబులఁ బాడవేల?
చంపకంబులతోడ సరసమాడుటకాని ముత్యాలసరములఁ బొందవేల?
సీసపూర్వనియతి నీపట్టులన్నియు వీడుమమ్మ మేము వేఁడుచుంటి
మమ్మ మూరకున్న యౌవనసంబంతయు వ్యర్థమగును లేక వనమునందు.

* * * * * *

అచ్చెరువాయె మీర లిటు లాడెద రించు నెఱుంగనైతి నో
నెచ్చెలులార! మిమ్ముల వని న్విడనాడి చనంగఁజాల, మీ
యిచ్చయు, నేను భర్తఁ గొనుటే యయియున్న స్వయంవరమ్మునన్
వచ్చినవాని నొక్కరుని నాపతిగాఁ గొని యుండెదన్.

అని లజ్జాభయ మొప్పుచుండఁ జిరు నవ్వాస్యంబునం దోపఁ గ
న్గొనలన్ దృష్టుల మెల్లఁగాఁ బఱపుచున్ మోమించుకన్ వంచి, చెం
తనె యున్నట్టిలతన్ గరంబునను వింతన్ జెందుచున్ గన్నె ప
ల్కినయంతన్ జెలులందరున్ ముదమునన్ గీర్తించి రయ్యోచనన్.

* * * * * *

అపుడు పచ్చికబయలుపై నలరునట్టి-పూలపొదరింటినీడలోఁ బురుషు లిర్వు
రున్నవారలు; ఛాందసుఁ డొక్కరుండు-నొక్కఁడు విలాసవేషుఁడై యున్నవాఁడు.

అంతం గోకిల శారికాశుకమయూరానీకముల్ చెంగటన్
సంతోషంబున నిల్వఁగన్ మనసులోనన్ భావవీచీతతుల్.
వింతన్ లేచుచునుండఁగన్ దమకముల్ లేజెక్కిళుల్ రంగులు
త్యంతస్ఫూర్తిగ నీనుచుండ నట కయ్యబ్జాక్షి వచ్చెన్ దగన్.
వచ్చి యంతలోన బయలుపై వారలఁ-జూచి చూడనట్లు చూచియంత
నేమి యెరుఁగనట్లు మోము వాంచినయంత-ఛాందసుండులేచి సరగఁ బల్కె.

కాళిదాసుని మూడుకావ్యంబుల౯ గ్రుక్క త్రిప్పకుండనె యొప్పఁజెప్పఁగలను,
శాకుంతలమును నస్యముతోడఁబీల్చితి లోపంబు లెన్నేని చూపఁగలను
కాదంబరీరసగ్రహణంబుఁ జేసితి నది వట్టి పొల్లుగా నయ్యె నాకు
పాణినీయంబునుఁ బట్టుక యయ్యది జీర్ణంబు నాలోనఁ జేసికొంటి
సంస్కృతంబువారె చప్పగా నుండఁగా-దెలుగువారిమాటఁ దలఁప నేల?—
భారతంబునందు భాగవతంబునఁ-దప్పులెన్నొ లెక్కచెప్పవాడ.

అని యింకేమియొ పండితుఁ-డననూహించుచును నుండినంతటఁ బ్రక్క౯
దన రెడి విలాసవేషుఁడు-ఘనకంఠముతోడ నిట్లుగాఁ దాఁ బల్క౯.

ఓలలనాలలామ! వినవో యిటువంటి విశేషఛాందసుం(?)
డేలొకొ నిన్నుఁ గోరుట; యహీనధనమ్ముఁ గలట్టివాఁడ ను
య్యాలల నిన్ను నూఁచెదను, నంచితరీతిగ ముద్దులొల్కుము
త్యాలసరంబుల౯ మిఫులఁ దావకకంఠమునందుఁ గూర్చెద౯.
నీవిలాసము, నీదుసంపద నీవిశేష వికాసవిభవము
నాకు నిడి ననుఁ బ్రణయలక్ష్మీనాథుఁ జేయఁగదే!

అని యేమేమియొ తమకం-బున మించుచు నుండునట్టి మోహాం బలరం
గను వాఁడు పల్కుచుండఁగ-విననయ్యెం జెంత నొక్క వేణుస్వరము౯.

మురళీగానమరందబిందులహరీ మోదప్రపూర్ణాస్యుఁడై
ధరణీదేవ కుమారుఁ డొక్కఁడు సముద్యత్ప్రీతి నక్కానలోఁ
గరము౯ వింతగఁ జిత్రము ల్గనుచు నక్కాంతారకన్యా స్వయం
వరదేశంబున కేఁగుదెంచె మదిలో భావంబు లుప్పొంగఁగ౯.

ఎవరయ్యా! తమరంచుఁ గోకిల కడు౯ హేలావిలాసంబుతో
డ వచింప౯ విని యాతఁ డిట్టులను వేడ్క౯ గోకిలా; నిన్ను నీ
రవము౯ గూరిచి పద్యముల్ సతము౯ వ్రాయంగ నూహించు నా
కవి నేనేసుమ్ము, నన్ను నీ వపుడె యజ్ఞానంబున౯ జూతువా?

కవి యిటు లాడినంతనె వికాసము మీఱఁగఁ జెంతఁజేరి య
క్కవిత స్వహస్తము౯ గవినిఁ గట్టిగఁబట్టి యురమ్ము రమ్మున౯
దవిలిచి యిన్నినాళ్లు కవితాసతి నొంటిగ వీడి యేడకు౯
గవి చనినాఁడ వీవనుచుఁ గౌఁగిలిఁ జేరిచెఁ బ్రేమమీఱఁగ౯.

* * * * * *

కాంతారంబున నెపుడు౯-వింతగ మురళీరవంబు వినవచ్చుచు, నా
శాంతములందుం గలిగెడు-శాంతంబును నిద్రపుచ్చు చక్క౯దోఁచు౯.

*ఇనోనీ

శ్రీ. శ్రీనివాసరావుగారు (కవితాసమితి)

ఉన్నతములు పర్వత పంక్తులున్న వి-రమ
ణీయములు లోయలున్న వనేకములు-మ
నోజ్ఞములు వానిలోన మనోజ్ఞమును మ
నోహర మ్మొక లోయ; దినోదయమున
అచట పొగమంచు లెగసి తారాడుకొనుచు
ఇనమయూఖకాస్పర్శ నశించియును న
శింపకయపూర్వమున చెట్టు చెట్టు నంటి
ఈదుకొనిపోవు నటులు కాన్పించు-ఇరుకె
లంకులను రమ్యముగ శాద్వలములు వెలసి
పచ్చగా హెచ్చుగా కనుపించునవై, అ
నేకములు పూలు తొడిగి, సున్నితమనోజ్ఞ
మై వికాసిల్లు-దూరాన అచటనెచటగో
గిరిఝరిణి యొండు పడిపడి సురిగి సురిగి
వాగులుగ తోగులుగ చిలుపలుగ ఏక
ధారగా శైలసంఘాల దారు లంటి
ఒరసి దొరలించి ప్రవహించి హోరుహోరు
మని జలార్ణవగర్భపాతార్థమై వి
ఘాతమై విలోలము విరిగిత మగుచు
అల్లకల్లోలముగ సాగు-అచట నచట
అధికమధురిమ రామణీయకత కలసి
నవ్వుకొనుచుండు-సృష్టిసౌందర్య మచట
ఆకృతిం దాల్చిన ట్లుండు!

అచటికొక్క-

ఆకు కదలని మట్టమధ్యాహ్న వేళ
ఒక మహాదుఃఖదూషిత-ఒకవయస్య
దారుణవియోగవేదనాదళితహృదయ-
ఒకపరిశ్రాంతకాంత నిట్టూర్చికొనుచు
ఎన్నటికి కానరాక నశించిన ఒక
వస్తువున కట్లు వెదకుచువచ్చె! ఆమె
చెక్కుటద్దాల యరుణిమ చెరిగిపోయె-

ఆమె విడివాటువడిన నీలాలకములు
గాలితాకున మొగముపై కదలియాడె!
అచట ఒకరాతిమీదుగా అల్లుకొనిన
తీవ చేరువ చేరి అతిశ్రాంత
సమయనిశ్శబ్దమున కరుణముగ స్వీయ
శోకగీతి 'ఇనోనీ' సకీకుమారి
పాడెనిట్లు దిశాంతదీప్తిప్రదోష
శోణరోచిర్వికాస మేచుకొనువరకు!

"ఈమహాదుఃఖగాథ-నా యీ అగాధ
వేదనాక్రోదనధ్వని వినెడి దెవరు?
నాకుగా జాలిగా నామనఃప్రగాఢ
విలయవహ్ని శమింప చింతిలెడి వెవరు?
ఓశిలామాత! ఓ అనేకోరుసాను
నిస్స్రవజ్ఝరిణీరమణీయమూర్తి!
ఓమనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
శాంతమాధ్యాహ్నసమయనిశ్శబ్ద మిపుడు
కొండకోనల నెల్లెడ నిండిపోయెను!
ఆకుజొంపాలలో కీటకాళి యడగె!
అదిగో తన నీడలో తాన యడగి నీడ
వలెనె ఊసరవెల్లి నిశ్చలత కాంచె!
కలువ పూసెజ్జ చంచరీకమ్ము చేరె!
నేన మిగిలితి! నాకనుల్నిండ బాష్ప
కణములే హృది ప్రేమమే కలవు నాకు!
ఇది భరింపగరాక నాఎడద పగులు
నేమొ! విసువమ్యు జీవితమే అదేమొ!

"ఈమహాదుఃఖగాథ-నా యీ అగాధ
వేదనాక్రోదనధ్వని వినుము వినుము
ఓశిలామాత! ఓ అనేకోరుసాను
నిస్స్రవజ్ఝరిణీరమణీయమూర్తి!

* Tennyson's "ŒNONE".

ఓమనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
వినుము భూదేవి! గిరులార వినుడు వినుడు!
స్రోతములార సెలయేళ్లు దరులు వినుడు!
ఒక నరునాథు ననుగు పుత్రికను నేను-
ఈ విధముగ నావేదనాజీవితమ్ము
పాటగాపాడి పాటలోపలనె కొంత
శాంతితో శాంతిలో నాహృదంతరమున
వేడివెతల నోకించుకి విస్మరింతు!

"నాకుగా జాలిగా నామహాకఠోర
హృదయబాధ శమింప చింతిలుము వినుము
ఓశిలామాత! ఓ అనేకోరుసాను
నిస్పృహిపక్షరిణీరమణీయమూర్తి!
ఓమనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ఆయుషఃకాలరామణీయకనిధాన
మస్రృణరోచిస్స్రవంతులు మలయునేళ
మంచుటెరులు దూరగిరుల మాటుపరచె-
అపుడు నాదరి నామనోహరుడు చేర!
నామనోమోహనుండు-ఘృణావిహీను
డతనికే నన్ను ధారపోసితిని నేనె!

"ఓశిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ఎచటనో పల్చె నను ప్రవాహిల్లు ఝరులు!
ఎచటనో దూరమున ఉషఃప్రచురకచులు
తుహినవనబిందుపటలమ్ము తుడిచివైచె!
నాకనులు నేల నప్రయత్నాన వ్రాలె
ఆ మధురమూర్తి నను జేర నరుగుదేర!
చిరుతపులితోలు తద్భుజశ్రీల చేరి
వ్రేలియుండెను-తత్కోమలాలకములు
కిణతలంటెను దేవతాకాంతికురిసి-
అతని మృదుగండఫలకమోహనము లెగసి
వాయువీచిప్రసారసౌభాగ్యవశత
ఫేనమాల లుప్పొంగిన విధముచూపె!
నను సమీపించు హృదయమోహనునికొరకు
నాఎడద కోరె కౌగిలింతలసుఖమ్ము!

"ఓమనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
అతడు చిరునవ్వి తన పయస్సితమనోజ్ఞ
మగు కరాంభోరుహము విప్పి అందు చూపె
స్వచ్ఛసౌవర్ణవర్ణభాస్వత్ఫలమ్ము!
తత్సుధామాధురులు దిగంతాలు నిండె!
దాపగని నాని మృదువచస్తరళలహరి
ఈదినీ మనస్సుతో-ఆత డిట్టు లనియె!
నాప్రణయినీ! ఇనోనీ! సుధాప్రసన్న
మూర్తి! నాఆత్మరాజ్ఞి! సమ్ముగ్ధనేత్ర!
ఈఫలము నీని గనుగొను మిచట ఇదిగో
"అఖిలజగదేకసుందరి" కనుచు కలదు!
నీ గమనలక్ష్మితో, భ్రూవిసీలదృష్టి
కాసుమముతోడ అప్సరఃకన్యలైన
ఎనసు నరిసీరు! ఇది నిర్ణయించిరేము
దవిసుకస్వాలు మోదముద్రితులు నీకు!'

"ఓశిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
తన ప్రవాళాధరమున ముగ్ధప్రమోద
భరముతో నాపెదవు లంటి మరల నతడు
కురియదొడగెను మధురవాక్సుధల నిట్లు-
'కనుగొనుము నీని నీఫలమ్మును! వివాద
కారణమ్మిది-నాకలోకమునయందు
దేవతామధ్యమున నీనికై వివాద
పడిరి సౌపర్వరాజ్ఞులు! వారియందు
ఎవరి కిది తగు నని నిర్ణయించుకొరకు
నన్ను నియమించి రైకకంఠ్యముగ సురలు!
ఆజగన్మోహినీస్త్రీయ మాగమించు
నపుడు నీవు సమీపగుహాంతరమున
దాగికొని నీప్రియుని దేవతాస్వరూప
విధివినిర్ణేత నరసి గర్వించుకొనుము!'

"ఈ మహాదుఃఖగాథ! నా యీఅగాధ
వేదనారోదన ధ్వని వినుము జనని!
అదియు మధ్యాహ్నవేళ! విహాయసమున
స్రోవతప్పెను తెలిమబ్బుతునుక యొకటి!

అంతహారిదంత సంక్రాంత కాంతిసంతతి
త్రిప్రవాహాలలో సృష్టి తేలిపోవ-
తమపదన్యాసమున ధరాస్థలమునందు
వేనవేలు నూతనపుష్ప వితతి విరియ-
ఒకసుగంధానిలము రేగి సకలలోక
సమునయామోద సమ్మూర్ఛనము ఘటింప...
వనలతాతోరణ ద్వారిభాగ్యాలతోమ్మ
స్వాగతమొసంగు ప్రకృతి నీకును వెలార్ప-
వెలిగి రచ్చట దివిజరాజ్ఞులు ప్రసన్న
నగ్నదేహప్రదీప్త సౌందర్యవతులు!

"ఓ శిలామాత! వినుము మృత్యువ్యాగ్ర వదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ప్రాంతపాదపశాఖాగ్ర భాగమందు
వనమయూర కలాప వైభవము వెలుగ
దూరమున మింట జలదమ్ము తొంగిచూచి
మృదుపరీమళ సుహితకాంబువృష్టి కురిసె!
ఆమె హీరా! సమస్తలోకాధిపత్ని!
స్వర్గసింహాసనప్రదేశమ్ము దిగ్గి
అవతరించెడు వేళ సోత్సవవిజృంభ
మాణమాణిక్యకాంతుల మాలికలకు
నాకవాసుల నీరాజనములు రేగు!
ఆమె యనె నిట్లు తొలుత నా ప్రాణపతికి!
'నిఖిలభూస్థలి నీపాదనికటమందు
నిలిచి నీకడకంటిసన్నల చలించి
నీనిరంకుశ పాలనానియతి కోర్చి
గౌరవము సంభ్రమభావమ్ము కలితభక్తి
నాకరుణ కారణమ్ముగనీకు చూపు.'

"ఓ శిలామాత! వినుము మృత్యువ్యాగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
మరియు ఆ దేవతారాజ్ఞి మరల మరల
ప్రాభవమ్మును గూర్చియే పలుకదొడగె!
'అఖిలకార్యాచరణమున కనిసమస్త
జగతి దీనినె వాంఛించు; సర్వకాల
సముచిత ప్రాభవమ్ము విచక్షణతయు
నేనొసంగెద నివియు ఎంతేని నీకు!
నావరమ్మిది-దివిజరాజ్ఞీవరమ్ము!

ఈగిరిప్రాంతమున సంచరింతువైన
రాట్కుమారుడవే యథార్థముగ నీవు!
రాజవే యౌదు నాఅనుగ్రహావశాన!
దేవతాంశలు నిన్నింక నాసహించు!

"ఓ శిలామాత! వినుము మృత్యువ్యాగ్ర వదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ఆమె ఆగెను! నామనోహరుడు వినుచు
ప్రాభవాప్తిని వాంఛించి స్వర్ణఫల మొ
సంగివేయగ చేసాపు సమయమందె
అదె 'అథీనా' సమస్త విద్యాధినాథ
నిర్ణయవిధాన మంత్రియు నిలిచి వినుచు
లోచనాంత నటత్ శోణగోచు లెగయు
పలికెనిట్లు గభీర వాక్స్ఫుటనమున:
'ఆత్మభక్తి, ఆత్మజ్ఞాన, మాత్మనిగ్ర
హమ్ము నివి మూడె నిరవద్యమైన ప్రాభ
వమ్ము జీవికిగూర్చును! ప్రభుత యదియు
కోరిక అవాంఛితముగ చేకూరుగాన
నియమబద్ధ జీవితమెపో నిర్మలమ్ము!
నియమజీవికి భయము సంధిల్ల దెపుడు!
ఋజుపథమ్మెల్ల వేళల ఋజుపథమ్మ
యగుట ఋజువర్తి తన భవిష్యత్ఫలమ్ము
నరసికొన దిద్దినే జ్ఞానమనుట తగును!'

"ఓ శిలామాత! వినుము మృత్యువ్యాగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ఆమె యనె నిట్లు మరల నీకై విశేష
బహుమతులచూపి ఆశగొల్పెను! బహూకృ
తుల నొసంగుటయన లంచములె నిజమ్ము;
దాన నామూర్తి మారదు! కాన నీకు
నాయథార్థ స్వరూపనిర్ణయమె తగును!
అదియు నిట్లయ్యు లాభమేదైన నీకు
కావలయునేని నాఅనుగ్రహమె కలదు!
నామహాశక్తి నీరక్తనాళపూర్ణ
మగుచు నీనాడులంజొచ్చి అమరతేజ
మున భయంకర జీవితమును తరించు
వేళ నియమద్రఢిమ నిచ్చు! స్వేచ్ఛ నిచ్చు!!'

అని వచింపగ నామనోహరుడు కొంత
తడవు యోచించె! నే ప్రమోదమ్ముతోడ
ఆమెకే దాని నిమ్మని అరచినాను
కాని అది వాని చెవిచేరనైన లేదు!

"ఈమహాదుఃఖగాథ! నాయీ అగాధ
వేదనారోదన ధ్వని వినెడి దెవరు?
నాకుగా జాలిగా నామనఃప్రగాఢ
విలయవహ్ని శమింప చింతిలెడి దెవరు?
"ఓ శిలామాత! ఓ అనేకోరుసాను
నిస్స్రవఝ్ఝరిణీ రమణీయమూర్తి!
ఓమనఃప్రియ! వినుము మృత్యూగ్ర వదన
గర్భమున నాశరీరము కలియుమున్నె-
ఆర్ద్ర డిండీరపూర నవ్యప్రకాశ
తెలవిధాన తనూరుచుల్మలసి కొనగ-
విరిసి వెలిగిన నేనవేల్వొరుల సరుల
నడుమ మృదుపాదకాంతులు కడలుకొనగ-
అచటి కరుదేరె ప్రేమరాజ్యైకరాజ్ఞి!
దివ్యమోహన దరహాస దీప్తనేత్ర!

"నాకుగా జాలిగా నామహాకఠోర
హృదయబాధ శమింప చింతిలుము వినుము!
ఓ మనఃప్రియమాత! మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
ఆమె నవ్విన చిరునవ్వుటలలలోన
తనభవిష్య ద్విజయరేఖ తాండవింప
నాప్రియుని చెంత చేరి నన్నని మనోజ్ఞ
కంఠమున ఈసమస్తలోకమున యందు
అమితలావణ్యవతిని ప్రేయసిగ నీకు
నేనొసంగెద! ఇదియె వాగ్దానమనియె!'
అని హసించినదామె! భయమ్ముచేత
మూసికొంటిని నానేత్రములను నేనె!
కనులువిచ్చి చూచిన యంత కరము చాచి
ప్రియుడు కననయ్యె! క్రోధవిస్ఫీత నేత్ర
రక్తరోచులతో నాకరాజ్ఞి కదలి
నీరదప్రతినీరలో నిలిచిపోయె!
నేనె మిగిలితి!—నాడుగా నేటివరకు
నేనొకర్తు వియోగతమోనిలీన
జీవిత విషాదహతుల శుష్కించిపోయి,
నేనొకర్తు వియోగ దవానలమున
హృదయమెరియగ ఇట్లు నశించిపోదు.

"ఓశిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె-
అమితలావణ్యవతిని ప్రేయసిగ నతడు
వలచునా! నేను లావణ్యవతిని కాన!
ఆతడే ఇట్లు పలుమారు లనుట లేద!
నాసురూః ప్రభామనోజ్ఞతలయందు
వనచరమ్ములు ముగ్ధవిభ్రాంతి కాంచి
ఓసరిల్లుట తెలియదా! హాసఖా-క
ఠోరహృదయుడ! నాప్రేమపారవశ్య
భరమున త్వదీయగాత్ర మిాహ్లనమ్ముదా
కరయుగమ్మున పెనగొన్న తరుణమందు
నీవుకురిసిన సురుచిర శ్రావణాబ్ద
వర్షధారానికాశ చుంబనసహస్ర
మధురిమములింతలోన నేమరచినావె!

"ఓశిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నాశరీరమ్ము కలియుమున్నె
ఎరుగడే నామనోహరు డీపవిత్ర
హరిత శాద్వల భూభాగమందు నిచట
ఈశిలావేది గూర్చుండి ఎన్నిమార్లు
ప్రణయభాషలు నెన్నెన్ని పలికినాడొ?
ఎరుగడే నాకరమ్మంటి ఎన్నిమార్లు
శీతహర్షాశ్రు సిక్తమ్ము చేసినాడొ?
ఈమదీయోష్ణ బాష్పమ్ము లివియునాటి
మోదవాఃపూరములు ఎంత భేదమకట!
ఓధరాదేవి! నామనః ఖేద భార
వహనమున నెంతగా నీకు బరువో నేను!
మృత్యుదేవీ! సహస్ర జిహ్వాకలతోడ
జీవితవికాసముల గ్రసించెదవు నీవె!

ఈవియోగవిషాదభారావిలమగు
నామనః పీఠిపై నిల్చి నాట్యమాడి
ఓస్మృతీ! ఓస్మృతీ! నీవె ఈమదీయ
జీవదీపిక నార్పివేసెదవు రమ్ము!"

## ౩. కథలు




౧

హిందూ దేశమందలి వాయవ్యదిశను గల పొలిమేర పేరు "చిత్రాలు." దానియెల్లలు: తూర్పునఁ గాశ్మీరము, దక్షిణమునఁ బాంచాలము, పడమట గాంధారము, ఉత్తరమున హిందూకుశపర్వతములు. చిత్రాలునందుఁ జూడఁ దగినచిత్రాలు లేనేలేవు. అది కేవలము పర్వత ప్రదేశము: ఎటు చూచినను గొండలు బండలు, మెట్టలు గుట్టలు, తిప్పలు తుప్పలు. ఆ కొండల నాశ్రయించుకొని యున్న చిత్రాలులు ముష్కరులై, యుద్ధ ప్రియులై, స్వాతంత్ర్యాభిమానులై యొండొరులతో సదా పోరాడుచు, ఆదమఱపుగానున్న సమయములలో దొరతనము వారి సేనల మీఁదను బడుచుందురు. ఒక్క చిత్రాలులే కాదు: వారికిఁ దూర్పుననున్న అఫ్రిదులును, దక్షిణముననున్న ధీరులు స్వాతులు, బాజారులు, బూనేరులు యూసఫ్జయులు, మహమందులును, పశ్చిమముననున్న యురక్జయులు జయిముక్తులు వజీరులు షీరానులును, దొరతనము వారికిఁ బ్రక్కలో బల్లెములే.

ఇది గాక, చిత్రాలును గూర్చి దొరతనము వారికి వేఱొక యారాటమునుగలదు. హిందూ దేశములోనికి రాఁగలుగుటకుఁ దగిన కనుమదారులచ్చటి కొండలయందున్నవి. పీషావరు ప్రాంతమందలి ఖైబరు కనుమ బాబరు చక్రవర్తికిఁ బూర్వమునుండియుఁ జరిత్రలయందు సుప్రసిద్ధము; అది చిత్రాలునకు దక్షిణమున సుమారు నూఱు మైళ్ల దూరముననున్నది. చిత్రాలునందే యట్టి కనుమదారులు కొన్నికలవు. అందు బారోఘిలు కనుమ 12,400 అడుగుల యెత్తుకంటె హెచ్చులేక శత్రుసేనలు దిగి వచ్చుటకు మంచి యనుకూలమైనది.

ఈ రెండు కారణములనుబట్టి దొరతనము వారి సేనలు చిత్రాలులో సదా నిలువయుండును.

మన కథ యీ నాఁటిది కాదు; ఇప్పటికిఁ జాల యేండ్ల క్రిందటిది. ఆ నాఁడు చిత్రాలులోఁ దెలుఁగు పటాల మొకటియుండెను.

౨

అది ఫాల్గుణ బహుళ చతుర్దశి నాఁటి సాయం కాలము.

చీఁకటి పడినది. చిత్రాలు గ్రామమునకుఁ జేరుననున్నయొక యింటఁ బదునెనిమిది యేండ్ల బాలిక యొకతె బల్లమీఁదఁ గూరుచుండి, చేతిలోని వ్రాఁత కాగితము దీపపు వెలుతురునఁ జదువుచుండెను. సంజ కెంజాయపడి నిగనిగలాడుచున్న యీ కన్నియ సొగసు మొగమునకుఁ గాగితమందలి వాక్యములు చదువుట వలన మఱి కొంతకళ వచ్చినది. ప్రత్యక్షముగా కనఁబడుచున్నను, సంతోషదాయకములైన యీ వాక్యములు కాగితమందు నిక్కముగాఁ గలవని యామె నమ్మఁజాలకుండెను. ఇన్నాళ్లయి తన గుండెలోఁ బెనురాతిబండ వలె నిండుకొనియున్న బెంగ యింత సులువుగాఁ దొలఁగి పోవునని యామె యనుకొనలేదు.

3

ఆమె హవల్దారు హనుమయ్య చెల్లెలు: పేరు తులసమ్మ. అన్నవలెఁ దండ్రియుఁ బటాలమందలి యుద్యోగి యగుటఁబట్టి, తులసమ్మకు శైశవమునుండియుఁ బటాలపు బ్రతుకే యలవాటు. తండ్రి లోపసంతరమున అన్నను కనిపెట్టుకొనియుండి, అన్న భార్యమూఁడేండ్ల క్రింద గతించినప్పటినుండి యతని పిల్లలకుఁ దులసమ్మగతియైనది. వారి సంరక్షణతోడను, గృహనిర్వాహణము తోడను, వెనుకటి మూఁడేండ్లును నిశ్చింతగాఁ గడిచినవి. తెలివిగల చిన్నది కాఁబట్టి యామె యీ కాలమందు స్వయంకృషి మూలమునఁ దనవిద్యనభివృద్ధి చేసికొని, యాంధ్రమందే కాక యాంగ్లహిందూస్థాని భాషలయందును జక్కని వ్రాఁతకూఁతల శక్తి సంపాదించుకొనెను.

౪

ఇంతలో హఠాత్తుగా ఘోరమైన యీ విపత్తు సంభవించి, యామె జీవనము దుర్భరముగా మాఱిపోయినది. ఆమె యన్న హనుమయ్య రహస్యావారికిఁ గొండ కనుమ దారుల రహస్యములను దొంగతనముగాఁ దెలుపుచున్నాఁడన్న సంశయము కలిగి, యతనిని దొరతనము వారు ఖైదు చేసిరి. పిమ్మట విచారణ జరిగినది. అనుమానాస్పదములైన కారణము లనేకములు కనఁబడుటవల్లను, ప్రత్యక్షసాక్షి యొకఁడు బయలుదేఱి యీ యనుమానములను బలపరచుటవల్లను, నేరము ఋజువై మరణదండనము విధింపఁబడెను. శిక్ష యమలు జరుగునాఁటి ముందటిదినమున హనుమయ్య భాగ్యవశమునఁ జెఱనుండి తప్పించుకొని పాఱిపోయి, తత్పరిసరముల నెచ్చటనో తల దాఁచుకొని, యప్పటప్పట సీతాపతి యను స్నేహితుని ద్వారా చెల్లెలికి జాబులు, వర్తమానములుఁ బంపుచుండెను.

వయసుకాఁడైన సీతాపతి సందేశహారుఁ డగుట తులసమ్మకు మొదటినుండియు భయహేతువే. ఆమెకు వాని యందిష్టము లేదు సరి గదా, నమ్మకమును లేదు. వాఁడు తన మీఁదఁ గన్ను వేసినాఁడని యామె యెఱుఁగును. అట్టి వాఁడు తమకుపకారి యగుట కాని, తమ గుట్టుమట్టులు వానికిఁ దెలియుట కాని, యామెకెంత మాత్రమును సమ్మతము కాదు. అయినను, అన్న యిష్టమును బట్టి యామె వానియెడలఁ దగిన యాదరము చూపుచు వచ్చెను. ఆ యాదరణమే యనర్థకారియైనది. అందువలన వాఁడు మునుపటి కంటెఁ జనవు హెచ్చి, వెనుకలేని పండ్లయిగిలింపులును గొంతుసగిలింపులును మొదలు పెట్టినాఁడు. తుదకుఁ, దులసమ్మ భయపడినట్లు కార్యము వికటించెను.

౫

అది యీ నాఁటి యుదయమున జరిగిన సంగతి బ్రహ్మకపాలము వఱకును వెళ్లిన తీర్థవాసులైన తెలుఁగు వైదిక బ్రాహ్మణులు కొందఱు దారి తప్పి యిచ్చటికి వచ్చినట్లును, వారు హనుమయ్యకుఁ బూర్వపరిచితులైనట్లును, వారితోఁ గలిసి తానును వైదికవేషముతో దక్షిణహిందూస్థానమునకు హనుమయ్య పాఱిపోవ నిశ్చయించినట్లును, సీతాపతి తెల్లవాఱకముందే కబురు తెచ్చినాఁడు. పిల్లలను జెల్లెలిని జూచుటకు హనుమయ్య యీ రాత్రి రహస్యముగా వచ్చుటకేర్పాటు. అప్పటికిఁ బిల్లలను నిద్ర

పెట్టవలసినదని హనుమయ్య కబురు పెట్టెను. అది యుగాదికి ముందటిరాత్రి గనుక, పిల్లల నిమిత్తమై పీఠాపురము నుండి తాను బహువ్యయప్రయాసములతోఁ దెప్పించిన ఆటవస్తువులు కొన్ని, తినుబడి పదార్థములు కొన్ని, యుగాది కానుకలుగా వారికిఁ బెట్టి పోవలయు నని యతని యభిలాషము. అందుకొరకు వారి మంచము ప్రక్క బల్ల యొకటి వేసి యుంచవలసినదని యతఁడు చెల్లెలితో ముఖ్యముగాఁ జెప్పమన్నాఁడు. ఉగాది దేవత యుగాది కానుకలు రాత్రికిఁ బట్టుకొని వచ్చునని యాపిల్లలు నమ్ముకొనియుందురు. అట్టి నమ్మకము వారికి నాలుగు సంవత్సరములు క్రిందటఁ గలకత్తాలో నెవరి షాపులోనో యుగాది దేవత వేషమును జూచినప్పటి నుండియుఁ గలిగినది. అట్టి వెఱ్ఱి నమ్మకము గల యాపసిపిల్లల ముద్దు తీర్పకుండ వారికి నిరాశ కలిగించుట హనుమయ్యకు మనస్కరించినది కాదు.

ఈ సంగతులన్నియుఁ గిటికీలో నుండియే విని, తులసమ్మ సరియే యన్నది. తన సందేశము సమాప్తమైనను, సీతాపతి యచ్చటనుండి కదలకుండఁ గొంతసేపు తారాడినాఁడు; ఎగువకుఁ జూచినాఁడు; దిగువకుఁ జూచినాఁడు; కేకరించినాఁడు; ఉమిసినాఁడు. ఏమి చేసినను, కిటికీ తలుపు మాత్రము రాదు! తెఱిచి తలుపుతీయుమని వాఁ డడిగినాఁడు. పిల్లలకు నిద్రాభంగమగు నన్న మిష చెప్పి, యామె కిటికీ తలుపును మూయఁ బోయినది. అందు మీఁద నోరు విడిచి వాఁడు ధారాళముగానే యామెను దన కోరికను దీర్పుమని యడిగినాఁడు. ఉపకారమునకుఁ బ్రత్యుపకారమఁట యది! అట్లు జరిగింపని నాఁడు, వారి కొంప తీయుదుననియు వాఁడు బెదరించినాఁడు. పాపము! అబల యని, యొంటికత్తె యని, యడకత్తెరలోని పోఁక చెక్కవలెఁ దన చేతఁ జిక్కియున్నదని, యట్టి పాడు కోరిక కోరుటకు సాహసించినాఁడు, క్రూరుఁడు, నీచుఁడు, తుచ్ఛుఁడు, లుచ్చా, పోకిరీ, పుండాకోరు! మానము విషయమైన యవమానము కలిగినప్పుడు, మానవతులైన స్త్రీలు తోఁక త్రొక్కిన త్రాఁచులు. అఱకాలి మంట శిరస్సునకు లేచినది, తులసమ్మకు. ఏది యేమైనను గాని మ్మని గాని యదరుచున్న ముకుపుటములతో, నిప్పులు కురియుచున్న కన్నులతో, వడఁకుచున్న యొడలితో, పరరసాధిదేవత వైఖరిని లేచి, కొరడా దెబ్బల వంటి కఠిన



వాక్యములతో వాని తలవాఁచునట్లు చీవాట్లుపెట్టెను. మొగమెత్తనీయని సిగ్గు, మొగమ్మెఱ్ఱఁ బాఱఁ జేసిన కోపము, మనస్సునఁ గ్రుమ్ములాడుచుండఁగా, వాఁడు పండ్లు పట పటఁ గొఱుకుచుఁ, బగ చాటుచుఁ బోయినాఁడు.

౬

ఇది ప్రొద్దుటి ముచ్చట. సాయంకాలమునఁ గాగితము వచ్చినది. చీకటిపడిన పిమ్మటఁ బురుషుఁ డొకఁడు గుఱ్ఱము నెక్కివచ్చి, యా కాగితము తులసమ్మ చేతిలోఁ బెట్టి, వెంటనే పోడు మీఁద వెళ్లిపోయినాఁడు. వడఁకుచున్న చేతి వ్రేళ్లతో దాని నామె విప్పినది: తన యన్న పట్టువడె నన్న దుఃఖవార్త దానియందుండు నని యామె భయము. మొదట దుఃఖబాష్పములు, వెనుక సంతోషబాష్పములు, కాగితము మీఁది వ్రాఁత యామెకుఁ దిన్నగాఁ గనబడమికిఁ గారణములు. హనుమయ్య మీఁద సాక్ష్యము చెప్పి, యతని మరణదండనశిక్షకు

ముఖ్యకారకుఁడైన కన్నయ్య వ్రాసిన కాగితమట. దాని యందు హనుమయ్య నిరపరాధి యన్నందుకుఁ దగిన నిదర్శనములు వ్రాసియున్నవి. అట్టి వ్రాంతకుఁ గల హేతువును దత్పత్రికయందేయున్నది. ఆ ముందటి దినమునఁ గొందఱు సిపాయిలును, దానును గలిసి కన్నయ్య యొక కొండకనుమదారిని వచ్చుచుండఁగా, దుప్పొంచి చాటున నక్కియున్న యాఫ్రిదులు వారివైపునఁ దుపాకులు గుఱిపెట్టి కాల్చిరి. తక్కిన వారికెవ్వరికిని దగులక, యొక్క కన్నయ్యకే ప్రాణాపాయకరమైన గాయము కలిగినది. ఒరుని ప్రాణముతీయఁగోరి యీర్ష్యామూలమునఁ దాను జెప్పిన యసత్యసాక్ష్యమునకుఁ బ్రతిఫలము భగవంతుఁడు తోడ్తోడనే కలిగించినాఁడని పశ్చాత్తాపము చెంది, మరణమునకుముందుఁ కన్నయ్య యీ కాగితమును వ్రాసెను. పత్రిక వెనుకప్రక్క: "అమ్మాయీ, నిమిషమైనను జాగుచేయక, తత్క్షణమే సేనానాయకునియొద్దకు వెళ్లి నీ యన్నగారి ప్రాణములు రక్షించుకొమ్ము. అట్లయిననే నా యాత్మకుఁ బరలోకమున శాంతి కలుగును. కన్నయ్య వ్రాలు," అని యున్నది.

## ౨

"ఒయ్యారిని దయారుచేసి వెంటనే బయలుదేఱ వలయును," అని తులసమ్మ లేచెను. ఒయ్యారి యనఁగా, ఆమె సవారిచేయు గుఱ్ఱము: ఉసవలెఁబోవు శక్తికలది. అశ్వారోహణవిద్య యా కన్యక బాల్యముననే యభ్యసించినది. సేనలోని హైందవులయందే కాక యాంగ్లేయులందును, ఆమెతో సరిసమానముగా గుఱ్ఱము పరుగు పెట్టింపఁగలవారు లేరు. తులసమ్మకుఁ దండ్రి నేర్పినది గుఱ్ఱపుసవారొక్కటియే కాదు; అవసరము పడినప్పుడు పిస్తోలుతోఁగాని తుపాకితోఁగాని గుఱితప్పకుండఁ గొట్టఁగలశక్తి యామెకుఁ గలదు. అచ్చటికి నలువది యేఁబది మైళ్లదూరములోనున్న మాలాఖండగ్రామ పరిసరమున డేరాలు వేసికొనియున్న శ్వేతముఖసేనానాయకుని శిబిరమున దానొక్కతె యీ రాత్రిపూట వెళ్లివచ్చుట కామె జంకకుండుటకదియే హేతువు.

జంకు లేమిహేతువునఁ గలిగినది. రాత్రికి రహస్యముగాఁ దన యన్నరాఁ గలుగుటకై, యామె నవుకరులను మిష కల్పించి పంపించివేసెను, ఇంటఁ బిల్లలు మాత్రమేయున్నారు. తోడు లేకుండ వారిని విడిచిపెట్టి పోవుట క్షేమకరమా?......క్షేమకరమైనను గాకున్నను గత్యంతరము లేదు. ఆమీఁద భగవంతుఁడేయున్నాఁడు. సీతాపతిగాఁడు కుట్ర పాటికే పన్నుచుండును.

ఇట్లు తలఁచి, యామె గుఱ్ఱపు దబేలాకడకుఁ బరుగున వెళ్లి, యొయ్యారినిదీసి, దానిని దయారుచేసెను. తెలుమేను కెకలమునలె నిగనిగలాడుచున్న యా పంచకల్యాణి మేను నిమురుచు, "ఒయ్యారీ, నా ముద్దుల యొయ్యారీ, మయూరిలాగున నొయ్యారము చూపుచు, నీవీనాఁడు కదము త్రొక్కుటకు వీలులేదు. గాలిని మించునీ గమనవేగమే కనఁబఱుప వలయును. అన్నయ్య వచ్చు లోపల మనము తిరిగి రావలయును జుమా. తాను మఱిదాఁగియుండవలసిన యవసరముగాని, పాఱిపోవ వలసిన యవసరముగాని, లేదన్న సంతోషవార్త యన్నయ్యకు మనము వినిపింతము. రమ్ము, మఱి రేపటి యుగాది మనకు సంతోషకరమగును. ఉగాది కానుకగా నీకుఁ బాయసము వండి పెట్టెదను." అని తులసమ్మ యనఁగా, జోషపడినట్లు యిహిహీ యని గుఱ్ఱము సకిలించినది.

దానిని బయట నిలిపి, లోనికిఁ బరుగున వెళ్లి పిస్తోలు మొలను దోఁపుకొని, యటుపిమ్మటఁ జప్పుడు చేయని యడుగులతో, ఆమె పిల్లల గదిలోనికి వెళ్లెను. ఒక్క మంచముమీఁదనే యొండొరులను గౌఁగిలించుకొని పిల్లలిరువురుఁ బరుండియుండిరి. మఱచకుండ మంచము ప్రక్కను దాను బెట్టియుంచిన బల్లనుజూచి, తులసమ్మకుఁ బెదవులమీఁద లేఁతనవ్వు పొడచూపినది.

"ఆహా! ఏమి ప్రేమ, అన్నయ్యకుఁ బిల్లలమీఁద! ఉగాదిదేవత యుగాదికానుకలు రాత్రికిఁ దెచ్చునని పిల్లలు నిరీక్షించుచుందురన్న సంగతి యిప్పటి తన యవస్థ

యందును మఱవలేదు." అని యనుకొనుచు మెల్లగా వంగి, తగిలియుఁ దగులనిబాగునఁ దనయొుఱ్ఱని పెదవులతో గులాబిఱేకులకు సరివచ్చువారి నున్నని చెక్కులు ముద్దుపెట్టుకొనిలేచి, "వీరిది గాఢనిద్ర; మెల్లవాలబనలుకును లేవరు. ఉదయమున వీరి యుగాది యత్యంతసంతోషకరముగును గాక! ఈరాత్రి వీరికివచ్చిన భయములేదు. ప్రహ్లాదుని రక్షించిన శ్రీమన్నారాయణమూర్తి, మార్కండేయుని రక్షించిన శ్రీపరమేశ్వరా; వీరిని రక్షించుభారముమీఁద అని చేతులెత్తి మ్రొక్కి, యామె యలికిడి లేకుండ బయటికివచ్చి, తలుపు గొండెము పెట్టెను. తాళము వేయుటకుఁ గారణము, తాను లేనిసమయమునఁ దనయన్న యుగాది కానుకలతో వచ్చునేమో!

మఱికొంతమైనను జాగుచేయక, కట్టుకొన్న చీర చెఱఁగు నడుమునకు బిగఁజుట్టి, తులసమ్మ చివాలుమని గుఱ్ఱముమీఁదికెక్కి కూర్చుండి, సేనానాయకుని శిబిరమువంక కభిముఖి యయ్యెను. చబుకు దెబ్బగాని, లగాములాగుడుగాని, మడమలు తాడింపుగాని యనవసరము లేకుండ, నోటిమాట, చేతిస్పర్శ, మాత్రమున గుఱ్ఱము




కాళ్లు పాఱజూచి దౌడుపెట్టినది. రాతినేలమీఁద డెక్కలచప్పుడు టకటకమని మొదలెఱిపిలేకుండఁ జీకటిలో వినిపించుచుండెను. ఆశతోడను, సంతోషముతోడను, దులసమ్మ మనోభావములు గుఱ్ఱపుదౌడును మించి ముందుకు పోవు పెట్టఁ దొడఁగినవి. తిరిగి వచ్చియన్నను దాను గలిసికొన్నప్పటి తమవేడుక, తండ్రి కౌఁగిలించుకొన్నప్పటి పిల్లలవేడుక, మఱునాటి యుగాదిపండుగవేడుక, యుగాది కానుకలు పట్టుకొని యాడుచు నవ్వెడి పిల్లల తెయితెయి తకతక పకపక,—టకటక, టకటక, టకటక,—టకటక, తకతక, పకపక,—టకటక, టకటక, టకటక,—

౮

"ఎవరక్కడ? ఆఁగు!" అన్న కేక చీకటినిఁజీల్చుకొని తటాలున వినవచ్చెను. అప్పటికి నాలుగుమైళ్లు మాత్రమే కడిచినవి. లగాములు వెనుకకు బిగించి, తులసమ్మ యెదుటివారిని నిలిపి చూడఁగాఁ, దనుపటాలపు సిపాయిలు కొందఱువచ్చి చుట్టుకొనిరి. శత్రువులఁ గూర్చిన జాగరూకతకొరకు దొరతనమువారు కావలి యుంచిన దండు కాఁబోలునని యామె యూహించెను.

"సుబేదారూ, ఎవరోచూడు" అన్న యాజ్ఞ చీకటిలో వినఁబడినది.

లాంతరు మీఁదికెత్తి చూచిన సుబేదారుపొందిన యాశ్చర్యమునకు మేరలేదు. మబ్బుల చాటునుండి తొంగిచూచుచున్న నిండు జాబిల్లియట్లు, తొలి జవ్వనమున నున్న తులసమ్మ సొగసు ముగము ముడిపడిన కనుబొమలతోడను, జాలిగొలుపు కంటిచూపులతోడను, బిగఁబట్టిన పెదవులతోడను, సుబేదారు శోభనాద్రి కన్నులకు విందు చేసెను. మల్లెతీఁగ బాగున సున్నితమై, సన్ననై, తీన్ననైన యా కన్నియ మేని దౌర్బల్యమును జూచి యాదరసూచకస్వరముతో శోభనాద్రి యామెను బలుకరించి యేమిపనిమీఁదఁ బోవుచున్నదో ప్రశ్నింపఁగాఁ దాను సేనానాయకునిజూడఁ బోవుచున్నానని యామె కోమలకంఠమునఁ దెలిపి దారి యీయవలసినదని కోరి

నది. "వెంకటస్వామిగారూ, ఎవతెయో చిన్నది దొర



దర్శనము నిమిత్తమై వెళ్లుచున్నది." అని సుబేదారు గొంతెత్తి తెలిపెను.

"ఆమెను పోనిమ్ము" అన్న యాజ్ఞ వినఁబడినది.

మర్యాదాపూర్వకముగాఁ దులసమ్మ వెనుకకుఁ దల వంచి, శోభనాద్రి వెనుకకు మూఁడడుగులు తగ్గినాఁడు. అతనికి కన్నులతోనే ప్రతివందనముచేసి, యామె గుఱ్ఱమును మరల దౌడు వదలెను.

౬

సుబేదారుమేజరు వెంకటస్వామి "రండు రండు; అడుగులు మఱికొంత వడిగాఁ బడనిండు. లేనియెడలఁ, బిట్ట దొరకకపోవును." అని తనవారిని హెచ్చరించెను.

"చిత్తము" అని పరధ్యానముగా శోభనాద్రి యన్నాఁడు. ఆపడుచు బ్రహ్మచారి మనస్సిప్పటికిని చీఁకటిలో గుఱ్ఱముమీఁద తివ్వతివ్వనఁ బోవుచున్న తేజస్వి నిప్పువంటి నవ్వులేని మొగముమీఁదనే నిలిచియున్నది. "ఎవ్వతె, యాజవ్వని? ఏమి పనియున్నది, యామెకు సేనానాయకునితో? ఒంటికత్తెయై యింత దవ్వు కటికి చీఁకటిలో వెళ్లవలసిన యగత్య మేమైయుండును? ఎవరి చిన్నది? ఏ జాతి?........ మా తెలగాల చిన్నదై యుండునా? పెండ్లి కానిదనుట మాత్రము నిశ్చయము," అన్న పరిపరివిధములైన యూహలు మనస్సునఁ గ్రమ్ముకొన్నవి. అడుగు తప్పకుండఁ గాళ్లుమాత్రము తనవారితో సరిగా నడచుచుండెను.

వడివడి వారు తులసమ్మ విడిచి వచ్చిన యింటివైపునకు నడిచిరి. కారణమేమనఁగా, దులసమ్మ దులిపి విడిచిన తరువాత సీతాపతి కోపావేశమున హనుమయ్య గుట్టు బయటఁ బెట్టినందున, సేనానాయకుఁడు సుబేదారు-మేజరు వెంకటస్వామిని పిలిచి, హనుమయ్యను బట్టుకొనుటకును, బట్టువడిన వెంటనే యతనిమీఁది మరణశిక్ష యమలులోఁ బెట్టుటకును, గట్టి యాజ్ఞ పెట్టి, యతనిని జిన్నదండుతో బంపెను.

ఘోరమైన యీ ఘోషయేమియుఁ దెలియక తులసమ్మ యాశాపూరితమైన మనస్సుకలిగి, తన యన్న నిర్దోషియని తేలుననియు, మఱి యతని ప్రాణమునకు వచ్చిన భయము లేదనియు నిండు నమ్మకము పెట్టుకొని, యత్యంతసంతోషముతో సేనానాయకుని శిబిరమునకుఁ బోవుచున్నది, పాపము!

ఇంతలో సుబేదారు-మేజరు వెంకటస్వామి యాఁగి, తనదండును నిలిపెను. అది సంకేతస్థలము.

శోభనాద్రి నిలువఁబడియున్న చోటికి మల్లన్న హవల్దారు మెల్లగా జరుగుకొని వెళ్లి యల్పస్వరముతో, "హనుమయ్య రష్యావారి గూఢచారుఁడగుట నిజమై యుండునా" అని సందేహము తెలుపుచుఁ బ్రశ్నించెను.

"నిజమే; సందేహము లేదు. విచారణలో నేరము ఋజువైనదఁట! శిక్షకు ముందొక్క దినమున్నదనఁగాఁ దప్పించుకొనఁబట్టి కాని, యతఁడిప్పటికే యమలోకమున నుండవలసినది."

"ఇప్పుడు మరల నట్లే జరుగవలయునని మన సిపాయిలు కోరుచున్నారు."

"అదేమి ?"

"ఈరాత్రి హనుమయ్య తన పిల్లల నిమిత్తమై యుగాదికానుకలు పట్టుకొని వెళ్లునఁట! అది హనుమయ్య రహస్యము వెల్లడించిన సీతాపతి చెప్పిన కబురే. సీతాపతిని దిట్టని వారొక్కరును లేరు. మన పటాలములో."

"ఆగొడవ మన కేల ? అధికారి యాజ్ఞ నెఱవేర్చుట మనవిధి" అని శోభనాద్రిపలికి, "ఉస్‌స్‌స్‌స్‌! ఎవరో వచ్చుచున్నారు," అనెను.

హనుమయ్య యింటిపైపునుండి యొకరు చీఁకటిలోవచ్చి, నలుదిక్కులుఁ బరిశీలించుచు నిలువఁబడినాఁడు.

"వీరన్నా ?" అని తగ్గింపు గొంతుకతో వెంకటస్వామి పిలిచెను,

"చిత్తము," అని గొంతుక యొనఁపుతో జవాబు.

"వచ్చినాఁడా ?"

"లేదు. చీఁకటిపడిన కొంతసేపటి నుండియుఁ జూచుచున్నాను; వచ్చినజాడలేదు."

"ఇంట నెవరైన నున్నారా ?"

"పిల్లలేయున్నారు. ఇతరుల సందడిని నేను రాకముందే యతనిచెల్లెలు పంపివేసినట్లున్నది. ఆమె గంటక్రింద గుఱ్ఱమునెక్కి దడదడ నెచ్చటికోపోయెను. గుట్టు బట్టబయలైనదని తెలిసి యన్నగారికి హుషారిచ్చుటకేమో ?"

"కారు మబ్బురంగు గుఱ్ఱమేకదా, యామెయెక్కినది ?" అని సుబేదారు-మేజరు ప్రశ్నించెను.

"చిత్తము."

"అట్లయిన, నీయూహ సరికాదు. ఆచిన్నది త్రోవలో మాకెదురుపడినది. ఆమె సేనానాయకుని దర్శించుటకు వెళ్లుచున్నది; తనయన్నను క్షమింపుమని ప్రార్థించుటకుఁ గాఁబోలు ! ఆయువు చెల్లిన వాని ప్రాణములను బాశమువేసి లాగుచున్న యమునిఁ బ్రార్థించి యెంతప్రయోజనకరమో, యంతే ప్రయోజనకరము. పాపము ! ఆమె యిచ్చటలేకుండుట కొంత నయమైనది. ఉన్నయెడల, ఆమెతోఁ గావలసినంత బాధపడవలసి వచ్చియుండును, మనము," అని పలుకుచు శోభనాద్రివంకకుఁ దిరిగి, "హనుమయ్య దాఁటుకొని పోవుటకు వీలులేకుండ మనుష్యులను గావలియుంచుమని వెంకటస్వామి" కాజ్ఞాపించెను.

శోభనాద్రి సహాసముతోనే తదాజ్ఞాప్రకారము నడిపినాఁడు. అమితమైన జాలితోఁ గూడిన యాతని తలఁపులు, సేనానాయకుని శిబిరమునకు దారిపెట్టుచున్న యేకాకినియైన యాయుబలమీఁదనే యుండెను నిలిచి యున్నవి. పాపము ! బాష్పసహితములైన ప్రార్థనలతోఁ బాషాణహృదయుఁడగు సేనానాయకుని గరఁగించి, మరణశిక్షనుండి రాజద్రోహిని రక్షింపఁ దలఁచినది కాఁబోలు, వెఱ్ఱిబాగుల కుట్టుపడ !

పావుగంట—అరగంట—ముప్పావుగంట- గంట గడచినను హనుమయ్య జాడలేదు. శోభనాద్రిని జూచి సుబేదారు-మేజరు, "ఓయీ, చీఁకటిలో వీఁడు మన కన్నులు కప్పిదాఁటుకొనిపోయినట్లున్నది. నీవు వెళ్లి చూచిరమ్ము. అనుమాత్రమైన యనుమానము కలిగినను, పిస్తోలు పేల్చుము; వెంటనే మేమువచ్చి పడెదము" అని యుత్తరువు చేసెను.

"చిత్తము" అని చీఁకటిలో శోభనాద్రి హనుమయ్య యింటివంకకుఁ బోయినాఁడు.

## ౧౦

ఒక్కగదిలోనే దీపపు వెలుతురు; తక్కిన యిల్లంతయు నంధకారమయము. అలికిడి చేయకుండఁ జుట్టును దిరిగి చూడఁగా, అనుమానకరమైన సంగతి యేదియుఁ గనఁబడలేదు, వినఁబడలేదు.

వీథితలుపు మెల్లగాఁ దెఱచి శోభనాద్రి లోనఁ బ్రవేశించి, యొక్కసారియాఁగి వినెను. నీరంధ్రమైన నిశ్శబ్దము. తలుపు మెల్లఁగా జేరవైచి యాతఁడు దీపమున్నగదికి దారితీసినాఁడు. వ్రేలెఁడు మూసియున్న తలుపు సందులోనుండి ముప్పాతిక తగ్గింపుగన్న దీపపువెలుఁగు,

త్తెల్లని బట్ట పీలికపోలిక బయటికిఁ బడుచుండెను. తలుపు తటాలునఁ ద్రోసి శోభనాద్రి గదిలోనికి వెళ్లినాడు. పిస్తోలు చేతిలో సిద్ధముగా నున్నది.

గది నలువంకలను చూపులు నిగిడించి యతఁడు చూడఁగా హనుమయ్య యచ్చట లేఁడు. దృగ్గోచర మైన యచ్చటిస్థితి శోభనాద్రికి లజ్జాహేతువయ్యెను.

మంచము; మంచముప్రక్క-బల్ల; బల్లమీఁద, ఒకయారదీపము; కింపువెలుతురు ముగములమీఁదఁ బడకుండ మంచముననుమఁ, జేతు లొండొరులపై వేసికొని యొప్పుగు పిల్లలు, ముంగిరులు ముద్దుమొగముల ముసురుకొనియుండ, సమమైన యుచ్ఛ్వాసనిశ్వాసములతో నిద్రించుచుండిరి.

ఉగాది కానుకలు బల్లమీఁద లేకుండుటనుబట్టి, యుగాది దేవత యింకను దిగలేదనుట నిశ్చయము.

మంచముమీఁదఁ బరున్నవారు, బాలుఁడొకఁడు, బాలికయొకతె. బాలిక నిద్రలోఁ గదలి, కన్నులు పులుముకొనసాగినది. ఆజానుబాహుఁడైన శోభనాద్రి భయమున గబాలుమని యనుకకు జరిగి దండెముమీఁది బట్టలకు వెనుకతట్టున గోడకంటిపెట్టుకొనెను. 'దొంగ! కానుకల—దొంగ!!—ఉగాది—కానుకల—దొంగ !!!—ఉసికో !-ఉసికో !!—ఉసికో !!' అని యతని గుండె కొట్టుకొనుచున్న ధ్వనికిఁ దోఁచినది. బిగఁబట్టిన యూపిరితో బట్టలు సందునుండి తొంగిచూడఁగా, మంచముమీఁది సంగతులు గోచరించుచుండెను.

ఆ బాలిక యంతకంతకును మెలఁకువ చెంది లేచి కూర్చుండి, బల్లవంకఁ జూచినది. ఉగాది కానుకలు కనఁబడలేదు. ప్రక్కను బరున్న బాలునిమీఁదఁ జేయివేసి, "అన్నయ్యా, లేలే" అని యామె యూఁపెను.

అన్న చెల్లెలికంటె రెండేండ్లు పెద్ద: సుమారు పదియేండ్లవాఁడు. నిద్రచేత బరువెక్కిన కన్నులు సగము తెఱచి, మరల వెంటనే గట్టిగా మూసికొని యతఁడు, "ఇంకను తెల్లవారలేదు; అల్లరిపెట్టక పండవే, అన్నపూర్ణా" యన్నాఁడు.

ఆలాగున వదలి యూరకుండ వలసినది కాదు, అన్నపూర్ణమ్మతల్లి! "చిన్నవాండ్రకుపోయి, శ్రీరంగశాయి" యని తులసమ్మ తమ్ముని నిద్ర పుచ్చునప్పుడు, "ఆఁ! అన్నయ్యమీఁదఁ బాటపాడి, నామీఁదఁ బాడవా?" అని మేనత్త మొగముచూచి టకాయించు గట్టిపిల్ల! అన్న జబ్బపట్టుకొని గట్టిగాఁ గదుపుచు, "ఓహో! కుంభకర్ణుని నిద్ర! లేవే. ఉగాది దేవత యింకను రాలేదు; రాదేమో ?" అని యతని చెవిలో నామెయూఁదెను.

"ఏమీ ?" అని రంగశాయి దబాలున లేచి కూర్చుండి, యుగాది కానుకలు లేనిబల్లను జూచుచుఁ గొంచము యోచించి, "చెల్లీ, భయము లేదు లే, ఉగాది కానుకలు తప్పక ప్రొద్దుటిలోపుగా వచ్చును. ఉగాది దేవత గొడవ మనకెందుకు, ఉగాది దేవత గొడవ మనకెందుకు. ఉగాది దేవతయున్నదిగదా?" అనెను.

"ఉగాది దేవత లేనే లేదా ?????"




"లేదని యీ యుదయమే యత్త నాతోఁ జెప్పినది."

"ఎవరు, తులసమ్మత్తయా ?"

'మఱియెవరే, వెఱ్ఱిమొగమా? నీమగని తల్లియా, నాపెండ్లాము తల్లియా?" అని కిలకిల నవ్వినాఁడు, రంగశాయి చెల్లెలికిఁ దీసిపోవవలసినవాఁడుకాఁడు.

"ఉగాది దేవత యుత్తుత్తయని తులసమ్మత్త చెప్పినదా? నేను నమ్మను, నమ్మను. నమ్మను."

"నమ్ము, మాను. అత్తయట్లు చెప్పుటమాత్రము నిశ్చయము. మనము నిద్రపోవుచున్నప్పుడు నాన్నయే వచ్చి యుగాదికానుకలు పెట్టిపోవునఁట! నాన్నకు మన మీఁదనున్న ప్రేమ యపరిమితమఁట! ఆమాటచెప్పి యత్త యెందుకో యేడిచినది. నాన్న వచ్చిన తరువాత నే నడుగఁదలఁచుకొన్నాను: 'నాన్నా, నీవే యుగాది దేవతవా, లేక యుగాదిదేవత వేఱేయున్నాఁడా?' యని. ఉగాది దేవత వేఱేలేనియెడల, వెనుకటి యుగాది పండుగులకు మన కోసరమై యుగాది కానుకలు తెచ్చి పెట్టినవాఁడు నాన్న యన్న మాటయే. ఉగాది దేవత కూరకే మ్రొక్కుచుంటిమి, నాన్నకు మాని."

ఉగాది దేవతను గూర్చిన యూహాతీతమైన యద్భుతసమస్య విషయమై యన్నపూర్ణ చిన్ని మనస్సునఁ దలపోఁతలు సాఁగినట్లు, పూర్ణమౌనము పూని యా బాలిక కొంతసేపు మొగము బిగించి కూరుచుండెను............ఉగాది దేవత లేనేలేఁడా?!!! ఈ నాస్తికవాదము నరకమునకే హేతువని యామె నమ్మకము............ఇంతలో, ఆమె కన్నులు నవ్వుతో తెఱయఁ జొచ్చినవి. ఆతురముతో ముందుకువంగి, "అన్నయ్యా, పరున్నట్లు నటించి మనము మేలుకొని యుందము; నాన్న యగునో కాఁడో తెలియవచ్చును." అని యాబాల యెత్తు చెప్పినది.

"ఆలాగుననే కానిమ్ము," అని రంగశాయి యొప్పుకొనెను.

అన్నపూర్ణ సంతోషముతోఁ జేతులుతట్టుచు, "ఓహో! ఎంత వినోదము! ఉగాది దేవత నాన్నయే యయి, మనము నిద్రపోవుచున్నామని యతఁడనుకొని యుగాది కానుకలు పెట్టుచున్నప్పుడు మనము గబాలున, 'ఉగాది దేవతా,' యని నాన్నమీఁదఁబడి సంతోషముతో గంతుచుఁ, గేకలువేయుచు, ఓహోహోహో!" అని నవ్వఁజొచ్చినది.

"ఆలాగుననే చేయుదము; మఱిరమ్ము. నిద్రలో నున్నామని నాన్న యనుకొనుటకు మనము కన్నులు మూసికొనవలయును. తెఱచియుంచిన యెడలఁ, దలుపు సందులోనుండిచూచి నాన్న లోనికిరాఁడు." అని బాలుఁడనెను.

ఇద్దఱును గన్నులు మూసికొనిరి. మూసికొన్న కన్నులకు మూఁడు నిమిషములలో ముద్రలు పడినవి. అలసియున్న యా చిన్నారి పిల్లల శిరస్సులు, తామర పూవుల జంటవలెఁ, దలగడ మీఁద నొఱగెను. ఉగాది దేవత యూసే మఱచి, వారు నిద్రాదేవతకు దాసులైనారు.

## ౧౧

పిల్లల సంభాషణ జరుగుచున్నంతసేపును గుంభకదశ పొందియున్న శోభనాద్రి యూపిరికి రేచకపూరక వ్యాపారములు, పిల్లల యూపిరి ధారాళముగా నడుచుచున్న ధ్వనులు వినవచ్చినంతవఱకును మరలఁ బ్రారంభము కాలేదు. ఆముద్దుబొట్టెల మురిపెపుఁ బలుకుల తోడి ప్రసంగ మతనిమనస్సును లెస్సగాఁ గరఁగించివేసెను. అదవిన్నతరువాత, రాజద్రోహినిగూర్చిన యతని యూహాలకు మార్పు కలిగినది: అతఁడు ద్రోహియైన గూఢచారుఁడనికాని, ఘాతుకమృగమునువలె సాటిమానవు నాతని వేఁటాడి చంపుట న్యాయమనికాని, యిప్పుడు శోభనాద్రికి మఱి తోఁచుచుండుటలేదు. దారిలోఁ దనకు దారసిల్లిన తరుణీమణికిఁ దోఁబుట్టువు; కల్లకపటములెఱుఁగని యీపిల్లవాండ్రతండ్రి: ఇట్టివానిని బట్టియిచ్చి ప్రాణములు తీయించుట ధర్మమని యతని బుద్ధికిఁ దోఁచలేదు సరిగదా, నేరమనియు ననిపించినది.

ఆఁ! అదేమి? వినఁబడీ వినఁబడనిలాగున బయట నేదో చప్పుడైనదికాదా, తలుపు దొంగతనముగాఁద్రోసి

నట్లు?...అదిగో, మరల! ఆధ్వనియేమో శోభనాద్రికి మఱి సందేహము లేదు. పన్నియున్న యురులన్నియు దాఁటి, వడి యిల్లో లోనికి వచ్చినది. ఢమ్మను పిస్తోలు ధ్వనియో, పొంచియున్న వేఁటకాండ్ర గొల్లుమను కేకలో, నేఁటినిముసమున కానిముసమున వినవచ్చునని యాతని నమ్మకము. కత్తిపోటువలె కనికర మతనిగుండెను జీల్చివేసినది.

అదిగోమరల, గదితలుపట్టఁ దేలికమైన యడుగుల చప్పుడు!......"మెల్లగా," "మెల్లగాఁ," గదు "మెల్లగా," గది తలుపు లోనికివిడి, యటూ సందుసందుఁ దొంగి చూచుచున్న మొగము కనఁబడెను. అది పురుషుని మొగము; నగము నుప్పొంగించియున్నది. కన్నులు మాత్రము పెద్దవై, కణకణమెఱయుచున్నవి, మంచము మీఁదఁ బరున్న బాలికకన్నులవంటివి. ఆ ముఖము శోభనాద్రికిఁ దెలియనిది కాదు; అది హనుమయ్యది.

గది నలువంకలను గలయఁజూచి, పరున్న పిల్లలు తప్ప వేఱెవ్వరును లేరని తోఁచినందున హనుమయ్య లోనికిఁ బ్రవేశమై, మునివ్రేళ్లమీఁద మంచము కడకు నడిచివెళ్లి, నవళించియున్న పసిపిల్లల ముద్దుమొగముల వంకఁ బ్రేమ యుట్టిపడుచూపులు పఱపుచుఁ, గొంత సేపు నిలుచుండెను. అటు వెనుకఁ గష్టముతో, బహుకష్టముతోఁ, జూపులు మెల్లగా మరలించుకొని, తన ప్రక్కను వ్రేలాడుచున్న తోలుసంచిలోనుండి యొకచిన్న పిస్తోలు, దానిలోఁ బ్రేల్చుటకుఁదగిన కేపులపెట్టెలుకొన్ని, చిన్న కత్తియొకటి, రెండు చిన్న గుఱ్ఱములు, బూచిలాగునఁ దలవెంట్రుకలు విరియఁబోసికొన్న యెఱ్ఱబుగ్గల దొరసాని బొమ్మ——

తటాలుమని యతఁడాగెను. బెదరులేడివలె గది నాలుగు మూలలకును జూపులు పరఁగించుచున్న యతని కన్నులు బట్టల దండెముమీఁదఁబడి, యచ్చటి చప్పుడో, కదలికయో, నీడయో, యేదో యతని యనుమానమునకుఁ గారణమైనది కాంబోలు! గడియసేపు నిశ్చలుఁడై నిలువఁబడి, యతఁడు తటాలున దనకోటు జేబువైపునకుఁ జేయిసాఁచెను.

అట్టిదేదో జరుగునని యెఱుఁగును గనుక, శోభనాద్రి పిస్తోలుగుఱి చూపించుచు బయలుపడి, "చేతులు మీఁదకెత్తు; లేనియెడలఁ, బిస్తోలు ప్రేల్చవలసివచ్చును," అనెను.



అయత్నపూర్వకముగా హనుమయ్య చేతులు మీఁదకిలేచినవి; అతఁడు కొయ్యబాఱినిలిచెను. ఆచోట హఠాత్తుగా, శోభనాద్రిగాని మఱియెవ్వరుగాని యట్లు ప్రత్యక్షమగునని యతఁ డనుకొనియుండలేదు. బిగఁబట్టియున్న సుబేదారు మొగము, గుఱిపెట్టియున్న యతని చేతిలోని పిస్తోలు, హనుమయ్యకు నిరాశ కలిగించినవి. మంచమువంకఁ జూచి యతఁడు నిట్టూర్చెను; ముఖమున దైన్యము క్రమ్ముకొన్నది. మనోధైర్యముకొఱకుఁ గొంత సేపు ప్రయత్నించి, యతఁడు బొంగురుపోయిన హీనస్వరముతో, "మీకులోఁబడినాను; మీవెంటవచ్చెదను; పిల్లల నిద్రకు భంగము కలిగింపవలదు" అనెను.

హనుమయ్య జేబులోని పిస్తోలు తీసికొని, శోభనాద్రి మంచమువంక వ్రేలితోఁ జూపుచు, "ముద్దుపెట్టుకొందువా?" అని చూపులు త్రిప్పుకొనెను.

గొంతుకలోనియుండ నేదో మ్రింగినట్లు గ్రుక్క వేసి, "వలదు; వారికి నిద్రాభంగమగును," అని హనుమయ్య గద్గదికతోఁ బలికి, పలికిన వెంటనే బయటికి దారి తీసినాఁడు.

వీథితలుపును చేరులోపల శోభనాద్రి యతని జబ్బమీఁదఁ జేయి వేసి, చెవులయొద్దఁ బెదవులు పెట్టి "బయటికి వెళ్లిన తరువాతఁ, బాఱిపొమ్ము," అనెను.

నమ్మకములేని చూపులతో హనుమయ్య శోభనాద్రి ముఖము చూచినాఁడు. ఆ చూపునందు నిరాశతోఁ గ్రుమ్ములాడుచుఁ గ్రొత్తయాశ యొకటి కనఁబడినది.

"హాస్యముకాదుగదా?" అని యతఁడు జంకుచుఁ బ్రశ్నించెను.

బహువిధభావముల కాటపట్టయిన ముఖముతో శోభనాద్రి కించిత్కంపితస్వరమున, "హాస్యముకాదు; నిశ్చయముగానే చెప్పుచున్నాను. ఈ పనికి మరణదండనమే నాకుదగిన శిక్ష. ఐనను, నేనన్యథా చేయఁజాలను. నీవు పాఱిపొమ్ము. లాభించునని నాకుఁ దోఁచదుగాని, యదియొక్కటియే నీకున్న గతి," అనెను.

తడఁబాటు మాటలతో హనుమయ్య, "మిమ్ము భగవంతుఁడు రక్షించుఁగాక!" అని కాళ్లమీఁదఁ బడఁగా, శోభనాద్రి యతనిని లేవఁదీసి ముందుకుఁ ద్రోచెను.

క్రొత్తసత్తువవచ్చి, హనుమయ్య బిరబిరనడచి వీథితలుపు తీసినాఁడు.

## ౧౨

తీయఁగానే,!!! యెదుట సుబేదారు-మేజరు, గుఱి పెట్టిన పిస్తోలును దానును, ప్రత్యక్షము. కొండెక్కి యాడుచున్న హనుమయ్య యాశలు గుబిల్లుమని కూలఁబడినవి.

ముందున్న హనుమయ్యను, వెనుకనున్న శోభనాద్రిని జూచి, "బాధపెట్టకుండఁ బట్టుపడినాఁడా, సుబేదారూ?" అని వెంకటస్వామి ప్రశ్నించినాఁడు.

"చిత్తము," అని తడుముకొనకుండ శోభనాద్రి పలికి, "పిల్లలు లేవకుండ నిశ్శబ్దముగాఁ దీసికొనివచ్చుచున్నాను," అని పలికెను.

"మంచిది, మఱిరండు," అని వెంకటస్వామి ముందుకు దారి తీసినాఁడు.

బయటికి వెళ్లిన తరువాత వెంకటస్వామి యీల వేయఁగా, సిపాయిలు వచ్చి చుట్టుకొనిరి. అందఱును గలిసి, యచ్చటినుండి యఱమైలుదూరము నడచి పోయినారు. ఆ స్థలమునకుఁ జుట్టుపట్లఁ గొంపగాని గుడిసెగాని లేదు. క్రొవ్వువత్తులు రెండు వెలిగించి, యొండొంటికి నాలుగడుగుల దూరముగా రెండు పొడుగు కఱ్ఱలమీఁద నిలిపి, యా రెండింటికిని నడుమ ఖైదిని మోఁకరింపఁజేసి, కన్నులకు గంతకట్టిరి. అతనికెదురుగాఁ గొన్నిగజముల యెడమున సిపాయిలందఱును బారుతీర్చి, తుపాకులు పట్టుకొని నిలువఁబడినారు.

సుబేదారు-మేజరు వెంకటస్వామి యొక ప్రక్కకు నిలుచుండి, "హనుమయ్యా, ఐదు నిమిషముల వ్యవధి నీకు భగవత్ప్రార్థనమునకై యిచ్చినాను," అని జేబులోని వాచిని తీసిపట్టుకొనెను.

## ౧౩

ఈ చర్య యిచ్చట జరుగుచుండఁగా, అచ్చటఁ దులసమ్మ దుఃఖావేశచిత్తముతో వెఱ్ఱియెత్తినట్లు గుఱ్ఱమును దౌడు పెట్టించుచు ఖైఁ ఖైమని వచ్చుచుండెను. సమయమునకు వెళ్లఁగలుగుదునా, యన్నప్రాణము రక్షించుకొనఁ గలుగుదునా, యన్నది యామె మనస్సునఁ బట్టుకొన్న యాందోళనము. వెళ్లులోపల ఘోరము జరిగిపోవునేమో యన్న పెనుబెంగ పిడుగులాగున గుండెలోఁ బడి పెనఁకుండెను. ఆమె చూపిన కాగితమును జదువఁగానే సేనానాయకుఁడు హనుమయ్య నిర్దోషిత్వము తెలిసికొని, యతని విమోచనమునకై యుత్తరువు కాగితము మీఁద వడివడి గిలికి, "ఇది వెంటనే పోవలయును. సీతాపతి పట్టియిత్తునని చెప్పఁగా, హనుమయ్యను బట్టుకొనుటకుఁ జిన్నదండు మధ్యాహ్నముననే పంపితిని. పట్టుపడఁ

గానే, శిక్షయాములు జరుగును. ఎవఁడురా, అక్కడ?" అని కేకవేసెను. ఎగువ ప్రాణములెగువకే యెగిరి పోయినట్లయి, తులసమ్మ యుత్తరువు కాగితము సేనానాయకుని చేతిలోనుండి తటాలున లాగుకొని, యొకటే యుఱుకు గుఱ్ఱముమీఁదికి! ఆమీఁద, ఒకటే దౌడు! టకటకా, టకటకా, టకటకా,—కటకటా, కటకటా, కటకటా,—టకటకా, టకటకా, టకటకా,—

## ౧౪

ఇచ్చట నిబిడమైననిశ్శబ్దము. ఆనిశ్శబ్దములో సుబేదారు-మేజరు చేతియందలి వాచీటక్కు-టిక్కులు విస్పష్టముగా వినఁబడుచుండెను. క్రొవ్వువత్తి దీపముల వెలుతురిలో నేలను మోఁకరించియున్న హనుమయ్యయుఁ జేతులలోఁ దుపాకులు పట్టుకొని బారు తీర్చియున్న సిపాయిలును, చిత్రప్రతిమలవలె నుండిరి.

ఇంతలో వాచీ టక్కు-టక్కుల నతిక్రమించి దూరమున, మైలుకంటెదూరమున,—గాలి ధ్వనియా యది? గాలివీచుట లేదే?—పిట్టల కలకలమా? పిట్టలు మూఁడు గంటలకే లేవవే? విస్తరిల్లుకొనును హెచ్చి, యాధ్వని స్పష్టపడుచున్నది. టకటకా, టకటకా, టకటకా.—అది వెఱ్ఱి పరుగున వచ్చుచున్న గుఱ్ఱపుదౌడు.

వాచీవంక నిదానముగాఁ జూచుచు సుబేదారు-మేజరు నిట్టూర్చెను. వచ్చుచున్నవారెవరో యతనికి బోధపడినది. "అయ్యో, పాపము! ఈఘోరము చూచుట తటస్థించును గాఁబోలు, ఆబాలికకు! హా! దైవమా, యీ నిమిషములమ్ముల్లు కదలదేమి?" అన్నది యతని నిట్టూర్పునకు భావము.

## ౧౫

టకటకా, టకటకా, టకటకా,—టకటకా, టకటకా, టకటకా,—టకటకా, టకటకా, టకటకా,—

## ౧౬

వెంకటస్వామి యున్నవైపునఁ గాక, రెండవైపున నున్నాఁడు శోభనాద్రి. అందఱితోఁబాటు, అతనికిని వినఁబడిన, గుఱ్ఱపుడెక్కల ధ్వని. టకటకా, టకటకా—టకటకా యన్న చప్పుడు విని, దడదడా-దడదడా యని యతని గుండె కొట్టుకొనసాగినది. ఆకస్మికముగవచ్చి కన్నులారఁ దన యన్న చావును జూచునప్పటి యామెదుఃఖము నూహించుకొని, శోభనాద్రికి శరీరము జలదరించెను. తన ప్రాణము లర్పించియైనను, ఆమెకుఁ గలుగనైయున్న ఘోరాపద తప్పించుట కతఁడు సిద్ధము. కాని, యేమిచేయఁ గలఁడు? చేయఁగలిగినది లేక చేతులు వ్రేలవేసికొని, యూరక చూచుచుండవలసివచ్చినది. బారు తీర్చియున్న సిపాయిలవైపునఁ జూడఁగా, వారును దనవలెనే దుఃఖించుచున్నట్లు కనబడినారు. మనస్సులెట్లున్న నేమి? అధికారి యాజ్ఞ.

"నాలుగు నిమిషములైనవి," అని గొణఁగుకొనుచు, సుబేదారు-మేజరు వాచీని మఱికొంత కంటియొద్దకు లాగుకొని చూడసాగెను.

## ౧౭

టకటకా, టకటకా, టకటకా,— టకటకా, టకటకా, టకటకా,—టకటకా, టకటకా, టకటకా,—.

## ౧౮

శోభనాద్రి త్రుళ్లిపడి, యా చేరువనే యున్న మల్లన్న హవల్దారు వంకకు వంగి, యతని చెవిలో నేదో యూఁదెను. మల్లన్నయుఁ ద్రుళ్లిపడి తన ప్రక్కనున్న సిపాయి వంకకు వంగెను. గాలి వీవఁగాఁ బొలమునందలి వరికంకులకువలె, సిపాయిల బారునందలి శిరసులకు వరుసగా వంగుదల కలిగినది; దుఃఖవాయుప్రసరణమునఁగాఁబోలు! హనుమయ్య కంటికిఁ గట్టియున్న గుడ్డ జరిగినదేమో, శోభనాద్రి దానిని సరచెను.

ఇంతలో వెంకటస్వామి వ్రేలు పైకెత్తఁగా, సిపాయిలందఱును హనుమయ్య వైపున గుఱిగాఁ దుపాకులెత్తిరి.

## ౧౯

టకటకా-టకటకా-టకటకా యని యేఁబది గజముల సమీపములో గుఱ్ఱము మలుపు తిరిగినది.

## ౨౦

సుబేదారు-మేజరు వాచీ జేబులోఁ బెట్టుకొని, "ప్రేల్చుఁడు," అని యాజ్ఞాపించెను.

ఢం ఢం ఢం ఢం ఢం ఢం ఢం ఢమ్మని తుపాకులు ప్రేలినవి. పొగ లేచినది. చేతులును గాళ్లును గిజ

గిజఁ గొట్టుకొనుచు, హనుమయ్య వెనుకకొఱిగి పడి పోయినాఁడు.

ఆ క్షణమందే చెమటలు కార్చుచు, నురుఁగులు గ్రక్కుచు, వచ్చి పడినది గుల్జము ! తెల్లఁబాఱిన మొగముతో, వెఱ్ఱియెత్తిన చూపులతోఁ, జెదరి చీఁదఱమైన తలవెంట్రుకలతోఁ, దులసమ్మ నేలకు గబాలుమని యుఱికి, చేతిలోని కాగితమూడించుచు, "ఇదిగో, మా




యన్న విడుదల యుత్తరువు——" అని తటాలున మాటలుడిగి యాఁగిపోయెను. నేలను నిశ్చలుఁడై పడి యున్న తన యన్ననుజూచి, తాను విన్న ధంధమ్మన్న ధ్వనికిఁ గారణ మిప్పు డామెకు బోధపడినది.

"హా, దైవమా ! చంపివేసినారు ! మాయన్నయ్యను జంపివేసినారు. అతఁడునిర్దోషి. సేనానాయకుఁడు విడుదల యుత్తరువిచ్చినాఁడు," అని పలికి, "అన్నయ్యా, అన్నయ్యా !! అన్నయ్యా!!!" అని పెద్ద కేకవేసి, యాకస్మిక మొదలు నఱికిన చెట్టువలె వెనుకకుఁ గూలఁబడెను.

ఆమెచేతినుండి క్రిందఁబడిన కాగితము తీసి వెంకటస్వామి చదవినాఁడు. చదువఁగానే, యతనికిఁ గలిగిన యాందోళనము విస్పష్టము.

"శోభనాద్రీ, ఘోరము, మహాఘోరము జరిగినది. ఈ చిన్నది చెప్పిన మాటసత్యము : హనుమయ్య నిర్దోషి," అని యతఁడు దుఃఖస్వరముతోఁ బలికెను.

నేలను బడియున్న తులసమ్మనుజూచి, యతనికిఁ గనుకొలఁకులనుండి వేఁడి కన్నీటిబొట్లు దిగజాఱినవి.

ఆమె వైపునఁగాక శోభనాద్రి వైపునఁ జూచిన యెడల, వెంకటస్వామికి వింతయొకటి కనఁబడియుండును. శోభనాద్రి యేదో బాధతోఁ దొక్కులాట పడుచున్నట్లు కనఁబడినాఁడు. అతఁడు మల్లన్న దిక్కునకుఁ జూపు లొకమాఱు త్రిప్పఁగా, ఆముసలి హవల్దారు ముఖము రెండవ ప్రక్కకుఁద్రిప్పుకొని మిన్ను చూడసాగెను.

"లోకములోని నాసర్వస్వము పోయినను, ఈ యన్యాయము జరుగకుండిన యెడల నేను సంతోషించి యుందును. పాపము ! నిరపరాధి యగు నతఁడు నిష్కారణము మరణించినాఁడు. అయినను మనదుఃఖము కేవలమును గొంజలసేతుబంధనము. మరణించినవానిని మరల బ్రదుకించుట మనుష్యశక్తికి మించిన కార్యము," అని సుబేదారు-మేజరు తనవిచారము మరల వెల్లడించెను.

శోభనాద్రి నసుగుచు, గుటకలు మ్రింగుచు, మాటలు తొట్రుపడుచు, "వెంకటస్వామిగారూ, నేను—హనుమయ్య—మరణించినవాఁడు—దోషము—సత్యము—క్షమించి—," అని యొకదానికొకటి పొందని మాటలాడుచుండఁగా, సిపాయిలు కిలకిల నవ్విరి.

శోభనాద్రికి దుఃఖము మూలమున వెఱ్ఱియెత్తినదని యూహించి, యతనివంక సుబేదారు-మేజరు జాలితోఁ జూచెను.

"వెంకటస్వామిగారూ, నాకు వెఱ్ఱికాదు. మఱి, మఱి దాపఱిక మెందుకు ? హనుమయ్య ద్రోహిగాఁడు. హనుమయ్య ఛావలేదు," అని

శోభనాద్రి తెగించి, తనమనస్సులోని రహస్యము వెడలఁ గ్రక్కించినాఁడు.

"ఏమీ !!!!" అని వెంకటస్వామి యాశ్చర్యముతో శోభనాద్రి ముఖమునుండి చూపులుత్రిప్పి సిపాయిల వంకఁజూడఁగా, వారందఱును హసన్ముఖులై యుండిరి.

"సుబేదారు-మేజరుగారూ, క్షమింపుఁడు. నేను— ఇందు దోషమంతయు నాది. ఆపిల్లలనుజూచిన తరువాత,—ఈకన్యకను జూచినతరువాత, మనస్సు జాలికి లోనై, కొంచెముమీఁదికి గురిచూచి తుపాకులు ప్రేల్చవలసినదని నేను మనసిపాయిలకు సూచించినాను. వారును నావలెనే కనికరపడి, గురియించుక తప్పించినారు. చచ్చినట్లు పడియుండుమని హనుమయ్య చెవిలో ముందుగానే యూఁదినాను," అని శోభనాద్రి తన కుట్రయుప్పుకొనెను.

ఇప్పుడు స్పష్టమే, హనుమయ్య జీవించియున్న సంగతి! గుట్టు బట్టబయలైనది గనుక, నటన మాని యతఁడు లేచి, చెల్లెలినిలేవఁదీసి, యామెకు సంగతిసందర్భములు తెలియఁ జెప్పుచున్నాఁడు.

తన తాబేదారులు తన్నుఁ జేసిన మోసమునకుఁ జెప్పరాని యాశ్చర్యమును గోపమును బుట్టి, సుబేదారు-మేజరు కొంతసేపు నోటిమాటరాక నిలువఁబడిపోయెను. మాటలు నోటినివెడలివచ్చినప్పటినుండి, యొకటే ప్రవాహము. అది గ్రామోఫోనులోని కెక్కించినఁ దగ్గది. అతఁడు ప్రయోగించిన శబ్దములును, ఉపయోగించిన భాషయు, గ్రంథస్థము చేయుటకు వ్యావహారికభాషావాదులును సమ్మతింపరు. అతఁడు వాడినముక్క యొక్కొక్కటియు మంచి జిగితమయినదగుట మాత్రము నిశ్చయము. "ఇంత జీవశక్తి యున్నదా, యాంధ్రభాష?" కని విన్నవారెల్ల నోళ్లు వెళ్లఁబెట్టిరి. పెళ్లుపెళ్లుమని పిరంగిగుండ్లు ప్రేలుచున్నట్లు వినఁబడిన యా ప్రచండోపన్యాసమునకు సారాంశమేమనఁగా: గుండువేసి కొట్టి వారినందఱను జంపినను పాపము లేదనియు, సేనానాయకునితోఁ జెప్పి యట్లు తప్పక చేయించెద ననియు, సిపాయిలుగా నుండుటకు వారు కేవలమును దగని వారనియు, వారు తనపటాలపు సిపాయిలని చెప్పుకొనుట తనకు సిగ్గులచేటనియుఁ, ఛీఛీయనియు, ఛూఛూ యనియు, అతఁడు వారిని దలలోని పేలు మాడునట్లు గిట్టిగాఁ దిట్టెను.

ఇంతతిట్టి,—వింత యేమనఁగా,—అతఁడు శోభనాద్రి చేయిపట్టుకొని యూఁపి, మల్లన్న వీఁపుతట్టి, సిపాయిల మొగములుచూచి చిఱునవ్వు నవ్వినాఁడు. ఆజ్ఞోల్లంఘనము క్షమింపరాని యపరాధమే కాని, యన్యాయకార్యమొకటి యందు మూలమునఁ దప్పె, విషాదాంతముగాఁ బరిణమింపవలసిన కథ ప్రమోదాంతముగాఁ దేలినందు కతఁడు తన మహాసంతోషమును వెడలఁ గ్రక్కుట మానలేకుండెను.

ఈచిత్రనాటకమునకు సూత్రధారుఁడైన యతని చెంతకు హనుమయ్యవెళ్లి, "శోభనాద్రిగారూ, మీరు నాపాలిటి భగవంతులై ప్రాణరక్షణము చేసినారు. సుబేదారు-మేజరుగారి వాగ్ధోరణి నాకున్న యెడల, నాకృతజ్ఞత యంతయుఁ దెలుపుటకుఁ బ్రయత్నించి యుందును. ఇదిగో, కృతజ్ఞతాపూర్వకవందనములుమాత్రము చేయుచున్నాను. ప్రత్యుపకారమునకు వీలు నాకుఁ గలిగింపవలసినదని భగవంతుని సదా ప్రార్థించెదను. నేను మీ కాజన్మ దాసుఁడను," అని చేతులుజోడించెను.

"నేనును మీకాజన్మదాసురాలను," అని ముకుళితకరపల్లవయై ముందుకు వచ్చిన తులసమ్మ, తన మీఁద శోభనాద్రి సానురాగదృష్టులు చిత్తజల్లుగా ముసరుకొనుచుండుట కాంచి, లజ్జావనతవదనయై నిలువఁబడిపోయినది.

శోభనాద్రియు సిగ్గుపడుచు, "నేను జేసిన దేమున్నది? ఈమల్లన్న హవల్దారు, ఈసిపాయిలు, మీ ప్రశంసకుఁ బాత్రులు. ఆమీఁద, సుబేదారు-మేజరుగారు మనల నందఱను రక్షించినారు," అనెను.

"వారందఱకు నాయనేకవందనములు," అని హనుమయ్య మోడ్పుచేతులతో, "సుబేదారు-మేజరుగారూ,

దయయుంచుడు. శోభనాద్రిగారూ, పోయివత్తునా?" అని సెలవు వేడెను.

"ఉగాదిపండుగ నీకు, నీచెల్లెలికి, నీపిల్లలకు సుఖకరమగునుగాక!" అని పెద్దవాఁడు వెంకటస్వామి దీవించినాఁడు.

"తథాస్తు! తథాస్తు! తథాస్తు!" అని ముప్పన్న తోఁగలిసి సిపాయిలందఱు నైకకంఠ్యముగా ననిరి.

"ఉదయమే మీపిల్లలను జూడవచ్చెదను," అన్నాఁడు శోభనాద్రి.

౨౧

చెల్లెలితో హనుమయ్య యిల్లు చేరుకొనునప్పటికి బిల్లుమని తెల్లవాఱె, యుగాది ప్రారంభమైనది. చిఱుగుఱ్ఱులు తీయుచున్న పిల్లలగదిలోనికిఁ దండ్రి మెల్లగా వెళ్ళి మిగిలిన యుగాదికానుకలు బల్లమీఁదఁ బెట్టుచున్నప్పుడు,—కిలకిల నవ్వులుగ, పడపడ చప్పట్లు, 'ఉగాది దేవతా,' యను కేకలు బయలుదేఱె, పిల్లలుమంచము మీఁదినుండి దుమికివచ్చి, యతనిమెడ రెండువైపులను బట్టుకొని వ్రేలాడసాగిరి.



"గుఱుకతీయుచు దొంగనిద్రలో నుంటిమి. దొంగ యుగాదిదేవతా, దొరకిపోయినావు," అని వారు తండ్రి చుట్టు తెయ్యిమని యాడినారు.

అతఁడు వారిని ముద్దులతో నలిపివేసెను.

౨౨

ఉగాదికానుకలు కొన్ని, యుదయమునఁ గాఫీ పుచ్చుకొన్నప్పుడు పనికివచ్చినవి. డబ్బాలలోని బిస్కతులు, తీయని ఫలరసములు, నిగనిగలాడుచున్న సీమరేఁగుపండ్లు, ముద్ద ఖర్జూరము, ద్రాక్షఫలములు, కిసిమిసు పండ్లు,—,—;—,పిల్లలు కడుపారఁదినుచు, మిగిలిన యుగాదికానుకలు తులసమ్మకుఁ జూపుచుండిరి.

ఆసమయమున వచ్చినారు, శోభనాద్రి, యతని చెల్లెలు రుక్మిణమ్మ. సిగ్గుపడుచు లేచి తులసమ్మ, తన యీడువైన రుక్మిణమ్మయొద్దకు వెళ్ళి, యాదరపూర్వకముగాఁ జేతులు పట్టుకొన్నది. హనుమయ్యకు, శోభనాద్రికి, వందన ప్రతివందనములు జరిగినవి.

అందఱును గూరుచున్నపిమ్మట, శోభనాద్రి పిల్లల చేతులందలి యుగాదికానుకలు చూచి, "హనుమయ్యగారూ, ఉగాది కానుకలన్నియు మీలో మీకే? నాకొక్కటియు లేదా?" అనెను.

"బొమ్మల యీడుదాఁటినవారు కాఁబోలు!" అని హనుమయ్య మందహాసము చేసెను.

"ఈడుమించినవానిఁ జేయకుఁడు నన్ను; మీ పుణ్యముండును! నేనును మీవలెనే యిరువది యైదేండ్లవాఁడను. బొమ్మల యీడుమించిన వాఁడనని తప్పించుకొనకుఁడు. ఉగాదికానుకగా మీవల్ల బంగారుబొమ్మను గ్రహించుటకు వచ్చినాను. ఏమే రుక్మిణీ, ఊరకున్నావు? పెండ్లికొడుకు పిల్లనడుగుట యాచారము కాదని కదా నిన్నుఁ దెచ్చితిని?" అని శోభనాద్రి తనచెల్లెలిని హెచ్చరించెను.

ఆమె తులసమ్మవంకకుఁ దిరిగి, "వదినా, మా యన్నయ్యకు భార్యవుకమ్ము," అని ముసిముసి నవ్వులు నవ్వినది.

"వహవ్వా, భేషుగానే యడిగినావు! వదిన యన్నకు భార్యకాక మఱేమగును? అదియుఁగాక, చుట్టరికమునకు వచ్చిన వారు పెండ్లికూఁతునే యడుగుదురా? ఇట్లే, నిన్నడుగ వచ్చువారును జరిగింపవలయునని నీకోరిక కాఁబోలు! అమీఁద, మీవదిన నడుగుట యనవసరము; ఆజన్మదాసురాలుగా నాకుండుటకుఁ దానింతకుముందే యొప్పుదలపడినది. ఆమె యన్నగారి యంగీకారమే కోరవలసియున్నది," అని శోభనాద్రి యనెను.

సిగ్గుతో మొగమెత్తి రుక్మిణమ్మ తన వంకఁజూడఁగా, ఆమె ముఖమునకే పెండ్లికళ వచ్చినట్లు హనుమయ్యకుఁ దోఁచి, క్రొత్తయాశ యొకటి యతనికిఁ దటాలునఁ బుట్టినది....అయినను సుబేదారు చెల్లెలు, తాను హవల్దారే! తన చెల్లెలిని శోభనాద్రి కోరుటయే తమకు మహా గౌరవము.

"ఏమే రుక్మిణీ, నీవే పెండ్లికొమార్తవైనట్లు తల వంచుకొన్నావు? నేనే యడుగవలయును గాఁబోలు, దొరలపద్ధతిని! కానిమ్ము. హనుమయ్యగారూ, మీ చెల్లెలిని నాకిప్పింపరా?" అని శోభనాద్రి యడిగెను.

హను: "ప్రాణదానము చేసిన యుపకారికి—"

"ప్రత్యుపకారము కాదు; నేను గోరుచున్నది. యుగాది కానుక."

హనుమయ్య జవాబు పలుకులోపల సిపాయి యొకఁడువచ్చి, యతనికిని సుబేదారుకును సలాముపెట్టి, హనుమయ్యచేతికిఁ గాగిత మొకటి యిచ్చి, పోయినాఁడు;

అది చదువుకొని, యానందముద్రితమైన ముఖముతో హనుమయ్య దానిని శోభనాద్రికిచ్చెను. శోభనాద్రి చదువుకొని, "హనుమయ్య సుబేదారుగారూ, బహు సంతోషము. రుక్మిణీ, మీవదినను వినుమనవే యీ యానందవార్త. సేనానాయకుఁడు పంపిన పత్రిక యిది. ఇందిట్లున్నది; 'అన్యాయము జరిగినదని యెఱిఁగి, దొరతనమువారు హవల్దారు హనుమయ్యకు నేఁటినుండి సుబేదారు పదవి దయచేసినారు. నేఁడు తెలుఁగుల యుగాది పండుగ గనుక, ఉగాదికానుకగా దీనిని నేఁడే పంపుటయైనది,'" అన్నయర్థము గల యింగ్లీషు వాక్యములు చదివెను.

తులసమ్మ ముఖముతో రుక్మిణమ్మ ముఖమును వికసించినది.

"హనుమయ్యగారూ, యీ యానందసమయమున నా యుగాదికానుక మాట?" అని శోభనాద్రి.

"తులసీ, రావే," అని సిగ్గుపడుచున్న చెల్లెలి చేతిని మెల్లగాలాగి శోభనాద్రి చేతిలోఁబెట్టి," ఈమె నాబహిః ప్రాణము; ఉగాదికానుకగా మీకు సమర్పించుచున్నాను ఈమెను మీకిచ్చుటచేత నేను జెల్లెలు చింత లేనివాఁడనగుటయేకాక, నాపిల్లలు మరలఁ దల్లిలేని వారగుదురు. బావగారూ, వారికి మాతృభిక్షపెట్టరా?" అని హనుమయ్య ప్రార్థనాపూర్వకముగాఁ బ్రశ్నించెను.

"మాతృభిక్షయా?"

"అవును; ఉగాదికానుకకు మాఱుగా, ఉగాది కానుక నేనును మీవలనఁ గోరుచున్నాను. మీరు కోరినది బంగారుబొమ్మ; నేను గోరుచున్నదియు బంగారు బొమ్మ. తులసీ, రావే; నాయిల్లు నిలుపవలసినదని బావ



గారిని గోరుము," అని హనుమయ్య తన చెల్లెలిని హెచ్చరించెను.

ఆమె రుక్మిణమ్మ వంకకుఁదిరిగి, "వదినా, మా యన్నయ్యకు భార్యవుకమ్ము," అని ముసిముసినవ్వులు నవ్వినది.

"వహవ్వా! పాఠ మొప్పగించుచున్నావా? నవ్వులాటలుమాని, బావగారి నడుగుదువా, నన్నను దొరల పద్ధతికే దిగుమందువా?" అని హనుమయ్య నవ్వెను.

సిగ్గుపడుచుఁ జిఱునవ్వుతోఁ దులసమ్మ శోభనాద్రి వంకఁజూచినది. శోభనాద్రి రుక్మిణమ్మ వంకఁజూచినాఁడు. రుక్మిణమ్మ యెటువంకనుజూడక, మొగము దించుకొన్నది. అది యనభిమతసూచకముకాదని మాత్రము స్పష్టము.

"రుక్మిణీ, రావే," అని సిగ్గుపడుచున్న చెల్లెలిచేతిని మెల్లగాలాగి, హనుమయ్య చేతిలోఁబెట్టి, "ఈమె నా బహిఃప్రాణము. ఉగాదికానుకగా మీకు సమర్పించుచున్నాను; బావగారూ, పరిగ్రహింపుఁడు," అని శోభనాద్రి తంతు నడిపెను.

"ఇఁక నీపిల్లలను నీవప్పగించుకొనవమ్మా, వదినా," అని తులసమ్మ యన్నపూర్ణారంగశాయిలను చెఱియొక చేతితోఁ దీసికొనివచ్చి, రుక్మిణమ్మ చేతులకీయఁగా, రుక్మిణమ్మ వారిని ముద్దులాడినది.

వివాహప్రశంస నడిచినప్పుడు, తనకుఁ దెలిసిన తెలుఁగు వైదికబ్రాహ్మణులు కొందఱు వచ్చియున్నారనియు, ఆయుగాదినాఁడే శుభకార్యములు రెండును జరిపింతమనియు, హనుమయ్య యనెను; శోభనాద్రి సమ్మతించెను.

ఇట్లందఱకుఁ బరమానందమయినది; ఉగాదికానుకలందఱకు లభించినవి.

చదువరులారా, మీరు కోరుకొన్న యుగాది కానుకలు మీకును లభించును గాక!

తే. గీ. క్రొత్త సంవత్సరంబు మీకు, భవదాప్త
జనులకు, సుఖప్రదంబుగ జరుగుఁగాక!
ఇట్టి సంవత్సరంబు లనేకము లిటు
మీఁద మీకుఁ గల్గుతఁ బరమేశు కృపను!

---

అజంతాచిత్రము



# నిరంజనశాస్త్రి

రాయసం వెంకటశివుఁడుగారు

౧

వంశపారంపర్యముగ వచ్చిన మడిమాన్యము లనుభవించి, సాగి లేటి నిర్మలోదకములు ద్రావుచు, పరంధామశాస్త్రి ఋజువర్తనమునఁ గాలము గడపుచుండెను. దైవ మొసఁగిన దానితోఁ దనివిచెంది దినములు వెడలబుచ్చుట ఆయన ముఖ్యాశయము. అంతని ప్రమాని కల్లలు నొమ్ముట కాయనకుఁ గిట్టదు. పరునెత్తి పాలు ద్రావుటకంటె, నిలుచుని నీరు ద్రాగుటయే మేలనుకొనువాఁడు. పరోపకారకార్యము లైనను నాసించిన సరిసమప్తి. ఇతరులకు మేలుచేయుట శ్లాఘనీయమే యైనను, ఈకలికాలమున, పుణ్యమునకుఁ బోయిన పాప మెదురగును. కావున, మనశ్శాంతియే పరమావధిగ నెంచువారు ఆకుచాటు పిందె వలెఁ బ్రదిమి నీ మహాస్వప్నమ్ములను బుచ్చుట యుక్తము. సత్కార్యాచరణముల నొకవిధముగ నచ్చినచో, సముద్రోదకములఁ బడవలసి వచ్చును. కాఁబట్టి నలుగురినోళ్ళలోఁ బడక దినములు గడుపుచు, తాను వచ్చినయాత్రకాల మాసన్నమగునపుడు, సడీ చప్పుడు లేక, ప్రపంచరంగమునుండి నిష్క్రమించుటే, సాధుసజ్జనమార్గమని యాతని నిశ్చితాభిప్రాయము.

పుత్రుఁడగు నిరంజనశాస్త్రి యట్టి మతికాఁడు. తన నెంతో గారాబముతోఁ బెంచి, విద్యాబుద్ధులు గరపి, పట్టపరీక్షలో విజయమందఁజేసి, తన శ్రేయోభివృద్ధి కెన్నిసాధనసదుపాయములో సమకూర్చిన పితరునియం దమితప్రేమానురాగము లుండియును, జనకుని దృక్పథము సరియైనది కాదనియు, ఆయనభావములు సంకుచితములు, విపరీతములు ననియు, నిరంజనుఁడు తలంచుచుండెను. లోకమార్గము, ఒక్కొకచోట కంటకమయమైనను, చాలవఱకు ఫలపుష్పయుతమై పరివృతమగునదిగాన, అట సంసారయాత్ర సలుపుటకు మనము సందియపడఁగూడదు. ఒకవేళ, ప్రపంచమున సౌఖ్యమునకంటె కష్టమె యెక్కువగ నుండినను, ధర్మనిర్వహణమున నె కనులుంచుకొనువారు, క్షణికములగు క్షుద్రసంతోషములకుఁ బోనొల్లరు. సంసారమండలి బాధలకు బాధ్యతలకును భీతిల్లి మూలమూలల దాఁగువారు, శాంతిమాట యటుండఁ దుదకు సౌఖ్యమైనఁ జవిగొనఁజాలరు. కావున, ధీరులమై మనము ధర్మరంగమున నిలుచునపుడే, అధర్మశత్రువులు పలాయనమై కష్టములు తొలఁగిపోవును. శాంతిసౌఖ్యధర్మములు, ఏకకాలమున, ఏకకృషి ఫలితముగ, సముపార్జితములగును.

తండ్రికిఁ గొమరునకును బ్రబలమగు నిట్టి యభిప్రాయభేదము లున్నను, అవి వారల యన్యోన్య సౌహార్ద మించుకయైన నరికట్టలేదు. జనకునికిఁ దనయేకైక పుత్రునియం దపారప్రేమవాత్సల్యతలును, సుతునికిఁ బితరునం దధిక భక్త్యనురాగములును కుదిరియుండెను. ఇరువురి దృక్పథములు, వేర్వేరుస్థానములం దున్నట్టు తోఁచినను, నిజమునకు న్యాయధర్మముల నెరిఁగి తిరిగి, ఏకపక్షమె యాలక్షించుచుండెను. కావున వైరులు లేరుగాక, పరొకరి మేలొకరు కోరుచుండిరి. తనయుఁడు విద్యాపరిపూర్తియైనను, ఉద్యోగమునఁ జేరికాని, స్వగృహమున నయుండికాని, వంశపుమరియాదలు జరుపుకొనుచు, నలుగురిచేతను సజ్జనుఁడని పించుకొనుచు, ఇలువేల్పుల దీవన లందవలయునని జనకుఁ డువ్విళులూరుచుండెను. సాధుపురుషుఁడగు జనకుండు, మానవసమాజ, నూతనోద్యమములం దభిరుచిగలిగి, లోకోపకారి యను కీర్తి నెపుడు గడింపునా యని తనయుఁడు తలపడుచుండెను. ఏకత్వమున ననేకత్వము, అనేకత్వమున నేకత్వమును, ఎట్లు లోకమునఁ గానఁగొని, ప్రపంచనాటకము యొక్క శోభకును, కథాపరిస్ఫూర్తికిని సహాయకారులగుచున్నవి!

౨

విద్యాపరిపూర్తియైనతోడనే తండ్రిప్రోత్సాహము ననుసరించి నిరంజనుఁడు దొరతనమువారి కొలువున నుద్యోగమునకై ప్రయత్నము చేసెను. కాని, ప్రస్తుతదేశకాలపరిస్థితులు పరిశీలించిన కొలఁదిని, ఆత్మగౌరవ మపేక్షించుతా నట్టియుద్యోగము స్వీకరింపక, దేశస్వాతంత్ర్యము నొడఁగూర్చు కృషియందె జీవితము గడపవలయునని యతఁడు దృఢనిశ్చయుఁ డయ్యెను. కావున తన కుద్యోగమయినయనువార్త దెలిసిన నాఁడే, అదత్యజించి, నిరంజనశాస్త్రి, సహాయనిరాకరణోద్యమమునఁ బ్రవేశించెను. ఆనాఁడు వారిగృహము ప్రబలసంక్షోభమున కాటపట్టయ్యెను. పెంచి ప్రయోజకునిఁ జేసిన తండ్రి కోరికను జెల్లించి, ఉద్యోగస్వీకారముచేయుట పుత్రునిధర్మమని పితరుని వాదము. ప్రస్తుతదేశకాల వైపరీత్యములను బట్టి, తలిదండ్రుల మాట వినుటయేకాక, దేశమాతఋణము తీర్చుటయు, పుత్రునికిఁ గర్తవ్యమని సుతుని ప్రతివాదము. తామునమ్మిన ధర్మవిధులకు ప్రతికక్షు లిరువురును సమానముగఁ గట్టుబడువారగుటచేత, ఇందు ధర్మనిర్ణయము చేయుట మఱెవరికిని సాధ్యము గాకుండెను. వెలుపలకు వ్యాపింపలేని యగ్ని లోలోనన రగులుచుండునట్లు, పితాసుతుల కలఁతలు మేర మీఱుటకు వీలుపడక, అంతరంగముననే కుములుచుండెను. తండ్రికొమరులొకయింటనే యుండినను, నాఁటినుండియు నొకరితో నొకరు మాటాడ మానుకొనిరి. ఒకరిలోటుపాటు లొకరు దిద్దఁగలిగియు నుపేక్షించిరి. ఆర్థిక రాజకీయార్థముల కన్నిటికో దేశము

లోనగువవుడు, వీనికన్నిటికిఁ గుంకటివేరగు విదేశప్రభుత్వమునకు దాస్యము సల్పుటవలన నాత్మగౌరవము పోవునని యోజింపఁగని జనకునిఁజూచి తనయుఁడు వగరుచుండెను. జలబుద్బుదములవంటి పృథివీ సంపదలకు, నస్థిరములగు కోరికలకు, సుతుడు చిత్తశాంతిని వీడి, స్థిరసౌఖ్యము గోల్పోవుటకు తండ్రి చింతిల్లెను. కావున నాతండ్రి కొమరులు, లోకులకు మంచి యాలోచనలు చెప్పఁగలవారలైనను, తమసునిశితబుద్ధివలని లాభము తామె పొందఁజాలక, ప్రవాహవేగమునఁ గొట్టుకొనిపోవు కట్టెయలవలె నెవరిదారిని వారు ప్రవర్తించుచుండిరి!

## 3

కాలచక్రము దిర్దిగఁ దిరుగుచుండును. నిన్నటిసంగతులు నేఁడు ప్రాతిపురాణములు! రేపటివి విశ్వసింపరాని వింతకథలు! ఈహాస్యపరిహాసములకుఁ దావలమగు ప్రాతక్రొత్తల మధ్యనే మన జీవితములు కడతేఱుచున్నవి. బుద్ధిమంతుఁడని పొగడ్తలకెక్కిన నిరంజనశాస్త్రిమీఁద జనక్షోభకారకుఁడని యభియోగము వచ్చినపుడు, ప్రభుత్వమువారు పసిబాలుని యురుసుఁబోసికొనుచున్నారని ప్రజలు మొఱపెట్టిరి. కాఁపరిలేని గొఱ్ఱియలగు హైందవులకు ఆంగ్లేయులు రక్షకులైరని వెనుక విద్యార్థిదశయందు వ్యాసరచన మొనర్చి, తత్ప్రభుభక్తికై గురువుల మన్ననలందిన నిరంజనుఁడు, ఆంగ్లేయపరిపాలనాప్రభావమున భారతీయులు కాఁపరిలేని గొఱ్ఱియలుగఁ బరిణమించిరని యుపన్యాసము లిచ్చెనని సాక్షులు ఋజువు పఱచఁగా, సింహలస్వభావులగు యువకులు చెరసాలచూడవచ్చిన నేమి సార్థకమని ప్రజ లాశ్చర్యపడిరి. సమర్థుఁడగు న్యాయవాదిని నియమించి, పుత్రుని నిర్దోషిత్వము స్థాపింప జనకుఁ డెంతప్రయత్నించినను, కుమారుఁడందుకు సమ్మతింపక, తనకు విధించిన యపరాధమును తండ్రిని జెల్లింపనీయక, సంతోషమునఁ జెరసాలలోని కష్టమనుభవింపఁబోయెను! సుకుమారుఁ డితరుల దుస్సహవాసముల మంత్రణములకుఁ జెవియొగ్గి, చిక్కులు తెచ్చుకొనుచుండెనని వ్యసనపడుచుండెడి పరంధామశాస్త్రి, కొమరుఁడు కారాగృహమున కేగుటవలన దుఃఖపరవశుఁడయ్యెను. కొంతకాలమునుండి మాటలు లేకపోయినను, ఇరువురు నొకచోటనే యుండుటవలన వారు ధైర్యము వహించి యుండిరి. ఇపుడు వేర్వేరు ప్రదేశములందుండి, వారొకరి సేమమును గుఱించి యొకరు పరితపించిరి. జనకుఁడు కోటవంటి గృహమున భద్రముగనుండినను, రాజసైన్యములన్నియును ఆయనమీఁద కత్తిపెట్టినట్టుగ కుమారుఁడు భ్రమించి పలవించుచుండెను! సుకుమారముగఁ బెరిగిన సుతునికిఁ గారాగృహవాస మెంతకఠినముగ నున్నదోయని పితరుఁడు వెతనందెను. భిన్నాభిప్రాయులై సంతమాత్రమున నొకరితో నొకనిటీవల మాటలు లేక, ఆజన్మవిరోధులవలె మెలఁగుట వారు తలపోసిన కొలఁదిని, వారికి వ్యసనమధికమయ్యెను. వార్ధకమున జనకుని కష్టముల పాలుచేసితినని తనయుఁడును, అర్భకు నాగర్భశత్రువునివలె కారాగృహము చొచ్చునంత నూరక చూచుచుండవలసి వచ్చెనని తండ్రియును, దుఃఖాగ్నిఁజెంది, ముందు తమలో భిన్నభావముల నెంచి మాయకుండుమని ముమ్మాటికిని వారు నిశ్చయించుకొనిరి.

## ౪

నిరంజనశాస్త్రి చెరసాలకుఁబోయిన యాఱునెలలకుఁ దండ్రి యాతనిఁజూచుటకచటికేగెను. ఈయాఱునెలలు నాలుగుయుగములవలె పరంధామశాస్త్రికిఁదోఁచెను. ఆయన, అహోరాత్రములు, కారాగృహమున గాసిచెందెడి కొమరుని కోమలాకారము మనోదృష్టిని వీక్షించుచు, వాని నెపుడు ప్రత్యక్షముగఁ గనులఁ గాంచఁగలనా యని తహతహపడుచుండెను. అధికారులసమ్మతి వడసి, పరంధామశాస్త్రి, ఒకనాఁడు చెరసాలయందలి కొమరునిఁ జూడఁబోయెను. కారాగృహమందలి కఠిన నియమములకుఁ గలంగుచు, అచ్చటఁ బెట్టెడి మోటుగంజికూడు కడుపునిండక, సుకుమార శరీరుఁడగు కుమారుఁడు తనమొగము కరయేకగఁ గనఁబడుచుండునని గుబిల్లు తండ్రిపాదములముందు, గళ్ళకట్టులచేఁ గొనిరాఁబడిన నిరంజనుఁడు సాగిలపడినపుడు, అతనికన్నులు విభ్రాంతినొందెను. కన్నీటి జడులనఁ గలిగిన దృష్టిమాంద్యము వదలిన తోడనే, తండ్రి కొమరులు కుశలప్రశ్నములడిగిరి. జనకుని యాగ్రహమునకుఁ బాల్పడిన తాను గారాగృహవాస నెపమున తిరిగి యాయన యనుగ్రహము వడసితినిగదా యని నిరంజనుఁడు మోదమున మిన్నందెను. ఇంక తండ్రి నిరంజనునిఁ జూచినపుడు జనించిన యానందమును, అతని ముఖమునఁ గలిగిన మార్పులు పరికించినపుడు గలిగిన యాశ్చర్యమును, మేర మీఱియుండెను. ఇరువదియైదేండ్లు దాటియు దాటని నిరంజనుని మోమునం దీయాఱునెలలలోను, అరువది వత్సరములైనఁ గొనిరాఁజాలని జ్ఞానవైరాగ్యముల జాడలు గానఁబడెను. దీప్తిమంతమగు ముఖపంకజముతో నొప్పెడి యాయువకుఁడు, కారాగృహాశ్రమమునఁ దపస్సు నెరపుచుండెడి మునిపుత్రకునివలె నుండెను. అతని మోమునగల వయసునకు మించిన వింతలగు శాంతి గాంభీర్యములు శోభఁగొనుచుండెను. తండ్రి తన క్షేమసమాచారములు వినుపింపుమని కోరినపుడు, తనయుఁడు తన బాధలు కష్టములు బయటపెట్టుటకు మాఱుగ, అందలి నియమిత జీవితమునఁ దనకు లభించిన యమూల్యలాభములు, క్రూరాత్ములనఁబడెడి యందలి యధికారుల సౌజన్యము, దురాత్ములని పేరుపడిన యపరాధుల మనముల మెల్లగఁ గలిగెడి మార్పులు, ఇవియె వర్ణించెను. ఇట్టి శ్రేయోదాయకమగు స్థితి తనకును లభించిన మేలుగదాయని తండ్రి యనుకొనుచుండఁగనే, కాలాతీతమగుటచేత, నిరంజనుఁడు లోనికిఁ గొనిపోఁబడెను. చెఱసాలకవాటము మూసివేయఁబడెను.

చెరసాల వాకిట బాల్యస్నేహితుఁడగు నందలి యుద్యోగి నొకనిని పరంధామశాస్త్రి కలసికొని, కారాగృహవాసమును గుఱించి తనకుఁ గొంతచెప్పుమనఁగా నతఁడిట్లు ప్రసంగించెను.—

"మిత్రమా! ఏమని చెప్ప నచ్చును? కారాగృహ వాసుల యిక్కట్టులు తొలగింప నొరశనము వారెన్ని సదుపాయములు చేయుచున్నను, చెరసాల చెరసాలయే! ఇందు కానికు నప్పటి నుండియు, సజ్జనులైనను స్వార్థపరులయ్యెదరు! ఇవటి మొరకు పూడు కుడిచిపడిచి నాలుక బరడుగట్టిన సుకుమారులు పాలు పెఱుగుల కొఱకు పెంగపెట్టు కొనుచుందురు. ఆరోగ్యము చెడుచున్న తమకు నేయి మజ్జిగలు, ఫలాహారములు నివ్వందగుడని వైద్యుని వేడుచుందురు. చిన్న పిల్లలవలె జిహ్వాచాపల్యమునం జెలుదండికై చిందులు త్రొక్కుదురు. రాజకీయ కల్లోలములలోం బాల్గొని ఖైదీలైన విద్యార్థికు లిట్టివల ప్రవేశించి నప్పటినుండియు కారాగృహమున మంచి మార్పు గలుగుచున్నది. అన్ని విషయముల విద్యార్థికు లధికులె. వారి నడత, వారి మాటలు, వారి వైఖరి, కడను యుపరాధుల కాపిర్య ప్రాయముగ నుండు ననుటకు సందియము లేదు. ఐనను, కొన్ని సమయము లందు, విద్యార్థికు లనంగినే భటుల, భాగముధిక మగుచున్నది. 'తాం చెడినకోంతి వనమెల్ల చెఱచును' యన్నట్టుండి, సామాన్యఖైదీలకును, భటులకును, నొసితనము వారి నెదరింపుడని విద్యార్థికులు బోధింప కుండునట్లు, ఉద్యోగులు పరికించుచుండ వలయును. ఈయనుమానములకు నిదర్శనముగ నొకప్పుడు విద్యార్థికులు సర్కారు పద్ధతుల నుల్లంఘించుచున్నారు. సామాన్య ఖైదీలను తమతో బాటు సమ్మెలలోం గంప యత్నించుచున్నారు. ప్రభుత్వ పద్ధతులను బయట ప్రతిఘటించు మహాత్ములు, చెరసాలలో వానిని శిరసావహింతురా? కావున విద్యార్థికుడగు ఖైదీయనంగనే, అమ్మమ్మో! కుంపటికదా యని కారాగృహాధికారులు భయమందుచున్నారు.

మీపుత్రుడగు నిరంజనశాస్త్రి మాత్రము యోగ్యుడు. ఖైదీలతోంగాని, భటులతోంగాని, తగవులకుంబోక, చుట్టుపట్టుల కల్లోలములు జరుగకుండం గనిపెట్టుచుండును. తనసాధు వర్తనముచే సంసత్తికి నిష్ఠుడై, అందరిచేతను ఋషికుమారుడని గౌరవింపం బడుచున్నాడు!"

కుమారుని వృత్తాంతము విని ముదమంది, ఇట్టివాడు ప్రవేశించిన ప్రదేశము పవిత్రముకాగలదని నమ్మి, పరంధామశాస్త్రి స్వగృహము బ్రవేశించెను.

౨

పాఠశాలలో నిరంజనశాస్త్రి, గోవిందశర్మయును సహాధ్యాయులు. జ్ఞానవయోరూపములందు సమానులుగనుండి, తక్కిన విద్యార్థులకన్న మిన్నలై, వీరు గురువులచే "జయ విజయులను" బిరుదు నందిరి. ఐన నిరువురిలోను తారతమ్యము లేకపోలేదు. అంతరాత్మ ప్రబోధనల ననుసరించి నిరంజనుడు పనులు నెరవేర్చుకొనుచుండువాడు. గోవిందుడన్ననో, సహపాఠిని మించవలెననియును, ఆతని దెసకుం బోవుకీర్తి వానిని కడ్డుగట్టవెట్టి, దానిని తనవైపునకు మరలించు కొనవలెననియును, పరిశ్రమచేయువాడు. 'పూవుపుట్టంగనే పరిమళించును.' చిన్ననాడే వీరిద్దఱి గుణములను గ్రహించిన ప్రధానోపాధ్యాయుడు, ఒకటి రెండుమారులు గోవిందునుద్దేశించి, "ఓరీ! తలక్రిందైనను, గుణసంపత్తిగల నిరంజనుని నీవు మించనేరవు సుమీ!" యని చెప్పెను. దీనియర్థమును సరిగా గ్రహించి కర్తవ్యమును గమనించుటకు మాఱుగ, గోవిందుం డెంతసేపును, సహాధ్యాయుని చదువున మించునుపాయమె యూహయుచుండెను. తుదకు పట్టపరీక్షలో నిద్దఱును కృతార్థతనొందిరి, కాని, నిరంజనుడు ప్రథముడుగను తాను ద్వితీయుడుగను జయమందుటకు గోవిందుడు సహింపక, తమ కిద్దఱికి నీవ్యత్యాసమును గల్పించినందుకై పరీక్షకుడు మొదలు బ్రహ్మవరకు నందఱిని శపియించెను! సహాధ్యాయుని మించని తనవిజయము కేవల పరాజయమునియే తలపనుంచెను!

విద్యార్థి దశవీడినను, చిన్ననాటి గోరికలు గోవిందుని వీడవయ్యెను! పాఠశాల వదలిపోయినను గూడ గోవిందుడు తనపూర్వ సహపాఠి యడుగులజాడ గనిపెట్టుచునే యుండెను. నిరంజనుని యుద్యోగప్రాప్తి వానికిం గొంత మనస్తాపము గలిగించెను. సహాధ్యాయుడు సహాయ నిరాకరణోద్యమమునం జేరెనని విని, గోవిందుడు కొంత సేదదేఱినను, సంపూర్ణముగ తృప్తి నొందడయ్యెను, అంత, గోవిందుడును నిరాకరణోద్యమమునం బ్రవేశించెనువార్త వినిన స్నేహబృందము, వాడు రాజకీయ రంగమును ధర్మ నిర్వహణమునకై వచ్చెనని నమ్మక, ప్రాంతమిత్రుని మడమలు త్రొక్కుపని పూనెననియే తలంచిరి! ఈర్ష్యామత్సరములతో నిట్లు గోవిందుడు పరోపకారకార్యములకు దిగి లోకుల నాశ్చర్యమున ముంచివైచెను. ఎట్టి విచిత్ర వికారపు నాటకముల కీ భూలోకము రంగస్థలమగుచుండును! ఒక ముహూర్తమునవె గోవింద నిరంజనులు జనుల కరతాళ ధ్వనులతో కారాగృహము ప్రవేశించిరి. ఒక ముహూర్తమునందే గూడ లూరు చెరసాల నుండి వెడలి, మెడలోని పూలదండలతో స్వగ్రామము ప్రవేశించిరి. శ్రీకృష్ణజన్మస్థాన నివాసమున స్వార్థత్యాగ ప్రదర్శన మొనరించిన వీరులలో నొకని నెరసుల నెన్న రీకాలమునం బట్టనేర్తురు!

గోవింద నిరంజనులు సహచరులుగా నుండుటచేత "దేశోద్ధారకద్వయ" మని పరిగణింపం బడుచుండిరి. సంతత మందహాస సుందర వదనారవిందమున నొప్పెడి గోవిందుడు ధీరతరుడని పలువురిమతము. ప్రశాంతమూర్తియగు నిరంజనుడె యధిక ప్రజ్ఞావంతుండని కొందఱు తలంచిరి. స్వాగతసభలలోను, వినతిపత్రస్వీకారసమయములందును, ఉభయులపక్షమున నుపన్యాసమీయ గోవిందుడే యుపక్రమించుచుండును. తను కొంచెపుపని కింతరచ్చ యేలయని విసిగినట్టుగ నిరంజనుడు మితభాషియై మెలంగుచుండును. ఇట్లే నాంటికి, గురువువాక్యము వమ్మై, తనపేరు ముందై, మిత్రునిమించం గలిగితినని, దిగ్విజయము చేసినట్టుగ గోవిందుడు కులుకుచుండును!

ముఖముచూచి మోసపోవు మనుజులకు, మనసునందలి మర్మమెట్లు బయల్పడఁగలదు? కావున గోవిందనిరంజనులు సమానప్రతిభులనియును, కాకున్న, ప్రథముఁడగు గోవిందుఁడే ప్రథముఁడనియును, జనులు విశ్వసించిరి!

౬

నిరంజనశాస్త్రి చెరసాలవదలి యింటఁ బ్రవేశించునప్పటికి, దేశమందలి పరిస్థితులు కొంత మాఱిపోయెను. ఇంతకుఁబూర్వము గాంధి మహాత్ముఁడు ఆంధ్రదేశమునఁ బ్రచారము సలిపి, సహాయనిరాకరణమును గుఱించి ప్రజలలో ప్రబోధము గలిగించి, స్వరాజ్యోద్యమ వ్యాపనమునకై కానుకలుగఁ గైకొనిన ధనరాసులు దేశసేవాకార్యముల కొఱకు సమర్పించి, కారాగృహమునకుఁ బోవునప్పటికి, ఈ నూతనోద్యమమును గుఱించి జనుల ఉత్సాహము తగ్గిపోయెను. అస్థైర్యపడవలదని మహాత్ముని యనుచరులు జనుల నెంతో ప్రోత్సహించినను, సేనాని లేని సైనికులవలె వారలయెడల ప్రజలకు విశ్వాసము క్షీణించెను. కావున, తమ నాయకుఁడు వచ్చునంతవఱకును రాజకీయాందోళనము సలుపుట నిరర్థకమని గ్రహించి, ఆ మహాత్ముని యభిమానము వడసిన యితరోద్యమములను గుఱించి యనుచరులు కృషిచేయసాగిరి. కొందఱు మద్యపాననిషేధమును గుఱించి పనిచేసిరి. ఖద్దరు వస్త్రనిర్మాణమును గుఱించి పలువురు పాటుపడిరి. మఱికొందఱు నిమ్నజాత్యుద్ధరణము మహాత్మునికిఁ బ్రియతమమైన సంస్థయని దానిని సాధింపఁబూనిరి. ఈకడపటి కృషియందు నియమితులగు వారలలో నిరంజనశాస్త్రి యొకఁడు.

పంచమజాత్యుద్ధరణము దేశాభ్యున్నతికి ముఖ్యసాధనమనియును, ఈ సేవయందు నియుక్తులగువారు, ఓరిమి, దయ, స్వార్థత్యాగము మొదలగు సుగుణముల వలనఁ బురికొని, సన్నియమములను పూని, ఆత్మపరిపాక మందఁగలరనియు, నిరంజనుఁడు నమ్మి, యీ యుద్యమమునఁ బ్రవేశించెను. కారాగృహవాస మప్పటినుండియు నతనికి గోవిందుఁడు కుడి భుజమయ్యెను. అతఁ డెంత మంచివాఁడు కాఁడేమోయని భయమందిన నిరంజనుని మనస్సున, మిత్రుల వెనుకవిఱుపులు మొదట మరింత సంశయములను బెంచెను. మాటలు చెప్పవచ్చును కాని క్రియ లగపఱచుట కష్టము. గోవిందునికి సచ్చింత సద్భావములె లేకుండినచో, అతఁడూరక చెరసాలలోఁ గష్టపడక తనవిద్యాప్రజ్ఞల కనుగుణ్యమగు నేవృత్తినైనఁ జేకొని, ధనసంపాద్యమునకుఁ దొడంగఁడా యని నిరంజనుఁడు తన్నుఁదాఁ బ్రశ్నించుకొని, గోవిందుని హృదయక్షేత్రమందు దేశభక్తి బీజములు మొలకెత్తుట సత్యమని సిద్ధాంతము చేసికొనెను.

ఇటు గోవిందుఁడు ఒడిదుడుకులు లేని ఖాదీవ్యాపనమును బూని, దేశసేవాతత్పరుఁడని పేరునంది, తాఁ గొంతసేవఁ జేసి, మెల్లగ స్వార్థపురుషార్థములఁ జేపట్టఁ దలంచెను. జాతీయ వికాసతకుఁ బట్టుగొమ్మయగు ఖాదీవ్యాపన మందు మిత్రులగు తామిరువురును జేరి కృషి చేయుదమని గోవిందుఁడు నిరంజను నాహ్వానించెను. నిరంజనుఁడందుకు సమ్మతింపక, పంచమోద్యమము ముఖ్యమని త్రికరణశుద్ధిగ నమ్ముట చేతఁ దానాకార్యమునే జరపుచుండు ననియును, మిత్రుఁడు మాత్రము శ్లాఘనీయమగు ఖద్దరు వ్యాపనమున పనిచేయ వచ్చునని యును చెప్పివేసెను. కాని, యేకార్యము నందైనను స్నేహితుని వీడి యుండుట గోవిందుని పద్ధతి కాదు. కొన్ని మొలకలు స్వతంత్రజీవనమునకుఁ జాలియుండక, ఇతరజాతి వృక్షముల నాశ్రయముగఁ జేకొని, వాని సారముగ్రోలి వర్ధిల్లుచు, తుదకు వానిని తుద ముట్టించును. వ్యక్తివిశేషమును బట్టి గోవిందుఁడు నిట్టి బదనికయే! తానేదేని స్వతంత్రకార్యము చేఁబట్టి, అందు శక్తియుక్తులు చూపి, పేరు ప్రతిష్ఠలు గాంచవలెనని యాతని యాశయము కాదు. ప్రాణస్నేహితుఁడగు నొక పాఠశాలయందును సహపాఠిగఁ జేకొని, అతని యెరుకను దిద్ది, యాతని మించిన విద్వాంసుఁ డనిపించుకొనవలెనని గోవిందుని సంకల్పము! సహవాసుఁడు తన వెన్నడును, నందును, మించఁ గూడదనియు, తన చేయివీడి, పేరు ముందు వెనుక వలెననియును, గోవిందుని కోరిక! ఉద్యమముల యొక్కయు, ఉద్దేశముల యొక్కయు, యోగ్యతాయోగ్యతలతో గోవిందునికిఁ బ్రసక్తి లేదు. మిత్రుని మించునట్లుగఁ బ్రజల దృష్టిలఁ బడుటయే వాని ముఖ్యాశయము. కావుననె యతఁడు తన ఖాదీప్రచార మిపుడు గంగను కలిపి, పంచమజాత్యుద్ధరణమునకు దిగి తన నెపమున మిత్రునితో మరల భుజము కలిపెను. కుడు



నిరంజనుడు నమ్మి యీ యుద్యమమున బ్రవేశించెను.

హ్రస్వ మగుచుండెను! ఎన్నిమాఱులు నులిపినను, సింగుకనులు వెండి బంగరులకంటె వేరు దృశ్యములు గానలేకుండెను. గాంధిమహాత్ముఁడు, ఈప్రాంతములకు వచ్చిన తరుణమున, ప్రజలు వేనవేలుగ వచ్చి, ధనరాసులు సమర్పించిరి. నగలు నాణెములు కుప్పలుగఁ గురిసెను. ఈసొమ్మంతయు దేశసేవాకార్యములకు వినియోగింపుఁ డని సింగునకు స్నేహితులపును మహాత్ముఁ డిచ్చివేసెను. కాని దానిలోఁ జాలభాగము సింగు సొంత వ్యయములకు వాడుకొని, వలసినపుడు తీర్చివేయుదునని చెప్పుటయె కాని, నేఁటికి నట్లు చేయనేలేదు. స్వదేశోద్యమమునఁ బాల్గొను బ్రాహ్మణేతర నాయకుని నేరము బయలు పెట్టిన యో, జాతివైషమ్యములు మఱింత యుద్రేకించునని మిత్రులూరకయుండిరి. కాని, యెల్లకాలము సహాయనిరాకరణోద్యమమున నిట్టి లాభములు ప్రాప్తించునా? కావున, సింగిపుకు చిరుదిండిలేక చిక్కిపోవుచున్నాఁడు! నోరుచుట్టు మీఁద గోకలిపోటును నట్లు, ఇపుడు సింగును పంచమోద్యమములోని కమాంతముగ దింపిరి. నాఁటినుండియు నాతనికన్నులు నీరునేలేదు! పోనిండు, బ్రాహ్మణేతర నాయకుఁడని కీర్తి కెక్కినయన నింత సింగున కొరు నిటువేయుదురు కారె! కావున తన దురవస్థకుఁ గారణమగు నిరంజనశాస్త్రి తాళము పట్టినఁ గాని, తనపాలు తనకు దక్కదని విశ్వసించి, గోపాలసింగుకూడ నిరంజనుని మీఁద ధ్వజమెత్తెను.

కంచె చేను మేసినట్లు, పంచమోద్యమమునఁ బాటుపడవలసిన గోపాలగోవిందులు, దానివినాశమునకై పని చేయఁ దొడంగిరి. పంచములలో ప్రబోధముగలిగించుటకు మాఱుగా, తమ గురువుల మీఁదను, స్వాములగు భూస్వాములమీఁదను ధ్వజమెత్తుఁడని చాటుచాటున వారల కుపదేశించిరి. చాలపంచములకోప మతివేగముగఁ బెరుఁగును. విద్యాబోధముగావించుమిషతో, నిరంజనశాస్త్రి పంచమజాతి దాస్యమును మఱింతవృద్ధిపఱచి, వారి సర్వస్వమును బ్రాహ్మణులకుఁ గాఁపులకును గట్టిపెట్టుచున్నాఁడనియును, ఖామందులగు కాఁపులను వారిపై (ది?)కుసికొలుపుచున్నాఁడనియును, ఈముష్టద్వయము పంచములకుఁ గొండెములు చెప్పిరి. తమ గురువులగు వీరినోటనే యీమాటలు వినవచ్చుటచేత, అమాయికులగు పంచములు కొంత జెవి నమ్మి, తమ్ము నిరంజనుని పగనుండి తప్పింపుడని వారినె కోరిరి.

ఈప్రముఖు లిరువురును తీరిక చేసికొని కాఁపుల గ్రామమేగి, పరమాప్తులవలె నటించి, నిరంజనుఁడు పంచములను వీరిమీఁదికెత్తివచ్చునట్లు సిద్ధముచేయుచున్నాఁడని రహస్యముగ వారి కెఱిఁగించిరి. పంచములలోని మార్పును కిదివఱకె కనలుచున్న కాఁపుల స్పర్ధలు దీనివలన మఱింత రగులుకొనెను. నిరంజనుని మిత్రులె యీవార్త తెచ్చుటవలన, కాఁపుల కది మఱింతనచ్చి, సమిమించకమునుపె పంచములపని పట్టవలెనని వారు యోజింపసాగిరి.

ఇట్లు గోపాలగోవిందులు, కాఁపులకు నిరంజన పంచములమీఁదను, పంచములకు కాఁపులపైని, నిరంజనునిమీఁదను విరోధాగ్ని నెలకొల్పి, అది రగిలి మండుసమయమునకు వేచియుండిరి.

## ౬

ఇది యిట్లులుండఁగా, సాగిలేటికావలి యొడ్డుననున్న కాఁపు పాలెపుప్రజలలో నింకొక విధముగు సంచలనముగూడఁ గలిగెను. నిరంజనశాస్త్రి పలుమాఱు రచటికేతెంచి, పంచములకు వారు చేయవలసిన సమపాయములనుగుఱించి కాఁపులతోఁ బ్రసంగించుచుండెను. ఈసంభాషణములు వినిన కాఁపుయువకులలోఁ గొందఱికి దేశోద్ధరణకార్యములను గుఱించి యుత్సాహముగలిగెను. అట్టివారిలో ముఖ్యుఁడు లక్ష్మణస్వామి.

లక్ష్మణస్వామి, ఉన్నతాంగ్లేయ విద్య నభ్యసింపకున్నను, యోగ్యుఁడు, కుశాగ్రబుద్ధియునగు యువకుఁడు. తమ గ్రామమున జనుల యుపయోగార్థమొక పఠనమందిర మేర్పఱచి, అది బాగుగ జరపుచుండెను. నిరంజనుఁడు నడపుచుండు పంచమాశ్రమము నెడ నితని కమితాభిమానము గలిగెను. పంచముల యభివృద్ధినిగుఱించి వారి యుజ్జ్వలతలను కాఁపులకు బ్రాహ్మణులకంటె నధికముగ పాటుపడవలసిన బాధ్యత గలదని యాతఁడు తన వారికి బోధించుచు, నిరంజనశాస్త్రికిఁ దాను దోడుపడుచుండును. లక్ష్మణునికిని, పంచమోద్యమమును గుఱించి పని చేయు నితర యువకులకును గల తాదాత్మ్యము త్వరితకాలములోనె తెల్లమయ్యెను. క్షత్రికామిత్వమునఁ గాన కేవల సోదర ధర్మనిర్వహణమునకై నిమ్నజాత్యుద్ధరణమునకుఁ గడంగవలెనని యాతని యభిప్రాయము. పంచములయెడ దయరానుగ్రహములు చూపు నధికులవలె మనము వర్తించునంతవఱకును వారిస్థితి చక్కఁబడదనియును, ఒక తల్లిబిడ్డలవలె వారితోఁ గలసిమెలసి యుండునపుడె వారు ముందుకు రాగలరనియును, లక్ష్మణుని నిశ్చితాభిప్రాయము. ఇంక నీవిషయమున మాటలతోఁ బని లేదని, కార్యాచరణమునకే యాతఁడు కడంగెను. తక్కిన ప్రచారకులవలెఁ గాక లక్ష్మణుఁడు తమగ్రామమునందలి స్వంతభవనమును వదలివైచి పంచమాశ్రమమునకె తాను విడిది యేర్పఱచుకొనెను. నేఁటికి గుడిసెకు లేక యాదమాంధ్రము లల్లాడుచుండునపుడు, భాగ్యవంతులు భోగపరాయణులగుట పాపమని నమ్మి, లక్ష్మణుఁ డేకవస్త్రధారియై, కఠినాహారనియమముఁ బూనియుండెను. పంచముల యిండ్లను బాహాటముగఁ బోవుచు, వారికష్టసుఖము లారయును; వలసిన సాహాయ్యము చేయుచుండును. కన్నతండ్రివలెఁ దమ్ము నిట్లుగని పెట్టు లక్ష్మణుని యెడల పంచములు కడుఁ గూరిమిగలిగి, యాతని చేయూఁతవలన నభివృద్ధిగాంచుచుండిరి.

పంచమోద్యమమునుగుఱించి యిట్లు పాటుపడుచుండుట వలననే లక్ష్మణుఁడు నిరంజనునికి యాంతరంగిక మిత్రుఁడయ్యెను. సాధు పుంగవుఁడగు లక్ష్మణునివంటి వారుగదా యీయుద్యమమును సాధింపఁగలరని నిరంజనుఁడునమ్మి, ఆపుర్యపురుషుఁడగు వానిమీఁదనె యాశ్రమ నిర్వహణభారము ముఖ్యముగ నుంచెను.

కాని, లక్ష్మణుని ప్రముఖత, ఇదివఱకె నిరంజనుని యున్నతిని గంటకించిన గోపాలగోవిందులకు మఱింతదుస్సహమయ్యెను. "ముందు వచ్చుచెవులకంటె, వెనుక మొలచు కొమ్ములు వాడియను" నట్లు, ప్రపంచము

మునుండి పరిశ్రమము చేయుట తమకుఁగాక మున్న మున్న చేరిన యీకాఁపు కుఱ్ఱనికి ప్రతిష్ఠ వచ్చుటకు వారు సమ్మతింపక, వానిమీఁద కసితో నుండిరి. నూతన ప్రియుని ప్రేమమునఁగని నిరంజనుఁడు ప్రాఁతయనుచరులగు తమ్ము విడనాడెనని వారు వాపోవుచుందురు. "గురుశిష్యు"లని చాటు చాటున నిరంజన లక్ష్మణస్వాములను వారు పరిహాసించుచుందురు. ఎట్లు వీరి సాంగత్యము భంగపఱచి, తాము మగల ముందుఁబడెదమా యని వారు సదా యోజించుచుండిరి.

గోపాలగోవిందులు కాఁపుపాలెముపోయి, లక్ష్మణనిరంజనుల గుఱించి యసలు నపవాదములు వెలయించిరి. లక్ష్మణుఁడు, తాను గొప్పవారియింటఁ బుట్టితి ననుమాట మఱచి, గురుబోధనల ననుసరించి పంచములతోఁ గలిసి తిరుగుచుండెననియు, ఒకటి రెండు దినములలో వారిలో గలసిపోన నిశ్చయించియున్నాఁడనియును, వారు ప్రకటించిరి! ఈయిరువురి సాయము చూచుకొని మైమఱచిన పంచములు, కాఁపుల తోడి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచున్నారనియు వారు చెప్పివేసిరి! ఇదివఱకె పంచములమీఁదను, నిరంజనుని దెసను వైరమూనిన కాఁపుల యాగ్రహమందువలన మఱింత ప్రజ్వరిల్లెను. ఇంకఁ దామూరకుండిన చో, పరిస్థితులు మితిమీఱి, లక్ష్మణుఁడే కాక, తక్కిన కాఁపుకుఱ్ఱలును క్రమక్రమముగ పంచములలోఁ గలసిపోయి, తమ జాతిసంకరముగునని భీతిల్లి, పంచములు తిరుగు పక్కలోని బల్లెములుగాక మును పే వారలనుక్కడగింపఁ గాఁపులు గడంగియుండిరి.

సుకలత్రుఁ జాడలు కొంత తెలిసి, పరంధామశాస్త్రి కొమరు నొకప్రాతఃకాలముననే కలిసికొని, "నాయనా, సమాచారము లేమి?" అని సంభాషింపఁదొడంగెను.

నిరం: "సమాచారములకేమిగాని, నాయనా! ఈ తెల్లవాఱు జామున నా కొకవింత కలవచ్చి, యింకను కనులకుఁ గట్టినట్టెయున్నది. మేఘురహితమగు నంబరమునుండి పిడుగుపడి, ముద్దులుగట్టు మనమామిడి గున్న మాడి పోయెనండీ! పసిపిల్లవంటి పంచమోద్యమమున కేమికీడు మూఁడునోయని ప్రాణము తల్లడపడుచున్నదండీ!"

పరం: "తండ్రీ! మబ్బులేనిపిడుగు, మాయావిలేని మోసము నుండునా! అంతయు చూపులోపమేగాని వేరుకాదు. గుర్జనుని దృష్టికి, సంస్థలు, జీవములు నొక్కటియ సుమీ. నాయనా, నీ వీనాఁడు ఇల్లు గదలకుము!"

నిరం: "కలకల్లరో! ఇన్నాళ్లు పెంచిన సంస్థను స్వప్నభీతిచే నిపుడెట్లు విడనాడెను? పిడుగైనను చెడుగైనను, విఘ్నములఁ జెండాడుట మన విధికదా! అవల, జయాపజయములు హరికరుణ యనుగ్రహింపవలసినవె!"

పరం: "నీమిత్రులు కొందఱు కపటులై కయ్యములు గలిపించుచున్నారు సుమీ!"

నిరం: "సరే, యిది మామామూలు దోస్యమె! ఏగోపాలగోవిందులో వారి మొగకాండ్రనికూడ కదా?"

పరం: "ఔను నాయనా! వారిని నమ్మియె నీవు చెడిపోవుచున్నావు—"దుష్టునకు దూరమున నుండవలయును." ఇప్పుడైనను ఈ సంస్థ వారి శిరమునపై పడవైచి, ఆపదతప్పి, హరిచరణస్మరణతో హాయిగ నుండఁగూడదా!"

అని కన్నతండ్రి కనులనీరు తెచ్చుకొనెను. నిరంజనుఁడు మందహాసమున జనకుని భయముఁ బోనాడఁజూచి, "నాయనా! ధైర్యముననే మనకీ వాదనలేల? తగినంత జాగ్రతతో నుందును. న్యాయధర్మములఁగాచు నారాయణునిపై నమ్మియుందును. ఇఁక నేమిభయము? సరేకదా!" అని సమాధానము చెప్పెను.

"సరిగాకేమి, నాయనా!" అని పరంధామశాస్త్రి గద్గదస్వరముతోఁ బలికి, కపోలతలమునుండి సెలయేటిధారవలె నొలుకు బాష్పజలమును తన యుత్తరీయపు కొసతోఁ దొత్తుకొనుచు, మరలి వచ్చెను.

## ౧౦

ఆమధ్యాహ్నము నిరంజనశాస్త్రి పంచములగూడె మేగునప్పుడు వింత దృశ్యమొకటి విలోకించెను. సాగి పేటి కావలియున్న మిట్టప్రదేశమున నొక సైన్యము విడిసి, స్కాటుకపి నవలలలోని వర్ణనమును వానికి జ్ఞప్తికిఁ దెచ్చెను. దుడ్డుఁగఱ్ఱలు చూపుల పెట్టుకొని కోపోద్దీపితులైన నూరుగురి కాఁపుల ముఖములు వానికిఁగానవచ్చెను! వీరిని ధైర్యముతో నెదుర్కొనుటకు, తమ కుటీరముల యెదుట పంచములు బారులుదీఱిచి, కఱ్ఱలు కటారులాయితము చేసికొనుచుండిరి! ఉభయుల నీ యాకస్మికవైరమెట్లు సంభవించెనా యని యచ్చెరువందుచు నిరంజనుఁడు మొగమున ఆశ్రమ శిబిరమున కెదురుగ నివ్వెఱతో నుండెడి తనయుపాధ్యాయమిత్రులను గాంచెను. సమీపించిన కొలఁదిని, వానికి వారిమొగములు స్పష్టముగ గోచరించెను. ఏలనోకాని, గోపాలగోవిందులు, వారల యనుచరులు నచటఁగానఁబడకుండిరి. మిత్రులను గలసికొని, నిరంజనుఁడు, ఈగడిబిడికిఁ గారణమేమని విచారింపఁగ, కొందఱి దుర్బోధనలవలన, కాఁపులకు పంచములకుఁ గలతలు పెరిఁగి, కసిదీర్చుకొనుటకుభయులును యుద్ధసన్నద్ధులైరని తేలినది! కలహకారకులు గోపాలగోవిందులని, ఒకరిమొగ మొకరు చూచుకొనుచు, స్నేహితులు నిరంజనునికిఁ జెప్పలేక చెప్పిరి! వారిబోధనలవలననే, నిరంజనుఁడు అతని మిత్రులును తమకు ద్వేషులని యిరుప్రక్కలవారును అపోహపడుచున్నారని తెలిసినపుడు, నిరంజనుఁ డాశ్చర్యమున మునిఁగి, జనకుని హితవచనములు మొదటినుండియుఁ దాసేల పెడచెవిని పెట్టితినాయని పరితపించెను. అతఁడంత వారలతో నాలోచించి, అందఱు నాపదనుండి తప్పించుకొనుటకై, అచట సమావేశమైన యుభయకక్షులవారికిని నిజము తెలిపి, ఒండొరులకు మిత్రభావము గలిగించుటకుఁ దానుబూనుకొనెను. ఇపుడు తమదగ్గఱకువచ్చిన నిరంజనశాస్త్రితో రెండుప్రక్కలవారును



చెన్నపురి హిందూయువతీ శరణాలయ వార్షికోత్సవము



శ్రీమతి బ్రిజలాల్ నెహ్రూసతిగారికి చెన్నపురిస్త్రీల సన్మానము



శ్రీ సర్ హరిసింగ్ గౌరుగారు, స్త్రీ సంఘ ప్రతినిధులు - చెన్నపురి



భారతి మహిళామండలి-బెజవాడ



అఖిలభారత మహిళాసభ-పాట్నా

# మిన్సారరసము



సకలవిధమైన రోగములకు దివ్యామృతమని లోకఖ్యాతి గాంచినది.

లోపలికి, పైపూతలకు చుక్కలు పరిమాణముగా ఉపయోగించిన నిమిషమాత్రములో అద్భుతగుణ మిచ్చును.

## మిన్ సారరసము

ఒకసీసా యింటివద్దనుంచుకొనిన వైద్యులను వెతుక నవసరము గనుపించదు

జలుబు, దగ్గులు, అన్నిరకముల జ్వరములు, కడుపు నొప్పి, దగ్గు, తలనొప్పి, ఉదరమందు లోపములు, గుండె నొప్పి, పులితేపు, అజీర్ణము, కీళ్లవాతము, ఉష్ణవిరేచనములు మొదలైనవాటికి గుణకారి.

సిసలైనది మాత్రమే.




ఈ ట్రేడ్ మార్కు గుర్తు గలది.

ఇతరమందులు పనిచేయనిచోట్ల యిది రామబాణములాగు వర్తించును.

ప్రతి కుటుంబమునకు మిగుల ఆవశ్యకమైనది.

ఒకమారు వాడిన నమ్మకము గలుగును.

ధర సీసా 1-కి రూ 2 లు; పోస్టేజి ప్రత్యేకము.

కేటలాగు ఉచితము.

అడ్రసు:—

**మిన్సారరసం కంపెనీ, లిమిటెడ్,**
**సేలం (దక్షిణ ఇండియా)**

మద్రాసు ఏజెంట్లు:

దాదా అండు కో, చైనాబజారు రోడ్డు. అశ్విన్ అండు కో, బ్రాడ్వే.

హానరబుల్ డాక్టరు యు. రామారావుగారి ఫార్మసీ, గంబుశెట్టి వీధి, మద్రాసు.

**Minsara Rasam Company, Limited, Salem. (S. I.)**

నోరు మెదల్పుటకైన మొదట నిష్టపడకున్నను, ఆశ్రమమున కెదుటి మిట్టప్రదేశమునకువచ్చి కూర్చుండుట కెట్టకేలకు సమ్మతించిరి. నిరంజనుడపుడు వారితో సంభాషించి, కర్తవ్యమును బోధించి, తన ప్రసంగము నిట్లు ముగించెను:—

"కావున మిత్రులారా! భారత జనని తనయుల మగు మన మందఱము సోదరులము. అందఱి శ్రేయమె దేశక్షేమము. ఐదు వ్రేళ్లును గూడి యుండు నదియె హస్తము. ఏ వ్రేలి తోడ్పాటు లేకున్నను, చేయి సరిగా పనిచేయ నేరదు. హిందూమాతకరమున కైదు వర్ణములు నైదు వ్రేళ్లు. పంచమజాతి వెనుకఁబడి యుండుట వలన, మన సంఘాభివృద్ధికి తీరని కొఱత వాటిల్లినది. కాల కర్మదోషమునలన, నాలుగు వర్ణములకును పంచమ జాతికిని పొత్తు లేకున్నది. కులవైషమ్యములచేఁ గుంటువడిన హేతువుననే హిందూసంఘము నాగరికత యందు ముందడుగు వేయఁజాలకున్నది. మొన్న మొన్నటి వఱకును మూఢులుగ నుండిన విదేశీయులు, ఐకమత్యమున నిప్పుడు వికసితవృద్ధినొంది, భారతీయులను వెనుకకుఁ ద్రోక్కివేయు చున్నారు! ఇప్పుడైనను కనులు తెఱచి, మనము కర్తవ్యముఁ జూచి కొనవలయును.

"సంఘ సమ్మేళనమున కావశ్యకములగు సంస్కారణములు మన మారాధింప వలయును. ఒకసారిగ జాతులన్నియు నేకము కావలయునని కోరిన లాభము లేదు. మనసు గలియని మమతలు వ్యర్థములు. స్వయంకృషిచేతను విద్యావ్యాపనము మూలమునను అగ్రవర్ణముల తోడి స్నేహ సఖ్యముల వలనను, నిమ్నజాతుల యుద్ధరణము కావలయును.

"ఇవ్విధమున పంచమజాతి యభ్యున్నతికై పాటుబడుటకే వచ్చినారముకాని, మీలో పరస్పర వైరములు పెంచుటకుఁ గాదు. అటుగాక, నేను, ఇందున్న నామిత్రులును, కపటులము దేశద్రోహులము నని మీకింక ననుమాన మున్న యెడల, మాదుర్న్యాయములకు నా తలగొట్టి వేయుఁడు!" అని నిరంజనశాస్త్రి, రెండుపక్షముల నాయకులయొద్ద కొనఁబోయి, తలయొగ్గి నిలువఁబడెను. "మీరే దుర్మంత్రములను జరుపలేదని మాకిపుడు స్పష్టమైనది! మీరు సత్కార్యములే సాగించుచున్నారు!" అని యుభయులును జెప్పివేసిరి.

"అట్లయిన నేను మీయిరువురికిని సఖ్యుఁడనే కదా! నాకు మీ రుభయులును సోదరసములు. నేటి నుండి మీరందఱును స్నేహభావమున మెలఁగుట ధర్మము. అట్లు మీరు చేయనొల్లరేని, మనలో నైకమత్యము కుదరదని నమ్మి నాయుద్యమమును విరమించుకొని, సంసారమును త్యజించి, యడవుల కేగి వెడలి పోయెదను!" అని ధీరత్వమున నిరంజనశాస్త్రి పలికిన వాక్కులు, "యథార్థము" "యథార్థము!" అని సాక్ష్యమిచ్చు చున్నట్టుగ, పరిసర ప్రదేశములందలి వృక్షపంక్తులు మాఱు మ్రోఁగెను! "పోవలదు" "పోవలదు" అని యందఱును కేక లిడిరి. అంత నిరంజనుని కోరిక చొప్పున నుభయపక్షముల నాయకులును ఆదర పూర్వకముగ నొండొరులను సంభావించిరి. వారలమధ్య నిలచియుండు ధీరుడగు నిరంజనశాస్త్రి కనుకొనల నుండి, కొండ చరియలనుండి ప్రవించు సెలయేటి నీటివలె నానంద బాష్పములు నేల ప్రవహించెను. దయాశీలుఁడగు నాతనిఁ గాంచి, కంటనీరు పెట్టని జను లచటఁ గానరారు! మిత్రభావము గలిగి, సుఖ సంభాషణములతో నంత సెనరియిండ్లకు వారు వెడలి పోయిరి.

## ౧౧

రణరంగమునఁ బరిపూర్ణవిజయ మందిన రాజకుమారుని వలె నిరంజనశాస్త్రి నానాఁడు మిత్రు లభినందనముతో ముంచివైచిరి. ఊరేగింపుతోఁ దమ నాయకునిఁ గొనిపోయి చూపి, జనకుని సమ్మోదమునఁ దేల్చనలె నని వారి సంకల్పము. కాని, నిరంజనుఁడు వారి నివారించి, తమ విజయ మానాఁ డారంభమయ్యెనే కాని ముగియ లేదనియును, ఎప్పటివలెఁ దాను నదీజలముల వార్చి, రాత్రి కింటికేతెంచెద ననియును జెప్పి, వారిని ముందు పంపివేసెను. పరంధామశాస్త్రికిని తక్కిన వారికిని సంతోషవార్తను వేవేగమె తెలియఁ జేయు నుత్సాహమున వారు తోడ్తోడనె యిండ్లకు వెడలిపోయిరి. రాత్రి వఱకును దనను గాచి యుండునని చెప్పిన లక్ష్మణస్వామిని జూచి నిరంజనుఁడు చిరునవ్వునవ్వి, "లక్ష్మణా! నన్ను గురించి నీవు భయపడ నక్కఱలేదు. పంచమాశ్రమమునకు ముప్పు వాటిల్లకుండ మాత్రము కాచికొనుము! అన్నిశుభములు చేకూరఁగలవు!" అని వానిని పంచమాశ్రమమున కంపివేసెను. ఆనాఁటి సంగతు లొక్కొక్కటియె మననము చేసికొనుచు, నిరంజనుఁ డంత నదీతటమును సమీపించెను.

అపుడు సూర్యాస్తమయ సమయ మయ్యెను. భాను బింబము జేవురుముద్దవలె పశ్చిమ దిశఁ గ్రుంకుచు, భూలోకయాత్ర చాలించి పరలోక మేగెడి జీవుని సామ్యమును నిరంజనుని మనమునకు దోఁపించెను. ఒకవేళ తనకా నాఁడె మృత్యువా సన్నమగు నెడల, ఎట్లు లోక ధర్మములు నిర్వహించెనో చూచు కొనుట కిదె యదనని తలంచి, ఆయువకుఁడు దనజీవిత విమర్శనముఁ జేసికొనెను. ఇపుడాతఁడు గట్టుదిగి, నదిలోని కడుఁగులు వెట్టుచు, "జీవితమందలి యాశ యంతములేనిదిగదా! ఈనదీప్రవాహము పోయిపోయి, కడకుఁ గడలి నెట్లు కలియునో, నాచైతన్యమును చైతన్యమూర్తినిజేరి శాంతినొందఁ గలదుసుమీ!" యని తలపోయుచు, చెట్టుమొదట నుత్తరీయముప్వైచి, నీటియొద్దున సంధ్యావందనము నెఱపి, జనకునిబోధన ననుసరించి మూవ మ్ముద్రమూని, నారాయణస్మరణ చేసికొనుచుండెను.

అంతట నీటిమీఁద వ్రాలిన యొక పెద్దకొమ్మ పెళపెళమని యెను. తోడనే కొండంతబరువగు నాయొగము తనశిరమును భిన్న




శా. అంధుండై జగతీపతిన్ గొలిచి నీచాత్మ్యం బటం బెంచి ని
ర్బంధంబేర్పడ కర్ణధారుఁడయి పారావారము ద్దాటుచున్
అగ్రక్రియ నున్న వర్తకుల కత్యానందమొప్పంగ దయా
సింధుండై ఘనరాసుల న్నొసగ బ్రోచెన్నా బుద్ధుండిలన్.

పూర్వకాలమందు భరువనురాజు భరురాజ్యమేలు చుండెను. ఆ రాజ్యమందు భరుకచ్ఛ[1] పట్టణమను సుప్రసిద్ధ నౌకాశ్రయము గలదు. ఆపట్టణమున బోధిసత్త్వుఁ డగ్ర నియామకుని[2] పుత్రుఁడై జన్మించెను. ప్రసాదాదిగుణ విరాజితుండై, సువర్ణవర్ణ శరీరుండైనందున నతనికి సుప్పారక కుమారుఁడని పేరిడిరి. షోడశవర్షప్రాయుఁ డగునాటి కతఁడు నౌకాశాస్త్రపారంగతుండై పౌరజనుల యుల్లము లుల్లసిల్లఁజేసె. జనకుని మరణానంతర మాతఁడు నావికజ్యేష్ఠుఁడై యానపాత్రముల నడపఁజొచ్చెను. అనుభవమునకుఁ దోడు, శాస్త్రజ్ఞానమును, బుద్ధికుశలతయు నుండుటచే నాతఁడు నడపునావ కెన్నడెట్టియాపదయుఁ దటస్థింపలేదు.

ఒకసారి లవణజలతుషారము లాతని నేత్రములందు బడి యతని నంధుని గావించెను. అప్పటినుండి నౌకాజీవనము వదలి రాజు నాశ్రయింప నాతఁడు మదసుప్పారకు నగ్రపణ్యకునిగ నియమించెను. రాజు నొద్దకువచ్చిన మాతంగ తురంగములను, శుభ్రముక్తా హారములను, అమూల్యరత్నమాణిక్యములను, సుప్పారకుఁడు పరీక్షించి, వెలఁగట్టుచుండెడివాఁడు.

ఒకనాఁడు వర్తకులు కొందఱు సహగొంపెనుంబోని భద్రగజమును రాజునొద్దకు గొనివచ్చి పట్టపుటేనుఁగుగ స్వీకరింపుమని వేఁడిరి. రాజు దానిని రత్నపరీక్షకునొద్దకు బనిచె. సుప్పారకుఁ డంతట దానిశరీరముఁ జేతితో మెల్లగ దడవి, "ఇది మన పనికిఁ దగినది కాదు. దీనివెనుక కాళ్లలో



నొక్కింత వంకరకలదు.

(1) పట్టణము=రేవు; సముద్రతీరపట్టణము (Sea-coast town)   (2) నియామకుఁడు=కర్ణధారి (Mariner)

ఇదిపుట్టిన వెంటనే దీనితల్లి మోయ శక్తిఁజాలక క్రిందపడవైచిన కతంబున దీని వెనుక కాళ్లలో నట్టివి కిలత్వమేర్పడియె. " నని పలికెను. వర్తకులఁ బ్రశ్నింప నాఁతడు చెప్పినది సత్యమనిరి. రా జదివిని సంతసించి, సుప్పారకున కెనిమిది [1]కహాపణములు బహుమాన మిచ్చెను.

ఇంకొకనాఁడు, కొందఱొక యుత్తమాశ్వము దెచ్చి రా జధిరోహించుట కెంతయుఁ దగియున్నదని వచించిరి. బోధిసత్త్వుఁడు దానిశరీరమును తడవి చూచి, "ఇది మన భూపతికిఁ దగినదికాదు. ఏలన ఇది పుట్టిననాఁడే దీనితల్లి చనిపోయెను. తల్లిపాలు లభింపకపోయినందున, దీని యవ



యవస్ఫూర్తిలోఁ గొంతలోపము కలిగె"నని నుడివెను. విచారింపగా నదికూడ సత్యమని తేలెను. రా జదివిని సంతోషహృదయుఁడై, రత్నపరీక్షకుని కెనిమిది నాణెములు బహూకరించెను.

మఱియొకనాఁడు, దివ్యమంగళరథ మాతని కడకుఁ గొనిరాఁబడియె. సుప్పారకుఁడు దానిఁ బరిశీలించి, "ఛీ! ఈరథము తొఱ్ఱచెట్టు కలపతోఁ జేయఁబడెను. రాజున కిది తగునా?" యని చెప్పెను. అదికూడ నిజమయ్యెను. రా జదివిని ప్రమోదాంత రంగుఁడై మఱల నాతని కెనిమిది నాణెము లిచ్చెను.



"ఛీ! ఈరథము తొఱ్ఱచెట్టు......రాజున కిది తగునా?"

వేఱొకనాఁడు, అనర్ఘ రత్నకంబళము పరీక్షకు వచ్చెను. మునుపటివలెనే, సుప్పారకుఁడు దానిఁ జేతితో జాగ్రత్తమై పరీక్షించి, "ఇందొకచోట నెలుకకొట్టినది



సుమా! " యని హెచ్చరించెను. అంతట నాకంబళమును శోధింపగా, ఆవిషయము యథార్థమయ్యెను. రాజది విని యాశ్చర్యచకితుఁడయ్యు మఱల నాయెనిమిది నాణెములనే బహుమానము జేసెను. రత్నపరీక్షకుని మనమునం దపు డనుమాన మొండుదయించె. "ఈధరణీపతి ఇన్ని చిత్రవిచిత్రవిషయములఁ జూచి యాశ్చర్యపడియు, మాటిమాటికి లెక్కపెట్టి యెనిమిది కహాపణములే యిచ్చుచున్నాఁడు.

(1) ఆకాలమునందలి యొక నాణెము.

ఇతనియం దేదియో లోప ముండకమానదు. చూతము.



క్షత్రియకులోత్పన్నుఁ డెవ్వఁడైన నిట్లు చేయునా?

నీచవంశజుఁడగు నాపితుఁడే[1] యిట్లు చేయనోపు. కాన నీతఁ డట్టినీచకులమునఁ బుట్టియుండవలయు. ఇట్టి రాజును గొలిచిన ప్రయోజనము శూన్యము. సుఖముగా ఇలుచేరి కాలక్షేపము చేసెదను." అని చింతించి, భరుకచ్ఛ పట్టణము మఱచిపోయెను.

అప్పుడు కొందఱు వర్తకు లొకనావను సిద్ధముచేసి ఆయోడను నడుప సమర్థు లెవరాయని విచారింపగా, గ్రుడ్డివాఁడైనను సుప్పారకుఁడే యందులకు సమర్థుఁడనియు ఉపాయకుశలుఁ డగుటవలన నాతనియోడ కెన్నఁడు ముప్పము రాదనియుఁ దెలిసికొని యాతని సమీపించి, 'నిన్ను మాయోడకు కర్ణధారునిగ నియమించితిమి. మా వేడికోలును మన్నింపవలెను' అని విన్నవించిరి.

"మిత్రులారా! నేనంధుఁడనుగదా! నావ నెట్లు నడుపగలను?" అని సుప్పారకుఁడు వచింప వారతనిని విడువక నిర్బంధించినందున నెట్టకేల కాతఁ డెట్లో యొప్పుకొని వారితోఁ బయనము సాగించి మహాసముద్రములు దాటి వెళ్లెను. మొదటి యేడుదినములలో నోడ కెట్టి యుపద్రవమును రాలేదు. అనంతర మకాలవాతములు జనించె. నాలుగునెల లాయోడ సముద్రపీఠమునం జరించి తుదకు ఖురమాలా సాగరముఁ జేరెను. అందలి జలచరములు మనుష్యసమానశరీరములతోను, కత్తివంటి పదను గల నాసికలతోను మునుఁగుచు తేలుచుండె. వర్తకులు వానిఁ జూచి ఆసముద్రనామముఁ దెల్పుమని మహాసత్త్వు నడిగిరి.

చికిలికత్తులఁబోలు నాసికలతోడ
రమ్యమానుష్య సమ శరీరములతోడ
మెలఁగుచున్నవి యిందలి జలచరములు
సాగరపు నామ మేమి తథాగతుండ?

బోధిసత్త్వుఁడును నౌకాశాస్త్రపారీణుఁ డగుటచే నయ్యది ఖురమాలి యని తెలిసి యిట్లని పలికె:

ధనము గడియించి మించెడు తలఁపుతోడ
పావనంబైన భరుకచ్ఛ పట్టణంబు
వదలి వార్ధులపాలైరి వణిజులిచట
వినుఁడు ఖురమాలి యని దీనిపేరు నిజము.

ఆసముద్రమునందు వజ్రములు మెండుగఁ గలవు. అది యెఱింగిన సుప్పారకుఁడు, 'వజ్రము లిందు గలవని తెల్పితినా, పేరాసచే వీరీయోడను వానిచే నింపి ముంచివేసెదరు.' అని తలంచి వారి కాసంగతిఁ దెల్పక లంగరు వేసి, చేఁపలు పట్టువానివలె వల వైచి వజ్రరాసులను పైకి లాగి, ఓడయం దొకచో వాని భద్రపఱచి, పనికిరానివస్తుసంచయము నావల బారవైచె.

పిదప నానావ ఖురమాల నతిక్రమించి అగ్నిమాల యనుసాగరము దరిసెను. ఆయర్ణవము మిట్టమధ్యాహ్న సూర్యునిపగిది, ప్రజ్వలించుచున్న అగ్నిమండలమువలెను కన్పట్టెను. అంత నావర్తకులు

పట్టపగటింటి సూర్యుని పగిది మెఱసి
విలయకాలాగ్నిమండలవిధము దోఁచి

(1) నాపితుఁడు=మంగలి.

కనులు మిఱుమిట్లు గొలిపి నిగ్గారుచును
సాగరపునామమేమి తథాగతుండ?

అని యడిగిరి. బోధిసత్త్వుఁడును

ఘనము గడియించి మించెడు తెలఁపుతోడ
పావనంబైన భరుకచ్ఛపట్టణంబు
వదలి వార్ధులపాలైరి వణిజు లకట
అగ్నిమాలయటంచు నీపేరు తాతలారా!

అని పలికెను. ఆజలధియందు సువర్ణ మత్యధికముగ నుండు కతంగి మునుపటివలెనే కాంచనము సేకరించి ఓడ యందుఁ దాచెను.

ఆయోడ అగ్నిమాలదాఁటి, దధిమాల ను సమీపించెను. అది క్షీరసముద్రమువలె స్వచ్ఛమయి, దధి సముద్రముభాతి ధావళ్యముఁ దాల్చి విరాజిల్లుచుండెను. అంత నావర్తకులు

క్షీరసాగరస్వచ్ఛతఁ గేరుచున్న
దధిసముద్రంపు సవతిఁ దాల్చియున్న
పండువెన్నెల తేటలు పఱచుచున్న
సాగరపునామ మేమి తథాగతుండ?

అని యడిగిరి. బోధిసత్త్వుఁడును

ఘనము నార్జించి సుఖపడు తెలఁపుతోడ
పావనంబగు భరుకచ్ఛపట్టణంబు
వదలి వార్ధులపాలైరి వణిజులకట!
తెలిపెద వినుండు దధిమాల నీపేరు.

అని పలికెను. ఆసముద్రమునందు వెండి మెండుగ నుండు కతంగి, ఉపాయాంతరమున దానిని సాధించి వెను కటి వలెనే సేకరించెను. అంతట నాయోడ దధిమాల దాఁటి కుశమాల యనురత్నాకరము సమీపించెను. ఆసముద్రజలములు నీలకాంతుల నీనుచు నీలకుశరాశి వలెను, సస్యసంపన్నమగు క్షేత్రముపోల్కిని గన్పట్టెను. అందు నీలమణులు లెక్కలేనన్ని గలవు. కర్ణధారి వెను కటివలె వానిని సేకరించి ఓడయందు దాఁకచోఁ బాచెను.

ఓడ కుశమాల దాఁటి నలమాల యనుసాగరము ప్రవేశించెను. అది చక్కని నలవనమువలెను, పసిమి గ్ర క్కెడి వేణువనమువిధమునను గాన్పించెను. అందు వంశ రాగవైడూర్యములు నిండి యుండెను. బోధిసత్త్వుఁడు మునుపటివలెనే కొన్నిటి నాయోడయందు దాఁచెను.

ఓడ నలమాలదాఁటి, అల్లకల్లోలముగనున్న వాలభ ముఖసముద్రముఁ బ్రవేశించెను. అచ్చట నుత్తుంగతరంగము లన్ని దిక్కుల నుగ్రముగ లేచుచు పడుచున్నందున పాతా ళగహ్వరములం బోలు సుడిగుండము లేర్పడుచుండెను. నీలాకాశమును ముంచెంచు నుత్తుంగతరంగములతోడను, జలధిగర్భస్థవైచిత్ర్యములఁ జూపు సారంగముల తోడను, హృదయపుటవిదారణములై, శ్రవణకుహర నిర్భేదన ములై మిన్నంటు భూరిభయంకర ధ్వానములతోడను, సిలగుండుపడుచున్న ఆభీకరదృశ్యముఁ జూచి సముద్ర మనుజులు భీతచేతస్కులై గడగడ వడంకిరి.

చలదుత్తుంగతరంగ సంఘములతో సంఘన్న ఫేనాళితో
నలయాకారగభీరరంధ్రములతో వ్యాలోలభూతాళితో
విలసత్ భూరిభయంకరధ్వనులతో భేరీవిరావంబుతో
వలభీనామ సముద్రముంగనిరి సంపాయుక్తులై వర్తకుల్.

బోధిసత్త్వుఁ డది వాలభముఖజలధి యని పేరు దెల్పి, "ఓమిత్రులారా! మున్నన్నఁ డీసముద్రముఁ బ్రవేశించిన యోడ తిరిగిపోలేదు. ఇటకు వచ్చిన ప్రతినావయు నీసుడి గుండములలో మునిఁగి నాశన మొందవలసినదే" యని పల్కెను.

ఆనావలో నేడువందలమంది జను లుండిరి. మృత్యు భయవిహ్వలులై అంద ఱొక్కపెట్టున కెవ్వున నార్చిరి. ఆయఱపు అవీచీనరకమందు తీవ్రవేదన ననుభవించువారి రోదనము ననుకరించెను. అతికరుణాయుతంబగునాయార్తరా వంబు విని బోధిసత్త్వుఁడు తనలో నిట్లని చింతించె: "ఇప్పటి నేను తప్ప నితరు లెవ్వరును వీరి రక్షింప నలంతులు గారు. మదీయసత్యప్రతిజ్ఞవలన వీరి నిప్పుడే రక్షింతును గాక!" అని వారిదిక్కు మొగంబై, 'తాతలారా! నన్ను

గంధోదకస్నానముఁ జేయించి, నూతనవస్త్రము లొసంగి, పుణ్యపాత్రలో నైవేద్య మిడి, ఓడపైభాగమున గూర్చుండఁ బెట్టుఁడు' అని నుడివెను. వారును వల్లెయని యట్లు చేసిరి. బోధిసత్త్వుఁ డంతట నావమీఁద నిలుచుండి, భిక్షాపాత్రను రెండు చేతులతో నెత్తిపట్టి యిట్లని శపథము గావించెను: "పుట్టి బుద్ధి యెఱిఁగిననాఁటఁగోలె, ఒక్క ప్రాణి నైనను హింస నొనర్పనైతినేని, అహింసా ధర్మపరాయణుండనేని, నిత్యసత్యవ్రతుండనేని, ఈనావ సురక్షితముగా నిల్లు చేరుఁగాక!

"ప్రాణిహింసను సేయనివాఁడ నేని,
పలికి యెన్నఁడు బొంకనివాఁడ నేని,
తలఁపునం బైన ధర్మంబు తప్పనేని,
శీఘ్రమున నావ మాయిలు చేరుఁగాక."

తత్క్షణమే, దూరదేశంబులఁ ద్రోవతప్పి నాలుగు నెలలనుండి చరించుచున్న ఆ యోడ, మంత్రసిద్ధవాసం బోలె నొకనాటిలో భరుకచ్ఛమున కత్యద్భుతముగ వచ్చి చేరెను. ఓడ యది యెనిమిది[1] యుసభములు భూమిమీఁదఁగూడ నడచి, కర్ణధారుని గృహద్వారము నెదుట వ్రాలెను. బోధిసత్త్వుఁ డంతట నోడవర్తకులకుఁ దాను తెచ్చిన వజ్రవైడూర్య ప్రవాళాదిమణులను రజతకాంచనాదికములను పంచిపెట్టి, "ఈధనము మీకు చాలును. ఇఁక నెన్నఁడును సముద్రయాన మొనర్పకుఁ"డని హితము గఱపెను. తరువాత నాతఁడు యావజ్జీవము భూరిదానాది సత్క్రియ లొనర్చి, కీర్తిదీధితులు దిక్కటాహములు నిండ యశఃకాయుఁడై స్వర్గనగరమున కేఁగెను.


"ఈనావ సురక్షితముగా నిల్లు చేరుగాక!"

1. ఉసభము=సుమారు 78 గజములు.
2. ఉసభములు=$2\frac{2}{3}$ ఫర్లాంగులు.

అజంతా చిత్రము




౮. రాజసమావేశము

# ఇప్పటికి పదిసంవత్సరములనుండి

ఇప్పటికి పదిసంవత్సరములనుండి యీ డాడ్జిబ్రదర్సు మోటారుకారులను మేము అమ్ముచున్నాము. డాడ్జి మోటారుకారులు గలవారి సంఖ్య యీ దక్షిణ హిందూదేశములో ఒక సం॥రమున కంటె యింకొక సం॥రము క్రమేణ హెచ్చుచున్నది ఆయా కారులయొక్క యజమానుల కవి తృప్తికరముగా నున్నవి.

ఇందులకు కారణమేమనగా డాడ్జి మోటారుకారుల ప్రాశస్త్యము నమ్మదగినదై యున్నది. వానియొక్క ఖరీదులు బహు సరసముగా నున్నది.

డాడ్జిబ్రదర్సువారి పేరుతో ఒక మోటారుకారు తయారైనయెడల ఆ పేరునకు కొంత అర్థము కలదు ఎటువంటి దుర్గమమార్గములందైనను పెద్ద దూరప్రయాణములను యొడుదుడుకులను ఓర్చి చేయగల్గునట్లు డాడ్జి మోటారుకారు తయారుచేయబడిన దని గ్రహింపవలెను. ఈ మోటారుకారుయొక్క ప్రాశస్త్య ముక్కటియే ఇదివరలో దీనికి గల ఖ్యాతి. దీనికి తోడుగా యిప్పుడీ మోటారుకారునకు ఆకారసౌష్ఠవము, ప్రయాణసుఖము, అప్రతిమాన యంత్రచాలనము కలుగజేయబడినవి.

మీ రొక మోటారుకారును కొనదలచినయెడలను, దక్షిణహిందూదేశమున కనుకూలమైనది కోరునెడలను, మీరు అడిసను కంపెనీవారికి వ్రాసి సంప్రతించుటయే యుత్తమము.

Addison's
MADRAS
CALICUT
BANGALORE
TRICHINOPOLY






## అడిసను కంపెని;

మద్రాసు, కళ్లికోట, బెంగుళూరు, తిరుచునాపలి.

# శీతలామందిరము

వేలాల సుబ్బారావుగారు

క్రీ. శ. 1927వ సంవత్సరం మే నెల ప్రవేశించింది. హిందూ మహమ్మదీయుల కొట్లాటలమూలాన్ని పంజాబుదేశంలో ఎక్కడ జూచినా మహా ఆందోళనంగా ఉంది. ఎవళ్ల నోటివెంట వినబోయినా యిదొకటే. ఎక్కడపయినా నలుగురుగురుకు గుంపుగా కూర్చున్నారంటే వాళ్లు మాట్లాడేవిషయం హిందూ మహమ్మదీయుల కలహాలనుగురించి తప్పకుండా అయివుంటుంది. సత్రాలలో రైళ్లలో స్కూళ్లలో నదీమార్గాలలో స్నానాలరేవుల్లో మోటారుగాడీలలో కచేరీలలో ఎక్కడపయినా నలుగురు కలవడానికి అవకాశం వుంటుందో అక్కడంతా ఈప్రసంగమే తప్ప మరోవిషయం వినవచ్చేదికాదు. గాంధీమహాత్ముని నాన్ కోఆపరేషన్ మూవ్మెంటు బొత్తుగా చల్లబడిపోయింది. దానికి ఇతిశ్రీకానడం, హిందూ ముసల్మాన్ కలహాన్నికి శ్రీరస్తు కానడం ఒకముహూర్తంలోనే. నైసర్గిక నియమాల ననుసరించి వేటికైనా యీ యానంలో కలుగుతుంది విజృంభణము. ఇది ఆనియమాలకు విరుద్ధమైంది కాబట్టి మొదలు పుట్టేపుట్టడంతోటే ముల్తాన్ నగరాన్నంతా భగ్గుమనిపించింది. అక్కడినుంచి మండూకప్లుతాలతో, మధ్యమధ్య రెండుమూడు నెలల అవకాశాలతో పంజాబులోని ముఖ్యముఖ్య పట్నాల్లో చెలరేగడం మొదలెట్టింది. క్రమక్రమంగా సహారన్‌పూర్, ఢిల్లీ, రేవాడీ, అమృతసరం, గుజరాంవాలా, కోహాట్, రావల్పిండీ మొదలైన నగరాల్లో హిందూ మహమ్మదీయుల కిద్దరకూ ఉండే సౌఖ్యాలూ సఖ్యాలూ అన్నీ స్వాహా అయిపోయినాయి. కేవలం ముప్పైమైళ్ల దూరంలో ఉండడంవల్ల అమృతసరం తగులబడినప్పుడు అక్కడ చెలరేగిన అగ్నిజ్వాలలసెగ లాహోరుకూడా తగిలింది కాని ఇంతవరకూ ఇక్కడి వారికి దేవతాసాక్షాత్కార భాగ్యం లభించింది కాదు. ఇంతకూ లాహోరువాళ్లు పట్టి నిర్భాగ్యులు. ఈలాటిపిరికితనం రాజధాని వాసులకు అవమానకరం కూడాను. పేరు ప్రతిష్ఠా లేని నగరాలన్నీ పేపర్లలో బడి పైకివచ్చి నలుగురినోళ్లలో బడుతూవుంటే ఈ మహాపట్నం చచ్చినదానిలాగు పడివుండడ మేమిటి? నిజంగా ఇక్కడివాళ్లంతా నామర్దాలే— అని కలహానికి కాలు దువ్వుతూ ఉండే హిందూ ముసల్మాన్ గుండాలు కొందరు ఉక్కిరిబిక్కిరై ఉసూరు మంటూ ఉండేవాళ్లు. మనుష్యుల మొగాలమీద నిష్కల్మషభావ మనేది కనబడేదే కాదు, ఎక్కడ మాయమై పోయిందో. ఏమొగం జూచినా ఏదో అనుమానం, భయం, ఆవేశం, అసంతుష్టి, వైమనస్యం వీటిని సూచిస్తూ ఉండేది. ఈ కలహాగ్నిహోత్రం దేశంలో కాలుపెట్టి జనులందరి మొగాలపై తాండవమాడే కలాకాంతులతో గూడిన ఆనందరసాన్ని పీల్చేశాడా అనిపించేది. ఎటువైపు చూచినా చిన్నబోయిన మొగాలే. అంతకుముందు ఏ ప్రకారం ఉన్నప్పటికీ హిందూ మహమ్మదీయు లిద్దరూ బజార్లో ఎక్కడైనా కలిశారంటే ఇద్దరి మొగాలూ వివర్ణాలై నల్లబారుతూ వుండేవి. వ్యక్తిగతమైన విరోధంగాని, మనస్పర్థగాని ఏవిధమైనది లేకపోయినప్పటికీ, అంతవరకూ ఒకరి నొకరు ఎరుగక పోయినప్పటికీ ఏం చిత్రమోకాని హిందూ మహమ్మదీయులు ఎదురుపడ్డారంటే ఇద్దరి మొగాల్లో అవిశ్వాసభావం ప్రత్యక్షమౌతూ ఉండేది. ఈలాటరోజుల్లో మే నెల రెండవతారీఖునాడు విద్యార్థు లిద్దరు రావీగోష్ఠుమీదుగా లాహోరువైపు వస్తున్నారు. సాయంకాలం షుమారు ఆరుగంటలై ఉంటుంది. ఇద్దరి చేతుల్లో సంస్కృత గ్రంథాలున్నాయి. సంగతి సందర్భాలను గుర్తెరిగిన వాళ్లకి వీళ్లను చూడడంతోటే విద్యార్థులనిన్నీ, పగలంతా ఏరావీ తీరాన్నో చదువుకొని సాయంకాలానికి ఇండ్లకు తిరిగి వస్తున్నారనిన్నీ తెలియకపోదు. ఇద్దరికీ రెండు మూడేళ్ల వార ఉండవచ్చు. పదిమూళ్ల పంజాబీ ధోవతులను ఒకచివరనుంచి కట్టుకొని రెండో చివరను మడతపెట్టి తొడుక్కున్న షర్టుమీద ఉత్తరీయంగా వేసుకొన్నారు. ఇంతకుతప్ప వేరే ఉత్తరీయాల్లేవు. తలలమీద సోకుగా చుట్టుకొన్న పాగాలున్నాయి. కాళ్లకు సరగాబీలు. ఒకచేతిలో పుస్తకాలకట్ట; రెండోచేతిలో చిన్నతువాలా. వీళ్లిద్దరూ చిన్నరావీనంతెన దాటి అక్కడే దగ్గరలో రోడ్డుప్రక్కగా ఉన్న వైరాగీమందిర ద్వారానికి ఎదురుగా రావడంతోటే గుళ్లోనుంచి మరో విద్యార్థి గబ్బున బయటకు ఊడిపడ్డాడు. ఇతనివేషం వైఖరి అంతా పై వాళ్లలాగే ఉంది. ఇతడు కనపడడంతోటే పై విద్యార్థు లిద్దరు—

"వంశీ! నీవు ఇవ్వాళ రైలు వంతెన దగ్గరికి వస్తానన్నావే! అక్కడి సమాచారం ముందుగానే తెలిసిందా ఏమిటి, రావడం మానేశావు? నీకోసం చాలాసేపు ఎదురుచూశాం."

అని అడిగారు. అప్పుడు వాళ్లకీసంభాషణ జరిగింది:

"శావాలన్నే, మిమ్మల్ని దోవలో కలుసుకోందామనే మన మందిరాన్నుంచి బయల్దేరాను! కాని మీరాయిద్దరి జాడా ఎక్కడా కన్పించిందికాదు. ఇక్కడికి వచ్చేసరికి ఎంత మహాతీవ్ర మనిపించింది. మీరు దొరకనే లేదు. ఒక్కడినీ రావడానికి పాలుమాలి ఈగుళ్లో చొరబడ్డాను."

"ఇవ్వాళ మీ కేం పేపరైంది?"

"వికల్పం. మీకో?"

"మాకు ఇవ్వాళ సాహిత్యదర్పణం మైపోయింది. రేపూ, మావికల్పం."

"మీ దేం వికల్పం?"

"ముక్తావళీ. నీదో?"

"కావ్యప్రకాశం"

"బాగా రాశావా?"

"ఏదో రాశాను. అసలు గ్రంథములోని తాత్పర్యం గ్రహించడం ఎల్లా ఉన్నా మా పండితులు గారు ముఖ్య విషయాల మీది శాస్త్రార్థాలన్నీ వల్లన వేయించారు. నాటినే అక్కడ గంపేసి వచ్చాను. ఇక ఇందులో తప్పిపోవడ మంటూ ఉండదనుకో."

"ఎంచేత?"

"పేపర్లని దిద్ది మార్కు లిచ్చేవాళ్లకీ ఇలా రాయడమే ఇష్టం. స్వబుద్ధిని ఉపయోగించి తమ చిత్తానికి వచ్చేలాగు రాసేవాళ్లంతా ఫెయిలే అవుతుంటారు."

"ప్రశ్నలకు జవాబు రాయడానికి తమ బుద్ధిని వినియోగించి రాయాలి గాని భట్టీవేయడం పనికిరాదంటారే!"

"ఊలాగని పైకి చెప్పడం మటుకే. కాని అసలు రహస్యం వేరు."

"అంటే?"

"మీ కింకా బహిరంగాలే కాని అంతరంగాలు తెలియని లాగున్నాయి. తప్పకుండా తెలిసికొని ఉండాలి. చెబుతా వినండి. ఇంగ్లీషు దొరలు ఇక్కడికి రాకపూర్వం మనదేశంలో శాస్త్రాధ్యయనం మరోలా ఉండేది: ఆకాలంలో ఒక్కొక్క శాస్త్రాన్ని రెండు మూడేళ్లు బాగా చదువుతూ ఉండేవారు. ఆ పరిశ్రమమూలాన్ని వారికి గ్రంథాల్లోని మర్మాలు కూడా అవగత మవుతూ వుండేవి. కాని ఇప్పటి కాలేజీల పద్ధతి వచ్చిన లగాయతూ ఆ ప్రాచీన పద్ధతులని మార్చుకోవలసి వచ్చింది."

"ఎందు నిమిత్తం?"

"రెండుమూడుసంవత్సరాల్లో చదవగలిగే గ్రంథాల్ని పధ్నాల్గింటిని ఇప్పుడు ఒక్క సంవత్సరంలోనే పూర్తిచేయాలాయెను. మరి ఏంచెయ్యాలి! ముఖ్యమైన శాస్త్రార్థాలన్నింటిని వల్లెన వేయించి పాస్ చేయిస్తారు పండితులు. ఆ క్రమాన్ని పాసయినవాళ్లే ఇప్పుడు మన పరీక్షకులు. వీళ్లు మనం రాసి యిచ్చిన పేపర్లను చూసేటప్పుడు వాళ్లు వల్లించి ఉన్న ముక్కలు వచ్చాయా లేదా అని చూస్తారుగాని ఇది ప్రశ్నకు తగ్గ జవాబు అవునా కాదా అనిచూడరు. నానాకష్టాలు పడి, ఆరోగ్యాన్నికూడా చెడగొట్టుకొని, పశువులాగు చదివి, పరీక్షాభవనంలో కూర్చొని మనం రాసేదాన్నంతా పరికించి చూచి మార్కు లిస్తారనుకొన్నావా ఏమిటి — ఈ చండాల మార్కులు! వేలకొలది విద్యార్థులు వేర్వేరుగా రాసే జవాబులన్నింటిని బాగా పరిశీలించి మార్కు లివ్వాలంటే ఒక్కనాళ్లో చావరూ? వీళ్ల కంతతీరిక ఎక్కడ? ఓపిక ఎక్కడ? వేలకువేలు పేపర్లని తిరగెయ్యాలి నాలుగయిదు వారాల్లో."

"బాగా చూడ గలిగి నన్ని పేపర్లనే తీసుకొంటే?"

"ఫీసు తగ్గిపోదూ మరి—అలా గప్పటికీ కాదు. అంచేతే పరీక్షకుడు పేపరు తెరచినాడంటే చేతివేళ్లు మెషీనులాగు పనిచేసి కాగితాల్ని తిరగేస్తుంటాయి. ఆసమయాన్ని పరీక్షకుని స్నాప్ షాట్ దృష్టుల్లో ఆయన అంతకుపూర్వం వల్లించికున్న పదాలూ, వాక్యాలూ, ఏవైనా ముక్కలూ పడ్డాయా అంటే సరే—లేకపోతే పేపరునిండా గ్రాసుమార్కులే."

"మేమింకా విన్లా—కూలాగని."

"మీరు డిగ్రీపరీక్ష కానుగా—వచ్చేసంవత్సరం అన్నీ తెలుస్తాయి."

"అయితే డిగ్రీలవల్ల లాభం లేదనా? నీ అభిప్రాయం."

"ఎందుకు లేదూ? ఉంది.

"ఏవిధాన్ని?"

"ఏదైనా స్కూళ్లలోనో కాలేజీలోనో నౌకరీ దొరికితే నాటినే మళ్లీ శిష్యులచేత ఏకరువు పెట్టించడానికి పనికొస్తుందా? ఇంకోలాటి సేవావృత్తిని స్వీకరించినప్పటికీ కొన్నాళ్లు అలవాటైన తరువాత రాయడానికీ, చదవడానికీ, అధికారియిచ్చే ఆర్డర్లను గ్రహించడానికీ, అవసరంబడితే వారితో మనవిచేసికోడానికి తగిన యోగ్యత తప్పకుండా వస్తుంది. ఇంతకంటే మన కీవెధవచదువుతో పనేముందీ? హాయిగా రెండుపూటలూ కడుపు నిల్లబడుతూవుంటే ఎప్పుడైనా వీటి పేరైనా ఎత్తేవాడేనా? దానికోసమే కాదూ ఈ అగచాట్లన్నీనీ? ఇక గాల్లో ఎగరాలనే గొప్పగొప్ప ఆకాంక్షలు మన కప్పుడూ కలగనే కలగవు. అలాటిగొంతెమ్మకోర్కెలను మనస్సుల్లో పెట్టుకోడం వల్ల వాళ్లకి ఆరో మహాపాతకం. సరే పరీక్షలమాట ఉండనీ— ఇవి కాకా మానవు, మనం ఇవ్వకా మానం—మీరు నన్ను చూడగానే 'నీ కక్కడి సమాచారం తెలిసిందా ఏమిటి?' అని అడిగారు. సమాచార మేమిటి? రావీదగ్గర ఏవైనా విశేషాలు జరిగాయా?"

"విశేషాలున్నాయని కాదు మాఅభిప్రాయం. లేవని—ఆసంగతే నీకు తెలిసిరాలేదా అన్నాము. ఇదివరకు పరీక్షలగోలలు వస్తే గూర్ఖా అంటే కైలువంతేన దగ్గర కట్టమీద ఎక్కడజూచినా విద్యార్థులే ఉండేవారు. అంతేగాకుండా వూళ్లో అమ్మవారి సంబరం పండ్లనీ, పూతమిఠాయిలనీ విద్యార్థుల కంబగట్టి డబ్బు పోగుచేసుకొందామని పండ్లవాళ్లు, మిఠాయిఅమ్మేవాళ్లు వచ్చేవాళ్లు. వీళ్లంతా రీతో గలసి అసలుసంతో మనుష్యులతో కిటకిటలాడుతూ వుండేది. ఇవ్వాళేమున్నది? మాలాగే దారితప్పివచ్చిన నలుగురైదుగురు విద్యార్థులు దప్ప ఇంకెవ్వరూ లేరు—కష్టంతో బావురుమంటూ ఉంది. నాకుగూడా ఏలాగో అనిపించి తిరిగి వద్దామనుకొన్నాంగాని ఎండచేత రావడానికి బద్దకించాం. ఇక ఇంతదూరం రానే వచ్చాంగదా అని అక్కడే కూర్చొని కాయితాలు తిరగేసివచ్చాం. కాని ఇవ్వాళింత పాడైన దన్నమాటే—నీసంగతేమిటి—గళ్లో బాగా చదువు సాగిందా? అక్కడేమీ విశేషాలు లేవు గామా?"

"గళ్లో ఏం విశేషాలూ! లాహోరుసిటీలో జరుగుతున్నాయి విశేషాలన్నీ. అందుమూలాన్నే కానచ్చు రావీ దగ్గర జనసామ్యం గావడం—ఒకగంటైంది. సయ్యద్ మిట్ఠాబజారునుంచి అయిదారుమంది గృహస్థులు స్నానం చెయ్యడానికని వచ్చారు. వాళ్లు బాధతో చెప్పుతూ ఉంటే విన్నాను—మూడునాలుగుగంటలప్పుడు డబ్బీ బజారులో సిక్కులకి ముసల్మానులకూ గొప్ప పోట్లాటైందట. నిముషంలో ఇటువేపు యాభైమంది సిక్కులు, అటువేపు అరవైమంది తురకలు పోగయ్యారు—క్షణంలో అంగళ్లన్నీ మూసేశారు. ఇంతలోనే ఎవళ్లో టెలిఫోన్ చేశారు. చేతులుచేతులు కలియడం మొదలైందట. కాని నాలుగైదు నిముషాల్లోనే పోలీసుకమీషనరు, సూపరింటు, డిప్యూటీకమీషనరు, మేజస్ట్రీటు, పోలీసుజవాన్లు గుర్రాలమీద పరుగెత్తుకొని వచ్చి మూకలను ఇవతలా అవతలాకి చేశారట. ఇప్పుడాబజారులో ఎక్కువమంది పోలీసువాళ్లని కాపలా ఉంచారట—ఆసమయానికి అందరూ పారిపోయినప్పటికి రెండుపక్షాలవారు ఉద్రేకంతో ఉన్నారనీ, సమయంకోరికితే మళ్లీ ఓమారు ఫిసాదాయించడానికి తయ్యారుగా ఉన్నారనన్నీ చెప్పారు."

"ఆపోట్లాట కలగడానికి కారణమేమిటట?"

"కారణమేమిటి? వీటిని పోట్లాటలనడంగూడా తప్పే. ఇవన్నీ ఒకవిధమైన తమాషాలు. ఇవ్వాళ పొద్దుని పంగలప్పుడు మనం పేపరు ఇచ్చి యూనివర్సిటీహాల్లోనుంచి బయటికి రావడంతోటే మాల్ రోడ్డుమీద మ్యూజియానికి ఎదురుగుండా కోతులవాడు కోతులను ఆడించి చూడడానికి చుట్టూమూగిన వాళ్లదగ్గర డబ్బు పోగుజేశాడు చూశారు గాదూ?" వాడిచేతిలో పేంబెత్తముండి. ఆబెత్తం సైగను బట్టి కోతులు తమాషాచేస్తూ వచ్చాయి. వాడాబెత్తాన్ని కుడిప్రక్కను త్రిప్పేటప్పటికి కోతులన్నీ రెండుకాళ్లమీద నిలచి పరస్పరం చేతులను పట్టుకొని మర్యాదగా కులుకుతూ నడవడం మొదలెట్టాయి—బెత్తాన్ని వాడు ఎడమవైపు త్రిప్పేసరికి పార్టీలుపార్టీలుగా ఏర్పడి గుర్రుగుర్రుమనుకొంటూ మహాభీకరంగా పోట్లాడడం మొదలెట్టాయి. అప్పటి వాటిముఖాలమీద ఉద్రేకం, ఉత్తేజం, పోట్లాటా చూస్తే ఇవన్నీ పరస్పరం కరుచుకొని రక్కుకొని చస్తాయేమో అని భయం కలిగింది. ఇంతలోనే వాడు బెత్తాన్ని కిందికి కొట్టాడు. వెంటనే కోతులు పోట్లాడడం మానేసి ముఖాలెత్తుకొని ఆకాశంకేసి చూస్తూ కండ్లను మిటుమిటులాడించాయి. తరువాత బెత్తాన్ని పైకెత్తితే అవన్నీ నేలకేసి ముఖాలు త్రిప్పుకొన్నాయి. అంతట వాడాబెత్తాన్ని నిలువుగా పైకెత్తేటప్పటికి అవి రెండుకాళ్లమీద నిలచి రెండుచేతులతో చుట్టూ పోగైఉన్న వాళ్లందరికీ సలాములుచేశాయి. ఇవిచేసే తమాషాలన్నీ మనకందరికి చాలా ఆనందం కలిగించాయి: ఆడించేవాడికి బాగా డబ్బులు దొరికాయి. ఆకోతులపోట్లాటను పోట్లాట అంటారా? తమాషా—అలాగే యీమనపోట్లాటలు. వీటికారణాలూ వాటికారణాలంటివే. తక్కిన ఏకార్యాలకైనా కారణాలుండితీరాలిగాని యీమనవివాదాలకు కారణం లేకుండానే అవుతూవుంటాయి. ఒకవేళ దేనైనా కల్పించినప్పటికి అది అందులకు కారణమై ఉండదు. నాకు తోచినంతలో వీటికి అసలు కారణమేదైనప్పటికీ గౌణకారణం మాత్రం మనరెండుపక్షాలవారి హఠం, దురాగ్రహం. అనేకాక ఈకలహాల్లో హిందువులుగాని, మహమ్మదీయులుగాని పెద్దమనుష్యులైన వాళ్లెవరూ చేయిచేసుకొన్నట్లుగా కనబడరు. అనామకులైన నీచులు, పోకిరీలు, మోసగాళ్లు, గుండాలు తన్నుకొని కల్లోలంజేయడం. జగడమంతా అయినతర్వాత తమతమ జాతివాళ్లని పక్షపాతం కలుగజేసికొని పెద్దమనుష్యులైనవాళ్లూ రంగంలోకి దిగడం, సభలుచేయడం, లెక్చర్లు కొట్టడం, తీర్మానాలుచేయడం, ఖుగ్బుచేయడం: అన్నిబులపాటాలూ తీరినతర్వాత మళ్లీ యథాపూర్వం శాంతించడం—మానగరపువంతుకూడా అయిందిగదా అని సంతోషించడం."

"ఏమిటో! ఈవెధవ కొట్లాటలన్నీ—మనయింటికి మనమే నిప్పంటించుకోవడం—తెలిసిరాదాను."

"జరిగినంతకాలం జగాలి—అపరాణికి చేసే మనవాళ్ల ప్రయత్నాలన్నీ వ్యర్థమే అవుతూవున్నాయి. ఇంతకూ దేనికైనా సమయం రావాలె."

ఈలాగు మాట్లాడుకొంటూ సిటీని చుట్టుకొనిఉన్న గోల్ బాగు అనే తోటలో ప్రవేశించారు. క్రమంగా కాశ్మీరద్వారము, భాటీద్వారము, మోరీద్వారము, హోరీద్వారములు గడచిపోయినాయి. లోహారీద్వారము దాటి కొంచెము దూరం వెళ్లేసరికి శీతలామందిరంలోనుంచి జాగంటలచప్పుళ్లు వినవచ్చాయి. వీళ్లుముగ్గురూ ఒక్కక్షణంలో పరుగెత్తి మందిరద్వారంలో చేరారు. అమ్మవారి హారతిసమయం. విద్యార్థులప్పుడక్కడ తప్పకుండా ఉండి తీరాలి.

## ౨

ఉత్తరహిందూస్థానంలో మందిరమంటే దేవాలయం. లాహోరులోని శీతలామందిరం అమ్మవారిగుడి. అక్కడివాళ్లంతా ఆదేవిని దుర్గ అని పిలుస్తారు. ఇప్పుడీ గుడినిగురించి, నాలుగువైపులా దీని నానుకొని ఉన్న లాహోరుభాగమునుగురించీ కొంచెం వివరంగా వ్రాస్తాను. లేకపోతే మూడో ప్రకరణంలో రాయబోయే సంగతులు తెలియవు. ప్రస్తుతం సిటీఅని పిలవబడే గోడకోటలోపలినాటి పురాతనలాహోరు పట్నానికి దక్షిణంగా ఉంది ఈగుడి. ఆకాలంలో ఊరూ పేరూ లేకుండా ఉండేదట. ఒకసన్న్యాసి అందులో ఉంటూ ఉండేవాడు. దీనికి తూర్పుప్రక్కని శాల్మిదరవాజా అని, పడమటివైపున లోహారీదర్వాజా అని పట్నంలోకి పోవడానికి రెండుద్వారాలున్నాయి. ఈ లోహారీ దరవాజానుంచి గుడికి వచ్చుటగా సన్నగా ఒక్కమైలు దక్షిణం పోయి నామంటే పురానా అనార్కలీబజారు వస్తుంది. ఇతిహాసప్రసిద్ధమైన అసలు అనార్కలీబజారు ఇదే. పూర్వం ఈమందిరానికి చుట్టుప్రక్కల దూరదూరంగా తోటలు, తోపులు పొలాలు ఉండేవి. వాటి తరువాత అంతా అడవులమయమే. గుడిని ఆనుకొని శ్మశానాలు, గోరీలు ఉండేవని చెప్పుకొంటారు. అందుకు తార్కాణంగా యిప్పుడు ఈమందిరం వెనకాలగా ఉన్నతోటలో దున్నితే ఎముకలు, పుర్రెచిప్పలు, బయటపడుతూవుంటాయి. దున్నంతా బూడిదలా గుంటుంది. కాని యిప్పుడీమందిరం పెద్దక్షేత్రంగా మారిపోయింది. ఇప్పుడు దీనితో సామాన్యపు రాజవాడలు సరితూగలేవు. ఇంతటి ప్రసిద్ధమైన మందిరం ఇంతటి ఆదాయముగలదీ లాహోరులో ఇంకోటి లేదు. ఇప్పుడు దీనికి సంవత్సరానికి నికరాదాయం లక్షరూపాయలకంటే యెక్కువగా ఉంటుంది. ఇంగ్లీషువారు పంజాబును లోబరుచుకొని రైల్వేలైనును వేసి పెద్దదుర్గంలాటి స్టేషన్ కట్టించారు. దాంతో లాహోరుపట్టణంతోపాటు ఈమందిరంపరిసరాలు కూడా తిరిగిపోయింది. దీనికి నాలుగువేపులా ఉన్న తోటలూ, తోపులూ అరణ్యాలూ సుందరమైన భవనాలక్రింద మారిపోయినాయి. ఉత్తరాన్ని సిటీ ఉండనేవుంది. దక్షిణ పశ్చిమపు వైపులాకూడా నాలుగైదుమైళ్ల దూరానికి మించిన పట్నం వెలసింది. ఇంకా పెరుగుతూ ఉంది. పాతఅనార్కలీ బజారును ఇప్పుడెవ్వరూ తలచుకోనే తలచుకోరు. ఈ మందిరానికి ఫర్లాంగుదూరంలో పడమటిగా వెలసిన అనార్కలీబజారే ప్రస్తుతం లాహోరు నగరానికంతా అలంకారభూతం. ఈ పురాతన నూతన అనార్కలీలు కలిసినచోటినుంచి అడ్డంగా తూర్పునుంచి పడమటికి మాల్ రోడ్డు వ్యాపించి ఉంది. ఇది రావీనదిమీదుగా వచ్చే పెషావరు ఢిల్లీ గ్రాండ్ ట్రంక్ రోడ్డునుంచి సిటీ పట్నంపక్కగుండా పొడుగునా తొమ్మిదిమైళ్లు ప్రయాణంచేస్తూ లాహోరు కంటోన్మెంటుకు పోయింది. ఈరోడ్డుకూడా చాలా సుందరమైనదే. మనోహరవస్త్రాలంకార విభూషిత యగు హిందుస్థానపు అనార్కలీ; పాశ్చాత్య వనువు మాల్ రోడ్డు. ఈరెండూ కలిసినచోటు పూర్వపాశ్చాత్యసంకరం. లాహోరులోని ముఖ్యసార్వజనికభవనాలన్నీ ఈరోడ్డుమీదే వున్నాయి. రావీనదిదగ్గరనుంచి బయల్దేరామంటే క్రమంగా పోస్టు ఆఫీసు బిల్డింగులు, చిన్నదైనా విశాలమైన, స్త్రీ హాస్పిటల్ భవనాలు, బాగుషాహుసీదు, గురుదత్తభవనాలు, ఇస్లామియా హైస్కూలు, లా బిల్డింగులు, సెంట్రల్ ట్రెయినింగ్ కాలేజిసౌధాలు, గవర్నమెంటుకాలేజి, కంపనీవాళ్ల యూనివర్సిటీభవనాలు, మ్యూజియం, జనరల్ పోస్టాఫీసు, హైకోర్టుబిల్డింగులు, లారెన్సుగార్డన్లు, జూ, గవర్నమెంటుహౌస్, గవర్నర్ బంగళాలు, మెడికల్ కాలేజి బంగళాలూ ఇవన్నీ పది పన్నెండు మైళ్ళదూరం వరకూ వ్యాపించి ఉన్నాయి. ఇవి గాక వీని మధ్య మధ్య గొప్పయూరోపియన్ ఫరములూ, బ్యాంకీలూ, హిందువుల వర్తక వ్యాపార స్థానాలూ ఉన్నాయి. ఈలాగు పట్నం మితిమీరి అభివృద్ధి పొందడంచేత ఇప్పుడీగుడి లాహోరు యొక్క హృదయస్థానాన్ని ఆక్రమించింది. ఇంతవరకైన మహాంతులు కూడా దూరాలలో వన గలిగి గుడికి చుట్టుప్రక్కలా ఫర్లాంగుల కొలదీ వ్యాపించి ఉన్న తమ నివేశనస్థలాల్లో దివ్యమైన భవనాలను కట్టించి వదిలారు. అమ్మవారి గర్భగుడీ, దాన్ని ఆనుకొని ఉండే సౌధాలూ గాక దీనికి చెందిన మేడలు మిద్దెలు రెండుమూడుఫర్లాంగుల పర్యంతం వ్యాపించి వున్నాయి. సాలుకు వీటినుంచి అద్దెలమూలంగా అరవైవేలు వస్తాయి. మందిరానికి ఎదురుగా అనార్కలీ నుంచి రైలు స్టేషనుకు పోయే హైరోడ్డు ఉంది. ఈరోడ్డుమీదుగా సమానాంతరంలో సిటీకి దిగువగా గోల్ బాగ్ రోడ్డు ఉంది. ఈ గోల్ బాగ్ సిటీని ఆనుకొని తూర్పు దక్షిణ పడమటి పార్శ్వాల నాక్రమించి వలయాకారంగా ఉంటుంది. ఈ ఆకారాన్ని బట్టే దీనికి గోల్ బాగని పేరువచ్చింది. ఇది పూర్వం సిటీ చుట్టూ ఉండే అగడ్త. ఇంగ్లీషువాళ్లు ఈకందకాన్ని పూడ్చించి తోటకింద మార్చి మధ్య గుండా కేవలం మనుష్యులు నడవడానికి రోడ్డు వేయించారు. ఈరోడ్డు రెండువైపులా ఫర్లాంగు ఫర్లాంగు దూరంలో యెన్నో కాలిబాటలను వేయించి తోటనంతా ప్లాట్లుగా విభాగం చేశారు. ఈ తోటంతటా ఎప్పుడూ గజంవెడల్పు నీళ్లకాల్వ పారుతూ ఉంటుంది. ఈకాలవ నీటిని ఒక్కొక్కరోజు ఒక్కొక్క ప్లాటులోకి విడుస్తూవుంటారు. ఇందువలన ప్లాట్లన్నీ ఎప్పుడు చూసినా పచ్చని గడ్డితో నిండి మహా సుందరంగా ఉంటాయి. అప్పుడప్పు డీగడ్డిని మెషీన్‌తో కోస్తూ ఉంటారు. ఇవిగాక అనేకరంగుల పూలచెట్లూ, తీగెలూ, ఫలవృక్షాలూ ఈతోటయొక్క అందాన్ని రెట్టింపు జేస్తూ ఉంటాయి.

సాయంకాలమప్పుడు, ముఖ్యంగా ఎండాకాలంలో, ఈ గోల్ బాగులోని పచ్చిక బయళ్లన్నీ మనుష్యులతో నిండిపోతాయి. కొన్నిచోట్ల రాజకీయ సభలు, కొన్నిచోట్ల సాంఘికసభలు, కొన్ని స్థలాల్లో సాధువుల ఉపన్యాసాలు, మరికొన్నిచోట్ల ఫకీర్ల సంభాషణాలు. పండితులు పురాణాలు చెబుతూవుంటే, శ్రోతలు వలయాకారంగా కూర్చొని వింటూ వుంటారు మరికొన్ని స్థలాల్లో. మరికొన్ని ప్రదేశాల్లో కళ్లులేని సిక్కుపాటకులు హార్మోనియం ముందు పెట్టు

కొని వాయిస్తూ శ్రావ్యంగా పాడుతూవుంటే వింటూ ఉంటారు అనేక మంది. బలిగుడు ఆడేవాళ్ల జట్టీ లింకోవైపు. నంటి బిష్టలని మెత్తని గడ్డిమీద ఆడుకోడానికి వదలి పెడితే వాళ్లు బోరగిలపడి, మోకాళ్ల మీద నిలచీ గడ్డిపోచలిని నుప్పిడితో బట్టికొని లాగుతూవుంటే వాళ్ళని ఓరకంట చూస్తూ గుంపులు గుంపులుగ జేరి ముచ్చటలాడుతూ వుండే యువతులగు తల్లులు మరికొన్ని ప్రదేశాల్లో- ఈలాగు సాయంకాల మెరుగంటలయిన పిటప గోల్ బాగ్ స్థలాలన్నీ ఉత్సవాలతో నిండి కలకల్లాడుతూ వుంటాయి. * అమ్మవారి దర్శనానికి లోపలికి వెళ్లాలంటే మొదలు రెండు పెద్దద్వారాలని దాటాలి. ఇందులో మొదటిది ముఖద్వారం. ఈద్వారంమీద నౌకమేడ-దానిమీద గోపురాలు-ముఖద్వారం తరువాత మరో విశాలమైన ద్వార ముంది. ఈ రెండువరవాజాల్లో దృఢమైన తలుపు లున్నాయి రాత్రి ఏడు గంటలు కావడంతోటే ద్వారాలతల్పులను మూసివేసి వాటిమధ్య భాగంలో ఉండే కిటికీల్లాంటి చిన్నతల్పులని 9 గంటలవరకు తెరచి వుంచుతారు. ఆసమయంలో తీయకుండా పహరా వుంటుంది. ద్వారాన్ని దాటి లోపలికి పోవడంతోటే ఎదురుగుండా దేవీమందిరం. ఈదేవీమందిరం సంగమర్మరపు పలకలతో కట్టబడింది గోడల్లో నాలు గైదుమూళ్ల అద్దాల్ని పొదిగి బిగించారు. అదిగాక గోడలమీది భాగంలో అనేకవిధాలచిత్రా లున్నాయి. ఈ దేవీమందిరం సరోవరంలోని కమలంలాగు మహాసుందరంగా ఉంటుంది. ఈమందిరానికి నాలుగువేపులా పదిపన్నెండు గజాలమేర ఖాళీప్రదేశం. అనువుగ నాపబండలను పరిచారు. మందిరానికి ఎడమవైపు రెండంతస్థుల గదులు చాలా ఉన్నాయి. వాట్లల్లో గుడియొక్క మహంతులవారూ, ఎప్పుడూ అక్కడే ఉండేసాధువులూ వుంటారు ఈగదులను ఆనుకొని పాకశాలలు కొన్ని ఉన్నాయి ఈభోజనశాలలో అతిథులు, అభ్యాగతులు, వైరాగులు, బ్రాహ్మణులు, భిక్షుకులు అంతా కలిసి నూటికంటె ఎక్కువ మంది రోజూ రెండుపూటలా భోంచేస్తూ ఉంటారు. ఇందు కయ్యే ఖర్చంతా మందిరాదాయంనుంచే. దేవీమందిరానికి కుడివైపు శివాలయం; దానికి కుడిప్రక్కగా మరికొన్నిభవనా లున్నాయి. వీనిలో ఉత్తరంగా ఉన్నది చాలావిశాలమైన మూడంతస్తులమేడ. నేలమీద గదుల్లో, రెండవయంతస్తులోని ముందరిభాగపుగదుల్లో విద్యార్థు లుంటారు. గదికి ముగ్గురు నలుగురుచొప్పున యాభై అరవై మంది సుఖంగా ఉండడానికి దగిన గదు లున్నాయి. వీట్లలో ఎప్పుడూ తియ్యకుండా యాభైమంది విద్యార్థు లుంటారు. వీళ్లీ మందిరములోని పాఠశాలలో సంస్కృతము జదువుకొని పంజాబు యూనివర్సిటీ పరీక్షలకు తయ్యారవుతూ ఉంటారు. కాని పరీక్షలు జరిగేదినాల్లో మరినలభై యాభై మంది విద్యార్థులు పంజాబులోని అన్యప్రాంతాలనుండి వస్తారు. ఈ పరీక్షలు పంజాబు యూనివర్సిటీకి సంబంధించినవి. ఓరియంటల్ ఫాకల్టీ పరీక్షలనిగాని, ఓరియంటల్ టైటిల్సనిగాని వీటిపేరు. ఇవి అరబ్బీ, ఫార్సీ, సంస్కృతము, ఈభాషల్లో జరుగుతాయి. సాధారణంగా అరబ్బీ, ఫార్సీభాషలపరీక్షలకు మహమ్మదీయులు, సంస్కృతానికి హిందువులూ వస్తూవుంటారు. ప్రతిసంవత్సరం సంస్కృతం నిమిత్తం నాలుగువందల మంది విద్యార్థులు నానాప్రాంతాలనుండి వస్తారు. ఈ వచ్చినవాళ్లలో ఎక్కువమంది రైలుస్టేషను దగ్గర ఉన్న మూలచందు మందిరంలో దిగుతారు. తక్కినవాళ్లు శీతలామందిరంలో. ఈ రెండుచోట్లా దిగేవాళ్లకు ఒక్కనాగం పర్యంతం ఉచితంగా ఉండడానికి స్థలం, రెండుపూటలా భోజనం దొరుకుతుంది. ఈఏర్పాట్లనుబట్టే శీతలామందిరంలోగూడా కొన్నాళ్లు చాలామంది దిగారు.

ఇంతటితో ఇప్పుడు వీళ్లసంగతి వదలి మళ్లీ రాస్తాను. రెండవ యంతస్థులోని గదులకు వెనుకభాగాన్ని విశాలమైన శాల లున్నాయి. వాట్లల్లో పండితులు విద్యార్థులకు పాఠాలు చెబుతారు. ఈ మేడయొక్క మూడో అంతస్థుమీద ఒక్క కాపురానికి తగినగృహ ముంది. అందులో ముఖ్యాధ్యాపకు లుంటారు. అధ్యాపకులకూ, విద్యార్థులకూ మరో భోజనశాల ఉంది. దీనిఖర్చంతా మందిరాదాయంనుంచే. శివాలయానికి తూర్పు దక్షిణ పార్శ్వాల్ని మరికొన్ని మేడ లున్నాయి. వాటిలో అభ్యాగతులైన సాధువులూ, దేవీదర్శనం నిమిత్తం వచ్చి కొన్నాళ్ల పాటు ఉండే గృహస్థులూ దిగుతూ ఉంటారు.

ఇక ఈ దేవీదర్శనానికి ఒక్క హిందువులే కాదు, సమస్తవర్ణాల వారు వస్తారు. విగ్రహారాధనం వేదవిరుద్ధం, దాన్ని చేయడం మహాపాపం అని చెప్పే ఆర్యసమాజకుల యువతులు, ఏకేశ్వరోపాసనం మనం చేయ దగింది, ఈబొమ్మలపూజలన్నీ అనాగరికులవని బోధించే బ్రహ్మసమాజకుల భార్యలు, దేవునిదప్ప మరొక్కని పూజించడం దోషమని వాదించే దేవసమాజకుల స్త్రీలు, హిందూదేవాలయాల్లోకి పోవడానికి సమ్మతింపని జైనులకాంతలు, సంఘసంస్కర్తల ధర్మపత్నులు తమతమభర్తలు కార్యాంతరాలనిమిత్తం ఇల్లు వదలిపోవడంతోటే బిడ్డలని జంకబెట్టుకొనివచ్చి అమ్మవారిని దర్శించి వారితీర్థప్రసాదాలను దీసికొని పోతూ వుంటారు. లేకపోతే యేవేళ అమ్మవారు పోసి చంద్రబింబంలాంటి తమబిడ్డలు కురూపులైపోతారో అని భయం. భయంచేతనే భక్తి హెక్కువ. ముసల్మాను స్త్రీలుకూడా దేవిని మారాన్నుంచి దర్శించి పాదతీర్థం ముగాలని కొట్టించుకొనిపోతారు. వీరికి గర్భగుళ్లోకి పోవడానికి సీలులేదు. గర్భగుడివెలుపల వీరినిమిత్తం ఒక కిటికీ ఏర్పాటైఉంది. అక్కడికి వచ్చి ముసల్మాను యువతులు బిడ్డల నెత్తుకొని నిలుచుంటే పూజారి అమ్మవారి పాదోదకం తీసికొనివచ్చి వాళ్ల మొగాల మీద జల్లి వాళ్లిచ్చే ముడుపులను పోగుచేసికొని పోతూవుంటాడు. ఈ మందిరానికి పురుషులుకూడా వస్తూనే ఉంటారు. కాని స్త్రీలసంఖ్య అపరిమితము. మార్చి ఏప్రిల్ నెలల్లో గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. ఆరోజులలో రావడానికీ పోవడానికీ సందుదొరకదు. ఈఉత్సవాలు మొదలైనవానివల్ల అనేకవేల రూపాయల ఆదాయం.

* ముఖ్యంగా శీతలామందిరానికి ఎదురుగుండా ఉండేభాగంలో రోజూ తిరునాళ్లాగే వుంటుంది.

జాగంటలూ గంటలమోతలూ చెవిలో బడడంతోటే మన విద్యార్థులు ముగ్గురూ ఒక్కపరుగులో ముఖద్వారం జేరారు. అప్పటికే సగంహారతి కావస్తోంది. దాన్నిగనిపెట్టి వీళ్లు మళ్లీ క్షణంలో తమగదులకాడికి బరువైన పుస్తకాల్ని కిటికీల్లోనుంచే లోపలికి గిరాటు పెట్టి వచ్చి హారతిలో కలుసుకొన్నారు. ఇంతలో హారతి సమాప్తమైంది. వెంటనే ఇంతలా అవతలా ఉన్న విద్యార్థులందరూ అమ్మవారి యెదుట రెండుపంక్తులుగా నిలబడి మొదలు దేవ్యపరాధస్తోత్ర శ్లోకాలను పఠించారు. అందరూ ఒకేస్వరంలో రాగందీసి పఠిస్తూవుంటే వినేవాళ్లకి మహా ఆనందం కలుగుతుంది. ఈస్తోత్రాలను పూర్తిజేసి గర్భగుళ్లోనుంచి బయటికి వచ్చి ఎవరికి నోటికివచ్చిన శ్లోకాలను వాళ్లు పఠించుకొంటూ ప్రదక్షిణాలు చేశారు. ఇవి కావడంతోటే దేవికి ప్రణామాలుచేసి శివాలయం ఎదటకి వచ్చి పూర్వంలాగే బారులుదీరి నిల్చొని అందరూ వినాయకస్తోత్రాలు, శివస్తోత్రాలు పఠించారు. ఇది ముగియగానే మహాదేవునికి నందనాలు జేసి వీళ్లు మహాంతులవారి దగ్గరకు బరుగెత్తిపోయి వారిపాదాలకు నమస్కారంజేసి, అంతవ బూర్వమే యెక్కడకేరి మహాంతుగారి ప్రక్కని కుర్చీలమీద కూరుచున్న అధ్యాపకులకు దండంపెట్టి వారియెదుట నేలమీద కూర్చున్నారు. దర్శనానికివచ్చిన గృహస్థులు మరోప్రక్కను కూర్చున్నారు. ఏదో సంభాషణ అవుతూవుంది. మహాంతు గారు కులాసామనిషి; మంచి ఉదారబుద్ధి కలవారు. ఎల్లప్పుడూ ప్రసన్నవదనంతో ఉంటారు. వీరి అన్నక్షేత్రంలో రోజూ భోంచేసే వాళ్లు మూడువందలమందికి తక్కువ గారు. దగ్గర ఉన్నవాళ్లు కొందరు ఇంతఖర్చు ఎందుకని ఏడుస్తూ ఉంటారు. కాని వీరు వాళ్లమాటల్ని లక్ష్యమే చెయ్యరు. విద్యార్థులమీద చాలా ప్రేమ. కులాసా పుట్టిందంటే నూరు నూటయాభై రూపాయలు ఖరీదుచేసే పండ్లబుట్టలు ఒక్కనిమిషంలో వచ్చిపడతాయి మాస్తూ చూస్తూవుండగానే విద్యార్థులు తోట్లాతొక్కలూ మిగిల్చేస్తారు. ఒక్కొక్కసమయంలో క్షీరాన్నాలు, మోహనభోగాలూ ఎగురుతూ వుంటాయి. కాని వీరిది మహానిర్లక్ష్యస్వభావం. తనమీద కేదైనా విపత్తు వస్తుందని తెలిసినప్పటికీ వచ్చినతర్వాత తంటాలు పడడమేకాని ముందుగానే తప్పించుకోడానికి ప్రయత్నంజేసే స్వభావంకాదు. గృహస్థులు వీరితో మాట్లాడుతూ ఉన్నది ఢిల్లీబజారు విషయమే. వీళ్లేదో సలహా ఇస్తూవుంటే మహాంతుగారు దానిని పాటించడంలేదు—వీరు నిర్లక్ష్యంగా నవ్వుతూ "ఇలాంటి విదివరకెన్నో జరిగాయి—కొత్త గాదు. ఇప్పుడంతగా మనతలమీది కేం వచ్చింది?" అన్నారు.

"నిజమే కానివండి—వాటికీ వీటికీ చాలా భేదావుంది. మేంగూడా అన్నీ చూస్తున్నాం కాదూ. కాని ఇవ్వాళ సాయంకాలం స్థితిని చూస్తే ఏదో గొప్పఉపద్రవం అయ్యేలాగే కనిపిస్తోంది. ఏలాగైనా మన ప్రయత్నంలో మనం ఉండడం మంచిది. మనం కలహానికి దిగకపోయి నప్పటికీ ఒకవేళ మనమీది కేదైనా వస్తే తప్పించుకోనైనా వద్దా?"

"ఎవళ్లో సిక్కులూ తురకలూ పోట్లాడుకుంటే మనకు వచ్చిన భయమేమిటి? మనమూ తురకలకీ ఏమైనా విరోధం ఉందా—మీరన్నట్లు జరుగుతుం దనుకోడానికి? ఎంతమంది తురకాళ్లు వస్తూవుంటారో చూశారా మన దేవికి మొక్కడానికి?"

"మీరాలాగు సెలవిస్తే మేమేం జెప్పాలి? వీళ్ల మీద మీకంతటి నమ్మకం ఏలా కలిగిందో తెలియడంలేదు. వీళ్లు సిక్కులనీ మనల్ని వేరువేరుగా చూస్తారా? కాఫిర్లంతా ఒకటే వీరిదృష్టికి. తప్పెవళ్లదైనా, విరోధం ఎవళ్లతో ఉన్నా దాన్నంతా ఆలోచించరు—ఎవళ్లు చిక్కితే వాళ్లమీదే చూపిస్తారు తమ శౌర్యాన్ని. ఇంతవరకెన్ని పోట్లాటలో అయ్యాయి. వాటివిషయమై మన మేం వింటున్నాం? కలహాలు తగ్గిపోయిందర్వాతగూడా ఎవడైనా గ్రహచారంచాలక ఒంటరిగా దొరికాడంటే హాంఫట్టే. బహుభిగతం పట్టిస్తూవచ్చారు."

"అయితే ఇప్పుడు మీసలహా ఏమిటి? ఏం చెయ్యమంటారు చెప్పండి."

"చేసే దేముందీ? ముందుగానే ఠాణాలో రిపోర్టుచేసి ఇరవై ముప్పైమంది పోలీసువాళ్లను పిలిపించి రేపుపగలంతా మందిరంలోపలా బయటా కాపలా పెట్టించండి. సాయంకాలందాకా ఉండి వెళ్లిపోతారు. ఇందులో మనకు వచ్చే నష్ట మేమిటి?

బిగ్గరగా నవ్వుతూ—"మంచిబుద్ధిగల బయల్దేరారు—మహావ్వా—ఇలాంటందాలి ఆగ్రసంతో నాలస్యమంటే—ఎప్పుడో! ఏదో వస్తుందని ముందుగానే వెళ్లి పిరికాళ్లట్టుకోవాలి! నామాటగూడా కొంచెం వినండి. మనదుర్గ అనుగ్రహం ఉన్నంతవరకూ మన కేం భయం లేదు. నాకు బాగానమ్మకం—మీరుమాత్రం నిశ్చింతగా ఉండండి. మ్యాగ్దాం, మనమందిరాని కేం ముప్పు వస్తుందో."

గృహస్థుల కిక మాట్లాడడాని కేమీతోచిందికాదు. మహాంతుగారి పట్టుదలవాక్యాలవల్ల వీళ్ల కోమాదిరి సంతోషంగూడా కలిగింది. ఇంతలో విద్యార్థుల భోజనానికి గంట వినవచ్చింది. ఒక్కక్షణంలో వాళ్లు స్థలాన్ని ఖాళీచేసి తిన్నగా భోజనశాలలో చేరారు. తరువాత గృహస్థులుకూడా మహాంతుగారికి దణ్ణాలుబెట్టి వారిసెలవు దీసికొని ఎవళ్లదోవని వాళ్లు వెళ్లారు.

క్రమక్రమంగా తొమ్మిది పది పదకొండు గంటలైంది. నగరమంతా క్రైస్తవుల ఆదివారపు నర్కుషాపు క్రింద మారుతూ ఉంది. అనార్కలీ బాజారులో, వీథివీథుల్లో మిఠాయి దుకాణాలు, తమలపాకు బీడాల దుకాణాలు మాత్రం తెరచి వున్నాయి. కాని వాటిదగ్గర అంత అలజడి ఏమీ లేదు. అప్పుడప్పుడు రసికశిఖామణు లెవ్వరో వచ్చి మిఠాయీలనీ, బీడాలనీ, కొనుక్కొని పోతూవున్నారు. అత్యంత ప్రకాశమానము లైన ఎలెక్ట్రిక్ దీపకాంతులు ఉపరిభాగాన్ని ప్రసరిస్తూ వున్నందు వలన చూసేవాళ్లకి నగరాధిదేవతయొక్క శిరోభాగమున జాజ్వల్యమానముగ వెలుంగు తదీయచ్ఛాయామండలమా అని

పిస్తూ ఉంది. ఇద్దరిద్దరు లేక ముగ్గురూ కలసి పోలీసువాళ్లు గస్తీని నిర్వర్తిస్తూ ఉన్నారు. వీళ్ల కుడిచేతుల్లో పొడుగుపాటి దృఢమైన లాఠీ కర్రలు, ఎడమ భుజాలమీద కంబళ్లు ఉన్నాయి

శీతలామందిరమంతా విద్యుద్దీపాలతో వెలిగిపోతూ ఉంది. మహంతుగారి నిశ్చింతస్వభావము అందరికీ తెలిసిందే. సమస్తమూ పరిత్యాగము చేసిన వీరివంటి వారికి ఈ అనిత్యసంసారపు గొడవలతో పనేముంది? వేళ కింత నల్ల కడుపులో బడితే చాలు. ఇక లోకమంతా అటు ఇటైనా వీరి కేమీ చింతవుండదు. పదకొండు గంటలకు కొంచెం పూర్వమే వీరు శయనమందిర మాక్రమించారు. ఇప్పుడు నిద్రాదేవి ఉపగూహనాల్లో వీరికి దేహస్మృతే లేదు. ముఖద్వారాల దగ్గర వున్న పహరావాళ్లు డెయిలీ మాగ్రీకేములాంతర్లని వెనుక పెట్టుకొని కునికిపాట్లు పడుతూ కూర్చొన్నారు. వీళ్లకు నిద్ర ఎక్కువైన అవుతూ ఉన్నట్లు కన్పిస్తుంది. వీళ్లు నేలమీద కూర్చున్నారు. తలలు మెల్లగా వంగుతూ వంగుతూ వచ్చి టక్కున నేలమీద తగిలేటప్పటికి నవ్వుతూ మళ్లీ కళ్లు తెరచి తలలు పైకెత్తుతూ వున్నారు. తక్కిన నౌకర్లుగూడా పగలంతా పనిపాటలు చేసి వున్నవాళ్లు కావడం చేత పక్కలమీద వాలంగానే అప్రయత్నంగా తెలియకుండానే మైకంకమ్మింది. కళ్లు మూతలు బడిపోయినాయి. కాని పరీక్షార్థివిద్యార్థులు మాత్రం ఇంకా మేలుకొనే ఉన్నారు. తెల్లవారితే మూడో పేపరు. అందునిమిత్తం వచ్చేనిద్రను చాల కష్టంమీద అదుముకొంటూ పుస్తకాలను తిరగేస్తూ ఉన్నారు. పన్నెండైంది. ఒంటిగంటకూడా కానచ్చింది. పట్నమంతా పూర్తిగా మాటు మడిగి పోయింది. నాల్గు వేపులా నిశ్శబ్దరాజ్యం. అలాంటి నితాంత నీరవమైన సమయంలో ఉన్నట్టులుండి హఠాత్తుగా హోగోస్టుమీద గుర్రమొకటి వాయువేగంతో పరుగెత్తినట్లు ధ్వని వచ్చింది. మేలుకొని ఉన్నవిద్యార్థులు అర్ధరాత్రివేళ అలా పరిగెత్తడం దేనికి? అని ఆలోచిస్తూ ఉండగానే మరికొన్ని గుర్రాలు దంయ్యమని పరిగెత్తాయి. వెంటనే లేచి వీళ్లు హాస్టళ్లలో ఉన్న కిటికీల దగ్గరకు పరుగెత్తుకొని పోయి చూసేసరికి రిజర్వుపోలీసు సోల్జర్లతో నిండి వున్న రెండుమూడు మోటారు బస్సులు గాండ్రిస్తూ పరుగెత్తాయి. కొంచెం పైగా ఉన్న గోల్ బాగ్ రోడ్డుమీదుగా పదిహేను ఇరవై మంది పోలీసువాళ్లు అమితవేగంగా పరిగెత్తారు. వీళ్లంతా చూస్తూ చూస్తూ ఉండగానే శాల్మీ దర్వాజా గుండా సిటీలో ప్రవేశించి అంతర్ధానమైనారు. ఏకారణంచేత ఎక్కడికి వెళ్లారో తెలియదు. అప్పుడు బయటికి పోవడానికా వీలులేదు. ద్వారాలన్నీ తాళాలతో వున్నాయి. కాని సిటీలో ఎక్కడనో బాగా గందరగోళమై వుంటుందని ఊహించుకొని గదుల్లోకి తిరిగి వచ్చి పక్కలమీద శరీరాలను వాల్చారు. కండ్లు మూసుక పోయ్యాయి. ఈపరీక్షల కని వీళ్ల కన్నాళ్ల నుంచో కంటినిండా నిద్రే లేదు. పాపం వొళ్లెరుగని నిద్ర వచ్చింది ఈక్షణంలో. తర్వాత ఏం జరిగిందీ వీరికీ తెలియదు. కాని సమస్త బ్రహ్మాండాన్నీ నిద్ర ఆవేశించి నప్పటికీ మేలుకొని ఉండేది ఒక్క కాలమే. ఈ కాలపురుషుని గతివిన్యాసం మహావిచిత్రమైంది. దీనికి నిరోధమునేది లేనేలేదు. ఈ పురుషుని కెప్పుడూ ముందుచూపేకాని వెనుకచూపు లేదు. లక్షలకొలది పుట్టినా గిట్టినా సరే; భూకంపాలుద్భవించి స్థలం జలంగా, జలం స్థలంగా మారిపోయినా సరే; జ్వాలాముఖీ పర్వతాలు పగిలి చుట్టూ ఉండే గ్రామాలూ నగరాలూ నామనిశ్శేషమై పోయినా సరే; మహాభయంకరసంగ్రామాలై రాజ్యాలకు రాజ్యాలు తల్లక్రిందులై పోయినాసరే; యీ మహాపురుషుని అడుగు ముందు పడుతూనే ఉంటుంది కాని ఆగదు. తృణకల్పులమైన మనకు ఉద్వేగం, ఆతంకం, విషాదం, మనోవ్యథా కలిగించి బుద్ధినికూడా చలింపజేసే భయానకఘటనాలన్నీ ఈకాలవిశ్వరూపుని పాదాల క్రింద గడ్డిపరకల్లాగు ఊరుపేరు లేకుండా నలిగి పోతూ వుంటాయి. అట్టి యీమహాకాలుని ముందు ఆరాత్రి లాహోరు బజారుల్లో జరిగిన సంగతు లో లెక్కా? రాత్రి గతించిన వాట్లో లెక్కైంది. మే నెల మూడోతారీఖు ప్రవేశించింది. నగరమంతా యథాపూర్వం నానావిధధ్వానాలతో నిండిపోయింది. మైమరచి నిద్రించిన విద్యార్థులుగూడా లేచి తొందరతొందరగా నిత్యకృత్యాలూ, స్నానాలూ జేసికొని యూనివర్సిటీ హాలుకు బోవడానికి తయ్యారైనారు. హాలుకు పోయ్యేముందు వీరందరికీ ఖుష్టే లస్సీ దొరకింది. ఖుష్టేలస్సీ అంటే పంచదారకలిపిన తియ్యని చిక్కనిమజ్జిగ. ఈదేశంలో చలికాలమందు అపరిమితమైన చలిఅయినప్పటికీ ఎండాకాలంలో ప్రచండమైన వేడిమికూడా దాన్నే జ్ఞాపకంచేయిస్తూ వుంటుంది. అందుచేత ముఖ్యంగా పంజాబీలూ, సింధీలూ వీలైనన్ని సాగ్లు సర్దాయీలు, ఖుష్టేలస్సీలు, మీఠీలస్సీలు, షర్బత్తులు ఎగబోస్తూ వుంటారు. ఎన్నిసార్లు తాగినా వద్దనిపించదు. దాహానికి పగిలినట్టు పొట్టనుకూడా ఎందుకియ్యలేదా అని దేవుడిమీద పరిహాసం కోపం వస్తుంది. మిట్టద్రవాల్ని కుతికల బంటిగా ఎక్కించినప్పటికీ దాహం తీరదు. నాలిక లాక్కుపోతూ ఉంటుంది. ఇంకా తాగాల్ననే అనిపిస్తుంది. వీటన్నిటిలో ఖుష్టేలస్సీ ముఖ్యమైంది. దీన్ని తాగి ఏపనికైనా వెళ్లితే ఆపని తప్పకుండా నెరవేరుతుందని అక్కడివాళ్ల అభిప్రాయం. ఆకారణాన్ని పరీక్షలకు గాని, ప్రయాణాలకుగాని, మరి శుభకార్యాలకుగాని వెళ్లేముందు చిక్కని మజ్జిగలో పంచదార కలిపి తాగిస్తారు. మహంతుగారి అనుగ్రహంవల్ల విద్యార్థుల కందరికీ పుష్కలంగా దొరికింది లస్సీ. తాగి త్రేన్చుకొంటూ బయల్దేరారు పరీక్షాభవనానికి పోవడానికి. దారిలో వీళ్లకు అనార్కలీ తగులుతుంది. ఆబజారులో ప్రవేశించేటప్పటికి అక్కడున్న వాళ్లందరూ గుంపులు గుంపులుగా కూడి మాట్లాడుకొంటున్నారు. అందరిమొగాలూ విపరీతంగా మారిపోయి ఉన్నాయి. విచారిస్తే రాత్రి సిటీలోని డబ్బీబజారులో రెండు ఖూనీలు జరిగాయనిన్నీ, అందుచేత తురకలు హడతాలు చేస్తారనిన్నీ తెలిసింది. కాని పరీక్షకు వెళ్లాలనే తొందర మీద ఆవిషయాన్ని గురించి ఎక్కువగా మాట్లాడడానికి వీల్లేక వీళ్లు తిన్నగా యూనివర్సిటీకి బరిగెత్తి హాల్లో చేరుకొన్నారు. ప్రశ్నపత్రాలు

చేతి కందాయి. రాయడం మొదలెట్టారు కాని మనసుకి స్థిమితం కుదిరింది గాదు. ధ్యానం పరిపరివిధాల పోయింది. బజార్లో విన్నదాని మీద అభిలాష యెక్కువైంది. మనస్సును బిగబట్టుకొని రాస్తూ వుండేవాళ్లు; కాని తెలియకుండా నప్పున పరుగెత్తేది వీధిలోకి. ఈప్రకారం తికమకలౌతూ రాశారు. మూడుగంటలూ నిమిషంలాగు ఎగిరిపోయ్యాయి. పదిగంటలయ్యేసరికి పేపర్లను ఇచ్చి బయటికి వచ్చేటప్పటికి మాల్‌రోడ్డంతా పోలీసులమయంగా గాన్పించింది. సోల్జర్లూ, సిపాయీలూ గుర్రాలమీద పహరా చేస్తున్నారు. అనార్కలీలోకి వచ్చేటప్పటికి అక్కడా ఇదేదృశ్యం కన్పించింది. షాపులన్నీ వేసున్నాయి. సాధారణంగా ఏడుగంటలు కొట్టకపూర్వం ఎవరూ దుకాణాలను తెరవనే తెరవరు. కాబట్టి పొద్దున వెళ్లేటప్పుడు హడతాలు అవుతుందని కాని, కాదనికాని నిశ్చయించుకోడానికే వీలైంది కాదు. కాని, ఇప్పుడో, పది దాటింది. ఈపాటికి షాపులన్నీ తెరిచి వుండాలిసింది. అలాగు లేవు. తురకల షాపులన్నీ మూసివున్నాయి. తెరిస్తే తమవాటిని ఎక్కడ లూటీచేస్తారో అని హిందువులుకూడా దుకాణాల్ని కట్టిపెట్టారు. అనార్కలీ ఈచివరనుంచి ఆచివరవరకూ ఏదోనిమిది దుకాణాలు మాత్రం తెరచి వున్నాయి. ఇప్పుడు సంగతులన్నీ బాగా తెలిశాయి. గతించినరాత్రి పన్నెండు దాటిన తర్వాత డబ్బీబజారులో ఇద్దరు తురకాళ్లని సిక్కులెవరో నరికేశారట. అందుచేత మహమ్మదీయులంతా మండిపడి పోతున్నారు.

ఈ గోలల్లో ఇంకోతమాషా జరుగుతూ వచ్చింది.

ఏ ప్రయివేటు కారణాలచేత ఖూనీలు జరిగినా వాటిని మతసంబంధమైన మరణాలుగానే భావించి చచ్చినవాళ్ళని ధర్మవీరులని ప్రకటనం చేస్తూ వుండేవాళ్లు. ఈలాగు వూరూ పేరూ లేనివాళ్లెందరో శహీదులయ్యారు. శహీదులంటే ధర్మంకొరకు ప్రాణం విడిచినవాళ్లు. అంచేత ఇప్పుడు ఈ చచ్చినవాళ్లిద్దరూ శహీదులనిన్నీ, వాళ్లని పట్నమంతా ఊరేగించి దఫనంచెయ్యాలనిన్నీ పట్టుబట్టారు తురకలు. ఇదివరలో హిందువులు, ముఖ్యంగా ఆర్యసమాజంవాళ్లు ఈలాటి ధర్మవీరులను కొందరిని ఊరేగించి దహనంచేశారు, కాని ఆసమయంలో విశేషాలేమీ జరిగాయి కావు. అలాగే యివ్వాళకూడా అవుతుంది కాబోలు. అందుకనే ఈ అడావిడీఅంతా-అనుకొని విద్యార్థులు తమతమ నివాసాలకు చేరుకొన్నారు. మధ్యాహ్నం భోజనాలయ్యాయి. భోజనాలు కావడంతోటే మర్నాటి పరీక్షకు కావలసిన గ్రంథాలను జంకపెట్టుకొని ఏరావీతీరానికో, ఏతోటల్లోకో ఏయితరమందిరాలకో పోతూవుండేవారు. అక్కడ ఏకాంతంగా ఉండే ప్రదేశాల్లో కూర్చొని ఎండ చల్లబడేదాకా చదువుకొని తరువాత కుటీరాలకు చేరుకోడం అలవాటు. కానీ పట్నమంతా హడతాలని అడావిడిగా ఉన్నందువల్లా,తురకల ఊరేగింపు సమయాన్ని ఏంగందరగోళాలు జరుగుతాయో అనీ కొందరు బయటికి పోవడం మానేశారు. మరికొందరు ఊరేగింపు చూడాలనే అభిలాషతో వెలుపలికి పోలేదు. ఏలాగైతేనేం ఒకర్ని జూచి ఒకరు అంటూ బయటికి వెళ్లడం మాని ఆమందిరంలోనే యిటూఅటూ సర్దుకొన్నారు. గర్భగుడిచుట్టూ ఉన్న వసారాలో కొంతమంది, అక్కడికి వెనుకభాగంలో ఉన్నతోట్లో కొందరూ చేరి చదువుకోడం మొదలెట్టారు. ముఖ్యాధ్యాపకులు మూడో అంతస్థుమీద కూర్చొని కొందరు విద్యార్థులను మర్నాటి పరీక్షకు తయ్యారుచేస్తూ ఉన్నారు. రెండవ మేస్టరు పాఠశాల్లోనే కూర్చొన్నారు. ఆయన విద్యార్థులేవిషయమైనా అడిగితే వాళ్లకు సమాధానం చెబుతున్నారు. అంతటా మహాశాంతంగా ఉంది. రెండు గంటలైంది. తురకల ఊరేగింపు వస్తుందని తెలిసింది మందిరంవాళ్లకందరికీ. వెంటనే ఇవతలా అవతలా కూర్చొని చదువుకోడానికి పోయిన విద్యార్థులూ, మందిరంలోని నౌకర్లూ, దేవీదర్శనం నిమిత్తం బయటినుంచి వచ్చిన వాళ్లూ అందరూ ఊరేగింపు చూడడాని కెగబడ్డారు. మూడో అంతస్థుమీద నిల్చున్నవాళ్లకు శాల్మీ లోహారీదర్వాజాల పర్యంతం గోల్‌బాగ్‌లో గాని హైకోర్టుమీదగాని ఏం జరిగినా బాగా కనబడుతుంది. అందుచేత ఎక్కువమంది అక్కడే పోగయ్యారు. పాఠశాల్లోని కిటికీల దగ్గర సందులేదు. ముఖద్వారం ఒకరెక్క వేసిఉంది. రెండో రెక్కను గూడా సగంవరకూ మూసి వుంచి ముప్పైనలభైమంది తేనెటీగల్లాగ మూగి నిల్చున్నారు. ఇదేప్రకారం ఆరోడ్డుకు రెండువైపులా ఉన్న మేడలన్నీ చూసేవాళ్లతో నిండిపోయ్యాయి. ఇంతలో శాల్మీదర్వాజా గాటి బయటికి వచ్చిన ఊరేగింపులోనుంచి "లాఇలాహీ ఇల్లల్లాహ" అనే రబ్బకేకలు వినవచ్చాయి. అందరికంటే ముందు ఎర్రతలగుడ్డల దర్శనమైంది. వీరి వెంటే రెండుమూడువేలమంది తురకలూ, తరువాత శవాలూ, వీటితరువాత మళ్లీ ఇరవై వేలమందిమహమ్మదీయులు. ఇందులో ఈశవాలకి ముందూ వెనకా ఉన్న మూడు నాలుగు వేలమంది తురకలూ ఒక్కధ్వనిగా "లాఇలాహీ ఇల్లల్లాహ" అని అరుస్తున్నారు. మధ్యమధ్యకూడా పోలీసువాళ్లున్నారు. అందరూ తురకలే. క్రమక్రమంగా శవాలు మందిరంఎదటికి వచ్చాయి. ఇప్పుడు మందిరాని కివతలా అవతలా శాల్మీలోహారీల మధ్యభాగమంతా మహమ్మదీయులే. అసలే వీళ్ల కేకలు ఆకాశాన్నంటుతూఉన్నాయి. అప్పుడు లాఇలాహీ తప్ప వేరేశబ్దం వినరాలేదు. మందిరముఖద్వారంలో ఉన్నవాళ్లంతా తన్మయులై నోళ్లు తెరుచుకొని చూస్తున్నారు.

మందిరం ఎదటికి రావడంతోటే వీళ్ల కేకలు పదిరెట్లెక్కువయ్యాయి. కేకలు ఎక్కువ కావడంతోపాటు అరిచేవాళ్లకు ఆవేశం పెరిగింది. మొగాలు ఎర్రబారాయి. చూస్తూచూస్తూ ఉండగానే పొగుపు తెలుసుకున్నంత వ్యవధానంలో ఈఆవేశమెక్కిన తురకల గుంపొకటి ముఖద్వారానికి పదిగజాలముందుగా రోడ్డుమీద ఉన్న సోడాలిమ్నేడ్ దుకానంమీద పడింది. వెంటనే ముఖద్వారంలో పోగైఉన్న హిందువులందరూ ఒక్కపెట్టున లోనికి విరుచుకొని పడ్డారు. మహంతుగారు ఉన్నది ఈగుంపులోనే. వీళ్లంతా రెండో



చెన్నపురి బ్రహ్మసమాజ స్త్రీశాఖా భాద్రోత్సవసమావేశము



మద్యపాన నిషేధప్రచారమునకైన స్త్రీల సమావేశము—చెన్నపురి



శ్రీ మోరోపంతు జోషీగారికి 'మదరాసులీగు' వారి విందు



చెన్నపురి క్రైస్తవ యువతీసంఘపు వినోదప్రదర్శనమున పాల్గొన్నవారు



సేవాసదన సంఘసభ్యులు—చెన్నపురి

రెక్కను మూసి అతిప్రయాసంమీద గొళ్లెం తగిలించారు. ఇంకా గొళ్లెం తగిలించడం పూర్తిగానేలేదు. సోడాలిమ్నేడ్ సీసాలు వడగండ్లలాగు ద్వారంమీద పడడం మొదలెట్టాయి. ఒకమాదిరి తలుపులే అయితే క్షణంలో ఎగిరిపొయ్యేవి కాని లోహంలాటివి కాబట్టి బయటివారితోపులనూ, సీసాలప్రహారాలనూ తాళుకొన్నాయి. ఇంతలో సీసాలజడివాన మందిరంమీద అన్నిప్రక్కలా కురియడం మొదలైంది. నాలుగైదు నిమిషాల్లో లిమ్నేడ్ షాపుఖాళీ. తరువాత చేతికందిన వానినెల్ల మందిరంమీద రువ్వడం మొదలెట్టారు తురకలు. బయట ఊరేగింపు నిలిచిపోయింది. లాఇలాహీ కేకలు మరింత మిన్నుముట్టుతున్నాయి. ఇప్పుడు కేవలం ముఖద్వారంమీదే కాదు ఆక్రమణం. ఇటూఅటూ ఉండే మందిరానికి సంబంధించిన మేడలమీదకూడా మొదలైంది. ఇంక కొన్ని నిమిషాల్లో ఏమౌతుందో తెలియదు. లోపలివాళ్లకు ఏంచెయ్యాలో పాలుపోకుండా ఉంది. మహంతులవారు మందిరమంతటా పరిగెత్తడం మొదలెట్టారు—పాపం వారి మొగమిప్పుడు ఉత్కంఠాపూర్ణమైంది. వీరికే కాదు. లోపల ఉన్నవాళ్ల మొగాలన్నీ భయోద్రేకంతో నిండిపొయ్యాయి. మహాఆందోళనంగా నాలుగుమూలల పరుగెత్తుతున్నారు. క్రింది అంతస్తులో నేలమీద ఉన్నవాళ్లందరూ కింకర్తవ్యమూఢులై కంగారు పడుతున్నారు. ఇంతలో హఠాత్తుగా మూడో అంతస్తుమీదినుంచీ, పాఠశాలకిటికీల్లోనుంచీ బయట ఆక్రమణం చేస్తున్న తురకతండాలమీద ఇటికరాళ్ల వాన కురియడం ఆరంభించింది. ఈవిపత్సమయంలో ఏమి చేయడానికీ పాలుపోక కొట్టుకొంటూ ఉన్న విద్యార్థులు లోనగువారికి తురకలే పథప్రదర్శకులై మహోపకారం జేశారు. ప్రాణాలను రక్షించుకోడానికి వేరోమార్గం గానక లోపలివాళ్లందరూ బయటితురకల మార్గం అవలంబించడానికే నిశ్చయించుకొన్నారనుకొంటాను. లోపలనుంచికూడా బయటివాళ్లమీద రాళ్లవాన ఆరంభించింది. వాటిని దీసికొని తురకలు మళ్లీ మందిరంవాళ్లమీద రువ్వడం మొదలెట్టారు. కాని ఎత్తుగా ఉండడంవల్ల పైవాళ్లకు తగిలేవికావు. మీదినుంచి వచ్చే ఇటుకలప్రహారాలుమాత్రం క్రిందగుంపులో పడడం మూలాన్ని ఎవరికో ఒకరికి తగులుతూవచ్చాయి. ఈపని ఆరంభమైన రెండుమూడు నిమిషాల్లో మందిరంముందరిభాగమంతా ఖాళీఅయిపోయింది. వెలుపలినుండి కురిసే యిటుకలవర్షం స్తంభించింది. తురకలమూకలు ఆక్రమణం మాని మందిరంలోనుంచి వచ్చేఇటుకలను తప్పించుకోడానికి దూరంగా పోయి నిలుచోని పండ్లుకొరకడం మొదలెట్టారు. ఇంతలో పోలీసుసిబ్బంది పోగైంది. సబ్ఇన్స్పెక్టర్లందరూ గుర్రాలుదిగి మందిరంముందు చేరి తలుపులు తెరవమన్నారు. పోలీసువాళ్లు వచ్చారనే ధైర్యంతో లోపలివాళ్లు తలుపులు తెరచారు. ఇంతవరకూ ఏలాగో ప్రాణాలని రక్షించుకొన్నాము; ఇక మనరక్షకులు వచ్చారు. మనలని తప్పకుండా రక్షిస్తారు. అని సంతోషపడ్డారు గుళ్లోవాళ్లందరూ. కాని తలుపులు తెరవంగానే వీరనుకొన్నదానికి భిన్నంగా జరిగింది. పోలీసువాళ్లు లోపల ప్రవేశించి ఊరేగింపుమీద రాళ్లువేశారనే నేరం మోపి అక్కడ ఉన్నవాళ్లందరినీ అరెస్టుచేయడం ప్రారంభించారు. పాపం మందిరంవాళ్లు ఒకచావునుంచి తప్పించుకొంటే మరోచావు వచ్చింది. గుడితురకలచేతుల్లో పడడం తప్పిపోయి పోలీసుచేతుల్లో బడింది. నలుబదైదుగురు నప్ప తక్కినవాళ్లంతా పదునుటికి ముక్కవాళ్లే. తమవాళ్లనోట్లో పడడానికి తీరాసిద్ధమైన చెరకుముక్క నీమందిరంవాళ్లు ఎగరగొట్టేశారు కదా అని వీళ్లకు కాఫర్లమీద కోపం రావడం స్వభావానికి విరుద్ధం గాదు. కాని ఈ ఉక్రోషాన్ని లోలోపల మింగుకోవలసిందేకాని బయటికి వెల్లడిచేయడం ఏలాగా? ఏప్రకారమైతేనేమి, వీళ్లు నోళ్లులేని విద్యార్థులమీద చేయిజేసుకొనీ, గదులు వెదకాలనేనెపంతో తలుపులను బద్దలుకొట్టి, కిటికీలను పొడుంజేసీ, బీరువాలను నాశనంజేసీ, తమకసిని దీర్చుకొన్నారు. మూలమూలలా వెదకి అయినవాళ్లనీ కానివాళ్లనీ కంటికి గనబడ్డవాళ్లందరినీ పట్టుకొనివచ్చి ఒకచోట గర్భగుడికి ప్రక్కగానే కూచోబెట్టారు. ఈరక్షకవర్గమువారి అంతర్యామిత్వము, సర్వజ్ఞత్వము నెంతని పొగడాలి! ఏంజరుగుతుందో చూద్దామని అక్కడికెవరైనా వస్తే యీసర్వజ్ఞులు వాళ్లనుగూడా గుళ్లోవాళ్లకిందగట్టి పట్టుకొన్నారు. తమప్రాణాలనిమిత్తం ప్రయత్నించిన యీమహాపరాధులచుట్టూ ఈఅంతర్యామిలపహరా. నిజం విచారింపగలిగేవాళ్లంటే ఆసమయాన్ని ఈరక్షకభటులున్నూ, వీరి అనుయాయులున్నూ గావించిన దుర్నయాలూ, దుండగాలూ గుళ్లోవాళ్లు చేసినదానికంటె వందరెట్లెక్కువని గ్రహించియుంటారు—కాని విచారించే దెవరు? వీళ్లు చేయడం మొదలిడింది న్యాయంకాదని ఎందరో వాదించారు. అందువల్ల లాభం లేకపోగా వేడుకొన్నారు. కాని వీళ్లకు వినాలనివుంటేగా! ఎవరెంత బతిమాలుకొన్నా వినేమిరా. ఆఖరికి ఈపట్టుకొన్నవాళ్లందరినీ అనార్కలీ జైల్లో ప్రవేశపెట్టాలనుకొన్నారు. పాపం, వీళ్లలో అధ్యాపకులూ, మందిరం విద్యార్థులూ, పరీక్షలకు వచ్చినవాళ్లూ, దేవీదర్శనానికి వచ్చినగృహస్థులూ, హఠాత్తుగా వచ్చి చిక్కుబడ్డవాళ్లూ నూటముప్పైమందికంటె ఎక్కువగా ఉన్నారు. తురకలకు బదులుచెప్పడం వీళ్లు చేసింది అపరాధమే అయినయెడల అట్టిఅపరాధులు వీరిలో కేవలం కొద్దిమందే; నిరపరాధులే యెక్కువ. కాని అందరినీ ఒకేబెత్తంతో తోలారు. మహంతులవారిని మాత్రం మంచిదీర్ఘాలోచనజేసి వదిలారనుకొంటాను. వీరినిగూడా పట్టుగెల్తే తరువాత జరిగే తంతు అంతా ఏలాగు జరగాలి?

షుమారు ఏడుగంటలయింది. దీపాలన్నీ వెలుగుతున్నాయి. మామూలుగా ఈవేళప్పుడు అనార్కలీని చూస్తే నిజంగా అనార్కలీని (దానిమ్మకలిక) చూసినలాగే ఆనందం కలుగుతుంటుంది. పగలు పనిపాటలకు వెళ్లినవాళ్లంతా ఈసమయాన్నే పోగవుతారు, కావలసిన సామానును కొనుక్కోడానికి. మేములుకూడా, తమవాళ్ల లిమిటెడ్ షాపుల్లోకి వెళ్లితే వస్తువుల కెక్కువఖరీదు ఇవ్వవలసివస్తుందనీ, నల్లవాళ్ల షాపుల్లో వాళ్లుచెప్పేధరలకుగాక సగానికి దింపి యీవస్తువును కొన్నప్పటికీ అక్కడకంటే చౌగ్గా ఉంటుందనీ, అనార్కలీకి దర్శన

మిస్తూవుంటారు. అదీగాక, నల్లవాళ్ల షాపుల్లో దొరికే సలాంబిస్కట్లూ, వినయసత్కారాలచాపాతీలు దొరకనందుకు వాళ్ల వాళ్ల షాపుల్లో దొరకవు. అందువల్ల బజారంతా టాక్సీలూ, మోటారుసైకిళ్లూ, జట్కాలు లోనగువానితో నిండివుంటుంది. జనసమ్మర్దము మూలాన్ని వీథిలో రావడంపోవడంకూడా కష్టంగా ఉంటుంది. ఎలెక్ట్రిక్‌గాసు దీపాలు వీథినంతా పగటికింద మార్చేస్తాయి-అట్టి యీసుందరమైనవీథి మే నెల మూడవతారీఖు సాయంకాల మేడుగంటలవేళ శోకార్తయగు యువతీ ముఖంలాగు కళావిహీనమైపోయింది. శీతలామందిరాన్ని పోలీసువాళ్లాక్రమించుకోగానే అక్కడనుంచి నగల ముంగుకుసాగిన శిక్కుల యూరేగింపు ఈ వీధిగుండానే పోయింది. అందుకు తగిన చిహ్నాలు బాజారంతటా అగపడుతూ వున్నాయి. ఒక్కషాపైనా తెరచిలేదు. రోడ్డుమీద పోలీసువాళ్లుతప్ప ఇంకెవళ్లూ లేరు. కొన్ని షాపులముందు తుత్తుమురుగా పగిలిపడివున్న లిమొనడ్ సోడాల సీసాలముక్కలూ, మరి కొన్నింటిముందు తలక్రిందుగా ద్రోయబడి చెల్లాచెదురుగ బడివున్న పగిలిన జాంచ్చెక్క పెట్టెలూ,లూటైనకాఫీహోటళ్లూ వీటినన్నింటిని జూస్తే ఎంతలో ఎంత సుందరమైనవీథికి ఎట్టిపాటు వచ్చిందని దుఃఖం పొంగి వచ్చింది. ఈసందర్భంలో గొప్పగొప్పషాపుల కేమీనష్టం రాలేదు. వాళ్లు ముందుగానే మేలుకొని తగినయేర్పాట్లు చేసుకొన్నారు. ఎటు వచ్చీ పాడైనవి లిమ్నేడ్ సోడాషాపులూ, తమలపాకుదీరీలదుకాణాలూ, కాఫీహోటళ్లూ, హోటళ్లూ. ఈసమయంలో మరోతమాషా జరిగింది. అసలు తప్పుచేసినవాళ్లు కాలికి బుద్ధిచెబితే పారిపోక నిలుచున్న నిరపరాధులనే పట్టుకోవలసివచ్చేది పోలీసువాళ్లకి. దంగాజరిగే సమయంలో రెండుపక్షాలవాళ్లూ కుక్కలూపిల్లులలాగు తన్నుకొనేవాళ్లు. ఇంతలో పోలీసువాళ్లు వస్తున్నారని తెలియడంతోటే బయటివాళ్లు పటాపంచలయ్యేవాళ్లు. దుకాణాదార్లు,వాళ్ల నౌకర్లూ నిలవనేయ్యేవాళ్లు. లూటీచెయ్యడాని కొచ్చిన బయటివాళ్లంటే పరిగెత్తుతారుగాని అసలు షాపులవాళ్లు ఏలాగూ పరిగెత్తేదీ! ఫలానిషాపులో దంగా జరుగుతూ ఉందని గుర్తుపెట్టుకొని వచ్చే పోలీసువాళ్లు షాపును సమీపించి అప్పుడక్కడ పారిపోక నిలుచున్నవాళ్లే పోట్లాడుకొంటూ తా మసటికి రాగానే మానేశారని వాళ్లనే అరెస్టుచేసేవాళ్లు. పారిపోయేవాళ్లు వీళ్లకంటికి అగపడరా అంటే అగపడతారు. వాళ్లెవరైందికూడా తెలుసూ. కాని పరిగెత్తినవాళ్లని పట్టుకోడం ఏలాగా? వాళ్ల వెంటబడి సందుగొందులన్నీ తిరగమంటారా ఏమిటి— సునాయాసంగా పట్టుకోడానికి కావలసినంతమంది ఎదట నిలబడివుంటే? పోట్లాట అయిన రెండు మూడురోజులతర్వాత అనార్కలీజైల్లోకి పోయిచూస్తే నూటికితొంభై మంది షాపులవాళ్లూ,హోటలువాళ్లూ,వాళ్ల నౌకర్లూ, వీళ్లే కనిపించారు. శీతలామందిరంవాళ్లు పట్టుబడిందీ ఈలాగే. బయటివాళ్లు బయట పరిగెత్తితే లోపలివాళ్లు లోపల పట్టుబడ్డారు. వీళ్లందరినీ షుమారు ఎనిమిదిగంటలకు అనార్కలీజైల్లో ప్రవేశంజేయించి, ఒకగంటవరకూ బయటవసారాలో కూర్చుండబెట్టి, తరువాత వీళ్లు తమగదులను ఖాళీచేసి యిచ్చి అతిథిసత్కారపుణ్యాన్ని మటుకు కాజేశారు. ఆరాత్రి అక్కడున్నవాళ్లందరూ మందిరంవాళ్లే. ఒకరూ ఇద్దరూ అయితే కష్ట మనిపించేదేమో. నలుగురితోచావు పెండ్లితో సమానం. ఇంతమందిలో కష్ట మేమిటి? ఆవేళ కొస్థలాన్నే మందిరమని భావించుకొన్నారు. కాని మందిరంలోలాగు భోజనం దొరికింది కాదు. విద్యార్థులకు మర్నాటి పరీక్షచింత పట్టుకొంది. పాపం, వీళ్లకు సంవత్సరం పాడైందన్నమాటే. ఏమైతేనేం-పన్నెండుగంటలవరకూ గప్పాలుకొట్టుకొంటూ కాలం గడిపి తరువాత అందరూ నిద్రాదేవికి వశులయ్యారు.

మర్నాడు తెల్లవారేసరికి లాహోరు స్థితిగతులు బొత్తుగా మారిపోయినాయి. కడచినరాత్రి జరిగిన బీభత్సకరములైన దౌర్జన్యాలను గూర్చి విస్తారంగా వ్రాయడం అనవసరం. తరువాత ప్రకటితమైన "ప్రతాప" అనే లాహోరులోని ఉర్దూదైనికపత్రిక శీతలామందిరానికి ఎదురుగుండా శాల్మ లోహారీ దర్వాజాలమధ్య ఉన్న గోల్‌బాగ్ రోడ్డు ఆనాటిరాత్రి శ్మశానతుల్యంగా మారిందని వ్రాసింది. దీన్నిబట్టి ఆదౌర్జన్యాల పరిమాణాన్ని కొంచెం ఊహించుకోవచ్చు. జైలుకి వెళ్లిన వాళ్లే నిర్భయంగా కాలాన్ని వెళ్లబుచ్చారు. మందిరంలో మిగిలిన ఇద్దరు ముగ్గురూ ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకొని గడిపారు రాత్రి అంతా. ఎప్పుడూ నూరు నూటయాభై మందికి తక్కువ కాకుండా ఉండే ప్రదేశంలో, నాలుగువైపులా మహాగంభీరఘోషంగా ఉన్నసమయంలో ఇద్దరు ముగ్గురు బిక్కుబిక్కుమంటూ ఉండాలంటే వాళ్ల స్థితి అనుభవించినవాళ్లకే గాని ఇంకొకళ్లకు తెలియదు. తలుపులన్నింటినీ బిగించి, ప్రాణాల్ని భగవంతుడికి కప్పించి కూర్చున్నారు, నిద్రకు తిలాంజలి ఇచ్చి. రాత్రంతా మందిరాని కెదురుగుండా తన్నులు తినేవాళ్ల ఆక్రందన రోదనాలు చెవులు మూసుకొన్నా వినిపిస్తూనే ఉన్నాయి. ఇక్కడి వసలి బయటికి రానివాళ్లే అదృష్టవంతులు. విధిలేక రావలసి వచ్చిందా, తన్నులు తన్నారన్నమాటే. తన్ను లేమిటి- ఫిడీలని చేదావు దెబ్బలతో వీపంతా బద్దలై నెత్తురు కారుతూ ఉంటే తల దిమ్మెక్కి క్రింద పడిపోయేవాళ్లు అంత ఆకింద బడ్డవాళ్ళని మరినాలుగు తన్నులుతన్ని ఏపు లేకుండా బరిగెత్తేవాళ్లు మరొకలు. ఇంత న్నేవాళ్లూ, తన్నులు తినేవాళ్లూ,హిందువులా తురకలాఅంటే అది సర్వేశ్వరుడికే తెలియాలి. కాని మర్నాడు తెల్లవారంగానే రాత్రి మావాళ్లని హిందువులు చావగొట్టారని తురకలూ,వీళ్లే మావాళ్లని చావదన్నారని హిందువులూ మొదలుపెట్టుకొంటారు. ఆకాళరాత్రి ఇలాటి ఘటనాల్లోటే చెలవుపుచ్చుకుంది. తెల్లవారింది. చేతులతిమ్మిరి తీర్చేలాగు కావలసినంత పని దొరికిందిగదా అని చాలాసంతోషించారు పోలీసువాళ్లు. నాలుగోతారీఖునాడు లాహోరు నాలుగుమూలలా విజృంభించింది హిందూ మహమ్మదీయుల తాండవ సంరంభం. పొద్దున్నే లేవగానే వందల కొలది పోలీసువాళ్లు బార్లుగట్టి వెళ్లారు, రాత్రంతా మహాజాగ్రత్తతో నగరరక్షణము చేసిన రక్షకభటులను విడిపించడానికి. కేవలం కాపలానిమిత్తం కొద్దిమంది మాత్రమే జైల్లో నిలచిపోయ్యారు. మంథిరం,

నుంచి వచ్చిన విద్యార్థులు తెల్లవారంగానే లేచి ఎలాగో ఒకలాగు అవసర కృత్యాలను దీర్చుకొని— ముఖ్యంగా పరీక్షకు పోవలసిన వాళ్లు— ఎవళ్లయినా వచ్చి విడిపించుకొని పోతారా దైవమా అని వాళ్లకోసం దారి ఎదురుచూస్తూ కూర్చున్నారు. కాని వీళ్లకోర్కె లేవీ ఫలించాయి కావు. పది గంటలు కొట్టారు. పాపం, కొందరి కళ్ల వెంట నీళ్లు కారడం మొదలెట్టాయి: జైల్లోకి రావలసివచ్చిందే అని వీళ్లకు లేశమాత్రమైనా దుఃఖము లేదు. సంవత్సరం పొడుగూనా నానాకష్టాలూపడి నిద్రాహారాలుకూడా త్యజించుకొని చేసిన ప్రయత్నమంతా ఒక్కగడియలో బూడిదలో కలిసిపోయిందగిదా అని పట్టరాని దుఃఖము వచ్చింది. కాని ఎవరేంచెయ్యగలరూ! గుండ్రాళ్లాంటి హోమాహూమీలందరూ ప్రవాహవేగానికి తట్టుకోలేక కొట్టుకొని పోతూవుంటే ఈ గ్లాటి విద్యార్థులేం లెక్క? వీరి పరీక్షలేం లెక్క? అక్కడ పరీక్షాభవనంలో హాజరైన విద్యార్థులందరూ సమ్మెకట్టి డెస్కులకు ఎదురుగా లేచి నిలుచొని, పట్నంలో నిన్న జరిగిన ఉపద్రవంవల్ల తమతోటివాళ్లు చాలామంది పోలీసులచేత పట్టుబడి రాలేకపోవడంవలన పరీక్షను మరోదినానికి మార్చాలని అధికార్లతో ఎదిరించి మాట్లాడి పేపర్లను రాయడం మానేశారు. కాని పంతాలుగా సంభవించినందువలన అప్పుడేలాటి ప్రయత్నం చెయ్యడానికి అధికార్లకు వీల్లేక పోయింది. ఒకవేపు రాయడం మాని విద్యార్థులందరూ నిలుచున్నారు. అక్కడ ఉన్నవాళ్లకు ఏంచెయ్యడానికీ తోచకుండా ఉంది. పరీక్షకు ఆలస్యమైపోతూ ఉంది. ఇంతలో టెలిఫోను ఇచ్చారేమో, రిజిస్ట్రారుగారు ప్రత్యక్షమయ్యారు. వారు ఆలోచన అప్పటికే తక్కిన కేంద్రాల్లో పేపర్లు బయలుపడి పోతాయి కాబట్టి ఆనాటికి మాత్రం తానేమీ చేయజాలననీ, తక్కిన రెండుమూడు రోజుల పరీక్షనూ పది హేనో తారీఖు వరకూ మార్చుతానననీ వాళ్లని శాంతింజేసి కూచోబెట్టారు రాయడానికి. అలానే జరిగింది. కాని లాభం లేకపోయింది. రెండునెల్ల తర్వాత పరీక్షా పరిణామాలు బయటపడ్డప్పుడు పట్టుబడ్డవాళ్లలో చాలామంది తప్పిపోయింది యీనాలుగో పేపర్లోనే. వీరందరికీ రాత్రి శివరాత్రిగానే కడచిపోయినందున మర్నాడు తెల్లవారి ది మొదలుకొని కడుపులో ఎలకలు పరిగెత్తడం మొదలెట్టాయి. పదిగంటలయ్యేటప్పటికి పోలీసుసార్జంటు ఇద్దరు ముగ్గురు జవాన్లతో వచ్చి సెనగపప్పు పంచిపెట్టడం మొదలిడితే వాటినే వీళ్లు అమృతోపమానంగా గ్రహించి ఉదరపూజను ఆరంభించారు. రాత్రి మేలుకొన్నంతవరకూ, తెల్లవారిన తర్వాత పోలీసువాళ్లు బయటికి వెళ్లేపర్యంతం వాళ్లీమందిరమునుండి లిని నిష్ఠుర వాక్యాలతో ఎత్తిపొడుస్తూనే వచ్చారు. కాని వాటికి వీళ్లు జవాబియ్యక పోవడమే కాక అవాస ప్రహారాలవల్ల వీళ్లకు కోపోద్రేకాలు గూడా కలిగాయికావు. ఇదంతా సార్జంటు కనిపెట్టే వున్నాడు. వీళ్ల మాటలూ వ్యవహారాలూ చూచి వీళ్లునట్టి అమాయికులనుకొన్నాడు. కాని మందిరం మీద ఆక్రమణం జరిగేటప్పుడు వీళ్లు ఇటికరాళ్లతో తురకల తలలు ఎగరకొట్టడం జ్ఞాపకానికి రాగా ఇతని కోటూ తోచకపోయింది. చిట్టచివరకు వీళ్లను అమాయికులనే నిశ్చయపరచుకొన్నాడు. సెనగలను పంచిపెట్టేటప్పుడు వీళ్లు మహానందంతో ఎగబడి తీసికొని తినడాన్నిగూచి యీయన తనభావాన్ని బయటపెట్టాడు: ఎంతమందినో ఖైదీలను పట్టుకొని వచ్చాంగాని ఇంతసంతోషంగా సెనగలను గ్రహించిన వాళ్లని యింతవరకూ ఎక్కడా చూడలేదు— అని మెచ్చుకొన్నాడు.

వీళ్లందరూ అనార్కలీ జైల్లో ఉన్నారని మహంతుగారికిగాని, లాహోరు నివాసులకుగాని ఆనాటి మధ్యాహ్నమువరకు తెలిసిందికాదు. నాలుగో తారీఖు ఉదయం వీళ్లు పట్టుబడ్డ సమాచారం పట్నం అంతటా తెలిసిపోయింది. అప్పుడేవాళ్లో వాళ్లనే కనుంది అనేక స్థలాల్లో ఉన్న జైళ్లకు పోయి విచారించడం మొదలెడితే రెండుఝాములు దాటిన తర్వాత తెలిసింది, మందిరం వాళ్లంతా అనార్కలీ జైల్లో ఉన్నారని. మహంతు పంపిన మనిషి వచ్చి భగీరథ ప్రయత్నాలు చేస్తే మూడుగంటలవేళకు లోపలి కెళ్లి తనవాళ్లని జూడవచ్చుననీ, వాళ్లకు కావలసిన తినుబండారాలు దీసుకొచ్చి ఇవ్వొచ్చుననీ ఉత్తరువు దొరికింది. ఆయన లోపలి కెళ్లి వాళ్లందరినీ చూసి ఓదార్చి భోజనాల యేర్పాట్లు చేయడానికి మళ్లీ మందిరానికి వెళ్లాడు. ఏలాగైతేనేం, సాయంకాలమయ్యేసరికి అందరికీ భోజనాలు దొరికాయి. ముఖ్యాధ్యాపకులక్కడ ఉన్నంతకాలం ఉపవాసం చేద్దామనుకొన్నారు కాని చాలా మంది చెప్పిన మీద రెండోనాటినుంచి పాలు పుచ్చుకున్నారు.

వీళ్లకు మొదటినాడు కొంచెం కష్టం కలిగింది కాని తర్వాత ఇంటికంటె అక్కడే హాయనిపించింది కొంతమందికి. దానికి కారణమేమంటే, నాలుగో తేదీ ఉదయంనుంచి జైలుకు రిక్రూట్లబాచీలు రావడం మొదలెట్టి ఆరో తారీఖు సాయంకాలంవరకూ వస్తూనేవచ్చాయి. ఈరెండురోజుల్లోనే వీరిసంఖ్య మూడువందలైంది. ఈవచ్చినవమ్మంది వాళ్లంతా పైప్రకరణంలో వర్ణించినలాటివాళ్లే. వీళ్లుపట్టుబడ్డవిధానాలు వేరేవా అవ్వే. వందలకొలది జైల్లో ఉన్నప్పటికీ పట్నంలో అత్యాచారాలు తగ్గాయికావు. బయటజరిగే ఉపద్రవాల్నీ, జైల్లో ఉన్నవాళ్ల వ్యవహారాల్నీ పరకాయించి చూస్తే తోడేళ్లని పిచ్చలవిడిగా వదలిపెట్టి గొర్రెలనీ, మేకల్నీ పోగుచేస్తున్నారా అనిపించేది. ఈ తోడేళ్లనే బంధిస్తే ఒక్కరోజులోనే ఉపద్రవాలన్నీ అణగిపొయ్యేవి. కాని ఏంచెయ్యాలి? పోలీసులకు వశమైందికాదు. అదీకాక, ఒక్కరోజులోనే తమాషా అంతా అయిపోతే ఇక తర్వాత మజా ఏముందీ? ఈసమాచారాలన్నీ లాహోరులో అందరికీ బాగా అవగతం కావడంతోటే జైల్లోవాళ్లందరూ ధర్మవీరులయ్యారు. వెంటనే సిటీలోని షాహుకారొకడు జైల్లోవాళ్లకందరికీ రెండుపూటలా భోజనం పంపడానికి నడుముకట్టాడు. ఇతన్నిచూచి మరిఇద్దరుసేట్లు ముందుకొచ్చారు. మందిరాన్నుంచి భోజనంరావడం ఇదివరకే మొదలైంది. పొద్దున్నే పాలు,

పదకొండుగంటలకు భోజనం. రెండు మూడు గంటలప్పుడు ఫలహారాలు. రాత్రి మళ్లీ భోజనం. ఇప్పుడు వీళ్లుండేది జైలా, అత్తగారిల్లా? లాహోరు వాసులు మాతుల్లను జేసుకోకుండా ఏర్పడ్డ కొత్తరకపు అల్లుళ్లు వీళ్లిపుడు. ఈవిపరీతజామాతృగణంలో ఆగర్భ శ్రీమంతులు మొదలుకొని పని పాటలు చేసుకొనేవాళ్ల పర్యంత మున్నారు. భాగ్యవంతుల ఆకలి మందగించింది. వీళ్లకు స్వకీయులమీద మనసుపోయి అన్నం సయించేది కాదు. కాని యీసంసారపు జంజాటాలన్నీ లేనివాళ్ల ఆకలి ద్విగుణం త్రిగుణమైంది. పైవాళ్లఖర్చుకూడా ఈరెండోవాళ్లే చెల్లిస్తూవచ్చారు. దొరికినన్ని సార్లు వద్దనకుండా ఆరగించారు. మొదలు మొదలు కొంచెం కఠినంగా ఉన్నప్పటికీ ఊర్లోవాళ్లంతా ఖైదీలపక్షం అవలంబించింది మొదలుకొని పోలీసువాళ్లు కూడా చల్లబడ్డారు. ఏలాగైనా మాట నెగ్గించుకోవాలని పోలీసులు చాలా ప్రయత్నం చేశారు. పట్టుకొని వచ్చిన వాళ్లలో కొందరిని అదిరించి బెదిరించి నేరాన్ని ఒప్పించి తమ పక్షం చేసుకోవాలని చాలా ప్రయాసపడ్డారు. కాని కార్యం లేక పోయింది. ఇక బొత్తుగా తూష్ణీంభావం తాల్చి పరువుదక్కేదేలాగని వీళ్లు కేసుమటుకు దాఖలుచేశారు పట్టుకొచ్చినవాళ్లందరిమీదా. పోలీసువాళ్లీవిధాన్ని తంటాలుపడుతూ ఉన్నా జైలువాళ్ల పనిమాత్రం పెరుగుమీగడలతో గడచిపోతూవచ్చింది. మరిరెండు రోజులు దాటిన తర్వాత వీళ్లమీదఉన్న ముసల్మాన్ పహారాకు బదిలీఅయి ఆస్థలాన్ని హిందూసిక్కు పోలీసులాక్రమించారు. ఇందువల్ల నూతనజామాతలకు మరికొన్ని అవసరసౌకర్యాలు దొరికాయి. ఇప్పుడు కేవలం స్థలంగాని స్థలంలో ఉన్నామనే చింతేగాని వీళ్ల కేవిధమైన బాధలూ లేవు. యూనివర్సిటీహాల్లో జరిగినసంగతులు తెలియగానే విద్యార్థులు చాలా సంతోషించారు. తప్పకుండా ముత్తం మార్కులు సంపాయించి పాసౌతా మనుకొన్నారు అప్పటికి. కాని పరిణామం పైనరాసిన లాగే తేలింది తరువాత. పిదప రెండు రోజుల్లో పోలీసు వేటగాళ్లలో కూడా కొన్నిమార్పులు జరిగాయి. అంతవరకూ గొర్రెలూ మేకలూ మాత్రమే వస్తూఉండేవి దొడ్డికి; వేటగాళ్లలో మార్పులు జరిగిన తర్వాత తోడేళ్లుకూడా రావడం మొదలెట్టాయి. ఇవన్నీ ఇలా ఉండగా, మార్షల్‌లా ధొరవారు లాహోరు నొకనెల పర్యంతమూ తమ ఆధీనంలో ఉంచుకోడానికి మక్కువగా ఉందని వారి యభిలాషను వెల్లడించారు. ఈవార్త చెవిని బడేసరికి హిందూ మహమ్మదీయ గుండాల నడుములు విరిగిపొయ్యాయి. కుంగిపోయి భూమిమీదబడి రోదనం చేయసాగారు వీళ్లు. అంతపర్యంతం అనుభవించిన ఆనందమే తమప్రారబ్ధంలో ఉందనుకొన్నారు. కృతయుగం పోయి కలికాలం వచ్చిందని భావించారు. పొద్దుటూకి ఎనిమిద గంటలు కావడంతోటే సర్ మార్షల్‌లా ధొరవారు మెషీన్‌గన్ మోటర్లమీద బహురూపులై విహరించడం మొదలిడే సరికి, పాపం, తోడేళ్లకు ప్రాప్తించినదుర్గతి ఏమని చెప్పాలి? ముఖాలైనా పైకి చూపించడానికి వీల్లేకపోయింది. ఈమార్పులన్నింటి మూలాన్ని లాహోరు మళ్లీ కొంచెం శాంతి ముఖానికి రావడం ఆరంభించగానే పట్టుబడ్డ వాళ్లని జామీన్లమీద వదలడం మొదలెట్టారు సర్కారువాళ్లు. ఏదో పోలీసువాళ్లు అరెస్టుచేసి కేసుచేశారుగదా, కొంచెమైనా తంతు జరపకుండా వదలిపెడితే గౌరవంగా ఉండదని, ఫలాని ఫలాని నాడు వచ్చి పోలీసుకచేరీలో దర్శనమివ్వమని ఆజ్ఞాపిస్తూ వదిలారు వీళ్లని సర్కారువారు.

మహంతుగారు ఇందు కోసం మొదటినుంచే కనిపెట్టుకొని ఉన్నారు కాబట్టి ఈసమాచారం తెలియగానే చప్పున వచ్చి పన్నెండు వేలరూపాయల జామీను ఇచ్చి తమవాళ్లనందరినీ విడిపించుకొని వచ్చారు.

ఇక వీరికి ద్రవ్యానికేం తక్కువ, మందిరందక్కింతర్వాత? ఇద్దరు హైకోర్టువకీళ్లని తగిలించేటప్పటికి ఛిన్నభిన్నమై దూదిపింజల్లాగు ఎగిరిపోయింది కేసూగీసూ. అసలు ఇక్కడ కేసేమిటి? ఇదీ ఒక తమాషాగామూ? అన్నదమ్ములబంతులాట. ఈసమయాన్ని పైగంబరు భక్తులొకడు గుళ్లోనించి రాళ్లు వేసినవాళ్లని గుర్తిస్తానని బయల్దేరాడు. అంత ఈకేసుకు సంబంధించిన వాళ్లయితేనేం, సంబంధించని వాళ్లయితేనేం, మూడువందలమంది కట్టగట్టుకొని వెళ్లారు ఐడెంటిఫికేషన్ నిమిత్తం. వరుసలు దీరి ఈమూడువందలమందీ నిలుచుంటే ఆగుర్తించే పెద్ద మనిషి వచ్చి వీరిందరంతా కేసుకు సంబంధించని వాళ్లనే. కేసు వెంటనే కొట్టేశారు. మహంతులవారికి అపరిమితానందమైంది. ఇప్పుడు వారి దగ్గరికి ఎవరైనా వెళ్లారంటే దుర్గాదేవే తురకల ఆక్రమణాన్ని తప్పించిందనీ, కేసులో గెల్పించిందనీ నవ్వుతూ సెలవిస్తూఉంటారు: సందేహముండదు. కాని ఆనాడు విద్యార్థులమూలాన్ని శీతలామందిరం నిలిచిందని లాహోరువాళ్లంతా అంటారు.




౧

మందమలయానిలాంకురంబులు మొలయుచుండ-నిన్నమాపట సాంద్రశాంతిమయ గగన
తటినియందున శశికళా తరణి నెక్కి-చెలిమికాండ్రతో గానంబు సేసికొనుచుఁ
బోయియున్నది నీవు కావోయి సఖుఁడ! -అదిగో! నిన్నటిరాత్రి మేఘాశ్వ మెక్కి-
తారకాగణోద్యాన రథ్యలను స్వారి-చేయుచున్నది నీవు కావోయి సఖుఁడ!

మొన్న పున్నమనిసయందుఁ బండువుఁగొండ-శిఖరమునఁ గూరుచుండి రసికత వెలయఁ
బశ్చిమాశాంగనామణిపైని మల్లె-చెండు విసరిన నీవెకా! చెలిమికాఁడ!
పాఱఁజూచితిఁ గనుచూపుమేర నుండి-ఈమహాకాంతి యెచ్చటి దెవరు లేరె!

౨

ఆకసంబునఁ జంద్రుఁడా, యస్తమించెఁ-దారకాబృందమా, వారిదముల డాఁగె
నీమహాకాంతి యెచ్చటి? దెంతమధుర - మెంత హృదయంగమంబయి యింపు నింపుఁ
దావకీనతనూవల్లికావిలాస-పూరమా? కాక త్వత్కృపా క్షీరసింధు
ధవళభంగములా? లేక తావకమగు - సరసరమణీయ మందహాసంబొ? దేవ!

౩

శాద్వలమునకు సాయాహ్న సమయమందు - నేఁగుదెంతువు నీ వని యెప్పటివలెఁ
బోయి కూర్చుండితిని ప్రొద్దుపోవుదాఁక - నీవు రాలేద కారణం బేమొ? సఖుఁడ!

వేగుఁజోకల వాహ్యాళి కేఁగునపుడు - నాదుగదివద్ద కరుదెంచి నన్నుఁ బిలుతు
వనుచు నీకయి వేచియుంటిని జిరంబు - నీవు రాలేద కారణం బేమొ? సఖుఁడ!

వచ్చి భోజనవేళకుఁ బ్రక్కఁ గూరుచుండి ముచ్చటలాడుచు నుందు వనుచుఁ
గాచుకొనియుంటి నే నొంటిగంటదాఁక - నీవు రాలేదు కారణం బేమొ? సఖుఁడ!

౪

శాంతిపాలిత మానందకాంతి దీప్త - మయిన నామకహృదయ సౌధాంతరమున
రేయుఁ బవలును సంధ్యలఁ బ్రీతిగదుర - సఖుఁడ! నీతో వసింప నిష్టంబు గలదు.

త్వద్విమానంబు నాదు సౌధంబుపైకిఁ - బట్టుమోయీ! సమర్పింతు స్వాగతంబు
నచలితానందమయహృదయంబుతోడ - బాష్పజలపూర్ణ నేత్ర కుంభములతోడ.

౫

ఓ అయస్కాంతమా! సువర్ణోత్కరంబు - మణిసముచ్చయములేని గణనఁగొనవు
నాయయఃఖండమందు ననశ్వరమగు-ప్రేమ నీకెట్లు గలిగె వర్ణింపఁజాల.

ఓయి! వైణిక వాంశిక గాయకాళి - చూపి తమతమ సంగీత నైపుణంబు
నిన్ను నానందపఱచుచు నున్న నేల - నాదుకూనరాగము విను నాదరంబు?

ఓ మహారాజ! రజతసముజ్జ్వలములుఁ - గాంచనములగు పాత్రముల్ గలిగియున్న
నాదు మట్టిగలంతియమీఁదమాత్ర - మేల యవ్యాజకృప గల్గె? యెఱుఁగఁజాల.

౬

అలలు కాలసర్పము పడగలవిభాతిఁ - బైకి నాల్కలు ద్రోయుచు వచ్చుచుండె;
యమునిసైనికసందోహ మనఁ దిమింగిలాది జంతువుల్ తట్టుముట్టాడుచుండెఁ;

గుటిలమృత్యుదేవత కంఠ కుహరము లన - నెసఁగు నావర్తములు వివరించి యుండె
జవ్వనను బలివేయు కసాయి యొకఁడు - వాఁడికత్తితోఁ బైనుండి వచ్చుచుండె

ఓయి యమృతశకుంతమా! యొక్కమారు - వెలయు నపరంజి రెక్కలు విప్పి వచ్చి
పైని వ్రాలి నీకాళులలోన నన్ను - గ్రుచ్చుకొనిపోయి కాపాడఁ గోరినాఁడ.

౭

నిన్ను ముద్దాడుచున్నట్లు నిశ్చయించి - నాకుమారుని ముఖచుంబనంబు సేతు;
నిన్నుఁ గౌఁగిలిగొనునట్లు నిశ్చయించి - నాప్రియాలింగనంబు నొనర్తు దేవ!

౮

నాయికానాయకప్రతినాయకులయుఁ - దొడరి చేటీకిరాతవిదూషకులయు
భూమికల నీ వొకండవ పూని పూర్ణ-నాటకముఁ జిత్ర మాడుచున్నావు దేవ!

౯

వేయికన్నులతోఁ గనిపెట్టుచుంటి - నెపుడు తప్పించుకొనుచుఁ బోయెదవొ నాదు
వజ్రపుం గోటనుండియు బయలి కనుచు? - నెటులఁగ నేత్రోవ వెలికిఁ బోయితివొ? దేవ!

౧౦

గుడి కట్టించి యమూర్తిమంతుఁడగు నీకున్ మూర్తిఁ గల్పించి యే
ర్పడ నోదేవ! పసిండిదువ్వలువలం బైఁ గప్పి పూదండలన్
మెడలో వైచి సహస్రనామములతో నిన్నుం బ్రశంసించుచుం
గడుబత్తిం గుసుమంబులన్ దళములన్ గావించెదన్ బూజలన్.

౧౧

కడుఁబొగచూరి నల్లఁబడి కాంతి యడంగిన గాజుగొట్టమున్
గడిగియు నీటితో విమలకాంతియుతంబుగఁ జేసియున్న న
ప్పాడె మసిబాఱి నల్లఁబడిపోవుచు దివ్వెవెలుంగుఁ దగ్గఁ జే
సెడు; నిది స్నేహదోషమున చేసెనొ? యెట్లికఁ గాంతు వస్తువున్?

౧౨

ప్రాహ్ణ సాయాహ్న వేళలఁ బ్రత్యహంబు - నేస్తులం జూడఁబోయెదు నీదుదారి
మధ్యనున్నది యో ప్రభూ! మద్గృహంబు-కాన దయసేయఁగా దవ్వ గాదు నీకు.

౧౩

తరుల చిగురాకు కదలికం దొలఁ గాంచి - వాని చల్లని నీడఁ బూఁబొనుపుపయి
శాంతముగ నీవు పండ నిశ్శబ్దముగను - నాకుఁ దెలుపుచునున్న చందమున భ్రమసి
గట్టులను బుట్టలను దాఁటి కాల్వ లీఁది - పోయి కని యాత్రమునఁ దెల్లఁబోయినాఁడ.

౧౪

నీమహాసౌధపున్ ద్వారభూమికడకు - వచ్చి గొంతెత్తి పిలిచితిఁ బలుతడవలు
'ఓ' యనెడుమాట వినఁబడ దొక్కటియును - ఉంటివో లేదొ తెలియరా దింట నీవు.

౧౫

నడిచే యయ్యెఁ బ్రగాఢనిద్రఁ గొనియున్నా రింటివారెల్ల రి
ప్పుడు శాంతించెను వృక్షమర్మరరవంబుల్ ఝిల్లికారావముల్
తడవుం జేయక రమ్ము! మిత్రమణి! మాతెన్నెథంబుపైఁ జేరి హెం
చ్చెదు మోదమ్మున సల్పు కొంద మహదక్షీణంబుగా మంత్రముల్.

౧౬

వినియు నాజీవితగ్రంథమును బుధేంద్ర! - దోషముల్ సవరించి తద్గుణాలవంబుఁ
బెంపొనర్చి రసస్ఫూర్తి వెలయఁజేయు - పుటకిత మొనర్తు నీకు సత్యాదరమున.

౧౭

ఆకాశం బది వంచి శీర్షము నమస్కారం జేయు; భూదేవి యా
శాకాండంపుఁ గరంబు లెత్తి మనవిం జల్పున్; గిరిశ్రేణి దం
డాకారంబుగ వ్రాలి మ్రొక్కెడు; సమస్తార్థముల్ భవత్ప్రార్థనా
శ్లోకౌఘంబు జగత్ప్రభూ! తగఁ బఠించుం బ్రోచ్చకంఠంబులన్.

౧౮

పూవులుం బండులుంగాఁ దీవెంగమిఁ - జుట్టుకొన్న ప్రాఁజవికె నేల్కట్టుక్రిందఁ
బఱచియుంటిని రత్నకంబళి మొకంపు; - విశ్రమింపుము విచ్చేసి వేగ దేవ!

అల తరంగహోలికల నుయ్యాలలూఁగు - రాజహంసలు శతపత్రరాజియుఁ గల
మానసరోవరము దాకమంటపంబుఁ - గట్టితిమి యధిష్ఠింపు మక్కడను దేవ!

౧౯

సెలయేఱులార మీ సులలితసలిలంబు - భక్తియుక్తంబుగాఁ బాద్య మిండు!
లతలార! మీ మృదుళములైన పుష్పమంజరుల సర్ఘ్యంబు లొసంగుఁడమ్మ!
తరులార! మీ దివ్యతరఫలబృంద మాహార మర్పింపుఁ డాప్యాయనముగ!
పతగంబులార! మీ స్వాదువాక్కులతోడ - క్షేమవార్తలను బ్రశ్నింపుఁడయ్య!
ఆజగత్ప్రభుఁ డీదినం బతిథియగుచు - నాకుటీరంబునకు వచ్చు ననుఁ దరింప
హర్షసమ్మోదచిత్తుండ నై తెలియక - అతనికి నపచారంబు సేతునేమొ?

౨౦

ఎచ్చటెచ్చటనో దేవ! యెఱుఁగకుండ - దాఁచియున్నావు నా పదార్థముల నెల్లఁ
బెద్దకాలంబునుండియు వెదకి వెదకి - విసుఁగు పుట్టెను గాని కాన్పింప దొకటి,



శ్రీమా. రాఘవదాస, వేణుగోపాలకృష్ణమూర్తిగార్లు



శ్రీ బాకురుపండా వేంకటరమణమూర్తిగారు



శ్రీ పరుమారు సుందరవరదులుగారు



డా॥ యన్. కేశవాచార్యులుగారు



డా॥ కె. యస్. మూర్తిగారు



శ్రీ వి. గోవిందరావుగారు



చోరగుడి వెంకట్రామయ్యగారు



శ్రీ పెండెం వెంకట్రాయులుగారు



శ్రీరామసేవా దళోద్యమము, నిజాంరాష్ట్రము



శ్రీ వనమాల నారాయణదాసుగారు



శ్రీ దావల్ జనార్దనస్వామిగారు

౨౧

నాదుదీపంబు తైలశూన్యమని కాని - కాంతిపరిమాణ మింతని కాని తెలియ;
దాని నిర్వాణకాలంబు దగ్గఱించి-నట్టు లున్నది మినుమినుకు లాడుచుండె:
నావిధుల నొక్కఁడేని నొనర్పలేదు - ప్రభువు కేమని ప్రత్యుత్తరంబు నిత్తు?

౨౨

నిదుర మేల్కాంచి మున్నున్న నెలవుఁ దప్పి-కలుషభూయిష్ఠమును భయానకము జుగుప్సి
తంబు నగు నొక్కయంధకూపంబునందుఁ-బడి యునికిఁ గంటి;సత్యమో,స్వప్నమొక్కొ!

౨౩

గగననైల్యంబు, శశికళంకంబు, వార్ధి - లవణభావంబు, హాలాహలంబు చేఁదు,
మాదు హృదయమాలిన్యంబు మాయు టెట్లు?-మాపు దివ్యౌషధి నొసంగుమా మహాత్మ!

౨౪

ఏతీర్థంబులఁ గ్రుంకులాడితినొ! ము న్నే వేల్పుఁ బూజించి సం
ప్రీతుం జేసి వరంబులం గొనితినో! వేదంబులన్ నాల్గిటిన్
వేమాఱుల్ పఠియించినానొ! నరయోనిం జన్మముం బొందఁగన్
భూతవ్రాతమునన్ శుభేంద్రియగణంబుం బొంది శోభిల్లఁగన్.

ఉత్తరకాలమం దిటులె యుత్తమజన్మముఁ బొందఁ జేయనే
నత్తఱి, మెట్టిహీనమగు జన్మము గల్గునొ యింక నాకు నం
చుత్తలపాటుతో హృదయ మూఱటఁ గాంచక కూరుచుండి వె
ఱ్ఱెత్తినరీతి నేఁడు జను లెల్లరు నర్థము గాక చూడఁగన్.

౨౫

అతటంబులైన నాజీ-వితగతదుఃఖప్రవాహ వితతుల తత్త
ద్గతు లెన్నని వినిపింతును?-నితాంతమును విసువు పుట్ట నీకును దేవా!

# మఱ్ఱిచెట్టు

శ్రీ త్రిపల్లి సూర్యారావు గారు

సీసమాలిక

జయ వృక్షమూర్ధన్య జయ వట విజయాభిధాన
మహోన్నత విశాల వర్ణనీయ!
సుగుణాఢ్య నిక్కమూర్ఖుఁ బోద్య హా నే మిని
నుతియింపఁ దగునో నామతికిఁ బోఁప
పైన నెక్కింతె నాయందలితలఁపులు
వెలిపుచ్చెదను విను వీను లొగ్గి
నిన్నుఁ గాంచినఁ దపోనియతులు మాండ్యకుఁ గా
న్పింతురు మునుమాండ్య సలిపియుంట
జడలు దాల్చుట నెండ జడి పేర నోర్చుట
బ్రహ్మస్పృహియుండుట మహినిఁ బాద
మూనియు నూనకయుండుట నిఖిలలోఁ
బక్షులు గూండ్లఁ గట్టి వసతి చేసి
కొనియున్న మిన్నకయునికినిఁ; బహుశాఖ
మునిభంగిఁ గాంచెద నిను నొకతఱి



బహుశీర్షముల బహుపాదమ్ములను బహుకోటరాక్షులు గల్గి కుశలఖిలల
సంవ్యాప్తనొప్పిన సకలజంతుశ్రేణిఁ దరులతాగుల్మాది దాల్పఁ జూచి;
మూదమూలము గాన కంతంబు లేదు నీ కని విష్ణురూపుగా ననుకొనియెద
తులసిపోలికి నీవు వెలసితి సర్వతీర్థసమృద్ధి మూలతీర్థకగుఁ బైన
పరమేశ్వరుఁడు నీదు ప్రకటమూలంబున వసియించి జ్ఞానసంపన్నులగను
మౌనులఁ జదివించి మంతు కెక్కించుట బోధిద్రుమం బను ప్రాత నామ
మును నీవ తాల్పఁగాఁ జను రావి కెట్లబ్బె బోధమూర్తి యగు నా బుద్ధదేవుఁ
డును నీదుమూలంబుననె కదా పేర్గాంచె రావి యెట్లో వృక్షరాజ మయ్యె
నక్షయవటసమాఖ్యయె చాలు నీ గౌరవంబున కెందఱు పాంథు లెపుడు
నీనీడ బ్రదికెదరో నేను జెప్పఁగావలయునా; గోపకావళిని గూడి
యుండ గోవులు నీదు నుత్తమచ్ఛాయను భాండీరవటము నా భావమందుఁ
బొడకట్టుచున్నది; భూమిపైఁ దారాపథంబు ప్రాలకయుండఁ ద్వచ్ఛిరోగ్ర
మున మహాబిలముగా నొనరించి బోల్పోగ్గువడువునఁ బెరిఁగెదు పొడవుగాను
దిక్కులు సంకోచదృష్టిఁ జేరకయుండఁ దతము గాంతువు దిగ్వితానములకు
భూతసంతతికి నీవే తావుగా నుందు పర్ణశాలవు వనవాసులకును
సుమనోభిరామ లౌచును లతాలలితాంగు లెపుడుఁ బైఁ బ్రాకఁగా భృంగగీతి
కలు శుకశారికావిలసదాలాపము ల్వేలయ శృంగారంబు లలవరింతు

నిన్నుఁ జూచిన మహనీయులకును నీదు నీడ సద్గోష్ఠిని నెఱప మనసు పుట్టు; నీఛాయను బోధింత్రు బాలురకును బడియొజ్జలు కుటశిరోమణీ! నిన్నుఁ గాంచిన నానంద మగు సర్వజీవులకును బోఁడఁ, జేరి యాడ, వేఁడ దేవుని, గుంపు గూడ నేపనికిని సజ్జనులను గాంచి సలుపఁ బోడము నజ్జనకును నొక్కయప్పుడు గాకున్న నొక్కయపుడు మంచియూహ; త్వాదృశులును సన్మార్గదర్శులు చెట్లు పుట్టలు శిలలు మృగంబులుఁ జిత్తశుద్ధి కారణంబులు గావె కలికాలమున మతభేదమానసులకు విశ్వదృష్టి నొదవును వేదాంత మొక్కప్పు డీశ్వరు నుతియింపఁ దన యపకృతులఁ దెగడి కొనఁగ జగము గురువు కొందఱ కారీతి - నిన్ను గురువుగాఁగఁ గొన్న నెఱుఁగ వచ్చు దైవమహిమ వ్యవహారరీతులు - సరసరంజనంబుఁ జలుపవచ్చు.

## భిక్షాందేహి

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

ధనికులార! నిర్భాగ్యసత్కవుల మేము
 వచ్చితిమి బిచ్చ మడుగ మీద్వారములకు!
ఇచ్చి సెల వీయుఁడయ్య! లేదేని త్రిభువ
నావనుం డైన జగదీశుఁ డాగ్రహించు!

వలదు మాకు కుటుంబపరిపోషణార్థ మ
 క్షయము లౌ ధనధాన్యసంచయములు
వలదు మా కిచ్ఛానివాసంబునకు నూత్న
 మణిమయాభోగరాణ్మందిరములు
వలదు మాకు శరీరపరిరక్షణము నిమి
 త్తం బమూల్యములు రత్నాంబరములుఁ
వలదు మాకు వినూత్నకళల నాపాదింప
 పొలుపారు సౌవర్ణభూషణములు
వలదు మా కిట్టి దుర్భిక్ష వలదు, వలదు;
తగవు మా కివి, పడవు మాతత్త్వములకు;
కవుల మేము, దారిద్ర్యలోకంబునందు
సౌఖ్యమును బొందెడు విచిత్రజాతి మాది!

సదమలానంద నవసుధాసారనిధుల
గర్భములఁ దాల్చు నీలమేఘములు మేము!
మీ కృపాదృష్టి యను గాలి సోఁకెనేని
కురియుదుము ధాత్రిపై సుధాకుంభవృష్టి!

ఆత్మసుఖముఁ గోరి యర్థింప మేవేళ
లోకసుఖమె సుకవి లోక సుఖము
మా కొనర్చు మేలు లోకం బనుభవించు
వలయు బిచ్చ మిచ్చి పంపరయ్య!

సుకవీంద్ర సహవాస సుఖముఁ బొందనివాని
 ధన మేల? వాని యార్జన మదేల?
కవిరాజ సన్మాన గణుతిఁ గాంచనివాని
 ధన మేల? వాని యార్జన మదేల?
కవిచంద్రచంద్రికా కలన మబ్బనివాని
 ధన మేల? వాని యార్జన మదేల?
కవిరక్షణోద్యోగ కాంక్ష కల్గనివాని
 ధన మేల వాని యార్జన మదేల?
ఆదరామృత బిందు భిక్షార్థు లగుచు
పంచఁ జేరి సత్కవులు ప్రార్థించుచున్న
కంటఁ జూడని పాపిష్ఠఘాతుకాత్ము
ధన మదేల? యార్జన మేల? తను వదేల?

సత్కవుల దుఃఖపెట్టంగఁ జనదు మీకు
వారి వేఁడినిట్టూరుపుల్ భవదనంత
వంశనాశంకరోద్భూత ప్రళయ దహన
దారుణజ్వాల లగుఁ జుఁడీ ధనికులార!!

# ౪. చరిత్ర

## *బుక్కరాయని విద్యానగరము—నాఁటి యన్యదేశ పరిస్థితులు

సిరిపి ఆంజనేయులుగారు,

**1. బుక్కరాయఁడు రాజ్యారూఢుఁ డగుట.**

హరిహరుని వెనుక నాతనితమ్ముఁడగు బుక్కరాయఁడు క్రీ. శ. ౧౩౫౧ వ సంవత్సరమున విద్యానగర సింహాసనము నధిష్ఠించెను.

సామ్రాజ్యలక్ష్మీం అధిగమ్య తస్మాత్
శ్రీబుక్కరాజో విజయోర్జితశ్రీః;
యో భూతభావిక్షితిపాలజాలం
అత్యక్రమీత్ విక్రమవైభవాభ్యామ్.

సర్వార్వఖర్వఫలోత్తరా వసుమతీ నిష్కంటకోత్కంటికా
నిశ్శేషీభవదీతిభిర్ అమితోదర్కోన్నితర్కోజ్ఝితా;
జాతస్ఫీతజనోత్సవో జనపద స్సంపన్నసమృద్ధా స్సదా
యస్మిన్ బుక్కమహీపతౌ సమభవత్ విశ్వంభరారక్షకే.

*  *  *  *

యత్తుంగభద్రాంచిత పాదపీఠం
భద్రాసనం భాసురి హేమకూటం;
క్షోణీజనానాం పరిరక్షణార్థం
తస్మిన్ విరూపాక్ష ఇవాధ్యతిష్ఠత్.

—ఎపిగ్రాఫియా కర్ణాటికా, సంపు. పి. సం. ౨౫౬, పుట ౫౨౧.

నాఁటి విద్యానగర వైభవమునుగూర్చి కుమారధూర్జటి యిట్లుఁగ నభివర్ణించెను. అందుండి రెండు పద్యములు—

సీ. శ్రీరమారమణ విహార గేహగృహంబు
బహుశోభనాన్విత ప్రత్యహంబు
సతత పౌరజనాచరిత విస్తృతమహంబు
దుర్వారచతురంగ ధూర్వహంబు
శ్రీమహాగత్సుమ గంధ సహిత గంధవహంబు
దీపితారాతి గర్వాపహంబు
నాయికా నాయకోన్నత రహఃకలహంబు
సర్వవస్తుప్రాప్తి సంగ్రహంబు
మహిని గహిమీలు నొగి పంపానదీత
రంగసంఘ ఘుమంఘుమా రవ విధూత
జాహ్నవీనిమ్నగా సుధా సాగరంబు
విజయనగరంబు సుజనసంవిత్కరంబు.

సీ. మధురసాధిక సుధా మధురసారోల్లస
న్మధురసావల్లరీ మహిమతోడ
సురసాలతుల్య భాసురసాలపనసమత్య
సురసాలజంబీరతరులతోడఁ
బున్నాగ హితసూన పున్నాగసంచర
త్పున్నాగ కైతవ స్ఫారతతోడ
బాలికారమణీయ పాలికాపన మధు
పాలికాసార సంపదలతోడ

---

* నే నీవ్యాసమున బుక్కరాయని విద్యానగరమును గూర్చిమాత్రమే వర్ణింపఁబూనక, రాయని సామ్రాజ్యమును, బరిపాలనాదికములను గురించి సంక్షేపముగఁ దెల్పుచు, నాఁటియన్యదేశపరిస్థితులఁ గొంతవఱకు సూచించినాఁడను. వాని నొండొంటితోఁ బోల్చిచూచుట పాఠకులధర్మమయి యున్నది. పదునాల్గవ శతాబ్దమునందలి ప్రపంచచరిత్ర ముక్కవాలు విలోకించి, నాఁటి విద్యానగర సామ్రాజ్యపరిస్థితుల నింకను గాఢముగఁ బరికించునో, నాకాలపు ప్రపంచచరిత్రమున విద్యానగరమున కట్టిస్థాన మీయఁ దగియుండునో యది చరిత్రగ్రాహకులకు సుబోధము కాఁగలదు. ప్రౌఢదేవరాయనియు, కృష్ణదేవరాయనియు, రామరాజుయొక్కయు పరిపాలనమున విద్యానగర సామ్రాజ్య మత్యుచ్ఛదశలో నుండినది; గాన నప్పటి రాజ్యాంగవిషయముల నన్యదేశపరిస్థితులతోఁ బోల్చిచూచిన, మిగుల స్వారస్యముగ నుండనోపు. ఈవ్యాసరచనమున 1. Bellary District Gazetteers, 2. The Never to be Forgotten Empire, 3. Humpi Ruins, 4. An Advanced History of Great Britain, Book III by T. F. Tout, 5. History of Europe 6. వీరేశలింగము పంతులుగారి యాంధ్రకవుల చరిత్రము, 7. మహమ్మదీయమహాయుగము-అను గ్రంథము లేదును సాధనములుగ నుండి నాకుఁ దోడ్పడినవి; కనుక నీగ్రంథకర్తలయెడ నేను గడుఁ గృతజ్ఞుఁడను. సి. ఆ.

మల్లికా వల్లికా గిరి మల్లికాను
తల్లికలతోడఁ దాళహింతాలకదళి
కా వకుళసంసుములతోడ ఘనసుమాలు
నాగ! విద్యానగర మహోద్యానతతులు.

ఈ విద్యానగరపట్టణము నిర్మించుటలో హరిహరుఁడే ప్రాధాన్యము వహించియున్నను, దానిని బలకోటలయందును, సామ్రాజ్యమును విస్తరింపఁజేసి రాష్ట్రభాగముల నేర్పరచుటలోను బుక్కరాయఁ డత్యధిక ప్రయాస వహించియుండుటచే, నీతఁడు కిరీటధారి యగునప్పటికి విద్యానగరసామ్రాజ్య మత్యంత బలవత్తరస్థితి నందియుండెను.

## 2. మంత్రులు

బుక్కరాయనికడఁ సేవలను సామర్థ్యముగల సమర్థులైన మాధవాచార్యుఁడు, మాధవమంత్రి, బచ్చిరాజు, ముద్దప్ప, బసవదండనాథుఁడు, అనంతసాగరుఁడు మొదలగు మంత్రులు పలువురుండిరి.

౧. మాధవమంత్రి — విద్యారణ్యస్వామియని ప్రసిద్ధినొందిన మాధవాచార్యుఁడును నీమాధవమంత్రియు నొక్కరేయనుచు ననేకుల భ్రమ: కాని మాధవాచార్యుఁడు వేఱు; మాధవమంత్రి వేఱు. ఇరువురకును చంద్రులు వేఱు. శాఖలును, గోత్రములును వేర్వేఱు. మాధవమంత్రియు విద్వాంసుఁడే యైనను మాధవాచార్యునకుఁ దుల్యుఁడు గాక రెండవతరగతిలోనివాఁడై కన్పట్టును. మాధవమంత్రి శైవబ్రాహ్మణుఁడని తెలియుచున్నది. ఇతఁడు క్రియాశక్తిపండితుని శిష్యుఁడఁట. ఇతఁడు హరిహరుని యనుజుఁడైన ఉమ్మఁడను మారభూపతి యొద్దసహితము మంత్రిగ నుండినవాఁడు. ఈ మహామాత్యవరుఁడు గోవా కూటమును (సంగ్రామపురి) రాజధానిగఁ జేసికొని, పదునెన్మదిమండలముల రాష్ట్రమగు నాగరఖండమును రాజప్రతినిధిగాఁ బరిపాలించెను. ౧౩౭౪ వ సంవత్సరప్రాంతమున నీతఁడు గోవానగరమును (మహమ్మదీయులను దోమి) వశపఱచుకొనెను. కేవలము రాజ్యాంగ వ్యవహారములయందే కాక యితఁ డాధ్యాత్మిక విషయములయందును నిపుణుఁడు; కావుననే యుపనిషద్దర్శనపాలనకుశలుఁడయి వేదసంచితుఁడైన విలసిల్లెను. ఈయశోవంతుఁడు భువనైకవీరుఁడనియు, ఉపనిషన్మార్గప్రవర్తకాచార్యుఁడనియు బిరుదము లున్నట్లు ఎపిగ్రాఫియా కర్ణాటికా (సం. ౮, సంఖ్య ౨౬ గల) తీర్థహళ్లిశాసనము నుడువుచున్నది. ఈతని శైవామ్నాయసారము, మాధవనిదానము నేఁటికిని మనదృక్పథమునఁ బడుచున్నవి.

౨. అనంతసాగరుఁడు — ఈతఁడును పేరొందిన ప్రధాని. పెనుగొండకు బలాఢ్యమైన దుర్గమును నిర్మించినవాఁడు. బుక్కరాయని యొకప్ర కుమారుఁడగు భాస్కరరాయఁ డీమహాప్రధాని పేరననే యనంతసాగర మను తటాకమును త్రవ్వించెను.

౩. బచ్చిరాజు — మంత్రులలో నత్యంతపరిభక్తి గలిగి స్వామికార్యనిరతుఁడును, భగవదారాధనతత్పరుఁడును నయి కీర్తిమంతముగ దేశసేవ యొనరించినట్టిఁడీ బచ్చిరాజు. ఈమహాభాగుఁడు బుక్కరాయసముద్రము, కీర్తిసముద్రము, మాలప్పచెఱువు, నాగప్పచెఱువు, బచ్చప్పచెఱువు మొదలగు తటాకములను నిర్మించి, చౌడప్పకాలువను త్రవ్వించెను. ఇట్టి ఘనకార్యములవలనను, 'బచ్చన్న', 'కంపన్న' యను నామములతో నాణెములు వేయించి వాని నభివృద్ధినొందించుటచేతను నీతఁడు మిగులఁ బ్రసిద్ధినొందెను. ఈయశోధనుఁడు మల్లికార్జునస్వామిప్రతిష్ఠ చేయించి, రెండవహరిహరుని కాలమున ౧౩౮౨ లోఁ దనధర్మపత్నితోడ తుంగభద్రానదీతటమున స్వర్గారోహణ మొనరించినట్లు తెలియుచున్నది.

౪. తదితరులు — దూరదృష్టిగలిగి స్వధర్మములను జాలఁ బాటవముతో నిర్వహించుచు, వాసికెక్కిన మంత్రులలో ముద్దప్ప యొక్కఁడు. అందఱిలోను ప్రముఖుఁడు మాధవాచార్యుఁడు. రాయఁడు రాజకీయ సారస్వత విజ్ఞాన విషయములందును, పరిపాలన వ్యవహారములయందును ముఖ్యముగ నీమాధవవిద్యారణ్యుని యభిప్రాయమే శిరసావహించుచుండెను.

## 3. సారస్వతము

బుక్కరాయని పరిపాలనమున సంస్కృతాంధ్ర భాషలకు నంటికిని సమానముగ నాదరణ ముండెను. ఈ మహాప్రభుఁడు సాయన మాధవులను బ్రోత్సహించి, స్వీయనామాంకితముగ వారిచే వేదములకు భాష్యములు వ్రాయించెను. ఇవి సాయనవేదభాష్యము లను పేరున భారతలోకమున మిగుల విఖ్యాతిఁ గాంచినవి. మాధవమంత్రియు నీమహారాజాదరణమువలననే పెక్కుకృతులు రచించుట.

బుక్కరాయనికాలమున సుప్రసిద్ధాంధ్రకవియగు నాచన సోముఁడు విద్యానగరమునందే యనేకాంధ్ర ప్రబంధములను విరచించెను. పెంచుగలదిన్నె దానశాసనమువలన నీకవి యాపస్తంబ సూత్రుఁడనియు, భారద్వాజ గోత్రుఁడనియు, యజుశ్శాఖీయుఁడనియు, సకలాగమవేదియనియు, అష్టాదశపురాణాభిజ్ఞార్థవేదియనియు, భాషకవిత్వనిర్మాణధౌరేయుఁడనియుఁ దెలియుచున్నది.

" పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ,
ఆపస్తంబాఖ్యసూత్రాయ భారద్వాజాన్వయాయినే. ౧౯
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే,
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే. ౨౦
భాషాకవిత్వ శ్రీవాణీ విజితసంపదే,
సోమాయ నాచనాంభోధేః సోమ యామితతేజసే ". ౨౧

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడగు నాచనకుమారుఁడు. సోమనాథుని వాసస్థానము 'నెల్లూరి మండలమునందలి యేదో యొక గ్రామముగఁ దోఁచుచున్న' దని శ్రీ వీరేశలింగము పంతులు వ్రాసెను; కాని బుక్కరాయనివలన నాచన సోముఁడు పొందిన యగ్రహారము

రాజరాజభుజంగో యః పరరాజ భయంకరః,
హిందురాయ సురత్రాణ ఇత్యేతై రుపశోభితః." (౨౪

హిందూరాజ శిరోమణియనియు, తీవ్రశాసనుఁడనియు, శత్రు రాజహంతకుఁడనియు, వసత్యవాదులపట్ల యమసదృశుఁడగు నాయకుఁడనియుఁ, బ్రాక్పశ్చిమదక్షిణ మహాసముద్రాధీశుఁడనియుఁ, బ్రాచీన శాసనము లీప్రతాపాఢ్యునిఁగూర్చి నుడువుచున్నవి; మఱియు నీతఁడు ప్రతిబద్ధమగు ధైర్యసాహసౌదార్యనిధియనియు, సంగ్రామరంగమున రోషాధీనమానసుఁడై యకుంఠిత బాహావిక్రమము నెఱపు వీరాధివీరుఁడనియు, నాహవక్షోణిని గాలాంతకునివలె విజృంభించుచుఁ బరిపంథి యోధుల నెదుర్కొనినపు డాతని తీక్ష్ణప్రతాపాగ్నికిఁ దురుష్క సుల్తానుల వదనాబ్జములు వాడి వత్తులగుచుండెననియు, విరోధిరాజులు ముఖావలోకన మాత్రముననే పడఁడిపోవుచుండిరనియుఁ దెల్పు నాధారము లెన్నియో కలవు. అందొక్కటి—

"భంగాఃకళింగా మితశౌర్యవృత్తేః గ్వంగా విభిన్నాంగ విఘూర్ణ నేత్రాః;
అంధ్రశ్చ రంధ్రాణి విశంతి యస్య, బాహాగ్రఖడ్గేన విశీర్యమాణాః.
తురుష్కాశ్చ ముష్కావసనాః పాండ్యభూపాః పలాయితాః,
స్వభుజార్జితవీర్యేణ తస్మిన్ రాజ్యం ప్రశాసతి."

ఇట్టి వీరవతంసమునకు ఫెరిస్తా గచించిన భామినీసుల్తానుల చరిత్రమున నోఁగులకున్నచోటఁ దావు లేకపోవుట విపరీతవిషయము గాకుండునా? ఈవీరుఁ డగ్రజుని యేలుబడి సమయముననే తురుష్కులను దఱిమి, తుంగభద్రానదికి దక్షిణముననున్న రాష్ట్రమంతయును, దూర్పున నోఢ్రకళింగదేశములను జయించెను. ఈతనిరాజ్యసరిహద్దాంధ్రకాంభోజ కొంకణఘూర్జర తురుష్కరాజులకు పోటుబల్లెమయి యుండెను. ఇతఁడు బల్లాలరాజులకును, నోరుగంటి ప్రభువులకును, దక్షిణ సామంతనృపతులకును నండయై, వారియున్నతిని బోషింప నన్నివిధములఁ బ్రయత్నింపఁజొచ్చెను. దక్షిణదేశమందలి రాజులందఱును గల్పకముపలెఁ దమకు రక్షకముగ నుండెడి యీవిద్యానగర పాలకుని పురోభివృద్ధియే నిరంతరము నభిలషించుచుండిరి.

## 8. రాజ్యవ్యాప్తి

ఫెరిస్తా రాయని సత్త్వహీనునిగఁ జిత్రించినను, రాయఁడు తన రాజ్యమును నలుదెసలకు వ్యాపింపఁజేసెననియు, నాతనికాలమున విద్యానగరరాజ్యము భామినీరాష్ట్రమునకంటె సర్వవిధముల నుత్కృష్టదశయం దుండెననియు నాతఁ డంగీకరించుచున్నాఁడు; వెండియు నోరిస్సా కొలంబో మలబారురాష్ట్రములయు, సింహళము మొదలగు ద్వీపములయు నృపులీప్రభున కనర్ఘములైన కానుక లేటేటఁ బంపుచుండిరనికూడ నాతఁడు వ్యక్తపఱుచుచున్నాఁడు. సమకాలికులగు ప్రభువులందఱిలోను బుక్కరాయఁ డెల్లవిధముల నద్వితీయుఁడై విలసిల్లెనని చరిత్రములు రూఢిగఁ దెల్పుచున్నవి.

## ౯. నాఁటి భారతదేశభాగములు

బుక్కరాయని రాజ్యాంగ వ్యవహారములనుగుఱించి వర్ణించుటకుముందు నాఁటియన్యదేశపరిస్థితుల నిట సంగ్రహముగ నివేదించెదము. ఆదినములలో భారతదేశమున దక్షిణమునందు భామినీ విద్యానగర రాజ్యములును, నుత్తరహిందూస్థానమున మేవాడ ఢిల్లీ రాజ్యములును బలవత్తరదశలో నుండెను. కృష్ణానదికి దక్షిణమునఁగల రాష్ట్రభాగములన్నియు, భుజబలరాయఁడగు బుక్కరాయని బాహాటోపకారణమున నన్యరాజులసలని యొత్తిడినిగూర్చి కలనైనఁ దలఁపక నిర్విచారముగ నుండి, సుఖజీవనము చేయుచుండెను.

౧. భామినీరాజ్యము—వింధ్యకుదిగువ 'హసన్ గంగూ భామినీ' యను తురుష్కసరదారునివలన స్థాపింపఁబడిన భామినీరాజ్యము పక్కను నందలి హిందువులకును, హిందూరాజ్యములకును బ్రక్కలోని బల్లెమయి యుండెనది. బుక్కరాయఁడు రాజ్యారూఢుఁ డగుటకు మూఁడేండ్లకు ముందు ౧౩౪౭ న నీరాజ్యము నెలకొనిన దగుటవలనఁ గ్రొత్తయగుటలో భామినీప్రభుల పాలనసీ స్వరాజ్యములోని యన్యజాతి జనులకును, బరిసరమండల ప్రజలకును బహువిధవేదనాకరమై దుస్సహముగ నుండెను. ఆపాలకులు తమరాష్ట్రమునందలి మతాంతరులఁ గడగంటఁ జూచుచు నాప్రజ కెట్టియల్పాపరాధముఁ గావించినను వారిని గ్రూరశిక్షలకు గుఱిచేయుచుండిరి. బుక్కరాయని సమకాలీనుఁడగు మహమ్మదుషా తనపాలనమునఁ జెల్లుబడిగా నుండిన వెంకినాతెగములు కరఁగించిన హేతువున, నసంఖ్యాకులగు హిందువులను గఠినదండనల పాలుగావించెను. తనరాజ్యపుఁ బొలిమేరలలోనుండు నోరుఁగల్లు, ఓఢ్రము మొదలగు రాష్ట్రములపైఁ బడి, జనులను బాధించి, వారిసంపదలెల్లఁ గొల్లఁగొని వెళ్లుచుండువాఁడు. ఇట్టి యాతనిదాడి సైఁపఁజాలక యోరుఁగంటిరాజు నాల్గుకోట్లరూపాయల వెలగల రత్నోపచితకనకాసనముఁ జేయించి యిచ్చెనఁట. ఇట్టి కారణములచే నాప్రాంతవాసులు శాంతియనునది లేక, యెప్పుడేమి దాపురమగునో యని దిగులు చెందియుండిరి.

౨. మేవాడరాష్ట్రము—రాజపుత్రస్థానమున మేవాడరాష్ట్రపాలకుఁడగు హమీరుఁడు బుక్కరాయని సమకాలీనుఁడు. హిందూదేశభాగములలో నీమేవాడరాజ్యము చాలఁ బురాతనమైనదియు, నద్వితీయమైనదియు. నాఁటి సంస్థానములలో నెల్ల శిరోభూషణముగ వెలసిన చిత్తోడ్గడము దీనిప్రధాన నగరము. ౧౩౦౩ వ సంవత్సరమున నల్లాయుద్దీను చిత్తోడ్గడమును ముట్టడించి మేవాడరాజ్యమును హరించినవిధానము చరిత్రప్రపంచమునఁ జాలఁ బ్రాముఖ్యమైనవిషయము. ఆసందర్భమున రాజపత్నులు, కన్యలు మొదలగు సాధ్వీమతల్లులెల్లరు మానరక్షణార్థమై వీతిహోత్రునకుఁ దృణములలీలఁ దమప్రాణముల నర్పించిరి. రాజ్యసంరక్షణమునకై వేలకొలఁది రాజపుత్ర వీరయోధులు శాత్రవసమరాంగణమున ప్రతాపదవానలాభీలకరాళకీలలఁ గాఁగిలించుకొని కరఁగిపోయిన విషయము మఱవఁగానిది. ఆ సమయముననే



తీయని తలంపులు

ఛాయాచిత్రకారుడు: శ్రీయుత యమ్. కె. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.



విచారార్పణ విరామము

ఛాయాచిత్రకారుడు: శ్రీయుత యమ్. కె. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.

మేవాడ సామ్రాజ్యాధినాథుఁ డగు లక్ష్మణసింహుఁడు, నాతని పదునొకండుగురు పుత్రులు వీరస్వర్గ మలంకరింపఁబోయినది. ఈ లక్ష్మణసింహుని ప్రథమసుతుని కుమారుఁడే పైనఁ బేర్కొనిన హమీరుఁడు. యుద్ధావసానమున నీ హమీరుఁడు జీవించియున్నను సామ్రాజ్యము తురుష్కుల యధీనమగుటచేఁ, దాను కేల్వారాలో నజ్ఞాతవాస మొనర్పవలసివచ్చెను. అయిన నా వీరుఁ డధైర్యము నొందక యచ్చటివారగు భిల్లుల నైదువేలమందిని గూర్చుకొని, తురుష్కుల పరగణాలపైఁ బడి పట్టణములఁ గొల్లగొనుచు, వాని నొక్కటొక్కటిగ నాక్రమింపఁ దివిరెను. ఇవ్విధమున నాతఁడు రాజ్యసంపాదనమునకై బహువిధంబులఁ బ్రయత్నించుచు మహమ్మదీయులకుఁ బ్రబలప్రతిస్పర్థియైనను, నాఢ్యప్రతినిధియగు మాలవదేవునితో మైత్రిసల్పి, యాతనికుమారినిఁ బరిగ్రహించి తిన్నగ నాదుర్గము సయితము చేకొనెను. ఇది తెలిసి యప్పటిఢిల్లీశ్వరుఁడగు మహమ్మదుఖిల్జి హమీరునిపైకి రాఁగా, చిత్తోడనాథుఁడు బూందీ, గ్వాలియరు, జయపురము, మోహపురము మున్నగు సంస్థానాధిపులను దనవంకకు మరల్చుకొని, వారితోడ్పాటునఁ దురుష్కసైన్యము నోడించి, మ్లేచ్ఛరాజును బట్టి మూఁడుమాసములకాలము చెఱలో నుంచెను. హమీరుప్రభుత్వాంతమునఁ జిట్లు మాసిపోయిన సిసోదియా వంశజుల కీర్తిజ్యోత్స్నలను రాజపుత్రస్థానమున మరల వెలుఁగొల్పుటకై సల్పిన పరిశ్రమ మింతింత కాదు. ఇందుకొఱకే యాతఁడు తనజీవితకాలమునఁ జాలభాగము వినియోగింపవలసిన విధిగ సందర్శించెను. అతఁ డనవరతము సమరవిహార మొనర్చుచు ఢిల్లీసామ్రాట్టులవలనఁ దన రాజ్యమును వ్యాపింపఁజేసెను! మేవాడరాష్ట్ర మిట్లయి నిరంతరము కలహోగ్రమున మగ్నమగుటచే, నశాంతజీవనమున కష్టనష్టముల నెడు తరంగములనడుమ నటు నిటు లూఁగులాడఁగవలసిన పరిస్థితి నాఁటి రాజపుత్ర ప్రజాతతికిఁ దప్పనిసరిగఁ బ్రాప్తించి యుండును; గాన నానాఁడు మేవాడ రాజ్యసౌఖ్యము సన్నగిలియుండె ననఁదగును.

3. ఢిల్లీ సామ్రాజ్యము—బుక్కరాయుని సమయమున నుత్తర హిందూస్థానము 'ఫిరోజు తుఘలకు' అను నాతని పరిపాలనమున నుండెను. ఆపాదుషా తన పినతండ్రియగు మహమ్మదు తుఘలకు నిర్మించిన కఠోరశాసనముల నెల్లఁ దొలఁగించి ప్రజాహితమున కత్యవసరములగు కైంకర్యముల నెన్నింటినో కావించి యోగ్యరాజని పేరొందెను, నాతని మతవిద్వేషము మాత్రము హిందువులకు దుస్సహమయ్యెను. హిందువుల మతగ్రంథములను, వారి దేవసదనములను, విగ్రహములను ఫిరోజుపా డొనర్చుటయే కాక, యాతఁ డొక్కొక హిందువునకును జుట్టుపన్ను విధించెను. దానిఁ జెల్లింపక యెందఱో ప్రాణములను గోల్పోయిరి. కాని పాదుషా పన్ను గ్రహించుటను మాత్రము మానఁడయ్యెను. నాస్తికమత మవలంబించుట లంచమును గ్రహించుటనువలె నపరాధము క్రిందఁ బరిగణించి, యట్టి మతావలంబులకు శిక్ష విధించుచుంటినని ఫిరోజు స్వీయచరిత్రమున వ్రాసికొనెను. ఇట్టి నిరంకుశాధికారపూర్వకమగు మతవిద్వేషము దావవహ్నివలె దహింపఁజొచ్చుటచే, మతాభిమాననిరతులగు హిందువు లనేకు లభిజనము వీడి, శాంతికరజీవనమునకై విద్యానగరమునకుఁ దరలుచుండిరి.

## 10. యూరపు

౧. సారసన్ సామ్రాజ్యభాగము:—పదునాల్గవ శతాబ్దమున యూరపు ఖండమునందుఁ దత్కాలస్థితిలో నుండిన రాష్ట్రములలో 'సారసన్ మహాసామ్రాజ్య భాగ' మను స్పెయిన్ ముఖ్యమైన దనవచ్చును. ఒకటవ శతాబ్దమున నిది (స్పెయిన్) పోర్చుగల్ రాష్ట్రముతోఁ జేరి 'ఐబిరియన్ భాగము' (Iberian Plc) అను పేర రోమకసామ్రాజ్యమున నంతర్గతమయి యుండి, నాల్గువందల సంవత్సరముల కాలము సామాన్యాభివృద్ధి నందుచుండెను. దరువాత విసీగాత్తుల (Visigoths) వశమయి యైదేసి శతాబ్దములలో నుత్కృష్టస్థితి నందుటయు యూరపు చరిత్రపాఠకుల కెల్లరకును విస్పష్టమే. అంతట రెండవశతాబ్దమునకుఁ బూర్వమే ఫ్రాన్సు (France) దేశము నాక్రమించి, రోమకసామ్రాజ్యమునుండి దానిని విడఁదీసికొనిన ఫ్రాంకులు స్పెయిన్ రాష్ట్రమును విసీగాత్తులనుండి లాగ యత్నించుటచే నల్లకల్లోలములు ప్రబలె ననుటయుఁ గ్రొత్త కాదు. ఏడవశతాబ్దారంభములో రోమకసామ్రాజ్య ప్రభుఁడగు 'జస్టినియన్' విసీగాత్తుల బారినుండి స్పెయిన్ దేశము నూడఁదీయఁ బ్రయత్నించుటయు, నాతఁడు మరణింపఁగనే విసీగాత్తుల మరలఁ జెలరేఁగుటయు సుప్రసిద్ధాంశము. ఏడవ శతాబ్దాంతము వరకు నిట్లు స్పెయిన్ విషమ పరిస్థితులకు దావలమయి యుండినను, దదభివృద్ధికి మాత్రము లోపము గలుగలేదని యూరపు చరిత్రవలన మనకు గ్రాహ్యమగుచున్నది. ఎనిమిదవ శతాబ్దారంభము (౭౧౧)లో నరబ్బీలు మహమ్మదీయ మతమును వ్యాపింపఁజేయుటను, నాసియా పశ్చిమరాష్ట్రములనే కాక యాఫ్రికా యుత్తర భాగమునంతయును లోఁబఱచుకొని, యాపైని జిబ్రాల్టరుసంధిని దాఁటి, స్పెయినును జొచ్చి, దానిని స్వవశ మొనర్చుకొనిరి. అరబ్బీలిట్లు సాధించిన రాష్ట్రముల మొత్తమే పైనఁ బేర్కొనిన సారసన్ మహాసామ్రాజ్యము. ఇది మహమ్మదీయఖలీఫాల పాలనమున ౧౪౯౨ వరకు రమారమి ౭ వందల యేండ్లకాలము క్రమోన్నతి నందినది. పదవ శతాబ్దానంతరము కలహములు పైకొని యాందోళనములు పయింబయిని హెచ్చిల్లుటచే, నన్యదేశముల దాడి నుండి తొలఁగి తనస్వాతంత్ర్యమును, బ్రతిభను నిలుపుకొనుట కొఱకే సామ్రాజ్యము స్వసంరక్షణార్థము సైన్యసన్నాహ వ్యాపారమున మగ్నమగుటవలన నాగరకతాభివృద్ధికిఁగాని, కళాభివృద్ధికిఁగాని చేయఁదగినంత కృషి యది చేయఁజాలక పోయెను. అయినను నాఁటి సామ్రాజ్యపాలకులు యూరపు నాగరకతకు బీజార్పణ మొనర్పఁ గలిగిరని మాత్రము చెప్పక తప్పదు.

౨. ఆంగ్లదేశము—నాగరకతయం దేమి, యైశ్వర్యమున నేమి, నేఁడు ప్రపంచమున నసాధారణ వైభవమున విలసిల్లెడి యాంగ్లభూమి

# సి సి లీ

## రంగనాయకులు గారు (అధ్యాపకులు)

కృష్ణాపత్రికయం దీవరకొక్కసారి, ఇటాలియను ప్రజలు, ఎటుల స్వాతంత్ర్యమును సంపాదించుకొనినది వర్ణించియుంటిని. ఇటలీ ప్రజల స్వాతంత్ర్యరక్షకులు ప్రేమోకుల లాగుటకు, అనేక యోధులు కాలక్రమేణ వచ్చుచుండిరి. అందు మాజ్జినీ, గారిబాల్డీ, కావూరు, విక్టరు ఎమ్మాన్యుయేలు అనువారు సుప్రసిద్ధులు. వారిలో గారిబాల్డీ, యనువారు స్వాతంత్ర్య మహోన్నతమును తన ప్రజలకు సంపాదించుటకై కంకణము గట్టుకొని స్వతంత్రముగ నొక బలగమును దక్షిణ-ఇటలీయందు బయలుదేరదీసి ఈభాగమున కష్టతరమైన నేపుల్సురాజును అనేకమారు బెదరించుచు, ఓడించుచు, తానోడినప్పు డెల్ల "సిసిలీ" యను ద్వీపమునకు పరుగెత్తి, దాగొనుచు, చాల శ్రమ కల్గించెను. క్రమముగా గారిబాల్డీ బలగము వృద్ధియయ్యెను. "సిసిలీ" ద్వీపము నేపుల్సురాజ్యము నుండి విడిపడి, ఆయన పరిపాలన క్రిందకు వచ్చెను. అంత, గారిబాల్డీ సిసిలీ ప్రజల సమ్మతితో, దక్షిణ ఇటలీపై దాడివెడలి, నేపుల్సురాజ్యమును వశపరచుకొని, ఇటలీస్వాతంత్ర్యపతాకమును నాటి, అంత రోము మహానగరమును వశపరచుకొనుటకై తన సైన్యమును నడుపదలచెను. కావూరు మహామంత్రి సలహాపై, ఎమ్మాన్యుయేలు మహారాజు గారిబాల్డీని దక్షిణ ఇటలీయందు కలుసుకొని గౌరవించి ఆతనిక్రిందనున్న రాజ్యమునంతను తనకు ధారాగతము చేసుకొనెను. దానితో, ఇటలీదేశమంతయు పీడ్మోంటురాజైన ఏమ్మాన్యుయేలు క్రిందకు వచ్చి, ఏకరాజ్యమై పరదేశీయుల పరిపాలనమునుండి విడివడి స్వతంత్ర జాతీయప్రభుత్వమును బొందెను. అట్టి మహాకార్యమునం దెక్కువగా సాయపడిన "గారిబాల్డీ"కి వాసస్థానము ఈ "సిసిలీ" ద్వీపము. ఆమహావీరుని అనుసరించి, ఇటలీకి స్వాతంత్ర్యామృతకలశమును అడుగకయే, ప్రతిఫలము గోరకయే తమ వేలకొలది ప్రాణముల సమర్పణ మొనర్చినవిమ్మట, లక్షలకొలది ధనము వెచ్చించిన పిమ్మట దేశమాతకు కానుకగా అత్యధికభక్తితో నేపుల్సురాజ్యము నిచ్చిన మహావీరులు ఈ "సిసిలీ" ద్వీపవాసులు. ప్రతి ఇటాలియను ఈద్వీపము గాంచినప్పు డత్యుత్సాహయుతుడగు. సిసిలీ ప్రజలయం దప్పటి నుండి ఇటాలియను ప్రజల కత్యంత ప్రేమ, భక్తి, నమ్మకము కలవు.

ఈ "సిసిలి" ద్వీపము ప్రక్కగా, "మెస్సిని" జలసంధి ద్వారా, ఇప్పటికి నాల్గుమారు లిదివరకె వెళ్ళియుంటి. ఐదవసారి కూడ నీద్వీపముజూచు. నత్యుత్సాహము అప్రయత్నపూర్వకముగ కల్గుచున్నది. వీరులకు జన్మస్థానముగుటయే కాక, పాశ్చాత్య ఖండమునందెల్ల ప్రఖ్యాతి గాంచిన భయంకరమగు, "ఎట్నా" యను నగ్నిపర్వత మిందు కలదు. ఐరోపాఖండపు ప్రజలకందరకు ప్రేమపాత్రము, రుచియుక్తమునగు ద్రాక్ష యీద్వీపమునందలి ప్రధానమైనపంట. ద్రాక్షసారాయి యనపాదుశాలలు అత్యంత ప్రీతికరమై యుండెడిది. ఫ్రాన్సు, ఇటలీ, సిసిలీలయందు ప్రతివారు రీసారాయిని అధికముగ త్రాగి, ఆనందించు చున్నారు. ఒకప్పు డింగ్లండుకు ప్రధానమంత్రియైన "డిజ్రేలి" యనువారు ఈదేశములవారికి ఇంగ్లీషువారు బాగు-ఇనుములనిచ్చి సీమ సాక్షుతముగు "ద్రాక్షసారాయి" తిరిగికొను పదుపాయము లున్న ఎంతయో సుఖమనెను. అట్టి సుఖప్రదమగు ద్రాక్షసారాయి ఈ ద్వీపముయొక్క ప్రధానమైన పంట! వ్యవసాయమా, కొల్ల. వరిపండను కాని, కూరగాయలు సమృద్ధి. జొన్న, గోధుమలు పండును. ఇచ్చటి గోవులు ప్రసిద్ధి గాంచినవి. గోవులకు వలయు పచ్చికబయళ్లు శృంగారదేవత కాభరణములు.

ఇంగ్లీషు దేశపు ప్రధానకవు లెల్లప్పు డిటలీయందు కొంతకాలము గడపుచుండెడిరు. పాశ్చాత్యదేశములకవు లనేకులు, తమజీవితములం దనేకమారు లిటలీదేశమునందు విహారముల నొనర్చెదరు. అందు, సిసిలీ ద్వీపము వారందరికి అత్యధికప్రేమపాత్రము. "సృష్టి" తన యాభరణముల నన్నిటిని విప్పిపెట్టి సముద్రమునందు స్నానమునకై దిగి, మహారాయోధారిపై తేలి, తిరిగి తనయాభరణముల నైకొనమరచినదా యనునట్లు ఈద్వీపము తళతళలాడుచుండును. మార్గపుగ 20 మైళ్ళపొడవుగ ద్వీపముయొక్క గొప్పయొకతట్టు కన్పట్టుచున్నది. ద్రాక్షపండ్లను పండింతురుగాన, కంచెలను ఒకదానివెంట మరొకటిగా భూమియంతట వేసియున్నారు. సముద్రపుటెల్లనుండి భూమి క్రమముగా గొప్పపర్వతములుగా పైకి లేచుచున్నది. అందువలన, ఈపెంక్షిపందిళ్లు ఒకదానిపై నొకటిగా నున్నట్లు, సృష్టియొక్క పూలహారముల వేయుచున్నట్లు, పచ్చనితోరణముల సృష్టియొక్క వివాహమునకు కట్టినట్లు పైకి లేచుచున్నవి. ఎత్తైన చెట్లు లేవు. గుబురుగానున్న యడవులు లేవు. కొండయంతయు సేద్యము చేయబడినది. ఎల్లెడ పచ్చనికంబళులతో సృష్టి శృంగారింపబడినదా యనున ట్లున్నది. ఒక్కకొండయనరాదు. వర్షములు కురియుటచే

కరగి రాయి పగిలి తుదకు గోపురములవలె ఒకదానివెంట మరొకటిగా ఒకదానిప్రక్క మరొకటి పైకిలేచును, అన్నియు గోపురప్రాకారములవలె పైకి కొండలవలె లేచుచు, తమమూడుముఖములందు రెండు మొగములమాత్రము కన్పరచుచు సృష్టివివాహమునందు పచ్చికముద్దలు భగవంతుని పూజించుటకై బ్రాహ్మణులు చేసిపెట్టిరా యనునట్లున్నవి. సృష్టికిమూడ ముత్యాలహారములు ఇష్టమే! కాని, ఇంకను అనాగరకస్థితియందుండుటవలనకాబోలు లంబాడీస్త్రీమెడయందున్న పూసల గుంపులు సరుసలవలె ఈద్వీపమునందీ ప్రక్క వానగోపురములవంటి నెత్తినుండి రాలు ముత్యములసముదాయముతో ఏర్పడిన మహానదులు చికిబికిగా వంకరటింకరగా అన్ని భాగములనుండి వచ్చి త్వరత్వరగా "సృష్టి"యొక్క యీసందర్భావ్యాపిలిత మగు సముద్రమునందు జేర పరుగిడుచున్నవి. సంతెనలు అనేకములు సముద్రతీరమువద్ద కన్పడుచున్నవి. అప్పటప్పట సీమరేగుపండ్లు, చెర్రీ పండ్లతోటలు తమ గుబురైన నెత్తులద్వారా దగ్గిరనున్న గొర్రెలగుంపుల దిగ్భ్రమింగబోవు తోడేలులవలె కన్పట్టుచున్నవి. అన్నిటిమధ్య అన్నిటిపైన నీలువిక్కినవొట్లు నెల్ల రాయియను భేదముగాని, పట్టణమను భేదముగాని యెరుంగక, పచ్చని మృదువగు బాలుర మొగపు సుఖవర్చస్సుతో పచ్చిక పెరుగుచు, కోపమనునది యెరుంగదా యనునట్లు, క్షేమముయొక్క యవతారమా యనిపించునట్లు బాలసూర్యకిరణములను నాభిరణములతో తెల్లగా, నల్లగా, పచ్చగా, తియ్యగా, కమ్మగా నవ్వుచు ప్రకాశించుచున్నది.

మేఘములు పర్వతశిఖరములపై నాడుచున్నవి. తమ మోహపరవశతచే ఇతరు లున్నారే యను భయము మాని, ఆబోసినెత్తులు కల్గిదిసములతో నున్న మాంసము లేక, నెత్తురు లేక, కళారహితమైరాత్రిని వెక్కిరించుచున్న ఆకొండశిఖరములకంటె అత్యధికముగ శృంగారవంతమై యొయ్యారయుతమై "రారమ్మని" పిల్చుచు, ఈరత్నకందరములకంటె మిాబోసినోటివా రంటుమనువారాయని హాయలు చేయుచున్న వృక్షములను, పచ్చికలను, తివాసీలను, శృంగారాధిదేవతల "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అన్న పెద్దనను జ్ఞప్తికిం దెచ్చునట్లు "కాకిబిడ్డ కాకికిముద్దనునట్లు" "నా కన్నులతో నాప్రియురాలి గాంచిన నీకుమోహమగునా" యనునట్లు ద్రోసిపుచ్చి ఆదిక్కుమాలిన కొండనెత్తులతో చెల్లాటలాడుచు జలకమాడుచు కుస్తీలబట్టుచు ఒకరినొకరు దాచుకొనుచు ఒకరితో నొకరు దాగుడుమూత లాడుచు మోహతత్వప్రభలయం దానందము బొందుచుండుట ఎల్లభాగములందు గన్పడుచున్నది. "ప్రేమ కుంను రంగుభేదములు, జాతిభేదము లుండజాలవు." "(Love nows no colour, no bar of nationality)" యనునట్లు తెల్లగ స్వచ్ఛందమైన ముత్యములవలె నున్న యీమేఘములు అసహ్యముగ కన్పడు నీశిఖరముల ప్రేమించుటత్యద్భుతముగ నున్నను, సృష్టివైచిత్ర్యములం దిదొక భాగముమాత్రమేకదా.

రైళ్లు అటునిటు పరుగెత్తుచున్నవి. మాబోటును వెక్కిరించుచున్నవా యనునట్లు అతివేగముగ బోవుచు మాటిమాటికి కూతల నిడుచున్నవి. అనేక "కౌను"లు భాగభాగమునందు కన్పట్టుచున్నవి. ప్రతిగోపురము చుట్టు నిండ్లు కలవు. గోపురపైభాగములం దుండ్లున్నవి. పట్టణములు, గ్రామములు మాత్రమే గుంపులుగుంపులుగా నున్నవని తలంపరాదు. ప్రతిపొలమునందు దాని రైతు తనయిల్లు కట్టుకొని నివసించుచు సాగుచేసుకొనుచున్నాడు. అందువలన దేశమునం దెల్లెడల ఇండ్లు కన్పడును గుంపులుగుంపులుగా నుండుట పత్తనములందే. ఇటులు ఎల్లెడ యిండ్లుండుటయు వానిపైనున్న యెర్రని పెంకులు వాని కిటికీలయద్దముల తళతళలు ఇంటిచుట్టు నున్న చిన్నిచిన్ని పండ్లచెట్లు అన్నియు కలిసి దేశమును అద్భుతముగ కన్పరచును.

మోటారులు పరుగెత్తుచున్నవి. పైనుండి క్రిందికి వచ్చు పదుల కొలదిగోడ్లు నదులవలె కన్పడుచున్నవి. ఇండ్లనుండి వెలికివచ్చు పొగలు దేశమునం దెల్లెడల చిన్నిచిన్ని ఎట్నాలున్నవా యనిపించుచున్నవి. ప్రజలుకాని, పశువులుకాని కానరారు! అకస్మాత్తుగా రాత్రికాలమునందు తమరూపును క్రొత్తవిధముగా మార్చినందులకయి "సృష్టి" కోపమంది ("Sleeping Sickness") "నిద్రరోగము" ద్వారా సంపెనా యని తోచుచున్నది. "స్టైన్సు"నందు ప్రసిద్ధిబొందిన క్రమవర్తుల దాతృత్వముద్వారా యేర్పడిన జగద్విఖ్యాతమగు "కళ" వైచిత్ర్యముల మహాచిత్రకారులు చూపెట్టుచు వ్రాసిన పటముల జాగ్రత్తగ రెండుమారులు వెళ్లి చూచియుంటి. ప్రపంచమునం దెల్లెడల తెలిసిన ఫ్లారెన్సు, మిలానో, బొలానియా, పట్టణములందలి పటముల, రోము వాసగరపటముల పరీక్షించితి. ఇంగ్లండునం దనేక పిక్చరుగాలరీల జూచితి. సినిమాలయందు సృష్టిబొమ్మల నానందించితి. కాని, మాబోటుయొక్క అడుగు డయామిటరు కల్గిన పోర్టుహోలునుండి చూచినప్పుడు కన్పడు యీదృశ్యమువంటిది ఏపటమునం దిప్పటికి గాంచియుండలేదను. ఇక "డెక్కు" పైనుండి చూచునప్పుడు కన్పడు శృంగారదేవతాస్వరూపము, సృష్టియొక్క చిద్విలాసము, భగవంతుని యద్భుతమును అసమానచిత్రకారులుమాత్రమే, ప్రపంచచారిత్రమునందు కొలదిమారులే చూపగలరు.

వేల్సుదేశమునందున్న పర్వతములు వీనివలె నుండవు. అచ్చట గొప్పగొప్పచెట్లుండును. త్వరితముగ ప్రవహించునదు లచ్చట గలవు. పచ్చిక యింత సమృద్ధిగ నుండదు. మేఘము లింతప్రేమపూర్వకముగ శిఖరములతో పెనుగులాడవు. స్విట్జరులాండుదేశము నందలి పర్వతములు వీనికంటె ఎత్తయినవి. మంచుతో నిండి, తెల్లగ కైలాసపర్వతములవలె నుండు సెలయేరులు గంభీరముగ, గుభగుభధ్వానములతో ప్రవహించుచుండును. తుంపురులు, అధికముగ లేచుచుండును. ఆపర్వతములు, వీనివలెక్రమముగ లేచుటకుమరు, తటాలున, పైనుండి దిగజారును. పర్వతములుగా జూచిన, స్విట్జర్లండుపర్వతము లెక్కువ శృంగారమైనవి. ఇక మనపడమటికనుమలు, బొంబాయికి చేరుటకుముందు, అత్యద్భుతముగ కన్పట్టును. ఆసెలయేరుల నింకను మరువజాల

ఘన్నాను. ఆచల్లనిగాలి, అమేఘములవిలువ, ఆ సెమ్మదిగ, మొగము వాల్చినట్లున్న, సూర్యుని చల్లవానినిగా జేయుచున్నట్లున్న వాయు ప్రవాహము, అపురూపము. కాని, ఆపర్వతములుకూడ తటాలున క్రిందకు దిగజారును. ఈ 'సిసిలీ' యందున్నట్లు పట్టణములు, పర్వతములు, నదులు, రోడ్లు, సముద్రము, రైలుమార్గములు, వృక్షములు, పచ్చిక, మేఘములు, శిఖరములు, అన్నియు నొక్కదృశ్యమునందు, గారడివాని తెరవలె, అద్దకపువాని మాయవస్త్రమువలె, సృష్టిని సృజింపకల్గిన చిత్రకారుని మహాపటమువలె, సూర్యునికిరణములచే సృజింపబడిన అత్యద్భుతనాటకమువలె, దేవతలచే శృంగారింపబడిన స్వప్నదేవతయాసనమువలె హృద్యమై, శోభాయమానమై, విచిత్రమై నైజమై, మరి తేజోమయమైయుండుట కానము.

ఈ 'సిసిలీ'ని గడచితిమి. గంటసేపు ప్రయాణము చేసితిమి. అంత కొన్ని దీవులవరుసలు మసమ్మగుపడుచుండెను. దూరముననున్న యా కొన్ని ద్వీపములు ఒకదానినొకటి తాకుచున్నట్లు కన్పడుచుండెను. దగ్గరకుబోయినకొలది, వానిమధ్య సముద్రము, 10, 20, 40 మైళ్ల వెడల్పున్నట్లు కానవచ్చె. బాల్యమున కోటప్పకొండకు వెళ్లగా, దూరముననుండి, నాదెళ్లనుండి చూచుచున్నప్పుడు, కొండపై ప్రజలు కొద్రెలవలెను, కొండ మైలుదూరములో నున్నట్లు నుండెను. ఈసమయము ప్రాతఃకాలము. "స్ట్రాంబులి" యను ద్వీపము కన్పడెను. నెత్తిపైశిఖరమా యనునట్లు పొగ కానవచ్చెను. దగ్గరకు జేరుచుంటిమి. కొంచ గట్టిద్వీపముపై ప్రజ లెవరైన, నివసింపసాహసింతురా యన [illegible]చ్చిరి. వారికి నేను, అచ్చటరెండు బస్తీలున్నవని తెల్ప ఆశ్చర్యమందిరి. దగ్గరకుచేరితిమి. ఒక బస్తీ కానవచ్చెను. నెత్తిపై అగ్ని, పొగ, దుమ్ము రేగుచుండెను. ఇయ్యది యగ్నిపర్వతము, భీకరమైనది. ద్వీపమంతయు నొకదీపములాగు సముద్రమునందు కానబడుచున్నది. కిరసనాయిలుబుడ్డుల నెరింగినవారికి ఈ ద్వీపము త్వరగా దీపములా గున్నట్లు తోచును. ఇందు కొంతభాగమంతయు, అగ్నిపర్వతమునుండి వెలికివచ్చుచున్న Lava అను అగ్నిప్రవాహముచే కప్పబడియున్నది. ఇప్పుడందు అగ్ని కానరాదు. నుసియైన పర్వతశిలచే బయలుదేరిన అగ్నిప్రవాహము చల్లారిన పిమ్మట అనుసిమాత్రము కన్పడు. అయ్యది ఈ భాగమునందంతట నిండియున్నది. ఇరుప్రక్కల రెండు కొండభాగములు లావాభాగము వంకకు దిగజారుచున్నవి. తక్కిన పర్వతభాగములందు వ్యవసాయము, వ్యాపారము సాగుచున్నవనియు, ప్రజలు గృహముల నిర్మించుకొని, సుఖ మనుభవింతుమను నమ్మకముతో నున్నారనియు తెల్లము. ఆ భాగమున, "సిసిలీ" యందున్నట్లే, ద్రాక్షారామములు, పండ్లతోటలు, పచ్చికబయళ్లు శృంగారదేవత కభిషేకము నొనర్చుచున్నవి. ఈలావా వంకకు దిగజారు భాగముల కిరుప్రక్కల రెండు బస్తీలు కలవు. వేల కొలది యిండ్లు; వేలకొలది ప్రజ లున్నారు.

ఈ ద్వీపమునకు మైలుదూరములో ఒక చిన్నిద్వీపము కలదు. దూరముననుండి చూచిన, ఒకయోడయొక్క తెరవలె నుండును. దగ్గర నుండి, ఒకనందివలె కన్పడును. దానిపై నొక ప్రభుత్వపతాకము కలదు. మన స్ట్రాంబులి ద్వీపముదగ్గరలో నున్న యితర ద్వీపములు చూడనగు. సూర్యుడు, తూర్పునందున్న యొక ద్వీపముయొక్క నెత్తిపై, గొప్పయాభరణముగ నున్నాడా యనిపించును. క్రిందటి పర్యాయము ఆద్వీపముయొక్క నెత్తినంటి మేఘములద్వారా యన్ని వైపుల కప్పబడి, "స్ట్రాంబులి" వైపున తెరువబడియున్న సూర్యుడు, హృదయానందకరముగా గన్పట్టుచుండెను. నాటకశాలయందు, నటకునిపై పైనుండి త్రిప్పిన విద్యుద్దీపకిరణమువలన కల్గు తేజమువలె ఇటులు మేఘములబారినుండి తప్పించుకొని, స్ట్రాంబులిద్వీపము నందున్న పచ్చిక బయళ్లపై మోహముగ త్వరత్వరగావచ్చి వ్రాలుచున్న సూర్యకిరణముల చెల్గాట లుండెను. మిక్కిలి మృదువగు వెండినీరును, బయళ్లపై నల్లిరాయనున ట్లొకనిమేషము, అప్పుడే బయటికివచ్చిన చిగుళ్లాయని మరొకనిమిషము భావములు తట్టుచుండెను. పైనుండి గొనగో లైటును నల్లగా త్రిప్పుచుండిరి. కిరణములు, పకపకాగహితముగ, నల్లగ, అన్నిపచ్చికబయళ్ల ముద్దిడుకొన ఒకరినుండి మరొకరివద్దకు కదలుచుండెను. మాకన్నులు వానిచెల్గాటల గమనింప తిరుగుచుండెను. క్రమముగా, క్రొత్తక్రొత్తబయళ్లు నూత్నకాంతులను బొందుచు, తెల్లని నవ్వుతో, తేలికహృదయముతో, నవ్వుచున్న కన్నులతో, రాలుచున్న యానందబాష్పములాయను మంచుకణములతో, నేత్రానందకరముగ, నవమోహనముగ కన్పట్టుచుండెను. ఇంతలో, వెనుక విడబడుచున్న ప్రియురాండ్రు, ప్రియులు దూరమైనకొలది తమసుఖమును, మోహమను మాయద్వారా యేర్పడిన తేజమును, నల్లనల్లగా బాయుచు దుఃఖభాజనమైన జీవితము నెదుర్కొన, తమసుఖమగు నుడుపుల వీడ్కొల్పుచు, తమ శృంగారసంపదను, వీడలేక వీడుచు, శిశిరహితములగుచుండెను. మాకన్నులు, కిరణములు వాని ప్రియురాండ్రు, వారి గుసగుసల, ముద్దుముద్దుల జూచుచుండెనే కాని, అప్రయత్నముగ, వీడ్కొల్పబడిన యీదురదృష్టుల జూచి సత్సహించుట లేదు. ప్రయత్నపూర్వకముగ నే వానిజూచి, అచ్చటుండమనుసు లేదాయెను. అంతకు ముందే, ఏల నేను వానినంత యధికముగ ప్రేమించితినో నాకు తెలియదాయెను. అట్టి సామాన్యదృశ్యముల నేల కొనియాడితినో తోచదు. పైగా నిమిషముక్రింద నద్భుతముగ నున్నవని తెల్పి మైమరువజేసి, హృదయమును సుఖపరచిన కన్నులే ఈనిముసమందు విచారపుప్రపంచము నేల జూపెట్టుచున్నవో దురూహ్యము. భర్త పరదేశవాసు డైనప్పుడు, స్త్రీలు తమశృంగారము దాచిపెట్టు కొందురని తలంతుమా? భర్త, భార్య యిద్దరు కలిసినప్పుడు కల్గు నిండు తేజము ఒకరినొకరు బాసినప్పుడు తగ్గిపోవునందుమా? ఇద్దరు కలిసిన పిమ్మట ప్రత్యేకభావము, ప్రకటన, ప్రభావము కల్గునుగాన, ఎవరికి వారు, వెనుకటిమాదిరిగా గూడ నుండరుగాన, తత్వము మారుగాన, విడబాసి

నప్పుడు, ప్రథమమున నున్నట్లు గూడ నుండ గలదుమా? ఆపచ్చిక బయలే గొబ్బియారములతో, నృత్యగానములతో సొంపు ఇంపులతో సుఖమందిన పెండ్లికూతురు లాగు కిరణప్రభావములచే కన్పడును. అంతియే కాదు. చూచువాని కన్నులుకూడ శృంగారము సృజించు చున్నవి. వాని హృదయము కూడ, శోభను వృద్ధిచేయు చున్నది. హృదయము, కన్నులు, కిరణములు, పచ్చిక, ఆపర్వతప్రదేశము అన్నియు చేరి ఆయద్భుతమూర్తిని, అనుప్రదర్శనమును, కలుగజేసినవి. నేను కవినికాను. లేనిచో, నాయుత్సాహము, నాసుఖము, నా దివ్యమగు సంప్రాప్తియగు అత్యద్భుతమగు ఆత్మసంతృప్తి ఎన్ని యనెనో ఘములగు పద్యములద్వారా, వెలువడెడిదో చెప్పనలవి కాదు. అటులనే, వివిధప్రజలకు వివిధవిధములుగా ఈదృశ్యమే తోచి యుండును. నాకు తట్టిన సాహిత్యములు ఇతరులకు అరుచికరముగాను, అసభ్యముగాను ఉండి యుండును. ఆకసముపై నున్న నాకు స్వర్గరేఖలె నుండిన మరొకనికి నుద్రమువలె నుండును. మే మిస్థగము తగవులాడిన ఫలితమేమి? సరేకాని, నెత్తిపై కుంపటి పెట్టుకొని, జీవించువా రున్నారా? ఇంట్లో త్రాచుపాము పెట్టుకొని, పక్కలను బల్లెము పెట్టుకొని భార్యవద్ద ఆపెప్రాతిన్నే హితుని పెట్టి ఏకైన శాంతితో సంతృప్తితో భయరహితముగ నుండగలరా? ఈరెండు బస్తీలయందున్న ప్రజలకు నెత్తిపై నున్న యీ యగ్నిపర్వతము, ప్రక్కన మైళ్లకొలదిగా నున్న లావా యగ్నిప్రవాహము ఎంతభయంకరమైనదొ చెప్పకయే చెప్పుచున్నది. ప్రతిదినము, ప్రతివాడు, నెత్తియెత్తి చూచిన అగ్నిశిఖ కానవచ్చు. ఎప్పు డేమివచ్చి పైనబడునో? ఎప్పుడు అగ్నిప్రవాహము బయలుదేరునో? కాని, వారు నివసించుచునే యున్నారు. "అంతా రామమయం" అను భగవద్భక్తియందు నమ్మక ముంచుచున్నారా?

ఈద్వీపములన్నియు, ఒకప్పుడు కలిసియుండెడివి. ఎందులకు, ఎప్పుడు విడిపడి పోయినవో జ్యాగ్రఫీ యను శాస్త్రము చదివిన వారికే తోచును.

ఆ ప్రక్కన ఉన్న ఆజండాగల చిన్నపర్వత మెన్నిశతాబ్దముల క్రితము విడిపడినదో ఇంక నెన్నిశతాబ్దము లిట్లేయుండునో! చుట్టును అపారమైన సముద్రము. ఎంతటి నిప్పునైన యార్పగల నీరు మధ్య నీయగ్నిపర్వతము ఎల్లప్పుడు నిప్పును గ్రక్కుచుండుట, ఆశ్చర్యకరమైన విషయముగదా! పైగా, రెండుమైళ్లలోతున సముద్రముండును. దానిక్రింద భూమి కలదు. ఈద్వీప మాభూమితో సంబంధించి యున్నది. కాన ఈ నిప్పు ఆభూమిలో నుండి, ఎచ్చట నుండియో బయలుదేరుచున్నది. భూమిలోపల మండుచున్న ద్రవపదార్థమైన లావాయను ప్రవాహము కలదు. అయ్యది సూర్యుడు, చంద్రుడు, భూమి ఇతర గ్రహముల మధ్యగల పరస్పర ఆకర్షణశక్తుల ననుసరించి అప్పుడప్పుడు, ఒక్కొక్కచోట క్రొత్తమార్గముల నవలంబించుచుండును. అందువలననే కొన్ని పర్వతములు మాయమగుట; క్రొత్తపర్వతములు లేచుచుండుట; ఇదివరకు లేనిచోట నగ్నిపర్వతములు పుట్టుచుండుట కలుగును. ఒకప్పుడు, సింధు పంజాబుదేశము లున్నచోట సముద్ర ముండెడిదట. ఇంగ్లండు, ఐర్లండు యూరోపుఖండముతో కలిసి యుండెడివట. అటులనే ఈద్వీపము లన్నియు కలిసి యుండి, సిసిలీ ద్వీపముతో నేకమై ఇటలీదేశముతో కలయిక పొంది యుండునో? పైగా ఒకప్పుడు సహారా యెడారి యంతయు సముద్రమయమై యుండెడిదట. ఇప్పటి సముద్రము ననుకరుపు వచ్చునట. అప్పు డానీరంతయు ఎచ్చటికి బోయెనో! ఈదేశము నిటుల మగులగొట్టెనా? జ్యాగ్రఫీ శాస్త్రముపై మన తెలుగున ఏపుస్తకము లేకుండుట విచారకరమైన విషయము.

సిసిలీ దూరమగుచున్నది. ఇచ్చటి నుండి యందముగ లేదు. అటులనే యిక నీవ్యాసము గూడ పెద్దదగుకొలది రుచి తగ్గునను భావమున ముగించు చుంటిని.

# నూర్జహాను

ప్రతివాది భయంకరం పార్థసారథిగారు

ప్రపంచచరిత్రయందు, నూర్జహాను తన యనన్యసామాన్య గుణగణాధిక్యముచే నొక యగ్రస్థానము నాక్రమించి, తన నామమును చిరస్థాయిగా నొనరించుకొనియున్నది. ప్రపంచమందు రాజ్యపరిపాలనాధురంధరలగు స్త్రీలు చాల నరుదు. ఆస్వల్పసంఖ్యాకులందును, నూర్జహాను, అసామాన్యమై, యపూర్వమై, సర్వతోముఖమై వెలసిన తన చాతుర్యవిశేషముచే నెల్లరి హృదయము నాకర్షించుచున్నది. ఎలిజబెత్ రాణి నిరుపమాన రాజ్యతంత్రప్రావీణ్యముచేతను, మెరియా తెరిసా రాణి యుద్ధకౌశలముచేతను, విక్టోరియా మహారాణి శాంతిస్థాపనసామర్థ్యము చేతను, నై మన దేశమందు చాంద్ బీబీ, రాణీ దుర్గావతి, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలగు రాజ్ఞీమణులు కేవల స్త్రీసామాన్యాధికమే కాక పురుషాతీతమైన యుద్ధకౌశలముచేతను, రజియా బేగము, రుద్రాంబ, తారాబాయి, ఆదిగాగల రాజ్ఞీమణులు రాజ్యపరిపాలనాధురంధరత్వముచేతను హిందూదేశమందు ప్రసిద్ధి కెక్కియున్నారు. వీరేకాక, ఇసబెల్లా, కెతరైను వంటి మహారాణుల చరిత్రలు నిత్యస్మరణీయములై యున్నవి. కాని, యీ మహారాణుల నెల్ల మించి యత్యున్నతస్థానమును నూర్జహా నాక్రమించి యున్నది. అందులకుంగల కారణము వారలెల్ల రేదోయొక్క విషయముననే ప్రావీణ్యమును గాంచి ప్రఖ్యాతి జెందియుండ, నూర్జహాను చాతుర్యము సర్వతోముఖమై, యిందు గల దందు లేదను సందేహము నకు తావిడక, నిఖిలవిద్యాపారంగతురాలై, సకలరాజ్యతంత్ర మర్మముల నెఱింగి, సర్వజనానురంజకముగ రాజ్య మేలియుండుటయే. కాని నూర్జహాను నామమే యెఱుగని వారనేకులు ప్రపంచమం దుండుటయే కాక, విశేషించి భరతఖండమందే యట్టివా రుండుట యెంతయు శోచనీయము.

జహంగీరు పాదుషా జీవించియుండెల్ల నూర్జహానుతో నాతని వివాహమే కథాంగము ప్రముఖ మగు విషయము. పదునైదు వత్సరములు నిరవక్రప్రజ్ఞతో సకలరాజన్యమూర్ధాభిషిక్తుడగు మొఘలుసామ్రాజ్యమునందెల్ల నూర్జహాను ప్రాముఖ్యమును ప్రఖ్యాతిని వహించెను. కాని యామె జన్మచరిత్ర యంతయు ఎన్నియో వింత విషయములతోడను విపరీతకథలతోడను నిండియున్నది. శ్రీగారి "హిందూస్థానచరిత్ర" యను పుస్తకమునందును, నితర రాంగ్లేయ చరిత్రలు కొన్నిటియందును, విశేషించి జాతీయవాఙ్మయములందును, నీక్రింద వివరింపబడు కథ నూర్జహాను బాల్యమును గూర్చి చెప్పబడియున్నది.

## బాల్యము

తార్తారీ దేశమందు దున్నతవంశజుడును, విద్యాధికుడును, గౌరవనీయుడు నగు ఖ్వాజాఘియాస్ బేగను నొక సదాచారపరాయణుం డుండెను. ఆయన తండ్రి యెక్కువ సంపత్తి గడపుకొనియు, గాలవశమున దుర్భర దారిద్ర్యదేవతకు గుఱియై కుటుంబ పోషణ మూడు లేక జీవితాధారమును గల్పించుకొను నాశతో హిందూదేశమునకు సంపదలాలను తన ప్రేయసి నొక బక్క గుఱ్ఱముపై నెక్కించి, ప్రక్కను దా నడచుచు బయలు వెడలెను. ఇట్లు పయనమై నడచుచుండ కొలది కాలములోనే యాతని కడ నున్న కొంచెము స్వల్పధనము వ్యయమై పోయెను. అందుచే ఘియాస్ బేగు నిర్ధనుడై కడునిర్భాగ్యమును గొలుపు మహారణ్యముల ప్రవేశించు చుండినను, భిక్షుకవృత్తిచే జీవితము గడుపుకొనెను. హిందూదేశమును, తార్తారిదేశమును విడదీయు నిశ్చలనిత్యశాంతిభూతములగు హిమాలయప్రాంతముల గనుటకు దరిలేక, మూడుదినములు లుపవాసముతోనే పయన మొనర్చి, నాలవనాటి ప్రయాణమున మార్గశ్రాంతియై యున్న స్థితిలో ఘియాస్ బేగు సతి సర్వశుభలక్షణసమన్విత యగు నొక శిశువును గనెను. అంత దమపోషణమున కేమైన లభించుచునను వ్యర్థమనోరథముతో గొన్ని యామము లటు బాంధవులకై యెదురు చూచి సూర్యాస్తమయసమయము సమీపించుచుండుటచే వారచ్చట విడువవలసిన వారైరి. ఎటు చూచినను హృదయవిదారకములగు వన్యమృగేంద్రముల భీకరగర్జనము లొడలు కంపింప జేయుచుండెను. ఆచిన్ని బిడ్డను దమతో గొనిపోవ శక్తిలేక, యొకతరుచ్ఛాయ నాబిడ్డను వదలి, యాకులములతో గప్పి విధిలేక, నడువ గాళ్లాడక, ఆ దంపతు లాసలము నెట్టెట్లో పాసి చనిరి. అట్లా బిడ్డను దిగనాడి, చూపుమేర మార్గము దాటి పోయినంతనే దుఃఖాధిక్యముచే మూర్ఛితయగు తన ప్రియురాలిం గాంచి మనసు నిలువక ఘియాస్ బేగు తిరుగ నాబిడ్డను విడిచిన స్థలమున కేగుసరికి యాబిడ్డను నల్లత్రాచొకటి చుట్టుకొని యుండెను. కొంతమారమునుండియే ధ్వనిచేయ సర్ప మాబాలికను విడిచిపోయెను. తోడనే బిడ్డ నెత్తుకొని ఘియాస్ బేగు తనభార్యతో నెట్లో లాహోరు చేరెను. అచ్చట చిరపరిచితుడగు నొకమిత్రుని సహాయముచే నక్బరు నాస్థానమున నొక యుద్యోగమును సంపాదించి,

క్రమక్రమముగా నభివృద్ధిఁ బొందెను. మెహ్రున్నిసా యని నామకరణ మొనర్పబడిన యాముద్దులబిడ్డ పెరిగి పెద్దదయి యంతఃపురస్త్రీల నెల్లఁ దలదన్ను సౌందర్య మువ్విపడ, గాన, నృత్య, సాహిత్య, చిత్రలేఖ నాదికళలయం దనుపమానపాండిత్యము నార్జించి కడుంగడు వన్నె కెక్కెను. యువరాజగు సలీము (జహంగీరు)ను జూచిననాటనుండియు నాతనిపై ననురాగ ముదయింప నాతని వశ మొనర్ప యత్నించుచు నొకనాఁడు రాజసభలో నృత్యమునందు దన యనూనపాండిత్యమును వెల్లడిచేయ రాజకుమారుఁడు సమ్మోహితుఁడాయెను. ఈ విషయము నాలించి సకల భారతభూమి నేలెడి చక్రవర్తి తనయుఁ డొక సామాన్యురాలిని వివాహమాడుట కిచ్చగింపక, యక్బరు పాదుషా యామెను అలీకులీయను షెరాఫ్ఘునునకు వివాహము జేయించెను! సలీము షెరాఫ్ఘునుని ముట్టుముట్టింప నెన్నియేని విశ్వప్రయత్నము లొనరించెను. షెరాఫ్ఘునునికి సింహ శార్దూలాది వన్యమృగములతో ద్వంద్వయుద్ధము గల్పించెను. కాని షెరాఫ్ఘును నిట్టి మహోపద్రవములనుండి నిత్యవిజయముచే రక్షింపబడుచు వచ్చెను. బర్ద్వానమున నున్న షెరాఫ్ఘునుని గృహము ముట్టడించి యాతని గడతేర్పుడని సలీము రహస్యముగ బంపిన నలువది మంది ఘాతకులును షెరాఫ్ఘునుని హస్తముల మడిసిరి. తుదకు బంగాళమునకు రాజప్రతినిధియు, సలీము పెంపుడు తల్లి కుమారుఁడునగు కుతుబుద్దీను వలలో జిక్కి, యంత్యసమయమున దనతో పాటు నతనిసరి యసువులగూడ గొనిపోయెను. మెహ్రున్నిసా రాజభటులచే నంతఃపురమునకు జేర్పబడి, మరణకాలమున షెరాఫ్ఘును, మెహ్రున్నిసా సలీమును వివాహమాడుట కనుమతి నొసంగెననియు, నందుచే సలీమును వివాహమాడెననియు ననేకాసత్యముల జెప్పెనట. కాని సలీము తనసోదరుని మరణముచే మిక్కిలి ఖిన్నుడై, యామెను గన్నెత్తియైన జూడనని నిర్ణయించుకొని, తనతల్లికి సపర్యలజేయ నామెను నియోగించెను. ఎట్టకేలకు నతివినుత్నాకారియగు మెహ్రున్నిసా వాగ్మోహాయములకు లొంగి, నాలుగుసంవత్సరములు గడచినతరువాత, నామెకు పాదాక్రాంతు డాయెను. ఈకథ కడుంగడు నుత్సాహకరముగ నున్నను జరిత్రాత్మకమైన సత్యమును జూచుటలేదు.

ఇట్టి వింతవిషయముల కెడమీయక, నిజస్థితిని జక్కగా బరిశోధనజేసిన చరిత్రకారు లీవిధమున దెలుపుచున్నారు:—పర్షియాదేశమందు ఖోరాసాను పరగణాను బరిపాలించుచుండిన ఖైగ్లారుబేగీ యను సుల్తానుకడ ఖ్వాజామహమ్మద్ షరీ ఫనునతడు ప్రధానమంత్రిగా నుండి, సుల్తాను మరణానంతరమాతని కుమారుడగు ఖాజక్ఖానుని కడ గూడ నాయుద్యోగమునందే యుండెను. ఆసుల్తాను మరణానంతరము షాతామస్పుచే యాజద్ పరగణా యొక్క వజీరుగా నియమింపబడెను. అటుపిమ్మట 1577వ సం॥మున నాతడు మరణించెను. అతడు మరణించిన నాటనుండియు నాతనివంశము కష్టముల పాలాయెను. అతనికుమారుడు మిర్జాఘయాసుద్దీను మహమ్మదు (ఘయసుబేగు) తనదేశమందు జీవనోపాధిలేక, హిందూదేశమునకు వెడల నిశ్చయించి, మహమ్మదుషరీఫు, అబుల్హాసన్ అను ఇరువురు కుమారులతోడను, గర్భవతియగు తనయిల్లాలితోడను, మాలిక్మూదను నొకవర్తకునితో పాటు బయలువెడలెను. పర్షియాదేశమునుండి హిందూదేశమునకుగల మార్గము కడుంగడు కంటకమై యుండెను. ఇలువెడలిన కొలది దినములలోనే ఘయస్బేగు అశ్వములన్నియు మార్గాయాసమున మడిసిపోయి, రెండుమాత్రము మిగిలెను. ఖాందహారు చేరుసరికి అతనిభార్య ప్రసవించి యొకకుమారికను గాంచెను. ఘయస్బేగునకు ఆలుబిడ్డలకు నలయు నావశ్యకముల సహితము సమకూర్ప శక్తి లేకుండెను. వారి దీనస్థితి గాంచి మాలిక్మాసూ దెంతయు గరుణించి, వారికి వలసినదంతయు నిచ్చి గౌరవించెను. అందుమూలమున వారిరువురకును మంచి స్నేహ మేర్పడెను. హిందూదేశము జేరినంతనే మాలిక్మాసుద్ తన మిత్రుని అక్బరు ఆస్థానమునకు దీసుకొనిపోగా, నక్బరు వానిని దన కొలువులోనికి దీసికొనెను. ఘయసుద్దీను విద్యాధికుడు; పండితుడు; వినయసంపత్తి గలవాడు. మదమాత్సర్యక్రోధముల కెన్నడు నెడమిచ్చినవాడు కాడు; అతనిహృదయము వినిర్మలము, దయామయము నైనది. కార్యదీక్ష, కార్యాచరణానైపుణ్యము, వీనికి గడుంగడు నధికము. అతనికింగల యోర్పు,దీక్ష,ప్రత్యేకించి యెన్నదగిన విషయములు. అట్టి సద్గుణసంపదల కాలవాలమగుటచే క్రమక్రమముగా పెద్దపెద్ద యుద్యోగముల జేయుచు, 300 యశ్వప్రదళమునకు మనసబుదారుడై, తుదను కాబూలునకు దివానాయెను.

## వివాహము

ఇంతలో ఖాందహారులో బుట్టిన మెహ్రున్నిసా పదునేడవయేటనే సకలకళాప్రవీణయై, సౌందర్యరాశియై, యంతఃపురకాంతలందెల్ల వాసిగాంచెను. పదునేడవయేట ఆలీకులీ ఇస్తాజ్లూ యను పారసీకునకు వివాహ మొనరింపబడెను.

ఆలీకులీ పర్షియా రాజగు రెండవ షా ఇస్మాయిల్ కడ నంగరక్షకుడుగ నుండి, తనచక్రవర్తి చంపివేయబడినపు డాదేశమును విడువవలసినవాడాయెను. ఇట్లు బయలుదేరి ఖాందహారుద్వారా ముల్తాను జేరి, అబ్దుర్రహీముఖానుని సైన్యమున బ్రవేశించి థాథా యాక్రమణసమయమున నద్వితీయపరాక్రమమును, సాహసమును వెల్లడించెను. అతని ధైర్య స్థైర్యములకు మెచ్చి అక్బరు ఆలీకులీ నొక మనసబుదారునిగా నొనర్చెను. శీఘ్రకాలములోనే యాతడు మెహ్రున్నిసాను వివాహమాడెను. 1599వ సం॥మున సలీము ఆధిపత్యమున మేవారుపై దాడి వెడలుచున్న సైన్యమం దొక ముఖ్యోద్యోగిగా నియమింపబడెను. ఆలీకులీ, యొకానొకసందర్భమున నిరాయుధుడై యుండియు, నొక వ్యాఘ్రమునుజంపగా నాతని శక్తిసామర్థ్యముల కచ్చెరువంది యువరాజాతనికి షెరాఫ్ఘున్ (వ్యాఘ్రహంత) అను బిరుదము నిచ్చి సన్మానించెను. అటుపిమ్మట సలీము తనతండ్రిపై తిరుగుబాటు గావించినపుడు, ప్రథమమున సలీము ననుసరించియు, షెరాఫ్ఘును అక్బరునంకకు దిరిగి



పెన్నదాటుట

ఛాయాచిత్రకారుడు: శ్రీయుత యమ్. కె. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.



వలపుకమ్మ

ఛాయాచిత్రకారులు: శ్రీయుత యమ్. కె. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.

పోయెను. కాని సలీము పాదుషా యైనంతనే, తనమిత్రుఁ డొనరించిన మోసమును మనసున నుంచుకొనక, వంగదేశమున నున్న బర్ద్వానున జాగీరు నిచ్చి, వంగదేశమున బెద్ద యుద్యోగియునిగా నొనరించెను.

కొంతకాలమునకు వంగదేశము రాజద్రోహములకును, తిరుగుబాటులకును మూలస్థానమాయెను. షేరాఫ్ఘనుకూడ వాటిలో పాల్గొనుచుండునేమోయని యనుమానించి, వానిని మందలింప జహంగీరు షేరాఫ్ఘనుని ఢిల్లీకి రమ్మని వార్తనంపెను. అతఁడాయాజ్ఞ నుల్లంఘించి రాజదర్శనము చేయడాయెను. అందుచే వంగదేశపు రాజప్రతినిధియగు కుతుబుద్దీనుఖానునకు షేరాఫ్ఘనుని ఢిల్లీకి బంపవలసినదనియు, నతఁ డొప్పటికిని రాజాజ్ఞ మన్నింపఁడేని, యాతని బంధించి పంపవలసినదనియు 'ఫర్మానా' రాగా, కుతుబుద్దీనుఖాను బర్ద్వానునకు బయలుదేరెను. కుతుబుద్దీను తనతో వచ్చి మాటాడుమని తెలియజేయ, షేరాఫ్ఘను నిరువురు బంటులుమాత్రము వెంటరా నాతనికడ కేగెను. అతఁడు కుతుబుద్దీనును సమీపింపగనే రాజసైనికులు షేరాఫ్ఘనుని ముట్టడించిరి. వెంటనే షేరాఫ్ఘనున కావేశము జనించి యొరనుండి కత్తి నూడబెరికి కుతుబుద్దీనునిపైబడి యాతని క్షతగాత్రుని గావించెను. ప్రాణోపద్రవకరమగు దెబ్బతినియు, కుతుబుద్దీను ఆద్రోహిపై లంఘించెను. ఇంతలో నంబాఖాను మొదలగు సైనికులు షేరాఫ్ఘనుని చుట్టుముట్టి ముక్కలు ముక్కలుగా ఖండించివైచిరి. కుతుబుద్దీను పండ్రెండు గంటలుమాత్రము జీవించి ప్రాణములు గోల్పోయెను. కుతుబుద్దీను మరణము జహంగీరు నతివిషాదసముద్రమున ముంచివైచెను. తనప్రియపుత్రునిగను, దయామయుఁడగు సోదరునిగను, నమ్మినమిత్రునిగను బరిగణించు కుతుబుద్దీను మరణమునకు గారకుఁడగు షేరాఫ్ఘనుని హత్యకై పరితపించుటకు జహంగీరంతటి దయామయునకు గూడ మనసు పొడమినది కాదు.

షేరాఫ్ఘనుని భార్యయగు మెహ్రున్నీసా, కుమారితయగు లాదీలాబేగము రాజాంతఃపురమునకు దోడ్కొనిపోబడిరి. మెహ్రున్నీసా రాజమాతయగు సుల్తానా సలీమాబేగమునొద్ద పరిచారికగ నియమింపబడెను. 1611వ సం॥ములో నొకనాఁ డున్నట్లుండి, జహంగీ రామెను జూచుట సంభవించెను. ఇంతవరకు నామె నాతఁ డెన్నఁడును జూచియుండలేదు; ఆమెను గోరియుండలేదు. కాని యా ప్రథమవీక్షణమునందే సమ్మోహితుఁడై, యామె పరిపూర్ణాంగీకారముతో నామెను వివాహమాడెను. ఇది జహంగీరు మెహ్రున్నీసాలనుగూర్చిన నిజచరిత్ర.

కొన్నికథ లక్బరు జీవితకాలమందే జహంగీరు మెహ్రున్నీసాను ప్రేమించినట్లును, అక్బరు, యువరా జొక సామాన్యకాంతను వివాహమాడుట కిచ్చగింపక, ఆలీఖులీకిచ్చి వివాహమొనర్చినట్లును, అందుమూలమున విఫలమనోరథుఁడగు రాజకుమారుఁడు తా సింహాసన మధిష్ఠించినంతనే, షేరాఫ్ఘనుని జంపించి మెహ్రున్నీసాను వివాహమాడ యత్నింప, నాయువతి తన భర్తను జంపించిన ఆదుర్మార్గుని ముఖమైన నాలుగు వత్సరములు చూడదాయెననియు, తుదకు బాదుషా ప్రయత్నములకు లొంగి యాతనిని బరిణయమాడెననియు దెలుపుచున్నవి. అనేకులగు యూరోపీయ చరిత్రకారు లీయుదంతము సాధారణముగనొప్పి తమ చరిత్రల నట్టిసంగతులతో నింపియున్నారు. జహంగీరు తన స్వీయచరిత్రమందీవిషయమును గూర్చి యేమియు వ్రాయకుండుటయం దాశ్చర్యమేమియు లేదు. కాని జహంగీరే షేరాఫ్ఘనుని చంపించియుండినచో, షేరాఫ్ఘనుని విషయమై లేశమైన నుడివియుండడేమో కాదు. అట్లుకాక, జహంగీరు షేరాఫ్ఘనుని జీవితవిషయమై యనేకపర్యాయములు వ్రాసియున్నాఁడు.

షాజహానుని యాస్థానమున నుండి యాకాలపు దేశచరిత్రలను వ్రాసిన మోతమదుఖాన్, ఖాంగర్ హుస్సేను, నూర్జహానునకు విరోధులయ్యు, నూర్జహాను విషయమై యిట్టి యపనీతికరములగు సంశయముల నుడివియుండలేదు. వీరేకాక షాజహాను రాజ్యమందున్న అబ్దుల్ హమీద్ లాహోరీయను చరిత్రకారుఁ డొకఁడు నూర్జహాను చరిత్ర వ్రాసియు, నామెకాని, జహంగీరుకాని, షేరాఫ్ఘనుని మరణమునకు మూలకారకులని నిర్వచించియుండలేదు.

కాని వితండవాదులు కొందఱు "ఆ యాస్థానమునందలి రాజసన్మానములనంది, రాజపోషణము వడయుచు, నారాజకులమునకే కళంకము నాపాదించుట కెవరును సిద్ధపడరు. అందుచే సమకాలికులగు మహమ్మదీయ చరిత్రకారులెల్లరు నూర్జహాను జహాంగీరుల సత్యమును గప్పిపుచ్చి" రని వాదింపవచ్చును. కాని, విదేశీయ యాత్రికులకుగూడ నిష్పక్షికబుద్ధి యుండవలసిన యగత్యము లేదు కదా. మీదు మిక్కిలి, యీవిదేశీయ చరిత్రకారులెల్లరు నేపెద్దమనిషి విషయమైనను నిందావాక్యముల వినుటయే తడవుగా, సత్యాసత్యవిచారణ కెడమీయక, వాటిని తమచరిత్రలయందు చొనుపుచుండెడివారు. జహంగీరునకును, నాతని సవతితల్లికిని నిషిద్ధమగు రహస్యసంబంధములు కలవనియు, నూర్జహానునకును నామె సవతికుమారుఁడగు షాజహానునకు నట్టి సంబంధములు కలవనియు, గూడ స్పష్టముగా జాటుటకు సిద్ధపడినట్టి చరిత్రకారులుగూడ జహంగీరు నూర్జహాను నిమిత్తమై షేరాఫ్ఘనుని జంపించెనని యెందును జెప్పియుండలేదు.

హాకిన్సు షేరాఫ్ఘనుని మరణానంతరము మొఘలాస్థానమున జేరి, మనసబుదారుఁడై, యెల్లరతో గలసిమెలసియుండి, జహాంగీరు నూర్జహానుల వివాహమైన కొంతకాలమునకు ఆగ్రా విడచి వెడలెను. హాకిన్సునకు తుర్కీభాషయందు బరిచయము మెండుగ నుండుటచే జరిత్రాంశముల సేకరించుట యితనికి సులభసాధ్యమాయెను. నూర్జహాను మహోన్నతపదవియందుండి యెల్లరసూత్రధారిణియైయున్న సమయమున, సర్ థామస్ రో, ఎడ్వర్డు టెర్రీ యను నిరువురు యూరోపియనులు ముఖ్యులు ఆస్థానమున అనేకవత్సరము లుండిరి. విలియంఫించ్ అను మరియొక సూక్ష్మబుద్ధిశాలి యీకాలముననే హిందూదేశమును దర్శించెను. పీట్రోడెల్లావేల్లీయను మరియొకఁడు తనసంచారమునంతయును గేవ

సంధి కుదిర్చెను. కాని అక్బరు మరణించిన శీఘ్రకాలములోనే జహాంగీరు మానసింగు నుద్యోగపదవినుండి తప్పించుట సిద్ధము. 'షేరా, శేర్‌హాయను విషయమునే మాత్ర మనుమానము. ఖుస్రూ తిరుగుబాటు గావించి వేయబడినంతనే, జహాంగీరు మానసింగు నుద్యోగమునుండి తీసివైచెను. ఆయుద్యోగమునకు చక్రవర్తి కనుకూలుడును విశ్వాసియునగువాడొకడు నియమింపబడు ననుట నిర్వివాదాంశము. అట్లే చక్రవర్తికి నమ్మకమైన వను కూలుడగు కుతుబుద్దీను వంగదేశపు రాజప్రతినిధిగ నియమింపబడెను. అంతియేకాని, కేవలము నూర్జహాను నపహరించు నుద్దేశ్యముతో జహాంగీరాతని, నియమించియుండలేదు.

ఇక మరికొందరు షేర్‌ఘ్ఫనుని రాజభక్తి ననుమానించుచు, చక్రవర్తికి బాడికాదనియు, సహేతుకముగ లేదనియు, కేవల మన్యాయముగ ద్రోహముదన్నదనియు జెప్పెదరు. కాని, యిందుగూడ నాశ్చర్యకరమగు విషయ మెద్దియు లేదు. ఏలయన నీసమయమున వంగదేశము రాజకీయాందోళనమునకును, నల్లరులకును, తిరుగుబాటులకును, మూలస్థానమైయుండెను. ఇంతకుముస్నే ఉస్మానొక తిరుగుబాటు గావించెను. ఆతనుజూచిన నల్లరులు ప్రబలియుండెను. అల్లరు లంతయుజాడ్యమువలె నలుదిశల వ్యాపింప మొదలెను. అట్టితరి చక్రవర్తి కనేక యాగయోకతలోడను, మెలకువతోడను, సంచరింపవలసియుండెను. ఈ సందర్భమున నొకమారు తిరుగుబాటు గావించిన యొక పారసీకయుద్యోగి షేర్‌ఘ్ఫను మరల తిరుగుబాటు గావించునేమో యను ననుమానము మానవుడగు ప్రతివానికిని జనింపకమానదు. అందుచే నట్టి యల్లరు లేవకుండ జేయుటకై షేర్‌ఘ్ఫనుని మరియొకచోటుకు మార్చు నుద్దేశ్యముతో ఢిల్లీకి నాతనిని చక్రవర్తి పిలిపించుటయందును వింత యేమియు లేదు. ఇక విషాదకరములగు షేర్‌ఘ్ఫను, కుతుబుద్దీను మొదలగువారి మరణములు, షేర్‌ఘ్ఫనుని పెంకెతనమువలనను, కుతుబుద్దీనుని యుక్తివిహీనతచేతను సంభవించెనుకాని, జహాంగీరు ప్రేరణ మిందు లేశమాత్రమైన లేదు.

భర్త మరణింపగనే భార్య సహజముగ దనపుట్టినింటివారికడకేగునుగదా! ఆధర్మము ననుసరించియే, మెహరున్నీసా తనసోదరుడును, తండ్రియు నుద్యోగము జేయుచున్న ఢిల్లీనగరమునకు గొంపోబడెను. ఢిల్లి ప్రవేశించిన తరువాత రాజమాత పరిచారికగ నుండుటయందును, హఠాత్తుగ చక్రవర్తి కంటబడుటయందును, దానను పరిణయమాడుటయందును నాశ్చర్యజనకమగు విషయ మెద్దియు లేదు.

జహాంగీరుని మరణానంతరము రెండు తరములు గడచిన వెనుక శృంగారమగు కథయొండు జహాంగీరు మెహరున్నీసాల వివాహమునుగూర్చి కల్పింపబడెను. మహమ్మద్‌సాలిక్‌తబక్షి, ఖాఫీఖాన్, సుజనరాయ్, మొదలగు మరికొందరు చరిత్రకారులు దీనికను ప్రాముఖ్యమును దెచ్చిరి. సలీము మెహరున్నీసాలు బాల్యమున గలసి యాడుకొనెడివారనియు, వయసువచ్చినపిమ్మట నొకనాడు సలీము మోహావేశమున మెహరున్నీసాను దన బాహువుల బంధించెననియు, నామె యొట్లో విడిపించుకొని యంతఃపురకాంతల కీయుదంతము నెరుగజెప్పెననియు, నక్బరీసంగతి విని తనకుమారు నామెను వలచుట కిష్టపడక యామెను షేర్‌ఘ్ఫనున కిచ్చి వివాహముజేయించెననియు, కొంతకాలమునకు (జహాంగీరు చక్రవర్తియైన పిమ్మట) దాను బాల్యమునుండియు ప్రేమించెడి మెహరున్నీసాను దనకు దెచ్చియప్పగించుటకై కుతుబుద్దీనుని నియోగించెననియు, షేర్‌ఘ్ఫను నీరహస్యము తెలిసి తన జాగీరునకు వెడలిపోయెననియు, నటుపిమ్మట రాజభటులకును షేర్‌ఘ్ఫనునకును జరిగిన ద్వంద్వయుద్ధమందు జీవములతో బయటపడి యంత్యకాలమున దన భార్యనుగూడ దుదముట్టింప నామెగృహమున కేగననియు, నంత నాతని యత్తగారు గుమ్మమున కడ్డముగ నిలచి, మెహరున్నీసా లోన నాత్మహత్య నొనరించుకొనెనని చెప్పి యాతని మోసగించెననియు, నందులకు దృప్తిజెంది యాతడు మరణించెననియు వ్రాసియుండిరి. ఈగాథ వెంటనే కార్చిచ్చువలె దేశమంతట వలము కొనెను. 17 వ శతాబ్దపు ప్రథమసంవత్సరమున నెవరు నెరుంగని యీయసత్యగాథ శతాబ్దాంతమున ప్రతియాత్రికుని చరిత్రయందు నెక్కెను. పారసీక చరిత్రకారులు కొందరీయుగంతమునకనేకవన్నెచిన్నెలగూర్చి యాసంపకగముగ నయారుచేసియున్నారు. గసపుత్రకవులు నిజచరిత్రను జాటప్రయత్నించినట్లు గన్పించును. కాని ఇటలీదేశపు యాత్రికుడగు మేనుచీ యీగాథకింకను గొన్ని యూహాపోహల గల్పించి కడు గసవంతముగ నొనర్చెను.

18వ శతాబ్దమున నిజచరిత్ర నెవరును దెలిసికొనకుండునంతటి నైపుణ్యముతో, డౌ మొదలుగాగల యాత్రికు లావిషయమును మహారసవంతమగు నొక నాటకకల్పవలె తయారుచేసిరి.

19వ శతాబ్దమున ఎలిఫిన్‌స్టనును, ఖాఫీఖాన్ వ్రాతల నాధారముగ గొని, దేశదేశముల నీయసత్యగాథను జాటియున్నాడు. ఈచరిత్రకారుల యుసంతమును గట్టిపెట్టి,సమకాలికుల వ్రాతల నాధారముగ గొని గణ్యించితిమేని జహాంగీరు నూర్జహానుల నిజస్వచ్ఛచరిత్రలు బయల్పడగలవు.

## నూర్జహాను స్వభావశీలములు

ఆమె రెండవ వివాహమునకు సరికి ముప్పదినాలుగేండ్ల ప్రాయము గడచినను, నూర్మహల్ (అంతఃపురజ్యోతి) లేక నూర్జహాన్ (భువనైకజ్యోతి) యను నామములచే ప్రసిద్ధివడసిన మెహరున్నీసా, తన సహజసౌందర్యము నిసుమంతేనియు గోల్పోలేదు. సౌందర్యవిషయమున నామెకు లోటేదియు గాన్పింపదు. పారసీకదేశపు సహజసౌందర్యవిలాసమున కొకవింతసోయగము, కాంతి, చిదానందస్వరూపము, అత్యద్భుతబుద్ధికుశలతచేరి యామె నొకయపూర్వవ్యక్తిగా నొనరించెను. అనేకచిత్రకారు లామెరూపమును జిత్రించి తరతరములుగా నామె స్వరూపవిభవవిలాసాదుల నానందింప నవకాశ మొసంగియున్నారు. "పల్లవసదృశమగు శరీరసౌకుమార్యము, గోలముఖము, విశాలనయనములు, ముద్దులొలుకు చిన్నిపెదవులు, విశాలఫాలభాగము నామెసౌందర్యమునకు వన్నె దెచ్చె"నని కొందరు చరిత్రకారులు వర్ణించియున్నారు. ఆమెశరీర మారోగ్యవిషయమున గడుంగడు ప్రశంసనీయ మైనది,

అశ్వారోహణమందును, మృగయావినోదములందును అనుపమానపాండిత్యముగల మానినీమణి. గురితప్పి యెఱుగని యస్త్రపాండిత్యచతుర.

అతిసూక్ష్మబుద్ధి, నూతనవిషయాన్వేషణాసక్తి, శీఘ్రగ్రహణకౌశలము, సర్వతోముఖవిజ్ఞానము నామెకు బాల్యమునుండియు నలవడెను. ఈ సహజనిపుణతయునకును, కౌశలమునకును, విద్య తోడ్పడి యామె నసమానురాలినిగా నొనర్చెను. పార్సీ భాషయందామెకు గల పాండిత్య మనుపమానము. అతిసొగసుగ, కడువృద్ధులముగ, బద్ధియముల నల్లుటయందపారశక్తిగల కవయిత్రి, నూర్జహాను. ఆమెరుడమ్ము గములను పద్యములను విని, జహంగీరు పాదుషా మాత్రమే కాక, సంస్థానకవులెల్ల గచ్చెరువందుచుండెడి వారని చరిత్రకారులమూలమున తెలియుచున్నది. స్త్రీజనములకు వలయు సద్గుణములెల్ల నామెయందిల్లు గట్టుకొని యుండెడి నన్నచో నతిశయోక్తి కానేరదు. 1618 వ సం. మున సుల్తానా సలీమాబేగము మరణించినపుడు పాదుషాహి బేగమను పదవి నూర్జహానుకొసంగ, సామ్రాజ్యమునందలి స్త్రీలయందెల్ల నగ్రగణ్యురాలై, పల్లకీ గలిగిన స్త్రీసంఘములకు నేత్రియై, నూతనాలంకారవిధులను సృజియించి, కుటుంబజనాన్యమున మార్గదర్శియై ప్రఖ్యాతి వహించెను. వస్త్రాలంకారములయందొక నూతనమార్గము త్రొక్కి సంపదాంగుల కెల్లరికాదర్శప్రాయురాలాయెను. ఇప్పటికిని, మహమ్మదీయులు కొందరు, వివాహసమయమున నూర్మహాలి (నూర్మహాలుచే గనిపెట్టబడిన దుస్తులగనుకనే) వాడుచున్నారు. ఇవికాక, యామె యుపయోగించెడి, గులాబి, పంచతోలియా, బాదలా, కినారీ, ఫార్సీనందనీలు నేటికిని ప్రఖ్యాతి గాంచియున్నవి. ఆమె నూతనవిధములగు నాభరణములు, నూతనవిధములగు గృహాలంకారములు, నూతనవిధములగు నుత్సవములు సృజియించెను. ఆమె మరణించిన సుమారు నూరు సంవత్సరముల తరువాత హిందూదేశమును దర్శించిన ఖాఫీఖా నామె సృజియించిన నూతనవస్త్రాలంకారాదుల దేశమంతయు ననుకరించె నని వ్రాసియున్నాడు.

ఆమె యెంత విలాసవతియో, యంత దయామయి యైనది. "కష్టజీవులకు, దిక్కులేనివారికి నామె కల్పతరువువంటి" దని మహమ్మదీ హాదీ వ్రాయుచున్నాడు. ఇతరుల బీదరికము చూచుట యనునది యామె యెన్నడు నెఱుగదు. నిరంతరమును దురదృష్టజీవుల నుద్ధరించుటకై యనతరమనంతశక్తిని వినియోగించెడిది. తల్లిదండ్రులు లేని పిల్ల లెవరైన దనకంటబడినచో, వారిని బెంచి, పెద్దజేసి, వివాహ మొనర్చెడిది. ఆమె రాజ్యమునరించిన పదునారు సంవత్సరములయందును బంధుశేష సంఖ్యాకలగు కన్యల వివాహమును గట్నములు, కానుకలతో సహా జరిపించెను. సామాన్యదానముల లెక్కించి చెప్పుటకు మానవమాత్రునకు సులభముగ సాధ్యముకాదు.

ఆమె స్వభావశీలములయందన్నిటను, నత్యధిక మగు బుద్ధిసూక్ష్మత యామె జీవితమునంతయు జాటుచున్నది. అత్యధికవిలాసవతి. అత్యధికకరుణామయి. జహంగీరు పాదుషా నత్యధికముగ ప్రేమించెను. అతడు మరణించినపుడత్యధికముగ విలపించెను. మిత్రుడై యుండినంతకాలమును ఖుర్రమును యువరాజ గౌరవస్థానమునకు బాత్రునిగ జేసెను. శత్రుడైనంతనే ధూళికన్న లోకువగ నొనరించెను. అధికారమునందున్నంతకాలము నేకచ్ఛత్రాధిపత్యముగ సర్వము నేలెను. అధికారము తొలగినంతనే సన్యాసినివలె సర్వము త్యజించెను.

నూర్జహాన తత్కాలపరిస్థితులయందు విశేషముగాని వైపరీత్యముగాని లేదు. సర్వతంత్రస్వతంత్రత నార్జించి యత్యధికచాకచక్యముతో నఖిలవిషయముల దానె నడపుచు, సర్వాధికారమును దనహస్తములందే యిమిడించుకొన యత్నించిన యసమానకార్యాచరణధురీణ యామె. అధికారవాంఛయు దగిన కార్యాచరణకౌశల మామెకు నన్నెదెచ్చెను. ప్రతివిషయము నామె స్వయముగ, సావధానముగ, సవిమర్శగ జర్చించెడిది. అతిసులభముగ రాజకీయసూత్రములనెల్ల గ్రహించెడిది. ఆమె విరోధులుకూడ, నెట్టి దురూహ్యవిషయమైనను, నూర్జహానుకడ దెల్పినచో వెంటనే విస్పష్ట మొనరింపజాలిన శక్తిమతి యని పొగడియున్నారు. బుద్ధిసూక్ష్మతకుదగిన మనస్థైర్యము, గాంభీర్యము నామె కొక నూతనశక్తి నొడగూర్చెను. ఆమె యేకార్యము జేయదలచినను దనశక్తిసామర్థ్యముల నెల్ల వినియోగించి కష్టపడెడిది. ఎట్టి యాపత్సమయములందైనను మనశ్చాంచల్య మెఱుంగని జాణ. అవసరమునకు దగినయుపాయాల బన్నుటయందనుపమానసమయస్ఫూర్తిగల చతుర. కలవరమంద పరువులెత్తి గజముపై నదీమధ్యమునందుండి, యొకకేల దాలు పూని యరిశరపరంపరల నడ్డగించుచు, రెండవహస్తమున ఖడ్గమును బూని, నిర్భీతిగ రణరంగమధ్యమున నిలిచిన యసమాన శౌర్యవతి నూర్జహాను. ఒకసైనికునిచే భర్తృసమేతముగ బట్టుబడి, సర్వస్వాతంత్ర్యమును గోల్పోయినపుడామె చూపిన సాహసము, కార్యసాధనానైపుణ్యము వర్ణనాతీతము. జన్మతః యేర్పడిన సహజగాంభీర్యమును సూచించుటకో యన స్త్రీల నొక మూలబంధించి నైచిన మొఘలుల పర్దాపద్ధతి నతిక్రమించి, సింహాసనముపై నిండుకొలువున గూర్చుండి, యెల్లవిషయముల స్వయముగ విచారించుచు, రాజ్యపాలన మొనరించిన యసమానప్రవీణ. కడుధైర్యవతియై, దయామయియై, విలాసవతియై, దానశీలయై, ప్రేమానుమయియై, యధికారవాంఛితయై, హృద్వికసనకారియై, యుల్లాసవతియై, సంతతానందజనకయై, సహజసౌందర్యవతియై, యమోఘగాంభీర్యవతియై, జహంగీరు చక్రవర్తి నామె యెల్లవిధముల మెప్పించెను.

జహంగీరు నూర్జహానును వివాహమాడుసరికి, నలుబదియూడు వత్సరముల ప్రాయమున నుండి, విశ్రాంతికై యెదురుచూచుచుండెను. అట్టిసమయమున, దన్నతిగాఢముగ వలచి, తనచే నత్యధికముగ ప్రేమింపబడి, తన మానసము బూర్తిగ స్వచ్ఛరింగి, తన పరిపాలనవిధానమునే యనుసరింప నిశ్చయించుకొని, తన్ను సర్వవిధముల దృప్తిపరచి సమ్మోహితునిగ జేసి, తన్ను రాజ్యభారమునుండి తప్పింప శక్తిసామర్థ్యములుగల నూర్జహానుకు సర్వస్వాతంత్ర్యమును జహంగీ రిచ్చె ననుటలో నాశ్చర్య మేమియును లేదు. కాలము గడచినకొలదిని, జహంగీరునకు విశ్రాంతివాంఛ యధికముకాగా, నూర్జహాను కధికారగౌరవము, శక్తి ద్విగుణీ

ప్రతిమారాయెను. దినదినము నామె కనుభవము వృద్ధియాయెను. మానవుల కధికారవాంఛకన్న మిన్నయగున దేదియు గాన్పింపదు. అట్టిచో సర్వ రాజ్యాధిపత్యమును నూర్జహాను తనయధీనము జేసికొనెననుటయం దాశ్చర్య మేమియు లేదు.

### జహాంగీరురాజ్యమున నూర్జహానుస్థానము

నూర్జహాను రాణి యైనంతనే, యామె బందుగు లెల్ల రున్నత పదవుల నియోగింపబడిరి. ఆమె తల్లియగు అస్మత్ బేగమున కంతఃపురమున మితిలేని యధికారమును గౌరవమును లభించెను. ఆమె తండ్రి మిర్జాఘుయాస్ బేగు ఢిల్లీ సామ్రాజ్యమున నంతటను గొప్ప యుద్యోగి యాయెను. కాని, వీరిరువురు జీవించియుండినంతకాలమును, దమకోమారితకు నలయక సలహాల నొసగుచు క్రోధ, మద, మాత్సర్యములవలన గలుగు నుద్రేకములనెల్ల దమశక్తినంతయు వినియోగించి, యణచుచు, నామె సద్గుణములకు మరింత వన్నె దెచ్చిరి. ఆమె సోదరు లిరువురును గూడ నున్నతపదవులను బొందిరి. వారిరువురి యందును అసఫ్ ఖా నధిక గౌరవము బొందెను. అసఫ్ ఖానుని కొమారితయగు అర్జుమంబాను బేగమును, నూర్జహాను, జహాంగీరు కుమారులయందెల్ల నుత్తముడు, నిపుణుడు నైన ఖుర్రమున (షాజహాను) కిచ్చి వివాహ మొనరించెను. ఈ అర్జుమంబాను బేగమే, ఖుర్రము పాదుషా యైనతరువాత ముంతాజమహాలను నామముతో ప్రఖ్యాతి నడసిన నారీశిరోరత్నము. వివాహకాలమునకు ఖుర్ర మిరువదిసంవత్సరముల ప్రాయమున నుండెను. అప్పటికే రాజ్యతంత్ర ప్రవీణుడై జహాంగీరు చక్రవర్తి కుమారులయందెల్ల శక్తిసామర్థ్యములు గలవాడని ఖుర్రము మన్ననవడసెను. జహాంగీరు మరణించిన తరువాత సింహాసన మధిష్ఠించుట కాతడే తగియుండెను.

చక్రవర్తికి బట్టపురాణి యైనంతనే, రాజ్యపాలనాభారమంతయు నూర్జహాను స్వతంత్రముగను, స్వశక్తిమూలమును వహించెను. ఆకాలమున దానే స్వయముగ సింహాసన మధిష్ఠించి, న్యాయసభల నలంకరించి, రాయబారులతో స్వయముగ మాటాడి, యుద్ధసంధివిషయముల దానే చర్చించుకొని రాజ్యపాలన జరిపెను. నాణెములపై గూడ నామె నామమే కాన్పింపజొచ్చెను. సర్వరాజ్యాధిపత్యమును దనహస్తముల నిమిడ్చి, యతినిపుణముగ, దనతల్లిదండ్రుల సహాయమున, నల్లకల్లోలములు గలుగకుండ బాలించెను. తాను రాజ్యభారము వహించిన 1611 వ సం॥ము మొదలు 1622 వ సం॥ము వరకు శాంతియుతముగ గడచిపోయెను. కాని 1622 వ సం॥ములో బరిస్థితులు మారజొచ్చెను. నూర్జహాను బందుగు లెల్ల రున్నతస్థితులకు వచ్చుట, చక్రవర్తి కామెపైగల విశేషాదరము, నన్నిటిని మించిన యామెయధికారమును గాంచి సహింపజాలక సామంతులు గొందరు మాత్సర్యపూరితులై యామెయధికారమణగింప యత్నించిరి. అట్లు తిరుగుబాటుగావింప యత్నించువారియందు మహబత్ఖాను ప్రముఖుడాయెను.

మహబత్ఖాను జన్మచే రాజపుత్రు డయ్యు నున్నతోద్యోగవాంఛచే మహమ్మదీయు డాయెను. కాని ధైర్యస్థైర్యముల కనలేనివాడై రసపుత్రమహమ్మదీయుల కిరువురకు నావర్యప్రాయుడై యుండెను. అనేకమార్లు మహబత్ఖాను, జహాంగీరుకు, నూర్జహాను కంతటి యధికారమీయవలదని యనేకవిధముల ముందెచ్చరించెను. కాని జహాంగీరాతని వాక్యముల నన్నిటిని చెవిచెవిని బెట్టెను. అందుచే మహబత్ఖాను విసుగుజెంది ఖుర్రముతో గలసి యాతనికి బట్టముగట్ట నిశ్చయుడాయెను. ఇందుమూలమున మహబత్ఖాను నూర్జహానులకు వైర మధికమాయెను.

ఇంతలో రాజ్యపరిస్థితు లన్నియు మారెను. పర్షియాచక్రవర్తి ఖాందహారు నాక్రమింప యత్నించుచుండెను. ప్రాక్పశ్చిమతీరములందు పోర్చుగీసువారి దుర్ణయము లధికమాయెను. మక్కాకు బోయెడి యాత్రికుల నడ్డగించి వారిధనములనెల్ల గొల్లగొట్ట మొదలిడిరి. ఒక సమయమున చక్రవర్తి నావలనుగూడ నడ్డగించి సుమారు నూరులక్షలు విలువగల యాస్తిని స్వాధీన మొనర్చుకొనిరి. అందున, నూర్జహా నాంగ్లేయ నావికాధిపతియగు డౌన్టను సహాయమును బడసి పోర్చుగీసువారి నోడించెను. ఆనాటినుండియు పోర్చుగీసువారి బలము క్షీణింప, ఆంగ్లేయులు వృద్ధిగాజొచ్చిరి. ఆంగ్లేయులు సూరత్ మొదలగు పట్టణముల వర్తకశాలలను గోటలను నిర్మించుకొని తమబలము నభివృద్ధిపరచుకొన మొదలిడిరి. ఆంగ్లేయులకు సదుపాయములు గలుగజేసి వారి నభివృద్ధికి దెచ్చిన దనసామ్రాజ్యమునకే మోసము కలుగుట తప్పదని నూర్జహాను గ్రహించి 1616వ సం॥మున పోర్చుగీసువారితో సంధి గావించుకొనెను. ఈసమయముననే వంగదేశమున ఉస్మాను లను నాఘనులు తిరుగుబాటు గావించి యల్లకల్లోలములకు మూలకారకులైరి. అందుచే వారి నణచుటకై నూర్జహానుతోడ రువాలను రసపుత్రనాయకుని బంపనత డాయాందోళనము నణగద్రొక్కెను. కాని వెనువెంటనే అఫ్ఘను ప్రముఖులకు గొంతకున్నతోద్యోగముల నొసంగి గౌరవించుటచే నూర్జహానెడ వారికి భక్తివినయము లధికముగా గుదిరెను. ఇట్లాఘనుల సాధువుల నొనరించి తనయనుచరులుగ నొనరించుకొనుటయందు నూర్జహాను చూపిన రాజ్యతంత్రప్రావీణ్య మనుపమానము.

అప్పటినుండియు నూర్జహాను చరిత్రయంతయు మహబత్ఖానుతోడను, ఖుర్రముతోడను వైరములతో నిండియుండెను. 1616వ సం॥మున దక్షిణదేశమున అహమ్మదునగరు బీజపూరుల జయించుటకై నూర్జహాను ఖుర్రమును బంపెను. ఖుర్రము దక్షిణాపథము ప్రవేశించినంతనే జయలక్ష్మి యాతనిని వరించెను. తనకు పూర్వ మంపబడిన యుద్యోగీయుల నెల్ల నోడించిన మాలికాంబరను గడగడ వడకించి సంధి కుదుర్చుకొనెను. బీజపూరుసుల్తాను హృదయమున భీతిగలిగించి, తనకు లాభకరమగు షరతులతో సంధిగావించుకొనెను. దక్షిణదేశమందు షాజహాను నధికారము, పలుకుబడియు నంతకంతకధికము గాజొచ్చెను. ఈవిషయము నెరింగినంతనే నూర్జహా నసూయాపూరితురాలాయెను. ఖుర్రమున కధికార మధికమైనచో సైన్యముల గూర్చుకొని జహాంగీరు నోడించి యాతని జీవితకాలమందే సింహాసన మాక్రమించి యితరసోదరులనెల్ల నేలమట్ట మొనరించునేమో యను భయ మామె

నావరించెను. జహంగీరు కడపటి కుమారుడగు షహరియారునకు, నూర్జహాను, తనకు మరొక భర్తవలన గలిగిన కొమారితనిచ్చి వివాహము గావించి యుండుటచే నాతనికే పట్టము గట్ట నిర్ణయించుకొనెను. అన్నిటి కంటె నధికముగ తనయధికార మే తగ్గిపోవునేమో యను భీతి యామెను బీడింపజొచ్చెను. ఈసమయమునకు మున్నే యామె తలిదండ్రులు మరణించిరి. అందుమూలమున నామె మహబత్ఖానునితో సంధిగావించుకొని, యాతనిని దన మాయోపాయములచే దనవంకకు ద్రిప్పికొని ఖుర్రమున కధికారాధిక్యత కలుగకుండ విశ్వప్రయత్నము లొనరింప మొదలిడెను.

ఇట్టిసమయమున నన్నటులుండ జహంగీరు రోగపీడితుడాయెను. జహంగీరు మరణించిన, ఖుర్రము రాజ్యమునకువచ్చిన, దనగతి యేమగునో యనుభీతి యామెను గీల్చి పిప్పిచేయ మొదలిడెను. ఎటులైనను ఖుర్రమును సింహాసన మధిష్ఠింపకుండజేసి, తనయల్లుడగు షహరియారునకు బట్టముగట్ట నిర్ణయించుకొనెను. జహంగీరు రోగపీడితుడుగ నున్న వార్త వినినంతనే ఖుర్రము ఖుస్రూను జంపించివైచెను. ఖుస్రూమరణము నాధారముగగొని నూర్జహాను, జహంగీరు మనస్సున ఖుర్రముపై నసహ్యతబుట్టించి ఖుర్రము నతని కాధారభూతములగు దక్షిణదేశమును విడచి ఖాందహారునకు రాజప్రతినిధిగ బోవునట్లు నియమించెను. కాని ఖాందహారునకు బోవుటకు ముందు ఖుర్రము నాలుగుషరతులు కోరెను. మొదటిది సర్వసేనాధిపత్యము తనకే యొసంగుట. రెండవది, పంజాబు దేశమంతయు దన కిచ్చివేయుట. మూడవది, తనకుటుంబరక్షణ నిమిత్తమై రణస్తంభపురము నాతని స్వాధీన మొనర్చుట. నాలవది, వర్షాకాలాంతమువరకు దన్ను దక్షిణదేశమందే యుండనిచ్చుట. ఈ తుది కోరికయం దాతని యభిప్రాయ మేమన, దక్షిణదేశమును వీడనంతలో దక్షిణమున దన యధికారము స్థిరముగ స్థాపించుకొనుటయే. ఈవిషయ మునంతయు నెఱింగినంతనే చక్రవర్తి కుమారుని ప్రవర్తనకు విసుగుజెంది తత్క్షణమే బయలుదేర వర్తమానముంపెను. పరిస్థితు లిట్లుండ, ఖుర్రము నూర్జహానుల పరిచారకులు కలహించి ద్వంద్వయుద్ధ మొనర్చుకొనిరి. ఇది యాధారముగ నొనరించుకొని ఖుర్రము దురుద్దేశ్యముతో నున్నట్లనుమానించి చక్రవర్తిచే ఖుర్రముస్వాధీనమందున్న పరగణాలన్నిటిని స్వాధీన మొనర్పవలసినదిగా నాజ్ఞాపత్ర మంపించెను. అందుచే ఖుర్రము తన ప్రవర్తనకు బరితపించుచున్నటుల నటించుచు క్షమాపణపత్ర మొండు తన తండ్రి కంపెను. కాని నూర్జహా నాయుత్తరము దెచ్చిన వార్తాహారుని జహంగీరు కడకు బోకుండజేసి తనస్థితిని గూర్చి విచారింపదొడంగెను.

ఆమెకు దోడునీడగ సహాయమొనర్చిన తలిదండ్రులు చనిపోయిరి. తనసోదరుడగు అసఫ్ఖాను నమ్మదగియుండక యాతనిని జలింపజొచ్చెను. ఇక చేయునదేమియు గన్పించలేదు. కాని నూర్జహానంతటితో విడచు భీరువు కాదు. వెంటనే మహబత్ఖానునకు వార్తనంపి, యాతని నత్యధికబిరుదములు, గౌరవములు మొదలగు వానితో సన్మానించి, తనవశ మొనర్చుకొనెను. మహబత్ఖాను కోరికప్రకారము, అసఫ్ఖా నాస్థానమునుండి పంపివేయబడెను. ఇక కార్యము మించినదని యెఱింగి ఖుర్రము తిరుగుబాటు గావించెను.

ఖుర్రమునకు దక్షిణదేశమందలి ప్రభువులెల్లరు సాయమొనర్చిరి. అతడు, సైన్యసమేతుడై 1623వ సం॥ మున ఆగ్రానగరమును జొచ్చెను. నూర్జహాను సర్వసైన్యాధిపత్యమును మహబత్ఖానుని హస్తమునం దుంచెను. బిలోచ్పూరనుచోట నిరుసైన్యములును గలసికొని ఘోరయుద్ధ మొనరించుకొనిరి. అందు ఖుర్ర మోడింపబడుటయేగాక, యాతని దక్షిణహస్తమగు విక్రమాదిత్యుడు హతుడాయెను. తన సైనికులు గూడ నాతని విడువనొడగిరి. ప్రాణరక్షణార్థమై అశీర్ఘరు కోటకు ఖుర్రము పలాయనుడాయెను. మార్గమధ్యమున తిరుగ నూర్జహాను సైన్యములచే రెండుమార్లోడింపబడెను. చేయునదిలేక, ఖుర్రము అహమ్మదునగరమున మాలికాంబరు శరణుజొచ్చెను. అంతటిలో మహబత్ఖాను వానిని వెన్నంటుట మాని, వంగదేశమును జయింప మొదలిడెను. బర్ద్వాను నాక్రమించి, ద్రోహులనెల్ల రాజమహాలునొద్ద నోడించి క్రమముగా వంగదేశము, ఒరిస్సాదేశము నాక్రమించుకొనెను. అలహాబాదు, జౌన్పూరులగూడ స్వాధీనపరచుకొనెను. మరల ఖుర్రము వంకదిరిగ యాతనినోడించెను. అటుపిమ్మట మాలికాంబరు నణగింప మహబత్ఖాను బీజపూరు సుల్తానుతోగూడి విశ్వప్రయత్నము లొనరించుచుండెను. ఈసమయమున ఖుర్రము శరీరమందు రుగ్మత ప్రవేశించెను. అందుచే, ఖుర్రము, మరణమునకు సిద్ధముగనున్న తనతండ్రికొక క్షమాపణపత్ర మంపెను. చక్రవర్తి శయ్యపైనుండి లేవజాలకుండుటచే నాపత్రము నూర్జహాను హస్తముల బడెను. మహబత్ఖానుని యధికారము నానాటికి వృద్ధిగాంచుట నూర్జహానున కిష్టములేకుండెను. అందుచే నామె ఖుర్రము క్షమాపణ నంగీకరించి, యాతనిని దనపక్షమున జేర్చుకొనెను.

మహాబత్ఖానునకు, ఖుర్రము రాజ్యమునకు వచ్చుట యిష్టము లేదు; ఎట్లైనను షహర్యారును, సింహాసన మెక్కించి, తన యధికారమును నిరంకుశముగ జాటుకొన మహాబత్ఖాను యత్నించుచుండెను. నూర్జహాను, తనయల్లుడగు షహరియారునకు బట్టముగట్ట నిశ్చయించెను. షహరియారు రాజ్యమునకు వచ్చినా, మహబత్ఖానునకు లేశమాత్రమైన నధికారముండుటకు నవకాశము లేదు. అందుచే నూర్జహానుపై మహాబత్ఖానున కసూయ యధికమాయెను. ఒండొరుల మనములు కలియనప్పు డెంత స్వల్పవిషయమైనను వైరము, నుద్రేకము దెచ్చుట సహజమేకదా! ఈ సమయముననే మహాబత్ఖానుని యల్లుడొక తప్పిద మొనరించి, క్షమాపణ వేడుటకై యాస్థానమున కేగ నచట యతడవమానపరుపబడెనట. ఈ యవమానమును సహింపలేక మహాబత్ఖాను తిరుగుబాటు గావించి సైన్యముల గూర్చుకొని యుద్ధసన్నద్ధుడాయెను. శరీర మస్వస్థతగ నుండుటచే, పంజాబుదేశమున నారోగ్యముగ నుండునని యెంచి, చక్రవర్తి యచట నివసించుచుండెను. మహాబత్ఖాను వెంటనే పంజాబునకు సైన్యసమేతుడై వెడలి చక్రవర్తిని ముట్టడించెను. సామ్రాజ్ఞి, తనపరివారముతో బాటు నదినిదాటి యావలిగట్టునకు బోవుచుండగా, నీవలివైపున దాటుటకు సిద్ధముగనున్న చక్రవర్తిని మహాబత్ఖాను చుట్టుముట్టి పట్టుకొనెను. నూర్జహానుమాత్ర మావలిగట్టునకు జేరిపోయెను. చక్రవర్తి మహాబత్ఖానుచే బంధితుడైనవార్త వినినంతనే, యామె మహాబత్ఖానునితో

ఘోరరణము సలిపి, యెట్టకేలకు పరాజితురాలాయెను. బలవంతముగ యుద్ధమందోడించి మహాబత్ఖానునాపుటకు శక్తి లేదాయెను. ఇక మిగిలిన దామెకు జన్మతః సిద్ధించిన యుక్తి. తానంత దాసె, భర్తను విడచి జీవింప జాలననియు భర్తతో గూడ దానును బందీకృతురాలై యుండెదననియు, మహాబత్ఖాను హస్తముల జిక్కెను. విరోధ శిబిరము జొచ్చినంతనే మహాబత్ఖానుని సైన్యమందలి గసపుత్రులకును, మహమ్మదీయులకును వైరము గల్పించి, మహమ్మదీయ సైనికులందరను దనవంకకు ద్రిప్పికొని, మహాబత్ఖానును బంధించుటకొక తంత్రమును బన్నెను. ఈ రహస్యము నంతయు నెరింగి మహాబత్ఖాను ప్రాణావశిష్టుడై పలాయనుడాయెను. ఇంతకుమున్నె పార్వేజు మరణించెను. అందుచే నూర్జహాను నోడించి షహరియరును రాజ్యమునకు దానీయకుండ జేయుటకై ఖుర్రము గొప్పప్రయత్నమొనరింపబూనెను. అప్పుడు నూర్జహాను మరల మహాబత్ఖానుని బిలువనంపి యెట్లో యాతని మోసగించి, యాతడు ఖుర్రము నోడించుటకును సర్వసైన్యాధిపత్యము నాతని కిచ్చుటకును షరతుల నేర్పరచుకొని సంధి కుదుర్చుకొనెను. అట్లే మహాబత్ఖాను సైన్యసమేతుడై ఖుర్రము నోడించుటకై వెడలుచుండ, 1627 వ సం॥ మున అక్టోబరు 28 వ తేదీని జహాంగీరు మరణించినట్లు మార్గమధ్యమున నాతనికి దెలియవచ్చెను. ఇంతలో మునుపటినుండియు నసఫు విరోధియై, ఖుర్రము శ్వశురుడునగు అసఫ్‌ఖానుని గలసికొని, యిరువురును సఖ్యపడి, ఖుర్రమును, షహజహాన్ బిరుదముతో సింహాసన మెక్కించిరి. ఈవిషయము నంతయు చారుల మూలమున నెఱింగి, నూర్జహాను, తన యధికారమిక సాగదని గ్రహించి, సర్వసంగపరిత్యాగ మొనర్చి, రాజ్యకాంక్ష లేక, యంతఃపురమున నేకో యొక మూల సన్యాసినివలె, భర్తృనామస్మరణముతో దనజీవితమును గడుపుచు 1646 వ సం॥ మున గాలధర్మము నొందెను.

జహాంగీరు, సింహాసన మధిష్ఠింపకమున్నె, దురభ్యాసములకు లోనై, తన్నతిగారాబముతో బెంచిన తనతండ్రి మనస్సును జాల నొప్పించెను. తాను రాజ్యాధిపత్యము వహించిన రెండుసంవత్సరముల లోనే ప్రజలు కొందరాతని పరిపాలనవిధానమున కసంతృప్తి నొంది ఖుస్రూను రాజుగ నొనరించుటకై యల్లరులు చేయ మొదలిడిరి. సింహాసన మధిష్ఠించునప్పటికే, "తెలివిగల త్రాగుబోతు" అను బిరుదముచే ప్రఖ్యాతివడసిన జహాంగీరే స్వయముగ దన జీవితాంతమువరకు రాజ్యపాలన మొనర్చియుండినచో మొఘలుల వంశచరిత్ర యెట్లు పరిణమించి యుండెడిదో, దురూహ్యము. అట్టి విపత్తువ బడకుండ, రాజ్యక్షయము లేకుండ, దేశమందు శాంతిని నెలకొల్పి ప్రజల రక్షించుట కవతరించిన దేవతవోలె నూర్జహాను సకలరాజ్యభారము దనపై వైచుకొని జనానురంజకముగ బాలించెను. ఎట్టి ప్రతిభాశాలి కానున్న సకలభారతభూమి నేలు చక్రవర్తి నొకనిని దన పాదాక్రాంతునిగ జేసుకొని, రాజ్యభారమంతయు దనకు విడమనట్లు చేసి, దేశమును మహావిపత్తునుండి తప్పించెనో చదువరులే యూహింతురుగాక! ఇక నట్టి శక్తిమతి రాజ్యమందుగూడ నెందులకు దిరుగుబాట్లు, నల్లరులు గలిగెనని ప్రశ్నింప వచ్చును. జహాంగీరు పరిపాలనసమయమున గలిగిన యల్లకల్లోలములు, నూర్జహానే కాక, మరి యే యితరవ్యక్తి (యెంతటి ప్రఖ్యాతుడైనను) యధికారమందున్నను గూడ సంభవింపక తప్పవు. కాని యీ యల్లకల్లోలములన్నియు సాధ్యమగునంతవరకు గొంగి శక్తిసామర్థ్యములతో నణచిన ప్రఖ్యాతి నూర్జహానునకు నన్నెతును విడువదు. నూర్జహానే రాజ్యభారము వహింపకున్నచో మొఘలువంశచరిత్ర యెట్లు మారియుండెడిదో కదా! ఎన్ని యుద్ధములు జరిగినను, ఎన్ని తిరుగుబాట్లు సంభవించినను, ప్రజల క్షేమమాత్రము నష్టము రానీయకుండ రాజ్యపాలన మొనర్చుటయందు నూర్జహాను చూపిన ప్రజ్ఞావిశేష మత్యధికశ్లాఘనీయము. ఏది యెట్లున్నను జహాంగీరే స్వయముగ రాజ్యభారము వహించినచో రాజ్యము క్షీణించి చెడిననుమాట మాత్రము రూఢి.

కాని యంతమాత్రమున నూర్జహాను నొక స్త్రీరూపము దాల్చిన పురుషునిగనో, మానవరూపము దాల్చిన రక్కసిగనో తలచుట కవకాశము లేదు. నూర్జహానుగూడ నితరులవలెనే యొక సామాన్యస్త్రీ. స్త్రీసహజమగు ప్రేమ యామెకు పుట్టినిల్లు. దయాధర్మములు రెండు నీమెకు హస్తములు. ఈమె నిరాశ్రయుల పాలిటి కల్పతరువు. రాజనీతివిశారద. అస్త్రప్రయోగనైపుణ్యచతుర. సకలవిద్యాప్రవీణ. రాజ్యతంత్రజ్ఞానకుశల. కాని, యిట్టి యుత్కృష్టసద్గుణముల కాలవాలమగు నూర్జహానుకూడ స్త్రీసహజమగు నధికారవాంఛ, యత్యాశ, యసూయ మొదలగు హీనగుణములకు బానిసయై యుండెను. అంతమాత్రమున నామె జీవితము నామె సద్గుణములు, హీనముగ నొనరింపజాలవు. సర్వకాలము నామె యొనర్చిన సత్కార్యము లితరలోటుపాట్లను గప్పిపుచ్చును. ఆమె సద్గుణరాశియందామె లోటుపాట్లు ప్రత్యేకించి యెన్నదగినంతటివి కావు.

నూర్జహాను జీవితము నంతయు సావధానముగ బరిశీలింపగా స్త్రీలుగూడ రాజ్యపాలనకు తగిన సామర్థ్యము గలవారనియు, కొన్ని సమయములందు బురుషులకు మించిన కార్యములుగూడ నొనరింపగలరనియు స్పష్టమగుచున్నది. ఒకవంక సవతికుమారునివలన గలుగు బాధల సవరించుకొనుచు, మరియొకవంక సామంతుల తిరుగుబాటుల నడగించుచు, భర్తమనస్సు నొవ్వకుండ, రాజ్యవినాశనము లేకుండ, యుక్తియుక్తముగ ప్రజలకు గష్టములు రానీకుండ రాజ్యమేలి యెల్లర మెప్పు వడసిన ప్రతిభాశాలి, నూర్జహాను. అత్యద్భుతసాహసము, మనఃస్థైర్యము, కార్యానుగుణనైపుణ్యము, కార్యదీక్ష, సూక్ష్మబుద్ధి, రాజ్యపాలనచాతుర్యము, సకలకళాప్రావీణ్యము, అగాధప్రణయము, నమోఘమగు పతిభక్తి, దీనజనరక్షణ, పరమకారుణ్యబుద్ధి, యాదిగాగల సర్వశుభలక్షణములు నూర్జహాననెడి యొక్క నామమున నిరంతరము ప్రతిధ్వనించుచుండును గదా!

# తూము లక్ష్మీనరసింహదాసు

మిన్నికంటి గురునాథశర్మ గారు

౧

శ్రీరామరామ యనుచు న, నారత మత్యంత పావన స్థిరభక్తి
ప్రేరణఁ బరిణమపుణ్యుఁడు, దారుని తూము నరసింహదాసు నిదలఁతుక్.

ఐహికభోగాసక్తుల సాహచర్యాదికముచేఁ బ్రాచ్యులకును భగవద్భక్తి సన్నగిల్లుచున్నది. హేతువాదములు మెండగుచున్నవి. ప్రత్యక్షప్రమాణమే ముఖ్య మగుచున్నది. "ఆత్మైవ హ్యాత్మనో బంధు" యన్నట్లు కించిజ్ఞులగు తా నన్యుల మహిమాతిశయముల వినానువ కార్యముల సందేహించి వెక్కిరించుచున్నారు. "మురారే స్తృతీయఃపంథా" యన్నట్లు విపరీతమైనను నవీనమార్గముం ద్రొక్కుటయే యశస్కరమై నాస్తికత ప్రబలుచున్నది. అనుయాయులుఁ దోడగుచున్నారు. కావున దగ్మతాంతరములు విజృంభించుచున్నవి. పూర్వమువలె నేఁడు భాగవతమాత భగవద్భక్తులఁ గడుపునిండఁ గనఁజాలకున్నది. అట్లయినను, ఏదేవుని సేవించిననేమి? ఏ మంత్రము నుపాసించిననేమి? ఏ యోగము నవలంబించిననేమి? వేమనయోగి, రామదాసు, తుంగదుర్తి బుచ్చయ్య, తూము లక్ష్మీనృసింహదాసు, త్యాగరాజు, బ్రహ్మముగారు, సిద్ధప్ప, నాసరుగారు, పరశురాముల నరసింహదాసు, వావిలికొలను సుబ్బారావుగారు మొదలగు భక్తవర్యులు నేటికిని బూజింపఁబడుచున్నారు. నిన్న మొన్న మాత్రము కన్నులు తెఱచి వేమన్న యోగినిగూర్చి పరిశీలించుచున్నారు. త్యాగరాజుఁ బడువుచున్నారు. కాని మిగిలిన భక్తవర్యుల చరిత్రముల సమగ్రముగఁ బరిశోధించుచున్నట్లు కన్పింపదు. "భక్తవిజయము" నాఁబరగు గ్రంథమాత్రము మహారాష్ట్రభాషాగ్రంథమూలక మగుటం జేసి ఆంధ్రదేశభక్తుల చరిత్రములందుఁ జేరదయ్యె. ఆంధ్రభక్తుల చరిత్రమును రచించుటకు 'ఆంధ్రవాల్మీకి" శ్రీయుత వావిలికొలను సుబ్బారావుగారు పూనుకొనెద మని యొకమారు సెలవిచ్చియుండిరి. ఎవరెవరెంగిన భక్తులనుగూర్చి వారు ప్రకటించుట సముచితమని నేనొక వ్యాసమును వ్రాయఁబూనితిని.

భక్తిలత కాలవాలమును సంగీతసాహిత్యముల కునికిపట్టును ప్రసిద్ధమును బవిత్రమును నగు "తూము"వంశమున లక్ష్మీనృసింహదాసు గారు క్రీస్తుశకము 1790 ప్రాంతమున నప్పయాఖ్యునకును వెంకమాంబకును నవతరించిరి. వీరు గోలకొండ వ్యాపారులు. ఆపస్తంబసూత్రులు. యజుశ్శాఖాధ్యయనులు. వసిష్ఠశక్తిపరాశరాఖ్యత్రయార్షేయులు. పరాశరగోత్రభవులు.

లక్ష్మీనృసింహదాసుగారి తాతగారు వేంకటకృష్ణయ్యగారు. వీరు గుంటూరుమండలము నందలి పొన్నూరు గ్రామమున నివసించుచు భావనారాయణస్వామిని సేవించుచుండిరి. వీరి కప్పయాఖ్యుండు జనించి బుద్ధిబలముతోఁగూడ దేహబలమును వహించి రాజగౌరవము నొందుచు వేంకమాంబను బెండ్లాడి యే కారణముననో పొన్నూరును విడిచి గుంటూరు పట్టణము జేరి స్వగృహమును నిర్మించికొని కాపురముండెను. హరిభక్తిపరాయణులగు నా పుణ్యదంపతులకు మన లక్ష్మీనృసింహదాసు, కృష్ణదాసు నా నొప్పు పుత్రరత్నద్వయమును, రుక్మాంబాయి నాఁబరగు ముద్దుకూఁతురు జనించిరి. రుక్మాంబాయిని నారుమూలరి వు వంశమున కిచ్చి పరిణయ మొనర్చిరి.

ఆ లక్ష్మీనరసింహదాసు, కృష్ణదాసు నుచితసంస్కారము లంది యాంధ్రగీర్వాణవిద్యల నభ్యసించి రామభక్తులై యుండిరి.

పిదప సంప్రదాయవంశజాత, సద్గుణమణి యగు "లక్ష్మీబాయమ్మ" ను లక్ష్మీనరసింహదాసు, సీతమ్మ యను బాలికను కృష్ణదాసు పరిణయమైరి. భగవద్భక్తశిఖామణి యనఁ దగు నీ లక్ష్మీనరసింహదాసునకు సంతానము లేకపోయెను. సాధారణముగా భగవంతుఁడు తన దాసుల కౌరసులనొసంగకుండు నేలనో?

ఈ భక్తుఁడు పరమపదముఁ జేరినవెనుక లక్ష్మీబాయమ్మగారు మఱఁదికొడుకును రామదాసనామునిఁ బెంచి వైదేహి యను కన్య నిచ్చి వివాహము చేసెను. వారలును నిస్సంతానులైరి. వైదేహమ్మయు భర్తృమరణానంతరము తూము లక్ష్మయరాయ నామునిఁ బెంచుకొనియె. అతని కొడుకు, సూర్యచంద్రుఁడు భద్రాద్రి నేటికిం గలరు.

మన లక్ష్మీనృసింహదాసుగారు బాల్యమునుండియు రామభక్తులై నడచుచున్నను నడుగడుగునకు రామరామ యనియు, మాటలాడుచున్నను మాటమాటకు రామరామ యనియు మదిలో ననుకొనుచుండువాఁడు. పువ్వు పుట్టుటతోడనే పరిమళించును.

తన కిరువదేండ్లు వచ్చినపిదపఁ దండ్రి స్వర్గస్థుఁడుగుడుఁ గటుంబభార మధికమై కలంపఁ బొన్నూరులోఁ బేష్కారు వేతనమున దినముల



ఆదిక్షత్రియ మహాజనసభ, బెంగుళూరు



శ్రీ రాయప్రోలు సత్యనారాయణగారు



శ్రీ తుంగల రామారావుగారు



శ్రీ నాగులకొండ వెంకటాచలంగారు



శ్రీ రేపాక వెంకటరత్నంగారు



శ్రీ కందాడై భాష్యాచార్యులుగారు



శ్రీ పెండెం అప్పలస్వామిగారు,



శ్రీ ముల్లెన్‌కన్యగారు



శ్రీ కమలామీనమకన్యగారు



క్యాంప్‌బెల్ హారిస్‌సతిగారు



భారతిమహిళాసమాజము, అబలాజన పఠనమందిరము-గుంటూరు

ఆర్. యస్. కృష్ణస్వామి అయ్యంగారిసతి బాలమ్మగారికి వీడ్కోలువిందు

గడుపుచుండినను రామభజనము, నతిథ్యభ్యాగతులసేవ, యాంధ్రకవితా రాధనము మాత్ర మేమరకుండెను. అట్టులెన్ని దినములో జరుగలేదు. దాస్యము స్వాతంత్ర్యము నడంచునుగదా. రామసేవ కుద్యోగధర్మ మంతరాయ మగుటఁ దృణంబుంబోలె దాని విసర్జించి సద్గురుఁడగు గురువునొద్దఁ దారకమంత్రమును గైకొని తనయింట రామమందిరమును నిర్మించి సీతారామాదివిగ్రహముల నిల్పి నిత్యము భజించుచు, నిరంతరము గద్యపద్యాదులచేఁ బొగడుచు నెన్నియేని శతకంబుల గేయంబుల రచించి ప్రసిద్ధుఁడై యుండెను.

౨

అన్నదానంబు పునర్జన్మహేతువని వాదించు లోభులకును, నాచరణశూన్యులై "అహం బ్రహ్మాస్మి" యని వాదించు దాంభికులకును, కుపథగాములై పుణ్యపాపంబు లాత్మ కంట వను పండితమ్మన్యులకును జెప్పఁజాలముగాని ముక్తికి భక్తియు భక్తికిఁ దీర్ఘసేవయుఁ గారణములు గాకపోవు. తా మెందుం గోఱగాక భక్తులం జూచి యోగుల మాత్రము పొగడియు యోగులంజూచి జ్ఞానుల నేకొండాడియుఁ దదితరుల దూషించువారు తీర్థయాత్రాపరుల గేలిసేయుదు రేటు? శివకేశవాదులు తీర్థయాత్రలఁ గృతార్థులు గాలేదా? నేఁడు ధూమశకటాదులవలన సుదూరమ్మైనను దాపగుచున్నది కాని పూర్వము కాశికేగుట కాటికేగుట సమానమఁట. రైళ్లలోఁ గూరుచుండి యనాయాసముగా యాత్రల సేవించిన ఫల మొకవేళ నంత లేకుండు నేమో కాని కాలినడకతో వివిధ శ్రమల కోర్చి కష్టసుఖంబుల ననుభవించి యనేక గ్రామప్రజల యన్యభాషాసల్లాపసామాజభూషణాదుల నాలకించుచుఁ జేయు యాత్ర భూతదయను లోకజ్ఞానమును సౌభ్రాత్రమును భక్తిని బెంపొందింపఁ జేయకపోదు. ఫలము గల్గకపోదు. అట్లగుటవలన నేఁ గాంబోలు యాత్రసల్పి వచ్చినవారిని స్వబంధువులు మేళతాళంబుల నెదుర్కొని మహావైభవంబున నింటికి గొంపోయెదరు.

సీ. పాడిదగ్గు కంఠంబుఁ బొరివుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొందకయమున్న
బొమలు కన్నులమీఁదఁ బొదివి వ్రాలకమున్న
పొగ నేత్రముల కడ్డు పొరకమున్న
శ్రుతిపుటంబుల శక్తి సురిఁగిపోవకమున్న
వళు లాననమునఁ బర్వకయమున్న
హృదయంబులో జాగ పదను దప్పకమున్న
గాత్రంబు శిథిలంబుగాకమున్న
పండ్లు వేర్వాసి కదలు చూపకయమున్న
కాకి కడకంటిపై చూపు రాకమున్న
కాలు నేయాడు తఱియంద కదలపలయుఁ
దీర్ఘసేవకు దేహ మస్థిరముగాన. (కాశీ)

అని తలపోసి మనదాసుగారు క్రీ. శ. 1818-19కి సరియగు బహుధాన్య సంవత్సర కార్తికమున శ్రీరంగమున కేగి రంగనింగడు నుప్పొంగుచు సేవించి "శ్రీరంగశాయి తారహారమను" అను మకుటము గల సీసపద్యముల నిర్వాహించి సమర్పించి తిరిగి యిలు సేరెను. వీ రే దేవు నెప్పుడు దర్శించినను బద్యములతోఁ బొగడక మానెడివారలేరు.

కాశీయాత్ర క్రీ. శ. 1820-21

తన మాతృసోదరి యగు వేంకమాంబయు, సంగియగు లక్ష్మీబాయమ్మయు సోదరుఁడగు కృష్ణదాసును నుచితవాక్యముల సమాధానపఱచి విక్రమ సం॥ చైత్ర శు ౧ శనివారము రేవతీనక్షత్రమున గుంటూరునుండి కతిపయాప్తమిత్రులతోఁ గదలి యమరావతి కేగి కృష్ణాస్నానమునఁ బవిత్రుఁడై భర్గుం గొనియాడి దుర్గమారణ్యమార్గముల ననర్గళభక్తిపరవశుఁడై నడచుచుఁ గ్రమముగా భద్రాద్రి కేగి శ్రీరామచంద్రమూర్తిని దర్శించి

సీ. అర్థి కిచ్చినధనం బఘుఁడే మఱచె దటు
పదిల మోహారో రామ! బహుపరాకు
అపకార మొనరించు నతని మఱచెదటు
పదిల మోహారో రామ! బహుపరాకు
మఱచుట నీ కిది మఱి సహజంబఁట
పదిల మోహారో రామ బహుపరాకు
మహి నున్న నీగతి (?) మఱచెద వేమొకో
పదిల మోహారో రామ బహుపరాకు
పద్మజాక్షు! రమాధీశ! బహుపరాకు
భక్తనరసింహపోషక! బహుపరాకు
భద్రశైలా! పరిసిద్ధ బహుపరాకు
భక్తమందార రఘువీర బహుపరాకు.

ఇట్టి యనేకపద్యంబులఁ బరాకుదెలిపి మఱలఁ బయనమై దినక్రమంబున నశ్వారావుపేట, కొవ్వూరు, రాజమహేంద్రవరము, సామలఁ బిఠాపురమ్ముం జేరి కుంతిమాధవుఁ బూజించి సింహాద్రి కేగ వరాహనృసింహస్వామికి మ్రొక్కి కూర్మపురముఁ జేరి కూర్మేశ్వరుని భావించి జగన్నాథముఁ దొరసి మార్కండేయాదిపుణ్యతీర్థంబులఁ గ్రుంకి జగన్నాథుని బిల్వమహిమకథల వినుచు నాతనికి నమస్కరించి

పం. — పరాకు శ్రీరమాంగనాస్య పద్మపద్మగంధవా
పరా కనంతపద్మజాంబుజాక్ష భూరితోషదా
పరాకు భక్తసౌఖ్యదాన భవ్యదివ్యవిగ్రహా
పరాకు దేవమౌళిరత్న భాసితాంఘ్రిపంకజా.

అని పొగడి యందు పంచరాత్రంబులు వసించి యటుగదలి బహుకష్టప్రయాణంబుల జాజిపురంబేగి యచ్చటిని పైతృకక్రియల నిర్వర్తించి మార్గశ్రమమ్మున నలసి కాశీదర్శనభాగ్య మున్నదో లేదో యని చింతించి శయి యగుడు నిద్రింప స్వప్నంబయ్యెనఁట.

సీ. బ్రహ్మాదులకునైన బడయ సాధ్యముకాని
యప్రతిహతశక్తివైన నీవు
దురితాత్ముఁడంచు నన్ ద్రోయఁగాఁ జూడక
యతిదీనుఁ డీతఁ డం చాత్మనెంచి

జాలిజనించి కాఁబోలు నాపైని నీ
నిర్హేతుకప్రేమ నెగడఁజేసి
స్వప్నగోచరుఁడవై భవమెల్ల తీర్చి శ్రీ
మేలు నా కరయ వేవేలుగాఁదె
స్వాంతమున నాదుపట్ల నొక్కింతకరుణ
నీకుఁ గల్గిన యొకలఁ ద్రిలోకములను
నాకు సముఁ డుండఁగలఁడే యనాథరక్ష
దశరథకుమార రామ భద్రాద్రిధామ!

గీ. వెఱువకు మటంచు నన్నిట్లు వెన్నుఁజఱచి
దయ దలిర్పంగఁ దెల్పెడి దాత లెవరు?
తల్లిదండ్రులు గురువులు దైవమీవె
దశరథకుమార రామ భద్రాద్రిధామ!

అహా! నృసింహదాసా? ఎంతధన్యుఁడవోయి! శ్రీరామచంద్రమూర్తి హస్తస్పర్శభాగ్యము నందితివి. పూర్వపు భక్తుల స్వప్నంబు లట్టివి. వారి విశ్వాసంబు నట్టిది. నేఁటివారిలిక్కాలను సుబ్బారావుగారు, నప్పాదాసుగారు మొదలగువారికి స్వప్నసాక్షాత్కారానుభవము గలదు. అయినను నట్టివానిని నమ్మక పరిహసించువారున్నను లేకపోలేదు. ఎవరికి లోటు? కావుననే దాసుగారు

గీ. క్షేమజంబని కొందఱు పెద్దలెల్ల
నవ్వి నిందింతురా తప్పు నాదికాదు
దాసుఁ డను పేరుఁ బెట్టించి ధరణియందుఁ
ద్రిప్పి రక్షించు దీవికా దేవదేవ.

అనియును నంత నిలువక,

గీ. మించి జనములెల్ల మెచ్చుకొనుటకు వ
ర్తింపఁజాల లయకు సొంపుమీర
నెసఁగి పాడనేర నిల నప్రసరోజక
తనువు దీనిఁ ద్రోచు దాస తీవె.

క. హరి నీ యడుగుందమ్ముల
నరసి మదిం గంటి నింక నరిసర్గము కే
వెలునను జామి........................

అని నమస్కరించి పొగడి పాదచారియై క్రమముగా బుద్ధగయ కేగి ఫల్గుణీనది దర్శించి స్నానసంధ్యాదులను పైతృకవిధులను నిర్వర్తించి యందందుంగల పుణ్యతీర్థముల మెట్టుచు రామనామస్మరణము సలుపుచుం జని చని దూరంబునం గాశిం గని

సీ. రజతాద్రి యిపటికి రాఁబోలు నేమొకో
కాదు కాశీసౌధకాంతిగాని
... ... ... ... ... ...
... ... ... ... ... ...

అని వర్ణించుచు సంతోషాతిశయమున నృత్యము సేయుచు,

గీ. పాంచభౌతిక దేహంబుఁ బాసి జీవుఁ
డరుగునప్పుడు సత్కర్ణాంతరమునఁ
దారకబ్రహ్మమంత్రంబు దయ నొసంగు
హరుని కాఁపురమగు కాశి నరయఁగంటి.

అని యుప్పొంగి పరియుంజని హృదయపీఠి విశ్వేశ్వరు నిలిపి భావకుసుమంబులఁ బూజించి జాహ్నవీ విమలతోయావగాహనంబునఁ బవిత్రదేహుఁడై యప్పురిపరి నొక భూసురావాసమున నతనియింట వసించి భక్తితాత్పర్యవిశేషంబుల నిత్యము విశ్వనాధుని సేవించుచు బిందుమాధవు భావించుచు భవానిని దర్శించుచు దండపాణిని విమర్శించుచుఁ దుంఢిని గొల్చుచు భైరవుని బిల్చుచుఁ గ్రమక్రమముగా నర్వదినాలుగు ఘట్టముల నధికశ్రద్ధఁ బరిశీలించి పవిత్రుఁడై కృతార్థుఁడనైతినని హర్షించి పితృగ్రహణాదులొనరించి విడువలేక విడువలేక యగస్త్యునింబోలెఁ గాశి విడిచి పశ్చిమముగాఁ జని ప్రయాగను గాంచి తనయందుంబోలె గంగా యమునాసరస్వతుల సంగమం దర్శించి త్రివేణీసంగమంబున స్నానాదికృత్యంబు లాచరించి తక్కుంగల విశేషమ్ము లారసి జన్మమ్ము సఫలమ్మయ్యెనని భావించి శీఘ్రప్రయాణమ్ముల దస్సివాఁ డనుటచే నటు పైకఁ జనలేక వెనుకకు మరలి లనపోవిన మహిమల మనంబునం దలంచుచుఁ గొన్నిదినంబులకు గుంటూరునకేఁగుదెంచి తన తల్లియగు వెంకమాంబ పాదపద్మముల్ గ్రాలి తాఁదెచ్చిన గంగాజలంబుల నామె నభిషేకించి యాత్రాప్రసంగముల నుగ్గడించుచు బంధువులతోఁ గూడఁ గొన్నిదినంబులు గుంటూరున గడపెను.

అంత శ్రీరామకల్యాణ నిరీక్షణ కౌతూహలాయత్త చిత్తుండై తమ్ముఁడగు కృష్ణదాసుం దోడ్కొని బంధువుల వీడ్కొని కతువేష్కతోఁ గదలి నృపమార్గన పై త్రేతుద్గసనమికి భద్రాద్రిని జేరి గౌతమీ పూత జలంబుల స్నాతుండై శ్రీరామునకు హృదయమిచ్చి సీతాదేవికిఁ గానుక లిచ్చి హనుమకు మ్రొక్కు లిచ్చి స్వామిసన్నిధి నిలిచి యంజలిబంధుండై

సీ. గయయందు నిప్పాపి కనులకు శ్రీపదంఘ్రి
వీక్షింపఁజేసిన దీనకావె?
గంగాతటయాత్రలీ కలుషాత్మచేతఁ జే
యించి రక్షించిన దీనకావె?
కలయందు నగ్నికాకారివై పీనికి
దృతి నెసకొల్పిన దీనకావె?
మఱల నిప్పాపి నీ చరణసన్నిధిఁ జేర్చి
యింపుగాఁగావించిన దీనకావె?
ఇంక దక్షిణదిగ్యాత్ర లెటుల వీని
పలనఁ జేయింపఁగా మదిఁ దలఁచినావొ?
భారమెల్లను నీదె దివ్యప్రభావ
దశరథకుమార భద్రాద్రిధామ రామ.

ఈరీతి నా భగవంతుని బొగడి యతని యంఘ్రుల హృదయంబున స్థాపించుకొని మఱల గుంటూరు చేరె.

అంతఁ దనువస్థిరమనియు సత్కార్యాచరణము సేమరరావనియు నిజజననికిం గళత్రమునకుం బోధించి తమ్మునికి ధైర్యంబుఁ గొల్పి నిర్ధ

మండయ్యు రాముని పై భారంబు నైచి రామేశ్వరాదిదివ్యక్షేత్రంబుల వీక్షింపు తమకంబున వృషవత్సరాషాఢశు ౭ (క్రీ. శ. 1821-22) దినంబున గుంటూరునుండి నిర్గమించి పొన్నూరుం జేరి శ్రీ భావనారాయణ స్వామిని గీర్తించి బాపట్ల కేగి యందలి స్వామిని బొగడి యచ్చ్యుచు నిట్లు తా విడిసిన ప్రతిష్ఠలముల నుండు స్వాములను దర్శించి మ్రొక్కుచు ననుదిన ప్రయాణమ్ముల నెల్లూరి కేగి పెన్నలోఁ గ్రుంకులిడి యందలి దివ్యాలయంబుఁ జూచి యచ్చెరువొంది రంగనాథుని సేవించి యాతనిం బొగడి తిరుపల్లిక్కేణి డాసి పార్థసారథి దర్శించి చెన్నపురినుండి కదలి యోజనెడ వర్షంబులఁ దడియుచు గడగడ వణఁకుచు నెండకుం గందుచు క్షుత్తృష్ణలకు సోలుచుఁ గాలినడకలకు బడలుచు నొడలు కృశింపఁ బయనములు సేయుచుఁ జిదంబరముఁ గగను మురియుచు నగసి యందలి పుష్కరణీతీరమునఁ గల నానావిధభక్తులఁ బలుకరింపఁగఁ బరికించి గగనలింగముం గని ప్రణమిల్లి బిల్వదళంబులం బూజించి శివకాళి కరిగి శంకరున కలిగిఁ గౌరీమయూరంబుం గాంచి పంచనదము వీక్షించి కావేరిం దర్శించి కాయంబు ముంచి మధ్యార్జునంబున మహేశ్వరు దర్శించి కుంభకోణమున ద్వాదశతీర్థంబులం బొడఁగని కుంభేశు శంభో హర హరా! యని యర్చించి మఱియుం గల దేవతలను సేవించి పంచనాథమున భవుని భక్తితోఁ బాలించి యం దాకాలమున నున్న మహాభక్తుఁడగు శ్రీ త్యాగరాయలవారి మహిమముల విని యచ్చెరువంది వారిం దిలకించి వారి సంగీతశ్రవణమునఁ దన్మయుండై

సీ. కేవలానందసంకీర్తనావళి వింటి
భావసిద్ధియు శుద్ధభక్తిఁ గంటి
భక్తులు శిష్యులు బలసి కొల్వఁగఁ గంటి
వాఙ్మయసురీసభంబుఁ గంటి
వినయసత్సంపద్వివేకముల్ కనుఁగొంటి
శ్రీరామపదభక్తి చెల్వుఁ గంటి
సజ్జన కందఁగరాని యనుభవంబును గంటిఁ
దన్మయత్వం బాత్మఁ దనరఁ గంటి
నరసి కనుఁగొంటిఁ ద్యాగరాయార్యునందు
నీ లసద్గుణపుంజ మిం కెన్నియైన
దివ్యమహిమాతిశయములు దేజరిలుటఁ
గంటి హర్షాబ్ధి నోలాడుచుంటి మదిని.

గీ. రామపదభక్తికిఁ ద్యాగరాయవరుని
సమము గానేర రెవ్వరీ క్ష్మాతలమునఁ
బ్రేమ నా ఘను డొకసారి పిలిచెనేని
రాముఁ డోహో యటంచు మార్పలుకునంట.

గీ. అట్టిఘనుని యాజ్ఞ నంది యచ్చోటు వాసి
కడరయంబుతోడఁ గదలిసాగి
పరఁగ రాజిలు నవపాషాణమహిమంబు
నాలకించి ముందు కరిగియరిగి.

శరధిని నవగ్రహశిలలను జక్రతీర్థము సేత్వారంభస్థలము వీక్షించి యందల భైరవాదితీర్థముల నర్హకృత్యము లాచరించి శాశ్వతసౌఖ్యప్రదము నవశ్వరమునగు రామేశ్వరము సముత్సుకత నవ్వీక్షించి మహోన్నతంబై విచిత్రశిల్పవిభ్రాజితంబై కైలాసంబు విలాసంబు దంబు విడంబించు దేవాలయంబు సార్థంబుగా బొడలఁ దిలకించి పులకితాంగుండై విశ్వాదిపూజాద్రవ్యంబుల రామలింగేశ్వరు దర్శించి "కాశికాపురి నుండి గంగఁ దెచ్చితిని. ఈశ! దీనిని గ్రహియింపఁగదయ్యా" అని తజ్జలంబుల నమకచమకాగుల నభిషేకించి

గీ. అన్య మెఱుఁగక దేవ! యహర్నిశములు
దైన్యమున నీపదంబులఁ దలఁచి సుజన
మాన్య సా పదమార్గసంపద లభించి
ధన్యమతి నైతి నీదగు దర్శనమున.

కం. అంగములో సగ మంగన
కుం గడిమన గంబు భక్తకోటి కొసఁగి తె
బ్భంగి నిమఁ గానవచ్చు భు
జంగమయావిభూష దోషసంగవిదూరా.

మొదలను పద్యంబులం బొగడి హనుమదాదుల కెఱఁగి మఱియు నందలి యిర్వదినాలుగు తీర్థంబులఁ గృతస్నానుండై గంధమాదనపర్వతంబుఁ గనుముట్టు నధిరోహించి సింధుబంధను శ్రీపాదంబుల స్మరించి పిదప సేతుమాధవు పదంబుల మార్గంబునొక మ్రొక్కి యుభయసాగర సంగమంబున నుచితవిధులు నిర్వర్తించి యందు దినత్రయం బుండి పిదప నేకాంతరాముల సేవించి యందుఁ జింతలపాటి లక్ష్మీనారాయణాఖ్య భూసురగ్రామణి వేదుకొలు మెయి రామకథ విన్పించి మరల సేతుమాధవు దర్శించి,

సీ. తగఁ బ్రయాగపురి మాధవుఁడు నీక్షేమంబు
నడిగినాడని తెల్పు మనిరోఁ బ్రీతి
జాహ్నవి నీ పాదజలజంబులకు మ్రొక్కె
యమున నీదాన నే ననుచుఁ బలికె
వరసరస్వతి నిన్ను బహుగతుల్ వినుతించె
నన్నపూర్ణ నమామి యనుచుఁ బలికె
కాశీశ్వరుఁడు నిన్ను ఘనముగా వినుతించెఁ
దక్కు సురల్ నీవె దక్కుటనిరి
భైరవుఁడు పండి మేము నీ బంట్ల మనిరి
విన్నఁ గదే యుత్తరక్షితి విషయము లివి
తెలిపినాఁడ నిస్థితిఁ జెలిమిమీర
సేతుమాధవ వినవయ్య చిత్తమలర.

ఉ. కోరికదీర నీ చరణకోమల యుగ్మము నాశ్రయించుటన్
గోరికదీరె గంగ నిటఁ గూరిమి లింగని కొప్పగించుటన్
గోరికదీరె సేతువునఁ గొంకక స్నానము లాచరించుటన్
గోరికఁ బోయివత్తు దయయుంచుము నీమది సేతుమాధవా.

అని నమస్కరించి కోటితీర్థంబుఁ గరంబు ముదంబునం గ్రహించి పయనంబై దర్భశయనముఁ జేరి శ్రీరామునకుం దండాపతితుండై శ్రీరంగముఁ జేరి,

గీ. ఔర గోవిందరాజైన ననుజూతోడ
నీఁడు మనవాఁడు చూచి కాపాడు మనఁడు
ఔర యిటువంటి మేళ మీ యవని నొప్పె
మతియిచట నుండ దీక వేయిమాట లేల?

ఇట్లనేక విధముల నిష్ఠురోక్తులు పలికి యార్తిమెయి నిద్రించుచుండ.

సీ. రజతాద్రికాంతి నిరాకరించెడి మేని
నందంబుఁగల్గు నశ్వంబు నెక్కి
మల్లెపూలంగిపై మణులకట్టి బిగించి
వల్లెవాటుగ ఖండువా నమర్చి
మణిమయ మకుటంబు మస్తకంబునఁ దాల్చి
దండిసొమ్ములు మెయినిండఁ దొడిఁగి
ఎడమచేతను కళ్లె మిరవొందఁగాఁ బట్టి
తక్కినచేత బెత్తంబుఁ దాల్చి
కులుకునడకలు దుముకులు కొసరు కొసరు
మాపులును గల్గి జనములు చోద్యమంద
దాపు కేతెంచి నరసింహదాస! యిందు
రమ్మనఁగ నేను నతనిఁ జేరంగనేగి.

నమస్కరించి నిలువంబడి యద్భుత పందుమంత మందహాసకుంజర ముఖారవిందుండై యిట్లనెంతుఁడు.

గీ. నీవు మావాఁడ వనికదా నిజముదెలిసి
నాదు విధ దాఁటు నేరికిఁ గాదుగానఁ
బర్వతం బెక్కవలదని పల్కినాఁడఁ
గూడదను పనిఁ జేయంగఁ గోరనేల!

పంచచామరము—

నగంబుఁ జూచు కోర్కె నీమనంబునందుఁ గల్గినన్
... ... ... ... రమ్మ ... ...
... ... ... ... ... ...

క. అని శైలమునకు ననుఁదోడ్కొనిచని మంటపంగఁ గంటి గోపర్వంబున్
ఘనపాపనాశనంబున, గనగంగాధార మున్నుగా సర్వంబున్.

మతియు మరి పెంపు పెంపుమెయి,

సీ. నీలఘనాఘననిరుపమదేహంబు
నందుఁ బీతాంబరం బమరువాని
నరిదరశార్ఙ్గగదాదిసాధనములు
హస్తములందుఁ దమరువాని
రవికోటిదీప్తి నిరాకరించెడు కాంతి
గల కిరీటము తలఁ గల్గువానిఁ
గస్తూరివాసనల్ గ్రమ్మెడు మెయినిండ
సొమ్ములం దాల్చిన సొగసుకాని
వక్షమున శ్రీమహాలక్ష్మి వరఁగువాని
నాటకపు రత్నకాళ్ల జీరాడువాని

వేంకటాద్రీంద్రనిలయు శ్రీవేంకటేశుఁ
గాంచి సేవించి యిట్లు వచించినాఁడ.

*     *     *

అని గొన్నిమెగా రీతులం బొగడి మతియుం గల విచిత్రంబులం జూచి,

గీ. అవ్వనజేయఁ జూచి యాశ్చర్యమొందుచు
నాజ్ఞవడసి యస్మద్గురు డిగ్గి
మతియుఁ గల్గుచోట్ల మహిమమెల్లను గాంచి
మేలుకొంటి నంతఁ జాలవేడ్క

ఇట్లు మేల్కాంచి యిది సత్యమా? అసత్యమా? యని తలంచుచుండ ఘ్రాణతర్పణంబుగా సుసౌరభ మేతేర నిది యేమని యన్వేషించు నొక నాళయ్యపై శ్రీవేంకటేశ్వరుని పాదచిహ్నము సురభిరజోలేశ మండం గాంచి దాసు విస్మితుండై లేచి తోడివారలకుం జూపి యాహరి పాదరేణువులఁ దలపై ధరించియు నాఘ్రాణించియుఁ గన్నుల నద్దుకొని యా భగవత్కృప గల్గెనగాయని హర్షాత్ముఁడైఁ తృప్తుఁడై నిమీలితనేత్రుఁడై స్వప్నగోచరపురుషుని భావబలంబునం బరికించి యానందాతిశయంబున నృత్యంబుచేసె.

అంతటఁ గనులువిచ్చి తోడివారి పొగడ్తలకు లజ్జించుచు నవ్వేల్పుని వింతచెయ్వుల నంతరంగమునఁ జింతించుచు నటనుండి కదలి యలమేలుమంగను సేవించి గోవిందరాజుల కానందంబున నమస్కరించి

సీ. శ్రీపాదరేణువు "విన్నంవరా" యంచుఁ
బల్కు ప్రశ్నపరిభావ వింటి
స్వామిప్రసాదసంప్రాప్తంబుఁ గోరిన
వెల చాలహెచ్చను విధముఁ గంటిఁ
గడ కాష్ఠలపు మన్నుకా పిప్పకుండంగఁ
జిక్కుబో దనువార్తఁ జేరి వింటి
వింతవింతలుగల వెలలేని పటములఁ
గన్నులపండువుగాఁగఁ గంటి
భక్తి యింతయున్నఁ జైకంబు లేదని
సర్వసాక్షియైన స్వామికెఱుక
గాన నతఁడె నన్నుఁ గని బ్రోచు వేల్పని
యాపురంబుదాటి యవలి కరిగి.

కాళహస్తి దాసి యా స్వామిని బ్రార్థించి తొంటిమార్గమున మఱలఁ బొన్నూరువచ్చి యావల గుంటూరు ప్రవేశించి వేడ్కతోఁ దల్లి కెఱిఁగి, మ్రొక్కినయనుజుని దీవించి భార్య సపర్యల నంగీకరించి జననికై తెచ్చిన కోటితీర్థంబున నామె నభిషేకించి మాధవప్రీతిగా సమారాధనాదికము నిర్వర్తించి ఫలము రామార్పణమని యాత్రావిశేషంబులఁ దనకష్టసుఖంబుల నందఱకుం దెల్పుచునుండె. "పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థమహిమ వినుటయు నఖిలకల్మషహరం" బని తీర్థమాహాత్మ్యములఁ దెల్పుచునుండె. ఈ యాత్ర వృషవత్సర ఫాల్గుణ శుద్ధపాడ్యమికి సమాప్తమయ్యెను.

అంత శ్రీరామనవమికి మఱల భద్రాద్రికేగి వచ్చెను.

ఇట్లే నృసింహదాసు నిరంతరప్రయాణములచే నారోగ్యముచెడి పోవఁగాఁ గొన్ని దినంబులు వ్యాధిబాధ ననుభవించుచు "స్వామీ! ఒకచోఁ బడియుండి నిరంతరము నిన్నుస్మరించుటకా యిట్లు కదలలేని దశను గల్గించి"తని రాముని స్మరింపుచుఁ గొంతకాలంబునకుం దేరుకొని క్రీ. శ. 1826-27 వ్యయసంవత్సర పుష్య శు ౨ నాఁడు బయలుదేరి యుత్తరంబుగాఁ జనిచని యయోధ్యకేగి యచ్చటచ్చట పుణ్యస్థలముల సభక్తికముగ నారాధించి సరయువున గ్రుంకులిడి పితృతర్పణ మొనర్చెను. వంశమును బవిత్రమొనర్చుటకుఁ జాలఁడా యొకఁడు? అట్లయోధ్యఁ గొన్ని నాళ్లుండి హరిద్వారమున కరిగి యటనుండి బదరికావనంబునకేగి నారాయణునిం దర్శించి మ్రొక్కులిడి యా క్షేత్రమహిమముల వర్ణించి మఱలి కాల్నడల బహుకష్టప్రయాణమ్ముల సర్వజిత్ఫాల్గుణ శు ౧౧ నాటికి గుంటూరు చేరెను.

మఱల భద్రాద్రికేగి వచ్చెను.

## 3

ఇట్లెన్నియాత్రలు చేసినను తనివి సనక యా భక్తాగ్రేసరుండు గరుడోత్సవంబు దర్శించు నాసమెయి విరోధిసంవత్సర వైశాఖమునఁ గొందఱుభక్తులతోఁ గదలి కంచి కేగి స్వామిని సేవించి మఱలి చెన్నపురికి రాఁగ వైదికబ్రాహ్మణుఁడును, మురికినాఁటను శాఖకుం జెందినవాఁడును, ధనాఢ్యుఁడు భక్తుఁడునగు నాగొండ్ల వరదరామదాసు వీరి నాహ్వానించి యుచితసేవలఁ దృప్తుల జేసి తారకమంత్రరాజ ముపదేశ మొంది తనయింట మాసత్రయం బుంచుకొని నిరతంబు రామకథ వినుచుఁ దనవ నాలుగువేలరూప్యములతో నరసింహదాసుగారి పాదపూజచేసి స్వామీ! మీ రింకొకమారు వేంచేసి నాకు భద్రాద్రిరాముని దర్శనభాగ్యము లభింపఁజేయవలయునని ప్రార్థించి, పిదప నొల్లుపఁగా నరసింహదాసుగారు రాతని భక్తిశ్రద్ధల కలరి యిదియంతయు నా శ్రీరాముని కారుణ్యాతిశయమని తలంచి గుంటూరున కేతెంచి మూఁడుతరంబుల నుండి పెరుగుచున్న ఋణమ్ము నా నాలుగువేల రూపికల లోసంగి నిశ్శేషముగాఁ దీర్చి ఋణవిమోచన సంతర్పణ మొనర్చి మఱల చెన్నపురి కేగి వరదరామదాసుం దోడ్కొని వికృతిసంవత్సర చైత్రమాసమున బయలుదేరి శ్రీరామనవమి శుభయియులు భద్రాద్రిని సముత్సుకత సందర్శించి యిచ్చట నిచ్చలు నుండువారిది గదా భాగ్యమని తత్రత్యులం గొనియాడి శ్రీరాముల సేవించి తిరిగి గుంటూరు వచ్చిరి.

అంత వరదరామదాసుగారు నరసింహదాసుగారిని సకళత్రముగఁ జెన్నపురికిం గొంపోయి యచట నాలుమాసము లుంచి వైరాగ్యసంపత్తిచేఁ జెన్నపురి నుండ నిచ్చగింపక తన యావత్ప్వస్తు వితతిని శకటాశ్వాదులపైఁ బూన్చి కదలి వికృతివత్సరకార్తికమున భద్రాద్రి కరిగి గోపురముండి నిరతము రాము సేవించుచు నృసింహదంపతుల సంభావించుచు నా వరదరామదాసు దంపతులు సంతోషమునఁ గాలముఁ బుచ్చుచుండిరి.

## ౪

భద్రాద్రి శ్రీరాములకుఁ గైంకర్యము సేయువారు ధనాశాపీడితాత్ములై శ్రీరాములవారి ధనము హరించుచుఁ దత్తత్కాలోచిత సేవల సలుపక యేరినిం జేరికిఁగొనక సంచరించుటం జూచి నృసింహదాసు శ్రీరామచంద్రా! నీకు సేవలు సక్రమముగా జరుగుట లేదు. నే నెట్లు సహింపఁగలను? అని విచారించి నిద్రింపఁగా నారేయి స్వప్నంబున నొకవైష్ణవుం డరుదెంచి "నృసింహా! పగ పేల? చందూలాలును దర్శింపం బొమ్ము, అన్నియుం జక్కనగు"నని పలికి చనియె. అంత దాసు మేల్కాంచి వరదరామదాసుతో స్వప్నవృత్తాంతముఁ జెప్పి శ్రీరామాజ్ఞగా భావించి సభక్తి నమస్కరించి హైదరాబాదునకుఁ బయనమై చనియె. భక్తుల భావంబులు భగవంతుని కెఱుక. భగవంతుని భావంబులు భక్తుల కెఱుక.

ఆ కాలమున నిజాం రాజ్యమునకు నాసరద్దౌలా నవాబుగా నుండెను. హైదరాబాదే రాజధాని. అతనికి మహారాష్ట్రబ్రాహ్మణుఁడును, ధర్మాత్ముఁడును, సంస్కృతాభిమానుండును, సత్పురుషుండును, సన్మార్గప్రవర్తకుండును, సద్గుణుండునగు చందూలాల్ ప్రధానామాత్యుఁడుగా నుండెను. పుణ్యాత్ముఁడగు నామంత్రి కొకనాటిరేయి కలలో రాముఁడు కన్పడి "ఓరీ! నృసింహదాసు నీచెంత కేగుదెంచు, అతని యభీష్టము నెఱవేర్పుము." అని పలికి యదృశ్యుండు కాఁగ మేలుకాంచి యద్భుతంపడి తనజన్మము సఫలమయ్యె నని తలంచి శ్రీరామచంద్రుని ధ్యానించి "ఎప్పుడు నృసింహదా సరుదెంచునో! శ్రీరాముని కా దాసు మీఁద నింత ప్రేమ యుండుటకు మహాత్ముఁ డెంత తపస్సు చేసెనో! ఔరా! నృసింహదాసు కారణమున నేనును గృతార్థుఁడనైతి. ఆ దాసు దర్శనంబుల నెన్నఁడు నాకు గలుగునో?" అని తలంచి దినంబులు పుచ్చుచుండె శ్రీ లక్ష్మీనృసింహదాసు కతిపయదినంబులకు హైదరాబాదున కేగి చందూలాలు మందిరంబున కానందంబునం దరియం జని సులభోపాయంబున లోనికరిగి రాజాధిరాజ సలామ్ మెంచు మ్రొక్కి... నరసింహదాసదన్నాముండ" నని చెప్పినంత

"దగ్గన గద్దెను దిగి డాయవచ్చి
దగ్గఁ గౌఁగిటఁజేర్చి వెసఁ జందులాలు
శ్రీరామచంద్రు సత్కృపఁ గాంచినట్టి
భూరిసత్తాపసపుంగవు నిన్నుఁ
గంటిఁ గన్పండువుగా నేఁడు దేవ!
బంటునై నీకు నే పనిసేయువాఁడ
నిమ్మ నా యిలు పావన మ్మొనరింప
రమ్మంచు నంతఃపురంబులోపలకుఁ
గొని చని పదములకును జాగి మ్రొక్కి
ఘనతరకరుణ న న్గనఁగదే యంచుఁ
గలలోన రాముండు కరుణ నేతెంచి
తెలిపిన సద్వార్తఁ దెలియఁగాఁబల్కి

శ్రీరాము నవ్యాజకృప రాజిలుటకు
భూరిహర్షావేశమునఁ దన్ను మఱచి
ఆనందబాష్పంబు లధికమై కాఁగ
మేనెల్లఁ బులకలు మెండుగాఁ జార
గద్గదకంఠుఁడై కను నోట మాట
లుద్గమింపక చేష్ట లుడిగి యొక్కెడకు
నల్లనఁ దెలివొంది............
నీరజోద్భవుఁడైన నెఱిఁ గాంచరాని
శ్రీరామచంద్రు వీక్షింపఁగల్గితినె?
ఘనతర సత్తపః కలితుని నిన్నుఁ
గను మాత్రఁబాపముల్ గడతేరు నన్న."

అని యుచితాలాపంబులఁ గొంతప్రొద్దు గడపి సందూలాలు ప్రార్థింపఁగా వానికిఁ దారకమంత్ర ముపదేశించి యొక నాఁడు తానచ్చిన కార్యంబుం దెలిపి రామకైంకర్యము సక్రమముగా జరుపుటకుఁ దదధికారము నా కిండన,

"నీకొక్క దేవళంబేల...
భద్రాద్రి పాల్వంచ పరగణాలెల్ల
భద్రంబుగా నీవు పాలింపఁదగుదు
వా యుర్వికెల్ల నీ వధికారమూని
చేయుము న్యాయ సంసిద్ధఁ బాలనము
రాజితమైనట్టి రాజాధిగుణము
నేఁ జెల్వుగా నిచ్చె నీ కొసంగితిని
చెలఁగి నీకే 'రాజాన్నృసింహదాసు' సంజ్ఞఁ
బిలుతు రింతటినుండి......"

అని దాసుగారు నిరాకరించుచున్నను "ఒక్క శాసనంబట్టె లిఖించి

మనమార నా మహామహుని కొసంగె......
మఱియు నొంటెలు రెండు మత్తేభయుగము
తురగచతుష్క మెంతో భక్తి నొసఁగె
పరిషేష్టురాయీలు సరిగంచు సెల్వ......"

లు నరసింహదాసున కొసంగి మహావైభవంబున సాగనంపె.

అంత నద్దాసవర్యుండు ఖరసంవత్సర ఆషాఢ బ ౧౪ నాటికి భద్రాద్రిఁ జేరి సర్వము రామార్పణమ్ము సేసి నాటినుండి భద్రాద్రి తాలూకా కధికారియై మంత్రిదర్శన మగుటయు నీయధికారము లభించుటయు నంతయు రామచంద్రా! నీ కృపాతిశయమున నే యని తన లోఁ దలంచి నమస్కరించి యమ్మహావైభవంబునం దగుల్కొనక "లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు చేయుగతి మనంబునఁ గామమోహితులుగాక యర్థిమై యుక్తకర్మంబు లాచరించి ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠఁ దవిలియుండు" డను యుక్తముల భంగిఁ బ్రవర్తించుచు శ్రీరామకైంకర్యములు సక్రమముగాఁ బ్రతినిత్యము నెఱవేరుచుండున ట్లాజ్ఞాపించె. అప్పటి భద్రాద్రి వైభవంబు వర్ణింప నలవిగాకుండె.

దేవాలయాధికార మిమ్మనఁ జందూలాలు భద్రాద్రితాలూకాకు యధికార మిచ్చె. రామకైంకర్యము నిమిత్త ముద్యోగమును స్వీకరింపవలసిన వాఁడయ్యె. లేకున్న భక్తుఁడగు వింగిరికి గతాంతైశ్వర్య మేల?

"రాముని కుదయాది రాజిలఁదగిన
శ్రీనుద్విఘ్నుల కొప్పు చెల్వంపుఁగృహములు
గద్యపద్యాదులు కడు హృద్యములుగ
విద్యాగసత్రాధి కాలయఁ గావించి
శ్రీరాము సత్పదాంచిత పూజలందుఁ
గోరికలారఁ జక్కనఁగ స్థాపించెఁ
బాదుచంద్రెల్ల రిప్పటికి నాకృతులు
వేడుక నా రఘువీరు సన్నిధిని."

ఇట్టుండ నా కాలంబున క్షామంబు సంభవించె. నందన కఱవు నేటికిం బ్రసిద్ధంబ కదా? అప్పుడీదాసుగారొనర్చిన సేవ యపారము. భద్రాద్రియందు నీతఁ డన్నసత్రము నెలకొల్పుటచే బ్రతిగ్రామ ప్రజలు నిచటికే యేతేర

"ఎందఱు వచ్చిన లేమిలే యంచు
సందఱకొనరించె నన్న దానంబు
శిశువులకును బాలు చేరి యిప్పించెఁ
బశుసమితికి మేఁతఁబాటించి పూర్చె
వారమునకు నొక్కపరి తల గడుగు
లారంగ స్త్రీబాలకాళికమర్చె
నాలమాదిగల కేమరక యన్నంబుఁ
జాలుఁ జాలనఁగ లెస్సగ సమకూర్చె
ముమ్మార్లు భోజనంబులు చేయువారు
ముమ్మార్లు తినువిధంబున నమరించె
పాత్రలు చాలక బలుగచ్చుగుండ్లు
చిత్రంబుగాఁ గట్టి చేర్చెఁ బక్వములు
ఆనాఁడు కట్టించినట్టి కుండంబు
లీనాటికిని నిల్చి యొసఁగు భద్రాద్రి"

ఇట్లు విజయవత్సరశ్రావణమువఱకు జనులబోషించె. అంత వర్షము గురిసె, జనము మురిసె, దుర్భిక్షము గరిసె.

౫

ఎట్టివారికిం బూర్వకర్మానురూపఫలం బనుభావ్యంబ. నాగండ్ల వరదరామదాసు గారికి క్షయరోగము సంభవించె. నానాటికిం గృశించుచుండె. "కాయంబు బుద్బుదప్రాయంబనియు, నైశ్వర్యంబు నశ్వరం బనియుఁ, జావు కాయమ్మున తావనియు

"నినుఁ జెన్నపురినుండి నే భద్రగిరికి
ఘను రాముసేవలకై తెచ్చినట్లు
వైకుంఠమునకు నొప్పఁగ నిన్నుఁ గొంచు
పోయెదననియు, నిది రామాజ్ఞ"

వెడలవలె ననియు నృసింహదాసతని నూఱడించి తత్సన్నాహంబున నుండె వరదరామదాసు భార్యయుఁ దల్లియు మేమును మీ వెంట నరుదెంతు మన పల్లెయని తనభార్య లక్ష్మీబాయమ్మ నాకును సెలవిండు; మిముఁ బాసి ధర నిల్వఁజాలననఁ గొంతెవట్టు విచారించి నీకు భగవదాజ్ఞ లేదు; భూమియం దుండు మని చెప్పి మఱియుం గొందఱుభక్తులు మమ్మె మీతోఁ గొంపోండు శ్రీరామునితో సాకేత పురు లరుదెంచినట్లు మీతో నరుదెంతుమన మీమీ యిచ్ఛచొప్పునఁ జేయుఁడు; విధిని మాత్రము దాట నేరితరముగా దని పల్కె. ఆహా! మనభక్తాగ్రేసరుని యం దెంత విశ్వాసమో యానాటి ప్రజకు!

దాసు తనయింటఁగల స్వర్ణరజతమయాది సర్వవస్తువులకు జాబితాలు వ్రాయించి రామాలయమునం జేర్పించి వలసిన వస్తువుల నలసిన వారి కొసంగి

" ఏమియు లేకుండ నిల్ చూఱవిడిచి
యామీఁద రాజకీయప్రసంగములు
దేశపాండ్యాలకుఁ దెలియబోధించి
వాసిగా సచ్ఛిలాన్వయ శాసనముల
పైని శ్రీరామ సర్వస్వర్ణరత్న
మానితాభరణముల్ మఱి యెన్నఁదగిన
స్థిరచరాస్థుల పేర్లు చేర్చి చెక్కించి
సరగఁ గోవెలయందు స్థాపనచేసి ".

మఱియు వరదరామదాసు నాలుగునెలల పుత్త్రి దాసి చేతులం దుంచి సాకుమని చెప్పి తనయొద్దనున్న తమ్మునికుమారు రామాఖ్యుని దీవించి మహాప్రస్థాన మహోల్లాసంబున నుండునంత వరదరామదాసు విగతాసుండయ్యె.

అంత జనులందఱు విస్మయస్వాంతులై చూచుచుండంగ హరిదాసు మనంబును దిరముకొలిపి వరదరామదాసు శవంబును వెంటఁదీసికొని, కాళ్లకు గజ్జలుగట్టి చేతఁ దాంబురఁ బట్టి కంఠంబు లెత్తి భక్తులతోఁ గలిసి పాడుచు నృత్యంబు సేయుచుఁ గదలి

కాంభోజి రాగము

"పోయెదమయ్యా! వైకుంఠమునకు పోవుచున్నాము ॥ పో॥
శ్రీ యుఃపతిని దలఁచి భక్తశ్రేణులకు దండములు పెట్టి ॥ పో॥
మోదముతో గోదావరి-స్నానము చేసికొని
సాధుజనుల వెంబడి మేము-సరగున శ్రీరాములజూడ ॥ పో॥
మారిమి రాముఁ డిచ్చిన-భూరిసంపద్వ్రాత మెల్ల
కోరికలారఁ గ్రమ్మర శ్రీరాముని సన్నిధిఁ జేర్చి ॥ పో॥
కోరి యీశరీరముల-శౌరి కర్పణము సేయఁ
శ్రీరామభక్తులును-నారసింహదాసుఁడును నేను ॥ పో॥

ఆదితాళము

అడుగో కోదండపాణి-అడుగో భద్రాచలేశుం॥ డడుగో॥
అళిసముదయముల-నదలించెడు బల్
కుటిల ముంగురుల-కురులు గలవాఁ॥ డడుగో॥
చందురు రుచి కడు-మందము చేసెడి
యందు గలుగు మో-మందము గలవాఁ॥ డడుగో॥
తీరుగ కస్తురి-తిలకము మెఱయఁగఁ
జాల భ్రూయుగపు-సైగలు గలవాఁ॥ డడుగో॥
వెన్నెల నీనెడు-సన్నపు నగవులఁ
జెన్నలరెడు నా-పన్నరక్షకుం॥ డడుగో॥
కంబుకంఠమున-ఘనరుచి గల ర
త్నంబు మెఱయు శ్రీదశరథరాముం॥ డడుగో॥

... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
... ... ... ... ... ...

వాసిగ భద్రగి-రీశుఁ డగుచు భువి
గ్రాసిలు నరసింహ-దాసునేలువా॥ డడుగో॥

అని పెక్కు తెఱంగులఁ బాడుకొనుచుఁ (క్రీ-శ-1833-34) విజయ సంవత్సర భాద్రపద కృష్ణచతుర్థి సౌమ్యవాసరమున రవి పశ్చిమాద్రిఁ జేరుతఱి గోదావరీనదిం జేరి పడవపై నెక్కి భక్తబృందముతో భజనసలుపుచు నితరజను లీ యద్భుతముం జూడఁ గొన్ని పడవలపై నెక్కి వచ్చుచుఁ బరిపరివిధములఁ దలంచుచుండ గోదావరివారి సముత్సాహంబునం బొంగి తరంగహస్తంబులం బిల్చుచుండ "జయ రమారమణ గోవిందా హరి" అను రావంబు భువనభోంతరంబులు నిండుచుండ, వేలకొలంది జనంబులు నదియొడ్డున బరివేష్టించి ప్రతీక్షించుచుండ, నదీమధ్య కరిగి ముందు వరదరామదాసు కళేబరము గంగలోఁ గలిపి రామరామారామరామా యంచు నా గోదావరీతరంగంబులఁ గౌఁగిలించుకొని నృసింహదాసానదియం దదృశ్యుఁడయ్యె. మిగిలిన పదునేడుగురు భక్తులు గుంపులున నాగోదావరిలో దుమికిరి. అంతలో

"...వింతగా నొక దివ్యవిమల తేజంబు,
ఘనతర దివ్యప్రకాశంబు మించి
జనములు చూడంగఁ జనె వియద్గతిని."

జనులంద అది నృసింహదాసు తేజంబని తలంచి యద్భుత మందిరి. సజ్జనులతోఁ గలసిమెలసి తిరుగువారు పవిత్రులగుటకు సందియ మేమి? అట్టిపవిత్రుల కిట్టిదివ్యసంవస్థన మబ్బుట కేమి? భక్తులుండు గ్రామంబున నునికి గల్గుటయుఁ బూర్వసుకృతపరిపాకమున నే.

అంత నృసింహదాసు భార్య లక్ష్మీబాయమ్మగారు తరుఖండాధారమునఁ దేలియాడుచుండ నామెయు, పిచ్చయాఖ్యుండను భక్తుండుం ద్రష్టలచే రక్షింపఁబడిరి. మిగిలినవారి శవంబుల వెదకి వెలుపలికిం దీసిరి. కాని యెంతవెదకినను వరదరామ నృసింహదాసుల శరీరములు మాత్రము కన్పింపవయ్యె. సరయూనదిలోఁ గతిపయాప్తబృందముతో

రాముఁడు మునిఁగి వైకుంఠమున కేగినట్లు నృసింహదా సేగెననియు, రాముఁ డీతని నెల్లవేళల నెడబాయక కాచుచుండుననియు, పలుమారు నర్థంబు స్వప్నంబున బోధించుచుండుననియు, నిట్టివారి మహిమముచే భగవదాస్తికత వెల్లడించుచుననియుఁ, దొల్లి టిగోపన్నయే యతిక్రాంచి తత్కర్మశేషము ననుభవింప నిట్లు పునరుద్భవించె నేమో యనియు నిట్టి భక్తజనములవలనఁ గదా ధరాతలము నిలిచియున్నదనియు, నేటికిని జను లనుకొనుచుండిరి.

పిదప లక్ష్మీబాయమ్మగారు ముప్పదేండ్లు జీవించిరి. ఈ వార్త చందులా లాలకించి రైదుగ్రామము లామె కొసంగి గురుభక్తి ప్రకటించెను.

వ్యాస విస్తర భయగ్రస్తుఁడనై సంక్షేపముగా వ్రాసితిని:

ఈ వ్యాసము ముగించుచు నింక రెండుమాటలు వ్రాయకుండఁ జాలను.

కలఁడుగదా యీ లక్ష్మీనృసింహదాసుగారికి తమ్ముండు కృష్ణదాసు సంగీతశాస్త్ర ప్రవీణుండు. అతని కుమారుండు రామాభిధానుండు సద్గుణుండు కలండు.

ఆ రామార్యునకు జానకమ్మ యను మా చిననాయనమ్మ నిచ్చి పెండ్లిచేసిరి. ఆ జానకీరాముల కేడ్గురు పుత్త్రులు జనించినను నొక్క సీతారామయ్య పంతులు మాత్రమే సజీవులై యుండిరి. వారి కమ్మగారన్నంబుతోఁ గూడ నపరంజిరేకుల నారగింపఁ జేసెడిదట. కావుననే బంగారువంటి శరీరచ్ఛాయయు మేల్మి గొనంబులుం గలిగి పక్క ఏనాల కెక్కియైరి. అట్టి సీతారామయ్యపంతులుగారు సంస్కృతాంధ్రములనే గాక హూణభాష యందును ప్రావీణ్యము సంపాదించి "తాలూకా హెడ్ అక్కౌంటెంటు" పదవి ననుభవించి శ్రీరామభక్తులై భక్తకల్పద్రుమాద్యనేక గ్రంథముల రచియించి తనివిసనక తమ వంశతిలకుఁడగు "తూము లక్ష్మీనృసింహదాసు చరిత్రము" నాబాలగోపాలము పఠించుటకు ముఖ్యముగా స్త్రీలు పాటవలెఁ బాడుకొనుటకుఁ దగినట్లు ద్విపదకావ్యముగా రచించిరి. నా యీ వ్యాసమునకు మా బాబుగారి గ్రంథమే యాధారము. వారును వారి తండ్రిగారివలనఁ బితామహపవిత్రకథల విన్నవారగుటచే నిందతిశయోక్తులుగాని కల్పనలుగాని చేరలేదు. మఱియు శ్రీ లక్ష్మీనృసింహదాసుగారు స్వయముగా రచించిన పద్యముల నిందుదాహరించుటచే నాసందియమున కవకాశము లేనేలేదు. ద్విపదను మాత్రము మా బాబుగారి గ్రంథమునుండి కైకొంటిని. వారికవితాశైలి అనర్గళధారాప్రవాహము వర్ణింప నేనెంతవాఁడను? చదువరులారా, మీదే యాధారము. వినుఁడు

"ఆ కాలమందుఁ బ్రయాణముల్ సేయు
సౌకర్యము లెట నెసంగకయుండె
ధూమశకటము లెందుఁ దనర్పవపుడు
భీమకానన పరివృత మీధరిత్రి
క్రూరభల్లూకశార్దూలవరాహ
నాగసంచార దుర్మార్గ వనములు
చోరసంఘములు నిల్చు విపత్పథములు
ఘోరదవాగ్ని వెల్గు ధరాధరములు
కంటకసర్ప సంకటదుఃస్థలములు
నుంట కిరవొసఁగని యూళ్లు పురములు
జల మెందు లేని దుష్టప్రదేశములు
నిలువనీడ యొసంగని జనవ్రజములు
పలుకులు తెలియని భాషాంతరులును
వెల కేదయేని లభింపని యూళ్లు
కలిగి యక్కాలదీర్ఘ ప్రయాణములు
సలుపు టత్యంతదుస్తరమయి యుండె.
నట్టిదుష్కాలంబునం దీమహాత్ముఁ
డెట్టికష్టములైన నెంచక ధృతిని
భరతఖండమున నేపాళాది దివ్య
తగ యాత్రలన్నియుఁ దవిలి కావించె."

ఇట్టివానిం గన్న గుంటూరు గదా ధన్య.

"చిన్నతనమునుండి శ్రీవిష్ణుభక్తి
హృన్నిలయంబునం దుసగించె నితఁడు
ఉద్యమింపక పాలనోద్యోగ మడిగి
వేడ్క యుంచెంచె శ్రీవిభుపాదసేవ
కడుఁ బీద యయ్యును గడుపుకక్కుర్తిఁ
బడి యన్యులను వేడఁ బాల్పడకుండె
పుణ్యయాత్రలకెల్లఁ బోయి గాల్నడల
గణ్యుఁ డీతఁడు భక్తగణములం దెల్ల
చందులాల్ స్వప్నంబునం దచ్యుతుండు
సంధించి పల్కెనే సరిగ నాగతిని
ఘనతరరాజ్యాధికార మీలీలఁ
దనరునే త్రుటిని నెట్టిదాసులకైన
"తన మహైశ్వర్య మంతయు రాఘవునకు
ఘనభక్తి సర్పణ గావించెఁ గాని
యను వొప్ప నొక గవ్వయైన నిజాప్త
జనులకు నిచ్చెనే సంగిరయ్యె యితఁడు
భక్తి యీపురుషరూపంబు ధరించి
వ్యక్తంబుఁ జేసె సద్వర్తనంబులను
నలువదేండ్లీతఁ డెంతయు గాఢభక్తిఁ
బలుకష్టముల కోర్చి వసుధపై మనియె
అనఘుఁ డియ్యతని శుభాఖ్య స్మరించు
జనులు నిర్గతపాపసంఘులై యుంద్రు."

## ముత్యాలు

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు (కవితాసమితి)

౧

చివురు మేసిన కోయిలే చిన్ని చిన్ని
గీతములఁ జేయ మధురసంగీతరచన
ఫలరసాలను ద్రావు నీ చిలుకకొదమ
పాడదేమమ్మ, పెదవుల పవడ మదర?

౨

ఈ ప్రశాంతనిశావేళ నెచటి దచటఁ
బ్రకృతి గంభీరగళమె నిద్రను మునుంగ
విపినవీథిని దిరుగాడు వెఱ్ఱితేఁటి!
ఎగయు కంఠాన శ్రుతిఁ గూర్తు వెవనికొఱకు?

౩

సుధల వెదఁజల్లు నీ తెలిచుక్క వెలుఁగె
యనుభవింపని మోహానూన్యంపు బడఁద
యీ జగత్సీమ-ఓ శశీ! యేల గోరి
యొలుకఁబోతువు పండువెన్నెలల తళుకు?

౪

ఎనసినంతన నులివెచ్చఁదనము లేని
వెలితి కౌఁగిలి-క్రొవ్వాడి వలపు చెమ్మ
లిగిరిపోయిన హృదయ-మిం కేల నాకు?
వట్టి గుసగుసలో మందపవన! యిట్టి
(?) మార్గశిర నిశాపర్యంక మధ్యమందు!

౫

మోహవనవాటి నెన్నెన్ని పూలు లేవు?
వెదకి తెచ్చితి నచటి చాంపేయసుమము
కోరికలు దీర మనసార నారగింపఁ
దేని లేదని యలిగి గద్దింతు నెవని?

౬

గడగడ వడంకు నా కనికరపు బుడఁదఁ
గూర్చు కన్నీటిముత్యాల క్రోవ లెల్ల
నిగిరిపో నేఁడియూర్పులు బుగులుకొల్పి
చిన్నవోయితిఁ గడగంటఁ జెమ్మ లేక!

౭

కమ్మని రసమ్ముఁ జిలుకు రాగమ్ము మేసి
కోనకడ కేఁగె మధుమాస కోకిలమ్మ!
రంగవల్లుల నిడి భవత్ప్రాంగణమున
ముదురుటాకుల తోరణములు రచించి
వేచియున్నావె ముసలి పెండ్లికొడుక?

౮

కడల వెలుఁగొందు తళుకునిల్కడల నలరు
నాణిముత్యాలు కడలిగర్భాన డాఁచి-
యేల గురియింతు వి క్లుడనెడఁ గదల్చి,
యడఁగిపోయెడు మంచు ముత్యముల జల్లు?

౯

జాలు జాలుగ విరియు నీ పూలవేళ
నెగుడుదిగుడులఁ జిన్నవోయినది బీడు!
నందనోద్యాన కుసుమసంతతులు మానె-
పులకరింపంగఁ దంగేటిపొదలు లేవె?

౧౦

ఫలరస మ్మయి తేనియ పలుచఁబారె-
కండ యై రేకు రేకునఁ గలసిపోయె-
వలపు చలి యయి లోలోన నిలిచి పోయె-
నలరుపై నేలఁ గనులు మోహమ్ము విడవు?

౧౧

జాలిచే దూలి తొలిరహస్యముగ నన్ను
నేఁడియూర్పులు నీయెద విడిచినానొ.
వడవడ వడంకు కౌఁగిలిపట్టు పీడి
మఱచితే నన్నుఁ గరువలీ, కరుణ మాలి?

౧౨

చిక్కిపోయిన నా తెలిచెక్కు లంటి
దొరలు కన్నీటిధార ముద్దుల హరించి
యవల నీవల గుసగుస లాడి యాడి-
దండడించెడు నిట్టి నిదాఘవేళ
మఱచితే నన్నుఁ గరువళీ, కరుణమాలి?

౧౩

మురిపెములఁ జల్లు నీ తొలిప్రొద్దులోనఁ
బూరికొన నాడు మరకతమ్మును వెమల్చి
కోసికొని డాఁచికొంటి నక్కున గదించి-
ఇంతలోనన జాముప్రొద్దెక్కిపోయె!
నవసిపోయిన యొంటితృణమ్మె మిగిలె!

౧౪

పవలు తీవియ సాగించు పడమటికొన
విడిన సంధ్యాప్రసూనమే వడలిపోయె!
అదరు తారకాతుహినకణాళి నిట్లు
దాఁటి యెటు వోవు నీ రేయి తేఁటికదుపు?

౧౫

పెదవిఁ దడుపని యీ తేనెపెరఁ గదల్చి
యాఁగపోటునఁ దూఁటువోయినది మేను-
తపము గైకొని మధుపగీతమున మునిఁగి
తేఁటి నై నేను కన్నులు తెఱచువేళ
పూవు లన్నియు వసివాడిపోవునేమొ!

౧౬

వెగటుఁదనమునఁ గెమ్మోవి విఱుచుఁ జివురు
చిఱునగవులోన నెగతాళిసేయుఁ బూలు
క్రించుఁదనమున లత తల వంచికొనును
నిలువుపాటునఁ దరులు కన్నీరు రాల్చు
నదరు బెదరుల నను నేన యరసికొందు!

౧౭

చివురుదొన్నెలఁ బూరేకు చిప్పలందు
వన్నియలు గూర్చి తేప్రొద్దు చిన్నిరేక
కుంచియలు గట్టికొనెదు నీ కొమరుఁ జూచి
కోకిలము రెక్కఁ జిత్రించుకొందు వంచు
సంతసించితి! నిది యేటి జాణతనము!
ప్రకృతిలోఁ గల క్రొందళ్కు వన్నె లెల్లఁ
గలిపి యీ యాకు చిలుకకే పులిమినావు!

౧౮

చిక్కువడి తారహారముల్ చెదర దెసల
కారు చీఁకట్ల కుచ్చెళ్ళు గంతు లిడఁగ
సందెమోమున మసిఁ బూసి సందడించు
నీ యమావాస్యరాత్రి యిం దెవనికొఱకు?

౧౯

నవరసవిహీన వేణుదండంబునుండి
చల్లుచున్నావు గానరసమ్ము నీవు!
తరుణమధురసపూర్ణేక్షుదండ మంది
పాడలే నేను తందనపదము నైన!

౨౦

సోగమే నేల? నీ వన్నెసొగసు లేల?
తళుకు లేలను? క్రొవ్వాఁడి వలపు లేల?
వెఱ్ఱిదానవు సుమ్ము చాంపేయ సుమమ?
తేనె గల పూల నెఱుఁగదే తేఁటికొదమ?

సత్య మాడంబరము లేక సంచరించు
కతమునన్ దాని నెల్లరుఁ గానలేరు;
కోరి యత్నించుచో నీదు గుహ్యమునను
దానిఁ గనుఁగొందు వీవు ప్రత్యక్షముగను.

కొండకోఁతులతోఁ జల్ది గుడుచుచుండు
బాలబాలికల న్గూడి లీల నాడు
ధరణిపుల కిరీటమ్ములఁ దన్నుచుండు
సంయమీంద్రులతోఁ గూడి స్వస్తిఁ జెప్పు.

అద్ది బీజస్వరూప మయ్యది యెఱింగి
యెవ్వఁ డద్దానిఁ గొని తన హృదయసీమ
యందు నాటునో యతని సర్వాంగములు వి
రాగరేఖావిలాసపాత్రంబు లగును.

బలవిహీనముగాఁ గనుపట్టుఁగాక
యెముక వజ్రాయుధంబయి యెసఁగునటుల
సమయమున కనువగు జవసత్త్వములను
సత్యమే నీకు జేకూర్చు సంతతంబు.

సూర్యకాంతము రవి దిక్కుఁ జూచునటుల
నెంతదగ్గైన వాన కోయిల యిలఁబడు
నీర మానక వానకై నిలుచునటుల
నాత్మ సత్యంబు నాశించు ననవరతము.

పిడుగు దనమీదఁ బడినను బుడమిలోన
నొక్కయడుఁగైన నిడదుగా యుర్విధరము;
చేతనాచేతనంబులు స్వీయపథము
లను ననుసరింప మనుజుఁడా! లాతిపథము

మానుమా! నీవు నాత్మాచ్ఛమార్గమందు
సంచరించుము, దాన మోక్షంబు గలుగు.
ఆత్మకు విభిన్నమౌ పరమాత్మ లేదు;
సత్య మాత్మస్వరూపము; సత్యభిన్న

దైవతము శూన్యమగు; నసత్యప్రవక్త
లగుదు రిల శూన్యవాదు, లీ వట్టివారి
సంగతిని మన నాత్మవంచకుఁడ వగుదు.
పరమపాపాత్ములైనను మరణముఖము

జొచ్చుతరి సత్యమాడుచుం జచ్చుచుంట
నరయ నాత్మస్వరము సత్య మంట నిజము;
మనుజుఁడా! వద్దు నీ కనుమానమిందు.
నీస్వభావసంగీతము నీవుపాడు

మంతియేఁగాని నీ వసత్యానులాప
గీతములు పాడఁబోకుము; నీ గీతములను
మెచ్చుకొనుకాల మిలలోన వచ్చుదనుక
కోకిలంబువలె మౌనముగూరి యుండు.

కాకి కలకాల మొకరీతిఁ గావుకావ
టంచుఁ గూయుచునే యుండునటుల నెపుడు
నీవు సత్యస్వరూపము కావటంచు
సత మసత్యప్రకృతి భువిఁ జాటుచుండు.

అల వివేకవసంతకాలావసరము
నందు నీ పరమరహస్య మరయనగును
ఘనతరులు—శ్రుతిసమ్మతఖ్యాతి నీవు
సత్యగానము జేయుము సంతతంబు.

# గోకులాష్టమి

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ గారు

౧

నిను గాంచిన జనని దేవకియు
నిను బ్రోచిన జనకుడు వసుదేవుడు
నిను బెంచిన యా గోపీదేవియు
నిను గాచిన యా నందగోపకుడు
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౨

నీవు జనించిన మధురానగరము
నీవు పెరింగిన రేపల్లెయు మరి
నీ వభివృద్ధిని గాంచిన బృందయు
నీవేలిన యా ద్వారావతియును
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౩

చిన్నతనంబుననుండియు నిన్నతి
సన్నుతికెక్కిన ప్రేమంబున గని
మన్ననకెక్కిన నీ ప్రేమాంబుధి
గొన్నది గోపక సోదరీమణియు
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౪

నిన్ను నెదిర్చిన రజకాన్వయమణి
నిన్నర్చించిన మాలాకారుడు
నిన్ను నుతించిన సుమలావికలును
నిను ప్రేమించిన దాసీమణియును
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౫

నీతో బోరిన చాణూరుండును
నాతుక పూతన నళినదళాక్షియు
నీతో బోరిన కంసక్షితిపతి
నీకృప గాంచిన సకలజనంబులు
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౬

నీవు జనించిన భారతవర్షము
భావుకభాగ్యసమన్వితమై కదు
గోవుల గాచెడు గోపాలుడవై
భువిలో భూతదయత్వము జాటగ
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౭

నీ వూదిన పిల్లనగ్రోవియు
నీవు జరించిన నిఖిలస్థలంబులు
నీవు ప్రేమచే గాచిన గోవులు
నీవు జనించిన గోకులాష్టమియు
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౮

భావ్యంబై బహుజనులకు నిలలో
సేవ్యంబై సంస్మరణీయంబై
నేడును నాడును వేలావలయిత
హిందూజనుల హృదంతరమందున
వెలిగెడి నష్టమియే భూమిని వెలగెడి నీదినమూ.

# మణిపాయ

ఆనందకృష్ణ [కవికుమారసమితి]

ఆ వసంతదినాంతసంధ్యావసాన
సాంద్రరాగారుణచ్ఛవి(?)స్రోతసలిల
నిర్మలప్రేమక్రీడితానిలకుమార
హాసపరిహాసముల కోడి మోసపోతి.

*    *    *    *

నావలెనె యామె గ్రహియించె ; సతపునీత
కుటిలకుంతలములు చిక్కుగూడుకట్టి
శల్యపంజరపాట్లుల సన్నగిల్లి
మిలమిలని జారు మణిపాయ సలిల మలసి.

*    *    *    *

ఆపుకోలేని భావసల్లాపములను
'అపుడు—అపు' డంచు నాతోడ జపము సల్పు,
నాపయిం ప్రేమ పదముల నంటవచ్చు
విఫలవాంఛాత్రపాభరవివశయగుచు.

*    *    *    *

కనులనీరొల్క లోలోన కనలిపోయి
గీర్ణహృదయపటంబును దేలవైచి
సహజలావణ్యరూపవిషాదకలిత
కుముదవదనంబుతో వ్రాలి క్రుంగిపోవు.

*    *    *    *

దినము సవ్వేళ కచ్చట జనుచునుండి
నా శిథిలవీణె నామెకు బాడనిచ్చి
నాదు ప్రియురాలు-మణిపాయ-నాదతరగ (?)
డోలికల నోలలాడుచు సోలిపోదు.

*    *    *    *

ఆనిశీథుల మణిపాయ నేను కలసి
గాఢపరిరంభణంబునఁ గలలఁ గనుచు
ప్రేమరాజ్యవిహారముల్ వెసలుచుండి
యాలో నిద్దుర మేల్కొందు మకట! విధిని.

*    *    *    *

మా సుఖము చూడలేనట్టి మాయ యింద్ర
సవతిపోరుగఁ దోచె మా జక్కవలకు
సీర్వలేనట్టి సవతి నా యువిద నిట్టి
పట్టుకొనిపోయి సంద్రాన పాల్పైచె.

*    *    *    *

ఇప్పటికిగూడ నచ్చోటికి కేగినపుడు
నాహృదయరాజ్యలక్ష్మినినాదసాగు
పూతసంగీత మొక్కింత పోల్చుకొనుచు
కనుల నశ్రులు రాల్చక కదలలేను.

---

# వేడుకోలు

వెలువోలు సీతారామయ్యచౌదరిగారు

దివ్యమై నిత్యమగుచును దేజరిలెడు
నీయనంతశక్తి మదీయనేత్రయుగళి
మునకు సాక్షాత్కరించుత ననవరతము
భవ్యభవదీయసుస్వరూపంపుఛాయ
మద్హృదయమున కనుభూతమయి నెగడుత
మధురమగు నీసునామము మామకీన
గానము, శ్రుతి, గురుమంత్రము నయి నిలుత
తావకీనధ్యానంబె మద్ధర్మమును సు

కర్మమును బుగుమార్గమై క్రాలుగాత
యుష్మదీయవిజ్ఞానసుజ్యోతికలన
మద్హృదిని దీప్తి ప్రసరించి మనుత సతము
నమలమైయొప్పు మీ ప్రణయంబు నాకు
నాత్మధారం బ్రాణాధారమయి వెలయుత
నాథ! మీదు సౌందర్యమున కనుగుణము
గను మదీయజీవనము సౌఖ్యములఁ గాంచి
సత్యశాంతశివంబుల సరళశుద్ధ
సుస్వరూపంబగుచు వెల్గుచుండుగాత.

# మఱది! లక్ష్మణ! నిన్ను నే మఱవఁగలనె?

గున్నేపల్లి అక్షయలింగము

(గీతములు)

సిరుల నెడఁబాసి ‘పితృసమో జ్యేష్ఠ’ యనెడి
పెద్దల మృదూక్తిఁ దలఁదాల్చి ప్రేమమీఱ
ఘోర వనవాసమునను బాల్గొంటి వౌరా!
మఱది! నీదు సౌభ్రాత్రమ్ము మఱవఁగలనె?

సర్వవిధముల నంగరక్షకునిబోలెఁ
దండకారణ్యభూముల నిండుభక్తి
గొలిచి నగరసౌఖ్యోన్నతిఁ గూర్చినావు!
మఱది! నీదు సేవాసక్తి మఱవఁగలనె?

శ్రమదలంపక నాఁడు నీసంతరించు
నాటవికవస్తువైభవ మ్మలర నవుర!
పర్ణశాలసైతము దివ్యభవన మయ్యె
మఱది! నీకౌశలపుఁబెంపు మఱవఁగలనె?

రమణగొల్పెడి పూవుఁటీరములఁ జొచ్చి
పరిమళము నివ్వటిల్లిన క్రొవ్విరులఁ దెచ్చి
ప్రియమువాటిల్ల నాకు నర్పించినావు
మఱది! నీయాదరపుఁగల్మి మఱవఁగలనె?

అరసి తెచ్చిన వన్యఫలాళియందు
నీయనేర్చితి నాకెంతొ యిష్టమనుచు
దోరపండుల నెంచి తోడ్తో నహూరె!
మఱది! నీయింగితజ్ఞత మఱవఁగలనె?

అకట! నిను బేలనై తూలనాడునపుడు
నాదు కఠినోక్తులకు నెంత నవసినావొ?
యించుకేనియుఁ గినుక వహింపవైతి
మఱది! నీశాంతభావమ్ము మఱవఁగలనె?

కడకుఁ జేదోడువాదోడుగా మెలంగి
గహనమునఁ బట్టణమ్మున గౌరవమున
నీప్సితార్థమ్ములను గూర్చి యొసఁగినావు
మఱది! నీ సద్గుణోన్నతి మఱవఁగలనె?

నెమ్మిమై మఱందులు వధూనికలఁ గాంచి
గారవింతురుగాత నీకరణి నెపుడు
నవని నీవృత్త మాదర్శమగునుగాత!
మఱఁది! లక్ష్మణ! నిన్ను నే మఱవఁగలనె?

---

# పాండువంశ ప్రతిష్ఠ

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

(నా యాంధ్రభవిష్యపర్వము లోనిది)

జనమేజయభూవరనం - దనులం దెవ్వాఁడు పాండునందనకులవ
ర్ధనుడయ్యె? సర్పయాగం-బున కవ్వల నెవ్వఁ డేమి వొనరిచెఁ జెపుమా!

అనఁగన్ సూతసుతుండు వారి పరమాహ్లాదంబు నీక్షించి యి
ట్లను నాకవ్వడి పౌత్రజుండు కనెఁ గాశ్యాదేవియందున్ యశో
ధనుఁడై యన్వయవర్ధనుండయిన చంద్రాపీడుఁడున్ బ్రహ్మవి
ద్యను బూర్ణుండయి యాత్మవేత్తయగు సూర్యాపీడుఁ డన్పుత్రులన్.

కలిగిరి చంద్రాపీడున - కలఘులు నూర్వురు కుమారు లన్వయకరులై
వెలసిన వారలఁ దొలివాఁ - డిల నేలెను సత్యకర్ణుఁ డిభపురపతియై.

వారాణసపురపతి యా - శూరాగ్రణి యఖిలరాజ్య సుఖముల గనియున్
బేరొంది యాగవిధులన్ - జేరెను సతిఁగూడి తపముచేయఁగ వనమున్.

ఆనరనాథసూనుఁడు మహాహవవీరుఁడు శ్వేతకర్ణభూ
జాని యదూద్వహుండగు సుచారుని పుత్రిని మానినీమణిన్
మానినిఁ బెండ్లియై మనుజమానితుఁడై భువి నేలియేలి సం
తానములేమి నేలుబడిఁ దద్దయు రోఁత జనించినంతటన్.

ధరణిరాజ్యంబు మంత్రులపరముచేసి - యెల్లభోగంబులను మది కెడముచేసి
నీడవలెఁ దోడవచ్చు మానినియుఁ దాను - భక్తిమార్గంబునం దపోవనము చొచ్చె.

వనగతుఁడైన యాతఁ డతిభక్తి మహేశసపర్య, లామె య
జ్జనపతిపాదపద్మపరిచర్యలుఁ జేయుచు నుండునంత య
య్యనుపమశీల మానినికి నయ్యెను గర్భము దైవయుక్తి సం
తన నవమాసముల్ గడచెఁ దత్సమయంబున శ్వేతకర్ణుఁడున్.

మానసమతివైరాగ్యము - పూనఁగ నిజవంశపూర్వపురుషులత్రోవన్
మానితమైన మహాప్ర - స్థానము చేయంగఁ దలఁచి చయ్యనఁ గదలెన్.

తనగతి చూడ కట్లు మమతారహితాత్మత నేగుచున్న భ
ర్తను బెడఁబాయనోపక భరంబగు గర్భముతోన యాతనిన్
వెనుకొని మానినీసతి వనిన్ గిరికుంజమునందు గాంచి పు
త్రుని విడనాడి పాండుపులతోఁ జను ద్రోవది కైనడిం జనెన్.

పతిభక్తిపేర్మి నపత్యమోహంబును విడనాడి తనతల్లి వెడలినంత
కొండతాఁకునఁ గంది యేడ్చు నక్కసుగందు గతి కచేతనములుఁ గరఁగెననఁగ
సంబుదంబులు నీడ నతనిపైఁ బఱపెడిసమయమం దాదారిఁ జనుచునున్న
శాంతచిత్తులు శ్రవిష్టాపుత్రులగు పిప్పలాదుండు కౌశికుఁ డనెడివారు

కూర్మి నబ్బాలుఁ గొనిపోయి కొండకాల్వ - బండపై నిడి కడుగుచు నుండ వాని
ప్రక్క లారాతిరాపిడిఁ బొక్కి యల్ల - నల్లవాఱెక్రమంబుగ నల్లవాఱె.
అప్పు డజపార్శ్వములు యట్టు లతనిప్రక్క - లెసఁగ నజపార్శ్వుఁడను నామ మిడి యతనిని
వారు గొనిపోయి వేమకవనిత కిచ్చి - రామెయును బెంచె నాత్మజప్రేమ నంత.

వేమకిపుత్రుఁడై పెరిఁగి పెద్దయి యాతఁడు, కానఁ దన్ను ము
న్నోమినవారు మంత్రులుగ నున్నతపూరుకులక్రమాగత
శ్రీమహితాత్ముఁడై గుణగరిష్ఠత భూతల మేలెఁ దన్మహా
ధాముని వంశ మాతనిప్రధానుఁ వంశము నిండె నెల్లెడన్.

పాండువంశప్రతిష్ఠ యిట్లుండెఁ గాక - పౌరవాన్వయనిష్ఠ నుపన్యసించి
పద్యమొకటి యయాతి చెప్పండె తొల్లి - దానిఁ జదివెద వినుఁడు మేధావులార!

శ్లో. అచంద్రార్కగ్రహా భూమి-ర్భవేదపి న సంశయః
అపౌరవా న తు మహీ-భవిష్యతి కదాచన.

# భారతీయ చిత్రకళ

శ్రీ మంత్రవాది వెంకటరత్నం గారు

శ్లో॥ కలానాం ప్రవరం ధర్మకామార్థమోక్షదమ్ । మాంగల్యం ప్రథమం చైతత్ గృహే యత్ర ప్రతిష్ఠితమ్ ॥—(మార్కండేయః)

౧

మంగళప్రదమైనది, చతుర్విధపురుషార్థముల నొసంగునది చిత్రకళ. దేశాభ్యుదయకళ్యాణమునకు పచ్చతోరణము, పండితపామర హృదయానందదాయకము, జాతీయౌన్నత్యమందలి జీవలక్షణముల రసప్రపంచమున కంకితమిచ్చునది చిత్రకళయే.

భూభాగమునం దేజాతియు కన్నుదెరువని కాలమందు నేటి నాగరికసీమలన్నియు గాఢాంధకారమున నిద్రించుతరి భారతాంబ విశ్వకిరీటమైన హిమగిరి నెక్కి తన యశంశౌన్నత్య జగన్మోహన నృత్యమున స్వర్గసేవత్రయై ప్రకాశించినది. ఆధ్యాత్మికరసావేశమున కళాగర్వమై విలసిల్లినది.

చిత్రవిద్యోత్పత్తికి ఆధ్యాత్మికరసపోషణ మిచ్చిన ప్రాగ్దేశీయుని యౌచిత్య మెంతయు శ్లాఘనీయము. నారాయణముని తపశ్శక్తి దేవతల భయభ్రాంతుల జేసెను అప్సరోంగనల హావభావవిలాసములకు తపోబలము చలన రహితమాయెను. లజ్జితలై వెడలజూచు దేవకన్య లచ్చెరువొంద నారాయణముని తన యూరువునందు నవరూపలావణ్యరాశియగు నొక నారీమూర్తిని చిత్రించి జీవముబోసెను. ఊరువునందు బుట్టి యుర్వి కంకితయైన యా లావణ్యవతి యూర్వశి. వేదప్రఖ్యాతుడగు పురూరవు డామెను పరిణయమాడెను. సుప్రసిద్ధ భారతకురుకుల మీదంపతుల కుద్భవించెనని ఋగ్వేదమం దొకఋక్కు దెల్పుచున్నది.

ప్రథమ చిత్రసూత్రకర్తయగు నారాయణముని విశ్వకర్మ కుపదేశించెను.

కం. ఆ విశ్వకర్మ నిర్మిత-దేవవిమానుండు నిఖిలదివ్యాభరణ
శ్రీవిరచన పరితోషిత-దేవుడు శిల్పప్రజాపతియునై నెగడెన్.
—(ఆం. మ. భారతము, ఆది. ౩ ఆ.)

విశ్వకర్మ తానేర్చిన చిత్రసూత్రములచే నరపశుపక్ష్యాది సకల జీవమయ అనంతవిశ్వగోళమును చిత్రించి చిత్రకళకు ప్రియజనకుడాయెను.

*  *  *  *

ప్రపంచమునం దనేకకళాసాంప్రదాయము లాయాదేశముల వ్యక్తిత్వముల బయల్పరచినవి. పూర్వపాశ్చాత్యకళలందు పూర్వకళాసాంప్రదాయములే ప్రాచీనములని తెలియనగును. ఇందలి సత్యమును దూరముజేయ "విన్సెంట్ స్మిత్" మొదలగు పాశ్చాత్యపండితులు ప్రయత్నించిరి గాని వారివాదములు హేతురహితము లగుటంజేసి వీగిపోయినవి.

పాశ్చాత్యసీమలం దత్యంతప్రాచీనసీమ ఐగుప్త (Egypt). ఐగుప్తకళాసాంప్రదాయములు క్రీ॥ పూ॥ ౫,౦౦౦ సం॥ నాటివి. ఐరేనియా మొదలగు దేశీయకళలు క్రీ॥ పూ॥ ౩,౦౦౦ సం॥ నాటివై యుండవచ్చును. అటుపై పారశీకకళలు తలలెత్తెను. క్రీ॥ శకారంభము నుండి యవన (Greek) రోమక (Roman) కళ లభివృద్ధిగాంచినట్లు ఇతిహాసములు చాటుచున్నవి. ఇట్టిచో సృష్ట్యాదినుండి మిక్కిలి యున్నతదశను పొందిన భారతీయకళలకు యవనకళ లాదర్శమైనవను పాశ్చాత్యవాద మెంత విచిత్రముగ నున్నదో దెలియనగును. "స్మిత్తు" గారు యవనకళలు హిందూదేశమునందు అలెగ్జాండరు దండయాత్రవలన వ్యాపింపబడుటంజేసి హైందవకళల కాదర్శము లైనవని వ్రాసిరి. హిందూ యవన దేశములకు ఆదినుండి రాకపోకలు గలవు. శ్రీ మహాభారతమునందు యవనులగాథ లనేకము లున్నవి. క్రీ॥ పూ॥ ఆరవ శతాబ్దమందు పైథాగరసు వంటి యవనపండితు లనేకులు హిందూదేశమందు జ్ఞానసుధ సేకరించుచుండిరి. క్రీ॥ పూర్వమునం దేనాడో బౌద్ధమతము పాశ్చాత్యదేశములలో ప్రవేశించినది. అట్టిచో స్మిత్తుగారు అలెగ్జాండరు దండయాత్రవలననె హిందూయవనదేశములకు పరస్పరము రాకపోకలు కలుగుట, హిందూకళలు యవనకళల నాదర్శము జేసికొనుట తటస్థించెనని వ్రాయుట ఎట్టిదో తెలియదు.

1 'But the Greeks no more created Indian sculpture and painting than they created Indian philosophy and religion. Their aesthetic ideals were essentially different from those of India and they never at any time imposed them upon Indian art, which in its distinctive and essential character is entirely the product of Indian thought and Indian artistic genius.'

1. E. B. HAVELL

హిందూకళలు ప్రపంచమునందు తదితరకళలకు దోవజూపిన వనిన ననవచ్చును. భారతీయకళలు మిక్కిలి ప్రాచీనము లగుటయే ఇందులకు ప్రబలతరకారణము. వేదములందు చిత్రకళా ప్రశంస లున్నవి. వేదము లేనాటివి? క్రీ. పూ. ౧౦,౦౦౦ సం॥ నాటివని బాలగంగాధరతిలక్ వ్రాసెను. ఇంతకంటెను ప్రాచీనములు గావచ్చును.

క్రీ. శకారంభమునకు హిందూకళ పూర్వదేశమందు యవ, బ్రాహ్మ, సింహళ, శ్యాము, త్రివిష్టప, చీనా, జపాను, మధ్యఆసియా దేశములకే కాక మిక్కిలి దూరదేశములకును పాశ్చాత్యదేశములకును వ్యాపించినది. 1 క్రీ. పూ. ౬౭ సం॥న చీనారాజగు "మింగ్టి"యనునతడు హిందూదేశమునుండి "కాశ్యపమతంగు"డను బౌద్ధసన్యాసిని మతప్రచారమునకు బిలిపించుకొనెను. బౌద్ధసన్యాసి హిందూ బౌద్ధకళా సాంప్రదాయముల నుతముతోపాటుగ చీనాలో ప్రచారముజేసెను. చీనానుండి కళలు జపాను జేరెనని తెలియుచున్నది.

2 "At the beginning of the Christian era and for centuries previously when the classic art of Europe had already passed its zenith India was drawing in towards a great flood of artistic culture from western Asia......Out of those eclective influences joined with the old indigenous traditions Indian religious thought quickly formulated a new synthesis of art which in its turn became the source from which other great currents followed..............In those early centuries of the Christian era, and from this Indian source came the inspiration of the great schools of Chinese painting which from seventh to the thirteenth century stood first in the whole world...............................From the sea ports of her eastern and western coast India sent streams of colonists, missionaries and craftsmen all over southern Asia, Ceylon, Siam and far distant Kambodia, through China and Korea. Indian Art entered Japan about the middle of 6th century. About 603 A. D. Indian Colonists from Gojarat brought Indian Art into Java, and at Borabudur in eighth and ninth centuries Indian art achieved its greatest triumphs."

*     *     *     *

## ౨

"Arts for India are not to please but to manifest."

ప్రపంచమునందలి కళలన్నియు రెండు విధములుగ నున్నవి. వాస్తవకళలు(Realistic Arts), మానసికకళలు (Idealistic Arts): స్థూలప్రపంచమునందలి ప్రకృతి యనుకరణములు వాస్తవకళలు. సూక్ష్మప్రపంచమున, మానసికోపాసనమున జ్ఞానచక్షువునకు గోచరించునవి మానసికకళలు.

ప్రపంచమంతయు భగవంతుని మాయాబింబము. ప్రకృతి సహస్రములైన తేజములతో ప్రకాశించుటచే మానవుడు మాయను దెలియజాలకున్నాడు. ప్రకృతి యతని దనలో లయింపజేసికొనుచున్నది.

లెక్కలేని తేజములతో ప్రకాశించు ప్రకృతియొక్క యంతరంగ అగోచర తేజమును బహిర్గతముజేసి, మాయను తొలగించి భగవంతుని ప్రత్యక్షపరచుటకె కళ లేర్పడియున్నవిగాని, చంచలములైన భౌతికానందముకొరకు మాత్రము గాదు. అవ్యక్తమై, లయబద్ధముగు రసభావనిరూపణమె కళ యనబడవలయును. కళలు ప్రకృతి యనుకరణములు గాజాలవు. భగవన్నిరూపణమె కళల ముఖ్యపథ. ప్రపంచమునకు కళలు దేవమాతలని ప్రాచ్యదేశీయుల నమ్మకము.

పాశ్చాత్యదేశములందు కళలు ఐహికసుఖములకె యుపకరించుచున్నవి. ప్రకృతినిరూపణమె వారికళల గమ్యస్థానమగుచున్నది. కాని కళల యాదర్శ మది కానేరదు.

"Art seems to reach its highest to go deepest which all that is small and common is excluded.'

—E. B. HAVELL.

ప్రకృతిప్రాధాన్యము లగుటచే పాశ్చాత్యకళలు స్థూలప్రపంచమునకే చెందియున్నవి. వారి మతమునకు కళలకు సంబంధము లేదు. కాని ప్రాచ్యదేశములందు కళలు మతాంతర్గతములు. మత నిర్మాణమే కళల పని.

*     *     *     *

ఆదియం దార్యులు ప్రకృతి యారాధకులై, సృష్టిలోని వివిధ స్వరూపములకు దివ్యత్వ మిచ్చి పూజించెడివారు. క్రమముగ ప్రకృతికి పరుం డీశ్వరుడని గ్రహించి, ఈశ్వరారాధకులైరి.

పురుష-ప్రకృతుల సంయోగస్వరూపమె ఈశ్వరస్వరూపము. అందుచే హిందూమతమునకు, కళలకు, సారస్వతమునకు పురుష-ప్రకృతులు రెండును ఆదర్శమై పోయినవి. ప్రపంచరంగస్థలనిర్మాణమునకు ప్రకృతిని-జీవితాదర్శమగు మోక్షమునకు పురుషుని, ప్రయోగించుచుండిరి. పురుషుడు ప్రధానాంగము. ప్రకృతి యుపాంగము.

"Nature is to art, as body is to soul."

—OKAKURA KURZO.

ఆత్మకు శరీరసంబంధ మెట్లో కళకు ప్రకృతి సంబంధ మట్లు. ప్రకృతి యనుకరణ కళ కానేరదు. ప్రకృతివినా పురుషునికి ప్రాధాన్యము లేదు. రెండును గలియుటచే (సమన్వయము జేయుటచే) కళలెగాక అనంతవిశ్వభాండ ముద్భవిల్లుచున్నది.

---

1. Indian Painting, by Percy Brown.

2 Indian Sculpture and Painting, by E B. Havell.

"True art can be compared to a lily which springs from the ground, is in touch with nature, and yet is quite high above it. So art must be in touch with nature and where that is gone art degenerates. Yet it must be above nature.'

—SWAMI VIVEKANANDA.

భారతీయకళ యంతయు మానసికకళ (IdealisticArt) యనుటకు వీలులేదు. రాజపుత్ర – మొగలాయి కళాసాంప్రదాయములు వాస్తవకళయందు ఉత్కృష్టతను జాటుచున్నవి. మనుష్యచిత్రరచన (Portraits) యీ కళలందు చక్కగ నిరూపింపబడినది. పాశ్చాత్య సాంప్రదాయములు హిందూకళతో మిళితము అగుటచేగాని, పాశ్చాత్య కళానుకరణమునగాని యీనూతనసాంప్రదాయము లేర్పడినవి. పారశీక–యవన–మొదలగు కళలీకాలమునకు పూర్వమునుండి హిందూదేశమున ప్రచారమునందు యున్నవి. ప్రాచీన హైందవ చిత్రశాస్త్రమునకు పై సాంప్రదాయములు భిన్నము లైనవి. కాలమె మారినందున కళలు సహితము మారియుండును.

పాశ్చాత్యచిత్రకారులలో సహితము ప్రాచ్యకళాసిద్ధాంతముల ననుకరించినవారు లేకపోలేదు. పాశ్చాత్య–ప్రాచ్యకళల తిరుగుబాటుకు కారకులైయు–విల్లియంమారిస్–ఎడ్వర్డుబర్న్ జోన్సు మొదలగు చిత్రకారులు మానసిక నిరూపణమె కళల ముఖ్యోద్దేశమను సిద్ధాంతమును స్పష్టపరచిరి. వీరినిగూఢభావరచనమును పలుమారు నిందించినపుడు బర్న్ జోన్సు వాస్తవకళనుగూర్చి ఇట్లువ్రాసెను;

"Realism? Direct transcript form of nature. I suppose by this time the 'photographic' artist can give us all the colours as correctly as the shapes. People will begin to find that the realism they talk about is not art at all but science; interesting no doubt as a scientific achievement but nothing more.

The object of art must be either to please or to exalt. I cannot see any other reason for it at all. One is a pretty one and the other a noble one." [1]

* * * *

## 3

శ్లో. రూపభేదప్రమాణాని భావలావణ్యయోజనమ్,
సాదృశ్యం వర్ణికాభంగ మితి చిత్రం షడంగకం.

ప్రాచీన భారతీయ చిత్రరచనకు మూలమైన సూత్రము లారు.

౧. రూపభేదము (The knowledge of appearance). ౨. ప్రమాణము (Correct perception, measure and structure). ౩. భావము (Action of feelings on forms and poses). ౪. లావణ్యయోజనము (Infusion of grace, artistic representation). ౫. సాదృశ్యము (Similitude or likeness in nature). ౬. వర్ణికాభంగము (Artistic manner of using colours). పై లక్షణములం దేయొక లక్షణము లోపించినను చిత్రము వికృతరూపమును దాల్చును. "అశాస్త్రీయముగ చిత్రమ్ముల రచించు శిల్పి కాయుః క్షీణ" మని శుక్రుడు వ్రాయుచున్నాడు. ఎట్లున్నను అట్టి చిత్రములు ప్రపంచమునకు నిష్ప్రయోజనములు. చిత్రలక్షణములన్నియు భావసూత్రముపై నాధారపడి భావనిరూపణలక్షణమును ప్రధానము చేయుచుండును. భారతీయకళలందు భావమె ప్రధానముగదా.

### ౧. రూపభేదము

చిత్రరచనయందలి ప్రథమసూత్రము రూపభేదము; రూపముల యొక్క తారతమ్యమును దెలిసికొనుట. భారతీయ చిత్రశిల్పరచనయందు మూర్తు లైదురకములని తెల్పిరి.

౧. బాలమూర్తి (౫ తలములఎత్తు). ౨. కుమారమూర్తి. (౬ తలములు) ౩. నరమూర్తి (౧౧ తలములు). ౪. క్రూరమూర్తి (౧౨ తలములు.) ౫. అసురమూర్తి (౧౬ తలములు.) తలము అనగా, 'తల' యొక్క నిలువుకొలతయని తెలియవలెను. ఇట్టి కొలతలు కృతయుగమందుండెను. కలియుగమునాటికి నరమూర్తి ౫ ౬ తలములఎత్తు. ఎంత క్షీణతయో తెలిసికొనవచ్చును.

నరమూర్తిని మరల నాలుగు విధములుగ విభజించి ఒక్కొక్క రకమును బహుజాగ్రత్తగ వర్ణించి భేదము నిరూపించిరి.

అటులె నారీమూర్తియొక్క కొలతనుగూడ నిరూపించిరి. "నవతలస్మృత దేవి" యని శుక్రుడు వ్రాసెను. అనగా నారీమూర్తి తొమ్మిది తలములు; పురుషమూర్తికంటె ఒకతలము తక్కువ ఎత్తు. నారీమూర్తియందు నాల్గురకములు గలవు. ౧. పద్మిని, ౨. శంఖిని, ౩. చిత్తిని, ౪. హస్తిని. ఈ విధముగ విభజించి వీరి పరిమాణముల నిరూపించి రూపముల యందలి భేదమును చక్కగ నిరూపించిరి.

### ౨. ప్రమాణము

ప్రమాణమును గూర్చి శుక్రనీతిసారమున ప్రతిలక్షణమందును, భృగుసంహితయందును చక్కగ నిరూపింపబడి యున్నది. మూర్తియొక్క తలములు హెచ్చుకొలది అవయవముల వృద్ధిగూడ నుండును గద. ప్రమాణమునందు చిత్రశిల్పకళలకు భేదముండును. నరమూర్తి ప్రమాణమును శుక్రుడు వర్ణించియున్నాడు. శుక్రనీతిసారము జూడవలెను.

### ౩. భావము

ప్రాచ్యకళలు భావనిరూపణమునకు గాన భావలక్షణము మిక్కిలి ప్రధానమైనది. భావమనగా రసము. రసములు తొమ్మిది.

1. Memories of E. B. Jones (by) Lady Burne Jones, 1904.

రసాత్మకమైనది కళ. భావము రెండువిధములుగ గోచరింపబడును: బహిరంగ స్వరూపమునందు, అంతరంగమునందును.

బహిరంగభావనిరూపణమునకు అవయవముల యందలి వంపులు, హస్త-నేత్రవిన్యాసములు ప్రధానములు. శరీరమునందు గల్గు వంపులు నాల్గురకములు. ౧. సమభంగము. మూర్తి నిలువుగ నిట్రముగ నిలిచి యున్నపుడు గల్గును ౨. అభంగము. అనగా తలయొద్దనుండి పాదము లవరకు నిర్ణయించుటకు వీలుగాని వంపు గల్గియుండును. ౩. త్రిభంగము శరీరమునందలి మూడువంపులవలన గల్గును. ఉత్తమజాతి స్త్రీలందును, ఉత్తమజాతి పురుషులందును త్రిభంగము సహజముగ నుండును. కృష్ణుని వర్ణించుతరి "త్రిభంగిగ నిల్చు" "మువ్వంకలం బోవగా" యని వ్రాయుదురు. ఇందలిభావమే త్రిభంగమై యున్నది. ౪. అతిభంగము: లెక్కలేనివంపులు శరీరమునందు గల్గుటచే అతిభంగ మేర్పడు. యుద్ధవీరులందును, శివుని విశ్వనాట్యమందును మన మీలక్షణము జూడగలము.

తదుపరి హస్తనేత్ర విన్యాసములతో బహిరంగస్వరూపము నందలి భావమును నిరూపింపనగును.

అంతరంగభావమును వర్ణములద్వారా గోచరింప జేయుదురు. వర్ణికాభంగమును జూడనగును.

## ౪. లావణ్యయోజనము

చిత్తర్వునకు లావణ్యమిచ్చువాడు చిత్రకారుడు. చిత్రకారుడే దేశమునకు, ఏజాతికి సంబంధించిన వాడేశముయొక్క, యాజాతి యొక్క లావణ్యము లాతడు చిత్రించును. దానినే చిత్రకారుని (Technic) వ్యక్తిత్వ మందురు. చిత్రకారుడు దేవతాచిత్తర్వుల రచించునపుడు నవయౌవనులగ చిత్రింపవలయునని శాస్త్రము. శరీరమునందు నరములగాని, కండరములగాని, ఎముకల గాని బహిర్గతములు కాకుండ శరీరము బలిష్ఠముగను, నున్నగను, సున్నితముగను ఉన్నట్లు చిత్రింపవలయునని సిద్ధాంతము. శ్రీకృష్ణ, గణేశ మొదలగు బాలకుమార మూర్తుల కీసిద్ధాంతములు వర్తింపవు. ఆ చిత్రములకు ప్రత్యేకలక్షణము లివ్వబడియున్నవి.

ఎంత లక్షణయుక్తముగ చిత్రించినను బొమ్మ అందముగ లేకున్న నిష్ప్రయోజనము. చిత్తర్వునందలి భావ మెంత ప్రధానము యంతకంటెను ప్రధానమైనది లావణ్యము. లావణ్యము వినా ప్రపంచమె శూన్యము.

## ౫. సాదృశము

కావ్యములందలి యుపమానములను గైకొని యావిధముగ చిత్రించుట సాదృశలక్షణ మనబడును. కావ్యాంతర్గత శిల్ప మిదియె. కవులు ఉపమాలంకారమును సాధారణముగ ప్రకృతిరూపమున మార్పుజెందని వస్తువులతోడనే సమన్వయించిరి. మీనములు, పక్షులు, పువ్వులు, గ్రుడ్లు మొదలగువానితో పోల్చిరి. మీనాక్షి, కంబుకంఠి పద్మాక్షి మొదలగుమాట లందలి యుపమానముల ప్రకారము చిత్రించుటె సాదృశలక్షణము.

మనుష్యునితలను కోడిగుడ్డుగను, నాసికను చిలుకముక్కుగ తిల పుష్పముగ, పెదవుల తుమ్మిపూవుగ మంకెనపూవుగ, జఘనములు హస్తములు అరటికంబములుగ, వక్షము వృషభతల, సింహావక్షముగ, పాదములు, అరచేతులు కమలములుగ కవులు వర్ణింతురు. ఈ పోలికల గైకొని చిత్రములకు ప్రకృతిరమణీయతనిచ్చుటకె సాదృశలక్షణ మేర్పడియున్నది.

## ౬. వర్ణికాభంగము

వర్ణికాభంగ మనగా వర్ణరచనము. వర్ణములు మూడు: ఎరుపు, నీలము, పసుపు. ఈమూడు ప్రకృతివర్ణములనుండి సప్తవర్ణములు గల్గును: ఊదా, నీలి, నీలము, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నారింజపండు రంగు, ఎరుపు. ఈవర్ణముల మిశ్రమమున లెక్కలేనన్ని రంగులు వచ్చును.

వాస్తవకళయందు వర్ణములు బాహ్యలావణ్యమునె చిత్రించును. మానసికభావ నిరూపణకు భారతీయులు వర్ణముల నుపయోగింతురు.

సాత్విక, రాజస, తామసములు భగవంతుని ప్రకృతిగుణములు. సాత్వికమును రెండురకములుగ నిరూపించిరి. శుద్ధసత్వము: శుద్ధసత్వమునకు తెలుపు వర్ణము (ఉదా) శివుడు తెల్పు. కైలాసము తెల్పు. నంది తెల్పు సరస్వతి తెల్పు ఆమెవసనములు తెలుపు.పద్మము తెలుపు. హంస తెలుపు. ఇట్లు తెలుపువర్ణము శుద్ధసత్వమునకు చిహ్నము జేసిరి.

సాత్విక రాజస తామసములు మూడు గల్గిన మూర్తులను నీలవర్ణముతో చిత్రించిరి. శ్రీవిష్ణు, మహాకాళి, రామ, కృష్ణ, మొదలగు మూర్తులన్నియు నీలవర్ణమున నిర్మించిరి. రాజసచిహ్నము ఎరుపు. తామసమునకు నలుపు నుపయోగించిరి. నలుపు వ్యచ్ఛిన్నము గదా.

సూర్యమండలము తెల్పు అనగా శుద్ధసాత్వికమూర్తి యనిగదా. సూర్యదేవతయగు గాయత్రిని "ముక్తావిద్రుమహేమ నీలధవళచ్ఛాయైః" యని వర్ణించిరి. సూర్యకాంతియందు సప్తవర్ణములు గలవు. అనగా సప్తగుణ ప్రధానమైనది సాత్వికము. అందును శుద్ధసాత్వికము.

పరిపక్వహృదయమును, అతీత మూర్తిని, నిరూపించుటకు ఆకుపచ్చవర్ణము నుపయోగించిరి. ఆకుపచ్చ, పసుపుపచ్చ వర్ణములు (మహమ్మదీయులకు) రాజసచిహ్నములు. నారింజపండువర్ణము (కాషాయరంగు) అగ్నిచిహ్నము. శ్రీరామతీర్థస్వామిని జపనీయులు, హిందూ సన్యాసి కాషాయవస్త్రధారణమునుగూర్చి యడిగినపుడు, హిందూ సన్యాసి శారీరసౌఖ్యముల నగ్నికర్పించినా డను నుద్దేశ్యముతో అగ్నివర్ణకషాయమును ధరించు ననెను. భావము ననుసరించి వర్ణముల నుపయోగించు లక్షణము ప్రాచ్యులదై యున్నది. దట్టముగ కండ్లు మెరసిపోవునట్లు రంగుల పూయుట పాశ్చాత్యలక్షణము. వెలుగునీడలు వర్ణపు దట్టములలో వారి కళలు ప్రఖ్యాతములైనవి.పలుచని వర్ణముతో భావ

# అజంతా చిత్రకళ

కె. నరసింహాచారిగారు

ఒక దేశము యొక్క చిత్రకళ యాదేశము యొక్క జీవకళవంటిది. జీవయుతుడగు శరీరి యెట్లు తేజోవంతుడుగను, ప్రతిభావంతుడుగను విరాజిల్లుచుండునో యట్లే యొక దేశము తన చిత్రకళయొక్క ప్రాశస్త్యమువల్ల ప్రకాశించుచుండును. చిత్రకళ దేశముయొక్క జ్ఞానసంపదను ప్రతిఫలింపజేయు నద్దము.

భారతమాత ప్రస్తుతమున తన నైసర్గికమగు చిత్రకళచే నలంకృతకాక పరదేశానత కేవల కృత్రిమ రత్నప్రతిపాదిత ప్రతిభాయుతమై యున్నను, పూర్వము జాతిరత్నమువంటి తన నైజకళాలంకారములచే భూషితమై యుప్పెడిది. అట్టి జాతిరత్నోపమ మగు మన దేశచిత్రకళ యనేక ప్రదేశములలో స్థాపితమై యున్నది. అజంతా ఎల్లోరా, నాసిక, గాంధార, అమరావతి సాంచి మొదలగునవి యందు సుప్రసిద్ధములు.

అనేకశతాబ్ద ప్రవర్ధమాన మగుచు వచ్చిన చిత్రకళాదేవి యొక్క వివిధగతు లొక్కచోటనే ప్రదర్శింపబడి యుండుటవలన అజంతా తక్కిన యన్నింటికన్న ప్రసిద్ధ ప్రదేశమని కొనియాడబడుచున్నది.

పాశ్చాత్య చిత్రకళ కేవల మైహికము. కల్పనా చమత్కృతికిని, ఆముష్మిక చింతకును, అవకాశ మొసగజాలదు. ఐహికస్వభావము ననుసరించియే యుండవలసినది కాన దానికి శృంఖలలు మెండు. స్వేచ్ఛ చాలదు. భావప్రపంచమున స్థానములేదు. భౌతిక ప్రపంచమునను పరిమితవ్యాప్తియే దీనికి, భారత చిత్రకళకన్నో నైహిక స్వభావానుగుణముగ నుండవలెనను నిర్బంధము లేదు. స్వేచ్ఛ యపారము. శిల్పులును, చిత్రకారులును కళారంగమున విచ్చలవిడి సంచరించగలరు. చిత్రకళా ప్రపంచమున వారు పెట్టినది బిక్ష. అప్రతిహతమును నపారమును నగు కల్పనా చమత్కృతి మాత్రమె కాక చారిత్రక విషయము గూడ వారిచే ప్రదర్శింపబడి యుండెను. అందువలన వారి చిత్రకళ ప్రస్తుత చరిత్రకారులకు గూడ నాధారమై యొప్పుచున్నది.

అజంతా చిత్రరంగమును మూడు భాగములుగ విభజింప వచ్చును. 1. చారిత్రక ప్రకరణము. ఇందు మూలమున నాయా కాలపు చరిత్రమును, ఆచారనాగరికతలును తెలిసికొననగును. 2. భక్తి ప్రకరణము. 3. కల్పనాప్రకరణము. ఈమూడు ప్రకరణములందును నవరసములు ద్యోతకములగుచుండును. ప్రతిచిత్రమును, ఔచిత్య విరోధము లేక సకలాలంకార సమన్వితంబై యొప్పుచుండును.

పాశ్చాత్య చిత్రములందు, ఏదేనొక్క విషయము ప్రధానముగ గణించి, దానికిమాత్రము ప్రాముఖ్యమొసగి (Bringing the main character alone into the forefront and throwing the rest into the background and indistinctness) తక్కిన భాగముల నుదాసీనభావమున జూచుట యాచారము. భారత చిత్రమున నట్టి లోపముండదు. నాటకరంగమున ప్రతిపాత్రమును, తత్తదుచితస్థానమాక్రమించి నాటకమునకందమయు రక్తిగొల్పునట్లు భారతచిత్రకళారంగమున గల ప్రతివిగ్రహమును చక్కగా చిత్రింపబడి చిత్రమునకు సౌందర్య మొసగూర్చుచుండును. (Every detail is shown with interest and earnestness and every character is portrayed with all its importance. (ప్రభవ సం. సంచిక, పుట 176 చూడుడు.)

చిత్రసౌందర్యమునకు అందలి పాత్రలను చక్కగా చిత్రించుటమాత్రమే కాక యితరశృంగార మావశ్యకము.

ప్రతిచిత్రమునకును చుట్టు నేదో యొకయలంకార చిత్రిమును చిత్రించుటయందు భారతీయు లద్వితీయులు. వారి యలంకార చిత్రములు (Conventional designs) వారి కల్పనా చమత్కృతిని వేవిధముల జాటుచున్నవి. (ప్రభవ సం. సంచిక, పుట 177.)

ఈసంచికయందు చేర్చిన చిత్రముల వివరము.

మొదటిచిత్రము: రాజసమావేశము

ప్రథమ గుహాలయమున వెనుకటి గోడపైనున్నది. ఇదియొక చరిత్రవిషయిక చిత్రము. ఇరువురు రాకొమరులు మంతనమున నున్నవారు. అందొకడు నాగరాజు. వెనుక భాగమున నొకతార్తారోద్యోగి యున్నాడు. ఇరువురు రాకొమరులును తమ పరిమిత పరివారసమేతముగ నొక మంటపమున నాసీనులైయున్నారు. కొందరు సేవ్యులు క్షీరముల నుపహారముల గొని నిలిచి యున్నారు.

రెండవచిత్రము: హంసవేట—హంసజాతకము

ద్వితీయ గుహాలయము నందున్నది. వారణాశి రాజగు బ్రహ్మదత్తుని యాజ్ఞానుసారముగ గొందఱు బోయలు మానస సరోవరము నందలి బంగారుహంసలను బట్టుకొన యత్నించు చున్నారు. ఈ చిత్రముస్వభావానుగుణముగ నున్నది. బోయయొకడు మొలబంటి నీట నిలిచి హంసల నాకర్షించు చున్నాడు.

మూడవచిత్రము: మరణావస్థ

పదునారవ గుహాలయమున నున్నది. ఒకరాకొమరిత మరణవేదన పడుటయు పరిచారిక లామెకు సకలోపచారములఁ జేయుటయు చక్కగాఁ జిత్రింపఁబడియున్నది. ప్రతి పరిచారిక ముఖమునను దుఃఖము ద్యోతకమగుచున్నది. విషయానుగుణ్యముగ పాత్రపోషణము చేయుట అజంతా చిత్రకారుల కతి సులభము. కుడిప్రక్క నిద్దరు సేవకులు పానపాత్రములగొని రాకొమరిత స్థితిని గురించి చింతిల్లుచున్నారు.

నాలుగవచిత్రము: సంభాషణ

ప్రథమ గుహాలయమున నున్నది. ఇరువురు పరిచారకులు తమలో తామేదియో సంభాషించు కొనుచున్నారు. వారు కూర్చుండిన రీతియు, వారి ముఖమునందలి భావసూచనయు నచ్చి చిత్రకారులను ప్రశంసాపాత్రులచేయక మానవు.

అయిదవచిత్రము: వనవిహారము

పదునేడవ గుహాలయమున నున్నది. ఇరువురు స్త్రీలు వనవిహార మొనరించు చున్నారు. ఆభరణ విహీనలై యుండుటంబట్టి స్త్రీలు సామాన్యులని కాని, సన్న్యాసినులని కాని తోచును. వనమున దుస్స్వభావములగు సింహాది మృగములును, అతి సాధువులగు హరిణములు, వానరములు, నెమళ్లును కనబడుచున్నవి. నానా విధములగు వృక్షములు ఫలభరితములై యున్నవి.

ఆరవచిత్రము: తామరకొలను

తామరలు తరంగములపై నూగు లాపుట కడు రమణీయముగ నున్నది. తామరలనడుమ కలువలునిలిచి తామరల స్వాగ్యములకు తాళములు మేళవించుకతి తల లూపుచున్నవి. తామర లిటునటు వ్రాలియుండుట తరంగ చలనమును సూచించు చున్నది.

ఏడవచిత్రము: పాద కమలములు

ఈ చిత్రమున కవులు వర్ణించు పాద కమలములలోని పాద, కమలముల అభేదరూపము ప్రతిపాదితమైనది. వ్రేళ్లు కొనలవంపులు పుష్పదళములతో సారూప్యము బొందినట్లుండుట చిత్రమునకు సౌందర్యము నొడగూర్చుచున్నది.

ఎనిమిదవ చిత్రము: తత్త్వబోధ-విశ్వంతర జాతకము

పదునేడవ గుహాలయములో నున్నది. విశ్వంతరుడను రాకొమరుడు మితిమీఱి దానతత్పరుడై తన పట్టపుటేనుంగును సహితము కొందరు భిక్షువేషధారుల కిచ్చెను. ప్రజలందఱకు కినిసి విశ్వంతరుడు ప్రజాపాలనార్హుడుకాడని, తపోనిష్ఠ నుండదగినవాడని, అతనిని వనములకంపుమని రాజగు సంజయుని కోరిరి. రాజంత తన ప్రధానమంత్రిని విశ్వంతరుని పాలిపింక బుద్ధిగరపుటకు యత్నింపగా విశ్వంతరుడు ప్రధానమంత్రికి దానము కన్న తన కేదియు గొప్పకాదనియు, తన ప్రాణము సహితము యాచకుని కీయ సంసిద్ధుడననియు దాన మహిమను బోధించు చున్నాడు.

# శ్రీ సత్యజ్ఞాన మందిరము

శ్రీ ఉత్తరాది మఠము, 13, సింగరాచారి వీధి, తిరువల్లికేణి, మదరాసు.



ఈ ఉత్తరాది మఠ భవనము శ్రీ మధ్వాచార్యులవారేర్పరిచి ఉత్తరాది మఠమునకధిపతులగు స్వాములవారి ఆస్థానమునందున్నది. ఈ భవనమున శ్రీమదాంజనేయస్వామివారి దేవళ మున్నది. ఇపుడు పీఠాధిపతులుగా నున్న శ్రీ సత్యధ్యాన తీర్థభగవత్పాదాచార్యుల వారికి ఆధిపత్య మిచ్చినవారును రాజమహేంద్రవరమున భౌతిక శరీరమును త్యజించిన వారునునగు శ్రీ సత్యజ్ఞాన తీర్థ భగవత్పాదాచార్యుల వారి బృందావనము గూడ నీభవనమునం దున్నది. ఇచట ప్రతి దినమును, పూజాప్రాకారములును ధూపదీప నైవేద్యాదులును పురాణ శ్రవణము, హరికథా కాలక్షేపములు హరినామ సంకీర్తనము, శ్రీరామ నవమి మున్నగు జాతీయోత్సవములు, మధ్వ నవమి మున్నగు పుణ్యదినోత్సవములు, గొప్పపండితుల వలన ఉపనిషత్పాఠ ప్రవచనములు మున్నగునవియు జరుగుచుండును. ఈ భవన మిపుడు శిథిలస్థితికి వచ్చియున్నది. శ్రీసత్యజ్ఞాన తీర్థుల జ్ఞానభక్తి వైరాగ్యాది మహిమాతిశయములు మధ్వమతస్థుల కందరికిని తిరుపతి మహంతుగారికిని గూడ తెలిసియే యున్నవి. మధ్వమతస్థులగు స్త్రీలును, పురుషులును ఇతరులును గూడ వందలకొలదిగా మఠమునకు వచ్చి శ్రీ స్వాములవారి బృందావనము కడ సేవజేసియు, పురాణాగులవినియు కృతార్థులగుచుందురు. ఈ భవనమును, దేవాలయమును మరల పెంచికట్టుటకును ఉపన్యాస మందిరమును గ్రంథాలయము నేర్పరుచుటకును నిశ్చయింపబడి పని ప్రారంభింపబడినది. మందిరమునకు వెనుక భాగమున పాకశాల పూర్తియైనది. ఉడిపిలో శ్రీ మధ్వాచార్యులవారు ప్రతిష్ఠించిన శ్రీ బాలకృష్ణుని సేవజేయుటకు శ్రీ మధ్వాచార్యులవారిచే నేర్పరుపబడిన అష్ట మఠములలో నొకటి యగు శ్రీ పుత్తిగ మఠాధిపతులీమధ్య చెన్నపురికి వచ్చినపుడు ఈ పాకశాలకు శుద్ధపుణ్యాహవాచనమును జరిపిరి. ఆ నాడు అచటనే శ్రీవారిభిక్షు నిమిత్తము మహా నైవేద్యము సిద్ధపరుపబడినది. ఇపుడు ముందు భాగమున పని ప్రారంభింపబడెను. పునాదులు పూర్తియైనవి. శ్రీ ఉత్తరాది మఠాధిపత్యము నిపుడు వహించియున్న శ్రీ సత్యధ్యాన తీర్థ భగవత్పాదాచార్యులవారు ఈ భవన నిర్మాణము నిమిత్తము చాల దీక్షబూని అత్యధికముగ ధన సహాయము చేయుచున్నారు. ఈ నిధికి యిప్పటికి 1163-5-8 చేరినవి. ఇందులో శ్రీ సత్యధ్యానతీర్థ భగవత్పాదాచార్యస్వాములవారును, చెన్నపురిలోని వారి ఏజెంటును సుమారు 800 రూపాయిలు యిచ్చియున్నారు. కే. కే. కానూరు రామచంద్రరావు. బి. ఏ., బి. యల్. (హైకోర్టు వకీలు) గారి భార్య మాతు శ్రీ కానూరి జానకీబాయమ్మగారు 2000 రూపాయల నొసంగిరి. తక్కిన మొత్తమును పలువు రొసంగియున్నారు. ఆంధ్ర దేశమునందలి ధార్మికులందరును ముఖ్యముగా మధ్వమతస్థులందరును శక్తివంచన లేకుండ యీనిధికి ధన సహాయము చేసి వారి గురువుల అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక! ధనమును పంపగోరువారు దిగువ రెండు చిరునామాలలో దేనికైనను పంప ప్రార్థితులు. నిర్మింపబడుచున్న ఈ భవనముయొక్క పటమిందున్నది.

బాంకి:—1. ఎస్. ఎం. ఎస్. జె. (శ్రీ మన్మధ్వ సిద్ధాంతోన్నాహినీ)నిధి లిమిటెడు, కారు స్ట్రీటు, ట్రిప్లికేను, మదరాసు.

ట్రస్టీ:—2. డాక్టరు, పి. కే. కృష్ణారావుగారు, ఎల్. ఎమ్. ఎస్. కల్యాణీహౌసు, మైలాపురు, మదరాసు.

ఇట్లు విన్నవించు విధేయులు,

టి. వి. నరసింగరావు, ఎం.ఏ., ఎల్.టి., ప్రెసిడెన్సీకాలేజి, మదరాసు.

అడ్రెసు:—సత్యానందరామాచారి, కంట్రాక్టరు, కాబినెటు మేకరు, గవర్నమెంటు ఆక్షనరు, ట్రిప్లికేను.

కార్యదర్శులు,

# తెలుఁగు బ్రాహ్మణుల తెగలు

విద్వాన్ గరిమెళ్ల సోమన్న గారు, యం.ఏ., యల్.టి.

తెలుఁగు బ్రాహ్మణులలోని తెగలు వాసములను బట్టియు, వృత్తులనుబట్టియు, వైదికమతశాఖలను బట్టియును గలిగినవి. తెలగాణ్యులు తొలుత అచ్చతెనుఁగునాటివారు. వేఁగినాటివారు వేఁగి దేశములోనివారు. కాసలనాటివారు కోసలదేశమునుండి వచ్చిరని ప్రతీతి కలదు. కాని ఇది సహేతుకమని తోఁచదు. వెలనాటివారు వెలిగనుండు దేశమువారనియు, లేక తెల్ల దేశమువారనియుఁ జెప్పఁబడును. వీరు వైదర్భులన్న వాడుక కలదు. వేఁగినాడు ఏలూరిప్రాంతము. ములికినాటివారి ప్రతి నైజాం దేశమువారని చెప్పుట కలదు. ముల్క- అనఁగా ఉరుదుభాషలో దేశము అని అర్థము. ద్రావిడులు ద్రవిడదేశమునుండి వచ్చినవారు. కరణకమ్మలు కర్ణాటకదేశవాసులు.

నియోగులు వేపార్లను వృత్తులనుబట్టి యాపేళ్లను బడసిరి. వైష్ణవులు, మాధ్వులు, స్మార్తులు అను భేదములు మతానుసారములు.

ఋగ్యజురాది వేదశాఖల వలన ఋగ్యజురాది శాఖాధ్యాయులు ఏర్పడుదురు.

ఇట్లు బహువిధముల విభాగమును జెందియున్న తెలుఁగు బ్రాహ్మణులు తమశాఖలలోనే పెండ్లిండ్లు చేసికొందురు కాని శాఖాంతరవివాహము కావింపరు. వీరిలో శిష్టులు శాఖాంతరులతోఁ గలిసి భోజనము చేయరు.

హవ్యకవ్యములలోను, ఆహారాచారములలోను భేదములేవియు లేకున్నను ఈ వేర్వేఱు తెగలవారు ఒకరితో నొకరు వివాహాది సంబంధములను గల్పించుకొనరు. ఇది గొప్ప వైపరీత్యము.

ఇంటఁ దెనుఁగు మాటాడువారు తెనుఁగువారని మనము సంకేతము పెట్టుకొనవచ్చును. ద్రావిడులును మాధ్వులలోఁ గొందఱును తమస్వభాషలను మఱచి అంతకన్న భిన్నయగు ఆంధ్రమునే యవలంబించిరి కావున వీరును ఆంధ్రులే యగుదురు. రోడ్డులు రైళ్లు మున్నగు సౌకర్యములు లేకుండిన పూర్వకాలములలో నూఱుమైళ్ల దూరమున నుండినవారు వైదేశికులుగనే యెన్నఁబడుచుండిరన్న వింత కాదు. ముందటికాలములలో దూరదేశస్థుల కుఁగోత్రములు సాధారణముగ సంశయాస్పదములగుటచే నేనాటివారు ఆనాటనే సంబంధములను గలుపుకొనుచుండిరి. ఈ నిర్ణయమును ఏలేశ్వరోపాధ్యాయుఁడు స్థిరపఱిచె నందురు. ఈ విభాగములు అకస్మాత్తుగ పుట్టియుండవు. వృత్తిగతభేదములును గూడ ఇటులనే క్రమోత్పత్తిని పొందియుండును. మతమూలకమగు భేదములు- రామానుజీయ మాధ్వాదులలోనివి- విస్తరించియున్నవి. వీరిలో పెక్కువిభాగము లున్నవి.

భిన్నశాఖలలో సమానగోత్రు లుందురు. అగాధమగు గోత్రవిషయము మన ప్రసంగమునకు తోడ్పడదు.

ఈశాఖాభేదములు పెక్కువందల యేండ్లనుండి పాటింపఁబడుచు వచ్చుచున్నందున ఒక్కొక శాఖవారికి కొన్నికొన్ని విశిష్టలక్షణములు ఏర్పడినవి. కులక్రమాగతముగ నీలక్షణములు చూపట్టుచుండెడివి. నానాదేశములవారితో సాంగత్యమును, సులభప్రయాణములును, సంకులసహవాసమును గల యీదినములలో నిట్టిలక్షణములు చాలవఱకు రూపుమాసినను వానికి అంతము కలుగలేదు. ఇవి పూర్తిగ నశించి ఆంధ్రబ్రాహ్మణులందఱు నొక్కజాతిత్వమును బొందుటకు ఇంకను కొన్నివం

దల యేర్పడ్డుట్టును. సహవాసమేగాక సహబాంధవ్యము కూడ ప్రబలినకొలంది పరస్పర పరిహాస నిందా మాత్సర్యములకు కారణములగు శాఖీయవైలక్ష్యములు అడుగంటి శాకాహార వైదికధర్మానుసర గాంధ్రభాషా వ్యవహారాదులగు ముఖ్యసాధనములు ఐక్యమును కలుగఁజేయును. అనవసరమగు శాఖాభేదములు నశింపఁజేయుట వివేకము గదా.

ఇప్పటివఱకును జరిగి వచ్చిన ప్రత్యేక శాఖీయాంతర్గుణముల ఆవిర్భావములను పరికించిన వినోదము కలుగును. తెలగాణ్యుల గుణాతిరేకమును, వేఁగినాటివారి వికటసన్యాసమును, కాసలనాటివారి పీసపు వ్యవహారమును, ములకినాటివారి ముగ్ధత్వమును, ద్రావిడుల ధార్ష్ట్యమును, నియోగుల గూఢత్వమును, వెలనాటివారి వెట్టియును, పరిహాస ప్రసంగములకు వచ్చుచుండును. ఇవి నానాటికిఁ దగ్గిపోవుచున్నను వీనినంన్న శాఖల సమ్మేళనము కాకున్నది. ఒకశాఖవారు మఱియొకశాఖతో సంబంధముచేయుచో క్రిందిసంతతివారు ఇట్టిపరిహాసములకు దగరు.

ఐక్యముకావలసిన యీదినములలో నిట్టి నామమాత్ర భేదములచే సంఘము చీలిపోవుట మనస్థహేతువు.

బ్రాహ్మణులలో వలెనే కాపులలోను గూడ వందలకొలంది విభాగములు ఏర్పడియున్నవి. ఆహారాచారములు సమానమగునప్పుడు వివాహాదిసంబంధములుండుట న్యాయము. క్షత్రియులలోను, కోమట్లలోను ఇట్టి విభాగములు తక్కువగ నున్నవి. వీరిసంఖ్య స్వల్పము, కావున వీరిలో ఐక్యము కలుగుట సులభము.

విద్యాసంపత్తిగల బ్రాహ్మణులును, ఇతరవర్ణములవారును, అనవసరములును నామమాత్రములును అగు భేదములను మాని కలిసిమెలసి జాతీయైక్యమునకు తోడ్పడుట యుక్తము. వీరినిజూచి జనసామాన్యము నడచును.



అమృతాంజనము
అన్ని నొప్పులకును
అమృతమువంటిది

చక్కని డబ్బీతో సహా
సీసా 1-కి అ. 10 మాత్రమే.







అమృతాంజనం డిపో,

మద్రాసు —— బొంబయి.

# విశ్వాసోపరత్వము

శ్రీ తత్త్వానందస్వామి

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.
యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.

## తాత్పర్యము

[సర్వభూతములందును సమదర్శనము గలవాడును నిరంతరబ్రహ్మనిష్ఠతో గూడినవాడై సమస్తభూతములందు తనను, తనయందు సమస్తభూతములను చూచుచుండును.

ఎవడు సమస్తభూతములందు నన్ను (బ్రహ్మను) జూచుచున్నాడో, నా యందు (బ్రహ్మమునందు) సర్వభూతములను జూచుచున్నాడో యట్టి వానికి నేను కనబడకుండను, నాకతడు కనబడకుండడు. (భగవాన్ శ్రీకృష్ణవచనము)]

ఈ రెండు శ్లోకములును నరుని జీవనపరమావధిని విశదముచేయుచున్నవి. పాశ్చాత్యుల పరిణామసిద్ధాంతము అనగా ప్రకృతిశాస్త్ర సాహాయ్యమున దేల్పగల సిద్ధాంతము, జీవియొక్క పరమావధియందు నిగూఢమైయున్న సర్వశక్తులను బూర్ణముగ బ్రకటించుట యని తెలుపుచున్నది. పాశ్చాత్యులు చేతనములందే సంకల్పశక్తియు ప్రయత్నశీలమును గలదని నమ్మెదరు. అచేతనములందు బరిణామము స్వతస్సిద్ధము కాదు. కావున ప్రాణములేని పదార్థరాశి యంతయు జీవుల యుపయోగార్థము సృష్టియయ్యె ననియు, ఆ పదార్థరాశిని జీవులు తమ యిష్టమువచ్చినరీతిని నుపయోగించుకొని క్రమేణా ఉన్నతదశలను బొందవలయు ననియు వారు నుడువుదురు. ఈ పరిణామక్రమమున, నచేతనములు జీవుల శరీరములందు బ్రవేశించి, వానితో సారూప్యమును బొంది సజీవము లగుట జూచుచున్నాముగదా! ఇటుల కాలము గడువగా నెన్నడో సర్వమును చైతన్యమయ మైపోవలసి వచ్చును. ప్రస్తుతము జీవకోటిలో నగ్రస్థానము వహించియున్న మానవునిగూర్చి పర్యాలోచింతము. చేతనము లచేతనములను దమకొఱకై స్వాధీనము జేసికొని నిరాఘాటముగా వినియోగించుకొనుచు స్వాభివృద్ధిని సాధించుకొనినటులనే, జీవులలో నుత్తము లధములను నిర్జించి తమ యుపయోగార్థమై వినియోగించుకొనుటయు ప్రకృతిలో గానంబడుచున్నది. చిన్నిచేపలను పెద్దచేపలు, చిన్నిపురుగులను బక్షులు, క్షుద్రజంతువులను మృగములు చంపి, తిని వర్ధిల్లుచున్నవి. ఈ ధర్మమే మానవకోటిలోను బ్రకటిత మగుచున్నది. బలహీనులను బలవంతులు, ధనహీనులను ధనవంతులు, అధికారహీనుల నధికారవంతులు, బుద్ధిహీనులను బుద్ధిమంతులు పీడించి స్వీయాభివృద్ధిని జేయుకొనుచున్నారు. బలము, ధనము, అధికారము, బుద్ధి యనువానిలో నుత్తరోత్తరము శ్రేష్ఠతరమందురు. దయాదాక్షిణ్యములు పరిణామమునకు ప్రతిబంధకములగునని పాశ్చాత్యులంగీకరింపరు. నరుని ప్రాధాన్యము, తన శక్తియుక్తుల నత్యంతమును ప్రయోగించి, శత్రువు నంత మొందించి సాధించుటలోనే ప్రకటితము కావలయును: అట్టి బలప్రయోగ మవసరములేని సామాన్యావస్థ యుండవచ్చును, అప్పుడు దయాదాక్షిణ్యాది శాంతిగుణములానుషంగికములుగ వినియోగమునకు రావచ్చును అందురు.

ఒక పాశ్చాత్యతత్త్వవేత్త నరహృదయమును బరిశోధించినవాడై దయాదాక్షిణ్యములు గనిగి వర్తింపుచు, క్షుద్రజీవుల హింసించరాదని తలచెను. మాంసాహారమును విసర్జించెను. తోడివారెల్ల వీనిని హేళన చేయసాగిరి. చాలకాల మోర్చుకొనినాడు. ఒకసమయమున నీతడు సముద్రప్రయాణము చేయుచుండెను. సముద్రమునగల విచిత్రముల బరిశీలింపసాగెను. చిన్న చిన్న పురుగులను చిరుచేపలును, చిరుచేపలను పెద్దచేపలును, వీనిని తిమింగిలములును దినుట గనిపెట్టినాడు. వాని కంతట నొక క్రొత్త స్ఫురణ కలిగినది. క్షుద్రతరజీవులు నుత్తమతర జీవుల కాహారమగుట ప్రకృతిధర్మము. కావున ప్రకృతిం గల జీవులలో నత్యుత్కృష్ట పరిణామమును బొందిన నరుడు తక్కినవానినెల్ల భక్షింపవచ్చును, అని నిర్ధారించినాడు. వెంటనే మత్స్యములను కూర వండించుకొని తిన నారంభించెనట.

భౌతికశాస్త్రనిర్ణీతమగు పరిణామసిద్ధాంతము ననుసరించి యింతవఱకు సత్యమే. నరునకు తక్కిన జీవకోటినెల్ల, యింతేల, జగమున బుట్టు సర్వమును స్వాభివృద్ధికై వినియోగించుకొను నధికారము గలదు. దీనిని భారతతత్త్వవిదులును నొప్పుకొని యుండిరి. కాని నరుని పరిణామమాత్ర ప్రపంచమున బుట్టువానినెల్ల నర్జించుటతోడను, భూతకోటి యొసగగల యానందము ననుభవించుటతోడను ముగియుట లేదని మన ఋషిసత్తములు కనిపెట్టిరి. పశువునకు దిండియు, నరునకలిమియు బ్రకాశముం గూర్చు ననిరి. పశువు తాను తిన్నదాని సౌఖ్యమునే యనుభవింపజాలును గాని, యజమాని తనకై కూర్చి, చేర్చిపెట్టియున్న దానిని జూచిగాని, స్మరించిగాని యానందమును బొందజాలదు. కొన్ని

మృగములు తమ సంతానమును సయితము నావలకు నెట్టివేసి యవి తినువానిని బలాత్కారముగ లాగికొని తినును. ఇది కేవల మృగస్వభావము. మానవులందును నిట్టివారు కలరుగాని, యెంత నికృష్టనరుడయినను నొకానొకప్పుడైన నితరుల యానందమును బంచుకొను స్వభావము ప్రకాశమునకు వచ్చుచునే యుండును. రాక తప్పదు. ఇది నరుని విశేష లక్షణము. భువిలో నెల్లెడల నన్ని జాతులందును మనుష్యస్వభావము కేవలస్వార్థపరతను దాటియే యుంట గోచరించును. అడవిమనుష్యులందు సయితము స్వకుటుంబమును, స్వసంఘమును నభిమానముతో జూచుట, వారికొఱకై స్వార్థత్యాగము జూపుట సహజముగ గోచరించును. నాగరికుల సంగతి జెప్పవలయునా? సామాన్యుల యభిమానము సజాతీయులవఱకే వ్యాపించును. ఉత్తముల యభిమానము నరసంఘము నంతటిని నిముడ్చుకొనును. ఉత్తమోత్తములు సర్వభూతదయయును, చరాచరచేతనాచేతనభేదమును గూడ నతిగమించి సర్వత్ర ప్రేమను ప్రసరింపజేతురు. బ్రహ్మవేత్త లట్టివారు. వీరు నరసంఘమునకు తలమానికము వంటివారు. వీరియందు స్త్రీపురుషపక్షపాతముగాని, స్వజనపరజనవ్యత్యాసములుగాని చూపట్టవు. సమస్తభూతకోటిని దమను వలెనే జూచుకొందురు. ఇంతేల, సమస్తభూతజాలమునందును నద్వైతపరబ్రహ్మమును సాక్షాత్కారము జేసికొందురు. ఇదియే పరమగమ్యము. అన్నిట దనను, దనయం దన్నిటిని సాక్షాత్కారము చేసికొనుట యిదియే.

అటువంటి మహాపురుషుల పవిత్రబోధల ననుసరించునప్పుడును, కొన్నియెడల, సంకుచితహృదయులగు విద్వాంసులు స్త్రీపురుషభేదములను గోరంతలను గొండంతలుగ జేసి గ్రంథముల వ్రాసియుండిరి. ఇంకను వ్రాయుచుండిరి. అటుల జేయుటకు సత్యమునుండి దృష్టి చలించుటయే హేతువు. కొందఱు స్త్రీలకు ప్రత్యేకాత్మయే లేదు, భర్తల గతియే స్త్రీలకు ప్రాప్య మనియు, పెండ్లి కాక మరణించినవారు కడుపాపులు గాన రౌరవాదినరకములే వారికి నివాసములగు ననియు వ్రాసిరి. అధ్యాత్మతత్త్వమును జక్కగ గ్రహించి, పాటింపనివారి భావము లివి. నరునకు కైవల్యము పరమప్రాప్య మనియు, నది స్త్రీపురుషులకు సమముగ సాధ్యమనియు తత్త్వకోవిదుల స్థిరాభిప్రాయ మైయున్నది. అవయవభేదములబట్టియు, కొలదివిశిష్టగుణములబట్టియు ప్రాకృతజీవనమున కించిద్భేదములు గాన్పించినను, ఆధ్యాత్మికజీవనమున సరిసమాను లనుట తథ్యము. విద్యలకెల్ల సరస్వతి యధిష్ఠానదేవత యని బోధించిన ఋషిసత్తములు స్త్రీలయెడ నలసభావమును జూపగలరా? త్రిమూర్తులను దమశక్తులను స్త్రీదేవతల రూపము నందించి వారిద్వారమున లోకపాలనము గావింతురని బోధించిన మునివరులు స్త్రీలను హేయముగ జూడగలరా? స్త్రీలను మహాసభలలో మధ్యవర్తులనుగ నంగీకరించి మహాతత్త్వచర్చలను జరిపిన బుధవరేణ్యులు స్త్రీలను తూష్ణీంభావముతోడ నైన దలంపగలరా? అందుచేతగదా సమస్తదేవతల నాహ్వానించి పూజించునప్పుడు మున్ముందు వారి భార్యలను జేర్కొనుచుందురు. వాణీహిరణ్యగర్భాభ్యాం నమః, ఉమామహేశ్వరాభ్యాం నమః అందురుగదా! మనయిండ్లలో వ్రతములు, నోములు, నిత్యనైమిత్తికకర్మలను నడుపునప్పుడు ముందుగ బుణ్యాంగనలను గాదా బూజింతుము? నిజమును గమనించుచో స్త్రీలయెడ నొకింత గౌరవాధిక్యమునే మన పెద్దలు విధించిరి. ఇతరదేశములందు నిటులే యున్నది. అది సాంఘికాచార, రాజకీయసంస్థలందు ప్రకటితమగుచున్నది.

కాని యాధునికనాగరికమున, పశుబలమునకు నైతికాధ్యాత్మికబలములు జోహారొనర్చు కాలమున, మన స్త్రీలకు నిమ్నదశ ప్రాప్తించి నదనుట నిజము. ఇది సనాతనధర్మము కాదు. పూర్వపుగ్రంథములందును స్త్రీజాతి నరుని నధోగతికి దెచ్చుటలో ప్రధానకారణముగ వర్ణింపబడియున్న దేల యని శంకింతురు. కేవలలింగభేదమును పాటించి వివరణములు చేయవలసిన సందర్భములందు తప్ప, సర్వత్రపురుషునే నరజాతి కంతకును ప్రతినిధిగ జేర్కొనుట సామాన్యధర్మము. ప్రపంచమున నెల్లెడలను నిట్లే జరిగినది. కావున ధర్మార్థకామమోక్షము లను పురుషార్థములం దెల్లెడల స్త్రీకిని పురుషునితో సమానాధికారము గలదనుట స్పష్టము. మగవారిలోనే వారివారి శరీరావయవదార్ఢ్యమునుబట్టియు, బుద్ధికుశలతనుబట్టియు, నైతికాధ్యాత్మికప్రభావమును బట్టియు కర్మభేదమును విధించునటుల, కొన్ని విశిష్టలక్షణభేదములను బట్టి స్త్రీపురుషులు నిర్వహింపవలయు కార్యములందు భేదము లుండుట న్యాయము, ననివార్యము నగును. కాని చతుర్విధపురుషార్థములందును నేపాటిభేదమును లేదు. అయినను వైరాగ్యప్రకరణములందు పెక్కుగ్రంథములలో స్త్రీనింద స్ఫుటముగ గోచరించుట కలదు. పైన వివరించినటుల సంఘనీతుల ప్రస్తావించుపట్ల మానవజాతికి ప్రతినిధిగ మగవానిని జేర్కొనుట సహజము గాన, నరుని పతనమునకు స్త్రీ హేతువైనట్లు వర్ణించుచో నట్లు చేసియుండిరి. స్త్రీని ప్రతినిధిగ గొని వ్రాసినయెడల పురుషుని సయితము నటులనే వర్ణించియుందురు. అనివార్యమగు స్థలములందుదప్ప సాంఘికరాజకీయశాసనములందెల్ల నరుడన్న నారియనియు నర్థముచేసికొనక తీరదు. తనతోడి మానవుని స్వాస్థ్యమును భంగపఱుపగూడ దనిన, స్త్రీస్వాస్థ్యమును భంగపఱుపరాదను నియమ మందు లేదనవచ్చునా? అటులనే మోహనివారకముగా త్వక్చక్షుఃశ్రోత్రాదులను హేయములుగ వర్ణించుపట్టుల స్త్రీని చేర్కొనినంతమాత్రాన, వివేకము కొఱవడిన కొందఱు స్త్రీల ననాదరముగ జూచుటయు, ఘోరశత్రువులని వచించుటయు నక్రమము. స్త్రీల చక్షుఃశ్రోత్రాదులు మోహజనకము లగుచో, నట్టికన్నులు, చెవులు గల పురుషులు స్త్రీలమోహమునకు గారకు లగుట లేదా? స్త్రీలశరీరములు మాత్రము రక్తము, మాంసము, నెముకలు, చీము, మలనాళములతో గూడియున్నవనిన పురుషుల తనువులు నటుల లేవా? వజ్రములు, బంగారు, సుగంధద్రవ్యములతో నిర్మితములై, యట్టిద్రవ్యములతోడ

ప్రవర్ధనము గాంచు పురుషశరీరములు గలవా? పశుభావముతో వర్తించి విషయలోలురగుచో, స్త్రీలు పురుషుల కంతటియపకారులో, పురుషులును స్త్రీల కంతటియపకారులే యగుదురు. పురుషార్థసాధనమున నుపకరింతురేని పరస్పరము గురుప్రాయులగుచు, మగవా రెంత మాన్యులో యాడువారు నంత పూజనీయులే. అన్యముగ దలచుట దురహంకారమనదగును.

అనివార్యములగు భేదములు, నరులందు స్త్రీపురుషవివక్షత లేకయే కానంబడుచున్నవి. వానిని పాటించియే సంఘనిర్మాణమున వర్ణవ్యవస్థ యేర్పఱచిరి. ఆశ్రమవ్యవస్థ ఒకేనరుడు తన జీవితమున వేర్వేఱవస్థలం దెట్లు వర్తింపవలయునో తెలుపును. ఇది యెల్లజనులకును సమానమే. అయినను వ్యష్టియొక్క గుణభేదములనుబట్టి కొన్నిమార్పు లుండవచ్చును. సమష్టిసంఘవ్యవస్థయగు వర్ణమునుగూర్చి విచారింతము. పశువులందు స్వార్థపరత్వమును, పరస్పరస్పర్ధయు, హింసయు సహజములైయుండ, నరునందు పరస్పరసహకారము, మైత్రి, కరుణ మున్నగు లక్షణములు సహజములుగ నుండును. కొందఱియం దివి మందప్రకాశము గలవిగ నుండును; మఱికొందఱియం దివి స్ఫుటముగ బ్రకాశించుచుండవచ్చును. వీనిని ప్రవర్ధనము గావించుకొని దైవత్వమును సంపాదించుట మానవధర్మము. తమతమ గుణగణముల కనుసరణములగు ధర్మసాధనల నేర్పఱచుకొని, పరస్పరస్పర్ధలు లేక, పరస్పరసహకారముగలిగి జీవనము గడపుటకే వర్ణవ్యవస్థను ఋషివరులు నియమించిరి. సమష్టిక్షేమమును, వ్యష్టిమోక్షమును నొకదానికొకటి ప్రతిబంధకముగాకుండ చేకూరుటకు వర్ణవ్యవస్థ మిగుల నుపకరించును. ప్రతివాడును దన పూర్వుల వృత్తి ననుసరించి జీవనముచేయుట ప్రధానసూత్రము. సామాన్యముగా దండ్రివృత్తి కొమారునకు సులభముగ నలవడును. జీవనమునకై విశేషశ్రమ లేకుండను నానందముతోడను పనిచేయువానికి బుద్ధివికాసము నొందును. పరమార్థచింతనమున కవకాశము మెండుగ లభించును. అతితృష్ణ పీడింపదు. ఎవని సహజగుణముల ననుసరించి వాడు వృత్తిజేయుచో, నుత్సాహము పెంపొందును. పను లతికౌశలముతో నెఱవేరి యానందము నొసగును. తాను చేయు పనులను శ్రేష్ఠముగ నొనర్చుటచే గల్గు నానందమే సత్యమైనది. ధనార్జనముచే గలుగు నానందము కృత్రిమమైనది, అతి చంచలమైనది. ఈనాడు సర్వజీవన వ్యవహారములును డబ్బుతో సంబంధపడుటచేతను, ధనసంపన్నత ననుసరించి గౌరవపరిమితు లేర్పడుటచేతను మానవజీవితము కృత్రిమమై చెడినదని విజ్ఞులెల్లరు గమనించియున్నారు. పూర్వకాలమున నెందఱో విద్యాధికులు పేదరికమును గౌరవభావముగ నెంచి తమ బుద్ధివిశేషము నాధ్యాత్మికతత్త్వాన్వేషణమున వినియోగించియుండిరి. ఎందఱోశిల్పులు తమచిత్రరచనలచే రారాజులను మెప్పించి, నగరములను, పుణ్యక్షేత్రములను దివ్యముగ నలంకరించి, కాసునైన గూడబెట్ట నెంచరైరి. క్షత్రవీరు లెందఱో ధర్మరక్షణార్థమై ప్రాణముల నర్పించి కీర్తి వహించిరేగాని ధనరాసులపై దమ గణ్యతను నిలుపజూడలేదు. వైశ్యులు సహా తాము సంపదలను సముపార్జించినను వానిని దానధర్మములకును, దేశక్షేమమునకును వినియోగించిరేగాని వ్యష్టిభోగములకై కూడబెట్టినవారు కారు. ఆనాటి శూద్రులును దమకు హైన్యము గలిగెనని యెన్నడును శోకింపక, దేశాభ్యుదయమునకై తమ బలోన్నతుల నర్పణము చేసిరి. ఈనాడైనను ధనము, అధికారము, కృత్రిమబిరుదములు దూరముగ నుంచి, నరుని యోగ్యచరితలే గౌరవమునకు ముఖ్యాధారములుగ నంగీకరించితిమా, తత్క్షణమే దేశశాంతియు, లోకశాంతియు చేకూరుటేగాక ప్రతినరుడును నత్యంతసంతుష్టితో దనలో నిగూఢమైయున్న విశిష్టప్రతిభను బ్రకటించి సత్యమగు నానందమును బడయగలడు. అప్పుడు వృత్తులన్నింటికిని సమానగౌరవమే యుండును. చాకచక్యప్రదర్శనమును, పరోపకారపారీణతయు, ఉన్నతభావప్రకటనమును మాత్రము గౌరవమునకు లక్ష్యములు కాగలవు. అప్పుడు ప్రతివాడును తనతండ్రివృత్తినే యవలంబించుట తన ప్రతిభావిశేషమును బ్రకటించు మార్గమని తెలిసి యభ్యున్నతిని సాధింపగలడు. సమష్టిని దేశమంతయు తేజోవంతములగు సంఘములతో చెన్నారగలదు. వ్యష్టి సమష్టిని దనలో నిముడ్చుకొని నట్లగును.

ఒకరి నొకరు గౌరవించుట యనగా నొకరు చేసిన కార్యముయొక్క శ్రేష్ఠతను గమనించి, యందుచేత మనస్సున పొడమిన భక్త్యానందముల వెలువరించుటే గాని, యొకరు తన నీచత్వము నంగీకరించుటయు, వేఱొకరు తన యౌదార్యత్వమును జూపి యితరుల నిరసించుటయు నని భావము కాదు. శ్రీ వివేకానందస్వాములవారు సెలవిచ్చినటుల పీఠులను నిర్మలముగ నూడ్చునతడు సింహాసనాధిష్ఠితుడై ధర్మపాలనమున నేమరు ప్రభువుకంటెను సంఘబోధకుడై విద్యాప్రచారము చేయ నసమర్థుడగు నుపదేష్టకంటెను శ్రేష్ఠతరుడనియు, హెచ్చు గౌరవనీయుడనియు గ్రహింపవలయును. మఱియు వీరందఱును దమ తమ విధుల జక్కగ నెరవేర్చినచో సమానముగ గౌరవార్హు లగుదురు. ఒకరు వేఱొకనికంటె నధికుడనని యెదుటివానిని హీనునిగ జూడనొల్లదు. ఎవరిధర్మము వారిది. వారివారి ధర్మమును జక్కగ నిర్వహించువారు సర్వపూజ్యులు. ఇట్టి సందర్భమున నెవడును తన వంశానుగత వృత్తిని నిరసించి యన్యవృత్తిని బూను నవసర ముండదు. సకృత్తుగా దన తండ్రివృత్తి కనర్హుడగువాడు గావచ్చును. అతడు తన కనుకూలమగు వృత్తిని బూని గౌరవభంగము లేకయే జీవింపవచ్చును. సామాన్యముగా నెవడును వృత్తిని మార్చుకొన నెంచడు. దేహకష్టసుఖముల పాటించి వృత్తిని మార్చుకొను నుత్సాహము సహజముకాదు. ధనము, అధికారము, కృత్రిమగౌరవము మున్నగునవి దుష్ప్రేరణకు మూలములగుచో మాత్రమే, యట్టి స్పర్ధలు సంఘటిలును. సంపద లేవి యున్నను నవి సమష్టిసంఘమున కుపకరించునవిగ నుండవలెను; వ్యష్టి వాని కధిపతిగ నుండరాదు. అప్పుడు ఒకవడ్రంగి కమ్మరి గావలయు ననిగాని, కమ్మరి

బడి పంతులు కావలయు ననిగాని, బడి పంతులు పత్రికము చేయవలయు ననికాని, పత్రికుడు రాజకీయోద్యోగి కావలయు ననిగాని, రాజకీయోద్యోగి వ్యవసాయకుడు గానెంచుట గాని, వ్యవసాయకుడు సంగీతసాహిత్యముల గడించవలయు ననిగాని సమాజపరిస్థితులలో నేర్పడవు. అట్టిమార్పులవలన నెవరును లాభ ముండు నని తలపరు. ఒక్కకుటుంబములోని సోదరులు పరస్పరప్రేమ, ధర్మశీలము నున్నయెడ, కష్టసుఖములమితో స్పర్థలకు దిగి యొకరినొకరు నిందించుకొనుట జూడము. పొలములలో కాయకష్టముచేయు సోదరుని నింటికడ కూర్చుండి పెత్తనము చేయు మనిన నొడంబడడు. ఎందువలన? అతనికి దాను చేయు పనిలో హాయి గలదు. హీనత లేనిపట్ల, పెత్తనముచేయు పనికై మార్పు జెంద నుత్సహింపడు. కాయపుష్టిగల్గి నిరాడంబరుడగు వానికి మోటారుకారులో విహారములు సల్పుట యసహ్యముగ నుండును. బలహీనుడై తనయశక్తతను గప్పిపుచ్చుటకు మోటారులలో దిరుగాడువాతడు గుట్టు వెలువడుచో దలవంచుకొనక తీరదు. ప్రతివాడును చేయు పని తనకును, సంఘమునకును ప్రయోజనకరముగ నున్నదా లేదా? ధర్మవిరుద్ధముగ లేదుగదా! ఆత్మనిష్ఫూరణకు దోడ్పడుచున్నదా? అను విమర్శనకుమాత్రమే నిలువనలసియుండును. కృత్రిమపు తారతమ్యము లుండదగదు. వేరులచేత వృత్తులందు గౌరవాగౌరవములను ప్రవేశపెట్టుట యవివేకము.

చిన్నకథ యొకటి కలదు. ఒక యూరిలో జనసంఖ్య హెచ్చైనది. చోటు చాలుట లేదు. చుట్టుపట్టులను తగిన వసవకాశములు లేవు. ఒక బుద్ధిమంతుడు దూరముగా బోయి యొకలంకలో నూతనముగా నొక యధినివేశమును నెలకొలుప నుద్దేశించి తనయూహను గ్రామములోని వారికి దెలిపెను. వీనికడ కొక మేధావి వచ్చి, "నేను మీ యధినివేశమున బరిపాలకుడనుగ నుండి, యందలి పనిపాటుల విమర్శింతును, మీ క్షేమలాభముల నరయుచుందు"నని చెప్పెను. అందు కాయన "నాతో వచ్చువా రందఱును న్యాయముగ సమష్టిక్షేమమునకై పాటుపడెడివారుగ నుండవలెను. ప్రాల్మాలికలు, మోసములు చేయువారలను నేను దీసికొనిపోను. కావున నీవంటి యుద్యోగి యవసరము లే"దనెను. ఇంకొకడు వచ్చి, "నేను బలశాలిని, ధైర్యముగలవాడను. ఎటువంటి పోగిరుబోతునైనను నణపగలను. కనుసన్నచేత నే నెల్లరను విధేయులను జేతును. మిమ్మందఱ రక్షింపుచుందు"ననెను. వీనినిగూడ నంగీకరింపక, "యధినివేశములో మేము పరస్పరము కొట్లాటలు జరుపుకొనము; అట్టి దురవస్థ మూడినప్పుడు నిన్ను కోరుకొందు"మని జవాబు చెప్పినాడు. మూడవవాడు వచ్చి, "నేను మీరు పండించు పంటను దగుకతిని రక్షించి మీకు వలయుదానికి మించినపంటను దూరప్రదేశములకు గొనిపోవుచు, మీకు వలయువాని నచ్చటినుండి తెచ్చిపెట్టుచు నుపచారము చేతును" అనెను. అందు కాయన "మేము పండించు సర్వమును నీయధీనము చేతుము. దాని రక్షణకు నీవు బాధ్యుడవై యుండవలయును. అదంతయు నీ వను భ్రాంతిని బొందదగదు. మాతోపాటు నీవును యథేచ్ఛగా ననుభవింపుము. ఇందు కొడంబడిన నీవు రావచ్చు"ననెను. నాలవవాడు వచ్చెను. "నేను బలముగలవాడనే కాని బుద్ధిబలమును నాకు భగవంతుడు డొసగలేదు. ఎవరేపని చెప్పినను శక్తివంచనలేక చేసెదను. మీతోపాటు సర్వవిధముల నాదరించిన చాలు"ననెను. "సోదరా! నీవే కావలె. ఇట్టివారనేకులు కావలెను. అధినివేశాభివృద్ధి మీవంటివారిపై నాధారపడియుండును. నీకు గౌరవమునకు మా యధినివేశమున నేపాటికొఱతయు నుండదు. రమ్మ"నెను. ఇంకొకడు వచ్చెను. "నేను మీకు వలయు వస్తూపకరణములను నిర్మించెదను. మీ మీ కర్మలందు నుపాయముల దెల్పుచుందును. నూతనవిషయముల గనిపట్టుచుండును. కాని నామాట చెప్పిన నాతో సహకారము సలుపువారు కొందఱు కావలసియుండు"ననెను. అందుకాయన "సోదరా, మేమందఱమును నీకు సహకారము చేతుము. నీవు లేనిచో మేమేమి చేయగలము! కాని యెన్నడును మాపై నహంకారమును జూపవలదు. మాకు తోడునీడవై నాతోపాటు సుఖముల బడయుము." అనెను. ఇంకొకడు వచ్చెను. "నేను వైద్యుడను. మీకు రోగములు వచ్చినప్పుడు కాపాడెదను. నేను దాపున నుండిన మీకనేకవిధముల ధైర్యము కలుగును. అధినివేశమునకు ప్రాణదాతనై యుందు"ననెను. అందు కా బుద్ధిశాలి "నాయనా! సోమరులకు నీయుపయోగ మెంతయు గలదు. మాలో మితిమీరి తినువారు, పనిపాటులు మాని వ్యర్థముగ జీవించువారు, రోగముల కాస్పదులగువారు నుండరు. కావున నిన్ను దోడ్కొని పోజాల"ననెను. ఇట్లు కొందఱు నూతనసంఘముగ నేర్పడి యొకయధినివేశమును స్థాపించి చిరకాలముననే మహోన్నతదశకు వచ్చిరట. స్వార్థపరతయు, పరస్పరనిరసనలును, సోమరితనమును లేక యాదర్శప్రాయులుగ నుండిరట.

పూర్వఋషులచేత నిట్టి పరస్పరసహకారధర్మముపైన వర్ణవ్యవస్థ నిర్మింపబడెను. గుణకర్మలను బట్టి కార్యములందు భేదము లున్నను గౌరవభాజనములందు వ్యత్యాసములు లేవు. శక్తియుక్తులు హెచ్చుగ నున్నకొలదిని హెచ్చుబాధ్యత వహించి శ్రేష్ఠతరసేవ యొనర్చుటే దీనికి సూత్రము. ఇట్టిబాధ్యత గుర్తింపబడినచో తృష్ణాపిశాచమున కవకాశ ముండదు. తృష్ణ లేక యపకృతులు సాగవు. అపకృతులు లేనిచో క్రోధమున కవకాశ ముండదు. సర్వమును ప్రేమమయమై విరాజిలును. క్రీస్తు తర్వాతనెవ రధిపతులుగ నుండవలయునని వానిశిష్యులలో వివాద గలిగినప్పుడు, "మీలో నెవ డందఱికంటె తుదను తన మేలును జూచుకొని, సమష్టినందఱకు హెచ్చుసేవ చేయగలడో వాడు మీలో నధిపతి యగుగాక" యని బోధించినాడు. ఇట్లొక్కొక్క జనశ్రేణియు జక్కబడెనేని, కొన్ని జనశ్రేణులు రాష్ట్రములుగను, రాష్ట్రములు సామ్రాజ్యములుగను, సామ్రాజ్యములు విశ్వమానవకుటుంబముగను నేర్పడి పరిపూర్ణానందముతో ప్రకాశించును. పాశ్చాత్యదేశముల

పల్లెటూళ్ల నిప్పుడు వర్ణవ్యవస్థానిరూపణకై కృషి చేయబడుచున్నది. కాని వారు నైతికబాధ్యతపైన గాక సంపద నార్జించు కౌశలముమీద నిర్మాణమును సాగింప నెంచుటచే కృతకృత్యులగుట లేదు. వారి ననుకరించి భారతీయులు కొందఱు సంఘనిర్మాణమునకు గడంగుచున్నారు. ప్రేమ నాధారముగ జేసికొని, త్యాగముతో వర్తించినయెడల నీసేరు లేయున్నను మానినను, వర్ణనియమములు ప్రతి జనసమాజమునందును నెలకొని, యత్యంతశుభదాయకములు కాగలవు. విశ్వసోదరభావమే దీనికి మూలసూత్రము. సమానసంపదలును, సమాధికారములును గావు.

ప్రతివాడును భాగ్యభోగ్యముల కాసించి, యున్నతపదవిని గోరుచున్నాడేగాని, యున్నతపదవి నధిష్ఠించినకొలదిని హెచ్చుబాధ్యతను వహించి సేవచేయుదు ననువాడు కానరాడు. తన స్వధర్మమును శక్తికొలది నెఱవేర్చినా యను చింతను విడిచి, నాకింతకంటె హెచ్చు లాభము వచ్చు నుపాయము లేదాయని ప్రతివాడును తలపోయుచున్నాడు. అసలు తనలో విశ్వమంతయు నిముడ్చుకొనవలయునని అత్యాశయేగాని, విశ్వమునంతటిలో దాను నిండియుండ గోరుట లేదు. వ్యష్టిదృష్టిలో సమష్టిదృష్టిని లయముచేయు యత్నము జరుగుచున్నది గాని, వ్యష్టిని సమష్టిలో లీనముచేయు సద్భావము జూపట్టుట లేదు. సమష్టి సంకుచితము చేయబడుచున్నది గాని, వ్యష్టి వికాసము నందుట లేదు. నేనింత కూడబెట్టుకొని, దాని నితరులకు దొరకకుండ జేయగలనా యను తలంపేగాని నావలన నెందఱి కొంపలు కూలుపడెను? యను విచారణ లేదు. పరదేశములనుండి సంపదలను గొనిరా వీలులేని భారతదేశమువంటి దేశములో ధనాఢ్యులు, నధికారధూర్వహులు పెరుగుచుండి రనగా వేనవేలుమంది యింకను దారిద్ర్యములో నడగద్రొక్కబడుచు, స్వాస్థ్యహీను లగుచుండిరని యర్థము. ఈనైఖరి వర్ణధర్మమున కెంతయు వేరుపురుగు వంటిది. విశ్వసోదరభావమును సంకురనీయకుండనే దిగమ్రింగును.

ఒకసంఘమున నెంతమంది త్యాగులు, కరుణాతురు లుండిన నంత ప్రకాశించును. ధనకాంక్షులు, పరపీడకులు నెంత హెచ్చుగా నుండిన నంత కృశించును. గుణములు, కర్మలే ప్రధానములు గాగల సంఘనిర్మాణము దైవీయము, తద్వ్యతిరిక్తమైన సంఘము కేవల మాసురము. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" అనుటలో భగవంతుని పక్షపాతముగాని, నిష్కారణముగాని లేదు. ప్రతివానికిని ఆత్మవికాసమున కత్యంతానుకూలనియమమును సమకూర్చితి నని చెప్పియున్నాడు. ఆయన స్వధర్మనిర్వహణమునే సంఘపు పునాదిగా జేసి, లాభాలాభములు విచార్యములు గావని బోధించి యట్టి యపోహను దొలగించియున్నాడు. "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన". ఎన్నడును ఫలాపేక్ష వలదని నొక్కి చెప్పియున్నాడు. సర్వసృష్టితోను నైక్యము, పరిపూర్ణపరమాత్మయందైక్యము గాంచినవాడయి నరసత్తముడు ఫలమును గోర్చి యేమి గణించ చేయగలడు? ప్రయత్నము సమగ్రమును, తీవ్రమును, నిర్దుష్టమును నైయుండవలయును. విశ్వసోదరభావసాధనయే యిది.

"ఓం సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః,
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖ మాప్నుయాత్".

తా. ఎల్లెడల సుఖు లుందురుగాక. అందఱు నారోగ్యముగ నుందురుగాక. అందఱు సుఖముల గాంతురుగాక. దుఃఖ మెంతమాత్రమును పొందకుందురుగాక.

సోదరసోదరీరత్నములారా! అనుక్షణము దీనిని సంస్మరింపుచు మీ జీవితముల ధన్యముల గావించుకొందురుగాక! వర్ణవ్యవస్థయొక్క పూర్ణసత్ఫలము ననుభవింతురుగాక. విశ్వసోదరభావము సర్వత్ర ప్రకాశించుగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# పద్మిని

చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి గారు

అరరె! భవన్మనోహర సహస్రనిశాతకర ప్రహార దు
స్తరపరితాపమంది పెలుచన్ మదకుంజర మంబుజాప్తు నె
త్తెఱంగున మీఱనేకరఁ దదీయ మనోరమమై చెలంగునిన్
జెఱపఁదలంచిరా; కమలినీ! వెసఁ దత్కర మంద నేర్చితే!.

కమలధవుండు నీ నడతఁ గన్గొని యేమితలంచు నొక్కొ! నీ
రమణుఁ డెఱుంగమిన్ గజకరగ్రహణ ప్రభవానురాగ సం
భ్రమమునఁ జొక్కి నిక్కెదవు పద్మిని! నీదు ప్రవర్తనంబు లో
కమునకు వెల్లడింపి కులగౌరవముల్ నశియింపఁ జేయుచున్.

ఎంతటిదానవే కమలినీ! యిటులన్ బరపూరుషాళికిన్
స్వాంతమొసంగ వేశ్యగతి బాపురె! నీదుప్రభావమేని నో
రంత యెరుంగవయ్యొ! కమలాలయ కీవు గృహాంబ వద్దియున్
సుంతయటుండ; నంబురుహసూతికిఁ దల్లివికాదె చెప్పుమా!.

ధృతిఁబోనాడి సరోజినీ! పడుపువృత్తిన్ బూన; వేడ్కన్ మధు
వ్రతమన్ వేడుక కాడు, దావకసుధాపానం బపేక్షించి; నీ
రతిగోరన్ మొగమోడి ప్రాణపతినిన్ రంజింప కీవే [1] యధః
పతనంబెంచియు జారు రేయిబవలున్ బాటింపకన్ గూడవే!

"ధవుఁ డరుదెంచె"నంచు విని తత్తరమందుచుఁ గృత్రిమంపు లే
నవు విరజిల్లుచున్, దగు వినమ్రతఁ జూపుచు నూర్పులూర్చుచున్
ధవుని గమించు జారిణి విధంబున; నీ మగఁ డేగుదెంచఁగా
నవుచు, వియోగపుంబొగల నన్ నిగుడించెదు తేంట్లఁ బద్మినీ!.

[2] ఎంతటిదాన వైతివె భళీ! నళినీలలితాంగి పద్మినీ
కాంతుని మోసగించితివి కాపురముండెడి లచ్చికండ్లకున్
గంతలు గట్టనేర్చితివి కంజభవుం డిది కానఁడిందుకే
"యింతుల నమ్మరా"దని వచించెడి పెద్దలపల్కు కల్లయే.

"గురునకుఁ బంగనామమిడఁ గోరిన చందురు డిప్ప మ [3] ద్వసు
స్ఫురణను వృద్ధిఁ బొంది ననుఁ జూచె నగౌరవవృత్తి" నంచు న
ల్కరవి, సుధాంశుపాతము దలంపఁగఁ బద్మిని! చంద్రుఁ డట్ల భా
స్కరునకుఁ గోరెఁ; "ధాత్రి నొకకాంతకు నిర్వురు బోరు కైవడిన్."

ఉపసంహారము అలుక వహింపకమ్మ! నిను నారడిబెట్టితినంచుఁ బద్మినీ!
కల దొక విన్నపంబు విను కౌరవముఖ్యుఁడు దండ్రి సెప్పు ప
ల్కుల వినకున్న, వాని విని లోకము నీతి గ్రహించెగాదె! య
ట్టులఁ దలపంగ నీ కివి కఠోరములైనను నీతులే గదా!.

1 అధఃపతనము=అస్తమానము. అనగా సూర్యుఁడస్తమించిన వెంటనే పద్మము ముకుళించుకొనును. అట్టితరత్ద్రప పానమత్తతచే నందు తుమ్మెదలు బంధింపఁబడి యుండుననుట. 2 ఈపద్యము మదీయ కల్యాణరాధామాధవనాటకమునుండి సంగ్రహింపఁ బడినదని మనవి. 3 వసు శబ్దము, ధనమందును, కిరణమందును వర్తించునని యూహింపఁదగు.

# దైవందిన్నె : వేంకటేశ్వరుఁడు

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

పదిమందిలో పచ్చపచ్చఁగా నుండక కొండలఁబడియుండు కొఁదువ తీఱ
"కడుబీదనని మొఱ్ఱలిడిన వీడక నెత్తి బాఁదెచ్చునఁ గోను" నన్న మచ్చ మాయ
"గొఱిగించి చెప్పుతోఁ గొట్టించి నామమ్ము దిద్దించు" నను నప్రతిష్ఠ వోవ
"లోక మచ్చెరువంద లోభినై వడ్డికాసులఁ గూర్తు" నన్నట్టి కొఱఁత తొలఁగ
తిరుపతి నగంబునందుఁ గాపురము మాని - ప్రీతి నేఁటికి నింక చేరితివటోయి!
శ్రీయువతి వెంటఁగొని ? రామరాయచిత్త - శరణ! జగదీశ! వేంకటేశ్వర నమోస్తు.

పరపతిచెడి తిరుపతివిడి - నరపతియగు రామవిభుని నగరమునకుఁ గా
పురమును మార్చితివో ; శ్రీవర ! సర్వవ్యాపకతను పాటించుటయో ?
ధరణి బీటలువోవ బెరయు బీరెండలు నిండారు పండువెన్నెలలు గాఁగ
పల్వలంబులఁజిక్కు పంకిలజలములు కమనీయగంగోదకములు గాఁగ
బడబడ సుడిసి వీచెడు వడగాడ్పులు మెల్లని చలువతెమ్మెరలు గాఁగ
దురుసుగ్రామీణులు త్రోవద్రోపు త్రొక్కిడి సురకోటి నోరసిడి కరణిగాఁగ
భవవినాశక ! భవదీయపాదపద్మ - భక్తితాత్పర్యమునఁ బారవశ్యమొనసి
తనిసితిమి, తండ్రి ! నీమహోత్సవమునందు - వేంకటేశ ! అనంతరవిప్రకాశ ! .

మలినపదార్థసంకలితమ్ములౌ పాడుకిడల్లె విపణిమార్గమ్ములయ్యె
కర్కశపాషాణకంటకావృతములౌ నిమ్ములు నాట్యరంగమ్ములయ్యె
సూకరఘుర్ఘురవ్యాకీర్ణ కశ్మలస్థలములు సంగీతశాలలయ్యె
పూతిగంధంబులఁ బొలుచు బీదల కుటీరమ్ములే, యంతఃపురమ్ములయ్యె
చెన్నపురమయ్యె దైవముదిన్నెపల్లె - విమలమతి, నీకు మా రామవిభుఁడు జరుపు
తేరుతిరునాళ్ల సంబ్రంపు దినములందు - విగతభవపాశ ! జగదీశ ! వేంకటేశ ! .

నిను దివ్యరథమున నిండుభక్తిని నిల్పి తానంతఁ జోదకత్వము వహించు
నిన్నుఁ బల్యంకిక నీటుగా నెక్కించి తానంత వాహకత్వము వహించు
నిన్ను భూషణముల నెఱి నలంకృతుఁ జేసి తానంత సత్కవిత్వము వహించు
నిను నిండుకొల్వున నినుపార నెలకొల్పి తానంత గాయకత్వము వహించు
నీకు భక్తుండు, మఱియును మాకు సఖుఁడు - రామరాణ్మౌళి, తన్నృపరత్నమునకు
చిరసుఖైశ్వర్యములు దయసేయుమయ్య - విశ్వవిశ్వేశ! మా తండ్రి వేంకటేశ! .

* శ్రీగద్వాల ప్రభువులకు వియ్యంకులును, మహైశ్వర్య విరాజితులును, దేవ బ్రాహ్మణ భక్తితత్పరులును, కవిపోషణ బద్ధకంకణులును, స్వయము కవులును, రసికావతంసులును, నగు మ-రా-రా-శ్రీ ఆర్. రామరెడ్డిగారు బళ్లారిజిల్లా, దైవముదిన్నె యను గ్రామమున జరిగించు శ్రీలక్ష్మీవేంకటేశ్వర కల్యాణోత్సవము సందర్భమున వాకువుగా నప్పుడప్పుడు రచించిన పద్యములు.



# భిక్షాపాత్రము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు, బి. ఏ.

పయిపయిఁ దేలియాడి కనుపట్టెడు వస్తువు మీఁదఁ జిత్ర మే
మియొ? యనఁ జిన్నచుక్కవయి మెల్లన నల్లఁగ విస్తరిల్లి యిం
తయి మఱి యింతయై క్షణమునం దొక భీకరభైక్షపాత్ర రూ
పయి కనవత్తు వీవె తొలియర్థము లెల్ల యదృశ్యమై చనన్.

కమనీయసాంధ్యరాగప్రభావృంతంబు గాంచుచో నెదుట నిన్ గాంతు నేల?
లలితవసంతపల్లవఖాది కోకిల పాడుచో నీవె కన్పడుదు వేల?
కోమలమాగుతాంకూరపరంపరల్ సోఁకినయప్డు నిన్ జూతు నేల?
పరిఫుల్లహల్లకపటలపరీమళం బెనయఁ గాంచెద నిన్నె యెదుట నేల?
స్వాదుభోజ్యాదులం గాంచు భాగ్యమబ్బ-నెదుటనే నీవు గనవత్తు వేల? నీవు
లేక యుండు ప్రపంచంబు లేదొ! యిట్టి-భావ మేల? భిక్షాపాత్రమా వచింపు.

అక్కట! యిట్లు దోఁచు కుహనాకృతి పూరక యుండలేకయో
ప్రక్కలు ప్రబ్బి యుబ్బి చికురంబులు ఫాలము నక్షులున్ జెవుల్
చెక్కులు ముక్కు నోరుఁ గల చిత్రవికార మొకంపు దాల్చి నా
దిక్కునఁ జూడ్కి నిల్పి వెనుదీయక నవ్వుచు వెక్కిరించుటల్!

వ్రాసి కట్టలు గట్టి పైచిన గ్రంథాళి వెల్లనౌ మషిఁ జూపి మెల్ల నగుదు
వ్యాసాల నిర్మించు నుత్తమపత్రిక లిట్టివా? యని చూపి మిట్టి నగుదు
వాంధ్రముద్రణదోష మడఁగింపఁ దలపెట్టు పరికరంబులఁ జూపి మురిసి నగుదు
వసతికాలము క్రింద నపహృత మగు విత్త మత్తకుండఁగఁ జూపి మొత్త నగుదు



సజ్జనార్త్తసంపోషణ సక్రమవ్య-యాధరీకృత కష్టసమార్జితాల్ప
వేతనముఁ జూపి యెడలెల్ల విఱుగ నగుదు-వేల భిక్షుకపాత్రమా కేలిసేయ?

ననుఁ గని వెక్కిరించు యతనంబున ఫాలము గడ్డ మేడకో
చనెఁ గనుదోయి మూఁతవడె సన్నగిలెన్ బెనుజెక్కు లొయ్యనొ
య్యన కడుబోసిమై వికటహాసము నూనెను నోరు క్రూరపుం
దను పదె మిన్ను మిన్నునఁ గనంబడు చిత్రము నీదుచూపునన్!

మాయానిస్తుల వక్రభావ వికస న్మందస్మితాభీల మా
నా యాస్యం బిది యేమి యొక్క త్రుటి బ్రహ్మాండంబు లన్నింటినిన్
మాయింపన్ జను కాలగహ్వర మనన్ వైశాల్యమున్ బొంది నా
చాయన్ వచ్చును మ్రింగుదానిఁబలె? భిక్షాపాత్రమా చెప్పుమా!

అఁటు చనుదెంచి నన్నును మదార్తినిఁ గూడ నొకేక్షణంబునన్
గుటుకున మ్రింగి మేలు సమకూర్చెద నంచుఁ దలంచుచుండ నా
పటుతరదుర్భగత్వపు ప్రభావము చేతనొ యేమొ నీవునున్
దటుకున నిల్చి చూపెదవు తర్జని భర్జన భీకరాకృతిన్.

రమ్మందువు చేరఁగఁ గై-కొమ్మందువు నిన్ను "భిక్షుకుం జను. మదె పా
త్ర"మ్మందువు పరయత్నము-వమ్మందువు పొందు వైభవ మ్మందు విలన్.

శిక్షాబుద్ధులు లేరె యెయ్యెడను వాసింగాంచు సత్పాత్రతా
రక్షాదీక్షులు లేరె సత్కవిదరిద్రక్లేశనిర్మూలనా
దక్షుల్ లేరె వదాన్యశేఖరపవిత్రంబైన యాంధ్రావనిన్
భిక్షాపాత్రమ, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!

[illegible]

అక్షిద్వంద్వ పటుత్వమంతయును మాయం గాన, నంగంబులన్
దక్షత్వంబు నశింపలే, దతుల మేధశ్శక్తి వైదుష్య స
ద్వీక్షాపేక్ష తొలంగ, దాంధ్రజననీ ప్రేమాస్థయుం డింద, దో
భిక్షాపాత్రమ, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!.

అక్షయ్యంబుగ నుబ్బి తొట్టికొను నూహావీచికల్ గల్గి పుం
ద్రేక్షుస్యంది సుధారసామలగుణాక్షీణార్థపూరాప్తిఁ బ్ర
త్యక్షోదారమహాశయంబయి కవిత్వం బుండ క్షీరాబ్ధియై
భిక్షాపాత్రమ, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!.

అక్షీణవ్యథఁ గుందు బందుగులకై యర్థించుచే న్యాయ పా
పక్షం బందు రదేల? దాతకు నిజాత్త్రాత కష్టావళుల్
చక్షుర్గోచరమై మెలంగమిఁ గదా! సారస్వతం బట్టిదే ?
భిక్షాపాత్రమ, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!.

నిక్షేపం బన భావ ముండఁ గృతి దానిం గూర్పఁగా నెంచుచో
ద్రాక్షాపాకమృదూక్తు లుండ రససామ్రాజ్యంబు వెల్గుండఁగా
లక్షింపన్ జుమ నిన్ను లేఖిని కరాలగ్నంబుగా నున్నచో,
భిక్షాపాత్రమ, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!

అక్షుద్రశ్రమ నాంధ్రవాఙ్మయచిరోదంచత్ప్రభోజ్జీవనా
పేక్షన్ యత్నముసేసి పొందియుఁ గలా విస్తార సౌముఖ్యమున్
గుక్షిం జూపెదు కష్టునింబలెనె నేనుం బోయి యాచింతునే?
భిక్షాపాత్రము, యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపుదో!

ఈక్షామాత్రన భవ్యభావహృదయాభీష్టంబు లక్షింపఁగా
దక్షుల్ దానకలావిశారదులు సత్ప్రాభవోదారు లాం
ధ్రక్ష్మాత్రోచితబుద్ధిఁ గొంద రిల నుండ న్నన్ను తాడింతువే?
భిక్షాపాత్రమ యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపెదో!.

పక్షిశ్రేణులఁ గీటకావలి మృగవ్రాతంబునుం జూపులన్
రక్షింపంగ వలంతియై సుగుణధైర్యంబుల్ పరీక్షించు ని
ష్పక్షాత్ముండు దయామయుండు ననుఁ గావన్ గల్గ ని న్నెంతునే?
భిక్షాపాత్రమ యేల నాపయి నిటుల్ బీభత్సముం జూపెదో!.

# ౭. వైద్యము

## ప్రకృతి చికిత్సా సిద్ధాంతము

భిషగ్వర, దంతులూరు శ్రీ రామచంద్రరాజు గారు

ఈ ప్రకృతిచికిత్సావిధానము తొలుత జర్మనీ దేశస్థుడగు డాక్టరు లూయీ కూనే మహాశయునిచే గనుగొనబడి జర్మను భాషయం దీతనిచే గ్రంథరూపముగ బ్రకటింపబడి అతని జీవితకాలముననే యేబదిమాఱులు ప్రకటింపబడి నేటికి వివిధభాషలయందు తర్జుమా గావింపబడియున్నది. దీనిని బట్టియే యీ ప్రకృతిచికిత్స లోకమున కెంతటి యుత్సాహము కల్గించినదో తెల్లము కాగలదు.

ఈ చికిత్సావిధానమున నితరచికిత్సలయందు వలె రోగనిరూపణము గాని, యౌషధసేవనము గాని లేకయే రోగనివారణోపాయము దెలుపబడినది.

రోగములు స్థానభేదముచేగాని, రూపభేదముచేగాని, వివిధనామములు గల్గియున్నను, ఆ రోగము లన్నిటికి దోష మొక్కటియే యనియు, నా దోష మెంత ప్రాబల్యముగ నుండిన రోగ మంత యధికముగ నుండుననియు, నా దోషమును మొదలంట రూపుమాపుట వలన రోగము నశించుననియు, నీచికిత్సాసిద్ధాంతము.

రోగహేతుకమగు దోషము కలుగుటకు బ్రకృతి విరుద్ధములగు నాహారవిహారములే కారణము. ప్రకృతి విరుద్ధములగు నాహారవిహారముల మూలమున, శరీరమందలి యవయవములు (ఆమపక్వాద్యాశయములు) తమతమ పనుల (మలమూత్ర స్వేదాది బహిష్కరణము) నిర్వహింపజాలకపోవుటచే నా చెడుపదార్థముశరీరమందు క్రమక్రమముగా ఘనీభవించి రోగముల గలిగించుచుండును.

దీనినిబట్టి విచారింప సమస్తరోగములకు కారణము శరీరమున ప్రకృతివిరుద్ధపదార్థము చేరుటయే యనియు, అట్టి పదార్థమే దోషమనియు, తెలియుచున్నది. సర్వరోగములకు గారణ మొకటియే యనియు, రోగకారణ మొకటియే యగుటచే జేసి చికిత్సకూడ నొకటిగానే యుండవలయుననియు, నీమహాత్ముని యభిప్రాయము.

అట్టి చికిత్సయే ప్రకృతి చికిత్స. ఈ చికిత్సయందు గటి బాష్పాతప జననేంద్రియ స్నానములే దివ్యౌషధములుగను, నుద్రేక జనితములగు లవణాదివ్యంజనమిళితములుకాని స్వాభావికపదార్థసేవనమే పథ్యముగను జెప్పబడినవి. ఇట్టి ప్రకృతిచికిత్స నొందుటవలన రోగకారణమగు దోషపదార్థము శరీరమునుండి కరగి, బహిర్గతమై, రోగముల మొదలంట నశింపజేయును. అందు బాష్పాతప స్నానములవలన రోగపదార్థము చెమటరూపమున రోమకూపములనుండి బహిర్గత మగుచుండును. కటి లింగ స్నానములవలన రోగపదార్థము పొత్తికడుపున జేరి మలమూత్రముల నాళములగుండ బహిర్గత మగుచుండును. మరియు నీచికిత్సవలన రోగపదార్థముయొక్క హెచ్చుతగ్గులనుబట్టి కొందఱకు స్వల్పకాలమునను గొందఱకు దీర్ఘకాలమునను రోగశాంతి యగును.

### చతుర్విధస్నానములయొక్క పద్ధతులు

### ౧. బాష్పస్నానము.

డేగిసాలో సగమువరకు నీళ్లుపోసి, మూతవేసి, ఆవిరి వచ్చువరకు కాచి, ఆవిరి వచ్చిన వెంటనే రోగి వస్త్రవిసర్జనము గావించుకొని, మంచముపై గాని పేముకుర్చీపైగాని కూర్చుండి, కండ్లకు వేడి తగులకుండునటుల తడివస్త్రముతో కండ్లను గట్టుకొని, ఆవిరి బయటకు పోకుండునటులు ముదుకవస్త్రమును గప్పుకొని, యా యా వికిపాత్రము కుర్చీకింద నుంచి రోగియొక్క సహనశక్తి ననుసరించి పాత్రపై గప్పియుంచిన మూతను కొంచె కొంచె

ముగా తొలగించుచు రోగము ననుసరించి పదిహేను లగాయతు ముప్పది నిమిషములవరకు ఆవిరిపట్టుట.

ప రా—నీటియొక్క వేడి తగ్గి ఆవిరి కొలదికాలము ననే తగ్గును కనుక రెండవ పాత్రము పొయిమీాద నుంచి ఆవిరి వచ్చునటుల సిద్ధముగా నుంచుట, లేక కుర్చీక్రింద నున్న పాత్రను "స్టౌ" మీాద నుంచుట.

౨. ఆతపస్నానము

సూర్యరశ్మియందు వెల్లకిల బరుండి శిరస్సు, ముఖము, పొత్తికడుపు, వీనికి రశ్మి సోకకుండునటుల పచ్చని యాకులచే గాని తడి గుడ్డతోగాని కప్పియుంచి, పలుచనివస్త్రముచే శరీరమంతయు గప్పుకొని, బాగుగ చెమటపట్టువరకు ముప్పది లగాయితు అరువది నిమిషములవరకు నుండుట.

3. కటిస్నానము

తొట్టియందు నీళ్లను పోసి, కటిప్రదేశము మునుగునటుల కొంచెము వెనుకకు వ్రాలి కూర్చుండి, పొత్తికడుపును (ఇరుప్రక్కల నుండు గజ్జయెముకల వరకు) ఒక వైపునుండి మఱియొకవైపునకు ముదుకబట్టతో ఆగక వయస్సురోగము ననుసరించి అయిదునుండి ముప్పది నిమిషములవరకు త్వరత్వరగా రుద్దుచుండుట.

౪. లింగస్నానము

తొట్టిలో నొక కోళ్లబల్ల నునిచి, బల్లపైని నాలుగంగుళములవరకు నీరుండునటుల పోసి, రోగి వస్త్రవిసర్జనము గావించుకొని,యాబల్లపై గూర్చుండి లింగముయొక్క పోకకు, నీరు తగులకుండునట్టుల ఎడమచేతి వ్రేళ్లతో లింగాగ్రచర్మమును ముందుకు లాగి పోకను గప్పి పట్టుకొని నీట మునుగున ట్లుంచి, ఆచర్మమును రోగము, బలము, వయస్సు ననుసరించి పది లగాయతు అరువది నిమిషములవరకు కుడిచేతితో మెత్తని ముదుకబట్టచే మృదువుగా రుద్దుచుండుట.

ఆహారము

సులభముగ జీర్ణము గాదగిన పదార్థముల నెంతవరకు జీర్ణశక్తి కలిగియున్నదో అంతవరకు దినుట. రసవంతములగు పండ్లు, పచనముచేయబడిన కాయ, ఆకు, దుంపకూరలు, ధారోష్ణములు (గుమ్మపాలు) మొదలగు పదార్థములను దినుచుండుట. గ్రుడ్లు, చేపలు, సారాయము, మసాలాలు, మొదలగు ప్రకృతివిరుద్ధపదార్థముల బహిష్కరించుట.

సంభోగము

ప్రధానముగ జీవనశక్తిని నశింపజేయునది యగుటచే సంభోగక్రియను మొదలంట మానవలసి యుండును. అటుల సాధ్యము కానిచో, బలము ననుసరించి అధమము పదిహేనుదినముల కొకసారి కూడవచ్చును.

ఈచికిత్స నొందు కాలమున శరీరాంతర్గతమైయుండిన దోషము బహిర్గతమగుచు తాత్కాలికబాధలు గలిగిన గలుగవచ్చును. అట్టి సమయమున భయపడి చికిత్స నిలుపక చేయుచుండిన ఆబాధ లన్నియు స్వల్పకాలముననే శాంతించి రోగమును మొదలంట రూపుమాపును.

# వాత పిత్తకఫముల తత్త్వము

భిషగ్రత్న మధునాపంతుల సత్యనారాయణమూర్తిగారు

ఈ నా చెప్పంబోవు విషయము ప్రాచీనగ్రంథములయందు ప్రస్తావింపబడినదియే గాని, నా స్వకపోలకల్పితము గాదు. కాని, పూర్వశాస్త్రములయం దొకచోట విస్తరించి చెప్పబడలేదు.

ఈ విషయము వైద్యులకే యూహింపరానిది. ఇతరులమాట యేల? అయినను వాత పిత్త శ్లేష్మము లను మూడుమాటలు మాత్రము ప్రజలందఱకును దెలిసిన విషయమే.

ఆయుర్వేదవైద్యు లొకరోగిని పరీక్షించునపుడు వాత పిత్త శ్లేష్మములలో నొకటిగాని రెండుగాని మూడుగాని భిన్నగా లేపని చెప్పుచుందురని మన మెఱింగియే యున్నాము.

కాని, అక్కటా! ఈ మూడుదోషముల మర్మమును చక్కగా విప్పిచెప్పగల పండితు డొక్కడును లభింపడు. కావున నక్షరాస్యులు కాని పామరులు దక్క నాగరికులగు జను లెవ్వరును నీ విషయమును నమ్ముటలేదు. కాన పామరులకును, విశేషించి పండితులకును, వీని యందు విశ్వాసము గలుగజేయుటకై ప్రయత్నము చేయవలసి యున్నది.

వైద్యులు వాత పిత్త శ్లేష్మములు మూడును దోషములని వ్యవహరింతురు. ధాతువులను దూషించునవి, యన పాడుచేయునవి, కాన దోషము లని వ్యవహరింపబడును. అని దోషశబ్దమునకు వ్యుత్పత్తి.

వాత పిత్త కఫములు దేహధారణమునకు హేతువులని చెప్పుదురు గదా? అవి దేహమును పాడుచేయుట యెట్లు అని ప్రశ్నింతురేమో వినుండు.

రోగమును బుట్టింప హేతువులగు సూక్ష్మములుగాని, స్థూలములుగాని బాహ్యములగు భూతవిశేషములు కొన్ని శరీరమునందు ప్రవేశించి వాత పిత్త శ్లేష్మములలో నొకదానినిగాని రెంటినిగాని మూటినిగాని చెఱచి వైషమ్యమును గలిగించును. తరువాత నట్లు వికృతిబొందిన దోషములు శరీరమునందలి సప్తధాతువులను, పాడు చేయును. కాన నవి మూడును దోషములని చెప్పంబడును. ఎట్లన— మన శరీరమునందలి ధాతువులలో నొకటియగు యెముక విరిగినదై మన శరీరమునకు శల్యమై బాధించును. అట్లే, దేహధారణకారణములే వివిధములగు వికారములను బొంది శల్యములవలె దేహమును బాధ చేయు చుండును. కావుననే స్వస్థుడుగా నున్నపుడు దేహధారణమును జేయునవిగాన ధాతువులనియు, వైషమ్యమును బొందినపుడు శరీరమును బాధచేయునవిగాన దోషములనియు, వాత పిత్త శ్లేష్మములు మూడును పేర్కొనబడుచున్నవి.

అట్లయ్యును నవికృతావస్థయందు గూడ దోషములనియే కాల క్రమమున వ్యవహరింపబడి తఱచుగా దోషములను నామముతోనే ప్రసిద్ధములైనవి.

కొన్నిచోట్ల నొకానొకప్పుడు ధాతువులనియు జెప్పంబడును.

వాత పిత్త శ్లేష్మములయొక్క స్వరూప మెట్టిది? శరీరమునందవి యెచ్చోట నుండును? ఇవి ఏయే కార్యముల జేయును? అని విచారింపవలసి యున్నది.

జగమునందు సర్వత్ర వీచుచున్నట్టిదియు, ఉచ్ఛ్వాసనిశ్వాస రూపమున ప్రతిక్షణమునను మనకు బరిచితమైనట్టిదియునగు, ఏ వాయువు గలదో యట్టిదే వాతమనియు, నమనాడులయందు గన్పట్టు పచ్చని ద్రవపదార్థ మేది కలదో యదియే పిత్తమనియు, శ్లేష్మము ప్రకోపించినప్పుడు మన నాసికనుండి వెలువడునట్టిదియే కఫమనియు పామరజనులవలె పండితులుగూడ నభిప్రాయపడుచున్నారు.

వాతపిత్తశ్లేష్మముల రూపము లట్టివియే యైనచో నాడీపరీక్ష చేయునపుడు (మణిబంధమునందు బ్రేళ్లుంచి చూచినపుడు) వాత పిత్త శ్లేష్మముల గతివిశేష మెట్లు తెలియును? అట్టి యాకారముగల వాత పిత్త శ్లేష్మములకు నిట్టినాడులయందు ప్రవేశ మెట్లు గలుగును? అను ప్రశ్నము గలుగును. దానికి సమాధానము సయుక్తికముగను నను భవసిద్ధముగను జెప్పగల విద్వాంసులు విరళముగ నున్నారు. శాస్త్రజ్ఞు లెవ్వరును వాత పిత్తశ్లేష్మముల స్వరూపము వెనుక జెప్పిన విధముగా నుండునని యొకప్పుడును జెప్పరు.

బాగుగా బరిశీలించి చూడగా వాతపిత్తశ్లేష్మములు మూడు దోషములును మూడు శరీరశక్తులుగా దెలియవచ్చుచున్నవి. రక్తము గూడ నాల్గవదోషముగా పరిగణింపబడుచున్నది. కావుననే యన్నట రక్తముగూడ వికృతినిబొంది, వాతపిత్తశ్లేష్మములు వికారమును బొంది వ్యాధులను గలిగించునట్లుగా స్వతంత్రించి వాతరక్తాదులగు రోగములను గలిగించునని వైద్యగ్రంథములయందు పఠించుచున్నాము. కావుననే తరుచుగా రక్తమునకు ధాతుత్వమును, కదాచిత్కముగా దోషత్వమును శాస్త్రమునందు వ్యవహారము గలదు.

ఇప్పుడు శక్త్యాత్మకములగు వాతపిత్తశ్లేష్మములను మూడు దోషములవలన శరీరమున కేమి యుపయోగము గలదు? అను ప్రశ్నకు సమాధానము జెప్పవలసి యున్నది.

రసరక్తాదులగు సప్తధాతువులచేతను శరీరము నిర్మింపబడిన దని మన మందఱము నిశ్చయించుచున్నాము. అపాయమును జేయు బాహ్య పదార్థములచేతగాని మఱి యే యితర హేతువులచేతగాని సప్తధాతు

మనుజుంబను శరీరమునకు విపత్తులు గలిగినచో నీవాతపిత్తశ్లేష్మములను మూడుదోషములును శరీరమును పోషించుటకును కాపాడుటకును భగవంతునిచే నేర్పాటుచేయబడినవి. రసరక్తాది సప్తధాతువులకు ననుకూలము గానిదియు, అత్యంతము విరోధమైనట్టిదియు నగు ద్రవ్యమేదని దేహమునం దెట్లో ప్రవేశించినచో నపుడే వాతపిత్తకఫములలో నొకటిగాని రెండుగాని మూడును కలిసికాని శత్రువగు నాద్రవ్యమును బయటికి ద్రోసివేయుటకై ప్రతిపదముందును ప్రయత్నించును. ఇట్లెగాని దేహమునందు ప్రవేశించి రోగహేతువులైన బాహ్యపదార్థములు బలహీనములైనవి యైనచో, దోషములని వ్యవహరింపబడు వాతపిత్తశ్లేష్మములను శక్తులు మూడును వానిని వెలుపటికి ద్రోసివేసి రసరక్తాది సప్తధాతువులను లెస్సగా బరిపాలించును. అట్లుగాక దోషములే దుర్బలమైనచో దేహమునందు జొచ్చి శత్రువులైన బాహ్యపదార్థములే వీర్యవంతములై తమ్మును ద్రోసివేయజూచు వాతపిత్తశ్లేష్మములతో బోరాడి వాని కన్యోన్యవైషమ్యము గలిగించి విషమములగు నాదోషములతోగూడ క్రమముగా సప్తధాతువులను బాధచేయును.

రోగారంభమునకు హేతువులగు బాహ్యద్రవ్యములు శరీరమున ప్రవేశించి, మొట్టమొదటను సర్వదా రక్షించుచున్న స్థిరములైయున్న శక్తిత్రయాత్మకములగు దోషములకు వైషమ్యమును గలిగించుటజేసి, సర్వరోగములు పుట్టుటకు ముందు వాతపిత్తశ్లేష్మములే వైషమ్యమును బొందునని తేలినదిగావున, ప్రతిరోగమునందును ముందుగా వాతపిత్తశ్లేష్మముల స్థితిగతులే పరీక్షింపబడవలయునని శాస్త్రములు ఘోషించుచున్నయవి.

శరీరము పంచభూతములచేతను నిర్మింపబడిన దను విషయము సర్వశాస్త్రములకు సమ్మతమైనదగునే; ఈ దేహమునందు పృథివ్యాది భాగము లేవి యేవి? వానివాని పను లెట్టివి? యను ప్రశ్నములకు సమాధానము చెప్పినచో, వాతపిత్తకఫముల మూటియొక్క తత్త్వము చాలవరకు చెప్పినట్లే యగును.

శరీరమునందలి సప్తధాతువులును చాలవరకు పృథివీభూతము యొక్క యంశముచేతనే నిర్మింపబడినవి. ఏలయనగా, ఆకారముగల సకలపదార్థములును పృథివీభాగములుగానే శాస్త్రజ్ఞులు చెప్పుదురు గదా? రసరక్తాదులగు రెండు మూడు ధాతువులు జలాంశముచే నేయబడినవని చెప్ప గొందఱు సాహసింపవచ్చును గాని సూక్ష్మదృష్టితో బరిశీలించి చూచినచో, నాకారము గలుగుట, గంధము గలుగుట మొదలగు లక్షణములచేతను, మరికొన్ని యితరసూక్ష్మాంశములచేతను రసరక్తాదులుగూడ ద్రవద్రవ్యములవలె వైటికి కనుపట్టుచున్నను పృథివీ వికారము లని పక్షపాతములేని పండితులకు జెప్పకతప్పదు.

అట్లయినచో నధికములగు పృథివీ భాగములచే జేయబడిన సప్తధాతువులును మిగిలిన నాలుగుభూతములకును సాధారణము లగునం దురా? యని మీ రడుగవచ్చినచో, ఔను; ఘనములు, మందములు నగు పృథివీభాగములచే నావిర్భవించిన సప్తధాతువులకును దమతమ పనులను జేసికొనుటకును, తమ్ము నాపదలనుండి తప్పించుకొనుటకును స్వాతంత్ర్యము లేమింజేసి, వానిని బరిపాలించుటకును వానిపనులను నిర్వహించుటకును జలాంశముచే కఫమును, తేజోభాగముచే పిత్తమును, వాయుభాగముచే వాతమును పుట్టింపబడినవి. కావుననే జలసంబంధములగు గుణములు శ్లేష్మమునకును, తేజస్సంబంధములగు గుణములు పిత్తమునకును, వాయుసంబంధములగు గుణములు వాతమునకును వైద్యశాస్త్రమునందు జెప్పబడినవి. ఇందులకై చరకమునందలి వాతకలాకలీయాధ్యాయమును జూడవచ్చును. ఇక నైదవదియగు ఆకాశము యొక్క యంశముచే నేది నిర్మింపబడినదో తెలుపవలసియున్నది.

అతిసూక్ష్మమును, శూన్యాకారమును నగు నాకాశముయొక్క యంశముచే సూక్ష్మమునకంటె సూక్ష్మమైనదగు మనస్సను నింద్రియము నిర్మింపబడినదని తలంతుము. పృథివీవికారములగు సప్తధాతువులయొక్క పరిపాలనముకొరకు వాతపిత్తకఫములవలె నాకాశవికారమగు మనస్సునకు సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు సూక్ష్మభావము లుదయించినవి. సప్తధాతుమయంబగు దేహమునకు, మనస్సునకు నెట్టిసంబంధము గలదో వాతపిత్తకఫములకు, సత్త్వరజస్తమోగుణములకు నట్టిసంబంధము గలదని మనము తెలియుచున్నాము. ఈకారణముచేతనే మనుష్యుల ప్రకృతులను జెప్పునప్పుడు వాతప్రకృతి తమోగుణభూయిష్ఠుడనియు, పిత్తప్రకృతి రజోగుణభూయిష్ఠుడనియు, శ్లేష్మప్రకృతి సత్త్వగుణభూయిష్ఠుడనియు వివరింపబడియున్నది. ఇందులకై సుశ్రుతశారీరమునందలి నాల్గవ యధ్యాయమును జూడవచ్చును.

శరీరమునందలి నాడీమండలముద్వారా మనస్సునకును దెలియని వివిధములగు ప్రేరణభేదములచే సకలకార్యములును జేయబడుచున్నవి. ఆపనులన్నియు వాతమను పేరుగల యొకానొక శక్తిచే చేయబడుచున్నవని యూహింతుము. నాడులయందు చైతన్యప్రభావముచే శీఘ్రముగా పరుగెత్తు నొకానొక విషయమే వాతమని పిలువబడుశక్తివిశేషమని యూహింపబడుచున్నది. ఆయావిషయములను దలచుటం తలో నతిశీఘ్రముగా నాడులగుండా బరుగెత్తుటం జేసియు, వెంటనే కార్యము లతివేగముగా జేయబడుటం జేసియు నీశక్తి వాతమనియు, వాయువనియు జెప్పబడుచున్నది. 'వా' ధాతువునకు గంధము, గతి యని రెండర్థములు గలవు. గంధమను నర్థముచే నాయావిషయములను దెలిసికొనుటయు, గతి యనునర్థముచే నవయవముల నాయాయుచిత కార్యములయందు బ్రవర్తింప బ్రేరేపించుటయు నను రెండువిషయములును సంగతము లయ్యెను. ఒకానొక శరీరప్రదేశమునందు ఏదియో తాకిన తోడనే వాయువను పేరుగల శక్తి బుద్ధియొక్క మూలస్థానమునకు నావిషయములను గొనిపోయి, ఆవిషయమున కనుగుణమైన పని జేయుటకై మరల బుద్ధియొక్క మూలస్థానమునుండి సందేశములను

గొనితెచ్చి యాయా యవయవములకు నిచ్చును. అదియే వాతమునగల శక్తి.

మనము తిను పదార్థములను జీర్ణముచేయుటకై ప్రేగులనందు జాఠరాగ్ని యను పేరుగల యొకానొక వేడిమి యావిర్భవించును. అది యును, రక్తముగుండా సర్వావయవములను వ్యాపించియున్న శరీర సంబంధమగు నుష్ణియొక్క వేడిమియును, రెండును, గలసి పిత్తమని వ్యవహరింప బడుచున్నవి. శరీరసంబంధమగు వేడిమినే యింగ్లీషులో 'ఎనిమల్ హీట్' అని చెప్పుదురు. పిత్తదోషమని పిలువబడు నీశక్తి సప్తధాతువులయందును, శరీరమున కావశ్యకములగు పదార్థములయందును ఆయా భాగములను పక్వముజేసి ధాతువులను వానికి వానికి దగిన పక్వాశయములందుంచి శరీరమును గాపాడుచున్నది.

మనశరీరమునందు అనేకములగు స్రోతస్సులయందు ప్రవహించుచు పాండువర్ణమయి 'లసీక' యను పేరుతో వ్యవహరింపబడు ద్రవద్రవ్యమే కఫమని నిశ్చయించియున్నాము. ఏలయన, వైద్యకమునందు కఫమునకు చెప్పబడిన తెలుపు మొదలైన గుణములు దీనికి గలవు గావునను, శరీర సంరక్షణమునకయి ధాతువులయొక్కయు, బాహ్యాంతరావయవముల యొక్కయు, పనులను నిర్వర్తించుటకై యొక్క శక్తి యుండవలయుటను దీనికే కఫత్వము జెప్పకతప్పదు. ఆ లసీక శరీరమునందు జొచ్చిన ప్రతికూలపదార్థములను బలాత్కారముగా వెలుపలకు ద్రోసివేయుటకయి ప్రయత్నించును. లేక తాను వానిని లోపలనే యుంచి హరింపజేయును; లసీక యను కఫమున కట్టిగుణము గలదు గావుననే శ్లీపదరోగమునందును, ఇతరములగు విషవ్యాధులయందును ఆయా రోగములకు కారణములైన విషక్రిమిసంబంధములగు పదార్థములను బట్టి తీసికొనివచ్చి గజ్జలు మొదలగు వానియందు గల శ్లేష్మగ్రంథులయందు చేర్చి, వానితో గూడ [illegible] పొందించి [illegible]చును.

ఇక శరీరసంబంధములగు పనులు చేయుటలో దోషత్రయమునకు నుగల ప్రాధాన్యతత్వములను దెలిపి యీ వ్యాసమును ముగింతును. దోషత్రయమునందును వాతమునకు ప్రబలత్వము గలదని యాయుర్వేదవైద్యుల కెల్లరకును దెలిసినవిషయమే. పిత్తకఫములుగూడ స్వయముగా శరీరకర్మములను గొన్నింటిని జేయుచున్నమాట నిజమే. అయినను సప్తధాతువులనువలె కఫపిత్తములనుగూడ నియోగించునది వాతమే యని శాస్త్రములచేతను, ప్రత్యక్షప్రమాణముచేతను గూడ మేము తెలియుచున్నాము. బుద్ధికిని, నింద్రియములకును వాతమే నియోక్త యని చెప్పగానిక కఫపిత్తములను నియోగించునది వాతమని వేర చెప్పవలయునా? వాత మొక్కటియే యావశ్యకములగు పనులయందును కఫపిత్తములను నద్యోగ్య యాశయములగుండా నడుపుచున్నది. కఫపిత్తములవలె సప్తధాతువులకును నాయా పనులయందు సాహాయ్యము జేయుచున్నది. కావుననే కఫపిత్తములను, సప్తధాతువులను, సకలశరీరమును గూడ దనయధీనము జేసికొని స్వాతంత్ర్యముతో స్వయముగా బరిపాలించుచున్నది. కావుననే

శ్లో. పిత్తం పంగు కఫః పంగుః, పంగవో మలధాతవః;
వాయునా యత్ర నీయంతే, తత్ర గచ్ఛంతి మేఘవత్.

అని పఠింపబడినది.

# సూష్లరు సూక్ష్మ వైద్యము

పొన్నాడ వెంకటరావుగారు, బి. ఏ., హెచ్. యం. బి.

మానవుని భగవంతుడు ఎందుకొరకై సృజించినాడో చెప్పుట చాల కష్టము. అయితే ఒక సంగతి మాత్రము స్పష్టముగా కనబడుచున్నది. ప్రతి జీవమును, అందులో మనుష్యుడు ఎక్కువగాను, నిర్విచారము గాను, సౌఖ్యము గాను జీవింపవలెనని కోరుచుండును. కాన సుఖజీవనమే పరమావధి గాని కష్టజీవనము అనాంఛనీయమని యెల్లరును ఎరుగుదురు.

సౌఖ్య జీవనమున కాధారములలో ముఖ్యమైనది ఆరోగ్యము. ఆరోగ్యము లేనిదే సౌఖ్య మెప్పుడును ఉండదు. ఆరోగ్యము ప్రతి మనుజునికిని జన్మహక్కై యున్నది. ఈ ప్రపంచములో యెవ్వడు, తాను రోగిననియు బాధపడుచున్నాననియు దుఃఖించుచుండునో, వాడు అశక్తుడనియు,అప్రాజ్ఞుడనియు, అట్టివానిని క్షమింపవీలులేదనియు అధునిక అమెరికను ప్రకృతిశాస్త్రవేత్త యయిన బెర్నారు మాక్ఫడనుగారు( Bernarr Macfadden) చెప్పుచున్నారు.

మానవుడు ప్రకృతిమాతయొక్క పుత్రుడై యుండి, భగవత్స్వరూపమైన ప్రకృతిలో నుండి జనించినాడు. తుదకు ప్రకృతిలోనే కలసి అంతరించుచున్నాడు. అయితే ప్రకృతిజీవనము చేయుటకు బదులుగా అవివేకియై వికృతి జీవనము చేయుచున్నాడు. స్వాభావికజీవనము చేయునంత కాలము మానవునికి ఏవిధమైన రోగమును కలుగదు. ఏ బాధయును, రోగమును కలుగకుండ జీవనము చేయుటయే ప్రాజ్ఞుని లక్షణము. Prevention is always better than cure.

కాని నాగరికతా పిశాచ నిరంకుశ ప్రభుత్వములో ప్రకృతి జీవనమును, రోగనిరోధమును అసాధ్య మయిపోయినవి. కృత్రిమజీవనము, కృత్రిమాభ్యాసములు, కృత్రిమపద్ధతులు, కృత్రిమాహారము, అన్నియు అస్వాభావికములై పోయి, ఆరోగ్యము పోయి, అనారోగ్యమే పరిపాటయిపోయినది. ఈ అస్వాభావికజీవనము దినదినమును అనేకరకముల వ్యాధులను జనింపచేయుచున్నది. మానవ ప్రపంచములో నూటికి తొంబదికన్న యెక్కువగా అనారోగ్యవంతులై యున్నారు. రోగము లెక్కువైన కొలది వైద్యులు లెక్కువగుచున్నారు. అయినను రోగములు మరింత హెచ్చుచుండుటయే గాని తగ్గుచుండుట లేదు. భావికాలములో సాధారణ మనుష్యులకు జీవనమే గడుచుట కష్టమైయుండి, సంసార సముద్రములో దారా పుత్రాదులతో ఈదలేక మునుగుచు తేలుచు కొట్టుకొనుచుండగా, ఆరోగ్య విషయమును గురించి యోచించుటకు సావకాశము లేదు. బీదసాదలకు వైద్య మెట్లు దొరకును? వైద్యుడు ధనవంతులతో గాని, బీదవాండ్రతో మాటాడునా? వైద్యుల కివ్వవలసిన ఖర్చును, మందుల విలువయును భరించుట కష్టము గాన అనేకులు తమ వ్యాధుల ననుభవించుచు నూరకున్నారు. హోమియోపతి వైద్య స్థాపనాచార్యుడైన హానిమనుగారు తమ “ఆర్గనను” లో వివరించినట్లు, రోగములను త్వరితముగను, శాశ్వతముగను కుదుర్చుటయే గాక, బీదసాదలకు సహితము అందుబాటులో నుండునదే సరియయిన వైద్యము. ఇప్పుడు ప్రభుత్వమువారు ఆదరించుచున్న “అల్లోపతి” వైద్యమునకు పై లక్షణము లేవియు లేనందున హానిమనుగారు తమజీవిత మంతయు ధారవోసి “హోమియోపతి” వైద్య శాస్త్రమును నిర్మించినారు. అయితే హోమియోపతి వైద్యము అన్ని విధముల మిక్కిలి యుత్కృష్టమైన వైద్యమే అయినను, శాస్త్రము మిక్కిలి విశాలమై యుండుట చేతను, విస్తారము కృషిచేసి, అనేక గ్రంథములు చదివినగాని అందలి మూలమును గ్రహించుట కష్టము. అందుకు ప్రత్యేక శిక్షణము పొందిన గాని హోమియోపతి వైద్యము సులభము కాదు.

హోమియోపతి వైద్యము కన్న అనేక రెట్లు మిక్కిలి సులభగ్రాహ్యముగా నుండునట్లును, బీదసాదలకు చౌకగా నుండునట్లు, వైద్యుని సహాయ మావసరము లేకుండ ప్రతి పురుషుడును, స్త్రీయు సహితము గ్రహింపగలిగి తమ వ్యాధులను తాము నివారించుకొన గలుగుటకు వీలుగా నుండు వైద్య శాస్త్రమును జర్మనిలోని ఓల్డెను బర్గు నాస్తవ్యులు, సూష్లరుగారు నిర్మించినారు.

సూష్లరుగారి వైద్య శాస్త్రములోని మూలము, పద్ధతులు, సాంప్రదాయములు, రోగ నిదానము, వైద్య విధానము, అన్నియు సులభ గ్రాహ్యములు. వీరి శాస్త్రములోని వస్తుసముదాయ మంతయు పండ్రెండులవణములలోనే యిమిడి యున్నది. ప్రపంచములోని మానవ శరీరము నావరించియున్న రోగము లన్నియు నీద్వాదశలవణముల ప్రయోగము వల్లనే కుదురునని సూష్లరుగారి శాస్త్రము. నా యొక్కయు, నా మిత్రుల యొక్కయు అనుభవమును బట్టి గూడ, సాధారణముగా కుదురుటకు సావకాశమున్న వ్యాధులన్నియు ఈ ద్వాదశలవణములవల్ల కుదురుచున్నవి. మిక్కిలి ధనవంతులు గాని సాధారణ సంసారులు, వైద్యుల ఖర్చులు భరింపలేని సామాన్య గృహస్థులును సూష్లరు వైద్య మవలంబించుటవలన వ్యయ ప్రయాసల నుండి తప్పించుకొన గలరు. ప్రతి మనుష్యుడును తనకు తాను వైద్యము చేసుకొని రోగ నివారణ చేసుకొన గల్గును.

సూష్లరుగారి వైద్యము జీవరసాయన శాస్త్రము (Biochemistry) తో కూడియున్నది. సూష్లరుకు పూర్వము అనేకులు రోగ కారణములును, రోగ తత్వమును వివరించుచు, అనేక సాంప్రదాయముల నేర్పరచినారు. అందులో "విర్చో"గారి జీవాణువునకు సంబంధించిన రోగలక్షణ శాస్త్రము (Cellular pathalogy) సూష్లరుగారి మనస్సు నాకర్షించినది. ఈ జీవాణువు సాంప్రదాయమును డాక్టరు మోల్స్కాటుగారు తమ "జీవచక్రము"(Cycle of Life)అను గ్రంథములో వివరించి యున్నారు. సూష్లరుగారు ప్రసిద్ధిగాంచిన వైద్యుడై యుండుట చేతను, రోగ విమోచన విధానములలో పరిశోధనలు చేయుచుండుట చేతను, డాక్టరు విర్చోగారి యొక్కయు, మోల్స్కాటుగారి యొక్కయు సాంప్రదాయములను స్వీకరించి పరిశోధించి, తమ నూతన శాస్త్ర విషయమును నిర్మించినారు.

తమ పరిశోధనా ఫలితముగా, జీవాణువే మానవ శరీరమునకు మూలాధారమని నిశ్చయించినారు. సూష్లరుగారి సిద్ధాంతముల ప్రకారము శరీరములో నింద్రియ పదార్థమును (organic matter), అవయవముల సంబంధము లేని నిర్జీవ పదార్థము (Inorganic matter), జలము మొదలగు పదార్థములు కలిసియుండు ననియు, నిర్జీవ పదార్థములైన సున్నము, పొటాషియము, సోడియము, లోహము, మగ్నీషియముల యొక్క లవణములు శరీరములోని ప్రతి కోశము యొక్కయు జీవాణువులలో ఒక నిర్ణీతమైన పరిమాణములో ఉండుననియు పరిశోధించబడినది. ఈ నిర్జీవ పదార్థములు, అనగా, పై లవణములు లేనియెడల, ఇంద్రియ పదార్థము (organic matter) నిరుపయోగమై పోవును. ఈ కోశ లవణములు ఇంద్రియ పదార్థముతో కలసి, శరీరము అహోరాత్రములు పని చేయుచుండుట వలన అరిగి పోయి, క్షీణించి నశించుచున్న అవయవములను, శక్తులను, రక్తమును, కండరములను తిరిగి పునరుద్ధరింప జేయుచు, ఎప్పటి కప్పుడు శరీరమును యథాస్థితి లోనికి వెంటనే తెచ్చుచుండును. శరీరములోని శ్వేతధాతువు (Albumen), చక్కెర, చమురు పదార్థము, జలము, తాంతవము (Fibrine) మొదలైన పదార్థములతో ఈ జీవాణుల లవణములు ప్రతి నిమిషమును అరిగిపోవుచున్న కోశములను బలపరచుచు శరీరమును శిథిలము కాకుండ కాపాడుచుండును. కనుక ఈ కోశలవణములు లేక జీవాణులవణములు నిర్ణీతమైన పరిమాణములలో నుండునంత కాలము మాత్రమే దేహారోగ్యము సరి అయిన స్థితిలో నుండునని సూష్లరుగారు గ్రహించినారు. ఈ కోశలవణములు సరియయిన పరిమాణములలో లేనప్పుడు, ఇంద్రియ పదార్థము నిరుపయోగమై, వృథాగా స్తంభించి నిలిచిపోవును. అవయవములు వాటి పనిని చేయలేక ఊరకుండును. వివిధములయిన రోగము లుద్భవించును. సూష్లరు సిద్ధాంతము ప్రకారము రోగమునకు కారణము జీవాణులవణములు లోపించుటయే.

సూష్లరుగారు తమ పరిశోధనలవలన మానవ శరీరములో ఇంద్రియ పదార్థములైన శ్వేతధాతువు, తాంతవము, శ్లేష్మము,చక్కెర, చమురు పదార్థము, జలమును గాక, ప్రతి కోశమందును, ప్రతి జీవాణువునందును సున్నము, పొటాసియము, సోడియము, లోహము, మగ్నీషియం అనువాటి యొక్క లవణములు అన్నియు పండ్రెండు లవణములు కలవనియు, ఈ లవణములలో నేది లోపించినను తత్సంబంధమైన వ్యాధి జనించు ననియు సిద్ధాంతము చేసినారు.

ఈ లవణములు: 1 ఫెర్రంఫాస్ఫారికం, 2 కాలీమ్యూరియేటికం, 3 కాలీ సల్ఫూరికం, 4 కాలీ ఫాస్ఫారికం, 5 కాల్కేరియా ఫాస్ఫారికం, 6 కాల్కేరియా సల్ఫూరికం, 7 కాల్కేరియా ఫ్లోరికా, 8 నేట్రం ఫాస్ఫారికం, 9 నేట్రం మ్యూరియేటికం, 10 నేట్రం సల్ఫూరికం, 11 మగ్నీషియా ఫాస్ఫారికం, 12 సిలీషియా అనునవి.

ఈ శాస్త్రము శరీరములో అంతర్భాగములు, అందలి వస్తుసముదాయములు, వాటి కూడికల వివరములును తెలియజేయునది గాన జీవరసాయనశాస్త్రము (Biochemistry or chemistry of life) అని పిలువబడును. పైన ఉపహరించిన ద్వాదశ లవణములను జీవరసాయనశాస్త్రములో సూష్లరుగారు విమర్శించి స్థాపించినారు గాన వీటిని సూష్లరుగారి కోశలవణములు లేక జీవాణులవణములు (Schuessler's Tissue or cell salts) లేక (BiochemicSalts) లేక ద్వాదశ కోశ లవణములు అను పేర్లతో పిలుచుచున్నారు.

సూష్లరుగారు తమ నూతన వైద్య విధానము వలన రోగ ప్రపంచమున కెంతేనియు మేలు చేసినారు. ఈ వైద్యము బీదలకు వరప్రసాదము. సూష్లరు లవణములు అన్నియు ఒకే మోతాదుగా నుండును. అల్లోపతి యందువలె ఇంగ్లీషు మందులకన్న అనేక రెట్లు, అనగా సుమారు నూరురెట్లయినను తక్కువ ఖరీదని చెప్పవచ్చును. మరియు అంతకన్న ఎక్కువ బాగుగా పని చేయును. ఔషధ ప్రయోగములో పొరబాట్లు కలిగినను ఏమియు వికటించదు. మోతాదు ఎంత యెక్కువ యయినను ప్రమాదించదు. ప్రపంచములో నింతకన్న నెక్కువ సురక్షితమైనట్టియు, తక్కువ ప్రమాదకరమైనట్టియు మందులు లేవు.

హోమియోపతి వైద్యశాస్త్రమునకును, జీవరసాయన వైద్యశాస్త్రమునకును మూలములోనే భేద మున్నది. హానిమనుగారు తమశాస్త్రమును సారూప్యసాంప్రదాయము(Law of Similars) మీదను, సూష్లరుగారు తమశాస్త్రమును శరీరములో తరిగిన కోశలవణములను సర్దుబాటుచేయుట వలన రోగవిముక్తి చేయగల్గుట (Supplying the Pathological difficiencies) యను సాంప్రదాయము మీదను నిర్మించినారు.

రోగనిదానమునకు ఏమియు యంత్రములు గాని, పనిముట్లుగాని మరి యేభేషజములుగాని అవసరములేదు. రోగమును, రోగిని పరీక్షించి రోగకారణమేమి? రోగియందు ద్వాదశలవణములలో యేలవణము లోపించుటవలన యీవ్యాధి కలిగినది? అనుసంగతి జాగ్రత్తగా యోచించి, లోపించిన లవణములను సరిగా గుర్తించుటయే రోగనిదానమైయున్నది. చికిత్సావిధానము కూడ మిక్కిలి సులభమైనది. రోగనిదానముచేసి, రోగిని పరీక్షించి, లోపించిన లవణములను సర్దుబాటు చేయుటయే ఈశాస్త్రములోని చికిత్సావిధానము. ప్రతిరోగమును ఏ కోశలవణ లోపమువల్ల కలిగినదో గ్రహించవలెను.

రోగియొక్క శరీరములో లోహభాస్వరము లోపించిన దనుకొందుడు! అది మనము గ్రహించు టెట్లు? రోగియొక్క శరీరములోని రక్తము పలుచబడినట్లును, రోగి రక్తహీనముగా కనబడినప్పుడును, జ్వరముచే బాధపడుచున్నపుడును, రోగికి లోహము ప్రయోగింపవలసి యున్నదని గ్రహింపవలెను. ఇట్లే ఎముకలసంబంధమైన రోగములు కలిగినప్పుడు సున్నము లేక కాల్షియము లవణము లోపించినదని గ్రహింపవలెను. ఇట్లే మజ్జాతంతువుల కోశములలో (nerve-cells) జబ్బుగానున్నయెడల మగ్నీషియాఫాస్ఫారికం వాడవలెను. మరియు కండరకోశములు (muscle-eclls) లో కాలిఫాస్, నేట్రం, ఫెర్రం లవణములు, కాలీమూరును, ఉన్నవనియు, త్రికాస్థికోశములు (cartila-ge-cells) ఆమత్వచకోశములు (mucous-cells) లోను, ఇతర ద్రవ ఘన పదార్థములలోను నేట్రంమూరు ఉన్నదనియు నెరుగవలెను. ఇట్లే యేయేలవణము ఏయేకోశములోను, అవయవములోను, కండరములోను ఉన్నదియును, ఏ అవయములో, శరీరములోని యేభాగమందు, ఏపదార్థమందు ఏలవణములు సహజస్థితిలో నుండనదియు జరిగినచో దానినిబట్టియు, రోగస్థానమునుబట్టియు, రోగబాధలను, లక్షణములనుబట్టియు ద్వాదశలవణములలోను లోపించినట్టిదానిని సులభముగ గుర్తింపగలము.

రోగియందున్న లవణలోపమును గ్రహించిన పిమ్మట మిగిలిన చికిత్సాపద్ధతులు సులభమే. హోమియోపతి వైద్యములోనవలెనే, ఈ లవణములుకూడ స్వల్పమోతాదులలోనే యివ్వవలెను. సూస్లరుగారు సాధారణముగా లవణములు 6 X వాడు చుండెడివారు. ఫెర్రంఫాస్, కాల్కేరియా, ఫ్లోరికాలు మాత్రము 12 X లో ఉపయోగించుచుండిరి.

పథ్యపానములు మొదలగు విషయములన్నియు అన్ని వైద్యములందు నొకేరీతిగా నుండును. సాధ్యమైనంతవరకు ప్రకృతిమార్గము నవలంబించి సాత్వికాహార నియమములు పాటించిన మేలు కలుగును. ఈద్వాదశలవణముల సంగతి నీక్రింద కొంచెము సూచించెదను.

1. కాల్కేరియా ఫ్లోరికా—ఎముకలు, దంతములు, చర్మము, దేహములోనుండి సాగుచుండెడు మృదువైన తాంతవములలో నుండును. ఈ లవణము లోపించినప్పుడు దంతరోగములు, చర్మరోగములు, కదుములుకట్టుట, నరముబిళ్లలు, గిత్తులు వాచుట, కంటిలోపువ్వు, పంటియిగుళ్లు ఉబ్బుట, మూలశంక, స్త్రీమర్మావయవము స్థానముతప్పుట, మొదలగు అనేకరోగములు కలుగును.

2. కాల్కేరియా ఫాస్ఫారికా—ఇది అన్ని జీవాణువులలోను, ముఖ్యముగా ఎముకల (bone-cells) లోను నుండుటవలన దీనిలోపమున, క్షుణక్షుణమును మార్పుచెందు జీవాణువులను బాగుచేయుటయు, క్రొత్తజీవాణువులు తయారు చేయుటయు ఉండదు. రక్తవిహీనము, అజీర్ణము, ఎముకలు బలపడకపోవుట, చిన్నబిడ్డల రికెట్సు వ్యాధి, తిమ్మిరిరోగము, ఉడ్పులు మొదలగు వ్యాధులలో ఈలవణము అమోఘముగా పనిచేయును. ఇది గొప్ప బలవర్ధకౌషధము (Tonic).

3. కాల్కేరియా సల్ఫ్యూరికా—ఈలవణలోపమున వ్రణములు, కురుపులు మొదలగు చర్మవ్యాధులును, శరీరమందలి పసుపురంగుగల విసర్జనములును, కర్ణరోగములును, రొచపుండు మొదలగు రోగములును గలుగును.

4. ఫెర్రం ఫాస్ఫారికా—ఇది దేహమందలి యెఱ్ఱరక్తములోను, యెఱ్ఱ రక్తకణములలోను ఉండును. ఇది లోపించిన యెడల జ్వరము, ఉష్ణము, వాపులు, రక్తహీనము, దగ్గు, అజీర్ణము, మేహవాత్రము, రక్తస్రావములు, రొంపలు, అతిసారము, చెవిపోటు, మూలశంక, తలనొప్పి, గుండెదడ, నరములసలుపు, బెణుకులు, గాయములు, దంతముల యిగురు ఉబ్బులు, ఊపిరితిత్తుల రోగములు మొదలగు రోగములు కలుగును. ఇది సాధారణముగా అన్నివ్యాధులలోను ప్రథమావస్థయందు పనిచేయును. దీనినే "శెడిమేకరు" గారు సర్వరోగనివారిణి (universal remedy) అని యున్నారు.

5. కాలీమూరు—ఇది దేహములో అన్ని జీవాణువులలోను ఉన్నది. దేహమందలి తాంతవపదార్థముతో గూడి పనిచేయును. ఇది తెల్లని దేహవిసర్జనము లున్నప్పుడు ఎక్కువగా పనిచేయును. ఫెర్రంఫాస్ ఉపయోగించిన పిమ్మట రోగములో ద్వితీయావస్థయందు సాధారణముగా ఉపయోగింపును. కర్ణరోగములలోను, కర్ణస్రావములలోను, చెవులు ఘుడియలుపడుట, చెవిలో హోరుమనుధ్వని, దగ్గులు, గొంతుక బొంగురుపోవుట, కాలేయము మందముగా పనిచేయుట మొదలగు వ్యాధులలో పనిచేయును.

6. కాలీఫాస్ఫారికం—ఇది నాడులలోను, మెదడులోను, నరములలోని ద్రవములందును, రక్తమందలి తెల్లజీవకణముల (white corpuscles)లోను యుండును. ఇది లోపించినప్పుడు కలుగు మనోవ్యాధులు, హిస్టీరియా, అనిద్ర, పిచ్చి, పక్షవాతము, టైఫసు విషజ్వరము, శరీరమందలి రక్తము విషపూరితమగుట మొదలగు వ్యాధులలో నిది పనిచేయును. ద్వాదశలవణములలో నిది చాలగొప్పది. అన్నిమానసిక రోగములలోను పనిచేయును. మూర్ఛ, విచారము, జ్ఞాపకశక్తి పోవుట, సంధివాతము, పురుషేంద్రియ నీరసము, టైఫాయిడ్డు, మశూచికము, ఉబ్బసము, వ్రణము, చెముడు, అతిమూత్రము, కలరా, అతిసారము, రక్తస్రావము, శరీరవిషపూరితవ్యాధులు మొదలగు అన్ని రోగములలోను ఇది చాలా పేరుపొందిన మందు. ఇది మెదడును బలపరచును.

7. కాలీసల్ఫ్యూరికం—ఇదియు అన్ని కోశములందు నుండును. ఇదిలోపించినప్పుడు నీరసము, మందముగా బరువుగా నుండుట, తలనొప్పి, అవయవములలో నొప్పులు, తలత్రిప్పును కలుగును. గదులలోను, ఇంటిలోను ఉన్నంతకాలము బాధగానుండును. రొంప, పొంగు, శ్వేతధాతురోగములు, ఉబ్బు, ఉబ్బసము, కర్ణరోగము, కోరింతదగ్గు, సవాయి, క్షయ, కుసుమ, అజీర్ణము, అతిసారము మొదలగు రోగములలో నిది పనిచేయును,

౮. మగ్నీషియా ఫాస్ఫారికా—ఇది కండరములు, మెదడు, రక్తజీవాణువులు, వెన్నెముక, నరములు, ఎముకలు, దంతములలో నున్నది. ఇది లోపించుటతోడనే ఈడ్పులు, పక్షవాతములు కలుగును. రోగి వేడిమివల్లను, గట్టిగా అదిమి బాధనొందు చోట పట్టుకొనుటవల్లను ఉపశాంతి బొందును. నరముల బాధ, దంతములనొప్పు, మూర్ఛ, శూల, వణుకు, కాలుచేతులు కొట్టుకొనుట, ఎక్కిళ్లు మొదలగు వ్యాధులలో నిది చక్కగా పనిచేయును.

౯. నేట్రంమూరు—ఇది సముద్రలవణము. ఈలవణము జలమునాకర్షించును. ఇది లోపించుటవలన జీవాణువులోని కాకర్షించబడవలసిన జలము ఆకర్షించబడక, నిలిచిపోవుటవలన ఉబ్బు, నంజు మొదలగువ్యాధులు కల్గును. రోగులు త్వరలో అలసిపోవుట, చేతులు కాళ్లును చివర మిక్కిలి చల్లగానుండుట, ఉప్పు ఎక్కువగా తినవలెనని యుండుటయు ఈలవణము లోపించినదని గుర్తించుటకు సూచనలు. ఆహారము పుష్టిని కలుగజేయలేకపోవుట, కృశించుచుండుట, కళ్లంట నీరుకారుట, రొంప, నోట నీరూరుట, గుండెలో మంట, చలిజ్వరము మొదలగు వ్యాధులకు నేట్రంమూరు దివ్యౌషధము. స్త్రీలవ్యాధులు క్షయ, రొంప, దగ్గు, తెల్లకుసుమ, అతిసారము, మలబద్ధము, మేహవాతములలో నిది ఉపయోగింపదగు.

10. నేట్రంఫాసు—ఇది కండరములు, రక్తము, నరములు, మెదడు, జీవాణువుల మధ్యనుండు ద్రవములలోను నుండును. ఈలవణము దేహములో తగ్గినయెడల, శరీరములో పుల్లని ఆమ్లపదార్థము (Acid substance) బయలుదేరును. పుల్లనిత్రేన్పులు, వాంతులు, పసిబిడ్డల విరేచనములు, ఆమ్లము, మేహవాతము, బంగారమువంటి రంగుగల విసర్జనములు, నాలుక పచ్చగానుండుట, అజీర్ణము కలుగును. కడుపులో ఆంబము, అజీర్ణము, వికారము, నులిపురుగులు, గుండెమంట, శీతజ్వరము, స్త్రీలవేవిళ్లు, ఇత్యాదిరోగములలో నిది చెప్పినమందు.

11. నేట్రంసల్ఫ—ఇది శరీరములోనున్న, పనికిరాక స్తంభించిన అనవసరపదార్థమును, ఎక్కువనీటిని బయటకు పారద్రోలు లవణము. ఇది లోపించినప్పుడు నాలుక పచ్చగాను, ఆకుపచ్చగాను, ఉండును, విసర్జనములు కూడ నదేరంగు కలిగియుండును. నోరు చేదుగానుండుట, చేదుగానుండు పసరువాంతులు, పైత్యజ్వరము, పైత్యము, కాలేయము నొప్పిగా నుండుట, కామెర్లు, అతిమూత్రము, అతిసారము, చలిజ్వరము, తలత్రిప్పు మొదలగు వ్యాధులలో నేట్రంసల్ఫ ప్రయోగించవలెను. వర్షకాలములోను, తేమగా నున్నప్పుడు ఎక్కువ ఉద్రేకముగానుండు రోగములకు నేట్రంసల్ఫ మంచిమందని కనుగొనబడినది.

12. సిలీసియా—ఇది చర్మము, తలవెంట్రుకలు, గోళ్లు మొదలగువానిలో నుండును. ఈలవణము లోపించినప్పుడు, చీముపట్టుటయు, సదా చీముకారుచుండెడు మార్గములు దేహమున బయలుదేరుటయు జరుగును. గోళ్లు పిప్పిగా నుండుటయు, పెళుసుగా నుండుటయు, తలవెంట్రుకలు రాలిపోవుటయు, చెమట దుర్వాసన చెందుటయు, పాదములు, చంకలును దుర్వాసనపొందుటయు, శీతలవాయువు భరించలేకుండుటయు గుర్తించినప్పుడు సిలీసియా లోపించినదని గ్రహింపవలెను. ఇది రాచపుండ్లు, కురుపులు, మేహవాతము, చీముకారుట, ఎంతకును కుదరని కురుపులు, పాదములచెమట, కనురెప్పలమీద పుండ్లు, గోరుచుట్లు, తలనొప్పి, కాలుఒరుపులు, ఇత్యాదిరోగములలో విశేషముగా పనిచేయునని సూస్లరుగారి అభిప్రాయము.

ఈద్వాదశలవణములను గురించి వ్రాయవలసిన అంశములు ఇంకను అనేకముగా యున్నవి. అన్నియు విపులముగా వ్రాయుటకు ఒకగ్రంథము ప్రత్యేకముగా వ్రాయవలెను. ఈవ్యాసములో నావకాశము లేదు.

ఇంకను విశేషముగా వీటినిగూర్చి తెలిసికొనగోరువారు సూస్లరుగారి Abridged Therapy, Carey's Biochemistry, Chapman's biochemistry, Vondergoltz Tissue Salts, Anshutz గారి guide to Tissue Remedies అను గ్రంథములు చదివిన యెడల, సూస్లరుగారి శాస్త్రసూత్రములను గ్రహింపగలుగుదురు.

సూస్లరు వైద్యమునుగురించి యింకను ప్రశంస చేయవలసినది యున్నది. సూస్లరు తనశాస్త్రమువలన ప్రపంచమునకు మహోపకారము చేసియున్నాడు. సూస్లరు ఔషధములు స్త్రీలుసహితము స్వేచ్ఛగా వాడవచ్చును. వైద్యమంతయు సంగ్రహించి లక్షణములలో నిమిడ్చినారు. వైద్యమునకాధారమైన సూత్రములు, స్వల్పకృషితో బోధపడగలవు. బీదవారుసహితము కొనగలరు. సూస్లరుమందులు అల్లోపతి మొదలగు నితరవైద్యములవలె క్రొత్తరోగములను తెచ్చిపెట్టవు. ద్వాదశలవణములును దేహముయొక్క స్వాభావికస్థితిలో దేహములో కలిసియుండుటచే, శరీరమున కన్యపదార్థము గాక స్వాభావిక పదార్థమే అయియుండుటవల్ల ప్రకృతిసూత్రములనుగూడ ననుసరించియున్నది.

అన్నివిధములను శ్రేష్ఠమైన ఈవైద్యవిధానమును ప్రతిసామాన్యగృహస్థుడును అవలంబించి, యెవరిగృహమునకు వారే వైద్యులై యుండి భేషజములతో రోగులను మోసపుచ్చు డాక్టరుల బాధలనుండి తప్పించుకొనవలరనియు, అందుకొరకై ఈశాస్త్రమందు అభిరుచి కలిగించుటకును ఉద్దేశించి ఈవ్యాసము రచించితిని. ఈవైద్యవిధానమందు నేనును నామిత్రులగు మరికొందరును కొన్ని పరిశోధనలు చేయుచున్నాము. మరియొకతరుణమున విపులముగా మా పరిశోధన ఫలితములను ఆంధ్రప్రపంచమునకు తెలియజేయగలమని నమ్ముచున్నాను.

# హోమియోపతి

డాక్టరు లంక రామారావుగారు, హెచ్. యం. బి.

ప్రపంచము యొక్క సృష్టిజాల మంతటిలోను ఉత్కృష్టమైనది మానవజన్మము. సర్వలీలామయుడగు భగవానుడు ఏమహాదాశయముతో ఈమానవుని సృష్టించినాడో, అట్టి మహాదాశయము నితడు నెరవేర్చినప్పుడే యితని జన్మము సార్థకమగును. ఇట్టి ఆశయమును నెరవేర్చుటకు ప్రతిమానవుడును అతిపరిశుద్ధముగాను, నిర్మలముగాను, యుక్తాయుక్త వివేకజ్ఞానము గలవాడుగాను, దృఢశరీరుడుగాను నుండవలెను. ప్రకృతికి వ్యతిరేకమైనట్టియు, అస్వాభావికమైనట్టియు నడవడికలచే ఉత్కృష్ట కార్యములు చేయదగిన యీమానవవ్యక్తి అల్పమైన పశువుకన్నను హీనముగా నగుచు శరీరదార్ఢ్యమునుగూడ గోల్పోవుచున్నాడు. ఎట్టికార్యము చేయుటకునైనను మానవుడు ముఖ్యముగ ఆరోగ్యవంతుడై యుండవలెను. అమూల్యమైనయట్టి ఆరోగ్యమును చెడగొట్టుకొనిన మనుజుడు ఈప్రపంచమున ఏమి చేయగలడు? ప్రస్తుత పరిస్థితులలో సామాన్యముగా ప్రతివారును [illegible], యింద్రియములను స్వాధీనపరచుకొనలేక అనేకదుస్థితులకు లోనగుచున్నారు. మిక్కిలి శీతలదేశవాసులగు పాశ్చాత్యులు అవలంబించు పద్ధతులు ఉష్ణదేశవాసులమగు మనము అభ్యసించిన ఎట్లు సరిపడును? అందుచే మనము అనేకరోగములకు పాల్పడుచు బలహీనుల మగుచున్నాము. మన పూర్వులలో, యిట్లుగాక సక్రమమైన నియమములతో నడచుకొని, దృఢశరీరులయి, చిరంజీవులుగా నుండిరి. ఏకారణముచేతనైనను ఆరోగ్యము చెడినప్పుడు మనము అవలంబించు విధాన మెద్ది? ఎయ్యది ప్రకృతితో ఒప్పునట్టిదియు, నిరపాయకరమైనదియు, త్వరలో ఆరోగ్యమును కలుగజేయునదియు నగు వైద్యవిధానము? ఇదియే ప్రస్తుతమున ప్రతిమనుజుడును ఆలోచించవలసిన ముఖ్యవిషయము. ఇట్టి ఆలోచన ఏదియును చేయకయే సమీపముగా నుండు ఏఅల్పజ్ఞానియగు వైద్యునికో కబురు పంపించుట, అతడు రోగమును సరియగు నిరూపణ జేయకయే వారి పూర్వులు ఇటుల వాడిరను ప్రణాళిక ననుసరించి అతడేదియో మందు నిచ్చుట; దానివలన నివారణ కాక రోగము మరింత బలపడినప్పుడు ఏడాక్టరుగారినో అర్జంటుగా తెప్పించుట, ఆయన వెంటనే అస్వాభావికముగ సూదులతో రక్తములోనికి విషపదార్థమును ఎక్కించుట, ఇటుల రివాజుగా జరుగుచున్నదిగాని ప్రథమముననే బాగుగ యోచించి ప్రకృతికి వ్యతిరేకము కానట్టియు, శాస్త్రసమ్మతమైనట్టియు వైద్యవిధానమును అవలంబించుట లేదు.

ప్రపంచములో సర్వమానవకోటికి సరిపడునదియు, ప్రకృతికి సంబంధించినదియు, చక్కని శాస్త్రసంబంధమైన మూలసూత్రములచే కనిపెట్టబడినదియు, నిరపాయకరమైనదియు నగు వైద్యవిధాన మెద్దియన జర్మనీదేశీయుడును, గొప్ప తత్వ, రసాయనవేత్తయు, గొప్ప అల్లోపతీ డాక్టరు నగు శ్రీ శామ్యుయల్ ఫ్రెడరిక్ హానిమను అను మహనీయునిచే సుమారు 150 సం॥ క్రిందట కనిపెట్టబడిన హోమియోపతి అను వైద్యవిధానము. ఇది కనిపెట్టబడిననాటినుండియు పాశ్చాత్యదేశములలోను, మన దేశమందు బెంగాలు మున్నగు ఉత్తరహిందూస్థానమందును నేటివరకు దినదినాభివృద్ధి గాంచుచునే యున్నది. ఈశాస్త్రమును కనిపెట్టకపూర్వము వైద్యవిధానములు ఎటులుండెనో మనము తెలుసుకొనవలసియున్నది. అల్లోపతి విధానమునందు అప్పటిరోజులలో ఒక్కొక్క రోగమునకు 30 లేక 40 మూలికలను కలిపి యిచ్చుచుండెడివారు. ఇది అయినను డాక్టరు స్వతంత్రించి యిచ్చుటకు వీలులేదు. ఈయన ప్రిస్క్రిప్షను వ్రాసిన తరువాత దానిని ఒకరసాయనశాస్త్రజ్ఞుడు సరిచూచెడివాడు. పిచ్చివాండ్రను రోగులని తలంచక అతిక్రూరముగా బాధించుచుండెడివారు. శరీరమునందు ఎక్కడనైనను వాపులుగాని, వ్రణములుగాని బయలుదేరినప్పుడు వాటికి జలగలను ఎక్కించి రక్తమును తీసివేయుచుండెడివారు. జ్వరముగాని, రక్తపుపోటు (Blood Pressure) గాని వచ్చినప్పుడు కొంతరక్తమును తీసివేయుచుండెడివారు. ఇటువంటి ఘోరకృత్యములను హానిమనుగారు సహింపలేక వైద్యశాస్త్రము యొక్క లోపమునుగురించి విమర్శన ప్రారంభించినారు. కొంతకాలము విమర్శించిన పిదప పిచ్చి అనునది ఒకరోగమనియు, దానిని ఔషధములచే నివారణచేయవచ్చుననియు చెప్పి, అటుల కొన్నిటిని నివారణచేసి లోకమునకు చూపించినారు. నాటినుండియు పిచ్చివాండ్రను బాధించక రోగులని భావించి వైద్యముచేయుచు, ప్రతిరోగమునకును చాల మూలికలను కలుపుట మానివేసి నాలుగైదు మూలికలనే కలుపుచు, రక్తపుపోటు అధికముగా నున్నప్పుడు రక్తమును తీసివేయుట మాని ఔషధములచేతనే దానిని నివారణచేయుచున్నారు. వైద్యవిధానమునందు గొప్పమార్పులు ఇతడు చేయుటచే మిక్కిలి ప్రఖ్యాతి గణించినాడు. కాని ఇతడు కనిపెట్టిన నూతనవిధానమగు హోమియోపతీ మందులు వాడుటకు లైసెన్సు ఇచ్చినారుకారు. అందుకొరకితడు అనేకకష్టముల కోర్చి తుదకు ప్యారిసునగరమున

తన ఔషధములు తాను వాడుకచేయుటకు వైసెన్సు పొంది, అనేక అసాధ్యములైన రోగములను కుదర్చి ఈశాస్త్రముయొక్క గొప్పతనమును లోకమునకు వెల్లడిచేసినాడు. ఈసమయములోనే యీశాస్త్రమునకు ప్రమాణమగు ఆర్గనాన్ అను పవిత్రగ్రంథమును వ్రాసినాడు. ఈతనికి పూర్వమందు రోగమును నిర్మూలించుటరేు కష్టముగా నుండెడిది. రోగోత్పత్తికి కారణము అనేకులు అనేకవిధములుగా చెప్పుచుండెడివారు. కొందరు శరీరాంతర్భాగములయందు అన్యపదార్థసమ్మేళనమనిన్నీ, కొందరు శరీరమందుండు లవణములు లోపించుటచే కలుగుచున్నవనిన్నీ, కొందరు రక్తములోను, మేదస్సులోను కలుగు మార్పులచే కలుగుచున్నవనిన్నీ, కొందరు క్రిములచే కల్గుచున్నవనిన్నీ, కొందరు వాత, పిత్త శ్లేష్మోద్రేకముచే కలుగుచున్నవనిన్నీ నేటికిని చెప్పుచున్నారు. అందుచే వారివారి యభిప్రాయానుసారముగా వారి బుద్ధికుశలతకొలది ఒక్కొక్క క్రొత్తవిధానమును కనిపెట్టి లోకమునకు వెల్లడిచేసినారు. కాని యేశాస్త్రమును ఈ హోమియోపతీశాస్త్రమువలె అతినిర్దిష్టమయినదియు, నిరపాయకరమైనదియు ప్రకృతికి సంబంధించినదియు నగు మూలసూత్రముపై నిర్మింపబడి యుండలేదు. ఆకారణముచేతనే ఒక్కొక్క బుద్ధిమంతుడు బయలుదేరినప్పుడెల్లను ఏవియో కొన్నిమార్పులు చేయుచు నూతనవిధానము కల్పించుచున్నారు. అటువలెగాక యీహోమియోపతి వైద్యవిధానము ప్రథమమునుండియు తగిన శాస్త్రసమ్మతమగు పద్ధతులపైన నిర్మింపబడినది. కాన నేటివరకు ఏ విధమైన మార్పులు లేకయే దినదినాభివృద్ధిగాంచుచున్నది. ఈశాస్త్రమున నుండిన "లా" ఏది యన, ఆరోగ్యవంతుడగు మానవుడు ఏమూలికను దానిసహజస్వరూపమున ఎక్కువ మోతాదులో తీసికొనిన ఏయేలక్షణములను పుట్టించునో అట్టి లక్షణములకు ఆమూలికనే అణుస్వరూపమున నిచ్చిన నివారణచేయును.

దీనినే సారూప్యమందురు. అనగా లా అఫ్ సిమిలర్సు, ఇందుకు వ్యతిరేకముగా అల్లోపతి విధానమునందు వాడెదరు. ఎటులన, విరేచనబద్ధమునకు భేదిమందులున్ను, నిద్రలేమికి మత్తుమందులున్ను, అత్యుష్ణముగా నున్నప్పుడు అతిశీతలోపచారములున్ను చేయుచుందురు. అవి ప్రథమావస్థలో (Primary action) లో కొంత పనిచేసినను ద్వితీయావస్థ (Secondary action ) లో రోగమును, మఱింత బలము చేయుచున్నవి. ప్రథమమున కలిగిన సుగుణమునకే సంతసించుటమిగాని తరువాత నేమి జరుగుచున్నదియు యోచించుట లేదు. ఈహోమియోపతీవిధానమునందు అన్ని ఔషధములను ఆరోగ్యవంతులగు మానవులు వాడి వాటియొక్క నిజతత్వమును వస్తుగుణదీపికగా వ్రాసినారు. ఇటు లేవైద్యవిధానమునందును మూలికలు రుజువుచేయబడలేదు. అల్లోపతీవిధానములో ఈ ఔషధములన్నియు కుక్కలు, పిల్లులు, కుందేళ్లు మొదలగు జంతువులమీద వాడినవియు, రోగములకు వాడి వాటి అనుభవము కనిపెట్టినవియు గాని ఇటు లారోగ్యవంతులగు మానవులు ఋజువుచేయలేదు. రోగము వచ్చినప్పుడు శరీరముపైభాగమునకు కనుపించులక్షణములు కొన్నియును, మానసికలక్షణములు కొన్నియును ఉండును. నోరులేని జంతువులమీద మూలికలను ప్రయోగించిన వాటి బాధలు గాని, వాటియొక్క మానసికలక్షణములు గాని మన మెటుల గ్రహింపగల్గుదుము? ఆకారణముచేతనే యీఅల్లోపతికి లా లేదు. హోమియోపతిలో నీవు ఎటుల రోగమును కుదర్చగలవని ప్రశ్న జనించినప్పుడు ఇదివరలో రుజువుచేసిన మూలికలయొక్క లక్షణములు గమనించి, ఆరోగముయొక్క లక్షణములకు సరిపడు మూలికను ప్రయోగించిన ఆరోగ్యమును తప్పక నివారణచేయును అని స్పష్టముగా చెప్పగలము. కాని అల్లోపతిలోనైతే దానికి విరుద్ధముగా నుండు లక్షణములుగల మందును ప్రయోగించిన నెటుల కుదుర్చును? అటులనిన ఆవిధానములో రోగము లేమియు కుదురుటలేదా అని ప్రశ్న జనింపవచ్చును. సాధారణముగా ఈ విషపదార్థప్రయోగముచే రోగములు తాత్కాలికముగా ఉపశాంతి చేయబడుచున్నవిగాని కుదురుటలేదు. ఒకవేళ ఏవైనను కుదిరినయెడల ఆమూలికలలో కొన్నియైనను సారూప్యలక్షణములుండవలెనుగాని ప్రత్యేకవైరూప్యలక్షణములవలన గాదు. హోమియోపతి వైద్యవిధానమునుగురించి కొంత తెలిసికొనవలెనన్నప్పుడు శ్రీహానిమనుగారు వ్రాసిన పవిత్రగ్రంథమగు ఆర్గనాన్‌లో వ్రాసిన కొన్నిమూలసూత్రములనైనను తెలుసుకొన్నగాని మనము వారి అనుచరులము గానేరము. ఆయన ప్రథమమున మొదటి సూత్రములో వైద్యునియొక్క ముఖ్యమగు ధర్మమేమి యనునది వ్రాసినారు వైద్యునియొక్క ప్రధానధర్మము రోగులను ఆరోగ్యవంతులుగ జేయుటయే. దీనిని రోగమును కుదర్చుట యందురు. కాని ప్రస్తుతము మన డాక్టరు సోదరులు చేయుచున్నట్లు మావైద్యవిధానమే గొప్పదనియు, మేమే పండితులమనియు చెప్పుచు రోగములకు పెద్దపెద్ద పేర్లనుపెట్టి రోగులను గాబరాచేసి డబ్బులాగుట వైద్యుని ధర్మము గాదు. మరియును అటువంటిధర్మము తెలిసిన వైద్యునియొక్క వ్యాధినివారణ ఎటు లుండవలెననిన, అతివేగముగాను, సాత్వికముగాను, నిరపాయకరముగాను, శాశ్వతముగాను నుండవలెను గాని శరీరోపరిభాగమందు కాన్పించు లక్షణములను ఏవైన విషపదార్థ సంపర్కము కల్గిన ద్రావకములచేతను, ఆయింటుమెంట్లచేతను, కత్తిచేతను రూపుమాపుచేయుట వ్యాధినివారణ యనబడదు.

దానిని లోపలికి త్రోసివేయుట యందురు. అనగా రోగములు తాత్కాలికముగ అణచిపెట్టబడుచున్నవి. తరువాత వైద్యునియొక్క ధర్మములలో ఇంకనొకటి యేమనగా, ప్రతిరోగములోను కుదర్చవలసినది ఏది? అనగా రోగనిదానమున్ను, ప్రతిమూలికయొక్క తత్వమున్ను, అనగా ఏయేరోగలక్షణములకు ఏయే ఔషధము పనిచేయునో దానిని తెలిసికొని ఆరోగమునకు సరిపడు ఔషధమును వెతుకుటయు, దానిని ఎంతమోతాదులోను, ఎంతకాలములోను వాడవలసినదియు తెలుసుకొని వైద్యముచేయునప్పుడే అతడు శాస్త్రసమ్మతముగా చేయుచున్నాడని యోచింపవలెను. ఇదివరలో రోగోత్పత్తికి

కారణము అనేకులు అనేకవిధములుగా చెప్పిరని వ్రాసియున్నారు కాని శ్రీహానిమనుగారు రోగ మనగా శారీరకముగాను, మానసికముగాను కలుగు మార్పే యని నుడివినారు. అనగా ఆరోగ్యవంతుడుగా నున్నప్పు డుండు పరిస్థితులను, జబ్బుగానున్నప్పు డుండు పరిస్థితులను రోగి స్వయముగా గ్రహించును. తనస్నేహితులును, వైద్యుడును పైకి కనబడు లక్షణములను పరికించును. ఈ అన్ని లక్షణములయొక్క సముదాయమే రోగమని చెప్పినారు. మరియు శరీరాంతర్భాగమందు కలిగిన మార్పులను సవరించుటకయి చైతన్యశక్తి (Vital-force) చేయు ప్రయత్నమే బాహ్యమునకు రోగచిహ్నములుగా కాన్పించును. అట్టి చిహ్నములన్నియు కలియుటయే రోగ మనబడుచున్నది. ఇప్పుడు చైతన్యశక్తి యన నేమి, దానిపని యేమి యనగా, శరీరాంతర్భాగముల నన్నిటిని (Material Body) ఒకవిధమైన ఆధ్యాత్మికశక్తి పరిపాలించుచుండును. అటుల పరిపాలించుటచేతనే అన్ని అవయవములు క్రమశిక్షణలో నుండి సరియగుపనిని నెరవేర్చుచున్నవి. అటువంటి ఆధ్యాత్మికశక్తి లేకపోయిన నీశరీరావయవము లన్నియు నిర్జీవములు, గనుక వానికి పరస్పరసంబంధము కలదు. ఆకారణము చేతనే రోగము వచ్చినప్పుడు ప్రథమమున మార్పుచెందునది యీఆధ్యాత్మికశక్తియే. రోగగ్రస్థమైన యీచైతన్యశక్తి యీభౌతికశరీరమును ఎటుల పాలింపగలదు? అందుచేతనే యీభౌతికశరీరములో నున్న కొన్ని అవయవములుకూడ జబ్బుపడినవాటియొక్క విధ్యుక్తకర్మములను నెరవేర్చలేక యున్నవి. అప్పుడే శరీరము రోగగ్రస్థమైనదని చెప్పబడుచున్నది. కనుక రోగమనిన శరీరాంతర్భాగములయందు కల్గిన మార్పులను ఆధ్యాత్మికశక్తి బాహ్యరూపమున వెలుపరించు చిహ్నము లేకాని యితరవైద్యులు తలంచునట్లు ఈశరీరమునకుగాని, జీవాత్మకుగాని సంబంధములేక లోపల నేదియో దాగియున్నదని చెప్పుట అసంభవమై యున్నది. రోగనివారణయందు మనము ముఖ్యముగ గమనింపవలసినది యీ ఆధ్యాత్మికశక్తిని మార్పుచేయగల ఔషధములను ప్రయోగించుట. అనగా రోగమునకు ఏలక్షణములు గలవో అట్టిలక్షణములుగల మూలికనే ప్రయోగించినగాని యీచైతన్యశక్తిని మార్పుచేసి రోగనివారణ చేయదు. రోగలక్షణములకు వ్యతిరేకలక్షణములుగల మూలికను ప్రయోగించిన రోగమును నివారణచేయలేకపోవుటయే గాక తాత్కాలికముగా అణచిపెట్టుచు ఇంకను కొన్ని క్రొత్తలక్షణములు పుట్టించుచున్నది. హోమియోపతీలో మనము మూలికలచే కల్పించుచున్న రోగలక్షణములు అసలురోగమునకు ఏలక్షణములు గలవో సమముగా అటులే యుండవలెనుగాని వాటికన్న కొంచెము బలవత్తరముగా నుండవలెను. రెండు సమానవస్తువులు ఒకచోట నుండుటకు వీలులేకపోవుటచేత, బలవంతుడు బలహీనుడని లాగివేయునట్లు ఈకల్పిత రోగము అసలురోగమును లాగివేయును. కాని మనము కల్పించిన రోగము క్రమేణ దానంతట యదియే బలహీనమై ప్రకృతిచే త్రోసివేయబడుచున్నది. కనుక మనము ఏరోగమునైనను కుదర్చవలెనన్నప్పుడు రోగమునకు ఏలక్షణములు గలవో అట్టి లక్షణములుగల మూలికనే ప్రయోగింపవలెను. అందుకు వ్యతిరేకముగా వాడిన రోగనివారణ కాకపోవుటయేగాక రోగము మరింతబలపడి దీర్ఘవ్యాధిగా మారును. అన్నివైద్యవిధానములలోను చాలకష్టసాధ్యమైనది దీర్ఘరోగములను నివారణచేయుటయే. ఏలయనగ వీటియుత్పత్తి గ్రహించుటయే కష్టసాధ్యము. తరచు ఆరోగ్యముగానున్న వీటికి రోగచిహ్నములన్నియు బయటికి కనబడవు. చిరకాలమునుండి అన్నియు అణచిపెట్టబడును. ఏవియో కొన్నిలక్షణములు మాత్రమే కనుపించుచుండును వీటినివారణయందు మనము ముఖ్యముగ గమనింపవలసినవి ఏవన, వీటియొక్క ఉత్పత్తిక్రమమున్ను, రోగము ప్రారంభించిన నాటనుండియు ఏవిధముగా నడచినదియు, ఏయేమందులు వాడినదియు, రోగియొక్క మానసికలక్షణములున్ను, రోగియొక్క ప్రవృత్తియున్ను, సాంసారిక వ్యవహారములున్ను, ఆహారవిధానములును ముఖ్యముగనన్నియు రోగివల్లను, అతని బంధువులవల్లను, స్నేహితులవల్లను మనము పూర్తిగా తెలుసుకొనవలెను. శ్రీ హానిమను గారు ఈ దీర్ఘరోగముల ఉత్పత్తికి ప్రధాన కారణభూతములు మూడు విశేషకారణములు గలవని చెప్పినారు. అవి ౧. సోరా, ౨. సిఫిలిసు, ౩. సైకోసిసు. ఈ మూడింటిలో ఏదియైనను ఒకటైన లేకుండ ఏవ్యాధిగాని దీర్ఘరోగముగా మారజాలదు. ఈగొప్పరహస్యమును ఇతడు తప్ప ఇతరులెవరును ఇంతవరకు గ్రహింపలేదు. హానిమను గారు వీటిని వర్ణించుచు సోరానుగురించి చెప్పుటలో వేయితలలుగల మహాపెనుభూతముని వర్ణించినారు. సోరా అనగా సమస్తచర్మవ్యాధులకు కారణభూతమైనది. సిఫిలిసు అనగా సవాయివలెను, సైకోసిసు అనగా సెగవలెను ఉండునుగాని అవియు ఇవియు ఒకటిగా నేరవు. వాటిలక్షణములు, వీటిలక్షణములు చాలవరకు సమముగా నుండును. ఈ త్రిమూర్తులు మానవశరీరమును ఆవహించి అనేక దీర్ఘరోగములకు పాల్పడచేయుచున్నవి. హానిమనుగారు ఈ రహస్యమును కనిపెట్టియుండుటచేతనే యీ వైద్యవిధానమునందు అనేకదీర్ఘరోగములు కుదర్చబడుచున్నవి. ఈ విధానములో రోగమునకు మూలకారణ మేదియో గ్రహించి వానిని నిర్మూలించుటకు వైద్యము చేయుదురు గాని పైకి కాన్పించు ఏవియో కొన్ని బాహ్యచిహ్నములను రూపుమాపుచేసి రోగము నివారణయైనదని చెప్పరు. ఈ వైద్యవిధానములో అన్నిమందులున్ను అన్నిస్వరూపములలో వాడుదురు గాన నిరపాయకరములు. ప్రతి ఔషధమున్ను ఎంత తక్కువమోతాదులో వాడిన అంత ఎక్కువపని చేయును. ఔషధము మోతాదు ఎంత తగ్గిన అంత పరిశుద్ధముగా నుండును. అణుస్వరూపములోనికి వచ్చినప్పుడు మూలికయొక్క నిజమైన తత్వము ఏదో నిలిచియుండి, దానియొక్క విషమపరిస్థితి అంతరించి పోవును. ఈవిధానమునే ఆయుర్వేదమందు శుద్ధిచేయుట యందురు. అణువులయందు మహచ్ఛక్తియున్నదని మన పూర్వులున్నూ, ప్రస్తుత రసాయనశాస్త్రవేత్తలున్నూ చెప్పుచునే యున్నారుగదా! అదియునుగాక మనశరీరోత్పత్తికి కారణభూత

మైనది ఒకజీవాణువు (Cell). దానిని దుర్భిణియంత్రముతో గాని చూడలేము. ఆజీవాణువే రెండుగాను, నాలుగుగాను ఇట్లు అనేకవేలు లక్షలుగా ఒకనిమిషములో అగుచున్నది. ఇట్టి కొన్ని జీవాణువుల సముదాయమే ఒకకోశము (Tissue). ఇటుల కొన్ని కోశములు కలియుటయే ఒక అవయవము (Organ) అగుచున్నది. ఇటుల వివిధములైన అవయవముల సంఘటనమే శరీరము. కనుక జీవాణువే శరీరోత్పత్తికి మూలకారణము. జబ్బుచేసినప్పుడుకూడ ప్రథమమున చెడునది యీ జీవాణువే. ఇది యెటుల ఉత్పత్తియగునో అట్లే లయమగుచుండును గాన మనము రోగనివారణయందు ఉపయోగించు ఔషధము ఆజీవాణువును ప్రథమమున పరిశుద్ధము చేయగలయునదిగా ఉండవలెను గాన మనము ఉపయోగించు మందుకూడ అతిసూక్ష్మముగా నుండినగాని జీవాణువులను బాగుచేయనేరదు. ఎక్కువ మోతాదు ఇచ్చిన ఈ జీవాణువులన్నియు ఈ ఔషధము తీవ్రతచే అణచిపెట్టబడును గాని బాగుపడనేరవు. కనుక ఏ ఔషధమైనను అతిచిన్నమోతాదులు వాడినప్పుడే యెక్కువ గుణము చేయును.

కాన నో ఆంధ్రసోదరులారా! ఏవైద్యవిధానమున రోగములు నిశ్శేషముగాను, త్వరగాను, సౌమ్యముగాను కుదుర్చబడుచున్నవో, యేవైద్యవిధానము అన్నివిధానములకంటెను శాస్త్రయుక్తమగు నిబంధనలపై నడుపబడుచున్నదో, యే వైద్యవిధానము నిరపాయకరమగునదియు, ఇతర దుర్గుణములు పుట్టింపనిదియునో యే వైద్యవిధానము కడుబీదలనుకూడ లభ్యమగునంతటి చౌకయైనదో, యే వైద్యవిధానము అరుచి పుట్టింపక మిక్కిలి తియ్యనిమందు గలదో చక్కగ యోచించి దానిని అవలంబించి మీశరీరారోగ్యము కాపాడుకొనగలందులకు వేడుచున్నాను.*

* ఈ వైద్యవిధానమును మిక్కిలి వ్యాప్తము చేయు నుద్దేశ్యముతో మేము ఈ గ్రామమున ఒకకాలేజీ స్థాపించి ఉచిత విద్యను నేర్పుచున్నాము. ఇంగ్లీషు రానివారికొరకై మేము ఆంధ్రమున "సాదృశ్యౌషధశాస్త్ర"మను నొక తెలుగు గ్రంథమును వ్రాసినారము. కాన ఆంధ్రసోదరులందరు మాఉద్యమమునకు తోడ్పడి మమ్ము ప్రోత్సహింపగలందులకు కోరుచున్నాము.

---

# ఆంధ్రగ్రంథమాల

నెం. 6, 7 తంబుశెట్టివీధి, చెన్నపురి.

ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధ విషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకటివంతున ప్రచురింపఁబడును. వెలువడిన గ్రంథములు:—

1. శతకమంజరి (భక్తిసంపుటము): వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, కాళహస్తీశ్వర, దాశరథి, రంగశాయి, రామతారక, రామచంద్ర శతకములు పది యిందు గలవు. ఒక్కొక్క శతకమునకు పీఠికయు, పాఠభేదములును గలవు. (ఈ శతకములు విడిగను దొరకును.) ౧-౮-౦
2. బసవపురాణము (ద్విపద): పాల్కురికి సోమనాథుఁడు. అనేక తాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ౨-౮-౦
3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము ౦-౪-౦
4. కమలాక్షి (చిన్న విచిత్రకథ): శ్రీ రాయసం వేంకటశివుడుగారు, యమ్.ఏ., యల్.టి. ౦-౮-౦

కాశీనాథుని నాగేశ్వరరావు, వ్యవస్థాపకుఁడు.

# కాలామృత గ్రంథకర్త

కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

ప్రస్తుతము ప్రచారములో నున్న జ్యోతిషగ్రంథములలో నాంధ్ర దేశమందు వాస్తుముహూర్తభాగములవిషయమై కాలామృతము విశేషము వాడుకలోనున్న దనుటకు సందియము లేదు. ఇతర జ్యోతిష గ్రంథములలోఁ గొన్నిటికంటె నిది సారళ్యముగా నుంటనో, లేక సారళ్యముగా నున్న కొన్నిటికంటెఁ గొంతవఱకు విశేషాంశములను సాకల్యముగాఁ దెల్పుటచేతనో జ్యోతిశ్శాస్త్రవాసన గల ప్రతివారికిని అక్షరాభ్యాస మిదిగానే గన్పడుచున్నది. కొందఱు జ్యోతిషపండితు లుత్తరోత్తరోత్కర్షంబట్టి ముహూర్త మార్తాండము, చింతామణి మున్నగు ప్రౌఢగ్రంథములం జూచి దీని నొక చిన్నచూపు చూచు చుండుట గలదు. మీఁదుమిక్కిలి తనకు దీనియందుఁ గల యనాదర భావముతోడనో, యాథార్థ్యమే తెలియుటచేతనో కాలామృతము వ్రాసినది కంసాలియని వ్యంగ్యముగా నర్థసూచన యగునట్లు కాలామృతకారకుఁడు అని హేళనగూడఁ జేయుట గలదు; కాని యట్టివారి భావ మాలోచించి చూచినచో సత్యమునకు దూర మయ్యెడు.

నిజమున కాగ్రంథకర్త యెవ్వరైనదియు నింతవఱకుఁ దెలిసినది గూడఁ గాదనవచ్చును. గ్రంథకర్తృత్వవిషయమై మన జ్యోతిషపండి తులుగూడ నంతగాఁ బ్రయత్నించినట్లును నగపడినట్లు తోఁపదు. ఈ యజ్ఞాతకర్తృత్వము వ్యాఖ్యాతకాలము నాటికే యున్నటున్నది. వ్యాఖ్యానారంభములో 'అథ తత్రభవాన్ స్వచికీర్షితస్య గ్రంథస్య...' అని కవినామము చేర్పకయే వివరించుటంబట్టి వ్యాఖ్యానమునాఁటికిని నీగ్రంథము వ్రాసిన కవి యెవ్వరైనదియు వ్యాఖ్యాతకే తెలియ లేదనుట స్పష్టము. గ్రంథాదినిగాని, యంతమునఁగాని యెచ్చటనేని కవి తన ప్రస్తావ మెత్తినవాఁడు గాఁడు. అచ్చువేయ నారంభించినదాదిగ నింత వఱకు నచ్చుపడ్డ గ్రంథములలో గ్రంథకర్తృనామము వేసినట్లు గాన్పింపదు. మొదట నచ్చువేయ నారంభించినవారికి దొరకిన వ్రాఁత ప్రతిలో లేకుండెనో యేమో! గతానుగతికత్వముగా నింతవఱకును నది యట్లే నిలిచిపోయినది. జిజ్ఞాసువుల కాగ్రంథకర్త యెవరా యను జిజ్ఞాసయట్టె యుండిపోయినది. కొంతమంది శాస్త్రవాసనాశూన్యులయ్యుఁ బండితమ్మన్యులయిన జ్యోతిషికబ్రువు లాగ్రంథము వ్రాసినది

'శ్రీమచ్చింతల పాటివంశజలధే
శ్శీతాంశునా... శ్రీమద్వేంకట......'

అను వ్యాఖ్యాత వ్రాసికొనిన శ్లోకములంబట్టి ఆచింతలపాటి వేంకటాధ్వరియే యని చెప్పఁగా విందుము. కొందఱు మహాశయులు కవితాలాలిత్యమునుబట్టి కాఁబోలు, కాళిదాసు వ్రాసెనని చెప్పఁగాను విందుము. కాని—అంత చిటికెల పందిలియే.

ఇదియే జిజ్ఞాసపడి నేనును గొంత విమర్శనబుద్ధితోఁ జూచుచు రాఁగా రాఁగా, అప్పకవీయములోఁ జతుర్థాశ్వాసమునఁ గ్రంథాదిగణ ప్రశంసలో "అనర్ఘ్య సువేసంబున మగణంబు వసుమతీదేవతాకంబుగాన శివప్రదంబని ... కాలామృతమునందు 'శ్రీమద్వేంకటనాయక' మ్మని మదీయాన్వయప్రభవుం డగు తిరుమల భట్టారకుండును" అని యప్పకవి యుదాహరించి యున్నవాఁడు. దీనిఁబట్టి కాలామృత గ్రంథకర్త యప్పకవివంశములోనివాఁడని తెలియుచున్నది. ఇక్కవి చంద్రుఁ డాంధ్రపండితుల మండనాయమానుఁ డనుటకలన మాత్ర భూమికిఁ గొండొక్క గౌరవము నిలుపఁ జట్టినవాఁడని సంతసింప వలసి యున్నది.

తిరుమల భట్టారకుఁడు అప్పకవికిఁ దాతసోదరుఁ డైనట్లు లప్పకవి వ్రాసికొన్న కర్తృవంశావతారములవలనఁ దెలియుచున్నది.

### అప్పకవి వంశవృక్షము



అప్పకవి తాతముత్తాతలనాఁటినుండియు ఆవంశములోఁ బరంపరగా విద్వత్పండితు లయి యుండినా రని యప్పకవీయములోని పీఠిక వలన విశద మయ్యెడు. అది పండిత కుటుంబము; రాజాస్థానములయందు వాదోపవాదములలో గెల్చి యగ్రహారాది బిరుదములను సంపాదించిన విద్వచ్ఛూరులు గల వంశము.

మన తిరుమల భట్టారకునకు ద్వితీయసోదరుఁడును, అప్పకవికిఁ దాతయు నగు పెదసోమయ

సీ. కట్టించె నెవ్వఁడు గుడినాపి వప్రద
క్షిణభాగమున రొంపిచెర్లలోనఁ
బెట్టించె నెవ్వఁడు పృథుతరారామంబు
గుడిపాటికడ వినికొండత్రోవ............

అని యప్పకవి చెప్పినట్లు రొంపిచెర్లలోఁ జెన్నూరాయి త్రవ్వించినట్లును, గుడిపాటిలో వినుకొండకుఁ బోవుమార్గమునఁ బెద్దవనము వేయించినట్లును దెలియుచున్నది. రొంపిచెర్ల నరసారావుపేట తాలూకాలో నున్నది. గుడిపాడును ఆప్రాంతములనే యుండవలెను. గుడిపూడి యని సత్తెనపల్లి తాలూకాలోఁ గలదు. గుడిపాడనునది యేదో! రొంపిచెర్లకు సమీపమునందే యుండియుండ నగు. కావున పెదసోమయ యీప్రాంత వాసిగా నుండవలయును. దీనిం బట్టి తిరుమల భట్టును నీప్రాంతముల వాఁడే యగును. కనుక నీతని జన్మస్థానము నరసారావుపేట కుండెను.

తిరుమలభట్టారకుఁడు అప్పకవికిఁ దాత సోదరుఁ డగుటవలనను అప్పకవి క్రీ. శ. 1656 సం. రముల ప్రాంతమునాఁ డగుటవలనను, క్రీ. శ. 1580 సం. ర ప్రాంతమున నుండవచ్చును. అనఁగా నిప్పటికి రమారమి నాల్గువందలయేండ్ల క్రిందటివాఁ డనుట స్పష్టము.

అప్పకవి చెప్పినప్రకారము కాలామృతము కాకునూరి తిరుమల భట్టారక ప్రణీతము అని నిశ్చయించుటకు సంశయము లేదు. కావున నిఁకముం దచ్చువేయు భాషోద్ధారకమహాశయులు, జ్యోతిశ్శాస్త్రపయోనిధిని మథించి కాలామృతము నుద్ధరించి పండిత పామరలోకము నకుఁ బంచిపెట్టిన పురుషోత్తముఁ డగు నప్పవిత్రజన్ముని నామధేయమును ఆంధ్రలోకమునకుఁ బరిచితముం జేయుటయుకాక, మనవారి భాషావాఙ్మయప్రపంచములో నింతవఱకును గల విషమాశయములను దూరీకరింతురుగాత మని కోరుచు నిప్పటికి నాతెలిసినవిషయ మాంధ్రలోకమునకుఁ దెలియపఱచు కొన్నాఁడ.

---

శృంగార హాస్య కరుణ రస ప్రసారకము

మనః పరిణామ నిరూపకము

వీరరస ప్రధానము

# వాల్మీకి

# నాటకము

నవరస ప్రవాహము

భక్తి వైరాగ్య శాంతి ప్రబోధకము

రాజకీయ సాంఘిక వైవాహిక సాంసారిక వేదాంత సారస్వతాద్యైహికాముష్మిక వివిధ ధర్మ తత్త్వ విచార ప్రచురము.

అపూర్వసంఘసంస్కరణ వసంతసేనాది కావ్యకర్త యగు

## కాళ్లకూరి గోపాలరావు గారు రచియించినది

శ్రీమద్దేశోద్ధారక

## కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు

అనుగ్రహపూర్వకముగ అంకిత మందినది.

కిరాతవనితను వరించి చోరుఁడై లోకకంటకుఁడైన ప్రాచేతసుఁడు రాజగుటకుఁ బ్రయత్నించుచుండ, వసిష్ఠవిశ్వామిత్రులు సంభాషణాభిమంత్రణంబుల నతనిని సంస్కరింతురు. ప్రాచేతసుఁడు తత్ప్రభావమువలనను గృహచ్ఛిద్రాదులవలనను విరక్తుఁడై, పశ్చాత్తప్తుఁడై, తారకమంత్రజపంబునఁ దరించి, వాల్మీకి యన మరల బ్రహ్మర్షియై, భక్తిప్రతిష్ఠాపనాచార్యుఁడై, జీవకారుణ్యమూర్తియై, కవియై, తుదకు సరస్వతీప్రసాదమునను నారదాదేశమునను శ్రీమద్రామాయణకర్త యగును. ఈ కథ యిందేడంకములలో నతిరమ్యముగ నభివర్ణింపఁబడినది.

సంస్కృతాంగ్లనాటకవిధానములందలి ప్రధానసంప్రదాయములు పాటింపఁబడినవి.

వెల రు. 1-0-0

**The Only Psychological**

# DRAMA

**In Telugu Literature**

పోస్టేజి వేఱే

ప్రకాశకులు: విశల్యా డిపో, 4, ఆచారప్పన్ సందు, జార్జిటవును, మదరాసు

# ౬. వేదాంతము

## ముక్తి విచారణ

కొటికెలపూడి యజ్ఞేశగారి నరసన్న గారు

శ్లో. *వందేహం తద్వర్గఘనసంఖ్య దోర్మూర్తి మన్మహః, రాశ్యోర్ఘాత హృతేవర్గ యోగో నయుతివర్గకే.

శ్లో. శ్రీరామాంఘ్రిసరోజ వందనరతం వాణీకటాక్షాగత శ్రుత్యంతార్థరహస్య భావితధియం కోదండరామాహ్వయమ్; ౧

గీర్వాణాంధ్రకవిత్వకల్పిత బహుగ్రంథవ్రజం పండితం, శ్రీమత్కొటికెలపూడి వంశ్య మనఘం వందే స్మదీయంగురుం. ౨

౧

సర్వలోక రక్షకుడగు సర్వేశ్వరుడు మనకు దయచేసిన వేదములందును, తదనుసరణములగు స్మృతి పురాణేతిహాసాదులందును ప్రవృత్తియు, నివృత్తియు అను రెండుమార్గములు గలవు.

ప్రవృత్తిమార్గమునందు ప్రవర్తించువారు ప్రకృతబద్ధులై సంసారసాగరమునబడి భ్రమించుచుందురు.

నివృత్తిమార్గమునందు సంచరించువారు నిర్విషయులై సంసారమునుండి విముక్తులగుచు మోక్షమును పొందుదురు.

ప్రవృత్తికి ప్రకృతిశాస్త్రాదులును, నివృత్తికి వేదాంతశాస్త్రాదులును ప్రధానములై యున్నవి.

అందు చతుర్విధ పురుషార్థములలో ధర్మార్థకామములను ప్రతిపాదించునవి ప్రకృతిశాస్త్రాదులు, మోక్షమును ప్రతిపాదించునవి వేదాంతశాస్త్రాదులు.

పురుషార్థ చతుష్టయములో నాలుగవదగు మోక్షమె పరమ పురుషార్థము.

తదితరములగు త్రి పురుషార్థములును అనిత్యము లగుటవలన ఉత్తమ పురుషార్థములు కావని.

శ్రు. తద్యథేహ కర్మచితో లోకక్షీయతే ఏకమేవాముత్ర
పుణ్యచితో లోకక్షీయతే

అను శ్రుతి వ్యక్తపరుచుచున్నది.

శ్రు. నస పున రావర్తతే

అను శ్రుతివలన చతుర్విధ పురుషార్థములలో మోక్షము ఉత్తమ పురుషార్థమనునది సుష్వ్యక్తము. అందువలననే శ్రీ వేదవ్యాసులవారు బ్రహ్మసూత్రములలో

సూ అథాతో బ్రహ్మజిజ్ఞాసా.

అను సూత్రమును ముందుగ విశదపరచిరి; కాన అందును గూర్చి విచారించెదము.

మోక్షమనగ సంసారబంధమునుండి విముక్తిని పొందుట. ఇది సర్వమత సంప్రతిపన్నము. మోక్షవిషయములో వివిధములగు మతములు గలవు. అందు వేదశాస్త్రేతిహాస పురాణాదులను ప్రమాణముగ పరిగ్రహించి ప్రవర్తించుచున్న భారతీయులు ద్వైతాద్వైత విశిష్టాద్వైతములను మూడుమతములును ప్రస్థానత్రయమునకు సమన్వయించి యున్నందున శ్రేష్ఠతరములుగ గ్రహించి అందు అద్వైతులు కించిజ్జత్వ సర్వజ్ఞత్వాదిలక్షణములుగల జీవేశ్వరులకు "తత్వమస్యాది" మహావాక్యములచే అభేదత్వమును ప్రతిపాదించుచు,

శ్రు. ఏకమేవా ద్వితీయం బ్రహ్మ.

అను శృత్యాదులనుబట్టి బ్రహ్మచైతన్యముకన్న సత్యమైనదేదియు లేదనియు, బ్రహ్మజ్ఞానమువలన ఆత్మానుసంధానము చేయుచు

---

*ఇష్టసంఖ్యలు 6,9.

రాశిఘాతం $6 \times 9 = 54$.

రాశి వర్గం $6^2 = 6 \times 6 = 36$.

,, ,, $9^2 = 9 \times 9 = 81$.

వర్గయోగం $6^2 + 9^2 = 117$.

ఇతి $6 + 9 = 15$.

ఇతివర్గం $15^2 = 15 \times 15 = 225$.

ఇతివర్గమునకును, వర్గయోగమునకును అంతరాయము $15^2 - (6^2 + 9^2)$ } $225 - 117 = 108$.

రాశిఘాతముచేత అంతరాయమును హరించగా $108/54 = 2$.

లబ్ధం $= 2$.

తద్వర్గం $= 2^2 = 2 \times 2 = 4$.

తద్ఘనం $2^3 = 2 \times 2 \times 2 = 8$.

తద్వర్గఘనసంఖ్యాదోర్మూర్తిమన్మహః వందేఽహం.

నాలుగుబాహువులు, అష్టమూర్తులు గల దేవుని-

స్వస్వరూపానందమును పొందుటయే ముక్తియనియు నుడివెదరు. ఇట్టి మోక్షము బ్రహ్మజ్ఞానమువలన సిద్ధించుననియు, ఇతరమార్గములవలన సిద్ధించదనియు

శ్రు. తమేవం విదిత్వాతి మృత్యు మేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ
బ్రహ్మవి దాప్నోతి పరం.

అను శ్రుతులు ప్రతిపాదించుచున్నవి. కాన ముముక్షువు బ్రహ్మము దెలిసికొనవలెను.

శ్లో. అధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్య స్తత్వ నిర్ణయః.
శ్రు. న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నై కేన అమృతత్వ మానసుహు.

అను శ్రుత్యాదుల వలన బ్రహ్మము అధ్యారోపాపవాదముల వలననే గాని తదితరములచే దెలియబడదు గాన వని యావశ్యము దెలిసికొనవలసి యున్నది.

అధ్యారోపమన రజ్జువునందు సర్పమువలె, శుక్తియందు రజతమువలె, స్థాణువునందు పురుషునివలె నిష్ప్రపంచమయిన ఆత్మవస్తువునందు ప్రపంచము నారోపించుట. ఇది వస్త్వజ్ఞానము వలన సంభవించునది. ఈ యజ్ఞానమే అవిద్యా, అవ్యక్తము, గుణసామ్యము, మూలప్రకృతి, మాయా అని వ్యవహరింపబడుచున్నది.

మూలప్రకృతియన సత్వరజస్తమోగుణములయొక్క సామావ్యావస్థ. ఇందు సృష్టికి పూర్వము అనంతకోటిజీవులు స్వస్వకర్మవాసనలతో జంతుపిండమునందలి సువర్ణ రేణువులవలె లీనులయియుండిరి. ఈ మూల ప్రకృతి సృష్టికాలమునందు పరిపక్వ జీవకర్మవశమువలన మాయా, అవిద్యా, తామసీ అను మూడువిధము లయినది.

అందు మాయ శుద్ధమయిన సత్వగుణము ప్రధానముగ గలది. అందు సృష్టికి పూర్వము విద్యమానమగు బ్రహ్మ చైతన్యము ప్రతిబింబించినదై ఈశ్వర సంజ్ఞచే నొప్పుచున్నది ఈ యీశ్వరునినే అవ్యాకృతుడనియు, అంతర్యామియనియు వ్యవహరించుచున్నారు. ఈ యనయే జగత్స్రష్ట.

పరిపూర్ణ బ్రహ్మచైతన్యరూపముచే తామసియం దవచ్ఛిన్నమైన ఈయీశ్వరుడే స్వోపాధి ప్రాధాన్యముచే జగత్తునకు ఉపాదాన కారణమును, స్వప్రాధాన్యముచే నిమిత్తకారణమును ఆయెను. జగత్తునకు ఉపాదానకారణమును, నిమిత్తకారణము నగు మాయాప్రతిబింబిత బ్రహ్మచైతన్యమునకే ఈశ్వరుడని వ్యవహారము.

ముందు చెప్పిన అవిద్య రజోగుణము ప్రధానముగ గలది. అందు ప్రతిబింబించిన చైతన్యమే జీవసంజ్ఞతో నొప్పుచున్నది. ఈయవిద్య అనేకప్రకారము లగుట వలన తత్ప్రతిబింబిత చైతన్యలగు జీవులు సంఖ్యాతీతులయిరి. ఇది ప్రతిబింబపక్షము.

అవిచ్ఛిన్న పక్షమునందు మాయావిద్యావచ్ఛిన్న చైతన్యమునకే వ్యుత్క్రమముగ జీవేశ్వరు లనుసంజ్ఞ. అనగ, మాయావచ్ఛిన్న చైతన్యము ఈశ్వరుడు, అవిద్యావచ్ఛిన్న చైతన్యము జీవుడు.

శ్లో. అనాద్యనిర్వాచ్య మపీహ కారణం,
మాయాప్రధానంతు పరం శరీరం.

జీవేశ్వరులకు వ్యుత్క్రమముగ మాయావిద్యలు కారణ శరీరములయి యున్నవి. అందు వ్యష్టిరూపము అవిద్య, సమష్టిరూపము మూలప్రకృతి. జీవేశ్వరులకు ఈశరీరమునం దునికియే సుషుప్త్యవస్థ. ఈశరీరమె ఆనందమయ కోశము.

ఈశ్వరుని యొక్క యీక్షణవశమువలన తమోగుణ ప్రధానమయిన మూల ప్రకృతి విక్షేపశక్తియు, ఆవరణశక్తియు అను రెండు విధము లయినది.

శ్లో. రూపేక్ష్యే నిశ్చితే పూర్వం మాయాయాః కులనందన,
విక్షేపావరణే తత్ర ప్రథమం కల్పయే జ్జగత్,
లింగాద్యా బ్రహ్మపర్యంతం స్థూల సూక్ష్మాది భేదతః.

అనురీతిని విక్షేప శక్తి స్థూల సూక్ష్మాది భేదమువలన లింగశరీరము మొదలు బ్రహ్మపర్యంతముగల ప్రపంచమును కల్పించినది. ఎటులనిన: ఈవిక్షేపశక్తి ముందుగ సూక్ష్మకాశమయినది. ఆయాకాశము వలన వాయువును, అందువలన అగ్నియు, అగ్నివలన ఉదకమును, ఉదకమువలన పృథ్వియు ఉత్పన్నములయినవి. ఇవియే సూక్ష్మభూతములు. వీనినె అపంచీకృతము లనియు, పంచతన్మాత్రలనియు వ్యవహరించుచున్నారు. ఈసూక్ష్మకాశాది పంచభూతములయొక్క సత్వగుణాంశములవలన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియ పంచకమును సత్వగుణసమష్టివలన అంతఃకరణమును ఉత్పన్నములయినవి. అందు అహంకారము మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనునాలుగు విధములు. అందు బుద్ధియం దహంకారమును, మనస్సునందు చిత్తమును అంతర్భావములై యున్నవి.

ఆకాశాది సత్వగుణ సమష్టివలన ఇంద్రియాధిష్ఠాన దేవతలును, రజోగుణాంశమువలన వాక్పాదపాణిపాయూపస్థ లనుకర్మేంద్రియ పంచకమును, రజోగుణ సమష్టివలన ప్రాణమును ఉత్పన్నములయినవి. అందు ప్రాణము ప్రాణాపానవ్యానోదానసమానములను అయిదు విధములు.

శ్లో. సూక్ష్మం మనోబుద్ధి దశేంద్రియై ర్యుతం,
ప్రాణై రపంచీకృతభూతసంభవం;
భోక్తుం సుఖాదేరపి సాధనం భవే
చ్ఛరీర మన్య ద్విదు రాత్మనో బుధాః.

అనురీతిని జ్ఞానేంద్రియ పంచకమును, కర్మేంద్రియ పంచకమును, ప్రాణపంచకమును, మనోబుద్ధులును కలసి సూక్ష్మశరీర మనబడు

చున్నది. దీనినే లింగశరీర మనియెదరు. ఇదియే భోగములకు సాధనము. జీవేశ్వరులకు ఈశరీరమునందునికి స్వప్నావస్థ. ఈశరీరమునందే విజ్ఞానమయ, ప్రాణమయ, మనోమయ కోశములు గలవు.

తమోగుణప్రధానములగు సూక్ష్మాకాశాది భూతములయొక్క స్వార్ధాంశమును నాలుగు విధములుగ విభజించి అందొక్కొక్క భాగమును తన యర్ధభాగమున విడిచి యితర భూతార్ధభాగములందు వేరువేరుగ కలుపుట పంచీకరణము. అనగ ప్రతిభూతమునకు తనసంగోరులో ఇతర భూతములలోని ప్రతిభూతముయొక్క మిగత సంగోరులో నాలగవ భాగము కలియునది పంచీకరణ మనబడును. ఇటుల చేయబడిన భూతములు పంచీకృతము లనబడును. వీనినే మహాభూతము లనియెదరు.

శ్లో. రసాదిపంచీకృతభూతసంభవం,
భోగాలయం దుఃఖసుఖాదికర్మణాం;
శరీర మాహు ర్దురితాది కర్మజం,
మాయామయం స్థూల ముపాధ మాత్మనః.

అనురీతిని ఈ మహాభూతములచేతనే బ్రహ్మాండ సృష్టి క్రమోపన్యాసమునందు వివరించిన ప్రకారము బ్రహ్మాండమును తదంతర్గతాకాశమునందు భూ, గ్రహ, నక్షత్ర, తారాది గోళములును, ఈగోళములందలి జరాయుజాండజస్వేదజోద్భిజ్జములగు చతుర్విధస్థూలశరీరములు, అన్నాది భోగ్యవస్తువులును సృజింపబడినవి. జీవేశ్వరులకు ఈస్థూలశరీరమునందునికి జాగ్రదవస్థ. ఇదియే అన్నమయకోశము. ఈస్థూలకారణశరీరములలో నొక్కొక్క శరీరము సమష్టియనియు, వ్యష్టియనియు రెండు విధములు. అందు కారణసమష్ట్యుపాధికుడు ఈశ్వరుడు; వ్యష్ట్యుపాధికుడు జీవుడు. అందు కారణ సమష్టిచే ఈశ్వరుడు, కారణవ్యష్టిచే ప్రాజ్ఞుడును, సూక్ష్మసమష్టిచే హిరణ్యగర్భుడును, సూక్ష్మవ్యష్టిచే తైజసుడును, స్థూలసమష్టిచే వైశ్వానరుడును, స్థూలవ్యష్టిచే విశ్వుడును అని జీవేశ్వరులకు అవాంతర భేదములు కలవు. అనగ, ఈశ్వరునకు కారణసూక్ష్మస్థూలసమష్టులవలన ఈశ్వర, హిరణ్యగర్భ, వైశ్వానరు లనుసంజ్ఞలును, జీవునకు కారణ సూక్ష్మ స్థూల వ్యష్టులవలన ప్రాజ్ఞ, తైజస, విశ్వ లనుసంజ్ఞలును కలిగినవి. ఈయీశ్వరుడే సత్వరజస్తమోగుణము లను ఉపాధులచే బ్రహ్మ, విష్ణు, రుద్రరూపముల నొంది సృష్టిస్థితి సంహారములను చేయుచుండెను. బ్రహ్మకు విరాట్పురుషునియందును, విష్ణువునకు హిరణ్యగర్భునియందును, రుద్రునకు ఈశ్వరునియందును అంతర్భావము. ఇటుల చరాచరాత్మకమయిన ప్రపంచము విక్షేపశక్తివలన ఉత్పన్నమయినది.

ఈప్రపంచోత్పత్తినిగూర్చి భాస్కరులవారు

శ్లో. యస్మాత్ క్షుబ్ధ ప్రకృతిపురుషాభ్యామహానస్య గర్భే,
హంకారోభూత్ ఖశశిఖిజలోర్వ్యశ్చ తత స్సంహతేశ్చ,
బ్రహ్మాండం యజ్జఠరగమహీపృష్ఠనిష్ఠాద్విరించే,
ర్విశ్వం శశ్వ జ్జయతి పరమం బ్రహ్మతత్త్వ మాద్యం.

సిద్ధాంత శిరోమణియం దిటుల వచించిరి. ఈక్రమము బ్రహ్మాండ సృష్టిక్రమోపన్యాసమునందు వివరించితిని. ఇది నిష్ప్రపంచమగు బ్రహ్మమునందు కల్పించుట అధ్యారోపము. ఇది విక్షేపకార్యము. ఇందువలన మనకు మాయాప్రతిబింబితచైతన్యము ఈశ్వరుడనియు, అవిద్యా ప్రతిబింబితచైతన్యము జీవుడనియు, మాయాకల్పితము ప్రపంచమనియు, నిర్వికల్పమగు బ్రహ్మమునందు ప్రపంచకల్పనము అధ్యారోపమనియు తెలియబడుచున్నది.

శ్లో. అపరం త్వఖిలం జ్ఞానరూప మావృత్య తిష్ఠతి.

అనురీతిని రెండవదగు ఆవరణశక్తి ఆత్మజ్ఞానియగు ఈశ్వరుని విడిచి తదితరములయిన జీవులకును, పంచకోశములకును, ఆత్మకు భేదము కనబడకుండ అంధకారమువలె ఆవరించినది.

ఆవరణశక్తి కార్యములు అసత్త్వావరణమనియు, అభానావరణమనియు రెండు విధములు. వస్తువు లేదను వ్యవహారకారణము అసత్త్వావరణము; వస్తువు ప్రకాశింపలేదను వ్యవహారకారణము అభానావరణము. ఇవియే మోక్షము సిద్ధించకపోవుటకును, సంసారవృక్షమునకును మూలకారణములయి యున్నవి.

శ్లో. అనాత్మని శరీరాదా వాత్మబుద్ధిస్తు యా భవేత్,
సైవ మాయా తయైవాసౌ సంసారః పరివర్తతే.

తాను కానటువంటి శరీరాదులయందు తానను బుద్ధియే మాయ. అందువలననె సంసారము ప్రవర్తించుచున్నది.

శ్లో. దేహస్తు స్థూలభూతానాం పంచతన్మాత్రపంచకం,
అహంకారశ్చ బుద్ధిశ్చ ఇంద్రియాణి తథా దశ,
చిదాభాసో మనశ్చైవ మూలప్రకృతిరేవచ,
ఏత త్క్షేత్ర మితి జ్ఞేయం దేహ ఇత్యభిధీయతే.

పృథివ్యప్తేజోవాయ్వాకాశములనెడు భూతపంచకమును, శబ్దస్పర్శరూపరసగంధములనెడు పంచతన్మాత్రలును, బుద్ధ్యహంకారములును, త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియ పంచకమును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియ పంచకమును, మనశ్చిదాభాసమూలప్రకృతులును కలసి క్షేత్ర మనబడును. దీనినే దేహ మనియెదరు.

శ్లో. దేహ ఏవహి సంసారవృక్షమూలం దృఢం స్మృతం,
తన్మూలం పుత్రదారాదిబంధభేదే వ్యథాత్మనః.

దేహమే సంసారవృక్షమునకు మూలము. ఇదియే ఆత్మకు పుత్రదారాది సంబంధమగు దుఃఖమునకు కారణమయియున్నది. ఇందువలన జీవునకు తాను పరమాత్మస్వరూపియను జ్ఞానము పోయి, దేహాత్మభ్రమ కలిగి, అందువలన పుత్రదారాది సంబంధమగు దుఃఖములు కలుగుచున్న

యని తెలియబడుచున్నది. ఇది ఆవరణశక్తికార్యము. ఈ యసత్వాభావానావరణములు రెండును నశించినగాని మోక్షము సిద్ధించదు. ఇవి తత్వజ్ఞానమువలనగాని నశించవు.

తత్వజ్ఞానము పరోక్షము, అపరోక్షము అను రెండువిధములు.

శ్లో. మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త,
షోడశకశ్చ వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః.

సత్వరజస్తమో గుణానాం సామ్యావస్థా మూలప్రకృతిః। మహదహంకారపంచతన్మాత్రాఖ్యానాం ప్రకృతి వికృతీనాం సప్తానాం మధ్యే అధ్యవసాయహేతు ర్మహత్తత్వం। అభిమానహేతు రహంకారః। శబ్దస్పర్శరూప రసగంధాత్మకాని పంచతన్మాత్రాణి పృథివ్యాది పంచమహాభూతానా మేకాదశేంద్రియాణాం లక్షణాని ప్రసిద్ధాని। న ప్రకృతి ర్న వికృతిః పురుష శ్చిదాత్మకః।

పురుషుడు చిత్స్వరూపిగాని ప్రకృతియు, తద్వికృత్యాదులగు మహదాదులును కావు.

శ్లో. ఏతై ర్విలక్షణో జీవః పరమాత్మా నిరామయః.

జీవుడు ప్రకృత్యాదులకు విలక్షణుడును, పరమాత్మయు అయియుండెను.

శ్లో. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.

ఆనందమే బ్రహ్మము. అనగ బ్రహ్మము సచ్చిదానందస్వరూపి.

ఈప్రకారము శ్రుత్యాదులచే ప్రతిపాదితములును, సద్గురూపదేశములును అగు వేదాంతవాక్యములను వినుటవలన కలిగినజ్ఞానము పరోక్ష జ్ఞానము.

శ్లో. తస్య జీవస్య విజ్ఞానే సాధనాన్యపి మే శ్రుణు,
జీవశ్చ పరమాత్మాచ పర్యాయే నాత్మభేదధీః,
మానాభావ స్తదా దంభహింసాది పరివర్తనం,
పరాక్షేపాదిసహనం సర్వత్రావక్రతా తదా,
మనోవాక్కాయసద్భక్త్యా సద్గురోః పరిసేవనం,
బాహ్యాభ్యంతర సంశుద్ధి స్థిరతా సత్క్రియాదిషు,
మనోవాక్కాయదండశ్చ విషయేషు నిరీహతా,
నిరహంకారతా జన్మ జరాద్యాలోచనం తథా,
అరక్తిస్నేహశూన్యత్వం పుత్రదారధనాదిషు,
ఇష్టానిష్టాగమే నిత్యం చిత్తస్య సమభావతా,
మయి సర్వాత్మకే రామే హ్యనన్యవిషయా మతిః,
జనసంబాధరహిత శుద్ధదేశనిషేవణం,
ప్రాకృతై ర్జనసంవాసే హ్యరతి స్సర్వదా భవేత్,
ఆత్మజ్ఞానే సదోద్యోగః వేదాంతార్థానలోచనం,
ఉక్తై రేతై ర్భవేద్ జ్ఞానం విపరీతై ర్విపర్యయః.

ఇట్టిజ్ఞానసాధనములగు గుణములుగల పురుషునికి పరోక్షజ్ఞానము వస్తువు లేదను వ్యవహారకారణమగు అసత్వావరణమును నశింపజేయును. ఇట్టిగుణములు లేనియెడల పురాణ ప్రమాతి శ్మశాన వైరాగ్యములవంటిది యగును.

శ్లో. బుద్ధిప్రాణో మనోదేహాహంకృతిభ్యో విలక్షణః,
చిదాత్మాహం నిత్యశుద్ధో బుద్ధ ఏవేతి నిశ్చయం,
యేన జ్ఞానేన సంవైతి తద్ జ్ఞానం నిశ్చితంచ మే.

తాను బుధ్యాదులకు విలక్షణుడును, చిత్స్వరూపుడును, నిత్యశుద్ధుడును అను నిశ్చయము దేనివలన కలుగునో అజ్ఞానము నిజమైన జ్ఞాన మనబడును.

ఇట్టిపరోక్షజ్ఞానమే శ్రవణ మనబడుచున్నది. ఇందువలన

శ్రు. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ.

సత్యమైనదియు, జ్ఞానమయమును, ఖహారమువలె పరిమితి లేనిదియు నగు బ్రహ్మము నిశ్చయముగ నున్నదను దృఢవిశ్వాసము కలుగును.

శ్రవణము వలన సంశయమును, మననముచే అసంభావనయును, నిదిధ్యాసచే విపరీతభావనయును నివర్తించి దేహాత్మజ్ఞానమువలె బ్రహ్మమే ఆత్మయని కలిగిన జ్ఞానము అపరోక్ష జ్ఞానము.

శ్లో. విజ్ఞానంచ తథై వైత త్సాక్షా దనుభవే ద్యథా.

శ్రవణాదులవలన అనుభవమునకు వచ్చిన ఈ యపరోక్షజ్ఞానమే విజ్ఞాన మనబడుచున్నది.

శ్లో. ఆత్మా సర్వత్ర పూర్ణః స్యా చ్చిదానందాత్మకోఽవ్యయః,
బుద్ధ్యాద్యుపాధి రహితః పరిణామాది వర్జితః,
స్వప్రకాశేన దేహాదీన్ భాసయ న్ననపావృతః,
ఏకఏ వాద్వితీయశ్చ సత్యజ్ఞానాది లక్షణః,
అసంగ స్స్వప్రభు ర్ద్రష్టా విజ్ఞానే నావగమ్యతే.

విజ్ఞానమువలన పరమాత్మ సర్వపరిపూర్ణుడును, సచ్చిదానందస్వరూపియు, బుధ్యాద్యుపాధులును, నాశమును, పరిణామాదులును లేనివాడును, సత్యజ్ఞానాది లక్షణుండును, సంగము లేనివాడును, తనకన్న వేరు లేనివాడును, తనకు తానే ప్రభువును, ద్రష్టయును అయి, తన ప్రకాశముచే దేహాదులను ప్రకాశింపజేయుచు తానొక్కడే ప్రకాశించుచుండె నని తెలియబడుచుండును. ఇందువలన వస్తువు ప్రకాశించలేదను వ్యవహారకారణమగు అభానావరణము నశించును.

ఈప్రకారము పరోక్షజ్ఞానము వలన బ్రహ్మము లేదను వ్యవహారకారణమగు అసత్వావరణమును, అపరోక్షజ్ఞానము వలన బ్రహ్మము ప్రకాశించలేదను వ్యవహారకారణమగు అభానావరణమును నశించి, అనర్థనివృత్తియు, ఆనందావాప్తియు అగుచున్నవి. ఇందువలన,

శ్లో. అజ్ఞాన మావృతి స్తద్వ ద్విక్షేపశ్చ పరోక్షధీః,
అపరోక్షమతి శ్శోకమోక్ష స్తృప్తి ర్నిరంకుశా.

అను సప్తావస్థలు సిద్ధించుచున్నవని తెలియబడెను.

ఈయవస్థలలో మొదటి మూడును బంధమునకును, మిగత నాలుగును మోక్షమునకును కారణములై యున్నవి.

శ్లో. శ్రూయతే దృశ్యతే యద్య త్స్మర్యతేవా నరైస్సదా,
అసదేవహి తత్సర్వం యథా స్వప్నమనోరథః.

ఏది చూడబడుచున్నదో, వినబడుచున్నదో, స్మరింపబడుచున్నదో యావత్తును స్వప్నమనోరథములవంటిది గాని సత్యమైనది కాదు.

ఇట్టిమిథ్యాస్వరూపమయిన ప్రపంచము ఆకాశమువలె నిర్మలమైన బ్రహ్మచైతన్యమునందు కల్పించుట అధ్యారోపము.

శ్లో. మాయయా కల్పితం విశ్వం పరమాత్మని కేవలే,
రజ్జౌ భుజంగవ ద్భ్రాంత్యా విచారే నాస్తి కించన.

అనురీతిని కారణము వినా కార్యము లేదను బోధవలన శుక్తియందు రజతమునవలె, రజ్జువునందు సర్పమువలె, స్థాణువునందు పురుషునివలె బ్రహ్మమునందు ప్రపంచము లేదనునిషేధము అపవాదము.

శ్లో. అధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్య స్తత్వనిర్ణయః.

అధ్యారోపాపవాదములచే తత్వ మిట్టిదని తెలిసికొని, యాతత్వ విచారణవలన బ్రహ్మముకన్న వ్యతిరేకమేదియు లేదనియు, ఆబ్రహ్మము నేనే యనియు తెలియుట బ్రహ్మజ్ఞాన మనబడును. ఇట్టి జ్ఞానము కలవాడే బ్రహ్మమును దెలిసినవాడు.

శ్రు. బ్రహ్మవి దాప్నోతి పరం.

అనుశ్రుతి బ్రహ్మజ్ఞాన సంపన్నుడు మోక్షమును పొందుననియు,

శ్రు. బ్రహ్మవి ద్బ్రహ్మైవ

అనుశ్రుతి బ్రహ్మజ్ఞాని బ్రహ్మమేయనియు, అనగ బ్రహ్మస్వరూపి యనియు వ్యక్తపరుచుచున్నది.

ఇట్టి బ్రహ్మజ్ఞానినే జీవన్ముక్తుడనియెదరు.

శ్లో. ఆచార్యశాస్త్రోపదేశా దైక్యజ్ఞానం యథా భవేత్,
ఆత్మనో ర్జీవపరయో ర్మూలావిద్యా తదైవహి,
లీయతే కార్యకరణై స్సహైవ పరమాత్మని.

అనురీతిని బ్రహ్మజ్ఞానికి సద్గురూపదేశములకు తత్వమస్యాది వాక్య విచారణచే మాయావిద్యోపాధుల వలన జీవేశ్వరులకు గలకించిజ్ఞత్వ సర్వజ్ఞత్వాది లక్షణములు తొలగి బ్రహ్మాత్మైక్యానుసంధానమువలన

శ్రు. సోహం బ్రహ్మాస్మి.

అను శ్రుత్యుక్త ప్రకారము బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగునటుల జీవాత్మ పరమాత్మలకు గల మూలావిద్య కార్యకరణములతో పరమాత్మ యందు లీనమగును.

దీనినే ఆత్యంతిక ప్రళయమనియు, తురీయమనియు నందురు. ఈ ప్రళయమును గూర్చి భాస్కరులవారు

శ్లో. దినేదినే య న్నిద్రయా హి ప్రాణి
నామంతకం తం ప్రళయం వదంతి,
బ్రాహ్మం లయం బ్రహ్మదినాంతకాలే
భూతాని యద్బ్రహ్మతనుం వ్రజంతి.
బ్రహ్మాత్యయే యత్ప్రకృతిం ప్రయాంతి
సర్వాస్తతః ప్రాకృతికం కృతీంద్రాః,
లీనాస్తతః కర్మపుటాంతరత్వా
త్పుంసాం క్రియాంతే ప్రకృతే ర్వికారాత్.
జ్ఞానాగ్ని దగ్ధాఖిల పుణ్యపాపా
మన స్సమాధాయ హరౌ పరేశే,
యద్యోగినో యాంత్యనివృత్తి మస్మా
దాత్యంతిక శ్చేతి లయశ్చతుర్ధా.

అని సిద్ధాంత శిరోమణియందు చెప్పిరి.

ఈవిషయము కాలస్వరూపోపన్యాసమున నుదాహరించితిని.

ఇందు జ్ఞానము కార్యకరణములతో మూలావిద్యను నశింపజేసి కటుకరేణువువలె తాను నశించును. ఇదియే నిర్వికల్పసమాధి ఇందు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అను భేదములు లేక, అనంతమయినదై యొకే-బ్రహ్మమే స్వస్వరూపములగు సచ్చిదానందములతో వెలుగుచుండును. కావుననే బ్రహ్మచైతన్యమునకు

శ్లో. అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే,
సమస్తజగదాధారమూర్తయే బ్రహ్మణే నమః.

నిర్గుణాయేతి. నిర్గతా గుణా స్సత్వరజస్తమోరూపా యస్మాత్ తస్మై గుణాతీతాయేత్యర్థః.

అని సూర్యసిద్ధాంత మందు నిర్గుణత్వమును,

శ్రు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ.

అను శ్రుతియందు అద్వితీయమైన ఏకత్వమును,

శ్రు. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.

అను శ్రుతియందు ఆనందమయత్వమును ప్రతిపాదింపబడి యున్నవి. ఈ స్వరూపానందము అనుభవమువలననే గాని వేరుగ తెలియునది కాదు. దీనినే స్వానుభవానుభూతి యనియెదరు.

శ్లో. సాస్థా ముక్తి రిత్యుక్తా హ్యుపచారో యమాత్మని.

ఈయవస్థనే ముక్తియని యందురు. ఇందు సంసారబంధమునకు కారణమగు అజ్ఞానము తనకు నాశకారియగు జ్ఞానముతో విముక్తియగుటవలన నీయవస్థను ముక్తావస్థ యని వ్యవహరించిరి. దీనినే విదేహముక్తి యనియెదరు. ఇటుల అద్వైతులు ముక్తి విచారణ విశదీకరించుచున్నారు.

# పాతంజల యోగసూత్రములు

గొట్టుముక్కల కృష్ణమాచార్యులు గారు

## గ్రంథకర్తృ విషయము

పతంజలి: క్రీస్తుశకమునకు 2300 సంవత్సరముల పూర్వము కాశ్మీర దేశమున నొకఋషి తపస్సుఁ జేయుచుండ నాతని యంజలి యందు పడినకారణమున పతంజలి యను పేరొందెననియు, నితఁడే పాణిని వ్యాకరణమునకు మహాభాష్యమును రచించెననియు వార్తిక వైశారదియందుఁ గానంబడు. గోనర్దదేశోత్పన్నుఁ డగుటంజేసి గోనర్దీయుఁడనియు నామాంతరము గలదు.

2. అభిధాన చింతామణియందు, ఇలావృతవర్షమున అంగిరువకు సతి యను భార్యయందు పతంజలి యుద్భవించి సుమేరు నట కోటరస్థయగు లోలుప యను యువతిని వరించిన యితఁడే మహాభాష్యమును, యోగసూత్రములును రచించెనని చెప్పఁబడినది.

3. పతంజలి వ్యాకరణ మహాభాష్యము క్రీస్తుపూర్వము 144, 142 సం. రముల మధ్యకాలమున రచితమని రామకృష్ణగోపాల భండార్కరు నుడువుచున్నారనియు, క్రీస్తునకు 25 సం. రముల కీవల పతంజలి పుట్టినాడని లీబరుపండితుడు చెప్పినాఁడనియు, క్రీస్తుపూర్వము 200 సంవత్సరముల కావల నుద్భవించి మహాభాష్య యోగశాస్త్రముల రచించెననియు జాన్‌డోసన్ పండితుడు వాకొనుచున్నాడు.

4. పతంజలి పాణిన్యంజలియందు కలియష్టావింశత్యబ్దంబున సర్పరూపంబున పతనమయి, కాయసిద్ధి ప్రాప్తికై వైద్యశాస్త్రమును, వాక్శుద్ధిరూపమున బ్రహ్మోపాసనాసాఫల్యము నొందుటకు వ్యాకరణ మహాభాష్యమును, మనశ్శుద్ధిచేఁ గైవల్యసిద్ధి నొందుటకు యోగశాస్త్రమును లోకోపకారార్థము రచించెనని భోజరాజుయొక్క అభిప్రాయమైయున్నది. ఇదియ జనసామాన్యముగా సమంజసమని తోఁచును.

## సూత్రవృత్తివివరణము

ఈపాతంజలయోగసూత్రములకు శ్రీవేదవ్యాసమునీంద్రులును, వాచస్పతి మిశ్రులును, ఇంకను గొందఱును భాష్యవ్యాఖ్యాన టీకా [illegible] రచియించి యుండినను, అందులోనెల్ల శ్రీభోజదేవవృత్తిమాత్రము సుబోధముగను, అనుభవవేద్యముగను, క[illegible]నః ప్రతిబింబముగను నుండియున్నది.

## గ్రంథప్రాశస్త్యము

మానవప్రపంచమున సంపాదిత వివేకులు భవతరణోపాయంబునకై యత్నింతురు. అట్టివారికి సాధనములుగా మహాత్ములచే రచింపఁబడిన వేదాంతగ్రంథముల యందు సుగమంబగు నభ్యాసప్రణాళిక లేమిచే మనోవాక్కాయ పారిశుద్ధ్యము గలుగుటలేదు. యోగశాస్త్రము మానవసామాన్య ప్రజ్ఞాతీతసకలస్వాత్మవప్రదాయక మగుచు, నాంతరంగికతత్త్వనిర్దేశకంబై, గత్వర చిరస్థాస్ను వస్తునిర్ణేతృత్వము వహించి, సుసుఖోపాయాభ్యాసంబులు గలిగి, ప్రాణిరాశికత్యంత నిర్మలచిదానందంబు నొసంగునదై యున్నది. స్వల్పసంఖ్యాకసూత్రపుంజముచే నిరతిశయజ్ఞానసంబగుట గడు శ్లాఘనీయము.

## విషయము

శరీరమందు ఆత్మజ్ఞానముఁ గలుగఁజేయు భ్రాంతిని దొలఁగించుటకుఁగాను పుణ్యపాపమిశ్రకర్మలపరిపాకముచేఁ గలుగుజాత్యాయుర్భోగములు సంతోషమునకును, పాపకర్మపరిపాకముచేఁ గలుగు జాత్యాయుర్భోగములు దుఃఖమునకును కారణములయి యున్నవనియు, సుఖదుఃఖాదులను గలుగఁజేయు కర్మము కాయిక వాచిక మానసిక భేదములచే సదా జరుగుచుండుట వలన అనేక జన్మములు గలుగుచుండుననియు, ఈకర్మము జన్మ జన్మముల యందు వృద్ధి యగుచుండు ననువిషయము "తే హ్లాదపరితాప ఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్" అను పా. 2-14 సూత్రముచే ప్రకటింపఁబడినది. వివేకవంతులకు సుఖభోగమందలి గుణవృత్తి దుఃఖరూపమేగాన క్లేశాదిస్వరూపజ్ఞానము గల వివేకి భోగసాధన పదార్థమును విషమిశ్రితామృతమును వలెఁ జూచుననియు, నిట్టి దుఃఖము పరిణామ తాపసంస్కార భేదములచే ముత్తెఱంగుల ప్రకటీకృతమయి, స్వానుభూత పదార్థావసానంబున పునస్సంపాదనేచ్ఛా దుఃఖమును, స్వసేవ్యమానవస్తు విరోధావసానేచ్ఛా దుఃఖమును, ఈప్సితపదార్థమిశ్రిత-అనిష్ట పదార్థ స్థితిదుఃఖమును గలుగఁ జేయుచున్నది గాన దుఃఖ రూప భోగనివృత్తియే వివేకి కావశ్యక మనువిషయము.

"పరిణామతాప సంస్కారదుఃఖై ర్గుణవృత్తి విరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకిన"అను పా. 2-15 సూత్రముచేఁ దెలుపఁబడినది.

[illegible]గు దుఃఖమునకు కారణము సాక్షిరూపుఁడగు చిన్మాత్ర పురుష[illegible] దుదాసీనుఁడయి [illegible] భోగమోక్షములు ప్రయోజనమును, ప్రకాశ ప్రవృత్తి స్థితి [illegible]పము

ను, స్థూలభూత పృథివ్యాదులును, సూక్ష్మభూత గంధతన్మాత్రాదులును, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములును, వాగాది కర్మేంద్రియములును, బుద్ధ్యాది అంతఃకరణములును కార్యరూపముగాఁగలది యను దృశ్య పదార్థమునందు పురుషునిచేత నశక్తి ప్రవేశించుట యనునది బుద్ధ్యాత్మ సంయోగమునకును, దుఃఖమునకును గారణమై యున్నదనుటను "ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః"; "ప్రకాశ క్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యం" అను పా. 2-17, పా. 2-18 సూత్రద్వయము ప్రకటించుచున్నది. ప్రస్తుత మనుభవింపఁబడుచుండు దుఃఖము త్యజించుట కసాధ్యమైనదియు, అనుభూత పూర్వ మవిచారణీయమనియు, భావి దుఃఖ మవశ్య విసర్జనీయమనియు "హేయం దుఃఖ మనాగతం" అను పా. 2-16 సూత్రముచే నుడువఁబడినది.

సంసార సుఖస్వరూపమంతయు చిత్తభ్రాంత్యుత్పాదిత మగుటచే దీతన్నిరోధమే ముఖ్యావశ్యకమని తెలుపుచు నందుల కుపాయంబు యోగమేయను నిర్ణయము "యోగ శ్చిత్తవృత్తినిరోధః" అను పా. 1-2 సూత్రమున ప్రకటింపఁబడినది.

ఇట్టియోగము సిద్ధించుట కుపాయంబు లనేకములు వక్కాణించుచు సుఖదుఃఖ మోహరూపమైన ప్రపంచానుభవమును గలుగఁజేయు వృత్తులను ఆవృత్తులకు కారణమైన చిత్తమందు లయింపఁజేయుటయే చిత్తవృత్తి నిరోధ మనఁబడుచున్నది. చిత్తముయొక్క వృత్తియన బుద్ధి ఆయా యింద్రియములలోనుండి వెలుపల ప్రసరించుటయే. ఇట్లు ప్రసరింపనీయక పోయినయెడల వృత్తులు అంతర్ముఖములయి లీనములుగాఁగను చిత్తమునందు శక్తిరూపముగా నుండును. విషయములలోనుండు దోషాదులను కనుఁగొనుటవలన పుట్టెడి వైరాగ్యము విషయములలోఁ దగులనీయక విముఖత నొందించును. అభ్యాసమువలన చిత్తము స్థిరముగా నుండును; కాన చిత్తవృత్తినిరోధము అభ్యాసవైరాగ్యములచేఁ గలుగునని "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అను సూత్రము వక్కాణించుచున్నది.

అభ్యాసము నిరంతరము ఆదరముతో బహుకాల మాచరించుట యనియు, దీనిచే దృఢస్థితి గలుగుననియు "సతు దీర్ఘ కాలనైరంతర్య సత్కారసేవితో దృఢభూమిః" యను సూత్రముచే ననువదింపఁబడినది. వైరాగ్యము ప్రత్యక్షమగు వనితాది భోగవిషయముల నీలోకమందును, పరలోకంబున శ్రుతిచోదిత రంభాదిభోగ విషయములను అభిలషింపకుండుట యని "దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యం" అను సూత్రముచేఁ బ్రకటీకృతము.

అభ్యాస వైరాగ్యములు సిద్ధించుటతోపాటు బ్రాహ్మణత్వాది జాతులు, కాశీరామేశ్వరాదిదేశములు, ఏకాదశ్యాది కాలము, సంధ్యావందనాది సమయములు మొదలగు నెట్టి సందర్భములలోఁ గాని హింసింపఁ గూడదు, అబద్ధ మాడఁగూడదు, పరద్రవ్య మపహరింపఁ గూడదు, వ్యభిచరింపఁ గూడదు, భోగసాధన వస్తువుల గ్రహింపఁ గూడదను విషయము బోధించు యమాదు లవసర మనునది "ఏతే జాతిదేశకాల సమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతం" అను పా. 2-31 సూత్రముచే ననువదింపఁబడినది.

అహింసాది యమాంగసాధనచేఁ గలుగులాభము లేమయినఁ గలవా యను విషయములో సందేహానివృత్తికై అగ్నిష్టోమాది కర్మములు చేయకపోయినను సత్యము పలుకువానికి ఆయా కర్మఫలములు లభించునని "సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం" అను పా. 2-36 సూత్రముచే ప్రకటింపఁబడినది.

అహింసాభ్యాసము చేయువాని సమీపమున స్వాభావిక విరోధజంతువులుగూడ వైరము విడిచి ప్రవర్తించునని "అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" అను పా. 2-35 సూత్రముచే ననువదింపఁబడినది.

పరులద్రవ్యము నపహరింపకుండుట నభ్యసించిన దృఢచిత్తునకు తాను ఆశలేనివాఁడైనను అప్రయత్నముగనే సకలస్థలములయందలి రత్నములును అతనికి లభించునని "అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం" అను పా. 2-37 సూత్రముచే వివరింపఁబడినది.

ఇంద్రియమును నిగ్రహించు నభ్యాసస్థైర్యము గలవానికి తేజోలాభము, బలము, మేధస్సిద్ధి, ఆత్మజ్ఞానము గలుగునని "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః" అను పా. 2-38 సూత్రముచే నిరూపింపఁబడినది.

భోగసాధనవస్తువుల నితరులనుండి గ్రహింపనివానికి పూర్వజన్మజ్ఞానము గలుగునని "అపరిగ్రహస్థైర్యే జన్మ కథంతా సంబోధః" యను పా. 2-39 సూత్రముచేఁ జెప్పఁబడినది.

పరిశుద్ధత నభ్యసించువానికి స్వదేహోత్పత్తి కారణములైన మాతాపితృదేహ జన్య శుక్లశోణితరూపముల పర్యాలోచనవలన తన దేహమునందు జుగుప్సయు, పరులను స్పృశించుట కేవల మసహ్యమని యును తోఁచును; బుద్ధి జాగరూకతయు, పాపసంసర్గ విముక్తియుఁ గలుగునని "శౌచాత్స్వాఙ్గ జుగుప్సా పరై రసంసర్గః" యను పా. 2-40 సూత్రముచే ప్రకటింపఁబడినది.

తృప్తివలన నిరతిశయానంద ప్రాప్తియు, సకలదుఃఖ నివృత్తియుఁ గలుగునని "సంతోషా దనుత్తమః సుఖలాభః" యను పా. 2-42 సూత్రముచే నిర్ణయింపఁబడినది.

కృచ్ఛ్రచాంద్రాయణాదులవలన చిత్తము పరిశుద్ధినొందుటయు, స్వేచ్ఛానుసారముగా తనదేహమును అణుమహద్రూపములుగాఁ జేసుకొనఁగల శక్తియు, ఇంద్రియాగ్రస్థూలసూక్ష్మవస్తుదర్శనశక్తియుఁ గలుగునని "కాయేన్ద్రియసిద్ధి రశుద్ధిక్షయా త్తపసః" యను పా. 2-43 సూత్రముచే వక్కాణింపఁబడినది.

తన కభిమతమగు దేవతామంత్రమును జపించుటచే దేవతాసాక్షాత్కారమును, ఈశ్వరోపాసనా బలముచే చిత్తనైర్మల్యమును, అందుచే దుస్సంకల్పరాహిత్యమును గలుగునని "స్వాధ్యాయా దిష్ట దేవతా సంప్రయోగః" యను పా. 2-44 సూత్రముచే ప్రకటితము.

ఈశ్వరునందు అధికమైన భక్తి నుంచుటచే చిత్తమున నేయితర సంకల్పములును లేక నిర్మలమైయుండు సంప్రజ్ఞాత సమాధిసిద్ధి గలుగునని "సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్" అను పా. 2-45 సూత్రముచే నుడువఁబడినది.

బహిరింద్రియ వ్యాపార నివృత్తిస్థైర్యములకును, శీతోష్ణాది ద్వంద్వబాధానివృత్తికిని ఆసనసిద్ధి యావశ్యకమని "తతో ద్వంద్వానభిఘాతః" యను పా. 2-48 సూత్రముచే దృఢపరుపఁబడినది.

అంతరింద్రియ వృత్తి నివృత్తికని, చిత్తమునందలి ప్రకాశావృత మాలిన్యనాశనమునకును ప్రాణాయామ మావశ్యకమని "తతః క్షీయతే ప్రకాశావరణమ్" అను పా. 2-52 సూత్రముచే ప్రస్ఫుటీకృతమయినది.

ఇంద్రియ వశీకరణమును, చిత్తచాంచల్యవిరతియు, ధ్యానమందు చిత్తస్థైర్యమును ప్రాణాయామముచేఁ గలుగునని "తతః పరమా వశ్యతేంద్రియాణాం" అను పా. 2-55 సూత్రముచే విశదీకరింపఁబడినది.

స్వాధిష్ఠానమందుఁగాని, నాభిచక్రమందుఁగాని, మఱే యేయితర వస్తువునందుఁగాని చిత్తమును చలనము లేక నిలుపవలెననియు, అటుల నిలుపుటయే ధారణయనియు "దేశబంధ శ్చిత్తస్య ధారణా" యను పా. 3-1 సూత్రముచేఁ బలుకఁబడినది.

ఎచ్చట ధారణ చేయఁబడుచున్నదో యాస్థలమునకు ధ్యానేతర వస్తువును రానీయకుండుటయే ధ్యానమనఁబడునని "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్" అను పా. 3-2 సూత్రముచే ధ్యానలక్షణము బోధింపఁబడినది.

తాను ధ్యానించుచున్నాననియు, ధ్యానింపఁబడు వస్తువు గలదనియు జ్ఞానము లేక మఱచుటయే సమాధి యనంబడునని "తదే వార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః" యను పా. 3-3 సూత్రముచేఁ దెలుపఁబడినది.

ధారణయు, ధ్యానమును, సమాధియు నేకత్ర గూడియుండుట సంయమ మనఁబడునని "త్రయ మేకత్ర సంయమః" యను పా. 3-4 సూత్రముచేఁ బలుకఁబడినది.

ఇట్టి సంయమమువలన మానవునకుఁ గలుగులాభ మేమి యను సందేహమునకు సమాధానముగా సర్వశక్తులును సంయమముచే సిద్ధించును అను విషయమును ప్రకటించుచు, పంచభూతములను సంయమముచే జయించిన అణిమాది అష్టసిద్ధులును, రూపలావణ్యాది దేహసంపదయు, దేహదార్ఢ్యాదులు స్థిరమై యుండుటయును గలుగునని "తతో ఽణిమాది ప్రాదుర్భావః కాయసంపద్ధర్మానభిఘాతశ్చ" అను పా. 3-46 సూత్రముచేఁ జెప్పఁబడినది.

ఇట్టి అణిమాదిసిద్ధులుగాని, యే యితర బాహ్యప్రపంచవస్తు ప్రాప్తిశక్తిగాని ఇచ్ఛానుసారము ప్రాప్తించి ఉపయోగింపఁబడునే కాని పరమేశ్వర ప్రాప్తి హేతుకములగు నీసంయమప్రాబల్యముచే చిత్తము వేఱు, చిద్రూపపురుషుఁడు వేఱు ననుభావము గలిగి, చిత్తమునందలి యాత్మభావము నివృత్తియగునని "విశేషదర్శిన ఆత్మభావనానివృత్తిః" యను పా. 4.21 సూత్రముచే నిర్ణయింపఁబడినది.

ఇట్టి వివేకవంతునకు బహిర్ముఖకాలమందుఁ గలుగు వాసనల వలన అభిమానములు గలుగుచుండునుగాన నా వాసనలను క్లేశములను వలెనే త్యజించువానికి ప్రత్యుపకారసంబంధము లేని నిరతిశయానందరూపమైన ధర్మమేఘమును సమాధియొక్క మహోత్కర్షము సదా వర్షించుచున్నది; నిరవధిక పరమానంద సమాధి గలుగుచున్నది యని "ప్రసంఖ్యానే ప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతే ర్ధర్మమేఘః సమాధిః" యను పా. 4-29 సూత్రముచే నిరూపింపఁబడినది.

ఈవిధంబున క్రమాభ్యాసము చేయు మానవుఁడు అనంతరము "క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" యను పా. 1-24 సూత్రముచే నిర్ణయింపఁబడిన పరమపురుషుని సాన్నిధ్యమును క్లేశరహితముగాఁ జేరఁగలిగి సమస్తశుభంబుల నొందఁగలుగును.

ఇతరగ్రంథములలో యోగవిషయము లుపదేశింపఁబడియున్నను సార్వజనీన ప్రబోధకంబగు నీసూత్రగ్రంథము యోగగ్రంథరాజమనుట కెంతయు సాహసింపఁదగును.

# పుష్పకోమలీ!

నాదెళ్ల వెంకట్రావు గారు

తొందరతోడ నే నొకఁడఁ ద్రోవను బోవుచునుండ నిర్మలా
నందదసౌరభం బొకటి నాసిక ఘుమ్మనఁ జుట్టుముట్టఁగా
ముందఱ కేఁగలేక చట ముగ్ధుఁడనై మొగమెత్తి కంటి నా
కందని కొమ్మలందుఁ జెలువందు నినున్నవపుష్పకోమలీ!

సుందరమూర్తివైన నినుఁ జూచినయంతనె మానసం బెదో
గందరగోళ మొంది సరిగా నవగాహన గాని భావముల్
సందడిఁ జేయుచుండ వివశంబయి చొక్కెను పూర్వజన్మసం
బంధము నేదొ జ్ఞప్తిఁ గను భాతి విచారమునన్ మునుంగుచున్.

కమ్మనివాసనల్ దెసలు గ్రమ్మఁగఁ జిమ్ముదు నెమ్మొగంబు, బల్
కొమ్మలమధ్య నుండుటను కొంచెమె కన్పడుచుండ, మందహా
స మ్మొనరించియుంటివి పసందుగ నంమలనుండి, యంతఁ జి
త్రమ్ముగఁ దావకీనసవిధమ్మున నిల్చితిఁ బుష్పకోమలీ!

ఆహా! యేమివిచిత్రమో తెలియరా దానందసందోహముల్
దేహం బంద లిరక్తనాళముల నుద్రిక్తాతివేగంబుతో
నూహాతీతవిహారముల్ సలిపె, నత్యుల్లాసకల్లోలమో
మోహంబో, సకలేంద్రియంబులు వెసన్ మూర్ఛిల్లఁగాఁ జేసెడిన్

కనుఁగవ నీసురూపమును గాంచుట హర్షముఁ జెందఁగాఁ, దగన్
వినుతపరీమళం బనుభవించుట నాసిక చొక్కఁగాక, తా
మనితరలభ్యసౌఖ్యమును నందఁగ నేటికొ యింద్రియంబు లె
ల్లను? భవదీయసన్నిధి విలాసకళామహిమం బనల్పమే!

ఏవిధి ని స్సగ్రగ్రహణ మే నొనరింతునొ యన్న తీవ్రవాం
ఛావిల మయ్యె డెంద మకటా! ననుఁ జేరఁగ నిష్ట ముండియున్
నీవును ముందు వెన్కల ననేకవిధంబుల నూఁగులాడుచు
న్నా వని తోఁచె సందియము నా దెస మానును పుష్పకోమలీ.

ఎత్తఱినైన నించుకయు నే నెడఁబాయక నిన్భజించుచున్
మెత్తనికయ్యఁ గూర్చెదను, మిక్కిలిప్రేమను గారవించుచున్
నెత్తిని బెట్టికొందు నవనిం జరియింపఁగనీక, యుష్మదా
యత్తము లౌను ప్రాణపవనావళి నాకిఁక బుష్పకోమలీ!

అంగీకారముఁ దెల్పినావు హృదయం బానందముం బొంద, సా
రంగారావరసామ్యతాధికతరశ్రావ్యప్రకారక్రియా
సంగీతచ్ఛలయుక్తిచేత నిఁక నీసామీప్యసాంగత్య మె
భృంగిం జేకుఱు నన్నచింత జలమై బాధించె నెట్లో కదే.

ఏని భవత్సమక్షమున కేఁగెద నన్న మహీరుహోన్నతా
నూనవిశాలసౌధమున నుంటివి గాదె లతావిలాసినీ
మానిత మధ్యదేశమున మానుగ నే నెటు వచ్చువాఁడ నీ
వే ననుఁ జేరరాదొకో ఫలింపఁగ గోర్కెలు పుష్పకోమలీ!

వల దెటులో (?) కనెద వంశపుఁగీరితి మాయఁగా మహా
బలుఁడని యేఁగెదో, భ్రమరబంధురబాలకుఁ డంచుఁ గూడెదో
తలఁపఁగ నెవ్వ రింతటి యధఃపతనంబును గోరిరే యటం
చలనత వెన్క లాగునొ కటా, నినుఁ గన్న లతాశుభాంగియేన్.

మధుప సదాగతి ప్రముఖమండలి మెండుగఁ జుట్టు ముట్టి నీ
మధుర వయోవిలాసముల మాయముఁ జేయఁగ నొప్పుకొంట, మా
నధనుఁడ నైన నే శిరముసం దిడి ప్రోవఁగనుంట, రెంట నె
వ్విధ మది మేలొ చూడుమని వేఁడుమ! కూడుమ నన్ను వేగమే.

ఏగతి వేఁడిన న్విన కొంకించుక పట్టును వీడకుండెఁగా
ప్రాఁగతనంబుతోడ నవురా! నినుఁ గన్న లతాపురంధ్రి చే
తోగతి మార్చువా రెవరుఁ దోఁచరు నామది కేమి సేయుదున్
వేగ మెఱుంగఁ జెప్పఁగదవే దయతోడుతఁ బుష్పకోమలీ!

ఇత్తఱి నేయుపాయము స్ఫురింపక దుఃఖభరావిలవ్యథా
యత్తమనంబుతోడ భవదాలయసాలము చుట్టు చుట్టు ను
న్మత్తునటుల్ భ్రమించితిని మాటికిఁ గాటపుఁగోర్కె లీగతిన్
రిత్తవడంగఁ జేయునె విరించి యొకించుక జాలి మాలుచున్!

ఎంతగఁ బాఱఁజూచిన నొకించుక కార్యము లేదు కావునన్
జింతిలఁబోను, దేహములు చెంతకుఁ జేరని ప్రేమయే కదున్
సంతస మిచ్చు నందురు ప్రశాంతపవిత్రతరంబు నౌట, జ
న్మాంత ముదప్రదం బగుచు హాయిని గూర్పదె ధ్యానమాత్రచేన్.

దూరసమాగతంబయిన ధూపముసోఁకిన రమ్యవాసనా
వారమొసంగు నా యగరువత్తివలెం బ్రియవస్తువుల్ ప్రియుల్

దూరగు లైనవేళలను తోరపు మోదము నిచ్చుచుండువా
రారయ నష్టు వారి మధురస్మృతి డెందముఁ బాయకుండుటన్.

కావునఁ బోయివచ్చెద సుఖం బవుఁ గావుత నీకు నిత్యము
న్నో విరికన్నె! నీదు మృదులోజ్వలసుందరరూపసంపదల్
నీ విలసత్పరీమళము నీ దరహాస వికాసలక్ష్మి నా
భావము నెల్లకాలమును బాయక మోద మొసంగుఁగావుతన్.

# మల్లమదేవి

శ్రీ వేంకట కాళిదాస కవులు

జీవమున్ సత్వము లేని మా భరతదేశమ్మెల్ల నొక్కుమ్మడిన్
సవరింపంగల తావకీన శుభవర్చస్సుల్ మదిన్ నిల్పి ఛా
త్రవతీ! నీ యనిరూప్యభావనలఁ దోరమ్మైన గీతాలఁ గా
వ్యవిపంచిన్ బలికించుచుండెదరు సుమ్మా భారతీయుల్ సదా!

ఓ వర్చస్విని! నీ సహోదరు సుషుప్త్యున్మీలితస్వాంతమున్
లేవం దీసితి; వాఁడిలోనికిఁ గడున్ నిర్నిద్రుఁడై యేఁగఁగా;—
ఏవో నాఁటి మహత్త్వముల్ మరల మా యీ యాత్మలన్ జ్ఞప్తి నీ
మా విద్యుత్ప్రతిభన్ సతంబు వెలిఁగింపన్ జేయుచుండున్ సుమీ.

మఱుపుం దెరన్ మఱుంగువడి మా హృదయమ్ముల నేఁటిదాఁకఁ జి
త్తరువువలెన్ భవద్విమలతావిభవమ్ములు మాసిపోయె, నా
తెర విడె నేఁడు; మా కనుమతింపుము పావనతావకీన దృ
క్సరసిజ నిర్గతాచ్ఛ మధుసారము లీఁపయి ఛాత్రశాలినీ!

నీవలె భారతీయజననీ గళలంబిత పాశబంధముల్
తీవలపోలికన్ సడలఁ దీయఁగఁజాలెడి సోదరీమణుల్
కావలెనంచు దేశము విలాపమొనర్చుచునుండెఁ గాని యా
హా! విధి! యామె కంటితడినైనను నొత్తెడివాఁడు కల్గిరే.

నీ వానాఁడు విశుద్ధవహ్నిశిఖలన్ దేహంబు నర్పింప నీ
పావిత్ర్యమ్ములు మింటిపై కెగసి శోభల్ నింపునక్షత్రమై
యీవేళన్ భరతావనీహృదయ చిహ్నీభూత దైన్యాంధ పీ
థీ విద్యుల్లతికాగతిన్ మెఱయుచుం గాంతిన్ ఛాత్రతేజస్విని!

# హెచ్చరిక

తుమ్మల సీతారామమూర్తిచౌదరి గారు

దేశహితైక కార్యముల దీక్ష వహించినవాఁడ నంచు, మీ
దేశము మీయశంబును మదిం దలపోయుఁ డొకింత యంచు నా
వేశముఁ గొల్పి జానపదవిత్తము నెంతయు లాగి దాని మాం
సాశనవృత్తి స్వార్థమునకై దిగమ్రింగెద వేల సోదరా ?

ఉ. "ఎవ్వఁడు నన్ను మెచ్చు నిఁక నేన ననుం గొనియాడుకున్న" నం
చెవ్వఁడొ మున్ను పల్కినటు లిస్సిరొ! జంకక లోకులెల్లరున్
నవ్వ శతావధాని కవినాథ విశారద రంగసింహ యం
చివ్విధి నీకు నీవ లిఖియింపకు సద్బిరుదాళి సోదరా!

చ. "నలుగురుఁ జెప్పకొంద్రుగద న" న్నను నీచపుఁ గోర్కితోడ నీ
తెలివిని నీదుపాండితి మదిం దలపోయక నిష్కళంకమూ
ర్తులపయిఁ గాలు దువ్వి కడుఁ దుచ్ఛపువ్రాఁతలు వ్రాసినంత నే
పలువ యటంద్రు గాని నినుఁ బ్రాజ్ఞులు మెత్తురటయ్య సోదరా !

ఉ. రచ్చలలోన మీసములు రంగు దొలంగఁగఁ ద్రిప్పి త్రిప్పి యిల్
సొచ్చినవెన్క యాచకుని జూచి రయంబున మూల డాఁగి పై
పెచ్చు "గృహస్థు లేఁ" డనుచుఁ బ్రేయసితోఁ బలికించి జాతికిన్
మచ్చను దెచ్చిపెట్టి యధమప్రథనుండవు గాకు సోదరా.

ఉ. ఎవ్వనితోడఁ గూడి శయియించితివో, విహరించితో సతం
బెవ్వనితోడఁ గూడి భుజియించితివో చెలికాని వాని నీ
వెవ్వఁడ? వేపురంబు? కుల మెయ్యది? పే రెది? యంచుఁ గూసె దీ
క్రొవ్విన చేష్టలన్ విడిచి కొమ్మధికారిపదంబు సోదరా.

ఉ. కమ్మని భోజనంబుఁ దినఁగన్ మన సొప్పదు నీకు మేలి వ
స్త్రమ్ములఁ గట్ట గిట్టదు వదాన్యతఁ జూపె యశమ్ము నంద లే
శమ్మును గోర్కి లే దిఁక నిజమ్మును బొంకును మాని కూర్చు నీ
సొమ్మది యేల? చిత్తమున సుంత విచారమొనర్పు సోదరా.

ఉ. వంగి నమస్కరించి ధనవంతుల చెంతకుఁ జేరి వారిఁ బల్
భంగుల వేఁడి నిక్కము లబద్ధములున్ బదివేలు సెప్పి య
ప్పం గొనిపోయి పిమ్మట నపూర్వపు టెత్తుల నెత్తి దాతకున్
భంగముఁ దేఁ దలంతు విది పాడి యటంచెటు దోఁచె సోదరా?

# సంగీతము: స్వరావళి

వింజమూరి వరాహ నరసింహాచార్యులు గారు
(సంగీతవిద్వాన్)

క్రిందటి వ్యాసమున (మా.-౩౦. స. విభవ సంవత్సరాది సంచిక) భారతీయులు హెల్మహోల్ట్సు, ప్లెసరినా మున్నగు పాశ్చాత్య శాస్త్రవేత్తల కెయ్యెడలను తీసిపోవరనియు, ధ్వనిగూర్చియు, స్వరావళి గూర్చియు వారు పరిశోధనలవలన కనుగొనిన పెక్కు అంశములు కూడ మనవారెరిగియుండిరనియు నెంచి యుంటిమి. సప్తస్వరములు కనుగొను క్రమముకూడ తెలుపబడెను. ఈవిధమగు స్వరములు ప్రస్తుతము మనశంకరాభరణము (Diatonic major scale)*

స రి గ మ ప ధ ని (సం)

4 శ్రు 3 శ్రు 2 శ్రు 4 శ్రు 4 శ్రు 3 శ్రు 2 శ్రు

ఈవిధమగు స్వరావళికి తుల్యమగుచున్నది కావున శుద్ధస్వరావళి యిదియె యని కొందరెంచుచున్నారు. కొందరు వింతగ మాయామాళవగౌళయందలి స్వరావళియే శుద్ధమనుచున్నారు. ఇది సరికాదు. శార్ఙ్గదేవుడు, రామామాత్యుడు, సోమనార్యుడు, వేంకటముఖి, అహోబలుడు మున్నగు వాగ్గేయులమతము ననుసరించి శుద్ధస్వరావళి

స రి గ మ ప ధ ని (సం)

3 శ్రు 2 శ్రు 4 శ్రు 4 శ్రు 3 శ్రు 2 శ్రు 4 శ్రు

చొప్పున నున్నది. ఇది కొంచెము మించు మించు ఖరహరప్రియ మేళమునకు తుల్యమగుచున్నది. ఈసంగతులన్నియు విపులముగను, క్రమముగను ఇటీవల నేను వ్రాసి ప్రచురించిన "22 శ్రుతులు - స్వరావళి" అను గ్రంథమున జెప్పియుంటిని. శ్రుతులగూర్చిన పెక్కు అంశములు, అవి సమములా? అనుదానికి సమాధానములు మున్నగుచర్చలు అట చూడనగును. కావున నీచిన్న వ్యాసమున నవి చెప్పబడవు.

బహుప్రాచీన కాలము నుండియు, ననగా భరతుని కాలము క్రీ. పూ. 4 వశతాబ్దమునుండియు, శుద్ధస్వరావళియందలి సప్తస్వరములు మాత్రమే కాక మరికొన్ని 'వికృతములు' అను పేర మన సంగీతమున వాడబడుచుండినట్లు విదితము. భరతుడు వీనిని "స్వరసాధారణ" మని వచించినాడు. కాని తన గ్రామరాగముల కాప్పటికులగు జాతులందును, మూర్ఛనలందును వీనిని విరివిగ నుపయోగించినట్లు కాన్పింపదు. అంతర కాకలి సాధారణముల నల్పముగనైన నుపయోగించుటకు నియమములు కలవు. అవి ఆరోహణమందే యుపయోగింపవలయు ననియు, నప్పటికిని వానిని మధ్యమ, పంచమ, మధ్యపంచమజాతులందు మాత్రమట్లు చేయవచ్చుననియు నతడు చెప్పెను. అనంతరము శార్ఙ్గదేవుడును వీనిని పేర్కొనెను కాని పన్నెండువికృతులు కూడ పేర్కొని తనమతమును వేరుగ నిలబెట్టుచుండెను. కావున వికృతిస్వరములు భరతుని కాలమునుండియు వాడబడిన వందుము. అంతకు ముందుగల గాంధర్వవిద్యగూర్చి విపులమగు సంగతులు మనకు తెలియుటలేదు. కావున భరతుని కాలము మాత్రము పేర్కొంటిమి.

ఈ వికృత స్వరముల సంఖ్య గూర్చినవాదము నేటికిని ప్రబలముగనే యున్నది. కొందరిట్టివి యేడుస్వరములు మాత్రము కలవనియు, కొందరు తొమ్మిది యనియు, మరికొందరు ఐదే స్పష్టము లనియు నిట్లు పలువురు పలువిధముల జెప్పుచున్నారు. ఇందుకు పూర్వపు మనవాగ్గేయులును కొంత కారకు లనక తప్పదు. శార్ఙ్గదేవుడు 12 వికృతులను గణించుచుండ, క్రీ. వె 1549 సం. రము నమున్న రామామాత్యుడు, దామోదరుడు మున్నగువారు ఏడు వికృతులను మాత్రము గ్రహించి చెప్పిరి. క్రీ. వె. 1609 సం. రమునాటి సోమనార్యుడు వైణికులవలె ఏడువికృతులను పేర్కొనుచు మరిమూడు స్వరములను కూడ "ప్రాచీన వికృతము"లని చెప్పెను.

ఇందుచే నితనికి 10 వికృతము లాయెను. అనంతర ముండిన వేంకటముఖి, తులజేంద్రుడు మున్నగువారు అయిదు వికృతులే చెప్పిరి. వీని సంఖ్యమాత్ర మిట్లు భిన్నమతములుగ నుండుటయే కాక శ్రుతులయందు వీనిస్థానములును భిన్నములుగనే యున్నవని తెలియవలయు.

ప్రకృతమున వేంకటమఖి సంప్రదాయ మని చెప్పుకొనుచు కర్నాటకగానమున నైదువికృతములనే మనవారు వాడుచున్నారు. అందుచే వీరికి 12 స్వరము లగుచున్నవి. ఇవి కలుగు విధము, వీని స్పందనల విలువలు, అంతరములు మున్నగునవి క్రిందటి సంచికయందలి వ్యాసమున దెల్పితిమి. కాని యీవిధమగు స్వరముల విలువలు గమ

* యూరోపియనుల ఘనస్వరావళి (Diatonic scale) ధైవతమందు తప్ప మన శంకరాభరణమునకు సమముగ నున్నది. మన ధైవతము $\frac{27}{16}$ అంతరము కలది. వారిధైవతము $\frac{5}{3}$ అంతరము కలదై కొంచెము కోమలముగ నున్నది.

నించిన వేంకటమఖిమతమునకు భిన్నముగనే యున్నవి. వేంకటమఖి చెప్పు పంచశ్రుతి ఋషభధైవతము లిప్పటి 12 స్వరములందు కానబడవు. సోమనార్యుడు చెప్పు చతుశ్శ్రుతి ఋషభధైవతములే పై వానియందు విదితము. కాని నవీనులు చెప్పునట్లు చతుశ్శ్రుతి ఋషభ శుద్ధగాంధారములు, చతుశ్శ్రుతిధైవత శుద్ధనిషాదములు ఒక్కస్థానమున నుండవు. వేంకటమఖి చెప్పినట్లు పంచశ్రుతి ఋషభశుద్ధగాంధారములు, పంచశ్రుతిధైవత శుద్ధనిషాదములు ఒక్కస్థానమున నున్నవి. * వేంకటమఖి యొక్క వరాళిమధ్యమ స్థానమున నవీనప్రతిమధ్యమము లేదు. ఇది సోమనార్యుడు చెప్పు ప్రతిమధ్యమస్థానముననే కలదు. ఇందుచే నిప్పటి పద్ధతి పూర్వపుపద్ధతి నతిక్రమించియే యున్న దనవలయును.

ప్రకృతి వికృతి స్వరములు వేంకటమఖి చెప్పినట్లు 12 మాత్రము నవీనులు చెప్పుచున్నారు. ఇందుకు దృష్టాంతముగ వీణయందు ఒకస్థాయిలో 12 సారికలనే వాడుచున్నారు. కాని యీపద్ధతి మన సంగీతమునకు తగియుండక పోవుటయే కాక చాలియుండుట లేదు. ఈ 12 సారికలపద్ధతి ఎప్పుడు వచ్చినదియు తెలియుటలేదుకాని నవీనమైనదే యనవలయును.

శార్ఙ్గదేవుని కాలమున వీణయందు సారికల నమర్చుపద్ధతి కాక ద్వావింశతి శ్రుతులకు నిరువదిరెండు తంత్రులు మేళగించుటే చెప్పబడియుండెను. సోమనార్యుడు మాత్రము ఈపద్ధతిని విపులముగ జెప్పినాడు. ఇతడు చెప్పువిధమున ప్రతిశ్రుతి ఒక్కొక్కసారిక యందు గలుగుటచే 22 శ్రుతులకు 22 సారికల నేర్పరచి యుంచియుండెనందుము. ఎట్లైనను ఈప్రాచీనకాలమునందలి వీణలు ఇప్పటివానివలె 12 స్వరములనే కాక తక్కినవానినికూడ పలికించుచుండెడివని గ్రహింపవలెను. అనగా 22 శ్రుతులు ఏర్పాటుగ జెప్పబడుచుండె నందుము. కావున నవీనసారికా పద్ధతి కొంత నూతనమైన దనవలయును. ఇందుకు కారణ మూహ్యము.

అయినను నవీనవీణలందలి 12 సారికలవలన కావలసిన పెక్కుస్వరములను గమకములచే మనవారు స్ఫురింపజేయుచునే యున్నారు. అట్లు కానిచో మన రాగకళ పూర్తి కానేరదు. ఏయేరాగమున నేయేస్వరము కలుగుచున్నదియు విద్యార్థులు గ్రహింపలేమి, విద్వాంసులవలె వీరు రాగకళను తీసికొనిరాలేక పోవుచున్నారు. వీరు 12 స్వరముల వలననే యట్లు రాగకళను పోషింపవచ్చునని విరుద్ధాభిప్రాయముతో మోసపోవుచున్నారు. ప్రథమతరగతి విద్యార్థులకు సప్తప్రకృతి స్వరములు గ్రాహ్యములగుచుండ కొంత ప్రజ్ఞావంతులకు వికృతిస్వరములు చేరిన 12 స్వరములు నావశ్యము లగుచున్నవి. విద్వాంసులకు ద్వావింశతి శ్రుతులు ఆవశ్యకములు. పాశ్చాత్యులగానపద్ధతి రాగపద్ధతి (Melody type) కాదుకావున వారు 12 స్వరములతో సంతుష్టులగుచున్నారు. కాని భారతీయసంగీతమున పెక్కుస్వరము లావశ్యకములే. ఉత్తరదేశగాయకులు ఎన్. వి. భాత్కండే, విష్ణుదిగంబరు, మహమ్మదుఖరీము మున్నగువారు కూడ విస్తారముగ (12 స్వరముల కెక్కువగు) స్వరావళితో గూడిన తమతమపద్ధతులను వెలయించుచున్నారు. కావున మనగానమునకు ద్వావింశతి శ్రుతులు ఆధారము లగుచున్నవని యెంచవలసియున్నది.

శ్రవణేంద్రియమునకు గ్రాహ్యములై రంజకములగు నాదములు పై జెప్పబోవున ఇరువదిరెండు కలవని పూర్వమునుండియు భరతాదులు వచించుచుండిరి. తక్కినగాయకు లెల్లరు ఈపద్ధతి ననుసరించుచుండిరి. కాని నవీనులు వింతగ జెప్పునట్లు 24 శ్రుతులు కలవనియు, 44 కలవనియు వారు చెప్పియుండలేదు. స్థాయియందు 24 శ్రుతులు గ్రహింతుమనుట సమశ్రుతిపద్ధతి (Equal temparamental sysetm) ననుసరించుటే. ఇదిమనభారతీయసంగీతపద్ధతి కాదు. రాగపద్ధతి (Melody type) తెలియని పాశ్చాత్యులచే నిర్మింపబడిన హార్మోనియమునందలి పద్ధతి కావున నట్టు లెంచవలనుపడదు. ద్వావింశతి శ్రుతిపద్ధతియొక్క యుత్కృష్టతను పాశ్చాత్యులు ఆర్. హెచ్. ఎమ్. బోసాంక్వే మున్నగువారు కూడ "తక్కువశ్రుతులు కలిగిన స్థాయి లన్నిటిలో ద్వావింశతి శ్రుతిపద్ధతియే నవ్యమగునది; తక్కిన పద్ధతులందలి పంచమగాంధారములకన్న దీనియందలివే సుకరము లగుచున్నవి. (The system of 22 possesses then, remarkable pıoperties; it has both fifths and thirds consideıably better than other cyclical systems having so low a number of notes.)" అని మెచ్చుకొనియున్నారు. ఇదియే మనకు తగియున్నది.

ఈ శ్రుతుల విలువలు, అంతరములు స-ప లేక స-మ పద్ధతి ననుసరించు సంవాదిత్వము (Quintal harmony) వలన నిర్మింపవచ్చును లేక కనుగొనవచ్చు నని కొంద రిప్పుడు తలంచుచున్నారు. ఇది సరికాదు. మన 22 శ్రుతులు ఒక్క స-ప లేక స-మ పద్ధతుల వలననే నిర్మింపబడక, యీరెండుపద్ధతులును, మరి స-గ పద్ధతియు గూడ చేరిన సంవాదానువాద పద్ధతి (Tertian harmony) వలన కలుగుచున్న వనవలయు. కొన్ని యెడల Septimal harmony పద్ధతి ననుసరించినవియు గలవు. ఈపద్ధతులవలన మనశ్రుతుల నిట్లు గ్రహింతుము:—

షడ్జపంచమ పద్ధతి

| | |
|---|---|
| స 1 | ప $\frac{3}{2}$ |
| ప $\frac{3}{2}$ | చ-రి $\frac{9}{4}$, ఒకస్థాయి తగ్గిన, |
| చ-రి $\frac{9}{8}$ | చ-ధ $\frac{27}{16}$ |
| చ-ధ $\frac{27}{16}$ | మృదు మ $\frac{81}{32}$, ఒకస్థాయి తగ్గిన, |

* ఈసంగతులు నేను రచించిన "22 శ్రుతులు - స్వరావళి" పుస్తకము నందలి చివరిశ్రుతులపట్టకమున గ్రహించునది.

మృ-మ $\frac{81}{64}$ మృ-స $\frac{243}{128}$

మృ-స $\frac{243}{128}$ వరాళి మ $\frac{243}{148} \times \frac{3}{2} = \frac{729}{512}$, ఇది $\frac{64}{45}$ కు [సమమని రొంతుము.

వరాళి మ $\frac{64}{45}$ శుద్ధ రి $\frac{32}{15}$, ఒకస్థాయి తగ్గిన,

ద్విశ్రుతి లేక శుద్ధ రి $\frac{16}{15}$ ద్విశ్రుతి ధ $\frac{8}{5}$

ద్విశ్రుతి ధ $\frac{8}{5}$ సాధారణ గ $\frac{12}{5}$, ఒకస్థాయి తగ్గిన,

సా-గ $\frac{6}{5}$ కై-ని $\frac{9}{5}$

కై-ని $\frac{9}{5}$ ఏకశ్రుతి మ $\frac{27}{10}$, ఒకస్థాయి తగ్గిన,

ఏకశ్రుతి మ $\frac{27}{20}$ ఏకశ్రుతి రి $\frac{81}{40}$, ఒకస్థాయి తగ్గిన,

ఏకశ్రుతి రి $\frac{81}{80}$ ఏకశ్రుతి ధ $\frac{243}{160}$

ఏకశ్రుతి ధ $\frac{243}{160}$ శుద్ధ గ $\frac{729}{320}$, ఒకస్థాయి తగ్గిన,

శు-గ $\frac{729}{640}$ శుద్ధ ని $\frac{2187}{1280}$ ......ఇట్లు—

ఇట మృదుసధ్యమమువద్ద కొంతభేదమును, వరాళి మ. వద్ద కొంత భేదమును గమనింతుము. కొన్ని సవరణలు కూడ చేసితిమి. ఏకశ్రుతి ఋషభము నుండి మిక్కిలి వ్యత్యాసములు కలవిలువలు వచ్చుచుంటచే నిక మానితిమి. ఏకశ్రుతి ఋషభము 81/80 లేక 22 శతాంశముల విలువ గలది మనసంగీతమున గ్రహింప బడుటలేదు.

### షడ్జమధ్యమ పద్ధతి

స 1 మ $\frac{4}{3}$

మ $\frac{4}{3}$ శుద్ధ ని $\frac{16}{9}$

శుద్ధ ని $\frac{16}{9}$ శు-గ $\frac{64}{27}$, ఒకస్థాయి తగ్గిన,

శు-గ $\frac{32}{27}$ ఏకశ్రుతి ధ $\frac{128}{81}$. దీనికి ఒకకోమా విలువ; అనగా $\frac{81}{80}$ లేక 22 సెంట్లు కలిపిన ద్విశ్రుతి ధైవతము $\frac{8}{5}$ వచ్చును.

ద్వి-ధ $\frac{8}{5}$ ద్విశ్రుతి రి $\frac{32}{15}$, ఒకస్థాయి తగ్గిన,

ద్వి-రి $\frac{16}{15}$ ప్రతిమధ్యమము $\frac{64}{45}$. కాని ఇది వరాళి మధ్యమ మగుచున్నది. ఇది 10 శ్రుతుల యంతరము కలది.

వరాళి మ $\frac{64}{45}$ మృదు స $\frac{256}{135}$, అనగా ఇది $455\frac{1}{9}$ చలనములు కలిగి, 1108 సెంట్లు విలువతో నున్నది. ఇది కొంచెము కోమలముగ నున్నది. ఇంతటినుండి విలువలు సామరస్యముగ నుండవు.

ఈ మూడు పద్ధతులందలి విలువల ననుసరించి మన శ్రుతుల విలువ లిట్లున్నవి:—

| శ్రుతులు | స్వరములు | స్పందనల వ్యత్యాసముతోడి యంతరములు | అంతరమందలి సెంట్లు |
|---|---|---|---|
| షడ్జము | స | 1 | 0 |
| ఏకశ్రుతి ఋషభము | $ఋ_1$ | 25/24 | 70 |
| ద్విశ్రుతి ఋషభము | $ఋ_2$ | 16/15 | 112 |
| త్రిశ్రుతి ఋషభము | $ఋ_3$ | 10/9 | 182 |
| చతుశ్శ్రుతి ఋషభము | $ఋ_4$ | 9/8 | 204 |
| [illegible] గాంధారము లేక శు-గ | $గ_2$ | 32/27 | 294 |
| సాధారణ గాంధారము | $గ_1$ | 6/5 | 316 |
| అంతర గాంధారము | గ | 5/4 | 386 |
| [illegible] గాంధారము లేక మృ-మ | $గ_{+1}$ | 81/64 | 408 |
| [illegible] మధ్యమము | $మ_1$ | 4/3 | 498 |
| [illegible] మధ్యమము | $మ_2$ | 27/20 | 520 |
| [illegible] మధ్యమము | మ | 45/32 | 590 |
| వరాళి మ లేక [illegible] మధ్యమము | $మ_4$ | 64 | 610 |
| [illegible] పంచమము | ప | 3/2 | 702 |
| ఏకశ్రుతి ధైవతము | $ధ_1$ | 25/16 | 772 |
| ద్విశ్రుతి ధైవతము | $ధ_2$ | 8/5 | 814 |
| త్రిశ్రుతి ధైవతము | $ధ_3$ | 5/3 | 884 |
| చతుశ్శ్రుతి ధైవతము | $ధ_4$ | 27/16 | 906 |
| [illegible] నిషాదము | $ని_2$ | 16/9 | 996 |
| [illegible] నిషాదము | $ని_1$ | 9/5 | 1018 |
| [illegible] నిషాదము | ని | 15/8 | 1088 |
| [illegible] నిషాదము | $ని_{+1}$ | 243/128 | 1110 |
| తార షడ్జము | (సం) | 2/1 | 1200 |

## షడ్జగాంధార పద్ధతి

| | |
|---|---|
| స | అంతర గ $\frac{5}{4}$ |
| అం-గ $\frac{5}{4}$ | కా-ని $\frac{15}{8}$ |
| కా-ని $\frac{15}{8}$ | ప్రతిమధ్యమము $\frac{45}{32}$ |
| ప్ర-మ $\frac{45}{32}$ | ద్వి-రి $\frac{135}{128}$. దీనిలో పైకోమా $\frac{81}{80}$ తీసివేసిన, |
| ఏకశ్రుతి రి $\frac{25}{24}$ | ఏకశ్రుతి ధ $\frac{25}{16}$ |
| ఏకశ్రుతి ధ $\frac{25}{16}$ | శుద్ధ గ $\frac{75}{32}$. ఇప్పుడునుండి విలువలు సుకరములు కావు. |

ఇట త్రిశ్రుతిఋషభస్థానములు, మధ్యమము- ఈమొదటివిలువలు పైపద్ధతులందు కాన్పించుటలేదు. వీని నిట్లు చెప్పవచ్చును: (i) త్రిశ్రుతిస్థానము శుద్ధమధ్యమమునకు అంతరగాంధారము, లేక అంతరగాంధారమునకు శుద్ధమధ్యమము అగుచున్నది. కావున దీని విలువ 5/4 × 4/3= 5/3 అగును. (ii) త్రిశ్రుతిఋషభము స్థానమునకు పంచమవ్యత్యాసమున నున్నది. కావున దీనివిలువ 5/3 × 2/3= 10/9 అగును. (iii) మధ్యమము ఏకశ్రుతిఋషభమునకు శుద్ధమధ్యమ వ్యత్యాసమున నున్నది. ఏకశ్రుతిఋషభము విలువ 25/24 గ నెంచిన, దీనివిలువ 25/24 × 4/3=25/18 అగును. దీనివిలువ వివాదాస్పదముగ నున్నది. నాపుస్తకమున దీనివిలువ శార్ఙ్గదేవాది పూర్వపుగ్రంథకర్తల మతమునసరించి చెప్పబడెను.

కాని యీమధ్యమమునకు సంబంధించిన ఋషభము ప్రకృతపు కర్ణాటకగానమందు కొంచెము కోమలముగనే యున్నది. కావున నేను ఇటీవల ఈయేకశ్రుతి ఋషభపు విలువ 25/24 నుండి 31/30 గ మార్చుటకు సమ్మతించితిని. ఇట్లు మార్చుటకు నాశ్రుతి వీణ యందు పరీక్షించి దృఢపఱచుకొంటిని. ఫిడేలువాద్యమున మహాఘనత కెక్కిన నామిత్రులు శ్రీయుత ద్వారం వేంకటస్వామి నాయుడు గారు, మరి శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు మున్నగువారి సలహాగూడ పొంది యట్లు చేయ సమకట్టితిని. కాని యిటీవల "హిందూ"పత్రికకు వ్రాయుచు శ్రీయుత సి. సుబ్రహ్మణ్యయ్యర్, బి.ఏ. గారు పైమార్పుకు అంగీకరించలేదు.[1] 31/30 ఋషభము అంతరగాంధారముతో సరళప్రమాణమున గానయోగ్యము (Musical) గా ఉండదని యీయన చెప్పునది సరికాదు. ఏకశ్రుతిఋషభము తోడిరాగమునందు వలె సాధారణ గాంధారముతో జేరివచ్చును. కాని అంతర గ. తో నట్లు రాదు. ద్విశ్రుతి ఋషభము 16/15 విలువగలది మాయామాళవగౌళ యందువలె అంతరగాంధారముతో జేరివచ్చును. కాని 25/24 విలువ గల ఏకశ్రుతిఋషభము తోడిరాగప్రయోగము లందు సరళప్రమాణమున లేనందున గానయోగ్యముగ నుండుటలేదు. దీనిని పూర్వికులు ఎంచియుండిరేనను, నవీనగానమున 31/30 విలువగల ఏకశ్రుతిఋషభమే గ్రాహ్యముగ నున్నది. పాశ్చాత్యశాస్త్రవేత్త "హెల్మహోల్ట్జ్" 31/30 విలువను గ్రహించి యీ గ్రీకుసంగీతమున గలదని చెప్పెను. ఈ ప్రదేశమునను 25/24 విలువగల ఋషభమును వాడుటలేదు. కొంచెము తీవ్రముగ 21/20 విలువగల ఏకశ్రుతిఋషభమే వారు సవరించి వాడుచున్నారు.[2] కావున ఏకశ్రుతిఋషభస్థానముల విలువలు 31/30, 31/20 గ నుండవలెను. ఇవియే కర్ణాటకగానమున లక్ష్యములు.

ఇక 27/20 విలువగల మధ్యమము మనగానమున నంతగా కానము కావున దీనిని మనగాయి (Gamut) నుండి తీసివేసి సుకరమున, సుస్పష్టమునగు 7/4 విలువతోనున్న దేవగాంధారిస్థానము నుంచిన బాగుండునని నాయభిప్రాయము. కాని సదరు సుబ్రహ్మణ్యయ్యర్ గారు 27/20 మధ్యమము బేగడరాగమున వ్యక్తమగుచున్నట్లు తీసివేయ వీలులేదనిరి. ఈమధ్యమము బేగడరాగమందును అంతగా కానము. బేగడరాగమున మధ్యమము దీర్ఘముగ బట్టునప్పుడు, అనగా- "సపసా, మాసాగరి, పసా" ఇట్లు పంచమముతో జేరిన ప్రయోగములందు 'మ' దీర్ఘముగా వచ్చినప్పుడే 27/20 మ. కలుగుచున్నది. తక్కిన బేగడరాగప్రయోగములందు "పమరీ, గమ గమరీ, గరిగమపమ" మొదలగు పలుకులందును పై 'మ' కనుపించక 4/3 విలువగల శుద్ధ 'మ' యే ప్రసరించుచున్నది. అందుచే 27/20 మ. మనగానమున నంతగా నావశ్యకము కాదు. ఇది కలుగు పైస్థలము లందు దీనిని గమకములచే స్ఫురింప జేయవచ్చును. కావున దీనిని తీసివేసి 7/4 విలువగల సువ్యక్తమగు స్థానమును జేర్చుకొనవలసియున్నది.

కర్ణాటకగానమున మనము పైవిధమున గ్రహించు సుస్పష్టమగునవి యిరువదిరెండు మాత్రము కాక యిరువదినాలుగు శ్రుతులు కలవనియు, భైరవిరాగమున గల ద్విశ్రుతిస్థానమును 128/81 విలువతో నున్నదానిని, సావేరి రాగమునందలి ద్విశ్రుతి ఋషభము 256/243 విలువగలదానిని గూడ జేర్చుకొనవలసి యున్నదనియు జెప్పు శ్రీఅయ్యరుగారి వాక్యములు పఠనీయములు కావు. ఈ సంగతులను "హిందూ" పత్రికలో ఖండించియుంటిని. 128/81 విలువగల ద్విశ్రుతికస్థానము ఈరాగమున నల్పముగ నున్నది. భైరవిరాగప్రయోగము లందు "ధపధ, ధస, మపధమప" ఇట్లు పంచమముతో జేరినస్థలములందు మాత్రము 128/81 ధ. కలుగును. తక్కిన యన్నిచోట్లను (1) ధనిస, ధరి, మనిధస, నిధని, సనిధపమ; (2) ధసమధపా, నినిధధ -సపా-మొదలగు ప్రయోగములందును ధ. విలువ యారోహణావరోహణము

---

1. నవంబరు డిశంబరు నెలలందు బుధవారమున ప్రచురింపబడు హిందూపత్రికలు చూచునది.

2. 'ఎల్లిస్'గారి పుస్తకము చూచునది.

లందు మారుచు, నారోహణమందు కొన్నిచోట్ల 27/16 విలువగల చతుశ్శ్రుతికమును, తక్కిన ప్రయోగములందు 8/5 విలువగల ద్విశ్రుతికమును గ్రహింపబడుచున్నవి. కావున భైరవిరాగము సువ్యక్తమగు శుద్ధ ధైవతము 8/5 ద్విశ్రుతికమే. పైజెప్పిన స్వల్పస్థలములందలి 128/81 ధైవతము గమకములచే స్ఫురింప జేయబడును. ఈప్రత్యేకస్వరము ఆవశ్యకము కాదు. కాని యీస్వల్పవ్యత్యాసము లగువానినెల్ల సరకుచేసిన యెడల ఒక్క భైరవి ధ., సావేరి రి. మాత్రము కాక, పెక్కులు రి, గ, మ, ధ, ని-లనుంచి కల్పింపవచ్చును. ఈసంఖ్యానీకములగు స్వరములు స్థాయియందు క్లిష్టము లగుటయే కాక, యసహ్యములుగ గూడ నుండును. 12 స్వరములే స్పష్టములని చెప్పబడును, ఇన్నిస్వరభేదము లెఱుగని పాశ్చాత్యులను పైమునే గ్రహింపు గలస్థాయిని కరము హర్షింపరని వేరు చెప్పనక్కరలేదు. స్వల్పభేదములతో నున్నవానినెల్ల, అనగా 25/24, 256/243, 31/30, 21/20, 81/80 విలువలతో నున్న ఏకశ్రుతి ఋషభములను, ఇట్లు 25/16, 128/81, 31/20, 63/40, 243/160 విలువలుగల ఏకశ్రుతి ధైవతములను గ్రహించుచుపోయిన మనసంగీతము సుకరము కాదు. మనకనుకూలు వానినిమాత్రము సంవాదముపలగు పద్ధతులనుండి గ్రహించి చెప్పవలయునే కాని సదరుపద్ధతులందలి వానినెల్ల నట్లు చెప్పుట భావ్యము కాదు. సువ్యక్తములును, ముఖ్యములు నగువానిని మాత్రము ఎంచిన మిగిలినవి గమకములచే స్ఫురింపజేయబడును. మరియు దక్కనసొడవులు కల వాద్యములలో, ముఖ్యముగా ఫిడేలునందు, పై యనేకస్వరములు పలుకు స్థానములు స్ఫుటములు కావు. కొన్నికొన్ని మిళితములగునంతటి అల్పదూరముననే యున్నవి. ఇట్లు ముఖ్యముగా 128/81 ధ. యు, 8/5 లేక 128/80 ధ. యు దుర్లక్ష్యభావమున నుంటచే ఫిడేలుతంత్రియందలి వీనిస్థానములు కరము చేరిక నున్నవి.

ఇక 256/243 విలువగల సావేరి ఋషభముగూడ పైసంగతుల వలె ఖండింపబడుచున్నది. ఇది 16/15 కు తుల్యమే. కావున ఈ ఋషభధైవతములు మనస్థాయియం దావశ్యకములు కావు.

స్వరముల విలువలు పైవిధమున నంతరములతో జెప్పుటగూర్చి క్రిందటిసంచికలో గొంత చెప్పియుంటిని. తీగెయందు ముళ్లు (Nodes) కలిగినప్పుడెల్ల సదరుతీగెయొక్క కంపించు భాగములను పోల్చుటే యీ యంతరములు. అంతరములకు (Ratios) తీగెపొడవులు విషమప్రమాణమున (Inverse ratio) నుండును. అనగా రెండుమేరులకు మధ్యగల తీగెబిగింపును (Tention) మార్చక దానిని భాగభాగములందు తాకి ముళ్లను కలుగజేయునప్పు డుదయించు స్వరముల తీగెపొడవులను విషమప్రమాణమున జెప్పబడిన యంతరములే పైన చెప్పబడిన విలువలు. కావున తీగెయందు ఆయాస్వరములు కలుగుప్రదేశములు పై భిన్నముల (Fractions) లవములు తెల్పును. కొన్ని ముఖ్యములగు స్వరముల విలువలు ఈవిధమున గమనించునది:—

(1) షడ్జము విలువ:—1; అనగా తీగెయందంతయు గదలుచుండినప్పుడు కలుగును.

(2) అంతరగాంధారము:—5/4 కావున 4/5 భాగము తీగె కదలునప్పుడును, 1/5 భాగమున ముట్టినప్పుడును కలుగును.

(3) శుద్ధమధ్యమము:—4/3 కావున 3/4 భాగము తీగె కదలునప్పుడును, 1/4 భాగమున తాకినప్పుడును కలుగును.

(4) పంచమము:—3/2 కావున 2/3 భాగము తీగె కదలునప్పుడును, 1/3 భాగమున తాకినప్పుడును కలుగును.

(5) చతుశ్శ్రుతి ఋషభము:—పంచమమునకు పంచమ మగును కావున పైస్థాయియం దిది కలిగి, $3/2 \times 3/2 = 9/4$ విలువతో నుండును. మధ్యస్థాయియందు దీనివిలువ $9/4 \div 2 = 9/8$ అగును.

(6) చతుశ్శ్రుతి ధైవతము:—షడ్జతంత్రియందు రి-రి ఎట్టి సంబంధము గలిగియున్నదో యట్లే పంచమతంత్రియందు చతుశ్శ్రుతి ధ. యున్నది. కావున దీనివిలువ $3/2 \times 9/8 = 27/16$ అగును.

(7) కాకలి నిషాదము:—మధ్యమమునకు అంతరగాంధార మెట్టి సంబంధము కలిగియున్నదో యట్లే షడ్జమునకు ఈ నిషాదమును; కావుననే దీని విలువ $5/4 \div 4/3 \times 2 = 15/8$ అగును.

(8) హెచ్చుషడ్జము:—2 కావున ½ భాగమున తీగె కదలునప్పుడు, లేక ½ భాగమున తాకినప్పుడు కలుగును.

తక్కినవానిని ఇట్లు గ్రహింపనగును.

# మహామహోపాధ్యాయ

# శ్రీ పరవస్తు వేఙ్కటరంగాచార్యులు అయ్యవారలుగారు

ఇ. వి. వి. రాఘవాచార్యగారు

క్రిందటి శతాబ్దమున భారతవర్షమున గీర్వాణ భాషాప్రౌఢసరస్వతి యని జగద్విఖ్యాతి నందిన శ్రీ పరవస్తు వేంకటరంగాచార్య లయ్యవారలుగారు క్రీ. శ. 1822 వ (చిత్రభాను) సంవత్సరమున నవతరించిరి. "సర్వశబ్దసంబోధిని" యను సంస్కృతాంధ్ర నిఘంటువును నిర్మించిన శ్రీనివాసాచార్యులవారు వీరి జనకులు. రంగాచార్యులవారు రప్రతిమప్రతిభాభాసురులు. అసాధారణ ధారణా ధురంధరులు. వీరు తమ 8 వ యేటనే కవితా కన్యకం జేపట్టి "కుంభకర్ణవిజయ" మను గీర్వాణ కావ్య పుత్రికం బడసిరి. వీరు బొబ్బిలిసంస్థానమున మూఁడువందల పృచ్ఛకులతోఁ బరశ్శతావధానము నొనరించిరఁట. వీరు షట్శాస్త్రములలోను గూలంకషవైదుష్యభూషితులు. వీ రాంధ్రగీర్వాణముల బహుగ్రంథప్రణేతలు. వీరి పాండిత్య రత్నపటలికి నికషాయమాణ మగు "లఘుశబ్దార్థసర్వ"మను సర్వతోముఖనిఘంటువు (Encyclopaedic Lexicon) ప్రకృతము ప్రచురప్రచారములో నున్న (రాజా రాధాకాంతదేవ నిర్మిత) "శబ్దకల్పద్రుమము"కం టెను, (తారానాథ తర్కవాచస్పతి ప్రణీతమగు) "వాచస్పత్యము" కంటెను సత్యుత్తమముగా నున్నది. గీర్వాణ విద్వల్లో దౌర్భాగ్యముచే నీకోశ మకారాకారాది పదములు గల రెండుసంపుటములవరకుమాత్రము (వాచస్పత్య నిఘంటు పుటల ప్రమాణమున 656 పుటలు) ముద్రింపఁబడెను. అవియు నాంధ్రలిపిలో ముద్రితములు. అనంతశిష్యప్రశిష్యకులకల్పమహీరుహము లగు నాచార్యులవారిని మైసూరు, పీఠికాపురము, తుని, బొబ్బిలి, మందస, ఉర్లాము మొదలగు స్వదేశసంస్థానాధీశు లెంతయో బహూకరించిరి. క్రీ. శ. 1887 వ వత్సరమున జరిగిన విక్టోరియా జూబిలీ సందర్భమున "మహామహోపాధ్యాయ"బిరుదము నందిన భారతవర్ష పండితప్రకాండ చతుష్టయములో నాచార్యులవా రొకరు. ఆంధ్రదేశమున "మహామహోపాధ్యాయ" బిరుదము నొందినవారిలో వీరు ప్రథములు. వీరు మహావక్తలు. ససౌరభమగు సువర్ణసుమమువలెఁ, గూలంకష వైదుష్యమునకు, సర్వతోముఖ పాండిత్యమునకుఁ దోడు వీరియందు నిష్కళంక చారిత్రముగూడ నలవడియున్నది. వీరు క్రీ. శ. 1900 సం. నఁ బరమపదించిరి.

—

# రసతరంగములు ౭

## చిగురాకుమీఁద ఝంఝానిలము*

యస్. సూర్యప్రకాశరావు గారు

ఒక్కనాఁడు ప్రభంజనుం డుగ్రవేగ
చలిత నిఖిల భూభాగ సంచారుఁ డగుచు
రేఁగి, దుర్గమంబగు హిమాద్రివిపినతరు
మధ్యమస్థలి నాకాశమండలంబు
నొరయు నుత్తుంగ పిప్పల మొండు గాంచి,
యాకుఁజొంపములనడుమ నలరి యచట
నెండకన్నును వానక న్నెఱుఁగ నట్టి
చిన్ని చివురాకు నిద్దంపు చెన్ను చూచి
చటులనినదాభ్రవిభ్రమార్భటిని బలికె:

"ఎఱుఁగుదో నన్నుఁ జివురాక! యెఱుఁగవేమొ!
అలఘుజవమున బ్రహ్మాండ మాక్రమించి
యుదధు లేడింటి నుఱ్ఱూఁత లూఁచియూఁచి
బహుళనీరంధ్రఘనబిడాభ్రఘటలఁ గలఁచి
సకలకుజనుల నుగ్గు నూచంబు సేసి
యవనిఁ బేరెక్కినట్టి మహాబలుండ
నేను; నేను గానని యణువైన లేదు;
నాకుఁ జొరరాని చీమ కన్నంబు లేదు—
పదిలమై యుంటి నాకంటెఁ బడక యెటులొ;
ఐన నేమాయె? నేఁటి కేఁడాదిలోనఁ
బ్రబల ఝంఝా సముద్ధూత పతితఁ జేసి
నిన్నుఁ గొనిపోదు నాపేరు నిక్కమేని."

అని సమీరణుఁడు వలుక నాక్షణంబ
చిన్నిచివురాకు ధృతి దప్పి, విన్నఁబోయి,
గడగడ వడంకి, సోలి, యాక్రందనంబు
సేయఁ దత్తరం బంది లేఁజివురుకొమ్మ
దాసి యోదార్చి యొసలి వడంకుఁ దీర్చి
యనునయోచితసరోక్తు లాడి యిరుగు
పొరుగు ముదుసలికొమ్మల కెఱుఁగఁ దెల్పి
గుజగుజలువోయి యందఱుఁ గూడికొనుచుఁ
గులముపెద్దయుఁ దమకెల్లఁ గూర్చు ప్రాపు
మహితజీవనగాత్ర సన్మార్గవర్తి
పిప్పలప్రభుని కెఱుఁగఁ జెప్ప నతఁడు—

అతివిశాలాసనంబున నధివసించి
ధళధళని మెఱయుఁ బ్రవాళములు ధరించి
నవ్యకలకంఠ మధురగానంబు సెలఁగ
నలుగడలఁ జేరి చిగురుకొమ్మలు మరాళ
లలితగతులు నర్తనము సల్పఁ బరిపూర్ణ
సంపద ననుభవించుచు సంతసమునఁ
గొలువులో నుండి, యించుక తలఁ గదల్చి
చిన్నిచిగురాకుఁ జూచి వచించె నిట్లు:
"అమ్మ! చివురాకుపట్టి!! ధైర్యంబు చిక్కఁ
బట్టు; భయము నీ కేల? యభయ మొసంగ
నూఢికెక్కిన పిప్పలు మ్రోల నిలిచి;
అనిలుఁ డొక్కఁడు గాదు దవానలుండుఁ
గూడఁ దోడునీడ యగుచుఁ గూడనిమ్ము
చీరికిం గొనక నిను రక్షించువాఁడ.
నిలుకడ యొకింత లేని వెంగలి యొకండు
లావు మీఱి నామూలబలంబుఁ గనక
యలఁతి యైనట్టి యీ చిన్నిదళము మీఁద
దాడిపెడలంగఁ దనమదిఁ దలఁచినాఁడొ!
అనుపమంబైన మామకోదగ్ర బల స
మగ్రబాహుశాఖా విజృంభణము గనఁడొ!"

---

* ఇది ఆంగ్లవాఙ్మయమునఁ గల అలిగరీ (allegory) ననుకరించెడు వ్యంగ్యకథాంతర్గత మగు చిన్న పద్యకావ్యము. అంతర్వ్యాప్తమైన కథ పాఠకులచే నూహింపఁబడును. ఇట్టివి సాధారణముగా నీతి, మత, వేదాంతాది కఠిన విషయములు సులభగ్రాహ్యము లగునట్లు బోధించుట కుపయోగించును.

అనుచు నైసర్గ గంభీర ఫణితి నుడివి
కరుణ దైవారఁ జివురాకుఁ గాంచి మఱియు,
"నీవు దలఁచినఁ గాక కొంపోవ నెవరి
కైనఁ దరము కానట్టి మహోపరంబు
నొసఁగి నాఁడ; భయంబు దక్కి సుఖము మెయిఁ
మను"మటంచుఁ దన మనికి కనిపెఁ బ్రీతి.

పిదప మహ్వాంపుఁగొమ్మల నొదిగి యరిగి
నెమ్మిఁ దనయిక్కఁ దలిరాకు నెమ్మనంబు
న నలవంత దక్కి దినదినప్రవర్ధ
మాన యయి పంచబాణుని బాణ మనఁగ
నలరుఁగొమ్మల మధ్యఁ దా నలరె మిగుల.

అంత హిమవంత (?) పినాంత మంతఁ గలయఁ
బాఱెఁ జలి నిరాఘాటసంచారి యగుచు;
అతని పరివారమును బోలి యవనిజములు
నిలిచె బహువర్ణసంకీర్ణదళము లగుచు.

పర్ణసంతాన మెల్ల సువర్ణసంగ
తంబు గాఁగ నీక్షించి చిత్తంబులో న
సూయ పొడసూపఁ జిగురాకు వాయి విప్ప
లప్రభుని గాంచి దీనానులాప యగుచుఁ
బలికె— "తండ్రీ! నాదగు దురవస్థ వినుము:
పర్ణములకెల్ల భూరి సువర్ణభాగ్య
మొసఁగి యిసుమంతయైన నా కొసఁగ కకట
దైవ మంతటి పక్షపాతంబు సేసె!
కులములోపలఁ దల యెత్తికొనఁగ లేని
యిట్టి హీనరూపంబుతోఁ బృథివి బ్రదుకఁ
జాల నే"నంచుఁ గన్నీరు జారవిడుచు
చిన్నిచివురాకు నక్కునఁ జేర్చి పట్టి
వగపు వాయంగఁ బిప్పలప్రభుఁడు వల్కు—

"అమ్మ! తలిరాకుకూన!! ధైర్యంబు నూన
వమ్మ!! యీపాటిదానికై యడర నేల?
పత్రనివహంబు తమతమ వర్ణగతులఁ
బడసె నిజకర్మ పరిపాక ఫలము కతన;
దైవకృత మందుఁ బక్షపాతంబు గలదె?
పృథ్విలోఁ బుట్టి యిసుమంత విసువకుండ
నియతకార్యంబు నెఱవేర్చి నెమ్మనంబు
న నొకచింత విడిచి మహానందమున ము
నింగి నింగి కెగిరిపోవ నేఁడొ రేపొ
పయనమయ్యెడు నీతోడివార లెల్ల;
కాన నీవును నీకు నీకాన నేది
విధి విధించెనొ యయ్యలేని విధి నదియ ప
నియని యనిశంబు సన్మార్గనియతి నెఱప
(?) దాన వాంఛితఫలంబు దాన వొడము".

అనుడుఁ జివురాకు తా నెన్నఁ డట్టివర్ణ
నీయవరసువర్ణావాప్తి నెగడుదాన
నో యటంచు నువ్విళులూరుచున్న తనువు
కరము తూఁగాడ మెల్లన నిరవ్వఁ జేరె.

అది మొదలు గాఁగ నా చిగురాకు హృదయ
వాటిలో వర్ణనాతీత వరసువర్ణ
పర్ణ వర్ణసౌభాగ్య దుర్వార వాంఛ
యుండుదక్క నితరవాంఛ యుండ నొఱదు.

తన్మయత్వము నొందిన తలిరుటాకు
సునతపఃస్ఫూర్తి గరిమకతన నఁగ ని
జాంగభాగంబులందు నస్వల్పలఘువృత్తి
సారసౌవర్ణవర్ణప్రసార మెసఁగె.

బాలభానుఁడు పూర్వాద్రిఁ బ్రాకువేళ
నపరభానుఁడొ నాఁ బిప్పలాగ్రమక్కు;
రాత్రి యరుదేర రెండవరాజుఁ బోలి
చీఁకటిని వెల్గు బంగారు చిన్నియాకు.
అట్లు దినరాజు రేరాజు ననఁగఁ దనరి
యొందు వెదకిన నొకమచ్చయేని లేక
తనపథంబున కడ్డేమి తగులనట్టి
యున్నతపదంబు నంటి తా నుండువేళ—

పవనుఁ డేతెంచి యద్దాని పసిఁడిఁ గాంచి
"నాఁడు సూచిన చివురాకు నేఁడు కాదు;

మెఱయుచున్నది మబ్బులో మెఱపుమాడ్కి;
మాటలాడింపఁ దెలియదో మనసువిధము"
అని తలంచి మెల్లనఁ జిన్నియాకుఁ గదిసి,
"ఏను వచ్చెదునంతలో నెంతదాన
వైతి! విలసనం బింత నీయందె కాని
యాకువలయంబునఁ బొడమ దెందుఁ;గాని
ఉన్న సంగతి యొకదాని నున్నయట్ల
తెలుపఁ దలఁచితి నీమేలు దలఁచి సుమ్ము!
ప్రాయ మింతయుఁ గల్గి నీ ప్రాయులైన
వారిఁ గూడి వర్తించుట పాడిగాని
యడవిలో నుంట జాతిమర్యాద గాదు.

కానలో నున్న పర్ణసంతాన మెల్ల
చనుట కానవె నిజనివాసంబు వీడి?
వార లిప్పుడు తమనిజాకారం మడఁచి
పరుల కెవ్వరికిని గంటఁబడకయుండి
మెలఁగెదరు వసుధ విభూతి మిగుల మెఱసి.

వారి సందఱఁ జూడంగ వాంఛ యున్న
నాకుఁ గల మహచ్ఛక్తిచే నీకుఁ జూప
నోపువాఁడ; నాతోడ వా రున్న యెడకు
వత్తువే"యన నదియును వల్లె యనియె.

అపుడు ఝుంఝానిలుండు బ్రహ్మాండభాండ
కర్పరము నిండి యుద్దండ ఘనఘనాఘ
సరవము దశలఁ బిక్కటిల్ల రభసగతి
నేఁగెఁ జివురాకుపై దుర్నిరీక్ష్యుఁ డగుచు.

తాఁకినంతనె యల్లాడి తనపదంబు
దూలఁ జివురాకు నేలఁ గైవ్రాలఁ దొడఁగెఁ;
పుడమిఁ బడునంతలో నను మొడిసిపట్టి
మింటిదెస వోయె నుగ్రసమీరణుండు.

పోయి దాక్షిణ్య మను దారిఁ బోక, పఱచి
పఱచి యొకచోటఁ జివురాకుఁ బాఱవైచి,
"ఇదియె! మీవార లెల్ల వసించు తావు
కొలఁదికాలంబులో వారిఁ గాంచిదెనీదు".

అంచుఁ దనమూర్తి యుపసంహరించి యుంచు
కంత దాక్షిణ్యము వహించి యానిలుఁ డేఁగ
నిజపదము ద్రెళ్లి చివురాకు నిగ్రహావు
చిన్నవిత్తుల వెచ్చని సెజ్జ యయ్యె.

---

## స ఖుఁ డా!

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

పరులయున్నతి వీనులఁబడినయంతఁ
బటువిషజ్వర మొడలెల్లఁ బట్టి పీల్చు,
ఒరుల కార్యవిఘాతమ్ము నొదవఁజేయఁ
గోరి తనముక్కు బల్మిమైఁ గోసికొనును,
తనదు క్షుద్రసుఖాభాసమునకు నొకరి
విమలబహుముఖ్యలోకద్వయమును జెఱచు,
జనుల రక్తబిందువు సుధాంజనము వోలెఁ
గనుల కానందబాష్పమ్ము గలుగఁజేయు,
ఒకరిమేలుకు వేఱొక రోర్వలేని
దీనుఁను సానుభూతి సుంతేని లేని
హేయ హింసా మహాదేవియే కడంగి
సర్వ మేకాధిపత్యమ్ము సలుపుచుండు
నీమహాపాపజగతి నిదేమి చిత్ర
మతిపవిత్ర మపార్థివం బైన దివ్య
వస్తు విది యెట్లు వచ్చె నపారదుర్వి
వేక గాఢాంధతమసన దుర్విలసితమున
నెట్లు స్వర్గీయ మీ జ్యోతి యేఁగుదెంచె?
సర్పవృశ్చికకోటిదంశనభవన్మ

హానలజ్వాలలందు హిమాంబుమిళిత
సరసచందనరసవృష్టి గురిసె నెట్లు?
క్షితి నపక్వామిషాలోల గృధ్రరాడ
శుద్ధ మారయ మారయ శోషయాది
పటురటత్కార బధిర దిగ్వలయమందు
నెటు జనించె విపంచికాహృద్యగీతి?
సఖుఁడ! యేమందు వియ్యాడి సఖ్య మనియ?

దివ్యమహిమాభిరామమై తెరలు దీని
కిల నుపాదానకారణ మెద్ది చెపుమ?
ధరఁ బరార్థైకఫలగుణాత్మతఁ జెలంగు
సమ్మహాభూతసామగ్రి యరయ దీని
కాదికారణ మనిన న్యాయ్యంబు గాదె?

సఖుఁడ! ధన్యుండ నేఁటిదనుకను నీవు
మాదృశుఁడవైన పార్థివమానవుండ
వనుచుఁ దలపోయు నాభ్రాంతి యంతరించె
చారుతరమైన నీసుకుమారమూర్తి
విశ్వసౌందర్యసారమై వెలయు నాకు.

శివకరము నీదు నామసంస్మృతి మదీయ
హృదయనభమున ధ్రువతారరీతి మెరయు
భయము లే దింక నీప్రేమ వజ్రకవచ
మటులు గాపాడ నురికెద నగ్గినేని

సఖుఁడ! భువి నెందుఁ గనుఁగొన్న స్వార్థసిద్ధిఁ
బడయుటకె నెయ్యు లగుట గన్పట్టుచుండు
క్షుద్రతృణమందు నెయ్య మెక్కుడు వహించు
నీపరార్థత్వ మేమని నే నుతింతు
సఖుఁడ! నే నవ్వ నవ్వెదు సంతసమున,
నామొగ మొకింత వాడిన నపశిరీష
కోమల కపోలములను ముగ్గులను బెడుదు
వేఁడి కన్నీటిబొట్టులు వెట్టిసఖుఁడ!
ఏల నీ కింతమమకార మీతృణమున?

ఒకటఁ గా దన్నిటను గర మూనియుందు
మంత్రణమ్మున మంత్రివై మఱి శరీర
యంత్రణంబఁప ధన్వంత రగుచు నెపుడు
లేమిడిం గొంగుపసిఁడివై బాములందు
సౌఖ్యసంధాత వగుచును సతము నాదు
జీవితచ్ఛిద్రముల మాటు చేస్త నందు
బహురూపుఁడ వౌదు వీశ్వరునిఁ బోలి
ఈశ్వరుని ప్రతినిధి వనియోని లేక
ఈశ్వరాంశమ వని ని న్వచింపరాదె?

ప్రేమరూపకుఁ డీశుఁడు ప్రేమనిధివి
నీవు లోహమ్ము స్పర్శమణిని స్పృశించి
హేమ మగురీతి నేను నీప్రేమజలధి
నొక తరంగమై క్రీడల నొందఁ గలనె!

---

## జోలపాట

కాట్రావులపల్లి రామమూర్తిగారు

జో జో మహాశయ! జో దయాహృదయ!
జోజో యశోమయ! జో యాంధ్రతనయ!
జోజో.

ఆంధ్రదేశీయుండ నని పొంగినావు
ఆంధ్రమాతకు పూజ లర్పించినావు
ఆంధ్రదేశౌన్నత్య మాశించినావు
ఆంధ్రోద్యమముఁ జాటి అలసియున్నావు
జోజో.

సంఘసంస్కారణంబు సాగింప నెంచి
చక్కగా నేఁటేఁట సభలు గావించి
వాదోపవాదాలు బాగుగా సలిపి
ధైర్యంబు చాలక తప్పుకొన్నావు
జోజో.

జాతీయవిద్యాప్రచారంబు కొఱకు
నడుము బిగించి సన్నద్ధుండ వయ్యు

ధనము చేకూరెడు దారి లేకుంటఁ
గునికిపాట్లు పడుచుఁ గూర్చొనినావు

జోజో.

పరదేశవస్తువుల్ పనికిరావనుచు
నిజదేశవస్తువుల్ నిర్మింపఁ దలఁచి
ధనమునకై యెన్నొ తంటాలు చెంది
ఖద్దరుమాత్రము కట్టుచున్నావు

జోజో.

ఆంధ్రుల విశ్వవిద్యాలయంబునకు
శ్రమఁ జెంది చివరకు సాధించినావు
దానితావునకెన్నొ తగవు లాడుచును
కాలంబు నూరకె గడపుచున్నావు

జోజో.

తెలుఁగు తెలుంగంచు దేవులాడెదవు
తెలుఁగుబిడ్డడ నంచుఁ గులుకుచుండెదవు
తెలుఁగు మాటాడుచోఁ దెల్లఁబోయెదవు
తెలుఁగువేసము వేయు తీరే యెఱుఁగవు

జోజో

ఆంధ్రమహాసభ లమరింగఁ గూర్చి
ఆంధ్రరాష్ట్రముకోస మర్జీలు వ్రాసి
వారల కంపించి సంతోషమ్ముఁ జెంది
పరువుపై వచ్చెఁగా నంచుకొన్నావు

జోజో

ధనము నీయింటిలోఁ దగినంత లేదు
ధనము లేకున్న నే పనియుఁ గాఁబోదు
కలలోన నెవ్వరైనఁ గాన్పించి నీకు
వరము లిచ్చెద రేమొ! యెంచుకొ మ్మింక

జోజో

జోజో మహాశయ! జో దయాహృదయ!
జోజో యశోమయ! జో ఆంధ్రతనయ!

జోజో

---

# మల్లిక

విద్వాన్ కే. బి. కోటిలింగం దేవరుగారు

చిలుకతెక్క పచ్చరంగు పుట్టము
లలితలతికాంగమున జాఱఁగ
పలితపీత పలాశకంచుక
కలిత వైతివి మల్లికా!

ననలు దొడిగిన నీదు వన్నియ
కనుల కింపగు కమ్మవిల్తుని
మొనలు నూరిన వెండిముల్కుల
దొనల గనివలె మల్లికా!

నెవ్వగల నకి వేయినోళుల
నవ్వినట్టులు పూచి తావుల
త్రవ్వి నింపితి వెల్ల తావులఁ
బువ్వుఁదేనియ మల్లికా!

కమ్మతెమ్మెర కొంకు కుప్పఁడు
తుమ్మెదల ముడివిప్పఁగమిత్రో
దొమ్మిగా నీ సౌరభస్వము
చిమ్మిపోయెనె మల్లికా!

అందముగఁ గైసేసి వేసఁగి
సందెవేళ వ్యాపాంగిసంగతి
నంద నేల కృశించిపోయెదు
మందమతివె మల్లికా!

పలుకవే నెత్తావి కరువలి
గలుకవే పూఁదేనె సోనల
నిలుపవే నీరూపు వెలుఁగున
పొలుపు మీఱఁగ మల్లికా!

# వేదకాలమునాఁటి ఇంద్రుఁడు*

ఆరవిల్లి నరసింహాచార్యులు గారు, బి. ఏ.

గతతమమును గూర్చి లోకముఁ గాంచు
వృత్రదైత్యు హరించి సవిత్రుని గగన
తలమునను నిల్పి కన్నులుగలఫలంబు
ప్రాణులకుఁ గూర్చె నింద్రుఁ డపారకరుణ.

అన్నలాభంబుఁ గోరిన నధికఫలముఁ
గోరినను మాకు మేలును గూర్చి మమ్ము
నష్టపఱచెడి వైరుల నాశమునకు
వజ్రమును దాల్చు నింద్ర! కాపాడు మమ్ము.

మాకుఁగల కోర్కెలం దీర్చి మంచివానఁ
గురియు నోయింద్ర! నింగిని గుంపులుగఁ జ
రించు మేఘాలనెల్ల భేదించి వర్ష
ముఁ గురియుము; కోర్కెలు (?) గిత్తపుచ్చ వీవు.

కర్మఫలమును సమకూర్పఁ గర్తలయిన
దేవతావళి కైన సంక్లిష్టవజ్ర
ధారి యైనట్టి యింద్రుని దగినయట్లు
ప్రస్తుతింప నశక్యమౌ పని యగుఁ జుమి

మానవులకెల్లఁ దద్భాగ్యమహిమ కెల్ల
నెవఁడు పరిపాలకుం డట్టియింద్రుఁ డొకఁడె
నేతి సుమి పంచమనిషాదజాతులకును—
మెలఁగు మనుజులలో వారి మేలుఁ గోరి

మమ్ముఁ గాపాడుటకుఁ గారణమ్ము మాకుఁ
దగిన వైరుల నెదుర నాదరువు సమద
శాత్రవావళిఁ దలపడ సాధనంబు
ఆజిఁ బరవీరులను వారి యశ్వములను
అడ్డుకొనఁ జాలు బలశాలులైన భటుల
సంతరింపఁగఁజాలిన సాధనంబు
శత్రుభయహారమైన విస్తారధనము
విజయసాధన మింద్ర! సంప్రీతి నిమ్ము.

ఇంద్ర! భవదీయరక్షణ నెసఁగు మేము
దృఢతమంబగు భవదీయదివ్యవజ్ర
(?)సాయమున నస్మత్సైన్యాల శాత్రవులను
ధిక్కరించుచునుందుము మిక్కుమీఱి.

దేహబలమహిమంబున దివ్యసుగుణ
భూషితుం డౌట నింద్రుఁ డశేషమైన
మానవాతీతమహిముఁ డౌ మాన్య సుగుణ
గణము దేహబలము వృద్ధిఁ గాంచుఁ గాత.

రణములందున జయలాభమును సుతులను
గోరి రెవ్వారు వారల కోర్కెలన్ని
సఫలమొనరించు ధీశక్తి సంఘటించుఁ
గామిత మొసంగు నింద్రుఁ డందు కరుణఁ బూని.

పక్వఫలభరితవృక్షంబు(?) భాతి నింద్రు
కామ్యదాయకసత్యవాక్యములు గడు ప
విత్రములు యజమాని కెవ్వేళను శుభ
కరములై యుండు నమితమౌ సిరు లొసంగు.

---

* ఇంద్రుఁడు వేదయుగమున సర్వోత్కృష్ట సంస్థాయియందుండు దైవము. కరుణామూర్తియగు నాయింద్రుఁడు లోకరక్షణార్థము తన మహిమచే వర్షకారకుఁడై ప్రజల కృతజ్ఞతకుఁ బాత్రుఁడగుచున్నాఁడు. భగవంతుని వేల్పురులీలలను వేల్పురువిధంబుల మనోహరవర్ణనలు పొందించి వేదకాలపురుషులు గాథలుగా రచించిరి. అన్నిగాథలలోను గడు మనోహరమగునది వృత్రాసురవధగాథ. వృత్రుఁ డను మేఘుఁడు విశ్వకల్యాణమును గుర్తింపక స్వేచ్ఛగాఁ జరించుచుండ జీవకోటికి సౌఖ్యమెసంగుటకై గాను ఇంద్రుఁ డాయసురుని నిర్బంధించి సాధించి అసురహంత యైనాఁడు. ఆతని విజయకీర్తనమే యాతనియెడఁ గృతజ్ఞత మాపులు. వీరులగు ప్రతిపక్షుల నిజగంభీరగర్జనలను గుండె లవియఁ జేయుచుఁ దళతళలాడు వాఁడి యంచుల వజ్రాయుధమున వృత్రాది మహాబలశాలుల ఖండించిన యింద్రుఁడు పౌరాణిక యుగమున నుక్కుగల ప్రతిరక్కసునకు మ్రొక్కులిడుచుఁ జిల్లర రాక్షసులపైఁ జేయివిసరు సామాన్యయోధుఁడైనాఁడు. తపోవిశేషంబులకు సంతసిల్లి ఋషులకు దివ్యపదవులనిచ్చు వేదకాలపుదైవము తపసుల నియమముఁ జెరుచుటయే ప్రధానకర్తవ్యముగాఁగల అప్సరసల కధినాథుఁడైనాఁడు. ఇంతియేల? వేదయుగమున విశ్వకల్యాణసంధాయకుండు, సర్వశక్తిమయాత్మకుండు నగు నింద్రుఁడు పౌరాణికయుగమున నధఃపతన మంది భోగపరాయణుఁడును, దిక్పాలకులకు సామంతనరపాలుఁడు నగు నమరావతీపరిపాలకుండైనాఁడు. ప్రభవసంవత్సర మాఘమాసభారతిలోఁ బౌరాణికకాలపు దేవేంద్రునిగూర్చి ప్రతాప రామకోటయ్య అనువారు వ్రాసిన పద్యవ్యాసమును జదివిన వేదకాలమునాఁటియింద్రుఁడు క్రమముగా నెట్టి యధఃపతన మందెనో తెలియఁగలదు. ప్రస్తుతమాంధ్రభాషలోఁ బౌరాణికగాథలఁగూర్చిన విమర్శనము లసదు. పశ్చిమదేశీయులు మిగుల శ్రద్ధతో నట్టివిమర్శనమునకుఁ జాలకాలము క్రిందనే పూనుకొనిరి. క్రమక్రమముగా వారు మనగ్రంథములనుగూడ పాశ్చాత్యవిమర్శనాపద్ధతుల విమర్శించుచు మిగుల సాహసప్రవాదములు వ్రాసియున్నారు. ఆండ్రూలాంగ్ వంటి యొకరిద్దరు బుద్ధిమంతులు భారతీయులకు గాథాచౌర్య మాపాదించిరి. అనాదినుండియు భారతవర్షము గాథలకుఁ బుట్టినిల్లు. వేదములందును, పురాణములందునుగల గాథ లనంతములు. వేదకాలమునాఁటికి వ్యాప్తములోనున్న గాథలను వేదములందు మహర్షులు సూచించిరి. గాథారచనమునకు భావనాశక్తియే ముఖ్యము. ఈశక్తి విదేశీయులకంటె భారతీయుల కత్యధికము. మనవారిలో గాథానిర్వచనము, తద్విమర్శనము సమర్థతతోఁ బూనుకొనఁగల పండితులు పెక్కురుండియు నింతవఱకును ఆంధ్రభాషయందట్టి గ్రంథములు రచింపకుండుట విషాదకరము. ఇకనైనను సమర్థులగు విద్వాంసు లాంధ్రభాషకుఁగల కొఱంత దీర్తురు గాక.

ఆ. న.

## ౧౧. ప్రకీర్ణకము

# లోకములు-లోకాంతరములు-లోకాంతర యాత్ర

వ్యాసకర్త-ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రి గారు

శ్రీ పరమేశ్వరునిచే సృజియింపంబడిన లోకములలో, మనము వసించు భూలోకమువలెనే, మఱికొన్ని లోకములు గలవనియు, నాలోకవాసులకును, మనకును బరస్పరము సంబంధము గలదనియు శ్రుతిస్మృతీతిహాసపురాణములవలనఁ దెలియఁబడుచున్న విషయమే. శ్లో॥ దేవాన్ భావయతా ఽనేన తే దేవా భావయన్తు వః, పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ॥ "మీరు దేవతల నారాధింపుఁడు; ఆదేవతలు మిమ్ముల ననుగ్రహింతురు. పరస్పరము నారాధించుకొనుట వలన నుత్తమమగు శ్రేయస్సును బడయుదురుగాఁతి" యని శ్రీభగవద్గీత 3 అధ్యాయ. ౧౧ శ్లోకమునఁ జెప్పఁబడెను. రామణీయకంబున భూలోకస్వర్గంబులనం బరగు, లండన్, ప్యారిసు, న్యూయార్కు మొదలగు మహాపట్టణములనుఁ జూడఁ గుతూహలులై, వానికిఁ బోవు మార్గములను, సదుపాయములను దెలుపు భూగోళశాస్త్రములను, మార్గప్రదర్శక గ్రంథములను నన్వేషింతురుగాని, తా మవశ్యము పోయి తీరవలసిన వైవస్వతపురికి మార్గ మెట్లు, అచ్చటి విశేషము లెవ్వి? సదుపాయము లెత్తెఱంగని యెవరు నాలోచింపరని శ్రీ నీలకంఠదీక్షితులు స్వరచిత వైరాగ్యశతకమునందు శ్లో॥ వంగాః కథం సంగాః కథ మిత్యనుయుజ్య వృథా దేశాన్। కీదృక్కృతాంతపుర మితి కో ఽపి న జిజ్ఞాసతే లోకః॥ (వంగదేశ మెట్లుండును? అంగదేశ మెట్లుండును? అని వ్యర్థముగా దేశ, దేశవిషయములనుఁ దెలిసికొన బ్రయత్నింతురే, కాని తా నవశ్యము పోయితీరవలసిన యమపురి యెట్టిదని మాత్ర మెవ్వడును విచారింపఁ)డని యీశ్లోకముచే వక్కాణించెను. భూలోకమునందలి ద్వీపాంతర దేశాంతర విషయములఁ జూచినవారు చెప్పఁగఁ దెలియుచుండును; కాని, లోకాంతర విషయములనుఁ దెలిసికొనుటకు సాధన మెట్లని ప్రశ్నించితివో, తపస్సంపన్నులగు మహర్షులు దివ్యదృష్టిచే నతీంద్రియములగు లోకాంతరవిషయములనుఁ దెలిసికొని వ్రాసిన శాస్త్రములును, దర్శనములును, ప్రమాణము లగుచున్నవి. శ్లో॥ "శాస్త్రదృష్టి ర్గురోర్వాక్యం తృతీయం చాత్మనిశ్చయః॥" అను న్యాయమును బట్టి, శాస్త్రమునఁ జెప్పబడిన విషయమునకును, సద్గురూపదేశమునకును, ఆత్మానుభవమునకును, సరిపడినని దృఢమైన ప్రమాణ మగును. శాస్త్రమునఁ జెప్పఁబడినది నమ్మకతీర దను నిర్బంధమునుఁ జెందక, యాత్మానుభవముచే సరిజేసికొని నిశ్చయించుకొనవలయును. సద్గురువు పరబ్రహ్మస్వరూపి యను దృఢవిశ్వాసము కలవానికే యంతఃకరణశుద్ధి కలిగి వేదశాస్త్రార్థవిషయములు స్ఫురించును—కాఁబట్టి, అతీంద్రియజ్ఞానముగల తపస్సంపన్నులగు మహర్షుల వాక్యములందు, వేదమునందును ప్రామాణ్యబుద్ధి యుండవలెను.

శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్దధాన శ్చ సంశయాత్మా వినశ్యతి.

అజ్ఞానియు, పెద్దలవాక్యమందు శ్రద్ధలేనివాఁడును, వారు చెప్పినది యథార్థ మగునో కాదో యని సంశయముఁ గలవాఁడును చెడిపోవుదు రని భగవద్గీతయందుఁ జెప్పఁబడినది. లోకానుగ్రహతత్పరులు, నిరపేక్షకులు నగు మహర్షుల వాక్యములందు నమ్మక మేల యుండవలెనో తెలియదు?

శ్లో॥ ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్తూపాయో న బుద్ధ్యతే
ఏతం విద న్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా.

ఏవిషయము, ప్రత్యక్షప్రమాణముచేఁ గాని, అనుమానప్రమాణముచేఁ గాని తెలియఁబడక, వేదముచేతనే తెలియఁబడుచున్నదో, అందువలన వేదమునకు వేదత్వము కలుగుచున్నది. కాఁబట్టి, అతీంద్రియములగు, లోకాంతరవిషయములఁ దెలిసికొనుటకు వేదమును, ఆర్షశాస్త్రములను, తదర్థములను బోధించుపురాణములును ప్రమాణము లగుచున్నవి. శ్లో॥ "పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుస్సనాతనం। అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్రమితి స్థితిః"॥ పితృదేవమనుష్యులకు వేదము దివ్యచక్షుస్సనియు, దానం జేసి, వేదశాస్త్రప్రమాణము ప్రమేయ మనియు, మనుస్మృతియందుఁ జెప్పఁబడినది. అల్పసత్త్వులు, అల్పమేధస్సులు నగువారు, కావ్యశాస్త్రపఠనంబును, బహుశ్రుతులతోడి నిరంతరసాంగత్యంబును, దేశాటనంబునుఁ గావింపక, కూపమండూకంబులువలె నుండి, తమకు గోచరములగు విషయములు కలవనియు, నతీంద్రియములగు లోకాంతరవిషయములు శాస్త్రసిద్ధము లయినను లేవనియు, బుద్ధిమంతులచేఁ గల్పితములనియు, నసంభవములనియుఁ జెప్ప సాహసింతురు. వారికిఁ బ్రత్యక్షప్రమాణమే కాని, యాప్తవాక్యమగు శబ్దము ప్రమాణము కాఁజాలదు. రజస్తమోదూషితాంతఃకరణు లగువారు, దురభిమానముచేఁ దమకుఁ దెలియని విషయము లేదనియుఁ దమకు గోచర

ములు కాని విషయములు కల్పితములు, నసంభవములునని చెప్పుదురు, కాని, శాస్త్రమందుఁ జెప్పఁబడిన యోగాభ్యాసము చేసి స్వానుభవముచేఁ జూచుట కాని, యోగాభ్యాసము చేసిన మహనీయులు చెప్పిన విషయములందు నమ్మకము కాని కలుగుటలేదు. అట్లుండుట, కరణగతదోషముకాని, విషయగతదోషము కాఁజాలదు. దినాంధమగు ఘూకము భాస్కరప్రకాశము లేదని నంతమాత్రమున లేకపోవునా? సత్యపదార్థము లెప్పటికిని సత్యములుగనే యుండును. ఇప్పటి యిరువదవ శతాబ్దియందు మన కెల్లఱకు ననుభవములయిన యాశ్చర్య విషయములగు తంత్రీరహితవిద్యుద్వార్తయు, (Wireless Telegram) వాయు విమానములు (Aeroplanes) జలాంతర్గాములు, విద్యుచ్ఛక్తిచే జరుపఁబడు ముద్రణాలయములు, యంత్రములు, కర్మాగారములు, వ్యజనములు, పాకములు, లోనగునద్భుతకార్యములు; గ్రాంఫోను, టెలిఫోను, సినిమా, లోనగు నద్భుతావహములగు యంత్రములును; యక్సురే లోనగు వైద్యోపకరణములును, ఇఁక ననేకములగు ప్రకృతి శాస్త్రోపకరణ జనితములగు కర్మలను గుఱించి, చరిత్రకారులు గ్రంథములు వ్రాసియుందురు. కొన్ని శతాబ్దులకుఁ బిమ్మట నీ దేశ కాల పరిస్థితులును, ప్రభుత్వంబును, యంత్రసాధనసామగ్రియు, మార్పు జెందును. అప్పటి అల్పసత్త్వులు, అల్పమేధస్సులు నగు దుర్బలులకు నీ సాధన సామగ్రి లేక, ఇరువదవ శతాబ్దీయ విషయములు నమ్మఁదగనవి కాక చిత్రములుగఁ దోఁచవచ్చును. తంత్రీవిరహితవిద్యుద్వార్త యసంభవమనియు, వాయువిమానములు బూటకములనియు, జలాంతర్గాములు శశవిషాణకల్పములనియు, విద్యుచ్ఛక్తిచే జరుపఁబడు కర్మలు విపరీతకల్పనలనియు, గ్రాంఫోను, టెలిఫోను మొదలగునవి బుద్ధిమంతు లూహాపోహలచేఁ గల్పించి వ్రాసిరనియు, ధూమశకటములు లేమిచే, 2, 3 నెలలలోఁ గాశీరామేశ్వరములకు పోకపోకలు, గగనకుసుమాయమానములనియు, నివి యన్నియు నూహలచేఁ గల్పించి చరిత్రకారులు వ్రాసినటుల చెప్పికొందురు. వారి కానాటికి ననుభవములో లేకపోయి నంతమాత్రముచేతనే, మన కెల్లఱకు ననుభవసిద్ధములగు విషయములు, చరిత్రాత్మకమగుటంజేసి, బూటకములగునా? దేశము, కాలము, పరిస్థితులు మారినను, చరిత్రమువలననే పూర్వకాలపుస్థితులు తెలియఁబడుచుండును. అందువలననే దేశచరిత్రములను, ప్రాచీనశిలాతామ్రశాసనములను రక్షించుచున్నందున, ప్రాచీనస్థితులనుఁ గనుఁగొన నవకాశము కలుగుచున్నది. అటులనే ఇప్పటి మనకు పూర్వులవలె, సత్త్వము, తపస్సంపత్తి, యోగబలము, మనోనిగ్రహము లేక, వారు దివ్యదృష్టిచేఁ దెల్పిన లోకాంతరవిషయములు, దేవతలకు పితృదేవతలకు మనకుఁ గలిగిన సంబంధములు, మహర్షులు స్వర్గమునుండి భూలోకమునకు వచ్చుట, భూలోకవాసులు సూక్ష్మశరీరముచే స్వర్గాదులనుఁ గాంచుట, కామశరీరములఁ బొందుట, మణిమంత్రౌషధసిద్ధులచే నద్భుతకార్యము లొనరించుట, శాపానుగ్రహశక్తులులోనగు విషయములు మనకు విపరీతములుగను, కల్పితములుగను దోఁచును. అప్పటివారి కవి యనుభవసిద్ధములుగ, సహజములుగ నున్నవి. మనకు విపరీతములుగఁ దోచినను, మన శక్తిలోపమును వెల్లడించునుగాని యవి మాత్రము సత్యమునకు దూరస్థములు కాఁజాలవు. వేదములలోను, పురాణములలోను గొన్ని యర్థవాదములుగ నుండును. వానిని ప్రాకరణికార్థమునుబట్టి ప్రజ్ఞాబలముచే సమన్వయించుకొని సత్యమగు తత్త్వమును కనుఁగొనవలయును కాని, మిథ్యాభూతము లని నుడువ సాహసింపఁ జనదు. పరిశుద్ధాంతఃకరణముగల వానికే దేవతాగురుప్రసాదమువలన, వేదములలోను, పురాణములలోను నుండు సత్యార్థము స్ఫురించును.

శ్లో॥ ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా
యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః,

ఋషిప్రోక్తమగు ధర్మోపదేశము, వేదశాస్త్రములకు విరోధముకాని, యనఁగా సమ్మతమగు, తర్కముచే విచారింపఁబడునది ధర్మ మనఁబడు, అటులకానిది ధర్మ మనఁబడదు

శ్లో॥ దుస్తర్కాత్సువిరమ్యతాం శ్రుతిమత స్తర్కోఽనుసంధీయతాం॥ అను నార్యోక్తినిబట్టి, కుతర్కము చేయఁ గూడదనియు వేదవిహితమగు తర్కము ననుసరించి విచారింపవలె ననియుఁ దెలియఁబడుచున్నది.

"అధీత్య గౌతమీం విద్యాం। సార్గాలీం యోని మావిశేత్", అను న్యాయమునుబట్టి, గౌతమతర్కశాస్త్రమును జదివి, భగవత్తత్త్వమునుఁ దెలియఁజేయు, వేదాంతశాస్త్రమున కుపయోగింపక, కుతర్కముచే విపరీతవాదము సేయువాఁడు జంబుకజన్మము నొందు ననియుఁ గలదు. కాఁబట్టి మీదఁ జెప్పఁబోవు విషయములను, వేదశాస్త్రములకు సమ్మతిమైన తర్కశాస్త్రప్రమాణముచే సమన్వయించుకొని తత్త్వమరయవలెను. లోకముల, లోకాంతరముల భూగోళ, భగోళ, ఖగోళ పరిజ్ఞానమువలన సర్వజ్ఞుండు, సర్వశక్తుండు, సర్వేశ్వరుండు నగు, భగవన్మహిమయు, తత్త్వంబునుఁ దెలియును. దానంజేసి నిశ్శ్రేయసావాప్తి కలుగును.

శ్లో॥ భూర్భువ స్స్వ ర్మహాశ్చైవ జనశ్చ తప ఏవచ
సత్యలోకశ్చ సప్తైతే లోకాస్తు పరికీర్తితాః.

భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము నని యేడులోకములు- అందు మన ముండు భూలోకము మధ్యమలోకము-తక్కిన యాఱును ఊర్ధ్వలోకములు- ఇవిగాక, అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళము లను అధోలోకములు 7 దును, మొత్తము 14 లోకములు, ఈ చతుర్దశ భువనములను, స్వర్గ, మర్త్య, పాతాళములుగఁ జేసి త్రైలోక్య మందురు.

శ్లో॥ రవిచంద్రమసో ర్యావ న్మయూఖై రవభాస్యతే
ససముద్రసరిచ్ఛైలా తావతీ పృథివీ స్మృతా.
—విష్ణుపురాణ ౨ అంశ ౭ అధ్యా.

సూర్యచంద్రుల కిరణములచేఁ బ్రకాశింపఁబడుచు, నదీ పర్వతారణ్య సముద్రములతోఁ గూడినది భూలోక మనఁబడును. ఈ భూమి సకలభూతములకు నాధారమై యోషధులచేఁ బోషించుచున్నందున ధాత్రియని పిలువఁబడుచున్నది. పాదములచే నడువఁదగినదంతయు భూమి యనఁబడు. ఈ భూలోకము, మహీభూమి యనియు, భూగోళమనియు నిరుతెఱంగులు. ఇందు మహీభూమి భూగోళమునకు నధోభాగమున, షుమారు ౫౦ కోట్ల యోజనముల దూరమునఁ బ్రకాశించుచున్నదనియు, పంచాశత్కోటి యోజనముల కర్ణాయామము కలదియై, దానిచుట్టు నుండు నండభిత్తినిఁ జేరుకొని యున్నదనియు, సర్వతోవృత్తముగాక తాఁబేటివీపువలె మధ్యభాగము మిట్టుగా నుండుననియు, సూర్యచంద్రులు నిరంతరము ప్రకాశించుచున్నను, విశేషదూరమైనందున ఆతపశైత్యము లుండవనియు, కాలనిర్ణయము లేదనియు, కర్మభూమి కాదనియు స్కాందపురాణాంతర్గతలలితోపాఖ్యానమునందుఁ జెప్పఁబడినది.

ఈభూమండలము జంబూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరములను పేరు ద్వీపములను, లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, శుద్ధజలములను పేరు సముద్రములనుఁ గలిగియున్నది. పైఁ జెప్పఁబడిన, సప్తద్వీపములు, సప్తసముద్రములచే నావృతములై యున్నందున, ద్వీపము లనఁబడుచున్నవి.

శ్లో॥ జంబూద్వీప స్సమస్తానా మేతేషాం మధ్యసంస్థితః
తస్యాపి మేరుర్మైత్రేయ మధ్యే కనకపర్వతః
చతురాశీతి సాహస్రో యోజనైరస్య చోచ్ఛ్రితః
ప్రవిష్టః షోడశాధస్తా ద్ద్వాత్రింశన్మూర్ధ్ని విస్తృతః.

—విష్ణు- ౨ అ-౨ అంశ

నదీనదపర్వతారణ్యసాగరపురనగరములచే నొప్పు నీ జంబూద్వీప మెల్ల ద్వీపములకు మధ్యమందుఁ గలదు. దానికి మధ్యమందు మేరుపర్వతము, మిక్కిలి యెత్తును, పొడవును, వైశాల్యమును గలిగి యెల్లలోకములకు నాధారమై దేవతలకు నాలయమై ప్రకాశించుచుండును. ఈ జంబూద్వీపమునందు, హరివర్ష, కింపురుషవర్ష, భారతవర్ష, రమ్యకవర్ష, హిరణ్మయవర్ష; కురువర్ష, ఇలావృతవర్ష, భద్రాశ్వవర్ష, కేతుమాలవర్షము లను నవవర్షములు గలవు. అందు ఇలావృతవర్షముచేఁ జుట్టఁబడి, దానికి మధ్యభాగమందుండిన మహామేరువునకు ఉత్తరదిగ్భాగమందు నీలపర్వతము ననుసరించి రమ్యకవర్షమును, దానికుత్తరమున శ్వేతపర్వతము ననుసరించి హిరణ్మయవర్షమును, దానికుత్తరమున శృంగిపర్వతము ననుసరించి కురువర్షమును. ఇట్లు ఉత్తరదిగ్భాగమున మూఁడువర్షములును; దక్షిణదిగ్భాగమున నిషధపర్వతము ననుసరించి హరివర్షమును, దానికి దక్షిణమున హేమకూటపర్వతము ననుసరించి కింపురుషవర్షమును, దానికి దక్షిణమున హిమవత్పర్వతము ననుసరించి భారతవర్షంబును ఇట్లు దక్షిణదిగ్భాగమున మూఁడువర్షములును; తూర్పుదిగ్భాగమున గంధమాదనపర్వతము ననుసరించి భద్రాశ్వవర్షంబును, పశ్చిమదిగ్భాగమున మాల్యవత్పర్వతము ననురించి కేతుమాలవర్షంబును, మధ్యభాగంబున ఇలావృతవర్షంబును మొత్తము నవవర్షంబులు మేరువు చుట్టును గలవు. తూర్పున నున్న గంధమాదనపర్వతమును, పశ్చిమమున నున్న మాల్యవత్పర్వతమును, ఈ రెండును, ఉత్తరమున నున్న నీలపర్వతమును, దక్షిణమున నున్న నిషధపర్వతమువఱకును వ్యాపించి అడ్డముగ నుండును. ఇవిగాక మేరువునకు, ప్రాగాదిచతుర్దిశలందు, మందరము, గంధమాదనము, విపులము, సుపార్శ్వము నను నాలుగు పర్వతములు, మూలమునం దాధారపర్వతములుగను, చైత్రరథము, విశ్వతోభద్రము, వైభ్రాజము, నందనము లను దేవోద్యానములును, అరుణోదము, మహాభద్రము, సితోదము, మానసము లను, మహాసరస్సులును, దేవతలు అప్సరఃస్త్రీలతోఁ గూడి విహరించుటకనుకూలములై, భోగ్యములై, రమణీయములై యొప్పుచున్నవని, శ్రీ విష్ణుపురాణమునందును, భాగవతమునందునుఁ జెప్పఁబడియుండెను. ఇవిగాక మేరువుచుట్టును కేసరపర్వతము లనేకములు గలవు. ఆ కేసరపర్వతదరులయందు, నిత్యఫలపుష్పితములై మిక్కిలి రమణీయములగు శ్రీవనము, కింశుకవనము, నళవనము, పనసవనము, హేమచిత్రము, భూతవనము, బ్రహ్మపార్శ్వము, సునాభకము మొదలగు దివ్యవనములయందు సిద్ధ, చారణ, గంధర్వ, విద్యాధర, కిన్నర, కింపురుషాదులగు ఉపదేవగణంబులును, ఇంద్రాదిదేవగణంబులును, సురసుందరీ బృందములతోఁ గూడి విహరించుచుందురు. ఇవి దేవతాభూములు- భౌమస్వర్గము లనఁబడు.

శ్లో॥ భౌమా హ్యేతే స్మృతా స్స్వర్గా ధర్మిణా మాలయా మునే
నైతేషు పాపకర్తారో యాంతి జన్మశతైరపి.

—విష్ణు- అ ౨- అం ౨.

ఇవి భూలోకసంబంధమగు స్వర్గభూములు- దేవలోకమునుండి చ్యుతులగు పుణ్యపురుషులకును, భూలోకమునందు ధర్మకార్యముల నొనరించు ధార్మికులకును, నివాసార్హములు- పాపకార్యములొనరించువారీ ప్రదేశములను నూఱుజన్మములెత్తినను బొందఁజాలరని పై శ్లోకమునకుఁ దాత్పర్యము. ఈ కనకాచలమగు మేరువు, సమస్తలోకములకు నాధారమయినందున, ఆయాలోకసంబంధ పాంచభౌతికాణువులచే నొప్పియున్నందున నాయా లోకానుగుణ్యముగఁ బ్రకాశించుచుండును. ఇందు యోగభూమి కొంతయు, భోగభూమి కొంతయుఁ గలదు. స్వర్గలోకమునందు కేవలము సుఖమనుభవింపఁదగుఁ గాని తపస్సొనరించుటకు, ఊర్ధ్వలోకములకుఁ బోఁదగినట్టి కర్మలఁ గావించుటకు ననుకూలము లేదు. కాఁబట్టియే, హిమాలయమందును, బిందుసరస్సునందును, పుణ్యప్రదేశములయందును తీవ్రమగు తపస్సును, సత్కర్మలను నాచరించి, రాజర్షులును, బ్రహ్మర్షులును, ఇంద్రాదులును, ఉత్తమలోకములకు బోవఁగలిగిరని పురాణములవలనఁ దెలియుచున్నది. దేవతలకును, తపస్సు నొనరించినట్టియు ధర్మకార్యముల నొనరించినట్టియు

పుణ్యపురుషులకును, సమాగమసాంకేతికస్థానములు మేరుహిమాల యప్రాంతముల నుండు భౌమస్వర్గప్రదేశములని తెలియఁబడుచున్నది. ఇంద్రాదిదేవతలు, భూమిని స్పర్శించి యొక్కొకకాలముండఁగూడనందు నను, మర్త్యులు స్వర్గలోకమున కీదేహముచే బోవఁజాలనందునను, వారి కూర్ధ్వభూములందు స్వర్గాంశము, వీరికి భౌమాంశము నున్నం దునను, భౌమస్వర్గము లుభయులకు గమ్యప్రదేశములును, సంచారార్హ ములును, అగుచున్నవి. ఈ మేరువు రహస్యమును, తత్త్వమునుఁ దెలిసి కొనుటయే విజ్ఞానవిశేషము. సుప్రసిద్ధపురాణములగు, విష్ణుపురాణ మందును, స్కాంద భాగవత మార్కండేయ మత్స్య పురాణములం దును, ఇతిహాసరత్నమై పంచమవేదమనంబరగు మహాభారతమందును, సూర్యసిద్ధాంత బ్రహ్మసిద్ధాంత ఆర్యభట సిద్ధాంతముల యందునుఁ జక్కగ వర్ణింపఁబడినది. సర్వలోకములకు నాధార మగుటచే మేరువని సాంకేతికము కల్పింపఁబడినది కాని, పురాణములలో వర్ణింపఁబడినంత వైశాల్యము,ఎత్తు,దైర్ఘ్యముగల కనకపర్వతముండుట యసంభవమనియు నిది యతిశయోక్తియనియుఁ గొందఱు నుడివెదరు. అట్లుండినచో భూ గోళశాస్త్రజ్ఞులు కనుఁగొనఁజాలరా ? వారి శాస్త్రములందు మేరుసం బంధ పరిభావయే కన్పించదనియుఁ జెప్పెదరు. పురాణములందు నస్మా కము లేకపోయినను,ప్రకృతిశాస్త్రములగు సూర్యసిద్ధాంతము, సిద్ధాంత శిరోమణిలోనగు జ్యోతిస్సిద్ధాంతశాస్త్రములు గ్రహముల యుదయా స్తమయములను, గ్రహణాదులనుఁ దెలుపుటవలన నమ్మతీరవలయును గదా?

శ్లో॥ ఇహ హి మేరుగిరిః కిల మధ్యగః
కనకరత్నమయ స్త్రిదశాలయః.

శ్లో॥ సదరత్నకాంచనమయం శిఖరత్రయంచ
మేరౌ మురారికపురారిపురాణి తేషు
తేషామధ శ్శతముఖజ్వలనాంతకానాం
రక్షోంబుపానిలశశీశపురాణి చాష్టౌ.

—ఇతి సిద్ధాంత శిరోమణౌ-గోళాధ్యాయే భువఃకోశః-

దేవతలకు నిలయము, స్వర్ణరత్నమయము నగు మేరుపర్వతము భూగోళమునకు మధ్యభాగమునఁ గలదనియు, ఆమేరువునందు, కనక మణిమయములగు మూఁడు శిఖరములు గలవనియు నందు త్రిమూర్తుల పురంబులును, దానిక్రింద నష్టదిక్పాలకుల పురంబులును గలవనియు, శ్రీ భాస్కరాచార్యులు, సిద్ధాంతశిరోమణి గ్రంథమునందు గోళా ధ్యాయంబునఁ జెప్పిరి.

శ్లో॥ మేరు ర్జాంబూనదమయో గిరి ర్భూగోళమధ్యగః
వినిర్గత శ్చోభయత్ర తత్రగేచ సురాసురాః.

భూగోళమధ్యమునందు, కనకమయమగు మేరుపర్వతము గల దనియు, నుభయపార్శ్వములందు వ్యాపించి యున్నదనియు, దానిక రమందు దేవాసురులు నివసించుచున్నారనియు రోమకసిద్ధాంతమం దుఁ గలదు. ఇట్లు సైద్ధాంతికు లందఱును మేరు వున్నట్లు ధ్రువపఱచి, దిఙ్నిర్ణయము కావించిరి.

శ్లో॥ సమంతా దండమధ్యాత్తు తుల్యభాగేషు తోయధేః
ద్వీపేషు దిక్షు పూర్వాద్యా నగర్యో దేవనిర్మితాః.
భూవృత్తపాదే పూర్వస్యాం యవకోటిస్తు విశ్రుతా
భద్రాశ్వవర్షే నగరీ స్వర్ణప్రాకారతోరణా
యామ్యాయాం భారతేవర్షే లంకా తద్వ న్మహాపురీ
పశ్చిమే కేతుమాలాఖ్యే రోమకాఖ్యా ప్రకీర్తితా
ఉదక్సిద్ధపురీనామ కురువర్షే ప్రతిష్ఠితా
తస్యాం సిద్ధా మహాత్మానో నివసంతి గతవ్యథాః
భూవృత్తపాదవివరా స్తా శ్చాన్యోన్యం ప్రతిష్ఠితాః.

—సూర్యసిద్ధాంతే- గోళాధ్యాయే.

భూమండలమునకు మధ్యభాగమునందు మేరువు కలదు. అచ్చట నుండి ప్రాగాదిదిఙ్నిర్ణయము కావింపవలయు. భూవృత్తపాదమగు మేరువునకు తూర్పుదిశనుండు భద్రాశ్వవర్షమున యవకోటిపట్టణం బును, దక్షిణమునునుండు భరతవర్షమున లంకాపట్టణంబును, పశ్చిమ మునునుండు కేతుమాలవర్షమున రోమకపురియు, ఉత్తరమునునుండు కురువర్షమున సిద్ధులకు నివాసమగు సిద్ధపురియు, నివి, దేవనిర్మితము లై, స్వర్ణప్రాకారగోపురాన్వితములై యుదయాస్తమయములఁ దెలుపుచుండు ననియు సూర్యసిద్ధాంతమునఁ జెప్పఁబడినది. జంబూద్వీ పమునకు, తూర్పున భద్రాశ్వవర్షమును, దక్షిణమున భారతవర్షము ను, పశ్చిమమున కేతుమాలవర్షమును, ఉత్తరమున, కురువర్షమును సరిహద్దులై యున్నవి. జంబూద్వీపమునకు మధ్యభాగమునందు మేరు వు కలదు. ఈ మేరువు చుట్టును సూర్యుఁడు ప్రదక్షిణము సేయుచు న్నట్టుల.

శ్లో॥ సోమపుర్యాం విభావర్యాం మధ్యాహ్నే చార్యమా యదా
మహేంద్రస్యామరావత్యాం తదా తిష్ఠతి భాస్కరః
మధ్యాహ్నే త్వమరావత్యాం యదాభవతి భాస్కరః
తదా సంయమనే యామ్యే తత్రోద్యంస్తు ప్రదృశ్యతే
మేరుం ప్రదక్షిణం కుర్వన్ భాత్యేవ సవితా సదా
ధ్రువాధారస్తథో తిష్ఠన్ వాలఖిల్యాదిభిః స్తుతః.

ఇంద్రపురి యగు నమరావతి యందు సూర్యోదయ మగుచుం డెనేని కుబేరపురియగు విభావరియందు మధ్యాహ్న మగుచుండును. అమరావతి యందు మధ్యాహ్న మయ్యెనేని, సంయమనీపురమందు ఉదయమగుచుండును. ఇట్లు సూర్యుఁడు, ధ్రువాధారము గలవాఁడై, యుదయించుచు, మేరువునుఁ జుట్టి వచ్చుచు, వాలఖిల్యాది మహర్షుల చే స్తుతింపఁబడుచుఁ బ్రకాశించుచున్నాఁడని, శ్రీ నృసింహపురాణ

భువనకోశమందుఁ గలదు. ఇట్టి బహువిధాధారములఁ బట్టి మేరువు కలదని నిశ్చయింపఁబడుచున్నది.

ఈ భూమియందు దృశ్యాంశము కొంతయు, నదృశ్యాంశము కొంతయుఁ గలదు. దృశ్యాంశమగు భూమి సామాన్యజనులకుఁ గన్పించును. అదృశ్యాంశమగు భూమియందు, సిద్ధాశ్రమములు, యోగాశ్రమములు నుండి, యందు తపస్సంపన్నులు, యోగసిద్ధులు నగు మహర్షు లుందురు. అట్టివారు సామాన్య జనులకుఁ గన్పింపక, యోగాభ్యాసమును, తపస్సంపత్తియుగల పుణ్యపురుషులకు మాత్రమేఁ గన్పింతురని యిదివఱలోఁ జెప్పఁబడెను. సామాన్యముగ హిమాలయమున సంచరించునపుడు, సామాన్యమానవదృష్టులకుఁ గన్పించు పదార్థములు కొన్నియే. మహాత్ముల యనుగ్రహము పొందిన యోగసిద్ధ పుణ్యపురుషులకుఁ గన్పించు పదార్థము లనేకములు, సామాన్య దృష్టి కలవారికి నంతఃకరణ శుద్ధియు, దివ్యజ్ఞానమును లేనందున, సమీపమున నున్న మహర్షులు గాని, మణులు గాని, ఓషధులు గాని కన్పింపవు. అంతఃకరణశుద్ధిలేక, యోగబలము లేక, కన్పింపనంత మాత్రముననే లేవని కాని, మిథ్యయని కాని, కల్పితములని కాని చెప్ప సాహసింపఁ గూడదు.

శ్లో. సర్వాణ్యపరిమేయాని తదేషాం రూప మైశ్వరం
తత్రతత్ర హి దృశ్యన్తే ధాతవః పాంచభౌతికాః
తేషాం మనుష్యాస్తర్కేణ ప్రమాణాని ప్రచక్షతే
అచింత్యాః ఖలు యేభావా న తాం స్తర్కేణ యోజయేత్
ప్రకృతిభ్యః పరం యత్తు తదచింత్యస్య లక్షణమ్.

అచ్చటచ్చట, పాంచభౌతికములగు ధాతువర్గము కన్పించుచుండును. అమేయములగు నా వస్తువులకు మనుష్యులు తర్కముచేఁ బరిమాణముఁ జెప్పుచుందురు. ఏయే పదార్థము లాలోచించుటకును సాధ్యములు కావో, వానికి నూహచేత పరిమాణములుఁ గల్పింపఁగూడదు. అచింత్య మనగా, ప్రకృత్యతీతవస్తువు. ప్రకృత్యతీతవస్తువులను, ప్రాకృతిక సాధనములచే సాధింప నలవికాదు. కాఁబట్టి, మానవుల కగోచరేంద్రియముల కతీతవస్తు విచారమందు, దివ్యదృష్టిగల మహర్షుల వాక్యములు ప్రమాణము లగుచున్నవని, మహాభారతమందుఁ గలదు.

కాఁబట్టి, అదృశ్య ప్రదేశమగు దేవభూమియందు మేరువు గలదనియు, నది ధార్మికులగు పుణ్యపురుషులకు దృశ్యము, గమ్యము నగుచున్నదనియు స్పష్టపడుచున్నది. ఇంకను మేరువుగూర్చినవిషయము మత్కృతలోకాంతరరహస్య మనుగ్రంథమున విశదముగఁజూడఁదగును.

జంబూద్వీపము, నవ వర్షములతోఁ గూడిన దని యిదివఱలోఁ జెప్పఁబడెను. ఆ నవ వర్షములలో భారత వర్షము శ్రేష్ఠమని ప్రశంసింపఁబడుచున్నది.

"అత్రాపి జంబూద్వీపే, భారత మేవ వర్షం కర్మక్షేత్ర మన్యాని, అష్టవర్షాణి స్వర్గిణాం పుణ్యశేషోపభోగస్థానాని భౌమస్వర్గపదాని వ్యపదిశంతి." —భాగవతే-౫ స్కంధే-౧౭ అధ్యాయః

శ్లో॥ వర్షేతు భారతే బ్రహ్మన్ త్రివర్గస్య ఫలం భవేత్
దుహ్యతే కామధుగ్ధేను ర్భూమి స్సర్వాగమస్థితా
తస్మిన్ శుభాశుభం కర్మ యథోక్తఫలదం నృణాం
అన్యాని యాని వర్షాణి భూమిస్వర్గాణి తాని వై
భారతే విహితం కర్మ యాగధ్యానాదలక్షణం
ఫలం జనయతే సమ్యగ్వికర్మ నరకాన్యపి
తత్ర సిద్ధా నరా బ్రహ్మన్ తపసారాధనేన చ
ప్రయాంతి పరమంలోక ముపసర్గంచ మారిష
సర్వేషామపి వర్షాణాం భారతం ప్రవరం ద్విజ
సిద్ధ్యంతి మానవా హ్యత్ర హరిభక్తిపరాయణాః
ప్రాయో భాగవతా స్సర్వే భారతే ద్విజసత్తమ
నానారూపాణి తీర్థాని ఫలదాని నృణామపి
—పాద్మే-భూమిఖండే-భూగోళవర్ణనం.

నవ వర్షములలో భారత వర్ష మొక్కటియే, కర్మభూమి, ఇచ్చటఁ గావించిన శుభాశుభ కర్మల కనుగుణ్యమగు ఫలము లభించును. తక్కిన అష్టవర్షములును పుణ్యాత్ములు తాము జేసికొనిన పుణ్యకర్మ శేషఫలము ననుభవింపఁదగిన భోగస్థానములు కాఁబట్టి భూలోక స్వర్గములని వ్యవహరింపఁ బడుచున్నవి. అవి భోగభూములు కాని కర్మభూములు కావు మనము పర్వతారణ్యాది విహారములఁ గావింపఁబోవు నపుడు, కట్టుకొని పోయిన భోజనపదార్థములవలె నచ్చట ననుభవించి, మరల కర్మభూమియందు జన్మింతురు. ఈ భారత వర్ష భూమియందు నక్కఱ ననుష్ఠింపఁబడిన కర్మ కామధేనువువలె సమస్త ఫలము లిచ్చును. స్వర్గమునకుఁ బోవఁదలఁచిన, తదనుగుణ్యమగు పుణ్యకర్మ నిచ్చటనే చేయవలయును. చంద్రలోకము, సూర్యలోకము, పితృలోకము మొదలగు నాలోకమునకుఁ బోవఁదలఁచినను, ఇచ్చటనే కర్మ గావింపవలయు; వేరేల, కైవల్యముఁ బొందఁదలంచినవాఁడును, నిష్కామకర్మయు, తపస్సును, భక్తిజ్ఞాన వైరాగ్యంబులను నిచటనే పొందవలయును. భోగలోకములందు కర్మ గావింపఁ వలనుపడదు గనుక, మోక్షగామియైన వాఁడు, భారత వర్షమందు జనింపవలయును. ఇచ్చట కృతత్రేతాద్వాపరకలియుగంబులును, కాలభేదంబులును, వర్ణభేదంబులును గలవు. ఇతరవర్షములందు యుగనియమమును, కాలభేదమును లేదు. ఆయా యుగమునం దాయుఃప్రమాణమును, సత్త్వమునుఁ జెప్పుచు కలియుగమునందు.

శ్లో॥ ద్వేసహస్రే ద్వాపరేతు శతమేకం కలౌ స్మృతం
తత్రాపి న స్థితి ర్నాస్తి కలౌ బ్రాహ్మణసత్తమ
గర్భస్థాశ్చ మ్రియంతేచ తథా జాతా మ్రియంతిచ
లబ్ధా శ్చాస్మృతికా శ్చైవ క్రోధనా దుష్కృతేరతాః
కలౌఖలు భవిష్యంతి భారతే తాపస ప్రజాః.

నూఱు సంవత్సరము లాయుఃప్రమాణమైనను, అంతకాలము బ్రదుకుట లేదు. గర్భమం దుండగనే మృతిఁజెందువారు కొందఱును,

జనించిన వెంటనే స్పృశులవారు కొందఱు నుందురు. లుబ్ధులు, అస త్యవాదులు, క్రోధనులు, దుష్కార్మాచరణమం దాసక్తులు, అలసులు, పండితులు గా నుందురు. అట్లున్నను, సత్సాంగత్యము చేతను, సత్కార్మాచరణముచేతను భగవద్భక్తులై యుత్తమలోకముఁ జెందెదరు. అట్టి సౌకర్య మీ భారతవర్ష మందుఁ గలదు.

శ్లో॥ ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణం
వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సంతతిః
నవయోజనసాహస్రో విస్తారోఽస్య మహామునే
కర్మభూమి రియం స్వర్గ మపవర్గంచ గచ్ఛతాం
అత స్సంప్రాప్యతే స్వర్గో హ్యతో ముక్తిం ప్రయాంతిచ
తిర్యక్త్వం నరకం చాపి యాంత్యతః పురుషా మునే
ఇత స్స్వర్గశ్చ మోక్షశ్చ మధ్య శ్చాంతశ్చ గమ్యతే
న ఖ ల్వన్యత్ర మర్త్యానాం కర్మభూమౌ విధీయతే
విష్ణుపురాణే,అంశే-3 అధ్యాయః.

సముద్రమునకు ఉత్తరమునను, మహాహిమాలయమునకు దక్షిణమునను, భారత వర్ష మున్నట్టును, అయ్యది నవసహస్ర యోజన విస్తీర్ణము గలదియు, అచ్చట నుండియే పుణ్య కర్మానుష్ఠాన పరులకు స్వర్గమును, నిష్కామకర్మానుష్ఠానముచే మోక్షమును, పాపకర్మచే నరకంబును, తిర్యక్త్వమునుఁ గలుగుచుండు ననియు, వన్నింటికి మార్గముల నిచ్చు కర్మభూమి యిదియే యనియు, నితర వర్షములందు కర్మాచరణమునకు వీలుగాక, భోగానుభవమే యనియు శ్రీ విష్ణు పురాణమందుఁ జెప్పఁబడినది. దేవతలు కయినను, బ్రహ్మవిద్యాప్రాప్తి లేక, మోక్షము లభింపదు. అట్టి బ్రహ్మవిద్యాప్రాప్తికి, భూలోకములో కర్మభూమియగు, భారత వర్షమునకు వచ్చి తీరవలయును. ఇట్టి శ్రేష్ఠమయి నట్టి భారతవర్ష మునందు నవఖండములు గలవు.

శ్లో. భారతస్యాస్య వర్షస్య నవ భేదం నిశామయ
ఇంద్రద్వీపః కశేరుశ్చ తామ్రపర్ణో గభస్తిమాన్
నాగద్వీప స్తథా సౌమ్యో గాంధర్వ స్త్వథ వారుణః
అయంతు నవమ స్తేషాం ద్వీపస్సాగరసంవృతః

ఇంద్రద్వీపము, కశేరు, తామ్రపర్ణము; గభస్తిమాన్, నాగద్వీపము, సౌమ్యము, గాంధర్వము, వారుణము, అయము నని తొమ్మిది ఖండములుగ (ద్వీపములుగ) విభజింపఁబడిన యీ భారత వర్షమునందు, సగరపుత్రులచే త్రవ్వఁబడిన సాగరముచే చుట్టఁబడిన భరత ఖండము మన కెల్లఱకు నివాసమగుచున్నది.

"జంబూద్వీపస్య రాజ న్నుపద్వీపానష్టౌ నిహైక ఉపదిశంతి సగరాత్మజైః రశ్వాన్వేషణ ఇమాం మహీం పరితో ఖనద్భి రుపకల్పితాః॥ తద్యథా, స్వర్ణప్రస్థ శ్చంద్ర శుక్ల ఆవర్తనో రమణకో మందేహారుణః పాంచజన్య స్సింహళో లంకేతి॥

—శ్రీ భాగవతే-౫ స్కంధే-౧౯ అధ్యాయే.

జంబూద్వీపము నందు, స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందేహారుణము, పాంచజన్యము, సింహళము, లంక, అనునట్టి యెనిమిది యుపద్వీపములు గలవు. సగరపుత్రులు యశ్వాన్వేషణకాలమందు భూమిని త్రవ్వుచున్నప్పుడు ఈ యుపద్వీపములు కలిగినవని, శ్రీ భాగవతమునందుఁ గలదు. భారతవర్షమును, నవఖండములుగ విభజించి విష్ణుపురాణమును, జంబూద్వీపమునం దెనిమిది యుపద్వీపములు కలిగినట్లు శ్రీ భాగవతమును జెప్పుచున్నవి.

శ్లో. ఏతత్తు భారతం వర్షం చతుస్సంస్థానసంస్థితం
దక్షిణే పరతో హ్యస్య పూర్వేణచ మహోదధిః
హిమవా నుత్తరేణాస్య కార్ముకస్య యథా గుణః
త దేతద్భారతం వర్షం సర్వబీజం ద్విజోత్తమ
దేవానామపి విప్రర్షే సదైవ మనోరథః
అపి మానుష మాప్స్యామో దేవత్వా త్ప్రచ్యుతాః క్షితౌ
మనుష్యాః కురుతే యత్తు త న్నశక్యం సురాసురైః
స్వకర్మనిగడగ్రస్తై స్స్వకర్మక్షపణోత్సుకైః
న కించి త్క్రియతే కర్మ సుఖలేశో పబృంహితైః
—శ్రీ మార్కండేయపురాణే-భారత ఖండే వర్ణనే.

ఈ భారతవర్షము, దక్షిణమునను, తూర్పునను మహోదధియు, ఉత్తరమున హిమాలయమును సరిహద్దు గలిగి, ఈ హిమాలయము, ధనుస్సుయొక్క నారివలె నుండును. దేవత్వమునుండి జారి, భూలోకమునఁ బడవలసినచో, భారతవర్షమునందు, మనుష్యజన్మ నొందవలెనని, దేవతలకును కోరిక కలదు. ఏలన, మనుష్యు లీ పుణ్యభూమియందు, బంధ మోక్షమునకై యే సత్కర్మలు గావింతురో, పుణ్యకర్మఫలభూతమగు బంగారు సంకెళ్లచేఁ గట్టఁబడి, సుఖలేశమునకుఁ జొల్పడిన దేవాసురులట్టి సత్కర్మను దేవలోకమున సలుపఁజాలరు. పుణ్యకర్మమువలన సుఖము కలుగును. అసుఖానుభవము, సువర్ణశృంఖలములవలె దేవతలను బంధించి స్వాతంత్ర్యము లేక చేయును. పాపకర్మ ఫలమగు దుఃఖము, ఇనుప సంకెళ్లవలె, నరకస్థులను బంధించును. బంధ మోచనము లేనపుడు, సువర్ణ శృంఖలములకును, అయశ్శృంఖలములకునుఁ గల భేదమేమి? పుణ్యమువలన స్వర్గసుఖమును, పాపమువలన నరకదుఃఖమును గలుగును. ఈ రెండు కర్మలు విడిచినపుడే మోక్షము లభించును; కాఁబట్టియే,

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే॥ సమ్యగ్జ్ఞాన నిష్ఠుఁడైన వాఁడే సుకృత దుష్కృతముల విడనాడి మోక్షమునుఁ జెందఁగలడని, శ్రీ భగవద్గీతాశాస్త్రమునఁ గలదు. ఈ భారతవర్ష శ్రేష్ఠత్వము, ప్రభావము, అనేక పురాణములయందు వర్ణింపఁబడినది.

శ్లో. అథ్యుత్తరేణ కైలాసం మైనాకం పర్వతంప్రతి
హిరణ్యశృంగి స్సుమహా న్దివ్యో మణిమయో గిరిః

తస్యపార్శ్వే మహద్దివ్యం శుభ్రం కాంచనవాలుకం
రమ్యం బిందుసరోనామ యత్ర రాజాభగీరథః
దృష్ట్వా భాగీరథీం గంగా మువాస బహులాస్సమాః
తత్రేష్ట్వాతు గతస్సిద్ధిం సహస్రాక్షో మహాయశాః
స్రష్టా భూతపతి ర్యత్ర సర్వలోకాన్ సనాతనః
ఉపాస్యతే తిగ్మతేజా యత్ర భూతైః పరివృతః.
నరనారాయణౌ బ్రహ్మా మనుః స్థాణుశ్చ పంచమః.
—మహాభారతే— భీష్మపర్వణి.

కైలాసమున కుత్తరపుదిక్కున, మణిమయమగు హిరణ్య శృంగ మను గొప్పపర్వతము కలదు. దానికి పార్శ్వమునందు బంగారు ఇసుకగలిగి, దివ్యమై రమణీయమగు బిందుసరస్సు కలదు. ఈ బిందుసరో వరమునందు, భగీరథుండు గంగానదినిఁ గని బహుసంవత్సరములు వసించెను. ఇచ్చటనే బహుయజ్ఞముల నొనరించి సహస్రాక్షుండు సిద్ధిని బొందెను. ప్రజాపతియగు బ్రహ్మదేవుఁడు తపస్సొనరించి సర్వలోకములను సృజించిన దిచటనే. వేయేల, నరనారాయణాదిమహర్షులును, మనువును, తపస్సు గావించునట్టి దివ్యప్రదేశ మిదియే—అచ్చటి వాహిని (గంగ) దృశ్యముగను, అదృశ్యముగను నుండును. కాఁబట్టి సర్వలోకములలో నుత్తమమగు భూలోకములో నుండు జంబూద్వీపమే, గొల్లరచేఁ బ్రశంసింపఁబడుచు నపేక్షిత మగుచున్నది. శ్రేష్ఠమగు నీజంబూద్వీపమునం దత్యుత్తమమగు భారతవర్షమునందు, మహేంద్రము, మలయము, సహ్యము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షము, పారియాత్రము నను, సప్తకులపర్వతములు గలవు. ఇవిగాక యనేకపర్వతములు దీని నాశ్రయించియుండు. నర్మదా సురసాదినదులు వింధ్యపర్వతము నుండియు, తాపీపయోష్ణనిర్వింధ్యాదులు ఋక్షపర్వతమునుండియు, గోదావరి, భీమరథి, కృష్ణవేణి మొదలగునవి సహ్యపర్వతమునుండియు, కృతమాల, తామ్రపర్ణి లోనగునవి మలయపర్వతమునుండియు, త్రిసామా ఋషికుల్యా ప్రభృతులు మహేంద్రనగమునుండియు, వేదస్మృతి ముఖాదులు పారియాత్రమునుండియు, ఋషికుల్య, కుమారి మొదలగునవి ఋక్షపర్వతమునుండియుఁ బుట్టి, యనేకోపనదులతోఁ గలిసి ప్రవహించుచుండును. అనేక దివ్యపురములు, జనపదములు గలవు. వీని విస్తరము, మహాభారత భీష్మపర్వాంతర్గత జంబూద్వీపవర్ణనమందుఁ జూడదగును.

జంబ్వాది సప్తద్వీపములు, సప్తసముద్రములచే నావరింపఁబడినట్లు ఇదివఱలోఁ జెప్పఁబడియె— కడపటి పుష్కరద్వీపము, స్వాదూదకసముద్రముచేఁ జుట్టబడినది. ఆవలిభూమి, హిరణ్మయమయినది. దాని నావరించినది లోకాలోకపర్వతము. ఈలోకాలోకపర్వతము, అంతరిక్షమువఱకు వ్యాపించి మిగుల యెత్తుగ నున్నందున లోపలిభాగము, సూర్యరశ్మిచేఁ గన్పించుచున్నందున లోకమనియు, వెలుపలిభాగమున సూర్యరశ్మి ప్రసరింపనందున, అలోకమనియుఁ జెప్పబడును. దానంజేసి లోకాలోకపర్వత మనఁబడును. సూర్యచంద్రకిరణములచేఁ బ్రకాశితమగుచు, సప్తద్వీపసముద్రపర్వతారణ్య నదీనదములతోఁ గూడి లోకాలోకపర్వతమువఱకు వ్యాపించినది భూలోక మనఁబడును. ఇయ్యది ఆవహవాయువుచే నిండియున్నది.

భువర్లోకము

శ్లో. భూమిసూర్యాంతరం యచ్చ సిద్ధాదిమునిసేవితం
భువర్లోకస్తు సోఽప్యుక్తో ద్వితీయో మునిసత్తమ.
—విష్ణుపురాణే— ౨ అంశే. ౭ అధ్యాయః

భూమండల సూర్యమండలములకు మధ్య నున్నట్టియు, సిద్ధవిద్యాధర గంధర్వ దేవయోనులచే సేవింపఁబడునట్టిదియు భువర్లోక మనఁబడు.

జంబ్వాద్యా స్స్వాదూదకాంతా స్సప్తద్వీపాస్సమాధయః
తతః పరా హిరణ్మయీ భూమిః
తతో లోకాలోకపర్వతః ఏవభూర్లోకః
అస్యోపరి అంతరిక్షలోకః ఖేచరాణాంరమ్య స్తదూర్ధ్వం స్వర్గలో
—శ్రీభాగవతే—౫ స్కంధే [కః.

శ్లో. పాదగమ్యస్తు యః కించి ద్వస్త్వస్తి ధరణీతలే
త ద్భూర్లోక ఇతి ఖ్యాతం శాకద్వీపాదికాననం
భూర్లోకాచ్చ భువర్లోక స్సూర్యాంత్యమథ రుదీరిత
ఆదిత్యా ద్ధ్రువం రాజన్ స్వర్లోకః కథ్యతే బుధైః.
—పద్మే—స్వర్గఖండే—లోకవర్ణనం,

పాదసంచరణార్హమగు ప్రదేశమంతయు భూలోకములోఁ జేరినది. భూలోకమునకుఁ బైన సూర్యమండలమువఱకు నుండునది భువర్లోకమని కాని, అంతరిక్షలోకమనిగాని చెప్పఁబడును. "అంతరిక్ష" మనఁగా నవగ్రహములు, నక్షత్రములు నుండునని యర్థము. సూర్యమండలము మొదలు, ధ్రువమండలపర్యంత ముండునది ద్యులోకమనికాని, స్వర్లోకమనికాని చెప్పఁబడును. భూలోక, భువర్లోక, స్వర్లోకములకు త్రిలోకి యనిపేరు. ఇవి స్థూలసూక్ష్మ పాంచభౌతికాణు నిర్మితములు— భూలోకము కేవలస్థూల పాంచభౌతికాణు నిర్మితము. భువర్లోకములో ననేకభూమికలు కలవు.

శ్లో. త్రయాణామపి లోకానాం దేవతానాం ద్విజోత్తమ
చకార శక్రం రాజానం దైత్యానాం దితిపూర్వజం
ఏవం విభజ్య రాజ్యాని పురాప్రోక్తాని యానివ
లోకాంశ్చ విదధే దివ్యాన్ దదౌ వశ పృథక్ పృథక్
కస్యచిత్ సూర్యసంచింకాశాన్ కస్యచి ద్వహ్నినిర్మలాన్
కస్యచి ద్ధిష్ణ్యవిద్యోతాన్ కస్యచి చ్చంద్రనిర్మలాన్

నానావర్ణాన్ కామమయాన్ అనేకశతయోజనాన్
స తాన్ సుకృతినాం లోకాన్ పావనాయవ సంస్థితాన్.

—ఇతి బ్రహ్మపురాణే-లోకవర్ణనే.

సృష్టికర్తయగు బ్రహ్మ పుణ్యలోకములను, దేవతలకును ఇంద్రుని రాజుగను, దైత్యులకు సురేంద్రుని రాజుగను గావించి, వారి కాయా రాజ్యముల నొసంగెను. ఇవిగాక, సూర్యప్రకాశముతో సమమైనట్టియు, అగ్నివలెఁ బ్రకాశించునట్టియు, నక్షత్రమువలె వెలుంగుచున్నట్టియు, చంద్రకాంతివలె నిర్మలమైనట్టియు గొన్ని కామలోకములను సృజించి పుణ్యకర్ములకు వాసార్హములుగ నొనరించి, వానికిఁ దన మానసపుత్త్రుల నధికారులుగఁ గావించెను. పైఁ జెప్పఁబడిన, కామమయలోకములు, భువర్లోకమునందుఁ జేరినవి. "కామమయోఽయం పురుషః" అనునట్లు జీవుఁడెల్ల తఱి నీ భూలోకమున నున్నప్పుడు పలువిధకోరికలఁ గోరుచుండును. మృతిఁజెందిన పిమ్మట నాయా కామములకుఁ దగినట్టి ఫలముల నాయా కామలోకముల యందు సూక్ష్మశరీరియై యనుభవించుచుండును. వీనిని దివ్యజ్ఞాన సమాజమువారు (Astral worlds) అని చెప్పుదురు. ఈ కామమయలోకము అంతరిక్షమున, అనగా భువర్లోకమునందు, సూక్ష్మ ఆపస్తత్త్వ ప్రధాన పాంచభౌతికాణు నిర్మితములు. సోమలోకము, పితృలోకము, యమలోకము, నక్షత్రగ్రహమండలములు (లోకములు) ఇవన్నియు, భువర్లోకమునందుఁ గలవు. ఇందు కామదేవతలు, భూతగణములు, మృతులు కొంతకాలము నివసింతురు.

విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రక్షస్సులు, గంధర్వులు, కిన్నరులు, పిశాచులు, గుహ్యకులు, సిద్ధులు, భూతములు, వీరు, ఉపదేవగణములు (దేవయోనులు) అని చెప్పఁబడుదురు. వీరి వాసస్థానములు మహాభారత భీష్మపర్వమునం దీక్రింది విధమున,

శ్లో. రక్షాంసి వై హిమవతి హేమకూటే తు గుహ్యకాః
సర్పా నాగాశ్చ నిషధే గోకర్ణే చ తపోధనాః
దేవాసురాణాం సర్వేషాం శ్వేతపర్వత ఉచ్యతే
గంధర్వా నిషధే నిత్యం నీలే బ్రహ్మర్షయస్తథా
శృంగవాంస్తు మహారాజ దేవానాం ప్రతి సంచరః
ఇత్యేతాని మహారాజ సప్తవర్షాణి భాగశః

హిమవంతమునందు రక్షస్సులు, హేమకూటమునందు గుహ్యకులు, నిషధమునందు నాగులు, గోకర్ణమునందు తపోధనులు, శ్వేతపర్వతమునందు దేవాసురులు, నిషధమునందు గంధర్వులు, నీలమునందు బ్రహ్మర్షులు, శృంగవంతమునందు దేవతలు నివసించుచుందురు. ఈ వర్షపర్వతములు, మేరువు చుట్టు నున్నందున, మేరుప్రాంతములందు పై దేవయోనులు సంచరింతురు. వీరు ఖేచరులయినందున, అంతరిక్ష లోకములందును సంచరింతురు.

శ్లో. భూర్లోకః పార్థివో లోకః అంతరిక్షం భువస్స్మృతః
భావ్యో లోకో దివి హ్యేత చ్ఛేషా దూర్ధ్వం యథాక్రమమ్
గంధర్వాప్సరస శ్చైవ గుహ్యకా స్సహరాక్షసైః
భూర్లోకవాసిన స్సర్వే అంతరిక్షచరాన్ శ్రుణు
మరుత స్సప్తభి స్సార్ధై రుద్రాస్తత్రైవ చాశ్వినౌ
ఆదిత్యా వసవ స్సర్వే తత్రైవ చ గవాంగనాః

—ఇతి దేవీపురాణే.

ఈ కనఁబడుచున్న పృథివీమయ మయినది భూర్లోకమనియు నక్షత్రగ్రహమండలములు గల యంతరిక్షము భువర్లోకమనియు, నటుమీఁదిది (ద్యులోకము) స్వర్గలోకమనియు, నీమూటికిఁ ద్రిలోకి యని వ్యవహారమనియు నిదివఱలోఁ జెప్పఁబడెను. గంధర్వులు, గుహ్యకులు, రాక్షసులు, అప్సరసలు, భూలోకవాసులు, సప్తస్కంధములతోఁ గూడిన మరుత్తులు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, అశ్వినీదేవతలు, దేవతాస్త్రీలు, అంతరిక్షలోకవాసులు, అటుపైన నింద్రాదులు, ద్యులోకవాసులు. పితృదేవత లుండునది భువర్లోకము గనుక, భూలోకమునకు భువర్లోకమునకు కేవల సన్నిహిత సంబంధము కలదు. మృతులై భువర్లోకమునందు నరకబాధ లనుభవించు వారికి, భువర్లోకవాసులు సాహాయ్య మొనరింతురు. అనఁగా మార్గదర్శకులయ్యెదరు. ఈ భువర్లోకమునందు, భూతప్రేతపిశాచములు, వారి వారి నియమిత ప్రదేశములందే సంచరించును. పైకిఁ బోవ శక్తి చాలదు.

శ్లో॥ అంతరిక్షచరా యేచ భూతప్రేతపిశాచకాః
వర్జయిత్వా రుద్రగణాంస్తే తత్రైవ చరంతి హి
నోర్ధ్వం విక్రమణే శక్తిస్తేషాం సన్మృతపాప్మనాం
అత ఊర్ధ్వం హి విప్రేంద్ర రాక్షసా యే కృతైనసః
తేతు సూర్యావధ స్సర్వే విహగం త్యూర్ధ్వవర్జితాః

—ఇతిపాద్మే-స్వర్గఖండే.

రుద్రగణములుతప్ప, భూతప్రేతపిశాచకములు, అంతరిక్షమునందుఁ దమకు నియమితప్రదేశములందు సంచరించును. పాపాత్ములగు వీరికి నూర్ధ్వగమనమందు శక్తిచాలదు. వీరికి పైన రాక్షసులు సంచరింతురు. వారయినను సూర్యలోకమునకుఁ గ్రిందిప్రదేశములందే కాని, యూర్ధ్వమునకుఁ బోఁజాలరు. దీనింబట్టి భూతప్రేతపిశాచరాక్షసగణములు, సూర్యలోకమునకధోభాగమునందే సంచరింప శక్తిగలవైనట్లు తెలియుచున్నది. భూలోకమున కతి సన్నిహితముగఁ బ్రేతలోకము, దానికిఁ బైన పిశాచలోకము, దానిపైన భూతలోకము, అటఁ బిమ్మట రక్షోలోకము, దానిమీఁద గుహ్యకలోకము, దానికి తర్వాత గంధర్వలోకము, పిమ్మట విద్యాధరలోకము, నుండినట్లును, శివశర్మను దేవదూతలు కైలాసమునకుఁ గొనిపోవునపు డీయూర్ధ్వలోకములఁ జూపి శివశర్మకు జెప్పినట్లును, కాశీఖండమునందుఁ గలదు. ఊర్ధ్వలోకము

లకుఁ బుణ్యాత్ములగు జీవులనుఁ గొనిపోవునపుడు, తేజోవాయు సూక్ష్మాంశములుగల సూక్ష్మశరీరములద్వారా గమనశక్తి ననుగ్రహింతురు.

## స్వర్గలోకము

శ్లో॥ ఆదిత్యా ద్ధ్రువం రాజన్ స్వర్లోక ఇతి కథ్యతే॥ ఇతి పాద్మే॥ ఆదిత్యమండలముపైన ధ్రువమండలపర్యంతము స్వర్గలోకమని చెప్పఁబడును. దీనినే ద్యులోకమందురు. సూక్ష్మశరీరము 'స్వర్లోక సంబంధమైన శరీరము' సంకల్పములకు స్థానము. జీవుఁడు కామలోకము వదలి స్వర్గలోకముఁ బ్రవేశించినపుడు, Astral body నుండి Lower mental body లోఁ బ్రవేశించుట యని దివ్యజ్ఞాన సమాజమువారు చెప్పుదురు. ఇందు రూపదేవతలు (ప్రత్యధిదేవతలు) ఉత్తమదేవతల యాజ్ఞ ననుసరించి, సూక్ష్మలోకమున, పలువిధములగు పరోపకార కార్యముల నొనరించుచుందురు. భూలోకములోనుండు, హిమాలయము, గంగ, యమున, సరస్వతి, సప్తసాగరములు, మహారణ్యములు, పంచభూతములు, సూక్ష్మములగు తేజోమయ దివ్యశరీరములతో స్వర్గలోకమున ఇంద్రునిసభయందు, వరుణలోకమున వరుణుని సభయందు నున్నట్లు భారతములోని సభ పర్వమందు లోకపాలకసభావర్ణనముఁ గావించుచోట నారదమహాముని సర్మాంగములతోఁ జెప్పెను. భూలోకములోని మహత్తర విభూతి పదార్థముల కన్నింటికి నధిమాన దేవతలు స్వర్గలోకమునందు దివ్యశరీరములతో నుండునట్లు తెలియఁబడుచున్నది.

శ్రీనరసింహపురాణ భువనకోశము చెప్పిన యధ్యాయమునందు, స్వర్గ స్థానము, తద్భేదములఁ గూర్చి యీ క్రింది విధముగ వర్ణింపఁబడినది.

శ్లో. స్వర్గస్థానం మహాపుణ్యం ప్రోచ్యమానం నిబోధ మే
భారతే కృతపుణ్యానాం దేవానామపి చాలయం
మధ్యే పృథివ్యా మద్రీంద్రో భాస్వాన్మేరు హిరణ్మయః
యోజనానాం సహస్రాణి చతురశీతిముచ్ఛ్రితః
ప్రవిష్టః షోడశాధస్తా ద్ధరణ్యాం ధరణీధరః
తావత్ప్రమాణా పృథివీ పర్వతస్య సమంతతః
తస్య శృంగత్రయంమూర్ధ్ని స్వర్గో యత్ర ప్రతిష్ఠితః
నానాద్రుమలతాకీర్ణం నానాపుష్పపశోభితం
మధ్యమం పశ్చిమం పూర్వం మేరోశ్శృంగాణి త్రీణి వై
మధ్యమం స్ఫాటికంశృంగం వైడూర్యకరకామయమ్
ఇంద్రనీలమయం పూర్వం మాణిక్యం పశ్చిమం స్మృతం
యోజనానాం సహస్రాణి నియుతాని చతుర్దశ
ఉచ్ఛ్రితం మధ్యమం శృంగం స్వము యత్ర త్రివిష్టపః
అప్రభాంతరితం శృంగం మూర్ధ్ని ఛత్రాకృతిస్థితమ్
పూర్వ ముత్తరశృంగాణా మంతరం మధ్యమస్య చ
త్రివిష్టపో నాకపృష్ఠే హ్యశ్మరా స్సంతి నిర్వృతాః
ఆనందోఽథ ప్రమోదశ్చ స్వర్గశృంగేతు మధ్యమే
శ్వేతశ్చ పౌష్టికశ్చైవ ఉపశోభనమాన్మథా
ఆహ్లాద స్స్వర్గరాజాఖ్య స్వర్గశృంగేతు పశ్చిమే
నిర్మమో నిరహంకార స్సౌభాగ్య శ్చాతినిర్మలః
స్వర్గాశ్చైవ ద్విజశ్రేష్ఠ పూర్వశృంగే సమాస్థితాః
ఏకవింశా నిస్వర్గా వై నివిష్టా మేరుమూర్ధని.

భారతవర్షమునందుఁ బుణ్యకర్మ లొనరించిన వారికి, దేవతలకు నిలయ మయినట్టి, మేరుపర్వతము, భూమధ్యభాగమం దుండి, యూర్ధ్వాధోభాగముల చాలదూరము వ్యాపించి బంగారుకాంతిగలిగి ప్రకాశించుచుండును. అనేకయోజనములు ఎత్తైన మేరు శిరస్సునందు, పూర్వశృంగము, మధ్యశృంగము, పశ్చిమశృంగమునని మూఁడు (శిఖరములు) గలవు. అందు తూర్పుశిఖరము, ఇంద్రనీల కాంతియు మధ్యశిఖరము వైడూర్యమణి కాంతియు, పశ్చిమశిఖరము మాణిక్య కాంతియుఁ గలిగి మిక్కిలి విశాల్యములతో, పుష్పఫలలతాదులచే నొప్పి మిగుల రమణీయముగ నుండును. మిక్కిలి యెత్తైన మధ్యశృంగము నందు త్రివిష్టపమను పేరుగల స్వర్గముండును. నిత్యప్రకాశ మగుటవలననే కాంతిచేతను దిరస్కరింపఁబడక, శిరస్సునందు ఛత్రాకారము వలె నుండును. నాకపృష్ఠమునందు, అశ్మరము, నిర్వృతులను పేరుగల భాగము లుండును. మధ్యమ శిఖరమునందు ఆనంద ప్రమోదములు గలవు. పశ్చిమ శిఖరమునందును శ్వేతము, పౌష్టికము, ఉపశోభన మాన్మథము, ఆహ్లాదము, స్వర్గరాజము నను నామములుగల భాగము లుండును. తూర్పుశిఖరమునందు, నిర్మమము, నిరహంకారము, సౌభాగ్యము, అతి నిర్మలము లోనగు భాగములు కలవు. ఈప్రకారము మేరుశిరస్సునందు ఇరువదియొక్క పేరులుగల స్వర్గములు గలవు. భారతవర్షమునందు ఏయే పుణ్యకర్మ లొనరించిన నే యే స్వర్గభాగములఁ బొందునది యీ క్రింది వివరములవలనఁ దెలియును.

జలప్రవేశముఁ గావించినవారికి, ఆనందనామక స్వర్గమును, అగ్నిప్రవేశము నొనర్చినవారికి ప్రమోదమును, భృగుప్రపాతము వలన సౌఖ్యమును, యుద్ధమునందు వెనుకంజ వేయనివారికి నిర్మలమును (వీరస్వర్గము), సర్వము సన్న్యసించినవారికి త్రివిష్టపమును, క్రతుయాజికి నాకపృష్ఠమును, నిత్యాగ్నిహోత్రికి నిర్వృతియు, తటాకకూపనిర్మాతలకు పౌష్టికమును, సువర్ణదాతకు సౌభాగ్యమును, శీతకాలమందు ప్రాణులకు అగ్నిని ప్రజ్వరింపఁజేసి యొసంగువారికి అశ్మరసమును, హిరణ్య గోప్రదానమువలన నిరహంకారమును, భూదానముచే శాంతికమును, రౌప్య (వెండి) దానములచే నిర్మలమును, అశ్వదానమువలన పుణ్యాహమును, కన్యాదానము వలన మంగళమును, వస్త్రదానము వలన శ్వేతమును, కపిలగోదానముచే పరమార్థనామక స్వర్గమును, గోసహితవృషభదానముచే మన్మథ స్వర్గమును, మాఘమాసమున నది

లో స్నానము చేసి తిలలు, ఛత్రమును, పాదరక్షలును దానముచేసిన వారికి ఉపశోభనము, దేవాలయప్రతిష్ఠాపనఁ జేసి తీర్థయాత్రాపరుఁడైనవానికి స్వర్గరాజ్యమును, ఏకాన్నభోజనము, నక్తభోజనము, త్రిరాత్రోపవాసము మొదలయిన వ్రతములు గావించినవారికి శుభనామకస్వర్గమును, మేధావియై విద్యాదానము చేసినవానికి నిగహంకారమును, సర్వభూతహితుఁడై, జితేంద్రియుఁడైన బ్రహ్మచారికి నిర్మల స్వర్గమును గలుగును. అంతియుగాక, ఎవరెవరేయే భావముచే నేయే దానము నొసంగెదరో దానికిఁదగిన స్వర్గమును బొందెదరు. కామ్యకర్మలచేఁ బ్రవృత్తిరూపమగు స్వర్గాది లోక సుఖములును, నిష్కామకర్మానుష్ఠానముచే నివృత్తిరూపమగు మోక్షమును లభించును.

విపులము, విపులము సుద్ధమువని పైపైన కొన్ని స్వర్గమార్గములు కలవు. ప్రథమమున కుమారస్వామి, ద్వితీయమున మాతృదేవతలు, తృతీయమున సిద్ధులు, గంధర్వులు, చతుర్థమున విద్యాధరులు, పంచమమున నాగరాజు, షష్ఠమందు వైనతేయుఁడు, సప్తమమున దివ్యపితరులు, అష్టమమున ధర్మదేవత, నవమమందు దక్షప్రజాపతి, దశమమునందు ఆదిత్యుఁడు. వీరలీమార్గముల కధిష్ఠానదేవతలుగా నుందురు. కావున, స్వర్గము నధిరోహించువారు ఈ దేవతల యనుగ్రహముఁ బొందియే పోవలయును. (Pass port) స్థానముల వంటివి. స్వర్గలోకమునందు సర్వర్తు ఫల పుష్పిత దివ్యోద్యానంబులు, దివ్యహర్మ్యప్రాసాదంబులు, మణిరత్నమయ దివ్యభూషణాంబరములు, దివ్యసుందరులు నుందురని భావించి, కర్మలు గావించి మృతిఁ జెందినవారికి తదిచ్ఛానుసారముగ ఫలము గలుగును. ప్రతిమనుష్యుఁడును తన చిత్తవృత్తికత్యంతరమణీయము, ఆనందదాయకము నయినది స్వర్గమని తలఁచుచుండును. కొందలు మనః ప్రీతికరమయినది స్వర్గమనియు, తద్విపరీతమయినది నరకమనియు, నంతకన్న వేఱు లేదనియుఁ జెప్పెదరు.

శ్లో. మనః ప్రీతికర స్స్వర్గో నరక స్తద్విపర్యయః,
నరక స్వర్గ సంజ్ఞేవై పాప పుణ్యే ద్విజోత్తమ.
వ స్త్వేక మేవ దుఃఖాయ సుఖా యేర్ష్యోద్భవాయ చ,
కోపాయచ యత స్తస్మా ద్వస్తు వస్త్వాత్మకం కుతః.
తదేవ ప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే,
తదేవ కోపాయ యతః ప్రసాదాయ చ జాయతే.
తస్మా ద్దుఃఖాత్మకం నాస్తి నచ కించి త్సుఖాత్మకం,
మనసః పరిణామోఽయం సుఖ దుఃఖాది లక్షణమ్.

—విష్ణుపురాణే, ౨ అంశే, ౬ అధ్యాయే.

మనస్సునకుఁ బ్రీతికరమయినది స్వర్గము; దుఃఖకరమయినది నరకము. పుణ్య పాపములకే స్వర్గనరకములని సాంకేతికములు. ఒక వస్తువే కాలక్రమమున సుఖమును, దుఃఖమును గలిగించుచున్నది. అదియే యీర్ష్యా కోపములకుఁ గారణ మగుచున్నది. వస్తువునందు సుఖముగాని, దుఃఖముగాని లేదు. మనః పరిణామముచే సుఖదుఃఖాది ద్వంద్వములు గలుగుచున్నవి. ఇందు తత్త్వమును బరిశీలించినచోఁ బూర్వోక్తవిషయమునకు సమన్వయ మగును. దుఃఖవృత్తులతోఁ గూడిన మనోమయమగు సూక్ష్మశరీరము నరక మనుభవించుచుండును. సుఖవృత్తులతోఁ గూడిన సూక్ష్మ శరీరము స్వర్గసుఖ మనుభవించును. అట్టి మనోవృత్తులు గలవారికే యాలోకసుఖములు గోచర మగు ననుటకు సందియము లేదు. దీనివలన నాయాలోకములు గలవని సిద్ధాంతీకరించుట వలన బాధక మేమియు లేదు. జీవుఁడు తన మనస్సంకల్పములచే నే దేని సృజించుకొనుచుండునని భావము. ఈ స్వర్గములు భౌమములు, దివ్యములు, బైలములునని మూఁడువిధంగులు. భౌమము లనఁగ భూలోక స్వర్గములు; దివ్యము లనఁగ ద్యులోక స్వర్గములు; బైలము లనఁగ పాతాళస్వర్గములు—అని చెప్పుట కలదు.

ఈద్యులోకము. సూక్ష్మ అగ్ని తత్త్వ వాయుతత్త్వములచే నిర్మితము. ద్యులోకవాసులు ప్రాయికముగ తేజోమయశరీరులుగ నుందురు.

## మహర్లోకము

శ్లో. త్రైలోక్య మేత త్కృతకం మైత్రేయ పరిపఠ్యతే,
జన స్తప స్తథా సత్య మితి చాకృతకం త్రయమ్.
కృతాకృతకయో ర్మధ్యే మహర్లోక ఇతి స్మృతః,
శూన్యో భవతి కల్పాంతే యోఽత్యంతం న వినశ్యతి.

భూర్భువ స్స్వర్లోకములు మూఁడును త్రైలోక్యమని చెప్పఁబడును.

ఈ త్రైలోక్యము, కృతక మనఁబడు. కృతకమనఁగ ప్రతికల్పమునందుఁ జేయఁబడును. జనలోకము, తపోలోకము, సత్యలోకము, ఈమూఁడును అకృతకము లనఁబడు. అకృతకము లనఁగ ప్రతికల్పము చేయఁబడనివని యర్థము. కృతకత్రయమునకు, అకృతకత్రయమునకు మధ్య నుండునది మహర్లోక మనఁబడు. ఈ మహర్లోకము జనులు లేక శూన్యమయ్యును బూర్తిగ నశింపదు. కల్పాంతప్రళయమందు త్రైలోక్యము దహింపఁబడినపుడు మహర్లోకనివాసులు తాపార్తులై జనలోకమునఁ బ్రవేశింతురు. ఈ మహర్లోకము, సూక్ష్మ అగ్ని వాయుతత్త్వములచే నిర్మితము. ఇచ్చట కల్పవాసులు నివసింతురు. విష్ణుపురాణమునం దీక్రింది విధమునఁ జెప్పఁబడినది—

శ్లో. చతుర్ముఖ దిన స్యాంతే జగ త్యేత చ్చరాచరం,
తదా హి దహ్యతే సర్వం త్రైలోక్యం భూర్భువాదికం.
జనం ప్రయాంతి తాపార్తా మహర్లోకనివాసినః,
చతుర్థకు మహర్లోకే తిష్ఠన్తే కల్పవాసినః.

ఈ విషయమే పూర్వ ముపపాదింపఁబడినది. భూర్భువస్స్వర్లోకములు మూఁడును దృశ్యలోకములు. జనతపస్సత్యలోకములు

మూఁడును అదృశ్యలోకములు. ఈదృశ్యాదృశ్యలోకములమధ్య నున్నది మహర్లోకము. లోకాలోకపర్వతము సంధిస్థానముగ నున్నది. ఈ మహర్లోకము ("Higher mental plane) శుద్ధమనోమయ శరీరమునకు సంబంధించినదనియు, ఇచ్చట కామక్రోధ రాగద్వేషాసూయేర్ష్యాది అశుద్ధకామసంకల్పము లుండవనియు, పరిశుద్ధమయిన విజ్ఞానమయకోశమునందు మహర్షుల యనుగ్రహము కలుగుచుండు ననియు దివ్యజ్ఞానసామాజికులు నుడువుదురు. ఇచ్చట ఉత్తమ దేవతలు (అరూపదేవతలు) తపస్సత్యలోకములందు నుండువారి యాజ్ఞానుసారము, క్రిందిలోకములలో నుండువారికి మే లొనరించుచుందురు.

జనలోకము

శ్లో. క్షణార్ధేవ విమానం తజ్జనలోకం నినాయతౌ,
నివసంత్యమలా యత్ర మానసా బ్రహ్మణ స్సుతాః.
సనందనాద్యా యోగీంద్రా స్సర్వే తే హ్యూర్ధ్వరేతసః,
అన్యేచ యోగినో యే వై హ్యశ్లథ బ్రహ్మచారిణః.
సర్వద్వంద్వవినిర్ముక్తా స్తే వసంత్యత్ర నిర్మలాః.
ఇతి స్కాందే - కాశీఖండే.

ఈజనలోకము మహర్లోకమునకు పైనున్నలోకము. ఇచ్చట నూర్ధ్వరేతస్కులు, బ్రహ్మమానసపుత్రులునగు సనందనాది యోగీశ్వరులు నుందురు. (సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతీయులు సనందనాదులు) ఇంకను, ద్వంద్వాతీతులు, అస్ఖలద్బ్రహ్మచర్యవ్రతము గలవారు, సర్వభూతహిత రతులు, తపస్సంపన్నులగు ఋషీశ్వరులు నుందురు. ఈ లోకము సూక్ష్మాకాశవాయుతత్త్వములచే నిర్మితము. జననామక ఋషు లుండినందున జనలోక మనఁబడు. జన తప స్సత్యలోకములు మూఁడును ఉత్తమలోకములు; "Spiritual plane" లకు సంబంధించినవి.

తపోలోకము.

శ్లో. అస్యోపరి తపోలోక స్తేజోమయ ఉదాహృతః,
వైరాజా యత్ర తే దేవా వసే యుర్దేవపూజితాః.
వాసుదేవే మనో యేషాం వాసుదేవే ఒర్పితక్రియాః,
తపసా తోష్య గోవింద మఖిలామవివర్జితాః.
తం తపోలోక మాసాద్య వసంతి విజితేంద్రియాః,
శీర్ణపర్ణాంబు వృత్తయో యే వై దంతోలూఖలికాశ్చ యే.
* * * * * *
ఇత్యేతై ర్నియమై ర్యేతు క్లిష్టాత్మాన స్తపోధనాః,
బ్రహ్మయుష స్తపోలోకే తే వసంత్యకుతోభయాః.
ఇతి పద్మపురాణమ్.

జనలోకముపైన తేజోమయమగు తపోలోకము కలదు. పరమాత్మ యగు వాసుదేవునియం దెల్ల కర్మలు సమర్పించి, తద్గతమనస్కులై, నిఖిలాభిలాషలను విసర్జించి, జితేంద్రియు లయిన వైరాజులను దేవతలు నిఖిల సురలచేఁ బూజితులగుచు నిచట వసింతురు. పండి రాలిన యాకులను భక్షించువారు, గ్రీష్మకాలమునందు పంచాగ్ని మధ్యమందును, హేమంత కాలమందు జలమందును నుండి తపమొనరించువారును, బొటనవ్రేలిని భూమిపై నూని సూర్యునిఁ జూచుచు నూర్ధ్వహస్తులై తీవ్రముగ తప స్సొనరించువారును, మాసోపవాస పక్షోపవాస అయనోపవాసములఁ గావించువారును, స్థాణువువలె నున్నందున మృగములు రాచుకొనుటవలన నానందించువారును, శరీరాభిమానము లేనివారును, నిరహంకారులును, పక్షులు జటాటవికుహరములఁ బ్రవేశించినను, నరములచేఁ గట్టఁబడిన యస్థిపంజరమందునే యవి ప్రవేశించినను నిశ్చలులై తపస్సొనరించు వారును,—వీరెల్లరు తపోలోకమున వసింతురు కల్పప్రళయాదులవలన నిర్భయులై, చతుర్ముఖబ్రహ్మతోఁ దుల్యముగ నాయుష్మంతులై, బ్రహ్మతో సహ పునరావృత్తిరహితమగు కైవల్యమును జెందుదురు. ఇచ్చట మహర్షులు, బ్రహ్మర్షులు లోకహితార్థము మునులద్వారా తమ తేజశ్శక్తిని బంపుచుందురు. ఇదియు నుత్తమలోకములలోఁ జేరినందున "Spiritual planes"లోఁ బరిగణింపఁ బడుచున్నది. జీవుని యానందమయకోశమునకు సంబంధించిన దీలోకము; సూక్ష్మాకాశవాయు తత్త్వములచే నిర్మితము.

సత్యలోకము

శ్లో. సత్యస్తు సప్తమో లోకో హ్యపునర్భవవాసినాం,
బ్రహ్మలోక స్సమాఖ్యాతో హ్యప్రతీఘాతలక్షణః.
మన్యుశేవ తపోలోకా త్సత్యలోకో విరాజతే,
అపునర్మారకా యత్ర బ్రహ్మలోకోపి స స్మృతః.

తపోలోకమునకుఁ బైన పునరావృత్తి రహితులకు నివాసమయినది సత్యలోకము. దీనినే బ్రహ్మలోక మనియుఁ జెప్పుదురు. ఇచ్చట బ్రహ్మర్షులు, దేవర్షులు, ఉత్తమ దేవతలు నుందురు. సామాన్య జీవు లీ లోకమును దర్శింప వలనుపడదని మహాభారత సభాపర్వాంతర్గత బ్రహ్మలోక సభావర్ణన సందర్భమున నారదమహాముని ధర్మరాజుతోఁ జెప్పెను. ఇది మిగుల తేజోమయముగను, దేవతలకు సయితము ప్రవేశింప దుస్సహముగను నుండునని తెలియఁబడుచున్నది. అష్టదిక్పాలకులు, ఇంద్రుఁడు నప్పుడప్పుడు ఈ హిరణ్యగర్భుని సందర్శింపఁబోవుదురు. ఈ సత్యలోకమువందే బ్రహ్మపురికి మీద కక్ష్యాభేదముచే వైకుంఠపురము, మహాకైలాసపురమును గలవు. సత్యలోకమునకుఁ బైన బ్రహ్మాండకటాహము. ఇది బ్రహ్మాండమునకు సరిహద్దు. ఇది సూక్ష్మాకాశ తత్త్వముచే నిర్మితము. 'Spiritual plane' లో జేరినది.

ఆనందమయకోశమునకు సంబంధము కారణశరీరము.
భూర్భువస్స్వర్లోకములు మూఁడును స్థూలత్రిలోకి.

జనతపస్సత్య లోకములు మూఁడును సూక్ష్మత్రిలోకి.

స్థూలత్రిలోకిని, సూక్ష్మత్రిలోకిని ఒక దానితో నొకటిని గలిపి యుంచునది మహర్లోకము. ఇది స్థూల త్రిలోకివలె నంతః కాలమును సూక్ష్మత్రిలోకివలె నంతః సూక్ష్మమునుగాక, లోకాలోక పర్వతమువలె నహోరాత్రములకు సంధివలె నుండునని దివ్యజ్ఞానసమాజమువారు చెప్పుదురు.

భూమ్యాది ఊర్ధ్వలోకములకు "లోకము"లనియు, అధోలోకములకు "తలము"లనియుఁ జెప్పు సంప్రదాయము కలదు. భూమ్యాది ఊర్ధ్వలోకములు 7 ను, అతలాది అధోలోకములు 7 ను, మొత్తము 14 (చతుర్దశ) భువనములును, సీనిలో నుండు సూర్యచంద్రాంగారక బుధ గురుశుక్రశన్యాది అవాంతర లోకములును అన్నియుఁ గలిసి బ్రహ్మాండ మనఁబడును. ఇట్టి బ్రహ్మాండము లనేక సహస్రములు. పరమేశ్వరుని రోమరంధ్రము లను గవాక్షములందు పరిభ్రమించు పరమాణువులు వలె నుండునని తెల్పు ఈ క్రిందిశ్లోకముచే బ్రహ్మదేవుఁడు శ్రీకృష్ణ పరమాత్మను స్తుతించెను:

శ్లో. క్వాహం తమో మహ దహం ఖచరాగ్ని వార్భూ
సంవేష్టితాండఘట సప్తవితస్తి కాయః,
క్వేదృగ్విధా విగణితాండపరాణుచర్యా
వాతాధ్వరోమ వివరస్య చ తే మహిత్వం.
—శ్రీభాగవతే, ౧౦ స్కంధే, ౧౪ అధ్యాయే.

ప్రకృతి మహ దహంకార ఆకాశ వా య్వగ్ని జల పృథివీ తత్త్వములచేఁ జుట్టఁబడిన బ్రహ్మాండఘటమం దేడంగుళములు పరిమితిగల శరీరము ధరించిన నే నెక్కడ? ఇట్టి యనంత కోటి బ్రహ్మాండములు నీ రోమవివరము లను గవాక్షములందు పరిభ్రమించు సూక్ష్మరేణువులు వలె నుండు నీ యనిర్వచనీయస్వరూప మెక్కడ! ఓ, పరమేశ్వరా! దురభిమానముఁ జెందితి మన్నింపు మని ప్రార్థించెను దీనింబట్టి మాడ నఖండ పరమేశ్వర తత్త్వమందు మనమెల్లరము పరమాణుప్రాయుల ముగ నుండినారము. పరమేశ్వరస్వరూప మవాఙ్మానస గోచరమని తెలియుచున్నది. అట్టి చతుర్ముఖ బ్రహ్మయే, అలాగు స్తుతించినపుడు సామాన్యమానవుల సంగతి నికేమిచెప్పవలయును? అల్పరాజ్యమదాంధకార దురభిమానమును వదలి, పరిశుద్ధమనస్కుఁడై, సర్వభూతహితరతుఁడై, పరమేశ్వరు నారాధింపవలెనని వ్యక్తపడుచున్నది.

## పరలోకయాత్ర

ఇట్లు బ్రహ్మాండమును, అందలి లోకములును వివరింపఁబడినవి. జీవుఁడు ప్రవృత్తిమార్గగతుఁడై సంసార చక్రమునందు పరిభ్రమించుచుండును. జీవుఁడు మృతిఁ జెందిన పిమ్మట నేస్థితినిఁ బొందు ననువిషయము విచారింపఁదగినది.

"తస్మా న్మరణం హి స్థూలేత త్పరిత్యజ్య జీవస్య శరీరాభిగమన రూపకార్యకరణమేవ। అత ఏవ మృతేసతి యమాలయంగచ్ఛతి ఇత్యాది ప్రవచనః। యమోహి నివృత్తిః। తదాలయ స్సూక్ష్మదేహః। నివర్తనం హి ప్రవర్తన స్యైవ భవతి। యదిదం ప్రవర్తనం స్థూలదేహస్థితి రూపం। తతో నివృత్య అన్యత్ర గచ్ఛతీతి విజ్ఞేయం। సోయం యమాలయోహి సూక్ష్మదేహః। తస్మిన్ జీవస్య స్థితిః। స్థిత్వా కామలోకాదికే నివసతి జీవ ఇతి విజ్ఞేయం॥"

మరణ మనఁగా జీవుఁడు తన కుపాధియగు స్థూలశరీరము జీర్ణింపఁగ దానిని విడిచి మఱియొక శరీరమును బొందుట. యమాలయమునకుఁ బోవునని చెప్పుదురు. "యము" అనఁగ నివృత్తి; "ఆలయము" అనఁగ సూక్ష్మదేహము. స్థూలదేహమును విడిచి, సూక్ష్మ దేహమును బొందుట నిద్రావస్థవంటిది. నివృత్తి; ప్రవృత్తికొఱకే; ప్రవృత్తి నివృత్తికొఱకే (పుట్టుట గిట్టుటకొఱకే; గిట్టుట పుట్టుట కొఱకే) యనిభావము. జీవుఁడు సూక్ష్మదేహమును బొంది, కామలోకాదులయందు తాను స్థూలలోకమం దొనరించిన కర్మల కనుగుణములగు ఫలముల ననుభవించుచుండు. దుష్టకర్మల నొనరించిన యెడల భువర్లోకమునందు దుఃఖానుభవముల ద్వారా కామమయ శరీరముల విడిచి, సువర్లోకమునకుఁ బోయి, పుణ్యకర్మల కనుగుణమగు సుఖముల ను మనోమయశరీరము ద్వారా అనుభవించి, పుణ్యకర్మఫలము సుఖానుభవము ముగియఁగనే మరల భూలోకమునకు వచ్చి, స్థూలశరీరమును బొందును. ఇదియే జనన మని చెప్పుదుము.

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యని భగవద్గీతా ప్రమాణమును గలదు. కాఁబట్టి జననమరణముల నొందుచు భూర్భువస్స్వర్లోకము లను సంసారచక్రమందు పరిభ్రమించుచుండును. ఈవిషయమును గుఱించి ఛాందోగ్యోపనిషత్తునందు పంచాగ్నివిద్య యని యొకటి కలదు. ద్యు సోమ పర్జన్య పురుష యోషిత్తులు— ఇవి పంచాగ్నులు. వీనిద్వారా కర్మదేవతలు జీవుల భూలోకమునందు జనింపఁజేయుదురు. పుణ్య పాప కర్మానుభవ మాయాలోకములందు కాఁగనే కర్మశేషముచే (శుద్ధమనోమయశరీరము) మహర్లోకమునుండి ద్యులోకము (స్వర్గలోకము)నకుఁ దెత్తురు. అచ్చటనుండి సోమలోకమునకు (భువర్లోకము), అచ్చటనుండి పర్జన్యలోకమునకు (వర్షబిందువులలోనికి), వర్షబిందువులద్వారా ఫలించిన వ్రీహియవాదుల నాహారముగ స్వీకరించిన పురుషుని దేహమున రేతోరూపముగను, అచ్చటనుండి స్త్రీగర్భములోనికి జీవునిఁ బ్రవేశపెట్టుదురు. స్త్రీగర్భమందుండు పిండములో జీవుఁడు 7 వ మాసమున కళతోఁ బ్రవేశించుననియు, నప్పుడు పూర్వజన్మజ్ఞానము కలుగుననియు, గర్భస్థనరకదుస్థితిని సహింపఁజాలక, "ఇఁకను దుష్కర్మలు గావించి నరకవాసమును బొందను; సద్భక్తి కలిగి నిన్నారాధించి కడతేరెద"నని భగవంతుని స్తుతించినట్లు శ్రీభాగవత తృతీయస్కంధమునఁ గలదు. నివృత్తి ప్రవృత్తి మార్గము

లకు వేదాంతములయందు అర్చిరాది మార్గమనియు, ధూమాదిమార్గమనియుఁ జెప్పుదురు. దీనినే దేవయానమనియు, పితృయానమనియు నుడివెదరు. జ్ఞానులకు అనావృత్తిరూపమగు అర్చిరాదిమార్గమును, కర్మయోగులకు ఆవృత్తిరూపమగు ధూమ్రాదిమార్గమును.

శ్లో. అగ్నిర్జ్యోతి రహః శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.
—భగవద్గీతా, అ. ౮, శ్లో. ౨౪.

బ్రహ్మవిదులగు జ్ఞానులు స్థూలభౌతిక దేహమును విడిచి, ఆతివాహిక దేవతల సాహాయ్యముచే అగ్ని, జ్యోతి, అహస్సు, శుక్లపక్షము, షాణ్మాసమగు నుత్తరాయణము—ఈమార్గముద్వారా బ్రహ్మలోకమును బొందుచున్నారు. అగ్ని దగ్ధమయినంతట అహస్సు, అహస్సునుండి శుక్లపక్షము, అటనుండి ఉత్తరాయణము, సంవత్సరము, ఆదిత్యుఁడు, చంద్రుఁడు, విద్యుత్తు, ఈయభిమానదేవతలు (ఆతివాహికులు), అటనుండి వరుణ ఇంద్ర ప్రజాపతులు ద్వారా అనావృత్తిరూపమగు బ్రహ్మపదవిని బొందించుచున్నారు.

శ్లో. ధూమ్రో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే.
—గీతా, అ. ౮, శ్లో. ౨౫.

కర్మనిష్ఠులగు యోగులు స్థూలశరీరమును విడిచి ధూమ్రాభిమాన దేవత, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, వీనిద్వారా సోమలోకము (పితృలోకమును) పొంది, మరలవచ్చి భూమిమీఁద జన్మించుచున్నాఁడు. ఇది పితృయానము. ధూమ్రాదిమార్గము అగ్నిదగ్ధమయినంతట ధూమము, ధూమమునుండి రాత్రి, అటనుండి కృష్ణపక్షము, దక్షిణాయనము, సంవత్సరము, పితృలోకము, ఆకాశము, చంద్రుఁడు—ఈయభిమానదేవతలు (ఆతివాహికులు) ద్వారా చాంద్రమసజ్యోతిస్సును బొంది, అటనుండి ఆవృత్తిరూపమగు జన్మము నొందుచున్నారు. అనఁగా భూలోకమునకు వచ్చుచున్నాఁడని భావము. దేశాంతరములకు, ద్వీపాంతరములకుఁ బోవు మహాపురుషులను ఆయా సరిహద్దు ప్రదేశములయందుండు అధికారజనులు Pass-port మొదలయిన వానిని జూచి గౌరవపురస్సరముగ స్థానాంతరమునకుఁ దీసికొనిపోయినట్టుల కాలాభిమాన దేవతలు, లోకాభిమాన దేవతలు మృతులగు జీవులను వారివారికర్మానుగుణ్యముగు లోకములను బొందించుచున్నారు. ఈసందర్భమున నింక ననేకవిషయములు గలవు. మత్కృత "జీవయాత్రా రహస్య"మను గ్రంథమునఁ గనఁదగు. పూర్వోక్తమగు బ్రహ్మాండమంతయు పిండాండమునఁ గల్పించి యోగులు సకలమును జూచుచుందురు.

శ్లో. పాతాళం నాభ్యధో భాగే భోగీంద్ర ఫణమండలం,
వేష్టిత స్సర్వతో నంత స్సంబిభ్ర జ్జీవసంజ్ఞకః.
భూలోకో నాభిదేశస్తు భువర్లోకస్తు కుక్షితః,
హృదయం స్వర్గలోకస్తు సూర్యాదిగ్రహతారకాః.
సూర్య స్సోమ స్సనక్షత్రో బుధ శ్శుక్రః కుజోంగిరాః,
మందస్తు సప్తమో హ్యేషో ధ్రువోంత స్స్వర్గలోకతః.
హృదయే కల్పయే ద్యోగీ తస్మిన్ సర్వసుఖం లభేత్,
హృదయోన్మహర్లోకో జనలోకస్తు కంఠతః.
తపోలోకో భ్రువో ర్మధ్యే మూర్ధ్ని సత్యః ప్రతిష్ఠితం,
ఏవం బ్రహ్మాండనిలయం తస్మిన్ దేహే ప్రతిష్ఠితం.
—ఉత్తరగీత, ౨ - అధ్యాయము.

నాభ్యధోభాగమునందు పాతాళం బుండును. అచ్చట స్వాధిష్ఠానచక్రమందు అనంతుఁడు ఫణామండలమును చుట్టి జీవుని సంసారచక్రమునందు భ్రమింపఁ జేయుచుండును. ఇది కుండలినీ స్థానము. నాభిస్థానమునందు భూలోకము, కుక్షియందు భువర్లోకము, హృదయమునందు స్వర్గలోకము, సూర్యాది గ్రహనక్షత్రమండలము లుండుచోటు. భ్రువలోకాంతము వఱకు ఇట్లు సర్వమును హృదయమునందుఁ గల్పించుకొని భావించుచు సుఖమును బొందుదురు. హృదయమునకు మీఁద మహర్లోకము, కంఠమునందు జనలోకము, భ్రూమధ్యమునందు తపోలోకము, మూర్ధస్థానమందు (సహస్రారమందు) సత్యలోకమును—ఇట్లు బ్రహ్మాండమును దేహమునందుఁ బ్రతిష్ఠించి భావించుచుండు యోగీశ్వరులకు బ్రహ్మపదవి కలుగును.

పిండాండములో భూలోకస్థానమగు నాభిస్థానముక్రిందనుండు మూలాధారచక్రము మొదలు సహస్రారమువఱకును మేరుస్థానమగు వీణాదండము నాశ్రయించియున్నవి. మేరుశిఖరమునందు సత్యలోకమున్నటుల వీణాదండముపైని సహస్రారములో సత్యలోకమును, నిఖిలదేవతలును, మహర్షులును గలరు. బ్రహ్మాండములో నుండు ద్వీపసముద్ర నగ్న పర్వతారణ్యాది నదపుణ్యక్షేత్రములును, సూర్యనక్షత్రాది మండలములును, లోకములును, లోకాధిపతులును, వీనికెల్ల నధిష్ఠానమగు పరబ్రహ్మంబును సూక్ష్మరూపంబున పిండాండము లోనున్నవాగలు. ఆహారవిహార నియమములచేతను, యోగాభ్యాసముచేతను నాడీవర్గమును శుద్ధిచేసి, దివ్యదృష్టి కలవారగ్నై, యోగీశ్వరులు గంగా యమునాది పుణ్యతీర్థముల స్నానమాచరించుచు, మహర్షుల సందర్శించుచు, లోకాంతరములకుఁ బోవుచు వచ్చుచునుందురు. ద్రష్టలకంతయుఁ బిండాండమునందును గలదు. కాఁబట్టి లోకములను, లోకాంతరములను, అందలి మహనీయులను, వీనికంతయు నధిష్ఠానమగు పరబ్రహ్మంబునుఁ దెలిసికొని, సర్వభూతహితరతుఁడగుచు సంసారబంధమునుండి విముక్తుఁడై, నిరతిశయాఖండానందస్వరూపి యగు పరమేశ్వరునిఁ బొందుటయే పరమ పురుషార్థము. అట్టిముముక్షువులకు శ్రీపరమేశ్వరుండు భక్తిజ్ఞానవైరాగ్యంబుల ననుగ్రహించి తనయందుఁ జేర్చుకొనుఁగాత మని ప్రార్థించుచున్నాఁడ.

# వాసనల పరస్పర ప్రభావము

పారనంది జగన్నాథస్వామిగారు

[గతించిన మూడు సంవత్సరాది సంచికలలోను మూడువాసనల స్వభావమును గురించి వ్రాసియున్నాను. వాటిమధ్య ఉండే సంబంధము గురించి ఈమారు వ్రాయదలచుకొన్నాను.]

వాసనలకు అన్యోన్యము సంబంధమున్నట్లు గతవ్యాసములలో సూచింపబడియున్నవి. ఈసంబంధము మైత్రిరూపముగాగాని పోరాటరూపముగాగాని ఉండవచ్చును. వాటి ప్రాథమికస్థితులలో వాటికి మైత్రికంటె విరోధము ఎక్కువగా ఉంటుంది. మనోనిర్మాణము అప్పటికింకా పరిసరములతో కావలసినంత అనుభవము పొందియుండనందున, ఈవాసనలు ప్రత్యేకముగానే ప్రవర్తిస్తుండుట అధికముగా ఉండును; కాబట్టి వీటిలో వీటికి కావలసినంత అన్యోన్యము కుదరదు. ప్రత్యేకముగా ప్రవర్తించేటప్పుడు వాటికి స్వాభావమైన విరోధము వ్యక్తమవుతూ ఉండును. వ్యక్తిత్వము అణచవలెనని సంఘత్వమూ సంఘత్వ నిరోధమును తొలగించుకొనవలెనని వ్యక్తిత్వమూ విజృంభించుట వాటి స్వభావము. కాని అనుభవము ఎక్కువవుతున్నకొలదీ వీటిప్రయోజనమూ వ్యాపారమూ ఇంత విరివిగా ఉండవు. కాబట్టి వాటివాటి శక్తులూ నిర్మాణములూ అనేకవిధములుగా అల్లుకొని ఉత్కృష్ట నిర్మాణములు సిద్ధమవుతవి. ఈ నిర్మాణములు మిశ్రనిర్మాణములు; అనగా మూడు వాసనలయొక్క అల్పనిర్మాణములు. ఒకదానితో ఒకటి అల్లుకొనడముచేత తయారైనవి. మూడువాసనలూ ఒకేవిధముగా వ్యక్తికి ముఖ్యమగుటచేతనూ, వీటివీటి అల్పనిర్మాణములకు అన్యోన్య సంబంధములు అవసరమగుట చేతనూ, ఒకేదానితో ప్రపంచ వ్యాపారము సిద్ధించకపోవడము చేతనూ, ఈ మిశ్రమ నిర్మాణములు ఆవశ్యకములు. మిశ్రమములు కావడము చేతనే చాలును, అందుకుతోడు నైజముగా వాటి అంగములైన అల్పనిర్మాణములు విరోధము కలవి కూడా అయినప్పుడు మైత్రికంటె విరోధము ఎక్కువేమో అని నిరూపించుటలో అతిశయోక్తి ఏమీ లేదు.

ఈవిరోధము లేకుండా ఉండేవాడు సుఖవంతుడు. ఎవనిలో ఈ మిశ్రనిర్మాణములు తక్కువగా ఉంటవో, లేదా ఎవనిలో వీటికిగల విరోధము ఆ మిశ్రమములో హరించిపోయి మైత్రి ఎక్కువగా కలుగుతుందో, వానికి ఎక్కువసుఖము కలుగుతుంది. ఈ మైత్రిఃపట్టే మనస్సుయొక్క ఆరోగ్యము, స్థైర్యదార్ఢ్యములు ఉంటవి.

ముఖ్యముగా మైత్రి కుదుర్చుకొనవలసినవి వ్యక్తిత్వసంఘత్వవాసనలు. కొందరిలో వాటికి స్వాభావమైన ప్రాథమికవిరోధము మాసిపోక నిలిచియుంటుంది. అట్టివారు సంఘములో ఆలాగు నిలిచియుండటము చాలా అరుదు; వారు సంఘబాహ్యులు, నీతివిరోధులు, రాజద్రోహులు అని పేరుపొంది సంఘసంక్షోభమునకు కారణభూతులుగా పిలవబడతారు. కొందరివిషయములో మాత్రము వ్యక్తిత్వము ఎక్కువైనా సంఘము ఓర్చిఉంటుంది. ఎందులోనైనా ఉత్కృష్టస్థానమును ఆక్రమించువాడు సంఘముయొక్క గౌరవమునకు పాత్రుడై తన వ్యక్తిత్వమును సంఘముపై ఆవరింపజేస్తాడు. సంఘములో చాలామంది ఏదైనా ఒక చిన్న అవినీతిని చేస్తూఉంటే, ఆఅవినీతికొరకు అందరితోను విరోధ మెందుకని శాబోలు సంఘము దానిని ఉపేక్షిస్తుంది; అట్టివి మరీ సంఘనాశకరములు కాకుండా ఉంటే చాలును. ఇట్టివ్యక్తులు ఈ సం

ఘువ్యక్తి సంబంధసోపానములో ఒకకొనను ఉంటే, రెండోచివరను ఉండే రకము ఒకటి ఉంది. సంఘానికి పూర్తిగా లొంగిపోయినవారు ఆ రకము. అట్టివారు సంఘాని కెంతో ఉపకారమువలె కనబడ్డా, వారిలో ఏమాత్రమూ స్వతంత్రత లేనందున వారి నడతంతా మీట బొమ్మ ఆటవలె ఉంటుంది ఆత్మలేని శరీరముగల మనిషి అవుతాడు.

ఈ రెండు కొసలమధ్య అనేకసోపానములు ఉన్నవి. వీరి అందరిలోను ఒక్క సామ్యమున్నది; అందరూ కూడా వ్యక్తిత్వ సంఘత్వములకు గల విరోధమును సమరసచేసుకొని మైత్రిని కల్పించుకోవాలని ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. ఈ మైత్రికి ముఖ్యసహకారి రెండువాసనల నిర్మాణములకుగల విరోధమువల్ల కలిగేనొక్కు. సంఘమందున్న ఇతరవ్యక్తుల సంపర్కము కలుగగానే స్వార్థవాసనలు మారతవి; సంఘము అనే సానలో ఈ వ్యక్తిత్వము తయారు పొందుతుంది. ఈ మైత్రి బాహ్యముగా మాత్రమే ఉంటే మనశ్శాంతి పూర్తిగా ఉండదు. బాహ్యముగా సాంఘికాచారములకు అవలంబన చూపిస్తూ, మనస్సులోను, రహస్యముగాను తన వ్యక్తిత్వవాసన శాంతికి ఉపచరించేటట్లు ప్రవర్తించుట సాధ్యమైనా, మనశ్శాంతి మాత్రము చక్కగా కుదరక ఆరోగ్యస్థైర్యములు సరిగ్గా ఉండవు. మరొక రకము ఉన్నది; వ్యక్తియొక్క సామర్థ్యమునంతా ఉచితములైన సాంఘికవ్యాపారముల క్రింద నుపయోగించేవారు కొందరున్నారు. వారు ధన్యులు.

ఇక వ్యక్తిత్వవాసనకున్నూ, లైంగిక వాసనకున్నూ గల సంబంధము చూదాము. లైంగికవాసనయొక్క కోరికలు చక్కగా తృప్తిచెందేటప్పుడు, ఆవాసన వ్యక్తిత్వవాసనతో అత్తుకొంటుంది. లైంగికవాసనకు గురియైన ప్రియురాలి యెడల కనబరిచే ప్రేమా, ఆప్రేమకు ఫలమైన సంతానముయెడల కనబరిచే వాత్సల్యమూ చాలా ఎక్కువగా ఉదారమైన భావములు. వీటికి గురిగా ఆ స్వార్థములైన ప్రియురాలును సంతానమును మాత్రమే కాకుండా, మానవసామాన్యమును కూడా గురిగా కల్పించుకో గలిగినవానిలో ఈ వ్యక్తిత్వలైంగికవాసనల బలమునకు సాంఘికత్వము కూడా మేళవింపు అయినట్లు అవుతుంది. కాని ఇట్టి సమ్మేళనము సులభమైన పని కాదు. చాలంచోట్ల వ్యక్తిత్వ లైంగికవాసనలకు విరోధము పుట్టుతూ ఉంటుంది.

పూర్తిగా స్వార్థమైన స్వీయసౌఖ్యమునకున్నూ, కొంత పరార్థమైన కార్యసిద్ధుల యెడల చూపవలసిన శ్రద్ధాసక్తులకున్నూ సహజముగా ఉన్న రాపిడిలో నలిగిపోయే వ్యక్తులున్నారు. ఇది పురుషులలో ఎక్కువ; స్త్రీలలో మరొకరీతిని కనబడుతుంది ఈ పోరాటము. పూర్వకాలములో స్త్రీ అనగా లైంగిక ప్రవృత్తికొరకు నిర్మితమైన వస్తువని సామాన్యాభిప్రాయమై ఉండేది. ఇప్పటికికూడా ఆ అభిప్రాయమే ప్రపంచమంతట ఏవేవో కొద్దిమార్పులతో ఆవరించి యున్నది. కాని క్రమముగా స్వాతంత్ర్యేచ్ఛ బలమవుతూ ఉండడముచేత కొంత, విద్యాప్రసారముచేత కొంత, ఆత్మసంబంధమైన వ్యక్తీకరణముచేత కొంత, ఈమార్పు బలమవుతూ, స్త్రీకూడా ఒకవ్యక్తి అనిన్నీ, స్త్రీలోకూడా వ్యక్తిత్వవాసన బలముగా ఉంటున్నదనిన్నీ స్పష్టమవుతూ ఉన్నది. ఈవ్యక్తిత్వ స్వాతంత్ర్య వాంఛకున్నూ, భర్తయొక్క ఆమోదమునకున్నూ సమరస కుదరడము సులువైన పనికాదు. ఈ రెండిటికి మైత్రి కల్పించుకో గలిగిన సాధ్వీమణులు ఉన్నా, వారి మనోనిర్మాణములో కూడా చక్కనిసామరస్యము కుదిరినదా అనే సందేహము తీరకపోవచ్చును. ఈ రెండిటికి మైత్రి అమర్చవలసిన అవసరము ఇప్పుడు ఎక్కువగా ఉన్నదని సాంఘికతత్త్వజ్ఞులు అంగీకరిస్తున్నారు; అందుకు తగినట్లు సంఘములో ఏర్పాటు లుండవలెనని వారి వాదన. ఈ సమస్య ఎట్లు పరిష్కారము కాగలదో ఇప్పుడు మనము నిర్ణయించి చెప్పలేము.

మిగిలిన రెండింటికి అనగా లైంగికవాసనకున్నూ, సాంఘికవాసనకున్నూ గల సంబంధమును చూదాము.

విచ్చలవిడి లైంగికసంబంధాలను సంఘము అంగీకరించదు. సంఘము ఆమోదించే మార్గాన్నే వ్యక్తియొక్క లైంగికవాంఛలు తీరితే వ్యక్తికి చాలా సుఖముగా ఉంటుంది. అప్పుడు రెండువాసనల శక్తులు మిళితమై ఒకే వస్తుపుకొరకే వినియోగ మవుటచేత, సౌఖ్యము నిండుగా ఉంటుంది. అలాగు వ్యక్తి ఇష్టమూ, సంఘముయొక్క ఆమోదమూ ఒకేమార్గాన్ని పోకపోతే, రెంటింటికి విరోధము గలిగి కావలసినంత అశాంతి కలుగుతుంది. వ్యక్తిగాని సంఘముయొక్క ఆమోదానికి లొంగినట్లయితే, పైకి శాంతివలె కనబడ్డా నిజమైనశాంతి దార్ఢ్యములు కుదరవు. లైంగికనిర్మాణమునకు వాస్తవమైన సంతుష్టి లేనందున, ఆలైంగికశక్తి అనేకవిధాల, అనేకమార్గాల ప్రవర్తిస్తుంది. సాంఘికనీతికిన్ని, వ్యక్తిప్రవర్తనకున్నూ విరోధము పుట్టి సంఘముయొక్క కట్టుబాటులకు విఘాతము సంభవించడమో, వ్యక్తి సంఘబాహ్యుడై వికలుడు కావడమో తటస్థిస్తుంది. అంతేకాకుండా వ్యక్తియొక్క మనోనిర్మాణములో చాలా చాలా విపరీతములు లేచి మనస్సుయొక్క ఆరోగ్యానికి విఘాతము తెచ్చి పెట్టును. కాని అనేకులు వ్యక్తులు ఒకేవిధమైన పొరపాటు చేస్తే, అందరితోను విరోధము తెచ్చిపెట్టుకోక సంఘము కొంచెము సర్దుకొంటూ ఉంటుంది. చిన్నచిన్న పొరపాటులను ఉపేక్షిస్తూ, సంఘము తన అధికారమును నిలుపుకోవలెనని ప్రయత్నిస్తుంది. సంఘమును కొంతవరకైనా అనుసరించేటట్లు కనబడే అవినీతిపరులను సంఘము బహిష్కరించదు.

మీద సూచించినట్లు అన్యోన్యసంఘర్షణవల్ల వ్యక్తియొక్క శీలము తయారవుతుంది. మూడు వాసనల నిరోధము అనే సానలో వ్యక్తియొక్క ఆత్మ అనే మణి నలుపక్కలు చెక్కబడినది కాగలదు. ఈసాన పట్టడము అనగా, వాసనలకు సమరస కుదర్చడము అనగా కొంచెము ఎక్కువ తక్కువగా పికలే. ఈపనులన్నీ లీన చైతన్యములో అబుద్ధిపూర్వకముగా జరిగేవి. అయితే వ్యక్తికి ఏమిన్నీ బాధ్యతలేదన్నమాటే గదా అని అడిగితే ఇదమిత్థ మనే జవాబు చెప్ప శక్యముకాదు. అంతర దర్శనము ద్వారా ఎంతవరకు ఈ వాసనలను వశపరచుకోవచ్చును? అనేవిషయమై ఇంకా విమర్శనలు జరుగుతూవున్నవి. ఇది విపులముగా మరొకమారు ప్రత్యేకముగా చర్చించవలసిన విషయము. వాసనల స్వభావమును మార్చుటకుగాని అణచివేయుటకు గాని ఆత్మకు శక్తి చాలకపోయినా, వాటి ప్రవృత్తులను సరళముగా ఉంచుకొనుటకు కొంతవరకు వీలు ఉన్నట్లు కనబడుతుంది. కాబట్టి వాటిసంగతి తెలుసుకొనుట ఆవశ్యకము.

---

## బసవపురాణము వెల రు. ౨-౮-౦

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి        పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు,

పండ్రెండవశతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు; తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నరాష్ట్రములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పు.) యిందుగలదు. ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము. విలాసము:— ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

# పాడిపశువుల మేత

యేజళ్ల శ్రీరాములు చౌదరి గారు

మన దేశములో అనాదినుండియు ప్రతిమనుష్యుడును తన పశువులకు తగిన ఆహారమిచ్చి పోషించుటయు, పూజించుటయు కలదు. పశుపోషణ వేదకాలమునుండి ధర్మసంరక్షణగా నెన్నబడుచున్నది. మన దేశప్రజలకు అనాదినుండి పశువులను పెంచు విధానము బోధపడియుండినను క్రమక్రమముగ మూఢవిశ్వాసములలో మిళితమై యుండి క్షీణించుచున్నది. ధనికులు, వివేకులు మున్నగువారు ఆంగ్లేయ విద్యల నభ్యసించి తమకున్న భూములను, పశువులను బోగొట్టి యుద్యోగాల కాశపడుచున్నారు. తదితరకృత్యము లన్నియు నక్షరజ్ఞానములేని ప్రజలకు విడిచిపెట్టబడుచున్నవి. అందుచేతనే వ్యవసాయము, పశుసంరక్షణ క్షీణించుటకు ప్రారంభమైనది. మన దేశమందు పశువులవిషయమై తగుజాగ్రత్త పుచ్చుకొనుటలేదు. పుట్టినవి పుట్టుచున్నవి. చచ్చినవి చచ్చుచున్నవి. రోగములు కలుగునప్పుడు రైతులకు తగిన చికిత్సలు తెలియుటలేదు. పాడిపశువులవిషయమై యితర పశువులకంటె నెక్కువ శ్రద్ధ తీసికొనవలయును. పశువు లారోగ్యముగానుండి తగినపని చేయుటకుగాని, పాలిచ్చుటకుగాని వాని కనుకూలములగు నాహారముల నీయవలయును. వ్యవసాయదారులుగాని, గోరక్షకులుగాని యీవిషయమై తగుశ్రద్ధ వహించనియెడల, నితరవిషయములలో నెంత శ్రద్ధ తీసికొనినను, నెంత వ్యయము చేసినను లాభములేదు. ఈపశువులను పెంచువారు వానికి తగిన యాహారము, నీరు, నీడ మున్నగునవి ఈయవలయును. పాడిపశువులు మిగుల సున్నితములైన జంతువులు గాన వానికి తగినపోషణ చేసినచో లెస్సగా పాలియ్యగలవు. పాడిపశువులుగల ప్రతికృషీవలుడు తాను నియమించిన వేళలయందు తగిన మేత, నీరు పెట్టుచుండవలయును. లేనిచో పాలు తగ్గి క్రమముగా నెండిపోవుట తటస్థించుచుండును. పాడిపశువులు నొక్కటే విధమగు నాహారము తినజాలవు. వానికి మేతవేయు గాడితొట్లును, కుడితి, నీరు పోయు గాబుతొట్లును కల్మషరహితముగానుంచి ప్రతిదినము శుభ్రము చేయుచుండవలయును. మేతలోగాని, చిట్టు, తవుడు మొదలగు పదార్థములలోగాని యేమాత్రము దుర్వాసన గొట్టినను పాడిపశువులు విడిచిపెట్టును. ఇంతియేకాకుండ అవి తినుమేతలో పొరబాటున పేడ పడిననుకూడ విడిచిపెట్టును. కాబట్టి వానికి పెట్టు ఆహారము కుళ్లనిది, చెడనిది, సారవంతమైనదిగా నుండవలయును. చెడు ఆహారము పెట్టిన మొదటికే మోసమువచ్చి నష్టము కలిగించును. పాడిపశువులు పగలంతయు పొలములలోనుండి రాత్రి వేళలందు ఇండ్లకు చేరును. అప్పుడు వానికి తగిన మేత పెట్టవలయును. పశువులు నోరులేని జంతువులుగాన వానికష్టములు మనకు చెప్పజాలవు. కాబట్టి మనమే తగినజాగ్రత్త తీసికొనవలయును. మనుష్యులవలెనే పశువులకును ఆహారవిషయములలో నియమితకాలము తప్పినచో అవి అజీర్తి మున్నగు రోగముల పాలగుటయు కలదు.

పశువులకు పెట్టు ఆహారము వానియొక్క కళేబర తారతమ్యములను బట్టి పెట్టుచుండవలయును. పాలు పిదుకునప్పుడు చిట్టుగాని, తవుడుగాని, జనుపకట్టెగాని దాణాగా పెట్టినచో పశువులకు బలము కలుగును. పశువుల నెక్కువగా క్రొవ్వుపట్టునట్లుగా మేపరాదు. అట్లు మేపినచో సరిగా పాలియ్యక త్వరలో వట్టిపోవును. ప్రతిదినము పశువులను పాలు తీసినతరువాత కొంచె మటునిటు త్రిప్పి పిమ్మట చిట్టు, కుడితి మున్నగునవి పెట్టవలయును. పశువులదగ్గర కావలసినంత నీరు తొట్లలో పోసియుంచినచో వాని కవసరము వచ్చినప్పుడెల్ల త్రాగుచుండవలయును. కుడితి మున్నగునవి సాయంత్రము పశువులు పొలములనుండి రాగానే పెట్టక ఒకగంటసేపు ఆగి పెట్టుట మంచిది. ఉలవలు, గోధుమలు, సెనగలు, ప్రత్తిగింజలు, తవుడు, చిట్టు, పచ్చిగడ్డి, తెలికపిండి మున్నగునవి పాడిపశువులకు ముఖ్యాహారములు. ఇంకను వేరుసెనగపిండి, కొబ్బరిపిండి, ఆముదపుపిండి, బియ్యపుగంజును, అపరధాన్యముల పొట్టు, [illegible] మొదలగునవికూడ కొందరు ఉపయోగించుచున్నారు. పై పదార్థములలో ఉలవలు, గోధుమలు పాల నధికముగ జేయును. పుష్టి కలిగించును. బలవంతచేయును. కొందరు ఉలవలు, గోధుమలు, యవలు సమభాగములుగా తెచ్చి నీటిలో నానబెట్టి రుబ్బిపెట్టుదురు. ఇందువలన పశువులకు అతిబలవంతచేయును. పాడిపశువులు మిగుల కృశించుచున్నయెడల సెనగలు నానబోసి రుబ్బి కుడితిలో కలిపిపెట్టుటవలన బలమేర్పడును. ఎక్కువమేత తిను పశువులకు అపరధాన్యముల పొట్టు నెక్కువగా నిచ్చుట మంచిది. అపరధాన్యములు పచ్చివి మాత్రము పెట్టరాదు. తవుడు తినిన పశువు వెన్న నెక్కువ కలుగజేయును. జీర్ణశక్తి వృద్ధియగును. మరితవుడు నెక్కువగా మేపినచో నేత్రరోగములు సంభవించును. తెలికపిండి రుచికి తీయగా నుండును. పశువులకు బలము గలిగించును. నెత్తురు పట్టి పాల నెక్కువచేయును. ఎముకలకు పుష్టికలిగించును. పుచ్చి పురుగులు పడిన పిండి నుపయోగించరాదు. పాతపిండి పశువులకు పెట్టరాదు. ప్రత్తిగింజలు పాలపశువుల కాహారముగ వాడబడుచున్నవి. ఈ గింజలపై కొంచెము ప్రత్తి

యంటియుండును. ఈప్రత్తిగింజలపై పొట్టును జీర్ణము గావు. ప్రత్తిగింజలయందు తగినంత చమురున్ననేగాని వీనిని పశువులకు బెట్టినపుడు జీర్ణము కావు. ప్రత్తి పండు జిల్లాలలో ఈగింజలు సవుకగ దొరకును. ఎక్కువకాలము నిలువయున్న గింజలు పశ్వాహారమునకు బనికి రావు. ఈగింజలనుంచి అంత ఎక్కువగా చమురు దీయుటలేదు. ఏగో పాదేశములో ప్రత్తిగింజలపై పొట్టును దొలగించి పిండిని సిద్ధముచేయుచున్నారు. ఇది ప్రశస్తమగు పశ్వాహారముగ వాడబడుచున్నది. ప్రత్తినూనె కొంచెము పసుపురంగు కలిగియుండును. పాడిపశువులకు ఈగింజలు పెట్టినచో వెన్నను కలుగజేయును. అయినను దినమునకు అర్ధసేరుకంటె ఎక్కువగా పెట్టితిమేని అతికాకచేసి కడుపునొప్పి, అజీర్తి మున్నగు వ్యాధులు సంభవించును. ప్రత్తిగింజలు బాగుగా నలుగగొట్టి మిక్కిలి మెత్తబడునట్లు నానబోసి పెట్టవలయును. ప్రత్తిచెట్టుయొక్క ఆకులు, పువ్వులు మొదలగునవికూడ పశువులు తినిన విశేషముగ పాలిచ్చును. బొంబాయిలో కొబ్బరిపిండి విశేషముగ తయారుచేయబడుచున్నది. మలబారునుండి కొబ్బరికాయలు బొంబాయికి గొనిరాబడుచున్నవి. అచ్చట వానిని చిప్పలుగ గోసి గానుగ బెట్టి చమురు దీయుదు. చమురు తీయగా మిగిలినపిప్పి పశువుల కాహారముగా వాడబడుచున్నది. ఈ పిప్పి పాడిపశువులకు పెట్టినచో పాలెక్కువ ఇచ్చి వెన్నను కలుగజేయును. వేరుసెనగలలో చమురు విశేషముగ నుండును. ఈచమురు తీయబడిన పిండియందు నత్రజని పదార్థమెక్కువగ గలదు. ఈపిండిని పశువులకు పెట్టి మలమూత్రములను జాగ్రత్తచేసి పొలములలో వేయుచున్నారు. ఈపిండిని పాడిపశువుల కెక్కుడుగా బెట్టిన కాకరోగములు సంభవించును. పిండులన్నిటిలో ఆముదపుపిండి ముఖ్యమైనది. పసువులకు కొద్దిగ బెట్టవలయును. లేనియెడల విరేచనములు కలుగును. ఇంకను ఎక్కువగా తినినయెడల హానికూడ తటస్థించును. కనుక దీనిని పశువులకు పెట్టకుండుటయే మంచిదని నాయభిప్రాయము. కొన్ని దేశములలో ఆవాలపిండి ఎద్దులకు, గిత్తలకు పెట్టుదురు. ఇంకను పచ్చిముల్లంగి, చెరకు మున్నగునవి కూడ పెట్టవచ్చును.

పశువులకు పచ్చిగడ్డి యనిన ప్రాణము. ఈగడ్డి తినిన పశువులపాలు తియ్యగా నుండును. పాలు రంగుగలిగి వెన్నయెక్కువగును. కృష్ణా, గోదావరి జిల్లాలలో దరచుగా నగు గడ్డిజాతులలో గరిక, గునుకు, చెంగలి, తుంగ, ఊడ, కామురు, ఆముడ, కాండ్ర, తిక్కలింత, ఊతిక, చిప్ప, ఊసడము, ఏనుగమోకాలు, జనిపె, దర్భ, అవురు, రెల్లు, గాలిగడ్డి, యివి, ముఖ్యములు. ఇవిగాక గడ్డికుటుంబములో చేరని గణ్ణేరు, ఎలకచెవి, అమృతకాడ, పాలకాడ, పావిల మొదలగు ననేకజాతుల మొక్కలుగూడ బీళ్లలో గానవగును. పై గడ్డిజాతులలో గరిక, గునుకు, మొలవ, చెంగలి మొదలగునవి మిగుల బలమైన జాతులును, పశువులు బాగుగా దినునవియునై యున్నవి. ఊతిక, చిప్ప, తుంగ, ఊసడము మున్నగునవి మేత కంతగా ప్రశస్తములు గావు. రెల్లు, అవురు మొదలగునవి మిగుల మోటుజాతులగుటచే మేత కనుకూలములు గావు తక్కినవి మధ్యమములు. సామాన్యముగ మొలవ, గరిక మొదలగు మంచిజాతులు సారవంతములై, కొంచెము జిగురుగ నుండు నేలలో బయలుదేరును. ఊతిక, చిప్ప మొదలగునవి ఇసుక, గరప నేలలో బయలుదేరును. నవటి నేలలలో ఉప్పిగణ్ణేరు కాడ మొదలగునవి మాత్రమే పెరుగును. కావున పశువులబీటిక్రింద వదలు నేల మంచిదైనచో యందలి పచ్చిక యందు మేయుపశువులకు బలమును, ఆరోగ్యమును ఇచ్చును. కానిమంచినేలలు విలువగల వగుటచే పశువులబీటిక్రింద నుంచక రైతులు వ్యవసాయమున బెట్టి పనికిరాని పొలములను బీళ్లక్రింద నుపయోగించుచుందురు. కొందరు అంతమాత్రమును చేయక నేలనంతటిని సేద్యము జేతురు. మెట్టతాలూకాలలో ఎఱ్ఱనేలలు విశేషముగా బీడుభూములుగా వదలబడుచున్నవి; గాని యందు వర్షము కురియుచున్నంతవరకే గాని యటుపిమ్మట త్వరలో పదును ఆరిపోవుటచే గడ్డి యంతగా బట్టదు. బీళ్లలో పెరుగు గడ్డిజాతులు సున్నము నెక్కువగ దీసికొనును. కావున సామాన్యముగ జంకగానుండు నల్లనేలలలో అప్పుడప్పుడు సున్నము జల్లుట మంచిది. గరికగడ్డికి సున్నము మరింత యిష్టము. బీటిమేత పశువులకు మిగుల నారోగ్యకరము. మనము తదితరములగు మేత నెంత బెట్టినను బీటిమేతకొరకే పశువు లెదురుచూచుచుండును. బీళ్లలో ననేకజాతుల గడ్డిగింజలుండుటచే పశువులకు గావలసిన వివిధవస్తువు లన్నియు నందుండును. ఇంకను ఈభూములలో తుమ్మచెట్లుకూడ నుండుటయు కలదు. ఈ చెట్లకాయలను ఎద్దులకు, పాడిపశువులకు పెట్టినచో మిగుల బలము కలుగును. గినిగడ్డి యను నొకజాతి గలదు. ఈగడ్డి విత్తనములను మేము స్వయముగా తెప్పించి వేసితిమి. ఇది పశువులు తినుటచే ఆరంభములో విరేచనములగును తరువాత క్రమముగా పశువు అలవాటుపడినకొలది బలము కలుగును. వరిగడ్డి కడుపునింపుటయే తప్ప అందుపశువునకు సత్తువ గలిగించు పదార్థ మంతగా లేదు. మురుగునీటిలో పెరుగు గడ్డి అంత ప్రశస్తమైనది గాదు. అది మిగుల నిస్సారమై పిప్పివలె నుండును. ఆర్టిగడము, వంకసన్నాలు, మొలకొలుకులు, కుసుమ మొదలగు ధాన్యముల గడ్డి మిగుల రుచిగా నుండి కొంచె ముప్పగా నుండుటచేత పశువున కారోగ్యముగ నుండును. పశువులకు పెట్టు ఆహారములలో ఉప్పు, గంధకము తగినంత తెచ్చి పొడిచేసి కలిపి పెట్టిన వ్యాధులంతగ రాజాలవు.

కఱవు సమయములలో పశువులను మేపుటకు సులభమగు నొక ఆహారము కలదు. దీనినే బొమ్మజెముడందురు. దీనిని తెచ్చి ముళ్లను పరిశుభ్రముగ తీసివేసి పశువులకు బెట్టుదురు. ముళ్లను, నూగును మొదలంట తీసివేయకుండ పెట్టుచో పశువు శరీరములో నుండు ప్రేవులలో గ్రుచ్చుకొని విరేచనములు మున్నగు వ్యాధులు సంభవించగలవు. అను

ళ్లలో విషముకూడ నుండును. కాబట్టి ముళ్లు లేకుండ చెట్టినచో పశువున కెట్టి ప్రమాదము కలుగదు. ఇవి పశువులకు మిక్కిలి చౌకయైన యాహారము. అనావృష్టియగు సమయములలో పశువుల కెట్టియాపద రాకుండ దీనివలన పోషింపవచ్చును.

కొన్నిచోట్ల పాడిపశువులను పెంటగోరకు పాయికానాలకు, తదితరచోట్లకు విచ్చలవిడిగా విడిచిపెట్టుదురు. పందులవలెనే యివి కూడ పెంటతినుట కలవాటుపడుచున్నవి. పెంటామువలన పాలరుచి బాగుండుననియు, వాసన చెడదనియు కొందరికి నమ్మకము గలదు. ఈపద్ధతి చాల పొరబాటు. పశువుల యారోగ్యము చెడి పలువిధములగు సంకటముల పాల్పడును. కొన్ని జంతువులకు సరియైన మేతపెట్టక యజమానులు సోమరిపోతులుగా తిరుగుచుండుటచేత అవి సహించలేక యేవస్తువుదొరకిన అదియే తిని నీరసస్థితికి వచ్చి అనేకరోగముల పాలగుచున్నవి. కాబట్టి పశువులుగల ప్రతిరైతు తగినయాహార మిచ్చి వానికి సౌఖ్యము కలుగజేయుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

---

భారతీయ శిల్పము



చెన్నపురి శాపలాల్ కంపెనీవారు తయారుచేసినది

# భాషాప్రయుక్తవిశ్వవిద్యాలయములు

కుందూరి ఈశ్వరదత్తు గారు

మ. తన దేశంబు, స్వభాష, నైజమత మా
త్మప్రాక్కులాచారముల్
తన దేహాత్మగ నెత్తెఱంగున సదా
దానట్లు ప్రేమించి త
ద్ఘనతావాప్తికి సాధనంబు లగు స
త్కార్యంబులన్ జేయఁగా
ననువౌ బుద్ధి నొసంగుమీ ప్రజకు దే
వా భక్తచింతామణీ.

—భక్తచింతామణి, వడ్డాది సుబ్బారాయఁడు

1921వ జనాభా లెక్కల ప్రకారము మన హిందూ దేశములో నీ క్రిందఁ జూపట్టిన విధమున వివిధ భాషల మాట్లాడు జనసంఖ్య కలదు:—

| | |
|---|---|
| హిందీ | 96,715,000 |
| వంగభాష | 49,294,000 |
| ఆంధ్రము | 23,601,000 |
| మహారాష్ట్రము | 18,798,000 |
| అరవము | 18,000,000 |
| పంజాబీ | 16,234,000 |
| రాజస్థానీ | 12,681,000 |
| కన్నడము | 10,374,000 |
| ఓఢ్రము | 10,143,000 |
| ఘూర్జరము | 9,552,000 |
| బర్మా | 8,423,000 |
| మళయాళము | 7,498,000 |
| పశ్చిమ పంజాబీ | 5,652,000 |
| కేవారీ | 3,503,000 |
| సింధి | 3,372,000 |
| భీలి | 1,856,000 |
| అస్సామీ | 1,727,000 |
| పహారీ | 1,634,000 |
| కాశ్మీరము | 1,269,000 |
| కురుక్ | 866,000 |
| తులు | 592,000 |

... ... ... ... ... ... ...

పైని వివరింపఁబడిన భాషలలో హిందీ, వంగ, ఆంధ్ర, మహారాష్ట్ర, ద్రావిడ, పంజాబీ, రాజస్థానీ, కన్నడ, ఓఢ్ర, ఘూర్జర, మళయాళ, బర్మా భాషలు మాట్లాడు వారు భరత ఖండములోని జనసంఖ్యలో సగముకంటె నెక్కువ కలరు.

వారిలో నెవ్వరికిని మాతృభాషా మూలకముగ విద్యలను నేర్పెడి విశ్వవిద్యాలయము లేదు. హిందీమాట్లాడు వారికి వారణాసీ విశ్వవిద్యాలయ మున్నను, అం దింకను పూర్తిగ హిందీ భాషకు ప్రాముఖ్యము నీయలేదు. వంగ దేశీయులకు కలకత్తా విశ్వవిద్యాలయ మున్నను Sadler Commission report ప్రకారము మాతృభాషా మూలకముగ విద్య నందు నేర్పుటలేదు. మూఁడవది మన ఆంధ్ర భాష. మన ఆంధ్రవిశ్వవిద్యాలయ మున్నను, విశ్వవిద్యాలయపుచట్టమునందు దేశభాషావిద్యాభ్యసనము విశ్వవిద్యాలయప్రధానోద్దేశ్యముని వివరింపఁబడినను, తద్విషయ మింకను వాదప్రతివాదములతోఁ గాలయాపనము గావింపఁబడి, వెనుకఁబడుచున్నది.

భరతఖండములో నధికసంఖ్యాకులచే మాట్లాడఁబడు భాషలలో మూఁడవది మన ఆంధ్రభాష. అట్టి మన ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లేదుసరికదా, మీఁదు మిక్కిలి దొరతనమువారిచ్చినవిశ్వవిద్యాలయమును గూడ

మనము వృద్ధిని గావింపలేకున్నారము. కేంద్ర సమస్య యింకను పరిష్కారము గావింపబడలేదు. ఆంధ్రులలో బహునాయకత్వపాపముచే నిట్టి యిక్కట్టులు మనజాతీయ వికాసమునకు భంగము కలిగించుచున్నవి. సెనేటువారు అనంతపురము కేంద్రముగ తీర్మానించిరి. శాసనసభ్యోప సంఘమువారు అనంతపురమును సూచించిరి. కర్నూలు ఆంధ్రసభవారు అనంతపురమునే కేంద్రముగ తీర్మానించిరి. అట్టియెడ, ఇంకను మన శాసనసభా సభ్యులు కేంద్రమునకై పెనగులాడుట వారి బుద్ధిమాంద్యమును సూచించుచున్నది. ఇకనైనను మన ప్రతినిధులు జ్ఞానవంతులై కలహమును మాని, ఏ దియో యొక దారికి వత్తురుగాక.

మాతృస్తన్యమును మఱచి పాలసీసా మూలకముగ పెంపొందిన బిడ్డవలె, మనము మాతృభాషను మఱచిపోయి, అన్యభాషాభ్యాసముచే స్వజాత్యభిమానమును గోల్పోవుచున్నాము. మాతృభాషమూలకముగ విద్యను గఱపుటచే దేశాభిమానము బాలురకు వెన్నతోఁ బెట్టినట్లుండును. అట్టి యభిమానము బాల్యమునుండియు నభివృద్ధమైనచో గాని యౌవనమునందది నిలుకడగానుండదు.

మనమిప్పు డాంగ్లభాషను బడినాగారము మొదలు శయ్యాగృహమువఱకును నడుచు డినచర్యలలో యథేచ్ఛగ మాట్లాడుకొనుచున్నాము. మన మాతాపితలు, పితామహ మాతామహాదులు ఆంధ్రులు అను మాట మఱచిపోయినాము. మనము ఆంధ్రులమా, ఆంగ్లులమో అను విషయము జ్ఞప్తికివచ్చుట లేదు. ఇట్లు కొన్ని వత్సరములు గడచినచో నిక మనము పూర్తిగ ఆంగ్లభాషా వ్యామోహావేశులమై ఆంధ్రభాషను మఱచిపోదుమేమో యను శంకయును, భయమును గల్గుచున్నది.

స్వరాజ్య సంపాదనకు మాతృభాషాభ్యాసము ప్రథమ సోపానము. అట్టి మాతృభాషాభ్యాసము మాతృభాషా ప్రయుక్తవిశ్వవిద్యాలయములచేగాని సంపూర్ణముగ లభింపదు. అట్టి భాషాప్రయుక్తవిశ్వవిద్యాలయములు భరతఖండమును భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించినఁగాని లభింపవు. నెహ్రూ రిపోర్టు భాషాప్రయుక్త రాష్ట్రములుగ భరతఖండమును విభజింపవలెనని సూచించినది. అందు ముఖ్యముగ, ఆంధ్ర, కర్ణాట, ఓఢ్రరాష్ట్ర నిర్మాణములు పేర్కొనబడెను.

ఆంధ్ర దేశీయులు, స్వరాజ్యాందోళనమునందు నిమగ్నులై, సొంతవిషయమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణాందోళనము గావించుటలేదు. రాష్ట్రములేని విశ్వవిద్యాలయము ఆవిరిలేని యంత్రము, ఆత్మలేని శరీరము. కావున ఆంధ్రులు కృతనిశ్చయులై ఆంధ్రవిశ్వవిద్యాలయ కేంద్రమునుగూర్చి ఏకగ్రీవముగఁ దీర్మానించుకొని, తదుపరి రాష్ట్రనిర్మాణమావశ్యకమని గుర్తెఱింగి తద్విషయమైపట్టుదలతోఁ గార్యమొనర్పవలెను. ఆంధ్రప్రముఖులు సైమను కమీషను నెడ విముఖులైనను, రాష్ట్రనిర్మాణమును గూర్చియైనను వారియెదుట సాక్ష్యమిచ్చి తత్సంపాదనోత్సాహవ్యగ్రులై కార్యదక్షు లయ్యెదరుగాక.

# బర్మా ఆంధ్ర కార్మికులు—వారి పరిస్థితులు

ఆ. నారాయణరావుగారు

బర్మా దేశానికి మొట్టమొదట మన ఆంధ్రులు దండెత్తివచ్చి కొంత కాలము దేశాన్ని పాలించి క్రమంగా దేశస్థులలో కలిసిపోయినట్టున్ను, ప్రస్తుతము "తెలాంగు"లని పిలువబడే వారే అప్పటి త్రిలింగ దేశస్థులయినట్టున్ను చెప్తారు. అది వెనుకటిగాథ. ఇక నీమధ్యనో, తెలుగుదేశస్థులు బర్మాకు వలసరావటము ప్రారంభించి నలభై, యేభై యేండ్లు కావస్తోంది. గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణ, నెల్లూరు జిల్లాలనుంచి వచ్చేతూర్పు జనులు, రెడ్లు, కాపులు, శెట్టిబలిజలు, ఆదిమాంధ్రులు మొదలయినవారు రంగూను, సిరియాం, బెస్సీన్, మౌల్మీన్, ఇనంజాంగు మొదలయిన చోట్ల లక్షాయేభై వేలకు పైగా వున్నారు. ఏప్రజయొక్కగాని, ఏసంఘంయొక్కగాని ప్రాముఖ్యమున్ను, పలుకుబడిన్ని, అందలి సభ్యుల విద్యాధిక్యం, భాగ్యం, ఉద్యోగం, ప్రజాహితంకోసనం నీటినింబట్టే నిర్ణయమగుతూ వుంటుంది. బర్మాలోని తెలుగువారికి—నేయింటికి యే వొక్కరో తప్పితే—కార్మికస్వత్వానికి సంబంధించిన ఆధిక్యం తప్పితే వేరే యేమిలేదు. ఈకార్మికస్వత్వంలో సహ యీపని ఆపని అనే భేదం లేక, నీచానీచాలను చూడక, అన్ని రకాల పనులను చేస్తూవుంటారు. పాయిఖానాపని చేసేది తెలుగువారు. రోడ్లమీది పేడను యెత్తేది, చెత్తను తుడిచేది, తెలుగువారు. మురుగుకాలువలను శుభ్రంచేసేది, పెంటకుప్పలను తగులబెట్టేది, తెలుగువారు. రయిల్లవద్గర, స్టీమర్లదగ్గర, మూటలను మోసేది తెలుగువారు. పాయిఖానాబండ్లను తోలేది, సరకుల బండ్లనులాగేది, రిక్షాలను యీడ్చేది, గోచీలుపెట్టుకొని బారులుతీర్చి రోడ్లమీద పడుకొనేది, ప్రత్యేకంగా తెలుగువారే. ఇటువంటి పరిస్థితులలో చిక్కుకొని, ఒకకట్టడి, నాయకుడు, ఒక మంచిచేష్ట, ఒకయిల్లువాకిలి, ఒకపండుగపర్వం, ఒకదేవాలయం వుత్సవం లేక దేశంనుండి యేచాపచుట్ట, యేమాసినప్రాణగుడ్డ, యేకుండబొచ్చాలతో దిగుతున్నారో వాటితోనే పోయే మహాజనులను లోకులు చులకనగా చూస్తూ, జాతిమీదనే ఒకవిధమయిన అసహ్యాన్ని, అసూయను కలిగివున్నారంటే ఆశ్చర్యం యేమీ లేదు. పోనీకూలిపని చేసుకొని బ్రదుకుదామన్నా బర్మాలో యెక్కడకు పోయినా మేస్త్రీ లేని పనిలేదు. ఇండ్లకు మేస్త్రీ, లంజలకు మేస్త్రీ, లంచాలకు మేస్త్రీ, పనిపాటలకు మేస్త్రీ, కదిలితే మేస్త్రీ, మెదిలితే మేస్త్రీ. ఇట్లా మేస్త్రీలమధ్య యిరుక్కొని, బిగుసుకొని, తన్నుకొంటున్నారు మనకార్మికులు.

ఇక్కడి కార్మికనిర్మాణము యావత్తు మేస్త్రీమీదనే ఆధారపడివుంది. మేస్త్రీ అంటే కూలికాంట్రాక్టరు. కార్మికజనబాంధవుడగు సి. యఫ్. ఆండ్రూసుగారు బర్మాకు వచ్చినపుడు మేస్త్రీపద్ధతిని గురించి మీఅభిప్రాయం యేమని అడిగితే వారిట్లా చెప్పారు:—

"కాంట్రాక్టుకూలిపద్ధతి చాలా అనర్థాలను కలిగివుంది. ఈపద్ధతియందు శరీరకష్టం చేసేవానికి స్వల్పఆదాయమున్ను, ఏపని చేయని మధ్యవర్తి విశేషలాభం పొందటమున్ను సంభవిస్తోంది. ఇతరపద్ధతులలోకన్నా దీనిలో లంచపంచాలకున్నూ చాలా వీలుంది. వాషింగుటన్‌లో జరిగిన అంతర్జాతీయ కార్మికమహాసభయందు కాంట్రాక్టు సబ్‌కాంట్రాక్టు కూలిపనిని ఖండిస్తూ యజమానే కూలియివ్వటం శ్రేయస్కరమని తీర్మానించారు. మేస్త్రీ పద్ధతిని తీసివేసి యజమానే కూలి యిచ్చే యేర్పాటు చేయటం అవసరం"

నాగరికప్రదేశాల్లో కాంట్రాక్టు కూలిపద్ధతి అంతరించినప్పటికిన్నీ బర్మాయందింకా అది గుదిబండవలె మెడకు తగులుకొనే వుంది. ఈకాంట్రాక్టుపద్ధతిలో కార్మికుని క్షేమానికి సంబంధించిన బాధ్యత యజమానిపైనుండి కూలిమేస్త్రీ పై పడటంచేత కార్మికులకు గావలసిన ఇంటివసతులు, వైద్యసహాయం, ఆరోగ్యరక్షణం, పనిచేయవలసినకాలం, కూలినిర్ణయం, దెబ్బలు తగిలినవారికిన్ని, ప్రాణం పోయినవారికిన్ని సహాయం, యిటువంటి వుపయోగకరమైనపనులు వుపేక్షింపబడుతున్నవి. యజమానికి సంబంధం తప్పిపోతోంది. ఇక మేస్త్రీకి స్వలాభంతప్పితే కార్మికుని క్షేమంపైన అభిలాషే లేదు. ఈ వ్యవహారం యిట్లావుండగా యితరయిబ్బందులుకూడా కొన్ని కలుగుతున్నవి. పనిలో చేరేటప్పుడు రుసుములు చెల్లించాలి. చేరినతర్వాత కోతలు, పద్దులు, భత్యకర్చులు, మామూళ్లు పీక్కుతింటవి. ఇట్లా కార్మికుడొకవైపున కార్మికునితో సంబంధంలేని యజమానివల్లను, ఇంకోవైపున సానుభూతిలేని మధ్యవర్తివల్లను కృశిస్తూ అనేకకష్టాల పాలవుతున్నాడు.

కాంట్రాక్టు కూలిపనులలో బియ్యపుమరలపని, ఓడలరేవుమతిదిగుమతిపని, బి. బి. యస్. యన్. ఖ్యాగేజిపని, పోర్టుట్రస్టుపని—వీటివిషయమై కిల్లడిలోకి వచ్చిన అక్రమాలు మిక్కిలి అధ్వాన్నంగా వున్నవి. బర్మాప్రభుత్వంవారి కార్మికవ్యవహార పరిశోధనాధికారి

జె. జె. బెన్నిసన్, ఐ. సి. యస్. గారు క్రిందటి సంవత్సరంలో ప్రకటించిన రిపోర్టును చూస్తే (76 పేజీనుండి 80 పేజీవరకు) ధాన్యపుమరలలోని అక్రమం బోధపడుతుంది. ధాన్యపుమరల పని సామాన్యంగా (1)ధాన్యాన్ని తట్టలతో మోయటం, (2) బియ్యాన్ని బస్తాలలో పట్టి, తూచి, కుట్టటం, (3) బస్తాలను కమాను చేయటం, (4) గోదాంనుంచి బస్తాలను పడవలలోనో, రాయిలువేగనులలోనో వేయటం—యీవిధంగా వుంటుంది. ఈపనులన్నిటికీ జవాబుదారీగా ఒక పెద్దమేస్త్రీయున్నూ, ఆయాశాఖల పనులకు చిన్నమేస్త్రీలున్నూ వుంటారు. మిల్లుయజమాని దగ్గర హెచ్చురేటును పుచ్చుకొని కూలీలకు తక్కువరేటును యివ్వటంవల్ల, మరలో జరిగేపని కంతకున్నూ వారంవారం చేసేబిల్లుమీద నూటికి రు 15ల చొప్పున యజమానిదగ్గర పుచ్చుకొనే కమిషన్‌వల్ల యేర్పడే లాభం కాకుండా ఆయాశాఖల గ్యాంగుమేస్త్రీల బిల్లులలో, అనగా గంపకూలీలదగ్గర నూటికి రూ 6లు మొదలు రు 12లున్నూ, పట్టుకుట్టువారిదగ్గర రు 10 లు మొదలు రు 15 లున్నూ, బస్తా మోసేవారిదగ్గర రు 10 లు మొదలు రు 30 లున్నూ, మిల్లులో పనిచేసే యీనెత్తుకూలీల దగ్గర ఒకవారం బిల్లున్నూ తీసుకొనే దురభ్యాసం స్థాపించుకొనివుంది. పెద్దమేస్త్రీ యీవిధమయిన తగ్గింపులతో బిల్లును గ్యాంగుమేస్త్రీలకు యిస్తే అక్కడనుంచి వీరితగ్గింపులు వీరు మొదలుపెట్టుతారు. కుట్టుపనికి యిచ్చేరేటులో నూటికి అయిదురూపాయల కమిషన్; పెద్దమేస్త్రీ నూటికి రు 0-9-6 చొప్పున యిస్తే రు 0-8-0 మాత్రం యివ్వటం; 84 గురు మాత్రం పనిచేస్తే 40మంది మీద ఆసామ్మును పంచి పనిచేయని అగ్గురవాటాలను తీసుకోవటం—యీవిధమైన లాభాలు కుట్టుపట్టు చేమేస్త్రీకి వున్నవి. ఇదేవిధంగా బస్తా చేమేస్త్రీయున్నూ పెద్దమేస్త్రీ యిచ్చేరేటులో నూటికి అయిదురూపాయల కమిషన్, 84గురు పనిచేస్తే 39గురు మీద ఆసొమ్మును పంచి అయిద్దరి వాటాలను తీసుకోవటం కలదు. ఇదిగాక యీచిన్నమేస్త్రీలు తమ చేతిక్రింద పనిచేసేవారిదగ్గర ఒకవారం, లేదా రెండువారాల బిల్లును పుచ్చుకొంటారని వాడుక. మొత్తాన పట్టు, తూకం, కుట్టులకున్నూ, మోతకున్నూ సంబంధించిన పనికై మిల్లుయజమాని రు 591-4-9లు యిచ్చినట్టయితే ఆసొమ్ము యీవిధంగా పంపిణీఅగునని బెన్నిసన్ గారి రిపోర్టులో వ్రాసివున్నారు:

| | |
|---|---|
| పెద్దమేస్త్రీ | రు 175-4-9 |
| కుట్టుచేమేస్త్రీ | ,, 50-0-0 |
| బస్తాచేమేస్త్రీ | ,, 23-14-0 |
| కుట్టుకూలీలు | ,, 153-0-0 |
| బస్తాకూలీలు | ,, 189-2-0 |
| మొత్తం | రు 591-4-9 |

ఓడలలో యెగుమతిదిగుమతి పనులను చేయించే మేస్త్రీపద్ధతియందలి అనర్థాలకున్నూ తక్కువలేదు. రంగూను మొదటి యెడ్డిషనల్ మేజస్ట్రీటుగారి కోర్టులో 1926 సం॥లో విచారణఅయిన 309 నెంబరు క్రిమినల్ కేసులో ఒకవిచిత్రమైన దస్తావేజు దాఖలయినది. దానిలో యీప్రకారంగా వ్రాయబడి వుంది:—

"ఇప్పటివరకు నేను చేయుచున్న బి.ఐ.యస్.యన్. కంపెనీలో వాడలలో కూలీలుసప్లయి వ్యవహారములో నాసమ్మతిని నాతో మిమ్ములను జాయింటుగా చేర్చుకొని మనము యిద్దరము కలిసి పనివాళ్లను సప్లయిచేసి యీక్రిందను వుదాహరించిన లాభములను ఖర్చులుపోను మనమిరువురమూ సమానముగా ప్రతీపది పేనుదినముల బిల్లునకు పంచుకుంటూ, పని సప్లయిచేయుటకు యీఖరారునామా మీకు వ్రాసియిస్తిని. (1) ప్రతిబస్తావాడకున్నూ కంపెనీ ఆర్డరుప్రకారము గాంకి 1 కి 17 జనము అయివుండంగా మనము మామూలు 15 జనము పంపిస్తూ మిగతి యిద్దరను మినహాయించి సదరు మినహాయింపుగా వచ్చిన లాభమున్నూ, (2) పెంకువాడకు కంపెనీ ఆర్డరుప్రకారము 20 జనము అయివుండగా మనము 17 మందిని పంపుచుంటిమి—సదరు ప్రతి గాంగునందున మిగిలిన ముగ్గురు పయికమున్నూ, (3) ప్రతిస్టీమరుకున్నూ వాంచిపనివాళ్లకు 8 జనము అయివుండగా మనము నలుగురను పంపించుచుంటిమి—అందుల మిగతా నలుగురు పయికమున్నూ, (4) ప్రతిగాంకి మేస్త్రీకిన్ని కంపెనీవారు రు 1-13-0లు యిస్తూ వుండగా మనము ఒకరూపాయ యెనిమిది అణాలు యిచ్చుచుంటిమి—అందున ప్రతిమేస్త్రీకి మిగిలిన అయిదు అణాలుగాక ప్రతిబిల్లునకు భత్యఖర్చునకు ఒక రూపాయయున్నూ, (5) ప్రతిబిల్లునకు వాంచిపనివారలు జనము 1 కి యిచ్చుచున్న తొమ్మిదిఅణాలున్నూ, (6) ప్రతిసం॥ గాంకి మేస్త్రీలున్నూ, వాంచిపనివారలున్నూ యిచ్చుచున్న రెండుపద్దులున్నూ—మనమిరువురము సమానముగా పంచుకోగలవారమని వ్రాసియిస్తిని. ఈపనిలో నేనూ మీరూ వున్నంతకాలము మిమ్ము నేనుగాని, నన్ను మీరుగాని పనినుండి తప్పించినయెడల పదివేలరూపాయీలు యిచ్చుకోగలవారమని మనమిరువురము తీరుమానించుకోవడమయినది. (7) ఇప్పటివరకు నాకు యిచ్చటవున్న ఆరువేలరూపాయలు ఋణము బాపతుకున్నూ మనకు వచ్చినలాభమునుండి యెనిమిది అణాలు అప్పుతీర్చి మిగత యెనిమిదిఅణాలు సమానముగా పంచుకోగలవారము. మరతు: ప్రతిసంవత్సరమున్నూ డిశెంబరు ది 25వ తేదిని వుద్యోగస్థులకు యిచ్చుచున్న మామూళ్లు మనము యిరువురు యిష్టము పయిని యిచ్చుటకు నిర్ణయించుకోవడమయినది."

ఇప్పటికి పదేండ్లక్రిందట డెక్కుప్యాసెంజర్ల కష్టాలను విచారించేదానికై బర్మాప్రభుత్వంవారు వొకకమిటీని యేర్పరచారు. ఆ విచారణసందర్భంలో బి.ఐ.యస్.యన్. కంపెనీ మేనేజరు బెల్లుగారికి బ్యాగేజికూలీలు వొకఅర్జీని పంపుకొనిరి. అందులో బ్యాగేజికూలీల కాంట్రాక్టరు మూడేండ్లనుండి యేమి కూలీయివ్వలేదనిన్ని, దీనికి బదులుగా ప్యాసెంజర్లదగ్గర సొమ్ము వసూలుచేసుకోమన్నాడనిన్ని, పనిలో చేరేటప్పుడు 8 రూపాయలున్నూ, ఆతరువాత నెలకు 2 రూపాయ

లున్నూ యివ్వవలసి వున్నదనిన్నీ, 7 లేక 8 రూపాయలు పెట్టి తను దుస్తులను తామే కొనుక్కొంటున్నామనిన్నీ, తమకంట్రాక్టరు చెయిస్తూవుండిన గ్రాహము అందుకోయొక్క, పోర్టుట్రస్టుయొక్క పనులను కూలియేమి యివ్వకుండానే చేయిస్తూ వుండినాడనిన్నీ, వివరించి వున్నారు. (డెక్కుప్యాసెంజరు కమిటీరిపోర్టు 39, 40 పేజీలను చూడండి.) తరువాతను, క్రిందటిసంవత్సరం జరిగిన పోర్టుట్రస్టు వుద్యోగస్థుల మానసష్టపుకేసు అప్పీలు తీర్పులో న్యాయమూర్తులగు డార్ర్విడ్జు కార్ గార్లు యీప్రకారంగా వ్రాసివున్నారు:—

"ఏ-గురుతు దాఖలాయొగ్గిబిట్టులోని జనుపద్ధతుల విషయమై నరసింహారావు యిట్లా చెప్పుతున్నాడు:—'గ్యాంగుకూలీలదగ్గర తీసుకొనే కమ్మిషన్, గ్యాంగుమేస్త్రీలదగ్గర పుచ్చుకొనే ప్రవేశరుసుము, కూలీలను పెట్టనిదే పెట్టినట్టుగా బిల్లుచేసి పోర్టుట్రస్టువారి దగ్గరను పుచ్చుకొనే సొమ్ము మారీఫత్తులెక్క తాలూకు ఆదాగా ఉన్నవి. ప్రతికూలిదగ్గర (బ్యాగేజీ?) నెలకు 9 రూపాయలున్నూ, సూలీగ్యాంగు దగ్గర 25 రూపాయలున్నూ పుచ్చుకొంటూ వుంటిమి.' దీనివల్ల ఏ-గురుతు దాఖలా యొగ్జిబిట్లు అక్రమంగా చేసినవసూళ్లకున్నూ, లంచపం చాలఖర్చులకున్నూ సంబంధించిన ఖాతాబుక్కుగా కనుపిస్తుంది... ...ఏ, బి-గురుతుల యొగ్జిబిట్టులలో వున్నదంతా శుద్ధ అబద్ధమనిన్నీ, అపద్దులన్ని యిష్టంవచ్చినట్టుగా వ్రాయబడినవనిన్నీ కే. సి. వెంకటరెడ్డి సాక్ష్యపు సారాంశం. అయితే యీకథను నమ్మటానికి యేమాత్రమున్నూ వీలు లేదు."

మేస్త్రీపద్ధతిలో జరుగుతూవుండిన అక్రమాలనుగురించి యింతకన్నా ప్రబలమైన సాక్ష్యం దొరకటం కష్టం. ఇంతకుబ్లీ బయటపడ్డా ఆయా యజమానులుగాని, ప్రభుత్వంవారుగాని, యింతవరకు యీవిషయంలో యేవిధమయిన చర్యను తీసుకొన్నట్టు కనుపడదు.

ఇక సాంఘికపరిస్థితులను చూస్తే యెంతఅధ్వాన్నంగా వుండాలో అంత అధ్వాన్నంగా వున్నవి. మనదేశస్థులలో చాలామంది సంసారాలను దేశంలో వదలిపెట్టి ఒంటరిగా రావటంచేత స్త్రీపురుషుల సంఖ్యలో విశేషవ్యత్యాసం వున్నది. 1921 సం. పు జనాభాలెక్క ప్రకారం బర్మాయందలి తెలుగువారిలో 1,25,413 మంది పురుషులును, 27,095 మంది స్త్రీలును కలరు. జిల్లాలనుబట్టి చూస్తే యీ విధంగా వున్నారు:—

| జిల్లా | పురుషులు | స్త్రీలు |
| --- | --- | --- |
| గంజాం | 21,907 | 1,366 |
| విశాఖపట్నం | 18,539 | 3,576 |
| గోదావరి | 21,118 | 4,175 |

ఈపై అంకెలనుబట్టి గంజాంవారిలో పదహార్గురు పురుషులకు ఒక్కస్త్రీయున్నూ, విశాఖపట్నంవారిలో అయిదుగురకు ఒకరున్నూ, గోదావరివారికి ఏడుగురకు ఒక్కరున్నుఅని తేలుతోంది. స్త్రీపురుషులలో వ్యత్యాసం యింత అధికంగా వుండుటవల్ల స్త్రీకి వొకవిధమయిన గిరాకి యేర్పడి దెబ్బలాటలు, ఖూనీలు, రంకుతనం, లంజలకొట్లు, సుఖవ్యాధులు మొదలయిన అనర్థాలకు వ్యాధి యేర్పడుతోంది. ఇక్కడకు వచ్చేవారిలో చాలామందికి దేశంలో వొకసంసారం వుండటంచేత యిక్కడ యేర్పరచుకొనే సంబంధం తాత్కాలికమయిందిగా వుంటున్నదిగాని స్థిరమయిందిగా లేదు. సంపాదన తక్కువగాను, ఇండ్లబాడుగలు అధికంగాను వుండటంచేత 8, 9, మంది వుండవలసినచోట 30,40,50 మందివుండే చెప్పిన గాలి, వెలుతురు లేని చీకటి కోణాలల్లో గోనెసంచుల తెరలు కట్టుకొని కాలక్షేపం చేస్తున్నారు. తెరలోపల స్త్రీపురుషులుంటే తెరచాట్లు పరాయివారుంటారు. ఇటువంటిస్థితిలో స్త్రీయొక్కపరువు యెట్లా నిలుస్తుంది? ఈసంబంధాలవల్ల కలిగే సంతానంలో మగపిల్లలను భేదోప్యంగా తండ్రికులంలో కలుపుకొంటూ ఆడుపిల్లలను వదలిపెట్టటంచేత సంకరజాతివారు అగుచున్నారు. ఈయాడుపిల్లలలో చాలామంది గదుఘసంఖ్యలు వచ్చియున్నవారు కావటంచేత తగినసంబంధాలు దొరకటం చాలాకష్టముగా ఉన్నది. రంగూను పెంకెంట్లనుగురించి యిక్కడి ఆడుపిల్లల వుద్దేశాలు యేమిటంగా వుంటున్నవో తెలిపేదానికై వారిలో ఒకరు వ్రాసిన వుత్తరంలోని యీక్రింది భాగాన్ని యెత్తి వ్రాస్తున్నాను:—

"ఈవూరిలో చాలామంది దేశంలో వివాహాలు చేసుకొని అక్కడ తమభార్యలను వదలి వొంటరిగా వచ్చినవారుగా వుంటున్నారు. ఇక్కడ వీరివేషాలు గిమాలు, నీట్లు గోట్లు, ఒడుపులు వొయ్యారాలు, మురుగులు దండకడియాలు, యెగ్రతలపాగా కిర్రుచెప్పులు—వీనిని మామసలిముండలు చూచి వీరంతా యేమో సంపాదనపరులని భ్రమపడి మమ్ములను వీరికి అంటగట్టి మాగొంతులు కోస్తున్నారు. ఈవివాహాలు చేసుకొన్నవారిలో చాలామంది కొద్దిపాటి సంపాదన గలవారు. ఇటునంటి వారికి దేశంలో వొకసంసారం, ఇక్కడ రంగూనులో యింకొసంసారం. ఇట్లా రెండుసంసారాలుపెట్టుకొని యింత ఖరీదుగల బస్తీలో యీదేదియెట్లా? కడుపునిండా అన్నం, కట్టుకొనేదానికి బట్ట, పడుకొనేదానికి సరియైనచోటు, పీల్చేదానికి శుభ్రమయిన గాలిలేక మొగంవాచి, పరాయివాళ్ల దెప్పులనున్నూ, యెగతాళులనున్నూ వోర్చుకొని మేము పడుతూవుండే కష్టాలు లోకుల కెట్లాతెలుస్తవి! మమ్ములను మాతల్లులే వ్యభిచారిణులుగాచేసి మావల్ల జీవిస్తూన్నారంటే నమ్మదగినమాట కాదు. ఎవరైనావుంటే వుండనూవచ్చు. అయితే, తమభార్యలను పోషింపలేక రాత్రులందు లంబాగాడీల్లో యెక్కించుకొని వీధులవెంట తిప్పేమగవాళ్ల సంగతి యేమంటారు? ఇది పురుషులకు తగిన పౌరుషజీవనం కాదు. ఇట్లా మిణికేవారికే మేము వొకపిల్ల తల్లి అయితేనూ పనికిరావటంలేదు. ఎప్పటికప్పుడు వీరికి క్రొత్త పిల్లలు కావాలి. ఎక్కడనుండి వస్తారు? ఎందరిని యిట్లా వీరు యేడిపిస్తారు?"

పోనీ, బ్రతంచెడ్డా సుఖమైనా దక్కితే కొంతమేలే. కాని, అదిన్నీ కనుపడదు. బర్మాలో తెలుగువాళ్లు వర్షంమీద నెలకు 20 రూపాయలు సంపాదిస్తే గొప్ప. ఇట్లా నెలకు 20 రూపాయలు సంపాదన గలవారి విషయములో జె. జె. బెన్నిసన్. ఐ. సి. యస్. గారు ప్రకటించిన జీవనవ్యయమునుబట్టి నెలకు అన్నానికి రు 7-3-11లు, బట్టలకు రు 0-15-11లు, యింటి అద్దెకు రు 0-15-4లు, కట్టెలు దీపాలకి రు 0-12-7లు, యింటి సామగ్రికి రు 0-4-5లు, చిల్లరఖర్చులకు రు 3-4-9లు; మొత్తాన రు 14-2-11లు పోను మిగిలే మొత్తంతో దేశములోని సంసారం గడుపవాలి. ఇది ఒంటరిమనిషి ఖర్చుగాని ఆడుమనిషితో కాపురంచేసేవానిఖర్చు కాదు ఈమిగిలేదానితోనే దేశములో పెండ్లిళ్లు పేరంటాలు, పండుగలుపర్వాలు, గురువుసంభావన, రోగంనొప్పి, శ్రాద్ధం తీర్థం, యిల్లు వాకిలి-యిన్ని జరగాలి. ఎల్లాగో దేవునికే తెలియాలి. దేశంలో చాలకుండా బర్మాకు వచ్చి ప్రాణాలు నిలుపబెట్టుకొంటున్నారేమోగాని కూలీలు కుబేరులవుతున్నారంటే అది అసాధ్యమైనపని. ఆత్మగత్యం అంటే యేమో తెలియక, ఆత్మగౌరవములేక గొర్రెల లాగున కారుచవుకకూలికి వచ్చిపడే యీ "కలా" ప్రవాహంవల్ల యజమానికిన్ని, మేస్త్రీకిన్ని తప్ప మరెవ్వరికిన్ని లాభంలేదు. ఒకడు పోతే పదిమంది వస్తూన్నారు. బర్మాలోని పరిస్థితులు మనదేశస్థులు ఖండిస్తూవున్న యే యితరదేశాలలోని వాటికిన్ని తీసిపోవటంలేదు. ఈఅనర్థాలన్నిటికిన్ని మేస్త్రీపద్ధతే ప్రబలమైన కారణంగా వుంది. బహ్వనర్థకరమైన యీపద్ధతి నిర్మూలనమైతేగాని కార్మికుస్థితి బాగుపడజాలదు. దీనికి మీరు తోడ్పడుదురా ?

# స్త్రీలు రాజకీయమున పాల్గొనువిధము

అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మ గారు

## ౧

### ప్రస్తుత రాజకీయోద్యమము

నేటికి నూరు సంవత్సరములు క్రిందట ఆ 1825 సం. సెప్టెంబరు 4 వ తేదీని బొంబాయి నగరరాజమందు పారసీకకులమున భారతీయులకందరకును తండ్రి (దాదా)యు, అన్న (భాయి)యునై వారలకు ముక్తిమార్గము చూపవలసిన మహామహుడు దాదాభాయి నౌరోజీగా రుదయించిరి.

దాదాభాయి నౌరోజీగారి జీవితమున కంతకును మకుటప్రాయముగ నెన్నదగినది దేశీయ మహాజనసభ (కాంగ్రెసు)స్థాపనము. వీరును, భారత దేశమున సానుభూతిగల వెడ్డర్ బరన్, హ్యూము అను ఇరువురాంగ్లేయులును కలిసి మొట్టమొదట 1885 సం లో కాంగ్రెసు మహాసంస్థను స్థాపించిరి.

శ్రీదాదాభాయి నౌరోజి కాంగ్రెసుకు మూడు పర్యాయములు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. తుది పర్యాయము 1906 సం లో కాళీఘట్టక్షేత్ర సమావేశమందు "భారత దేశమునకు స్వరాజ్యమే గమ్యస్థాన" మని భారతపితామహుడగు నౌరోజిగారు తమయధ్యక్షపీఠము నుండి సింహనాద మొనర్చిరి. ఆ స్వరాజ్యనినాదమే నేడు భారతభూమియందంతటను మారోగుచున్నది. అప్పటి నుండియు భారత దేశమందు నూతనశక మారంభ మయ్యెను. భారత పితామహుడు భీష్మునివలె తనబిడ్డలకు ధర్మము లుపదేశించుచు 1917 సం.లో తన 92 వ యేట పరమపదించెను.

ఆయన శిష్యుడగు సర్ ఫిరోజిషా మెహతా, ఆతనిశిష్యులగు జస్టిసు రానడే, గోపాలకృష్ణ గోఖలేల పని ఈయన బ్రతికియుండగానే సాంతమయ్యెను. ఇంకొకవంక బాలగంగాధరతిలకు, అరవిందఘోషు, బిపినచంద్రపాలు మొదలగు జాతీయవాదులు పనిచేయు చుండిరి.

గాంధి మహాత్ముడు భారత దేశములో తనపని 1914 సం.లో ప్రారంభించి తాను కైరా, ఛాంపరాను లలో నడపిన సత్యాగ్రహములు చూడగలైను; భారత స్వరాజ్యప్రయత్నమున ఆందోళనాయుగములు రెండును చూడగల్గెను. తాను ప్రారంభించినపని ఇట్లు విజృంభించి వృద్ధిజెందుటయును, దానిని చూడగల్గుటయు ఇట్టి పుణ్యాత్ములకు తక్క తదితరులకు దుర్లభము కదా! కావున, సోదర సోదరీమణులారా! త్యాగమునకు జంకవద్దు. మీ సర్వమును దేశమాత పాదపద్మముల కడ సమర్పించుడు. అప్పుడుగాని మీకు దివ్యపురుషుడు సాక్షాత్కారమై మోక్షపాయస మొసంగడు. స్వాతంత్ర్యమే స్వర్గలోకము. "సర్వం పరవశం దుఃఖం, సర్వం ఆత్మవశం సుఖం"— ప్రతిప్రాణికిని ఇట్టిస్వాతంత్ర్య ముండుట యీశ్వరేచ్ఛయై యున్నది. అందుచే ఇది ప్రతివానికి జన్మహక్కు అయి ఉన్నది.

"స్వరాజ్యము నాజన్మహ"క్కని తిలక్ మహాశయుడు సూత్రప్రాయముగ నిర్వచించియున్నాడు. దీనిని హరించుటకు ఎవరికిని వలనుపడదు. ప్రతి పురుషుడును, ప్రతిస్త్రీయును "నే నీవర్తమాన సంగ్రామమున హిందూదేశపక్షము నవలంబించితినా?" యను ప్రశ్నను ముఖ్యముగా వేసికొనవలయును. నిశ్చలమగు సాహసవర్తనము మన దేశమున కిప్పు డవసరము కావున కాంగ్రెసులోని ప్రతి

జెలిగేటునుగూడ కాంగ్రెసు వాలంటీరుగా చేరవలసియున్నది. ప్రతి కాంగ్రెసుసమితి మెంబరును కాంగ్రెసు వాలంటీరు కావలసినదే. దేశమంతయు కాంగ్రెసు ప్రచారమునకై వదలిరావలసినదే. ఈవర్తమాన సమరము ముగియువరకును మన సాధారణ దినచర్యల నన్నిటిని గట్టిపెట్టుదము. భారత దేశపురుషులారా! భారతవనితలారా! కర్తవ్యమును బూనుడు! కర్మక్షేత్రమున దిగుడు! ఈయవకాశము గతించిపోక పూర్వమే కార్యశూరులు గండు!

## ౨

### ఖద్దరుధారణము—రాట్నము

ఈస్టుఇండియాకంపెనీ మన భారతవర్షమునకు రాకపూర్వము ప్రశాంతములగు పల్లెటూళ్లలో కుటీరములలో, సర్వశోభనములతో కలకలలాడుచుండు పరమపావన గృహాంగణములలో, పుణ్యసతీమణుల మృదుల హస్తములలో సర్వలోకమంగళప్రదము లగుచున్న లలితకళలు, పరిశ్రమలు ఎట్లు కాలక్రమమున నాశనమయ్యెనో దృష్టాంతపూర్వకముగ తెలుపు శ్రీ రమేశచంద్రదత్తు గారు మొదలగు గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథములను చూడుడు. పరిశ్రమలలోనికెల్ల నతిముఖ్యమగు చేతిపరిశ్రమను ముందుగ పెంపొందించుటకు నేడు మహాత్ముడు పూనికొనియున్నాడు. దానికొరకే యెల్లరును రాట్నమును చేపట్టుడని యుపదేశించుచున్నాడు. గృహపరిశ్రమల పునరుద్ధరించుటకు ఈరాట్నమంత్రమే కీలకము. రాట్నము రాట్నమనగ ఒక్క కొయ్యచక్రమే గాదు. వర్తమాన కాలమందు లోకమంతటను ప్రబలిన నీతిదూరము లగు ధనార్జనాపద్ధతులను, అభిరుచులను, వేగము - తమోగుణ పూరితమును, దుష్టకలిరూపధారిణియు నగు నవనాగరికతా వ్యామోహమునే మరల్చి, సత్యమును, నిరాడంబరమును, నీతియుతంబును నగు జీవితపథమును లోకంబునకు ప్రసాదించు మహాద్భుత శక్తి యీరాట్నమందు గలదు. అట్టిదివ్యదృష్టితోడనే మహాత్ముడు లోకమునకు రాట్నమును ప్రసాదించుచున్నాడు. రాట్నము స్త్రీల పాతివ్రత్యమును తప్పక కాపాడును. ఏలనగ:—

ఇప్పుడు మన దేశములో వేలకొలది స్త్రీలు కట్టుకొనుటకు సరియైన గుడ్డలైనను లేక పల్లెకు రోడ్లమీద రాళ్లు పగులగొట్టుట మొదలుగా గల కూలిపనుల చేసుకొని బ్రతుకుచున్నారు. వీరి శీలసంరక్షణమునకు తరుచుగ భంగము కలుగు పరిస్థితు లనేకములు సంభవించుచున్నవి. కాని యీరాట్నమువల్ల వీరందరికిని మానసంరక్షణము జరుగగలదు. సోదరీమణులారా! మన దేశములో అనాదినుండియు రాట్నమే రెండవవృత్తిగ నుండెడిది. అత్యద్భుతమగు రవసెల్లాలు నేసి నిరుపమానమగు కళాకౌశలమును జూపి ప్రపంచమునంతను మోహింపజేసిన యీరాట్నపు వృత్తి మాయమైపోయినది. ఇది నశింపగనే మనకు హాని పతనము, దారిద్ర్యదశ సంప్రాప్తమైనవి. తిరిగి యిప్పుడట్టి పురాతనకళను పునరుద్ధరింపబూనుట మీధర్మము.

కొందరు స్త్రీలు ఖద్దరువస్త్రములు మోటందురు. చెల్లెలారా! భారత దేశపు హానిపతనము మోటు ఖద్దరు కంటె మోటయినది. భారత దేశపు దారిద్ర్యము కటిక మోటు ఖద్దరుకంటె నూరురెట్లెక్కువ మోటైనదని గ్రహించుడు. భారతవనితలారా! ఖద్దరువలన గూడ స్వరాజ్యమును సంపాదించుటకు మనము లజ్జా, లోభ, భయ, భ్రాంతు లను శృంఖలములను త్రెంచవలసియున్నాము. ఆత్మకళంకములను బాయవలయును. లజ్జయన అసమంజసమగు సిగ్గు. స్వదేశీయమైన ముతకగుడ్డను ధరించుటకు జంకజేయునట్టి సిగ్గు పోవలయును.

## 3

### దేశభక్తి-పాతివ్రత్యము-నీతి

ప్రతి దేశమందును వివిధమతస్థులవారుందురు. కాని దేవుని యాదేశములు సర్వ మతస్థులకును ఒకేవిధముగ నన్వయించును. సంఘమునందు, దేశమునందు స్త్రీపురుషు లిరువురు నుందురు. పురుషులకెట్టివిధులుండునో స్త్రీలకు

గూడ నట్టివిధులే యుండును. స్త్రీలు తప్పించుకొన జాలరు. భారత స్త్రీలు రానురాను సుకుమారులై, సోమరులై, దేశ హితమునందు పాల్గొనక మూలబడి యుండుట చాల దుఃఖకరమగు సంశము. నూర్జహాను, చంద్బీబి, ఝాన్సీ రాణి లక్ష్మీబాయి, రెజియాను, అహల్యాబాయి, పార్వతి మున్నగువారు పూర్వము భారత దేశమున నుండిరా యని నేటిచరిత్రపాఠకులు శంకింతురు! కాని నేడుగూడ వీరమాతలు, దేశసేవాతత్పరలునగు నారీమణులు మనలో నున్నందులకు ఈశ్వరునికి మ్రొక్కుచున్నాను.

గాంధిమహాత్ముని సతి, దాసుసతి, నెహ్రూసతి, సరోజినీదేవి, అనసూయాబాయి, సరళాదేవి, బేగం మహమ్మదాలి, బేగం అన్సారి, బేగంక్వాజా, బేగం హాజరతు మోహాని, వున్నవ లక్ష్మీబాయమ్మ, దువ్వూరిసుబ్బమ్మల వంటి దేశసేవకురాండ్రు కొందరు గలరు. ఈ నారీమణులలో బలువురు రాజ్యకార్యధురంధరిత్వమునందును, కొందరు పాతివ్రత్యమునందును, కొందరు విద్యావినయాది సద్గుణములయందును, కొందఱు దానధర్మాదులయందును ప్రసిద్ధిని గాంచిరి. పురుషులు విశేష విద్య నేర్పినచో స్త్రీలును అసామాన్యబుద్ధిచాతుర్యములను జూపి పురుషుల కనేకవిషయములలో సాయముచేసి యర్ధాంగులన్న నామమును సార్థకపఱుతురని నొక్కి వక్కాణించుటకు సందేహము లేదు. ఈశ్వరానుగ్రహమువలన జగత్తునందెప్పుడెప్పుడెచ్చటెచ్చట స్త్రీలకు రాజ్యాధికారము దొరకెనో యప్పుడప్పుడచ్చటచ్చట స్త్రీలు పురుషులకంటె నధికధైర్యముతోను, అధిక నీతితోను, అధిక న్యాయముతోను రాజ్యము జేసిరని చరిత్రముల వలన దేటపడుచున్నది.

పురుషులవలె ధైర్యము నవలంబించి భీతిం జెందక, సర్వకార్యములను నిర్వహించునటుల స్త్రీలకు విద్య నేర్పవలయును. భర్త ధనహీనుడనియు, విద్యాహీనుడనియు భార్య యాతనిని విడిచినట్టి యుదాహరణము లీదేశమునందు వెయ్యికుటుంబములలో నొకటి దొరకునో లేదో సంశయింపవలసి యున్నది. స్త్రీలకు బహుపాతరహితులై పురుషులు విశేషవిద్య నేర్పినచో స్త్రీలును అసామాన్య బుద్ధిచాతుర్యములను జూపి పురుషుల కనేక రాజ్యాంగ విషయములలో సాయముచేసి యర్ధాంగు లన్న నామమును సార్థకపఱుతురని నొక్కి వక్కాణించుటకు సందేహము లేదు. పూర్వమాంధ్ర దేశమునందు పూజనీయ లగు వీరపత్నులు, వీరమాతలు, వీరభగినులు అనేక లుండుట వలననే యాంధ్ర దేశములోని బ్రాహ్మణులలో గూడ క్షాత్రతేజ మత్యంతప్రబలమయి యుండెనని వీరమాత చానమ్మకథ చెప్పుచున్నది. పతిభక్తియే స్త్రీలకు భూషణము. అదియే యుత్తమవ్రతమును, ఉభయలోకములందును కొనియాడబడినదియును అయియున్నది. కావున పెనిమిటియందు భయము, భక్తి, వినయము, అనురాగము కలిగి నడచుకొనవలయును. పాతివ్రత్యము బాడుచేసి కొని పాపాత్మురాం లొకవేళ సత్కర్మములను జేసినను అవి దుష్కర్మములక్రింద మారి తుదకు దుఃఖమును గలిగించును గాని లేశమయినను సుఖమును గలిగింపవు. పతివ్రతలయొక్క ప్రభావముచేతనే భూతలమంతయు నంతరమును నిలిచియున్నదనియు, పతివ్రతల విషయమున బ్రహ్మాదిదేవతలు భయపడుచుందురనియు పెద్దలు చెప్పుదురు. పాతివ్రత్యరక్షణ మొక్కటే పడతులకు పరమోత్కృష్టవ్రతమని ధర్మశాస్త్రములు విధించుచున్నవి. సోదరీతిలకములారా! పూర్వకాలమున దేశములన్నిటిలోను మిన్నగా నెన్నబడిన మన భారతమాత ప్రస్తుతకాలమున నన్ని దేశములకన్న హీనదశయందున్నదన్న సంగతి లోకవిఖ్యాతమై యున్నది. అందలి రాష్ట్రములలో మన యాంధ్రరాష్ట్రము కడు హీనదశ ననుభవించుచున్నది. తక్కిన రాష్ట్రములలో రాష్ట్రోద్యమములను కనిపెట్టి మన యాంధ్రదేశమునందలి అన్ని మండలముల వారును స్వాభ్యుదయమునకయి ప్రయత్నించుచున్నారు. దేశాభ్యుదయము స్త్రీలపై నాధారపడి యున్నది. స్త్రీలకు విధాయకకృత్య మెద్ది? మన సోదరీమణు లందరకును మనమే మార్గదర్శకులము గావలయును. ఆ భారము

నంతయు వహించి పనిచేయుటకు స్త్రీ సమాజముల స్థాపించుకొని సమాజములకు దినదినాభివృద్ధి గలిగించవలెను. ఏకాలమందును, ఏదేశమునందును తమ స్త్రీలను మంచిదశకు తీసికొనిరా తాము బాగుపడిన పురుషులు లేరు. తాము బాగుపడవలచిన పక్షమున ముందుగా తమస్త్రీలను బాగుచేయ వలయును. స్త్రీల బాగే పురుషుల బాగు; స్త్రీలయోగే పురుషుల యోగు. మూఢురాండ్రయిన యిప్పటి స్త్రీలను తొంటి యుత్తమదశకు మరల దీసికొనివచ్చుటకై ప్రయత్నింపవలెను. కాబట్టి పురుషులు తమస్త్రీలను మూఢదశయందుంచియే దేశమున కేమో మహోపకారమును చేయుదుమన్న దురభిప్రాయము విడిచి వారితోడ్పాటును బొందియే సత్కార్యములను జేయజూడవలయును. స్త్రీల సహాయ మున్నపుడే పురుషులకు విజయము గలిగి లోకమునకు సత్యమైన యుపకారము కలుగును. భారతవనితలారా! భావిసంతతి మీమీద నాధారపడి యున్నది. మీమీ మతసాంఘికసాంప్రదాయములను మఱువవలదు. మీరు కర్యాముసకై కాలుద్రవ్వవలదు. కాని సమయము వచ్చినపుడు వెనుదీయవలదు. స్వాతంత్ర్య ధ్వజమును ప్రతిష్ఠించి పోషించుచుండవలెను. శాంతి సమరమున పాల్గొని స్వరాజ్యమును సంపాదించుడు.

---

# శ్రీ రాజా మీర్జా నల్లపరాజ వేంకటపతిరాజు బహద్దరు వారు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు



శ్రీ రాజా మీర్జా నల్లపరాజ వేంకటపతిరాజు బహద్దరువారు

వీరు ధనంజయసగోత్రికులు. మార్కండేయ పురాణోత్తరభాగమునఁ జెప్పఁబడిన యాంధ్రక్షత్రియ వంశజులలో ధనంజయసగోత్రికు లొకరు. ఆదిని కృష్ణానదీ ప్రాంతముల నేలి, "కోటవంశపువా"రను ప్రఖ్యాతి నొంది, కాకతీయులకు లోఁబడి త్రిలింగరాజ్యోపప్లవమున "నల్లానివా"రను వైష్ణవగురువులచేఁ గాపాడఁబడుటచే "నల్లపరాజు" వారను నింటిపేరు కలిగినటుల నైతిహ్యము గలదు. ఈ నల్లపరాజువారిలో "రంగరాజు"గారను నొకరు పెద్దాపుర సంస్థాపకులతోపాటు గోదావరీమండలమునకువచ్చి, వారిచే "తుని, కొత్తూరు" ముఖాసాలను పొందిరి. ఆయన పౌత్రులగు "రామభద్రరాజు"గారు గోలకొండ కుతుబుశాహీయొక్క ఖజానాను(శ్రీకాకుళమునుండి గోలకొండ పోవుదానిని) తునికి సమీపమున "పిల్లిగడ్డ" యను చోటున నాటవికులు దోపిడి చేయఁగా, వీ రాదోపిడికాండ్రను జయించి ఖజానాను నవాబునకుఁ చేర్పించుటచే మహమ్మదీయ సంస్థానప్రవేశ మీవంశజులకుఁ గలిగెను. వారి పౌత్రులే శ్రీరాజామీర్జా వేంకటపతిరాజుగారు. వీరి చిన్నతనముననే కుతుబుశాహీల రాజ్యము నశించి మొగలు లాంధ్రదేశము నాక్రమించుటయు, మొగలాయివంశజులలో "అసఫ్జా" యను నాతఁడు "నిజాముల్ముల్క్" అను బిరుదును వహించి హైదరాబాదు సింహాసనము నెక్కుటయునను విశేషములు కలిగెను. క్రీ. శ. 1740 సం. ప్రాంతమున మహారాష్ట్రులతో మహాయుద్ధమున నిజాము చిక్కుకొనిన సమయమునఁ బెక్కండ్రాంధ్రదేశమున రాజులమని, నవాబులమని చిన్నచిన్న రాజ్యములను స్థాపించిరి. ఒకప్పుడు నిజాము ఏలూరు మకాము చేసి యీకృత్రిమరాజులను, నవాబులను జూచి కోపోద్దీప్తుఁడై పెక్కండ్రను కొరడాలతోఁ గొట్టించెనట! శ్రీవేంకటపతిరాజుగారి తేజస్సునకు, వారి యశ్వశిక్షానైపుణ్యమునకు నిజాము మోహవివశుఁడై ఏలూరు సర్కారునకు "సర్లష్కర్" హోదా నిచ్చి, అవసరమైనచో దేశసంరక్షణమునకు (50) యేబదివేల సైన్యముఁ గూర్చుకొను నధికారమును, సుమారు ఒకలక్షయేబదివేల రూప్యములాదాయము వచ్చుజాగీరును, శ్రీరాజామీర్జాయను బిరుదములు, రత్నఖచితమగు ఖడ్గమును తదితరరాజచిహ్నములను కూడ నొసఁగెను. వీ రశ్వశాస్త్రమను పద్యకావ్యమును రచించిరట! కొన్ని పద్యములుమాత్రమె నిలిచియున్నవి. శ్రీవేంకటపతిరాజుగారికి నాఁటికాలపు ఫార్సీ మొదలగు పెక్కుభాషలలోఁ బాండిత్యము కలదట! శ్రీవేంకటపతిరాజుగారి కుమారులగు శ్రీవేంకటకృష్ణంరాజుగారు కూడ హైదరబాదు నవాబగు "నిజామాలీ" వలన "బందరు" నకు సర్లష్కరు హోదాను పొంది. ఈతండ్రికుమారులు నిజామురాజ్యమున నుద్యోగముల నందు కాలమున "తుని, కొత్తూరు" ముఠాలను పెద్దాపుర సంస్థానముల వారు తిరిగి తీసికొనిరని తోఁచును. అందువలననే శ్రీ వేంకటకృష్ణంరాజుగారి కుమారులగు శ్రీవేంకటపతి రాజు బహద్దరుగారు "దండంగి" ముఠా కధికారులైరి. గ్రంథవిస్తరభీతిచే వీరివంశజుల చరిత్రనంతయు వ్రాయుటకు వీలులేదుగాని శ్రీమీర్జా నల్లపరాజువారిలోఁ బెక్కండ్రు విద్వాంసులు తపశ్శాలురునై యుండిరనియు, అశ్వశాస్త్రము, పండితరాయ శతకమునను నాంధ్రగ్రంథములు "దర్యాయెమసాద్" అను పార్సీ భాషా గ్రంథము, "బాహార్గుల్హజార్"అను "ఓరజ్" భాషాగ్రంథము వీరినామాంకితములో, వీరిచే రచింపఁబడినవో యైయుండెనని చెప్పవలసియున్నది. ఏతద్వంశజులచే సంపాదితములగు నమూల్య లిఖితగ్రంథము లీ సంవత్సరమునఁ గలిగిన తునిజలప్రళయములో నశించినవని వ్రాయుటకు విచారమగుచున్నది. ఆజలప్రళయములో నీవంశజులలో రాజర్షులనఁదగిన శ్రీ సీతారామచంద్ర రాజుబహద్దరువారు సకుటుంబముగా నీవలకు వచ్చుటయే వారి తపోవిశేషమనఁదగును.

# శరీరవ్యాయామము — ప్రొఫెసరు యశ్వంతసింహగారు

చల్లా జగన్నాథంగారు యం. ఏ.

భారతజాతి యున్నతిని బడసి యితరజాతులతో పాటు సమానస్వత్వముల బడయుటకు దగినస్వాతంత్ర్యమును, స్వరాజ్యమును గాంచుటకు రాజకీయవేత్తలు కొన్నిమార్గములను, సంఘసంస్కర్తలు మరికొన్ని మార్గములను, ఆర్థికసమాలోచకులు వేరుమార్గములను, వేదాంతులు మరొకమార్గమును, సూచించుట మన మెరింగిన విషయమే. కాని వీరందరును గుర్తించిన విషయములను దోడ్పడవలసినది ముఖ్యముగ భారతజాతీయపౌరుషమై యున్నది. పరాధీనతవలన పౌరుష మంతయు బోయెను. కలదని నిక్కువారల నణచివేయుటకు ప్రభుత్వసాధనము లనేకము గలవు. అవి యటుండనిండు. ప్రతిమానవుడును దన విధ్యుక్తము ననుసరించుటయు ఆత్మరక్షణమునకు దగిన పరికరముల గూర్చుకొనుటయు ధర్మమై యున్నది. ఆంగ్లప్రభుత్వమువారు భారతీయ మానధనములు గాపాడుచున్నను, యెవరికివారు స్వీయమానధనముల గాపాడుకొనుటకు దగిన శరీరబలమును, మనఃస్థైర్యమును సంపాదించుట యవసరమై యున్నది. అందులకుదగిన సాధనసంపత్తి నరసెదము గాక!

ప్రప్రథమమున బ్రహ్మచర్య మిందుల కెంతేని తోడ్పడగలదు. వేదశాస్త్ర పురాణము లనుశ్రుతముగ నీ బ్రహ్మచర్యవ్రతానుసరణప్రాశస్త్యమును వివరించుటయే కాక యిక్కాలమున గాంధిమహాత్ముడు బోధించుచున్న ప్రధానమార్గ మదియే. బ్రహ్మచర్యము అవివాహితులకే కాక సంసారులకుగూడ ముఖ్యధర్మమై యున్నది. స్త్రీపురుషు లీధర్మము ననుష్ఠించుటవలన ఆత్మశ్రేయస్సునకును, తద్ద్వారా దేశపురోభివృద్ధికిని తోడ్పడగలరు. ఎన్ని వ్యాయామపరిశ్రమలు జేసినను, ఎన్ని నీతులు బోధించినను, ఇంద్రియనిగ్రహమూలమగు బ్రహ్మచర్యోపాసనకన్న నుత్కృష్ట శ్రేయోమార్గము వేరొండు లేదనిన నతిశయోక్తి గాజాలదు. అయ్యది మానసికముగ, శారీరికముగ, ఆధ్యాత్మికముగ, సంపదను జేకూర్చినను, అంగబలమును సంపాదించుటయు, ఆత్మసంరక్షణమార్గముల నేర్చుకొనుటయు, మానవుని ముఖ్యధర్మములై యున్నవి. ఇందులకు భారతీయులే వలయునన్ని సాధనముల నన్వేషించిరి. సూర్యనమస్కృతు లట్టివయ. వానియౌత్కృష్ట్యము నాధునికులు దెలిసికొనజాలకున్నారు. బాలసూర్యకిరణప్రసారమువలని లాభములను, శీతలోదకప్రాతఃస్నానముయొక్క యమూల్యఫలమును ఇక్కాలమున నిద్రమంచము నసే కాఫీ సేవించు పాశ్చాత్యనాగరకతానిమగ్నులాస్వాదించజాలరు. బాలురకిక్కాలమున పాఠశాలలందు నేర్పు శరీరసాధనము లన్నియు, పాశ్చాత్యములే. వీనికి గూడ ప్రాచీప్రతీచీభేదము లేల యనవలదు. ఎప్పుడైనను, దేనికైనను మనవద్ద లేనిదానికే యింకొకరిపై నాధారపడవలయును గాని, ఉన్నదాని నెరుంగక పరాభిలాష యుక్తముగాదు. కావున స్వదేశపరిశ్రమలను గాంచుటయే ముఖ్యమని తెలుపగోరెదను.



శ్రీ కేశవదేవజ్ఞాని        శ్రీ యశ్వంతసింహ
లాటీతో గొట్టగా వజ్రముష్టితో నాత్మరక్షణము గావించుకొనుట.

ఇట్టి స్వదేశవ్యాయామముల నభివృద్ధిజేయగోరి, ఉత్తరహిందూస్థానమున ప్రాచ్యదేశవ్యాయామ సాధనసంపత్తిని జేకూర్చి, వింధ్యహిమవత్పర్వతములందు తపోనియములగు మహర్షుల నన్వేషించి, ఆత్మశరీరసౌష్ఠవమును గాంచిన ప్రొఫెసరు యశ్వంతసింహగారు మన కిందు ఆదర్శపురుషులు గాగలరు. ఈ పేరు విన్నపుడు వీ రెవరా యను భావ మేర్పడవచ్చును. ఉత్తరదేశస్థులా యను భ్రమ గలుగవచ్చును. వీ రాంధ్రులు, గుంటూరుజిల్లావారు గుంటూరుసమీపమున కాజగ్రామము వీరిది. పండితవంశజులు స్వాధ్యాయసంపన్నులు. ఆంధ్రలోక

ము భావకవిత్వ మనుపేర రసతరంగముల నోలలాడించు సాహితీ సమిత్యాచార్యులగు శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారి యన్నకుమారులు. వీరి యన్వర్థనామధేయము శ్రీరామమూర్తి. వీరే యశ్వం



శ్రీ కేశవదేవజ్ఞాని శ్రీ యశ్వంతసింహ

లాటీకొట్లాట,లాటీతో ఆత్మరక్షణము చేసికొనుట. దీని నే "పరీగడ్కా"

తులు. ముప్పదేండ్ల ప్రాయము. చిననాటనుండియు వీరికి శరీరవ్యాయామవ్యాసంగము మెండు. మహాసంగ్రామ సమయమున సైన్యమునజేరి నాల్గువత్సరములు యోధులుగ నుండిరి. బరోడా,కోడ్పూరు, జయపూరు సంస్థానములందు కొన్నివత్సరము లుండి దేశీయ శరీరపరిశ్రమ సాధనముల నేర్చుకొని గతవత్సరము అక్టోబరులో గుంటూరునకు వచ్చి యిచట పురజనుల ప్రోత్సాహముపై శ్రీహనుమద్వ్యాయామ శరీరశాల నొకదాని స్థాపించిరి. బరోడాలో అఖాడాలయందు రాజరత్నమాణిక్యారావుగారి యాధిపత్యమున సింహగారు వేర్వేరు సాధనముల నభ్యసించినవారని నిచట పాఠశాలల విద్యార్థులకు నేర్పుచున్నారు. వీరు నేర్పు సాధనముల గొన్నింటి నిందు చిత్రములమూలమున నుదహరించు చున్నాను. లాటీబందేషు, ఫరీగడ్కా, బగ్నాఖా మున్నగు సాధనములు గలవు. ఇందు శరీరమునకు మంచిబలమును జేకూర్చు మార్గములు గలవు. వీరు కమ్మవారి వసతిగృహమునందు విద్యార్థులను గూడ నీ సాధనముల నేర్పు చున్నారు. అచట ప్రారంభోత్సవమునాడు జిల్లాజడ్జి, కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు మున్నగువారలు వచ్చి చాల మెచ్చుకొనిరి. ప్రేగు విశ్వవిద్యాలయమునందు ప్రొఫెసరుగ నుండి యీమధ్య నిచటికి వచ్చిన ప్రహ్లాదమాడ్కాగారు చాల ప్రశంసించిరి. ఆంధ్రక్రిస్టియను కాలేజి ప్రిన్సిపాలుగారగు డాక్టరు స్ట్రాసుగారు చాల అభిమానముతో తమవిద్యార్థులను నేర్చుకొనుటకు ప్రోత్సహించు చున్నారు. జిల్లాబోర్డుఅధ్యక్షులును, తాలూకాబోర్డు అధ్యక్షులును దమతమ పాఠశాలలం దీ వ్యాయామముల ప్రవేశపెట్టి సింహగారికి ప్రోత్సాహము కలుగజేసెద రని నాయాశయము. ఈ వ్యాయామసాధనముల ప్రవేశపెట్టుటతో ఇప్పుడు పాఠశాలలందు జేయు వైద్యపరీక్షలకును, ఔషధసేవకును అవసరము లేకుండునను నమ్మకము గలదు. ఇందులకు ముఖ్యు లందరును దోడ్పడుదురు గాక యని నేనభిలషించు చున్నాను.

---

# భీమావ్యాపారము - ఆంధ్ర దేశము

## యస్. సుబ్బారావు గారు

౧

మన దేశమునకు స్వరాజ్యము లేనందున పాశ్చాత్య దేశీయులు అనేకరీతులుగ ధనమును మనలనుండి తీసుకుపోవుచున్నారు. స్వరాజ్యమున్నయెడల వాటన్నిటిని అరికట్టుటకు మనకు హక్కు లుండేవి. విదేశిభీమాకంపెనీల ఏజన్సీలు మన దేశములో 23 గలవు. యీఏజన్సీల వారు మన దేశములో ప్రతిరాష్ట్రములోను, ప్రతిజిల్లాలోను సబుఏజంట్లను ఏర్పాటుచేసి, వారిద్వారా పల్లెటి గ్రామాగులనుండియు విదేశీ భీమాకంపెనీలలో మన దేశీయులచే భీమా చేయించి ఈ రీతిగ సాలీనా భీమాచేయించినవారు చెల్లించే ప్రీమియముల ధనమును ప్రతియేట పది కోట్ల రూపాయలను కొంపోవుచున్నారు. యీ రీతిగ విదేశములకు పోవు ధనమును అరికట్టుటకే స్వదేశీ భీమాకంపెనీ లేర్పడినవి. యింత వరకు మన దేశములో 60 స్వదేశీకంపెనీలు గలవు. మనరాష్ట్రములో యితర రాష్ట్రకంపెనీల ఏజన్సీలు బెజవాడ, గుంటూరు, బందరు, చామర్లకోట మున్నగుచోట్ల గలవు. యివి గాక విదేశీ కంపెనీల ఏజన్సీలవారి సబుఏజంట్లు విశాఖపట్నం, ఏలూరు, బెజవాడ, గుంటూరు మున్నగు చోట్లను గలరు. మనరాష్ట్రమునుండి ప్రతిఏట కొన్ని లక్షలరూపాయలు సాలీనా ప్రీమియముల రూపమున విదేశీకంపెనీలకై తేనేమి, స్వదేశీకంపెనీలకై తేనేమి పోవుచున్నవి.

యీరీతిగ ప్రతి ఏట మనరాష్ట్రమునుండి యితరచోట్లకు ధనము పోవుచున్నందున ఆర్థికముగ రాష్ట్రము త్తమమీద నష్టము కలుగుచున్నదనియే ఆంధ్రప్రముఖులును, ఆంధ్రదేశౌన్నత్యము కొరకు పాటుబడునట్టియు శ్రీయుతులు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యపంతులుగారు, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, టంగుటూరి ప్రకాశం పంతులు గారు, యడ్లపల్లి మంగయ్య పంతులుగారు, డాక్టరు కోకా అహోబలరావునాయుడు గారు ఎక్కువక్కపిన్ని, మోతేవారు, పైడావారు, కొమ్మారెడ్డివారు, నాళంవారు మున్నగు ధనికులయొక్క ప్రోత్సాహము వల్లను 28-8-1925 సంవత్సరమున యీ ఆంధ్రాభీమాకంపెనీ రిజష్టరు కాబడి బందరు పట్టణమున నెలకొల్పబడి దినాభివృద్ధిని గాంచుచున్నది.

విదేశీకంపెనీలతో మనదేశపు కంపెనీలను పోల్చిజూచిన మనదేశ మెన్నియో వందలరెట్లు వెనుకబడియున్నది. మన దేశంలోని యితర రాష్ట్రకంపెనీలతో మన ఆంధ్రభీమాకంపెనీ సరిపోల్చిచూచిన నూతనముగా వెలువడి పనిచేయుచున్న కంపెనీలతో తీసిపోవుటలేదు. ఆంధ్రరాష్ట్రములో యితర కంపెనీల ఏజన్సీలు వేళ్లుపాతుకొనియున్నవి. అందువల్ల వాటన్నిటికి సమాధానము చెప్పుచు నూతనముగ వెలువడిన యీఆంధ్రసంస్థ మూడు ఏండ్లలో 1384 గురు భీమాచేసిరి. వీరు 22లక్షల 53వేలకు భీమా చేసిరి. ఇంతవరకు వీరివల్ల ప్రతిసాలున ఆదాయము 1 లక్ష 47వేల 700 వచ్చుచున్నవి. ఏజంట్లయొక్కయు, కంపెనీ స్థాపకులయొక్కయు నిందు అభిమానముంచి భీమాచేసిన పోలసీదార్లయొక్కయు కార్యనిపుణతయని చెప్పుటలో నాశ్చర్య మేమియు లేదు. ఆంధ్రులైన మన రాష్ట్రములోనున్న రెండుకోట్లు తప్పక ఈకంపెనీ అభివృద్ధికే పాటుపడుట వారివిధ్యుక్తధర్మమని యెంచుకొనినచో కొలది సంవత్సరములలోనే యీకంపెనీ మనదేశమునందున్న అన్ని కంపెనీలకన్న మొదటిదిగా ఏల యుండదు! విదేశీకంపెనీలతో కూడ ఏల సవాలుచేయదు! మన భారతదేశములో నున్న 60 స్వదేశీ కంపెనీలలో నింతవరకు నాలుగు లక్షలమంది తమ జీవితములను భీమా చేసిరి. మన భారతమాతయొక్క జనాభా సుమారు ముప్పది రెండు కోట్లు. దీనినిబట్టిచూడ వెయ్యిమంది మనుష్యులకు ఎనమండుగురు భీమాచేసినట్లున్నది. నూటికొక్కడైనను చేయలేదు. ఈఅంకెలను బట్టి మనదేశ మెంతగూ యీవ్యాపారములో వెనుకబడియున్నది గదా! మన ఆంధ్రరాష్ట్రము సంగతి జూచెదము: రెండుకోట్ల మంది వున్న ఆంధ్రులలో 1384 గు॥ ఆంధ్రభీమాకంపెనీలో వారిజీవితాలను భీమాచేసిరి. అనగా రమారమి లక్షమందికి 7 గురు చేసిరి. ఈఅంకెను వచ్చేసంవత్సరాదినాటికి అనేకరెట్లు అగుటకు ఆంధ్రులు పూనుకొనెదరుగాక!

భీమావ్యాపారములో సాంఘికసేవ, రాష్ట్రీయ ఆర్థికాభివృద్ధి నిమిడియున్నవి. బీదరికముచేతను, అగ్నిప్రమాదములచేతను, వర్తకవ్యాపారములవల్లను దివాలాతీసిన కుటుంబములకు భీమావ్యాపారము కల్పవృక్షమువలె నాస్థితిలో తోడ్పడును. ఈరీతిగ తోడ్పడే వ్యాపారము మరేదియు ప్రపంచములోనే లేదని రూఢిగ చెప్పవచ్చును.

భీమావ్యాపారములో విదేశములందు పెద్దపెద్ద పరీక్షలలో నుత్తీర్ణులైనవారున్ను, రాజకీయవేత్తలున్ను, బ్యాంకర్లున్ను నిమిడియున్నారు. అట్టిస్థితిలో భీమావ్యాపారము చులకనగా జూడదగినదా!

ఎటువంటి రాజకీయవేత్తలకు, సాంఘికసేవకులకు, ఆర్థిక వేత్తలకు నీవ్యాపారమందు సంబంధమున్నదో ఈ క్రింద పొందుపరచితిని.

### భీమావ్యాపారము-అఖిలభారతనాయకులు

1. పండితమోతీలాల్ నెహ్రూగారు- రెండుసార్లు అఖిలభారతకాంగ్రెసునకు అధ్యక్షత వహించినవారు; సామ్రాజ్యశాసన సభాసభ్యులు, వీరు లక్ష్మి ఇన్సూ్యరెన్సు కంపెనీ, లాహోరు; ట్రాపికల్ ఇన్సూ్యరెన్సు కంపెనీ, ఢిల్లి; హిందూస్థానీ భీమాకంపెనీ అను మూడుకంపెనీలకున్ను అధ్యక్షులుగా నున్నవారే.

2. టి. ఆర్. ఫూకన్‌గారు, గౌహతి కాంగ్రెసునకు ఆహ్వాన సంఘాధ్యక్షులు; సుప్రసిద్ధ న్యాయవాది. సామ్రాజ్యశాసన సభాసభ్యులు. గౌహితి కాపురస్థులు. వీరు హిందూస్థానీ భీమాకంపెనీ ఢిల్లి దానిలో డైరెక్టరుగా నున్నారు.

3. జే. యం. సేనుగుప్తాగారు, బి. ఎ., యల్. యల్. బి. (కాన్‌టబ్), బారిస్టరు, యం. యల్. సి, కలకత్తా. వీరు కలకత్తాలో జరిగిన 1928 సం. కాంగ్రెసునకు ఆహ్వానసంఘాధ్యక్షులున్ను, కలకత్తా నగరమునకు మేయరు చేసినవారున్ను అయివున్నారు.

4. యం. యస్. ఆనీగారు, బి. ఎ. యల్. యల్. బి. సామ్రాజ్య శాసనసభాసభ్యులు. బీరారురాష్ట్రములో యతోమలు కాపురస్థులు. అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు.

5. డాక్టరు ఎం. ఎ. అన్సారీగారు. యం. డి; యం యస్. (ఎడింబర్గో). 1927 మదరాసు కాంగ్రెసునకు అధ్యక్షులు. యిదివరలో అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు చాలసార్లు కార్యదర్శిగ నున్నారు. యీవత్సరము వీరే కార్యదర్శులు. వీరు ట్రాపికలు ఇన్సూ్యరెన్సు కంపెనీ ఢిల్లి దానికి డైరెక్టరుగాను, చీఫ్ మెడికలు ఆఫీసరుగాను వున్నారు.

6. పండిత క. సంతానంగారు, బి. ఎ. మదరాసు రాష్ట్రీయ వాసులు. 1906 లో ఇంగ్లండునకు ఐ. సి. యస్. పరీక్షకు వెళ్లిరి. ప్రభుత్వోద్యోగమును వద్దనినవారు. 1911 లో న్యాయవాదిగ లాహోరులో ప్రవేశించిరి. మార్షల్లారోజులలో 1919 లో చాలా శ్రమపడి పనిచేసిరి. పంజాబు దురంతరములను గూర్చి కాంగ్రెసు నియమించిన సాక్ష్యపుకమిటీకి కార్యదర్శిగ నున్నారు. 1920 లో అసహాయోద్యమములో చేరి న్యాయవాదవృత్తిని విసర్జించిరి. 1921, 1922 లో పంజాబురాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగ పనిచేసిరి. 1922, 1923 లో యీరాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకు అధ్యక్షులుగా నున్నారు. 1922 ఏప్రియలులో బాటియాలో జరిగిన పంజాబు రాష్ట్రీయసభకు అధ్యక్షులుగా వున్నారు. పంజాబు మ్యునిసిపలు సంఘములో 1921-1924 వరకు సభ్యులుగా నున్నారు. 1926 లో అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగ నున్నారు. 1924 లో లక్ష్మిఇన్సూ్యరెన్సు కంపెనీ కీ. శే. లాలాలజపతిరాయిగారు స్థాపించగా అందు మానేజింగు డైరక్టరుగ చేరి ప్రస్తుతం పని చేయుచున్నారు.

7. సర్దారు మంగళసింగు, బి. ఎ. అకాలీ ఉద్యమమును నడిపిన వీరుడు అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులుగానుండి ప్రభుత్వముచే అనేకయిక్కట్టులను పొందిరి. వీరు పీపిల్సులైఫ్ ఇన్సూ్యరెన్సు కంపెనీలో డైరక్టరుగా నుండిరి.

8. సర్దారు సర్దూల్ సింగు. అకాలీ ఉద్యమమునకై వీరు సర్వస్వమును త్యాగము చేసిన ధీశాలి. 1909 లో బి. ఎ. ప్యాసు అయిరి. అసహాయోద్యమములో చేరిరి. సిక్కురివ్యూఅను పత్రికను ఢిల్లిలోనుంటూ స్థాపించిరి. 1918 లో లాహోరునకు వెళ్లి అక్కడనే నివసించుచున్నారు. లాహోరులో న్యూహెరాల్డు అను పత్రికను స్థాపించిరి. సిక్కురివ్యూను అందు కలిపిరి. 1919లో మార్షల్లారోజులలో నిలిపి వేసిరి. 1921 లో సిక్కులీగునకు కార్యదర్శిగ నుండెను. 1925 వరకు ప్రభుత్వమువారు వీరిపై రాజద్రోహనేరమును మోపి జైలునందుంచిరి. 1917లో హిందూయూనివర్సిటీకి ఫెల్లో క్రింద ఎన్నుకోబడిరి. 1922 లో పంజాబురాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగ నుండెను.

1920 లో సిక్కులీగునకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. 1925 లో పంజాబు రాష్ట్రీయసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. 1926 లో సిక్కులలో బయలు దేరిన స్వసంఘాభిమానోద్యమములో వీరికిష్టము లేక సిక్కులీగుతో సంబంధమున్న కమిటీలన్నిటికి రాజీనామానిచ్చిరి. 1928 కలకత్తాలో జరిగిన కాంగ్రెసులో స్వాతంత్ర్యతీర్మానమును బలపరచిన ధీరుడు. వీరు పీపిల్సు ఇన్సూ్యరెన్సు కంపెనీకి మానేజింగు డైరెక్టరుగా నుంటున్నారు.

9. లాలా దునీచంద్, బి. ఎ., యల్. యల్. బి., అంబాలా అనుచోట న్యాయవాద వృత్తిని గావించుచున్నారు. వీరు కాంగ్రెసువాది. పంజాబు దురంతములలో శ్రమపడిన వీరుడు. వీరు పీపిల్సు ఇన్సూ్యరెన్సు కంపెనీలో డైరెక్టరుగా ఉన్నారు.

10. యస్. శ్రీనివాస అయ్యంగారు. గౌహితీ కాంగ్రెసు అధ్యక్షులు. మదరాసులో పేరుగాంచిన న్యాయవాది స్వరాజ్యపార్టీ ఉద్యమములో వీరు అఖిల భారతములో పేరుగాంచిరి. 1928 లో విదేశయాత్రను గావించిరి. ప్రస్తుతము ఇండిపెండెంటు పార్టీకి అధ్యక్షులుగా నున్నారు. వీరు ట్రాపికలు ఇన్సూ్యరెన్సుకంపెనీకి అధ్యక్షులుగా నున్నారు.

11. లాలా గిరిధర్లాల్‌గారు. పంజాబు చేంబరు ఆఫ్ కామర్సుకు కమిటీలో మానేజింగు మెంబరుగా చాలకాలము వున్నారు. 1919-1920 లో యీయనే యీకమిటీకి డెప్యూటీ ప్రెసిడెంటుగా నుండిరి. అమృతసరములోనున్న అనేక జాయింటుస్టాకుకంపెనీలను

స్థాపించినవారు. 1907 నుంచి యీయనకు వ్యాపారమందు ఎక్కువ అనుభవము గలదు. 1919 లగాయితు 1925 వరకు అఖిల భారత కాంగ్రెసు సంఘములో ముఖ్యులుగా నుండేవారిలో నీతడొకడుగా నుండెను.

1919 లో అమృత సరములో జరిగిన కాంగ్రెసునకు జనరలు సెక్రెటరిగావుండి కాంగ్రెసును జయప్రదముగా జరిపెను. జలియను వాలాబాగ్ మెమోరియలు ఫండునకు గౌరవ కార్యదర్శిగ నుండెను. 1926 లో మరల వ్యాపారములో ప్రవేశించిరి. అఖిలభారత కాంగ్రెసులో సభ్యులుగా నుంటున్నారు. వీరు హిందూస్థానీ భీమా కంపెనీ డిల్లీలో దానికి మానేజింగు డైరెక్టరుగానున్నారు.

12. డాక్టరు సత్యపాలుగారు బి. ఏ, యం. బి. అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగా పనిచేసిరి. అఖిలభారత కాంగ్రెసుసంఘసభ్యులు. పంజాబురాష్ట్రమునందు అసహాయోద్యమములో తీవ్రప్రచారమును గావించి జైలునకు వెళ్లిరి. పంజాబు దురంతములలో చాలబాధలను పడినవారే. లాహోరులోనున్న పంటివైద్యపు కాలేజీకి ప్రిన్సిపాలుగానున్నారు. హిందూస్థానీ ఎన్సూర్యెన్సుకంపెనీ (లాహోరు)కి సూపరింటెండింగు డైరెక్టరుగానున్నారు. లాహోరులోనున్న తదితరభీమాకంపెనీలకున్ను, ఢిల్లీలోనున్న హిందుస్థానీ భీమా కంపెనీకిన్ని చీఫ్ మెడికలు ఆఫీసరుగా నున్నారు.

13. జమ్నాదాస్ యం. మెహతా. బారెట్లా; సామ్రాజ్యశాసన సభాసభ్యులు. ఆర్థికశాస్త్రములో నిపుణుడు. స్వరాజ్యపార్టీ లీడరు. అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు, సంపూర్ణస్వాతంత్ర్యపార్టీ మెంబరు. భీమావ్యాపారములో గొప్ప అథారిటీ. బొంబాయిలో నున్న ఏషియన్ ఇన్సూర్యెన్సుకంపెనీకి అధ్యక్షులుగా నుంటున్నారు.

14. టి. సి. గోస్వామి జమిందారు. సామ్రాజ్యశాసనసభ్యులు, కలకత్తా. వీరు అఖిలభారతకాంగ్రెసునందు సభ్యులు. యూరపుదేశమునకు అనేకసార్లువెళ్లినవారు. హిందూస్థానీ కోఆపరేటివు(కలకత్తా) కంపెనీలో డైరెక్టరుగావున్నారు.

15. నలిన, ఆర్. సర్కారు యం. ఇల్. సి. కలకత్తా కార్పొరేషను మెంబరు. కీ. శే. దేశబంధుదాసుగారి అనుచరుడు, కీ. శే. దేశబంధుదాసు జ్ఞాపకార్థపు గ్రామపునర్నిర్మాణపు నిధికిన్ని, కమిటీకిన్ని కార్యదర్శిగానున్ను, ట్రెజరరుగానున్ను వున్నారు. 1928 లో జరిగిన కాంగ్రెసు ఎగ్జిబిషను వగైరానిర్మాణములలో చాలపనిచేసిరి.

అఖిలభారతకాంగ్రెసు సంఘసభ్యులు. వీరు కలకత్తాలోనున్న హిందూస్థానీ కో ఆపరేటివు ఇన్సూరెన్సు కంపెనీకి మేనేజరుగా నున్నారు.

16. క. వి. రంగస్వామిఅయ్యంగారు. హిందూపత్రికాసంపాదకులు. సామ్రాజ్యశాసనసభ్యులు. అఖిలభారతకాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగ పనిచేసిరి. అఖిలభారతకాంగ్రెసు సంఘసభ్యులు. వీరు ఢిల్లీ లోనున్న హిందూస్థానీభీమాకంపెనీలో డైరెక్టరుగానున్నారు

17. త్రిలోకచంద్రకపూరు లాలా బి. ఏ., యల్. యల్. బి. 1921లో అసహాయోద్యమములో చేరి న్యాయవాదవృత్తిని విసర్జించిరి. పంజాబురాష్ట్రీయ కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగా పనిచేసిరి. 1921లో ప్రభుత్వమువారికి గురియై జైలునకు శాసనాధికార సమయములో వెళ్లిరి. లాహోరులోనున్న దయానందచేడి కోకాలాజీకి మానేజింగుకమిటీమెంబరుగా వున్నారు,

వీరు పంజాబు మ్యాదియల్ కుటుంబపు ఫండునకు డైరెక్టరుగానున్ను, లక్ష్మిఇన్సూర్యెన్సుకంపెనీలోమానేజింగుఏజన్సీగానునున్నారు.

18. లాలా హరికిషన్‌లాలుగారు, లాహోరు, బి ఏ. (కాంటబ్) బారెట్లా. 1899 లో న్యాయవాద వృత్తిని వదలివేసిరి. పారిశ్రామికాభివృద్ధికై చాలాపాటుబడిరి. 1910 లో జరిగిన కాంగ్రెసునకు వీరు ఆహ్వాన సంఘాధ్యక్షులు. 1912 లో బెంగాలులో బాంకిపురమున జరిగిన పారిశ్రామిక సభకు అధ్యక్షులుగా నుండిరి. గవర్నమెంటువారి పారిశ్రామిక కమిటి ఎదుట గొప్పసాక్ష్యమును యిచ్చిరి. పంజాబు యూనివర్సిటీ ఫెలోగా నుండిరి. 1919 లో మార్షల్లాఠోజులలో వీరికి గవర్నమెంటు చెప్పరాని యిక్కట్లను బెట్టిరి. యిక్కట్లేకాక వీరిని యావజ్జీవపు ఖైదీగా శిక్షించిరి. 1919 డిశంబరులో ఏలనో వదలివేసిరి. 1920—1923 వరకు పంజాబు కౌన్సిలులో వ్యవసాయపు మంత్రిగా పనిచేసిరి—వీరు భారతి ఇన్సూర్యెన్సు కంపెనీ (లాహోరు) కి అధ్యక్షులుగా నున్నారు.

19. సర్ పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారు, సి. ఐ. ఇ., యం. బి. ఇ; సామ్రాజ్యశాసన సభ్యులు. గవర్నమెంటునియమించిన లార్డుఇంచికేపు కమిటీలో సభ్యులుగా నుండిరి. ఇండియా ఇంపీరియలు బ్యాంకునకు గవర్నరుగానున్నారు. మితవాది. ఓరెంటియల్ (?) ఇన్సూర్యెన్సుకంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

20. సర్ చమ్నాలాల్ సెటల్వాడ్ గారు, క. సి. ఐ. ఇ. ఎడ్వకేటు, బొంబాయి. వీరు 1928 లో అలహాబాదులో జరిగిన మితవాదుల సభకు అధ్యక్షులు. ఇండస్ట్రియలు ప్రూడెంషల్ (బొంబాయి) కంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

21. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు, బి. ఎ. యం. బి. అండు. సి. యం. వీరిని ఆంధ్రులలో ఎరుగనివారు లేరు. బ్యాంకు వ్యవహారములలోను, పరపతి సంఘముల వ్యవహారములలోను ఆంధ్రదేశమునకు మణి. వందేమాతరం ఉద్యమమునుంచి నేటి వరకు అఖిల భారత కాంగ్రెసులో సభ్యులుగా నున్నారు. దేశసేవ చేయుచున్నారు. జన్మభూమి అను ఆంగ్లవారపత్రికకు సంపాదకులు. వీరు అనేక సంస్థలకు కార్యదర్శులగను, ట్రెజరరుగను నున్నారు—అనేకసభలకు అధ్యక్షత వహించిరి. వీరు ఆంధ్రఇన్సూర్యెన్సు కంపెనీకి స్థాపకులే యని చెప్పవలెను. యీకంపెనీలో డైరెక్టరుగాను చీఫ్ మెడికలు ఆఫీసరుగాను ఉన్నారు.

22. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. వీరిని గూర్చి ఆంధ్రదేశ మెన్నటికి మరువజాలదు. ఆంధ్రులలో నేకీర్తి ఔన్నత్యము తెచ్చినను వీరేయని చెప్పక తప్పదు—ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రగ్రంథమాల మున్నగు వాటికి సంపాదకులుగా నున్నారు. వ్యాపార నిపుణత గలవారు ఆంధ్రులలో ఏజాతీయోద్యమముగాని, ఏపారిశ్రామికోద్యమముగాని, ఏ పుస్తక భాండాగారోద్యమమో గాని, ఇదియది యనిచెప్పనేల, వీరు ప్రతిదానికి శక్తికొలది దానమును చేయుచునే యున్నారు. అనేకసభలకు అధ్యక్షత వహించిరి.

ఆంధ్రఇన్సూర్యెరెన్సు కంపెనీ స్థాపకులలో వీరున్ను ముఖ్యులే. వీరు అందు డైరెక్టరుగా నున్నారు. అఖిలభారత కాంగ్రెసుసభ్యులు. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘకార్యదర్శి.

23. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు, బారిష్టరు. వీరు అసహాయోద్యమములో న్యాయవాదవృత్తిని వదలివేసిరి. అఖిలభారత కాంగ్రెసునందు కొంతకాలము కార్యదర్శిగా పనిచేసిరి. అఖిలభారత దేశమంతటను అనేకసార్లు జాతీయోద్యమాభివృద్ధికై పర్యటనగావించిరి. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుకమిటీ అధ్యక్షులు. అనేకసభలకు అధ్యక్షత వహించిరి. సామ్రాజ్యశాసనసభ్యులు. స్వరాజ్యదైనిక ఆంగ్లపత్రికా స్థాపకులున్ను, సంపాదకులునైయున్నారు అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు. ఆంధ్రాయిన్స్యూరెన్సు కంపెనీలో డైరక్టరుగా నున్నారు.

24. డాక్టరు ధన్వాడ రామచంద్రరావుగారు, ఎం. ఎ., ఎం. బి. సి. హెచ్. బి. ఇంగ్లండులో డాక్టరుగా పనిచేసిరి. అసహాయోద్యమములో చేరి దేశసేవ చేసినవారు. అఖిలభారతకాంగ్రెసుసంఘమునకు సభ్యులుగా నున్నారు. ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగ పనిచేసిరి. కొన్నిసభలకు అధ్యక్షతను వహించిరి. బెజవాడ మ్యునిసిపలుసంఘమునకు చైరుమెన్‌గానున్ను, కృష్ణాజిల్లా బోర్డు ప్రెసిడెంటుగాను పనిచేసిరి. వీరు ఆంధ్రఇన్సూర్యెరెన్సు కంపెనీలో డైరక్టరుగా నున్నారు.

25. గౌరవనీయులగు వేమవరపు రామదాసుపంతులు గారు మదరాసుహైకోర్టులో న్యాయవాది, స్టేటుకౌన్సిలు సభ్యులు. పరపతిసంఘములలోను బ్యాంకువ్యవహారములలోను నిపుణులు. కొన్ని బ్యాంకులకు అధ్యక్షులుగా నున్నారు. కొన్నిసభలకు అధ్యక్షత రాష్ట్రమందును రాష్ట్రేతరమందును వహించిరి. అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు. వీరు ఆంధ్రభీమాకంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

26. నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహ రావుగారు, బారిష్టరు, గుంటూరు. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగను అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులుగ నున్నారు. ప్రస్తుతము గుంటూరు మ్యునిసిపలు సంఘమునకు అధ్యక్షులుగా నున్నారు. కొన్నిసభలకు అధ్యక్షత వహించిరి. అసహాయోద్యమములో న్యాయవాద వృత్తిని వదలిరి. జమీందారులు. ఆంధ్రభీమాకంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

27. న్యాయపతి సుబ్బారావుపంతులుగారు, ఆంధ్రభీష్ములు. అఖిలభారత కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగను శాసనసభాసభ్యులుగను పనిచేసిరి. పెద్దలైరి. వీరు ఆంధ్రభీమాకంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

28. సీలం జగన్నాథరావు నాయుడుగారు. ఎం. ఏ. బారిష్టరు. బందరు. బందరులోని సత్యసాధని వారపత్రికకు సంపాదకులుగా నున్నారు. వీరు ఆంధ్రభీమాకంపెనీలో డైరెక్టరుగా నున్నారు.

29. మోతే గంగరాజుగారు, జమీందారు, ఏలూరు. శాసనసభకు నొకసారి సభ్యులు. ఏలూరులో జ్యూటుమిల్లు ప్రొప్రైటర్లు, పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు సంఘమునకు ట్రెజరరుగా నుండిరి. వీరున్ను ఆంధ్రాభీమా కంపెనీలో డైరక్టరుగా నుండిరి.

30. డాక్టరు కోకా అహోబలరావునాయుడుగారు. ఎం. బి. సి. హెచ్. బి. (ఎడింబర్గ్) డి. టి. యం. (లివర్‌పూల్). వీరు బీదల యెడల దయగలవారు. ఉచితవైద్యము కొన్ని నియామకములైన గంటలలో ఎవరికైనను చేయుదురు. మంచిదేశభక్తులు. ఆడంబరములేని సత్పురుషుడు. వీరు ఆంధ్రభీమా కంపెనీకి మేనేజింగు డైరెక్టరుగా నున్నారు.

31. యడ్లమిల్లి మంగయ్య పంతులుగారు. బి. ఎ., బి. యల్. వీరిని గూర్చి అంతగా ఆంధ్రులకు వెల్లడింప నక్కరలేకయే తెలియును. వీరు అసహాయోద్యమములో ఏలూరులో న్యాయవాద వృత్తిని విసర్జించిరి. అప్పటి నుండియు యీ కంపెనీ స్థాపించేటేదీవరకు పశ్చిమ గోదావరి జిల్లాలో పాదచారియై జిల్లాలోనున్న పల్లెలన్నిటిలోను అమిత ప్రచారమును గావించిరి. దేశసేవలో విసుగు అనేది లేక నిరంతరము గ్రామములందు సంచారముచేసి పశ్చిమగోదావరి జిల్లాలో జాతీయోద్యమాభివృద్ధి కెంతయు తోడ్పడిరి. ఆంధ్రరాష్ట్రమునకు కార్యదర్శిగను, అఖిల భారత కాంగ్రెసు సంఘమునకు సభ్యులుగను నుండిరి; నిష్కళంక స్వార్థత్యాగమును గావించిన వారిలో వీరున్ను ముఖ్యులే అయి యున్నారు.

1925 లో ఆంధ్ర యిన్స్యూరెన్సు కంపెనీ స్థాపకులతో వీరు మిక్కిలి శ్రమపడి పనిచేసిరి. ప్రస్తుతము వీరు యీకంపెనీకి కార్యదర్శిగ నుండి వారి యావచ్ఛక్తిని వినియోగించి విరామమనేది లేకుండ కంపెనీ అభివృద్ధి కెంతయు తోడ్పడుచున్నారు.

32. చెరుకువాడ వెంకటనరసింహం పంతులుగారు. వీరు అసహాయోద్యమములో ఆంధ్రదేశమునం దంతటను జాతీయోద్యమ ప్రచారము కొరకై ఉపన్యాసముల నిచ్చినవారు గదాయని వీరి పేరు వినినంతనే అనుకొనుట గలదు. 1907 నుంచియు జాతీయ పాఠశాలాభి

వృద్ధికిన్ని, జాతీయోద్యమ ప్రచారమునకున్ను పాటుబడి అసహాయో ద్యమములో గవర్నమెంటు వారికి అతిథిగా ఖైదీగదులలో సుమారు వత్సర ముండిరి. వీరు ఆంధ్ర భీమా వ్యాపారమును ఆంధ్రదేశములోని పల్లెలకు వ్యాపింపజేసిన వారిలో ప్రథములు. భీమా పంచాంగమును వ్రాసి భీమా అనగనేమో చేసేవారికి, చేయబోవు వారికి, చేయించే భీమా ఏజంట్లకు తేటతెల్లమగునటుల వ్రాసి కొంత మంది భీమా ఏజంట్లను తయారుచేసి కొంతమంది అసహాయోద్యమ ప్రచారకులకు భీమాపాలి సీలిచ్చిన, కంపెనీ దినాదినాభివృద్ధికై పాటుబడుచున్న భీమావాలి గరువు.

## 2

## కీర్తిశేషులైన లాలా లజపతిరాయి గారి అభిప్రాయము

వారు లాహోరులో నెలకొల్పిన లక్ష్మి ఇన్సూర్యెన్సు కంపెనీకి ఛైరుమెన్ (అధ్యక్షులు)గా నున్నారు. సాలీన అంత్యరిపోర్టు సభ యందు 26 అక్టోబరు 1928 తేదీని వారొసంగిన ఉపన్యాసములోని ముఖ్య సారాంశము—

1. హిందూదేశముయొక్క ఆర్థికాభివృద్ధిని పునర్నిర్మింపజేయ వలెనంటే మీయొక్క దేశాభిమానమును మీరు ఆచరించిరనే చూప వలెను. ప్రతిమానవుడు తనకు శీలుస్వంతవారకు స్వదేశీ భీమాకంపెనీల యభివృద్ధికి సహాయపడవలెను.

2. నేను భారతీయుడను. నేను భారతీయులందరిని కోరే దేమంటే భారతదేశములోని డబ్బు అంతయు భారతదేశములోనే ఉంటూ ఆ డబ్బు భారతీయులందరి క్షేమముకొరకే ఖర్చుపడవలెనని కోరుచుంటిని. ఈవిషయమై ప్రజలందరు తమబాధ్యతలను, తమ ధర్మములను గుర్తించవలెను.

స్వదేశీ భీమాకంపెనీలవా రందరు భీమావ్యాపారములను నిజాయతీతోను, మంచి నిపుణతతోను నడపించినయెడల ప్రజ లందరు తప్పక తమ ధర్మములను నెరవేర్చుచు తగినంత ప్రోత్సాహ మిచ్చెదరు. ప్రజలకు, కార్యనిర్వాహకులకు పరస్పర సహాయము లేనియెడల స్వదేశీ భీమావ్యాపారాభివృద్ధి నిజముగా జరుగనేరదు.

3. స్వదేశీ భీమాకంపెనీ లభివృద్ధికై గవర్నమెంటువారి సహాయముకొరకు జూడగూడదు. మన స్వప్రయత్నముల మీదనే ఆధారపడవలెను. ప్రజల సహాయము మున్నయెడల స్వదేశములోనుంచి అమితముగా ప్రతియేటు విదేశీయుల భీమాకంపెనీలకు దానవిక్రయాద్యధికారములు లేకుండ వంశపరంపరగా ననుభవించునట్లుగా యిచ్చేధన ప్రవాహము నరికట్టగలము.

4. ఈవిషయము మీఎదుట చెప్పినది ఎందుకంటే మీరంతా స్వదేశీభీమ కంపెనీ లభివృద్ధికై ప్రజలలో ప్రచారమును గావింతురనియే. స్వదేశీ భీమాకంపెనీలలోని ప్రతినాయకులున్ను, ప్రతిపట్టాదారున్ను తమ విధ్యుక్తధర్మముగా నెంచుకొని తమ శక్తిసామర్థ్యముల ననుసరించి స్వదేశీ భీమాకంపెనీ లభివృద్ధికొరకు ప్రచారము గావించెదరుగాక! యిట్టి అమితమైన ప్రచారము జరిగినపుడే మనము అన్నివిధముల అభివృద్ధిలోనికి రాగలుగుదుము.

## 3

## కలియుగ ధర్మము

ధర్మము అనగా ఎవరిపనిని వారు దాతృత్వముద్వారా నిర్వర్తించుట. దాతృత్వమనగా ధనమునే యితరులకు దానముచేయ నక్కరలేదు. దాతృత్వములోనే త్యాగము, దయాళుత్వము నిమిడియున్నవి. ఈరెండు పనులను చేసిన నదియు దాతృత్వమే యనబడును. దాతృత్వమును నవలంబించిన మానవుడు నైతికముగను, సాంఘికముగను, ఆధ్యాత్మికముగను నభివృద్ధినొందగలుగువాడని చెప్పవచ్చును.

హిందూదేశమనిన దాతృత్వమునకు ప్రపంచమంతటిలోను పురాతనమునుండియు ప్రఖ్యాతినిగాంచెను. హిందూమతమనిన దాతృత్వమే. ధర్మమునకు పెనగొనను మనపూర్వికులైన హిందువులందరు దాతృత్వమును ఆచరించిన వారే యని దేశీయచరిత్రలవల్లనే కనబడు చున్నది. మనహైందవుల దాతృత్వమువల్లనే పరదేశీయులు భారతదేశములో నడుగుపెట్టుటయు, క్రమేణ రాజ్యాధిపతులగుటయు సంభవించినది. పరదేశములతో సంబంధము కలిగినది గావున మనముకూడ దేశకాలపాత్రల ననుసరించి నడవక తప్పనిసరి యగుచున్నది. ఆంగ్లేయుల పరిపాలనవల్లనే భారతీయులకు సహజముగా నుండే స్వార్థత్యాగము, భక్తి, సాంఘికసేవ పరస్పరసహాయమనునవి కొంతవరకు నశించినవని చెప్పక తప్పదు. ఆంగ్లేయపరిపాలనవల్లనే అనాత్మవాదము, ధనకాంక్ష, స్వార్థకారి, మున్నగునవి అబ్బుచున్నవి. ఈ పాశ్చాత్య నాగరికతవల్లనే జీవితమును గడపుటెటుల అనుసమస్య వచ్చినది. ప్రస్తుతము అమలులోనున్న ప్రాపంచికనాగరికత సంపర్కమువల్లనే దాతృత్వము అను దానికి నూతన మార్పు వచ్చినది. ప్రస్తుతదేశకాలపాత్రలనుబట్టి దాతృత్వమునువది భీమావ్యాపారము (ఇన్సూరెన్సు) అనుపేరుతో నున్నది. ప్రపంచకమందంతటను నీవ్యాపారము వలయ ల్లికవలె నల్లుకొనిపోవుచున్నది. భీమాచేసిన ప్రతిమనిషి తనకుటుంబమునకు, మానవసంఘమునకు, దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి ఉపకారమును నూతనయుగములో చేసినవాడగుచున్నాడు. భీమావ్యాపారమువంటి దాతృత్వవ్యాపారము ప్రస్తుతములో మరొకటి యేదియు లేదు. భారతదేశము మరల తన పూర్వపు దాతృత్వమును జ్ఞాపకముజేసికొని యీనూతనదాతృత్వములో పాల్గొని యీవద్వార తమయొక్క ఆర్థికసాంఘిక సమస్యలను పరిష్కరించు గాక!



శ్రీ శివాజీ మహారాజు

# అమరావతీస్తూపము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

## స్తూపము

స్తూపమనగా మట్టిదిబ్బ; కాని ప్రతి మట్టిదిబ్బకు స్తూపమను పేరు లేదు. బౌద్ధవాఙ్మయమున స్తూపమునకు శారీరకచైత్యమని పేరు. శారీరకచైత్య మనగా నిర్వాణము నొందినబుద్ధుని యస్థికలనుగాని, భస్మమునుగాని భద్రపఱిచియుంచుట కగు నొక సమాధివంటి నిర్మాణము. ఈవిధమైన నిర్మాణములకు నేపాళదేశమున చైత్యములని పేరు. వీటినే బర్మాలో 'పెగోడా' లనియు, సింహళమున "దాగబ" (వ్యావహారికమున దాగోబా) లనియు నందురు. "దాగబ" యనునది 'ధాతుగర్భ' యనుదాని తద్భవము. అస్థ్యాద్యవశేషములను భద్రపఱిచి యుంచునట్టి నిర్మాణభాగమునే 'దాగబ' యందురు. దానిపైన కప్పబడునట్టి దిబ్బకే స్తూపమని పేరు. అయితే, యిటీవల ఈ రెండుభాగములకును కలిసియే స్తూపమను వ్యావహారికనామము చెల్లుచున్నది. కాని కాలక్రమమున ఒక బుద్ధభగవానుని యొక్కయే కాక బౌద్ధమత ధర్మప్రవర్తకులైన వారిలో మహనీయులకు సంబంధించిన అవశేషములను కూడ ఈ రీతిని భద్రపఱిచియుంచి స్తూపములను నిర్మించుటయు కలదు. ఇట్టి నిర్మాణములలో బుద్ధునియొక్కగాని, లేక సుప్రసిద్ధులును,ఋషితుల్యులుఅయినబౌద్ధమహాత్ములయొక్క కాని ఎముకయో, దంతమో, భిక్షాపాత్రమో, తలవెంట్రుకయో ఏదోయొకటి యుండును. ఇట్టి వాటితో కూడిన దిబ్బకే స్తూపమనుపేరు ఇప్పుడు రూఢముగ వాడుచున్నారు. ఇట్టి స్తూపములు ఆంధ్రదేశమున, అందు ముఖ్యముగ కృష్ణానదీతీరమున చాల గలవు. తమ మతమునకు సంబంధించిన నిర్మాణము లగుటచే బౌద్ధులకు ఇవియన్న అత్యంతభక్తి గౌరవములు. దానం జేసియే బౌద్ధులు ఇట్టినిర్మాణములను వట్టి మట్టిదిబ్బలుగనే వదలివేయక, హిందువులు తమ దేవాలయములకు వలెనే, వారును వాటికి చిన్నెలును వన్నెలును బెట్టి,చూడముచ్చటయిన రకరకముల శిల్ప చిత్రములతో తీర్చిదిద్ది వాటిని కడుమనోహరముగ నిర్మించియున్నారు. ఇట్టి నిర్మాణము లోకవిధముగ బుద్ధనిర్వాణమునాటినుండియు ఉండిన దగుటచేత"బుద్ధ, ధర్మ, సంఘము "లనుత్రిరత్నములను ఆరాధించు పరమభక్తులైన బౌద్ధుల సిద్ధహస్తముల స్తూపనిర్మాణ మొకకళయై క్రమక్రమాభివృద్ధిని గాంచెను. ఇందునుబట్టి అతిపురాతనములైన స్తూపములకును, అటుతరువాతిస్తూపములకును నిర్మాణకళలో కొంత పరిణామ ముండుటచేత కొన్ని కొన్ని వ్యత్యాసములు కాన్పించును.[1]

అందములైన బొమ్మలు, అలంకారములతో చెక్కిన సుందరములైన విగ్రహములు, పనివాని తనము చూపుచు చేయబడిన ముచ్చటయిన కర్రపని, చేతితో వ్రాసిన సుందరములైన చిత్రములు - నేత్రేంద్రియతర్పణములైన యిట్టివున్నచో బౌద్ధభిక్షువులును, భిక్షుణులునుగూడ అట్టి రంగులమెఱుపులు, కనులు కోరగించు అట్టిరూపములు ఉన్నచోటికి పోరాదను బుద్ధుని యుపదేశములు బౌద్ధమతగ్రంథములలోనే యున్నప్పటికి బౌద్ధమతావలంబకుల నిష్కలుషహృదయములు లోక

1. స్తూపముల ప్రాథమిక స్వరూపములు, తరువాత నవి పొందిన యభివృద్ధులు—వీటినిగురించి ఆర్. డి. బెనర్జీ గారు 'మోడరన్ రివ్యూ' పత్రికలో ఒక చక్కనివ్యాసము వ్రాసియున్నారు. ఇందునుగురించి విశేషము తెలిసికొనగోరువారు అది చదువదగును.

మును తరింపజేయ నవతరించిన ప్రేమావధియగు తమ బుద్ధ భగవానునియెడ భక్తిరసప్రపూర్ణములై వారిని ఆరాధకులుగ దిద్దెను. ఈరీతిని కాలక్రమమున భక్తి రహితమైనమతమున భక్తియు, ఆరాధనారహితమైన మతమున ఆరాధనయు మొలకలెత్తి ఆదిబౌద్ధముయొక్క స్వరూపస్వభావములను సంపూర్తిగ మార్చివేసెను. బౌద్ధ మతము భక్తిమతముగ మారిననాటినుండియే శిల్పకళలో బుద్ధునికి రూప మేర్పడినది. అంతకుపూర్వము శిల్పము లలో బుద్ధుని జూపవలసివచ్చినప్పుడు భౌతికప్రపంచపు కొలతలకు లోనైన నామరూపములనుండి ఆమహాత్ముడు విమోచనము—నిర్వాణము—పొందెనని తెలుపుటకు గుర్తుగ అచ్చటి స్థలమును ఖాళీగ ఉంచువారు: బుద్ధచిత్ర ముండవలసినచోట దాని యభావమే పై నుడివిన యట్టి భావమునకు చిహ్నముగ నుండెడిది. క్రమక్రమ ముగ నీస్థలమును శ్రీపాదములు (బుద్ధభగవానుని పాదములు) ఆక్రమించినవి. మరికొంతకాలమునకు బుద్ధ రూపమే చిత్రిత మగుచుండెను. శిల్పులు ప్రధాన ముగ ప్రజలలో మతవిషయకమైన ప్రబోధమును గలిగించుటకొఱకును, బుద్ధభగవానుని ఘనతను దెల్పు గాథలను చిత్రించి తన్మూలమున బౌద్ధమత వ్యాపనము సేయుటకొఱకును స్తూపశిల్పమును వినియోగించువారు. రామాయణ మహాభారత గాథలవలెనే బౌద్ధగాథలును చాల కలవు. మొట్టమొదట ఇట్టిగాథలు చాలతక్కువగ ఉండెడివి. కాని బౌద్ధమతము భక్తిమతముగ మారినకొద్ది ఇట్టిగాథలునుసంఖ్యాతీతములయ్యెను.సిద్ధార్థుడు(మతమును కనిపెట్టకపూర్వముబుద్ధునికిగలపేరు) తొలుత బోధిసత్త్వుడుగ పెక్కుజన్మములెత్తి దయ, అహింస, ప్రేమలనునిదానముగ తనజీవితమును గడపెనని తెలుపు అట్టిగాథలనే జాతక కథ లందురు. ఇవియే బుద్ధునిపూర్వజన్మవృత్తాంతములు. ప్రపంచవాఙ్మయములోని కథావళిలోనికెల్ల ఈ జాతక కథావళియే కడుంగడు ప్రాచీనమైనదనియే కాక, ఐరోపీయ ప్రాచీనవాఙ్మయములోని చాలకథలకుగూడ ఆకరము లిందే కలవనియు భారతీయ, విదేశీయ ప్రాచ్య పరిశోధకపండితులెల్లరును అభిప్రాయ మిచ్చియున్నారు. ఈ జాతకకథలే స్తూపశిల్పమున ప్రధానశిల్పచిత్రములు. అంతేకాక, విష్ణ్వాలయమున నేను రామాయణగాథలును, శివాలయమున శైవగాథలును చిత్రింపబడునట్లే నాడు స్తూపములమీద జాతకకథలనుమాత్రమే కాక బుద్ధుని జీవితకథలనుగూడ చిత్రించుచుండువారు. బౌద్ధస్తూప మీ విధమైన శిల్పములతో చూచుటకు నేత్రపర్వమై యలరారుచుండెడిది. సిద్ధహస్తులైన శిల్పులు తమబుద్ధిని, ప్రజ్ఞను సమస్తము భగవదర్పితముచేసి శిల్పకళారూపముననే భగవానుని ఉపాసించువారు.

### అమరావతీస్తూపము : చరిత్ర

అట్టి యుపాసకులు బుద్ధభగవానుని పాదపీఠిని కానుకగా సమర్పించిన పూజాకుసుమములలో అమరావతీస్తూప మొకటి. ఇది ఎప్పుడు నిర్మితమైనదో స్పష్టముగ దెలిసికొనుటకు మన కాధారములు లేవు; కాని బౌద్ధమతము హిందూదేశమునం దంతట వ్యాపించినది అశోకచక్రవర్తికాలములోనే. ఆతనికాలములోనే ఇతని రాజధానియైన పాటలీపుత్రమున మూడవ బౌద్ధమహాసభ జరిగెను. ఈ చక్రవర్తికి పూర్వమునుండియు బౌద్ధులలో బౌద్ధులకు కొన్ని మతవిషయములను గురించి పొరపులు సంభవించి హృదయములలో అగ్ని రగులుచుండెను. అశోకచక్రవర్తి చీలిపోవనున్న సంఘమును ఏకీకరించుటకై చాల పని చేసెను గాని కార్యము లేకపోయెను. పాటలీపుత్రమున జరిగిన సభానంతరము బౌద్ధసంఘమున చీలిక యేర్పడెను. ఈచీలిక యేర్పడుటకు కారణము మతాచార వ్యవహారములను గురించిన దశవస్తువులను (దశవత్థూని) గురించి యని కొందఱును, మహాదేవ భిక్షువుయొక్క పంచవిషయములను గురించి యని కొందఱును చెప్పుదురు. ఈవివాదమునకు పర్యవసానముగ అర్హతులు(థేరులు -స్థవిరులు) ఒకపక్షమును, బౌద్ధసాంఘికులు (వీరివాదము నంగీకరించినవారిలో కొందఱు అర్హతులును కలరని తెలియుచున్నది) ఒకపక్షమునైరి. 'థేరవాదము'నకు ప్రతికూలమైన సాంఘికవాదము నంగీకరించినవారలే

'మహాసాంఘికు' లనబరగుచున్నారు. నాటినుండి పాటలీపుత్రము మహాసాంఘికులకు ప్రధానస్థల మయ్యెను.

పాటలీపుత్రసభానంతరము అశోకచక్రవర్తి బౌద్ధమతమును దేశదేశముల వ్యాపింపజేయుటకై మతబోధకులను బంపెను. బౌద్ధమతవ్యాపనమునకై చక్రవర్తి యాజ్ఞ శిరసావహించి దేశాంతరముల కరిగిన మతబోధకులు మాగధులకు దెలియవచ్చినవారు వీరు :

౧. కాశ్మీర గాంధారములకు "మజ్ఝంతిక" భిక్షువు.

౨. మహిషమండలము (ఆంధ్ర, మైసూరు దేశములు) నకు వెళ్లినవాడు "మహాదేవ" భిక్షువు.

౩. "వనవాసి" (రాజపుత్రస్థానము ?) "రక్షిత" భిక్షువు.

౪. "అపరాంతక" మునకు "ధమ్మరక్షిత" భిక్షువు.

౫. "మహారట్ఠ" మునకు "మహాధమ్మరక్షిత" భిక్షువు.

౬. "యవనలోక" మునకు "మహారక్షిత" భిక్షువు.

౭. "హిమవంతపాద" మునకు "మజ్ఝిమ", "కస్సపు"లు.

౮. "సువణ్ణభూమి"కి "సోణక", "ఉత్తరు"లు.

౯. "తాంబపణ్ణి"కి "మహింద" భిక్షువు.

ఈ పై విషయముల వలన ఆంధ్రదేశమున బౌద్ధమతము అశోకచక్రవర్తినాటినుండి నెలకొన్నదనియు, మతబోధకుడు "మహాదేవు" డనియు, వచ్చిన మతము మహాసాంఘికవాదమునకు సంబంధించిన బౌద్ధమతమనియు తేలుచున్నది.

కాని అశోకుని కాలమునుండియు ఇది ఆంధ్రదేశమున బాగుగ వర్ధిల్లినట్లు కాన్పించదు. దీనికి త్వరితముగనే అంతరాయము సంభవించెను. అశోకుని యనంతరము మగధను పాలించిన 'కునాల', 'దశరథు'ల వెనుక 'సంప్రతి' రాజ్యమునకు వచ్చెను. ఈతడు జయస్వాలుపండితుల పరిగణనము ప్రకారము క్రీ. పూ. ౨౨౦ మొదలు ౨౧౧ వరకు రాజ్యముచేసెను. హేమచంద్రుని 'పరిశిష్టపర్వము' ననుసరించి అశోకచక్రవర్తికి బౌద్ధమతమున నెట్టి విపరీతాభినివేశ ముండెనో అట్లే యీతనికి జైనమతమన్న అంతటి యభినివేశ ముండెననియు, అశోకునివలెనే ఈతడును జైనమతవ్యాపనమునకై ఆంధ్ర, ద్రమిళ దేశములకు మతబోధకుల నంపి యచ్చట జైనమతమును వ్యాపింపజేసెననియు తెలియుచున్నది. అశోకచక్రవర్తి మరణానంతరము ఆంధ్రులు మగధసామ్రాజ్యమునకు లోబడియుండిరో లేదో తెలియదు కాని, ఆంధ్రదేశమున జైనమతమును వ్యాపింపజేయుటకై 'సంప్రతి' చేసిన ప్రయత్నములమూలమున—జైనమతము ఆంధ్రదేశమున బాగుగ వ్యాపించినను వ్యాపింపకపోయినను—మహాదేవభిక్షువు తలపెట్టిన బౌద్ధమతవ్యాపనకార్యమునకు కొంతవఱకైనను అంతరాయము కలిగియుండునని యూహింప నవకాశము కలదు. 'సంప్రతి'ప్రయత్నముల మూలమున ఆంధ్రదేశమున జైనమతము బాగుగ వర్ధిల్లినదో లేదో తెలిసికొనుట కాధారములు చాలవుకాని, బౌద్ధమతము తాత్కాలికముగ కొంతయణిగియుండినను తరువాత అనతికాలముననే విజృంభించి యుండెననుటకు బౌద్ధవాఙ్మయమున, అమరావతీస్తూపశిల్పముననే మనకు తార్కాణములు.

ఆంధ్రదేశమున బౌద్ధమత మెప్పుడు ప్రారంభమైనదియు మనకుస్పష్టముగ దెలియుచునేయున్నది. కాని అమరావతీస్తూప మెప్పుడు నిర్మింపబడినదియు దెలిసికొనుటకుమాత్రము ఆధారములు లేవు. ఈస్తూప నిర్మాత అశోకుడే యని కొంద ఱందురు. అశోకుడు స్తూపమును నిర్మించినను నిర్మింపకపోయినను, ఆచక్రవర్తి యీ నిర్మాణమునకు దన సంపూర్ణాదరము నొసంగి యీ సంస్థను పోషించుచుండెనని తెలుపువారు కొందఱు కలరు. ఇవియన్నియు అశోకచక్రవర్తియొక్క బౌద్ధమతాభిమానమునుబట్టి చెప్పు గాథలే కాని ఆధారసహితములైనవి కావు. ఒక్క అశోకచక్రవర్తియే కాక బుద్ధభగవానుని భక్తులు చాలమంది చాలచోట్ల స్తూపము లనేకములు నిర్మించినట్లు బౌద్ధగాథలు కలవు. స్తూపనిర్మాణము రాను

రాను బుద్ధభగవత్ప్రీత్యర్థముగ సమర్పించు నొక కానుక యయ్యెను. పెద్దపెద్ద స్తూపములకడ ఈవిధమున కాను కలుగ లేచిన చిన్నచిన్న స్తూపము లెన్నియో యుండి కనట్లు మనకు దెలియుచున్నది. అశోకచక్రవర్తి దీనిని నిర్మించెనని చెప్పుటకు ఆధారములు కానరానందున ఇది యాతనిదని కాదనియే నమ్ముట యుక్తము.

అయితే ఇది అశోకచక్రవర్తికి తరువాతదైనను క్రీస్తుపూర్వము నిర్మింపబడినదా? క్రీస్తుతరువాత నిర్మింపబడినదా? ఇది మనము తేల్చవలసియుండును.

చాలమంది యీస్తూపము క్రీస్తుపూర్వమే నిర్మింపబడినదనియు, ప్రాయికముగ ౨౦౦ సం.ల ప్రాంతమున గట్టబడి యుండవచ్చుననియు దెలిపియున్నారు. ఇట్లు చెప్పుటకు వారికి స్తూపనిర్మాణకళాశిల్పమే ఆధారము. నిర్మాణశిల్పకళలో ప్రాథమిక స్తూపములకును, తరువాతిస్తూపములకును చాల వ్యత్యాసము లుండునని యిదివరకే చెప్పబడియున్నది. శిల్పకళలోని ఈవిధములైన వ్యత్యాసముల ననుసరించియే క్రీ. పూ. నిర్మితమైన ప్రాథమిక స్తూప మొకటి తప్పక యుండెననియు, కాలక్రమమున ఆ యసలుస్తూపమునకు చాల నిర్మాణములు చేర్చబడినవనియు చెప్పుట కవకాశము కలుగుచున్నది. స్తూపనిర్మాణకళలోనే కాక చిత్రశిల్పమునకూడ పరిణామము కలిగెను. ఈవిధమైన పరిణామము ననుసరించికూడ ప్రాచీనమైనవి కొన్నియు, అర్వాచీనమైనవి కొన్నియు శిల్పములు కలవని తజ్ఞులు తేల్చియున్నారు.

ఇందువల్ల క్రీస్తుపూర్వము ప్రాచీనకాలముననే అసలు స్తూపము అమరావతిలో వెలసినదని తెలిసినను దీనికాలమును స్పష్టముగ నిర్ణయింప వీలగుటలేదు. కాని క్రీ. పూ. ౨౦౦ ల ప్రాంతమున ధనకటకము రాజధానిగ ఆంధ్ర దేశము నాంధ్రరాజులు పరిపాలించుచుండినప్పుడే ఇది కట్టబడినట్లు పెక్కురు చెప్పుచున్నారు. బర్జెస్ మొదలైన పండితులు ఈస్తూపమును గురించి ఉద్గ్రంథములు వ్రాసి, నిర్మాణసముదాయమున ఏవేవి ప్రాచీనములో, ఏవేవి అర్వాచీనములో నిరూపించియున్నారు. ఇట్టి నిరూపణమున వారికి శాసనములుకూడ గొంతవఱకు తోడ్పడినవి. కొన్ని నిర్మాణములమీది శాసనములు కొన్ని "మౌర్యలిపి" (అనగా అశోకచక్రవర్తి శాసనములలోని లిపి)కి ఇంచుక చేరికయైన లిపిలో నుండుటచేత, అట్టి శాసనములు గల నిర్మాణములు స్తూపనిర్మాణసముదయ మంతటిలో కడుప్రాచీనములై యుండవలయు నని నిశ్చయింపబడెను. ఈస్తూపము క్రీ. పూ. ౨౦౦ల ప్రాంతమున ఆంధ్రులకాలములో నిర్మితమైన ట్లూహింప బడుచున్నను, ఈవిధమైన యభిప్రాయమును సప్రమాణముగ రుజువుచేయుటకు మొదటి ఆంధ్రరాజుల శాసనము లేవియు ప్రాచీననిర్మాణము లన్నవాటిమీద కానరాలేదు; కాని గౌతమీపుత్ర శ్రీ సాతకర్ణియొక్క కొడుకైన వాసిష్ఠీపుత్ర శ్రీపులమావినుండి కడపటి యాంధ్రరాజుల శాసనములు అరుదుగనే యైనను కాన్పించుచునే యున్నవి. స్తూపనిర్మాణసముదయ మంతటిలో అర్వాచీననిర్మాణములే ఎక్కువగ నుండినట్లు పరిశీలనముమీద తేలుచుండినందున ఈ స్తూపము నిర్మితమైన మొదటి రోజులలోకంటె తరువాతనే పేరును పెంపునుగాంచి జగదానందకర మయ్యెనని యూహింపవచ్చును.

మహాచైత్యము : చైత్యకులు

మహాదేవునినాటినుండియు ఇది మహాసాంఘికులకు ప్రధానమైన పవిత్రస్థలముగనే యుండెను. శాసనములలో ఇది "చెతికియానం నికాయస" "మహాచెతికియ" మని పేర్కొనబడి యున్నది: అనగా "చైత్యకనికాయము" యొక్క "మహాచైత్య" మని యర్థము. "చైత్యశాల"కు సంబంధించిన బౌద్ధసంఘమునకే "చైత్యకనికాయ" మని పేరు. ఈచైత్యశాలాసంస్థాపకుడు "మహాదేవుడే" యని "టిబెట్" బౌద్ధగ్రంథములుకూడ దెలుపుచున్నవి. అందువలన మహాసాంఘికులలో "చైత్యకు" లొక్కరని తెలియుచున్నది. వీరిసంఘమును దాక్షిణాత్య బౌద్ధులు "చైత్యవాద" సంఘమనియు, ఉత్తరాదిబౌద్ధులు

"చైత్యశాల" సంఘమనియు వ్యవహరించుచుండువారు.

## పూర్వశాల : అపరశాల

కృష్ణానదీతీరమున ఆంధ్రరాజులకు రాజధానియైన ధనకటకమునకు పశ్చిమమునకూడ పూర్వదిశనున్న మహాచైత్యమువలెనే మఱియొక మహాచైత్యము వెలసినది. అదియు మహాసాంఘికులైన చైత్యకులయొక్క నివాసమే. ధాన్యకటకరాజధాని కపరదిశ నామహాచైత్యము వెలసిననాటినుండి అచ్చటి బౌద్ధసంఘమునకు "అపరశాల" సంఘమనియు, ధాన్యకటకమునకు తూర్పుననున్న మహాచైత్యమునకు సంబంధించిన బౌద్ధసంఘమునకు "పూర్వశాల" సంఘమనియు పేర్లు కలిగెను. అందువలన ధాన్యకటకమునకు పశ్చిమముననున్న మహాచైత్యవిహారము "అపరశాల" యనియు, అందలి బౌద్ధులు "అపరశాలికు"లనియు, ధాన్యకటకమునకు దూర్పుననున్న మహాచైత్యవిహారము "పూర్వశాల" యనియు, అందలి బౌద్ధులు "పూర్వశాలికు" లనియు వ్యావహారికనామమేర్పడెను. వీరెల్లరు మహాచైత్యకులే. "పూర్వాపరశాలల ననుసరించి వీరు రెండు తెగలుగ చీలిపోయిరి. ఈ "పూర్వాపరశాలలు" రెంటిలో అశోకవర్ధన ప్రేషణమున దక్షిణదిశాగతుడైన మహాదేవాచార్యులచే మున్ముందు సంస్థాపితమైనది "పూర్వశాల" యేయని మనకు బౌద్ధగ్రంథముల ప్రమాణమే కలదు. "పూర్వశాల", "అపరశాల"పదములు రెండును శాసనములలో "పువసేలియ"[1], "అపరసేలియ" లేక "అపరమహావనసేలియ" అనురూపములతో వచ్చును. "అపరసేలియ" అనగా"అపరశాల"యనియు,"అపరమహావనసేలియ"యన "అపరమహాచైత్యశాల"యనియు అర్థము. "వన" యను పదమునకు చైత్యమనునర్థమున బౌద్ధవాఙ్మయమున ప్రయోగములు కలవు. పూర్వాపరశాలాసంఘములు కాలక్రమమున మరల "రాజగిరికు" లనియు, "సిద్ధాంతికు" లనియు రెండు తెగలుగ విడిపోయెను. మొత్తముమీద ఇచ్చటి "మహాసాంఘికులు" అయిదు తెగలుగ విడిపోయిరని కొందఱందురు. వారి ప్రకారము పూర్వాపరశాలికులు కాక తక్కిన మూడు తెగలు ఇవి : హైమవతులు, (2) లోకోత్తరవాదులు, (3) ప్రజ్ఞప్తివాదులు. ఈ తెగలను గురించియు, ఈ సంఘములను గురించియు నిచట ఇప్పుడు వ్రాయుట అప్రస్తుతము; కాని వీరందఱునుకూడ మహాసాంఘికులే యనియు, అందును మహాచైత్యకసంఘములోనివారే యనియు మాత్రము జ్ఞాపక ముంచుకొననలయును. పూర్వశాలామహాచైత్య

1. శాసనములలోను, వాఙ్మయములోను వచ్చు ఈపదముల యప్రాకృతిరూపములు "పూర్వశైల", "అపరశైల"ములుగా విదేశీయులును, స్వదేశీయులునైన ప్రాచ్యపరిశోధకపండితులు నిర్ధారించియున్నారు. అమరావతిదగ్గర 'శైలము' (కొండ-గుట్ట) ఏమియు లేకపోవుటచేత అచ్చటి మహాచైత్యమునకు "పూర్వశైల"నామము సరిపడదనియు, 'సేలియ' అనుదాని సంస్కృతిరూప మొకవేళ 'శాల' యై యుండవలెనేమో యనియు, అందువలన "పూర్వశైల" మనియు, "అపరశైల" మనియు ఇంతవరకు పరంపరాగతముగ వ్యవహరింపబడుచువచ్చుచుండెనవి. ప్రాయికముగ "పూర్వశాల", "అపరశాల" లుగ సంస్కరింపదగియుండుననియు, "ఘంటశాల" యనునదికూడ ప్రాకృతమున "కంటకసేల"యనియున్నదనియు, దానిని ఇప్పటి"ఘంటశాల"గా గుర్తించియున్నారనియు, కాని ఘంటశాలయొద్ద-అది "శైల"మనుటకు-అచ్చట కొండకాని గుట్టకాని లేదనియు, ఈ కారణముల ననుసరించి పూర్వశైల, అపరశైల, కంటకశైలములలోని ద్వితీయపదము,శైల అయియుండదనియు, అది 'శాల' కాదగుననియు సంభావనాసందర్భమున మన్మిత్రులైన శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారొకప్పుడు నాతో చెప్పియున్నారు. ఇటీవల నీ "అమరావతీస్తూపము"ను గురించిన పరిశోధనకై గ్రంథములు చదువునప్పుడు పరిశోధకులైన బౌద్ధపండితులే పూర్వాపరచైత్య బౌద్ధసంఘములను "పూర్వశాలీయులు" (శైలకులు కారు) గను, "అపరశాలీయులు" (శైలకులు కారు) గను వ్రాసియుండుటచేత శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చెప్పునదే సత్యమగునేమో యని నాకుకూడ కొంతనమ్మకము కలిగి నేనును "పూర్వశాల", "అపరశాల" అను నామములనే వాడియున్నాను. అదియునుంగాక, 'కంటకసేల' అనుపదమే ఒక ప్రాకృతిశాసనమున "కంటకసాల" రూపముననను గనబడుచున్నది. అయినను ఈ విషయమున నింకను పరిశోధన జరుగవలసియున్నది. యథోచితిసంభావణ సందర్భమునందలి విషయములను వారి యనుమతిలేకయే యిచ్చట వెలిబుచ్చినందులకు శ్రీశాస్త్రిగారు నన్ను మన్నింప ప్రార్థితులు.

మును, అపరశాలామహాచైత్యమునే కాక వేటొకచైత్యము "కంటకశాల"యొద్ద గూడ నున్నట్లు శాసనములు పేర్కొనుచున్నవి. అదికూడ "మహాచైత్యము"గనే పేర్కొనబడియున్నది. దీని ననుసరించి చూచినచో దూరముగనైననేమి, దగ్గఱనైననేమి, కృష్ణానదీతీరమున నాడువెలసిన వన్నియు మహాచైత్యమునకు సంబంధించిన విహారములే యనియు, దానంజేసియే యచ్చటచ్చటి నిర్మాణములకు "మహాచైత్య" నామము పొందింపబడె ననియు నూహింప నవకాశము కలుగుచున్నది. వీటిలో మనకిప్పటికి తెలిసినంతవఱకు పూర్వాపరమహాచైత్యములు కడుప్రసిద్ధమైనవి. పూర్వమహాచైత్యమున కించుక తరువాతిదైనను అపరమహాచైత్యముకూడ అనతికాలముననే ప్రసిద్ధినంది మహాసాంఘికబౌద్ధులకు పవిత్ర క్షేత్ర మయ్యెను.

అమరావతీస్తూపము: పేరుపెంపులు

అమరావతీస్తూపచిత్రములలో కడు ప్రాచీనములైనవి అరుదుగను, అర్వాచీనములైనవి (ఈవ్యాసమున అర్వాచీనము లనగా అసలుస్తూపము నిర్మితమైన రెండు వందల సంవత్సరములకు తరువాతివి అని యర్థముచేసికొదగును) ఎక్కువగనుగాన్పించుటచేత అసలుస్తూపము నిర్మితమైన మొదటినాళ్లకంటెను దరువాతనే సుప్రసిద్ధ బౌద్ధక్షేత్ర మయ్యెనని నిశ్చయింపనగును. మొదటి 'దశ' లలోనైనను దీనికి అంత గొప్పఖ్యాతి లేకపోలేదు. ఇందుకు సింహళదేశచరిత్రలే యాధారము. "తాంబపణ్ణి"కి (బౌద్ధవాఙ్మయమున సింహళద్వీపమునకు "తాంబపణ్ణి" యని పేరు) రాజైన "దుట్టగామణి" అనురాధపురమున "మహాథూప"(రువాన్‌వెల్లి మహాస్తూప)మును నిర్మించు సందర్భమున హిందూదేశములోని వేఱువేఱు ప్రాంతములనుండి అర్హతులు, శ్రమణులు, భిక్షువులు వేలకొలది బౌద్ధసాంఘికులతో నచ్చటికి వెళ్లిరట. ఇట్టివారిలో మహాఋషి (అర్హతుడు) మహాదేవు డొకడు. ఇతడు "పల్లవభోగ్గ"మునుండి నాలుగులక్షల అరువదివేల భిక్షువులతో అచ్చటికి వెళ్లెనట. ఇంతమంది నిజముగా అచ్చటికి వెళ్లినను వెళ్లకపోయినను ఇంతమంది వచ్చిరని చెప్పబడు "పల్లవభోగ్గము"న బౌద్ధమతము చాల నభివృద్ధిదశలో నుండినట్లు తెలిసికొనుటకు మాత్ర మీసంఖ్యలు తోడ్పడుచున్నవి. ఈ "పల్లవభోగ" మెచ్చటిది? విషయము, నాడు, దేశవిభాగము అనునర్థమున "భోగ" పదము వాడుకలో నుండినట్లు ప్రాచీనశాసనములవలన మనకు దెలియుచున్నది. (చూడు: ఉదాహరణములు: మహేంద్రభోగము; కవచకారభోగము; హోమనిభోగము మొదలైనవి)

ఇందువలన "పల్లవభోగ(భోగ్గ)" మనునది పల్లవదేశమనికాని, పల్లవవిషయమనికాని, లేకపల్లవనాడని కాని అర్థము చెప్పకొనవలసియుండును.[1] ఇప్పటి "పలనా"డనునది "పల్లవనాడే" యని కొందఱు చరిత్రకారుల యభిప్రాయము. అందువల్ల "పల్లవభోగము" ఇప్పటి "పలనాడే" యని నిశ్చయింపవచ్చును. ధాన్యకటకము "పల్లవపరిపాలితదేశము"న నుండినట్లూహింప నాధారములు కలవు. ఈ కారణములచేత అమరావతీస్తూపము నిర్మితమైన మొదటి 'దశ'లలో నైనను ప్రఖ్యాతి గాంచకపోలేదని నిశ్చయింపవచ్చును. కాని స్తూపనిర్మాణములు వృద్ధిమై అది పెంపును గాంచినదిమాత్రము అసలు స్తూపము నిర్మితమైన ౨౦౦ ల సంవత్సరములకే యని చెప్పవచ్చును. అమరావతీస్తూపమునందలి ప్రాచీన, అర్వాచీన శిల్పపద్ధతి యిట్టి యూహ కెడమిచ్చుచున్నది.

మహాయాన, హీనయానములు

బౌద్ధమతమునం దద్భుతపరివర్తనము జరిగిన కాలమును, ఈస్తూపము పెంపుచెందినకాలము నించుమించుగ నొక్కటే. ఇందువలన ఆపరివర్తనమునకును, ఈ పెంపు

1. ఈ 'పల్లవ భోగము' "పలనాడు" కావచ్చు ననుటకు నాకుగల యాధారములను వేఱొకవ్యాసమున నిరూపించెదను. "పల్లవభోగము" "పలనాడే" యని నిశ్చితమైనచో ఆంధ్రచారిత్ర చతురానన బిరుదాంచితులైన శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు మొదలగువారు చెప్పినట్లు పల్లవులు తొలుత ఆంధ్రదేశీయులే యనియు, పిదపనే వారు "దక్షిణాది"కి వ్యాపించి "కాంచీపురము"ను రాజధానిచేసికొనియుండు రనియు నిర్ణయింపవలసి యుండును.

నకును దగ్గఱసంబంధము కలదని యూహింప దగును. ఆ పరివర్తనమిది. బౌద్ధమత మదివఱకున్న పంథను విడిచి క్రొత్తపంథ ద్రొక్కెను. ఈ పరివర్తనమువలననే ఇందు భక్తిబీజములు నెలకొనెను: అనగా బౌద్ధ మొకవిధముగ భక్తి మతముగ మారెను: అది శైవ, వైష్ణవముల వంటి భక్తిమతము కాదు కాని బౌద్ధసంఘమును ఆరాధకులుగ దిద్దిన భక్తి మతము. ఈ మార్పుతో బౌద్ధమతమున పెక్కుసంస్కృతులు జరిగెను. వేదాంతతత్వములు మాఱినవి; ఆచారములు మాఱినవి; మత గ్రంథములలోనే మార్పు కలిగెను. ఇంతయేల, అదివరకున్న బౌద్ధముయొక్క స్వభావమే మాఱిపోయెను. బౌద్ధసంఘమున నిదివఱకు సంభవించిన మార్పులకంటె ఇది గొప్ప మార్పు. ఈమార్పున కంగీకరించినమతము ఒకపక్షముగను, అంగీకరింపని ప్రాచీనాచార వాద మతము వేఱొక పక్షముగను ఏర్పడెను. ఇట్లుచీలిపోయిన ఈ రెండుబౌద్ధ శాఖలకు ఇంతటినుండి శత్రుత్వము ప్రబల మయ్యెను. ఈమార్పు నంగీకరించిన శాఖకు "మహాయాన" మనియు, మార్పు నంగీకరింపని వృద్ధవాద శాఖకు "హీనయాన" మనియు పేరు కలిగెను. ఈ రెండుశాఖలకునున్న ప్రధానమైన భేద మిది: "హీనయాన"మున "నిర్వాణము" నొందుటకై "ప్రతిమనిషి" ప్రాపంచికసంబంధములనుండి విముక్తిపొంది భిక్షువై, అర్హాత శ్రమణక శుశ్రూష చేసి, బౌద్ధమత గ్రంథములగు "వినయ, సుత్త, అభిధమ్మ-పిటకము"లనుజదివి పరిజ్ఞాత కావలెను. "మహాయానము" నకు అట్టి ప్రాపంచికసంబంధ పరిత్యాగ మేమియు నవసరములేదు. బంధువులనుండి విడిపోవనక్కఱలేదు; ఆస్తిని త్యజింప నక్కఱలేదు; భిక్షువు కానక్కఱలేదు; తాను చేయువృత్తిని విడనాడ నక్కఱలేదు. తాను ఏవృత్తిలో నున్నను, ఏదేశమున నున్నను, సంసారిగ నుండియైనను, బౌద్ధమతమున విశ్వాసము, ప్రేమ, బౌద్ధమతపరిజ్ఞానము నుండి బుద్ధుని కొలుచుచుండిన జాలును. ఎట్టివాడైనను "నిర్వాణము" (బౌద్ధమతపరమావధి) నొంద నర్హుడే. "హీనయానము"నకును, "మహాయానము"నకును ఇంకను భేదము లనేకములున్నను ప్రస్తుతము మనకు కావలసినదియు, ప్రధానమైనదియు ఇదియే. ఇందువలన నంతవఱకు ప్రజలకు బౌద్ధమతమున విశ్వాసముండినను వారు భిక్షువులు లేక శ్రమణులు అయిననేకాని వారు 'నిర్వాణ పదవి' కర్హులు కారనియు, వారికి 'నిర్వాణ' ముండెడిది కాదనియు దేలుచున్నది. "ప్రతిమనిషి"ని—భిక్షువుగమారకయే,సంసారసంబంధములనుపరిత్యజింపకయే—నిర్వాణ పదవి' కర్హుని జేసినదియు, 'నిర్వాణము' "ప్రతిమనిషి"కి సులభసాధ్యము చేసినదియు ఈ "మహాయాన" బౌద్ధమతమే. మతవిషయకములైన నిబంధనలు సడలి, "నిర్వాణ" సాధకమైన మతము అందఱికి అందుబాటులోనికి వచ్చుటంజేసియే అనేకులీ 'మహాయాన బౌద్ధము' నవలంబించిరి. త్వరితముగనే "మహాయానము" విజృంభించెను. మనకు గానవచ్చు అమరావతీస్తూపపు పెంపంతయు నాటిదే.

## నాగార్జునాచార్యులు

ఈవిధమైన పరివర్తనము బౌద్ధమతమున కలుగుటకు కారణభూతమైన స్థలము కొందఱి యభిప్రాయమున ఈ యమరావతీ చైత్యమే. మఱికొంద ఱది కాశ్మీరగాంధారము లందురు. మహాయాన బౌద్ధమతము అమరావతిలో నుదయించినను ఉదయింపక పోయినను, అమరావతికి దానికి నెక్కువసంబంధము కలదని అంగీకరింపక తీరదు.

మహాయాన బౌద్ధమునకు కారణభూతుడైన బౌద్ధ మహర్షి నాగార్జునాచార్యులు. ఇతడే మహాయానమును గనిపెట్టెనని కొందఱి మతము. ఇతనికి పూర్వమే బౌద్ధసంఘమున మహాయాన బౌద్ధమతమునకు సంబంధించిన యభిప్రాయములు నిగూఢములై యుండెననియు, ఇట్టి యభిప్రాయములను వెలువఱుచుచు వచ్చినవారు నాగార్జునాచార్యులకు పూర్వమే కొందఱు కలరనియు కొంద ఱందురు; కాని ఎల్లరునుగూడ నాగార్జునాచార్యులవల్లనె 'మహాయానము' 'అభివృద్ధికి వచ్చినదని యంగీకరింతురు.

ఈనాగార్జునాచార్యులవారి తత్త్వమున(Philosophy)కే మాధ్యమికవాదమని పేరు. నాగార్జునాచార్యులవారుమాధ్యమికవాదమును బయలుదేఱదీసినది అమరావతీ చైత్యముననే యని బౌద్ధపరిశోధక పండితుల యభిప్రాయము. దీని ననుసరించి ఆంధ్రదేశము బౌద్ధమతమునకు సమర్పించిన కానుకలలో "మాధ్యమికవాద" మొకటి యని జెప్పవచ్చును. ఈయనయే ఈ "ధనకటక చైత్యసంఘారామము"ను (ధనకటకము ఆంధ్రరాజులకు రాజధానిగ ప్రసిద్ధి గాంచుటచేత తత్సమీపస్థితమైన ఈచైత్యమునకును ధనకటక మహాచైత్య మనియే పూర్వపు వ్యావహారికనామము) గొప్ప బౌద్ధ విద్యాపీఠము (విశ్వవిద్యాలయము)గ జేసెను. ఈ ధనకటక విద్యాపీఠము నాదర్శముగ గైకొనియే టిబెట్ దేశములోని "లాస్సా" నగరసమీపమున "డాపంగ్" విద్యాపీఠము నిర్మితమయ్యెనట.

నాగార్జునాచార్యులవారి కాలమునుగుఱించి కాని, వారి జన్మస్థలమునుగురించి కాని మనకు నిశ్చయముగ దెలియదు. వీరికాలమును గుఱించి పెక్కు వాదోపవాదములు కలవు. కొందఱీయన క్రీస్తుపూర్వము మొదటిశతాబ్ది యంతిమభాగమున నుండెనని చెప్పుదురు; మఱికొందఱు క్రీస్తుశకము రెండవశతాబ్ది మధ్యభాగమున నుండెనందురు. కాని చాలమంది క్రీస్తుశకము రెండవ శతాబ్దిలో నుండినదియే వాస్తవమని విశ్వసించుచున్నారు. ఇక ఆయన జన్మస్థలమునుగుఱించి: ఈయన మహాకోసలమున విదర్భలో పుట్టెనని కొందఱందురు. మఱికొందఱు కాంచీపురసమీపమున "కహోర"(?) గ్రామమున నుదయించినట్లు తెలిపెదరు. వేఱొక కొందఱు ఈయన ఆంధ్రుడే యనియు, ఆంధ్రరాజైన "సాతవాహను"నిచే నాదరింపబడినవాడనియు, ఆమహాదానపతి (Patroniser) యొక్క వితరణముమూలముననే 'శ్రీపర్వత' మున "శైలమండపాలయము"ను గట్టించెననియు జెప్పుచున్నారు. ఇందేది నిజమైనను, ఏది నిజము కాకపోయినను, నాగార్జునాచార్యులవారికి, ధనకటక (అమరావతి) మహాచైత్యమునకు నెక్కువసంబంధ ముండెననియు, ఆయనకు, ఆంధ్రరాజులలో నొక్కడైన సాతవాహనరాజునకు ఎక్కువ మైత్రి యుండెననియు, ఆరాజు ఈ యాచార్యుని కొఱకు "శ్రీపర్వతమున" "శైలమండపాలయాది నిర్మాణము"లను గావించెననియు చెప్పు సంగతులు సత్యమైనవి. తన్నాదరించిన "సాతవాహనరాజు" నిమిత్తమీయాచార్యులవారు పద్యమయమైన యొక "సుహృల్లేఖ"ను రచించి పంపెనట. ఆ "సుహృల్లేఖ"లో బుద్ధభగవానుని సుగుణసంపన్నత కంటికి కట్టినట్లు వర్ణింపబడినదట. దీని ననుసరించి చూచుచో, ఆంధ్రరాజులైన సాతవాహనులలో నాగార్జునాచార్యులకు సమకాలికులైనవారు కొందఱైనను బౌద్ధమత మవలంబించి యుందు రనునూహకవకాశము కలదు. నాగార్జునాచార్యుల యంతిమదశలో ఆయన కావాసస్థానమైన "శ్రీపర్వతము" నిదివఱకు "శ్రీశైల"మని భ్రమించియుండిరి కాని నాగార్జునకొండ (పల్నాడు)దగ్గఱ ఇటీవల త్రవ్వగా బయలుపడిన స్తూప శాసనముల ననుసరించి, నాగార్జునకొండయో, లేక తత్సమీపస్థమైన వేఱొక కొండయో (ప్రాయికముగ నాగార్జున కొండయే కాదగును) "శ్రీపర్వత" మనుపేర బరగుచుండినట్లు తెలియవచ్చుచున్నది (చూడుడు: నాగార్జున కొండస్తూపపు శాసనములు). ఈ'శ్రీపర్వతము' 'కాశ్మీర, గాంధార, చీనా, అపరాంత, వంగ, వనవాసి, తాంబపణ్ణిదీప'ఆదిదూరస్థదేశములలో బౌద్ధమతమునువ్యాపింప

1. ఈసుహృల్లేఖ చీనా, టిబెత్తు భాషలలోనికి భాషాంతరీకరింపబడినది. అందు చీనాభాషలోనికి దీనిని గుణవర్మ యనునతడు క్రీస్తుశకము ౪౩౧ ప్రాంతమున పరివర్తనము చేసెను. టిబెత్తుభాషలోనికిది క్రీస్తుశకము ౪౩౧ ప్రాంతమున "సింఘవర్మ"చేత ననువదింపబడెను. ఈ సుహృల్లేఖకు మూడవ అనువాదముకూడ కలదని తెలియుచున్నది. క్రీస్తుశకము ౬౭౩ వ ప్రాంతమున "ఇట్సింగ్"అను సుప్రసిద్ధ చీనాయాత్రికుడే హిందూదేశమును సందర్శించుసందర్భమున "తామ్రలిప్తి"నగరమునకు వచ్చినప్పుడు స్వయముగ అనువదించెనట. 'సుహృల్లేఖ'అను పేర 'టిబెత్తు' భాషనుండి అనువదింపబడిన యొకపద్యగ్రంథము ఇంగ్లీషుభాషను గలదు. ఇది నాగార్జునాచార్యులవారి 'సుహృల్లేఖ'కనువాద మగునో కాదో,

జేయు బౌద్ధులకు అత్యంతపవిత్రస్థానముగ జెప్పబడి యున్నది. ఇందునుబట్టి కృష్ణానదీతీరమున వర్ధిల్లుచుండిన బౌద్ధమతమునే అప్పటి ధనకటకసంఘారామము నందలి బౌద్ధులు పైనుడివిన దేశములలో వ్యాపింపజేయుటకు ప్రయత్నించుచుండినట్లు స్పష్టమగుచున్నది. వారి ప్రయత్నములు సఫలమయ్యెనా లేదా యన్నవిషయమును చర్చించుట కిది యదనుకాదు. ఆకాలమున నాగార్జునాచార్యావాసమైన పర్వతమగుటచేతనే (నాడు నాగార్జునాచార్యుల వారు బుద్ధునితరువాత బుద్ధునియంతటివారని పేరు కెక్కియుండుటచేత వారిమీదగల భక్తిగౌరవములకు సూచకముగ నాటి బౌద్ధులు) దానికి "శ్రీపర్వతము" (శ్రీవారు, శ్రీపాదములు అనునట్లు) అనుపేర వ్యవహరించి యుందురు. ఆమతముమీద గౌరవాదరణములు నశించి, ఆమతమే నశించినమీదట ఆకొండను వట్టి "నాగార్జునకొండ" అనుపేరు కలిగియుండవచ్చును.

ఒక్క "శ్రీపర్వతము"తోను, "అపరమహాచైత్యము"తోనేకాక నాగార్జునాచార్యులవారికి "పూర్వమహాచైత్యము"తో కూడ చాలసంబంధ ముండినట్లు టిబెట్టు గ్రంథముల ననుసరించి తెలియుచున్నది. ఓఢ్రదేశపురాజగు "ముంజ" భూపతికి బౌద్ధమత మిప్పించెననియు, "ఒడిసవి" (? ఒరిస్సా)లోను, ఇతరదేశములలోను పెక్కువిహారముల నిర్మించెననియు, అందు ముఖ్యముగ ధాన్యకటక చైత్యమునకు చుట్టు నొక ప్రాకారము (Railing) ను కట్టించెననియు ఆగ్రంథములు చెప్పుచున్నవి:

### అమరావతీశిల్పములు

అపరిమితాద్భుతకళాకౌశలమునుజూపుచిత్రశిల్పములు అమరావతిలోనివి, ఈ ప్రాకారముమీదవే. ప్రాకారమునకు వెలుపలిప్రక్కను, (స్తూపమున కభిముఖముగనున్న) లోపలిప్రక్కనుగూడ చిత్రశిల్పములు లెక్కకు మించి యున్నవి. అందు లోపలిప్రక్కనున్నవి అత్యంతరమణీయములని భరతవర్షమునందంతట పేర్వడియున్నవి. శిల్పకళోపాసకులైన బౌద్ధసాధకులచేతిలో రాయి మైనమైనది. బౌద్ధులప్రాథమిక శిల్పకళకు అమరావతియే పరమావధి యని కళావిమర్శకులైన ప్రాచ్య, పాశ్చాత్యపండితులెల్లరు నంగీకరించియున్నారు. ఈ "మహాయాన" కాలమున బుద్ధచిత్రములు కూడ వాడుకలోనికి వచ్చెను. బుద్ధప్రతిమను చిత్రించుపద్ధతి క్రీ. శ. మొదటిశతాబ్ది ప్రారంభప్రాంతమున గాని, మధ్యగాని ఆరంభమైయుండుననిి తజ్ఞుల యభిప్రాయము[1].

### అమరావతి అంతిమదశ

అమరావతీ చైత్యముయొక్క ప్రభ క్రీస్తుశకము నాలుగైదుశతాబ్దులవఱకు వెలిగిపోయినది. దాని పతనమున కదియే మొదలు. దీనికి కారణములు అనేకము లుండవచ్చును. క్రమక్రమముగ వైదికమతము పురికొనెను. వైదికమతాభిమానము లైన రాజ్యములు వెలసినవి. పల్లవులు, విష్ణుకుండిభూపతులు, చాళుక్యులు, గుప్తులు, వాకాటకులు మొదలైనవారు వైదికమతాభిమానులై యజ్ఞయాగాది సవనదీక్షలందు ప్రవృత్తులైరి. ఎట్లయిన నేమి, దేశమున బౌద్ధమత మంతరించెను. నాటి నుండియే "ధాన్యకటక చైత్యము" నకు బౌద్ధేతరుల పూజావేదికపై స్థానము దొరకలేదు. అయినను క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దివఱకు మతసంస్థగ గాక ఉత్కృష్టశిల్ప కళాభిజ్ఞత కది యపూర్వోదాహరణముగనే నిలిచిపోయెను. అట్టిస్థితిలోకూడ అది బౌద్ధవైదిక మతవిభేదవిజ్ఞానము నెఱుంగని జానపదులనుండి పూజలంగొనుచుండినట్లు కొన్ని తార్కాణములున్నను అవి సక్ర

1. "The only possible conclusion is that the Buddha figure must have been produced simulta. neously, probably in the middle of or near the beginning of the 1st century A D., in Gandhara and in Mathura in response to a demand created by the internal development of Buddhism which was common ground in both areas, in each case by local craftsmen, working in the local tradition."

—*Coomaraswamy-Hist. of Indian and Indonesian Art, p. 60.*

తు. క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దినాటికి ఇది సంపూర్తిగ జీర్ణమయ్యు, నాశమును బొందియు సంతాప కరస్థితికివచ్చి, తుదకు సౌందర్యకళాభిజ్ఞులైన పాశ్చాత్యుల ద్వారముననే తన యస్తిత్వమును బయలుపఱుచుకొని, భిన్నాభిన్నములైన నిర్మాణ, శిల్పకళా శకలముల వలననే నేడు ప్రాచీనాంధ్రశిల్పకళాకుశలుర కళావిజ్ఞానమునకు స్మారకచిహ్నమై తనరారుచున్నది.

## అమరావతీ స్తూపము: వర్ణన

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటమున శ్రీయుత కానూరి వీరభద్రేశ్వరరావు గారు ఈ యమరావతీస్తూపము నిట్లు వర్ణించియున్నారు:

“ఈ స్తూపరాజ మొక ప్రాకారముచే పరివృత్తమై యుండెను. గుండ్రముగ నున్న అడుగుచట్రముమీద నీ స్తూపము గోపురాకారమున గట్టబడెను. దీని చుట్టునున్న ప్రాకారము వలయాకారముగ నుండెను. స్తూపముయొక్క అడుగుచట్రము వ్యాసము 162½ అడుగులు గలిగి ఆరడుగుల యెత్తున నుండును. ప్రాకారముయొక్క పరిఖము (చుట్టుకొలత) 803 అడుగులు[1]. ఈ ప్రాకారము 14 అడుగుల యెత్తు గలిగి చిత్తరువులు చెక్కబడిన నాపరాళ్లతో గట్టబడియుండెను. స్తూప మిటుకలతో గట్టబడి చిత్రవిచిత్రములైన నాపరాళ్లచే కూర్పబడెను. ఈ నాపరాళ్లమీద నత్యంత శిల్పనైపుణ్యము జూపు చెక్కడపుపని చేయబడినది. అప్రతిమాన సౌందర్యమునందును, శిల్పకళావిన్యాసమునందును ఈ స్తూప ప్రాకారముతో సరివచ్చునది హిందూదేశమున మరెచ్చటను గానరాదు. ఇది రమారమి పదియడుగుల యెత్తుగల నిలువు స్తంభములతో గట్టబడెను రెండు స్తంభము లొకదానికి నొకటి కలిపి పట్టిక కొంతయంతరముగ నిల్పబడి, మూడు అడ్డ స్తంభములతో (రాతి దూలములతో) కలుపబడినవి. ఇట్లు ద్వారములయొద్ద తప్ప ప్రాకార మంతయు స్తంభములతో గట్టబడెను; అనగా నిలువు స్తంభములలో సందులుచేసి వానిలో నడ్డరాతిదూలము లమర్చబడెను. ఈ స్తంభముల మీద సందు లేకుండ నీ చివరనుండి యా చివరవఱకు అంచు కట్టినట్లు మదురుబండలు వేయబడెను...... ఈ నిలువుస్తంభములును, అడ్డదూలములును, పై అంచురాళ్లును రెండువైపుల చిత్రవిచిత్రములైన చెక్కడపు పనులతో సుశోభితములై యున్నవి. మొత్తముమీద నీ ప్రాకారమునందు 186 నిలువు స్తంభములును, 348 అడ్డదూలములును, 803 అడుగుల పొడవుగల పై యంచుశిలలును ఉండెనని లెక్కవేయబడినది. ఈ ప్రాకారమునకు నలువైపుల గొప్ప ద్వారము లున్నవి.”

నాగార్జునాచార్యులవారిచే ధనకటక మహాచైత్యము చుట్టు నిర్మింపబడినదని ప్రసిద్ధిగాంచిన అత్యద్భుతచిత్ర శిల్పకళానిలయ మైన ప్రాకారరేఖ ఇదియే. ఈ ప్రాకారమునకును, లోపలనున్న స్తూపపుచట్రమునకును మధ్యనున్న శ్రీవీధి (ఉత్సవమార్గము) 13 అడుగుల వెడల్పున నున్నది. ఈ స్తూపములోని వలయాకృతిగల గోపురభాగము ఎత్తు 90 అడుగులు.

## చిత్రవివరణము

ఈ తొమ్మిదవ చిత్రములోని రెండు స్తంభములును ప్రస్తుతము బ్రిటిషుమ్యూజియములో నున్నవి. ఇవి ప్రాకారరేఖలోని మదురు బండలు తీసివేసిన స్తంభములు. మనకు గనబడునది స్తంభముల వెలుపలి వైపు దృశ్యము. ఎడమ వైపున నున్న స్తంభము నాగస్తంభము కాదగును. ఈ స్తంభము మీది చిత్రము లన్నిటిలో నాగమే ప్రధానస్థానము నాక్రమించి యున్నది. ఈ యైదుపడగల నాగమున కిరువంకలను పూజోపహారములతో నిరువురు స్త్రీలు మొసళ్లవంటి జంతువులమీద నిలుచుండియున్నారు. స్తంభమున కెగువభాగమున మధ్య చిన్న స్తూపము కలదు. దీనిని ఉభయ పార్శ్వముల నేనుగులు పూజించుచున్నవి. దిగువభాగమున కుబ్జవిగ్రహములు ఆడుచుపాడుచు అత్యంతానందమును బొందుచున్నవి. కుడివైపునగనబడు స్తంభము స్తూపస్తంభము. స్తూపమే యిందు ప్రధానస్థానము నాక్రమించినది. స్తూపముపైని ఛత్రములుకలవు. వీటిలో ఆఱు స్పష్టముగ గానవచ్చుచున్నవి. ఫెర్గ్యూసన్ గారు వీటిసంఖ్య పదునొకండని తెలుపుచున్నారు. కొన్ని శిథిలములైనట్లు కనబడుచుండుటవలన మొత్తముమీద నివి 11 ఉండిన నుండవచ్చును. స్తూపమునకిరువైపుల ఒక పురుషుడును, స్త్రీయు నిలుచుండి, పైకెత్తిన చేతులు మోడ్చి భక్తిపారవశ్యమున మ్రొక్కుచున్నారు. ఈ చిత్రములకు కుడి-యెడమవైపుల స్త్రీ-పురుషుల రెండు జంటలు— పూజాద్రవ్యములతో గానవచ్చును— స్తూపారాధన కేతెంచుచున్నారు. వీరి కాళ్లక్రిందగూడ మొసలివంటి చిత్రములు కలవు. స్తంభమున కెగువ భాగమున బోధివృక్షము నారాధించుచు ఏనుగులును, మరి కొన్ని యితరజంతువులును కలవు. మునుపటి స్తంభమువలెనే యీ స్తంభము దిగువభాగమునగూడ గ్రుల్లింతలు కొట్టుచున్న కుబ్జగణముల ప్రతిమలు కలవు.

పదవ చిత్రమున ఎడమవైపున నున్న స్తంభము పాట్లిపోవుటచేతనో, మరియేకారణముననో, చెడిపోయి యుండుటచేత దానిమీద నున్న చిత్రములను స్పష్టముగ దెలిసికొనుటకు సాధ్యముగుటలేదు. స్తంభమున కెగువను రెండు విగ్రహములు పల్లెరమునంటి దానినో, లేక

1. కొందఱి యభిప్రాయము ప్రకార మీ ప్రాకారపు చుట్టుకొలత 600 అడుగులే.

అటువంటి మరి యేవస్తువునో, పై కెత్తిపట్టుకొనినట్లు కాన్పించుచున్నది. ఆవస్తువులో ప్రాయికముగ అవశేషము(Relics) లో దేనో ఉన్నట్టులున్నవి. ఎవరో ఆఱుగురు ఆకసమున గాలిలో నెగురుచు పళ్లెరములో నున్న వస్తువులను ఆరాధింపబోవుచున్నట్లు చూపట్టును. దిగువభాగమున నిరువురుమనుష్యులు పైనుండి వచ్చుచున్న వస్తువును కాబోలు, పట్టుకొనబోవుచున్నట్లు కన్పడును.

ఇచ్చటగూడ ఆఱుగురు గాలిలో నెగురుచు తద్వస్తుపూజనార్థమరుగెంచుచున్నట్లు కన్పించును. పరికించిచూచినచో, నివియంతయు అవశేషములకు సంబంధించిన గాథగా తోచును. కాని స్తంభము చెడిపోయి యుండుటచేత నీవిషయము నింతకన్న చక్కగ దెలిసికొన సాధ్యముగుటలేదు. కుడివైపుననున్న స్తంభముమీద ఇతర స్తంభములమీద వలెనే ఎగువభాగమున సంపూర్ణపద్మమును, దిగువభాగమున నర్ధపద్మాకృతియు చిత్రితములయినవి.

పదునొకండవ చిత్రమున మనకు గానబడుచున్న చిత్రములు రెండును ప్రాకారరేఖపైనుండు మకుటబాడి వెలుపలిభాగమున చిత్రితములయినవి. ఇందలి చిత్రములు కడు నేత్రానందకరములు. నాణెమైన ఱాల 'నమూనా' లో ఎడనెడ స్తూపములు, ధర్మచక్రములు, బోధివృక్షములు నున్నవి. స్తూపము బుద్ధనిర్వాణమునకు సంజ్ఞ. బుద్ధభగవానుడు తాను కనిపెట్టిన బౌద్ధధర్మమును మొట్టమొదటిపర్యాయము వారణాసిలో ప్రజలకు బోధించి తన ధర్మచక్రమును ప్రవర్తింపజేసినందున బౌద్ధశిల్పమున ధర్మచక్రము గురుతుగ నుండును. బౌద్ధసంఘమునకు బోధివృక్షమే చిహ్నము. పైచెప్పినచిహ్నములుగాక పతనోన్నత్యములు గలిగి తరంగవంక్తివలెనున్న మోకుతోరణ మొకటి మనుష్యులీడ్చుచున్నట్లు చిత్రింపబడినది. ఈస్తూపమున వచ్చు నీమోకుతోరణమునుగురించి 'విజ్ఞానసర్వస్వము'న నిట్లు వ్రాసియున్నారు: "ఈమోకుతోరణము జరీపోగులతో పురివేయబడి కట్లుకట్టబడినట్లును, పలువిధములయిన లతలు చుట్టబడి అలలవలె వ్రేలాడదీయబడినట్లును, దండలుగా గ్రుచ్చిన పుష్పహారములు తోరణములుగ నలంకరింపబడినట్లును, మోకంతయు నగిషీ చెక్కినట్లుండుటయేకాక ప్రతిభాగునందును కొంచెము శ్రద్ధతో విలోకించినయెడల పలువిధములయిన చక్కందనపుపూజలు కన్పించును. అల క్రిందికి వచ్చునప్పుడు వికసించినపద్మమును, దానిపైని దాగొబా, ధర్మచక్రము, గరుడుడు, వజ్రాసనము మొదలగు పూజార్హములైన చిత్రములు చెక్కబడియున్నవి. మోకును లాగుచున్న మనుష్యుల భుజములయందున్న కట్టమీద చూపబడిన శిల్పచాతుర్యమత్యద్భుతము. మొత్తముమీద నీ మోకుతోరణముమీద శిల్పకారుడు చూపిన కల్పనావైచిత్ర్యము కడుచోద్యము."

పండ్రెండవ చిత్రముననున్న చిత్రములన్నియు మదురుబండల వలెనే స్తంభములకు దిగువభాగముననున్న అంచుబండలమీది వెలుపలిచిత్రములు. ఇవి అనందమయప్రకృతికి ఉదాహరణములు గనున్నవి. ఎగువనున్న చిత్రమున ఒకకుర్రవాడు ఎద్దుతోకపట్టుకొనియున్నట్లు చూపబడినది. కాని, యాని దిగువచిత్రములోని ఉరకలిడుచున్న వృషభమంత చక్కగ చిత్రితమయినట్లు కనబడదు. ఎద్దుగూపురేఖలు చక్కగనున్నవి. ఈవృషభమునకు ముందు రెక్కలుగలిగిన చతుష్పాత్తులు చిత్రితములైనవి. దిగువనున్న చిత్రములందుగూడ సింహమువంటి జంతువును, ఏనుగును చూపబడినవి. ప్రక్కన రెండు బొమ్మలలోగూడ మునుపటివానిలోనవలెనే, ఉద్రేకపూరితములైన గొప్పజంతువులను అల్పసాధనమైనతోకతో మాలుగుజ్జులైన కుర్రవాండ్రు స్వాధీనముచేసికొన ప్రయత్నించుటయే యిందలి విచిత్రము.

పదుమూడవచిత్రమున గాన్పించు చిత్రములు ప్రధానముగ బుద్ధునికి సంబంధించినవే. ఎడమవైపు స్తంభములోని వృత్తము (Medallion)న గుఱ్ఱముమీద స్వారిచేయుచున్న రాజొకడు కానవచ్చుచున్నాడు. అతని నెత్తిమీద ఎగువను రాజలాంఛనమైన ఛత్రము కలదు. అతని ఉభయపార్శ్వముల చామరములు వేయువారున్నారు. వెనుకను, ప్రక్కను పరివారమున్నది. ఆరాజకుమారుని శిరస్సుపై పరివేషముండుటచేత అతనిని ప్రపంచమునకు భవిష్యన్మోక్షప్రదాత యయిన సిద్ధార్థునిగ గుర్తింపవచ్చును. వృత్తమునకు దిగువనుగూడ కొన్ని బొమ్మలు కలవు. ఇవి మూడు విభాగముల(గళ్ల)లో చిత్రితములై యున్నవి. ఎడమవైపున నున్న మొదటివిభాగమున నొక మనుష్యుడు అవశేషముల (Relics)ను మోసికొని పోవుచున్నట్లు కలదు. వానిక్రింద నాగరాజొకడు ఒకవిధముగ మోకరించియున్నరీతి నున్నాడు. మఱికొందఱు ఇతర భక్తులును గలరు. దీని తరువాతి విభాగమున సిద్ధార్థుడు పరివేషవిరాజితుడై సింహాసనము నలంకరించి యున్నాడు. ఎవరో యొక రాయన పాదములను ముద్దుగొనుచున్నారు. మిగిలినవారు భక్తిగౌరవములు గదుర నిలువబడియున్నారు. సిద్ధార్థుని ప్రక్కను అతని గుఱ్ఱము (కంథకము) కలదు. కుడివైపుననున్న విభాగమున ధర్మచక్రమును, ఆరాధకులును గాన్పించుచున్నారు. ఈ చిత్రములోని కుడివైపు స్తంభము ఎగువవృత్తముమీద సిద్ధార్థుడు బుద్ధుడై భిక్షుకవస్త్రములతోను, పరివేషముతోను చూపట్టుచున్నాడు. అతని కుడిప్రక్క ఈ చిత్రమునందలి యే యితరస్త్రీలకంటె గూడ సంపూర్ణముగ వస్త్రాలంకృతయై యున్న యొకస్త్రీయును, ఆమెదగ్గఱనే యొకబాలుడును గనబడుచున్నారు. ఈబాలు నామె బుద్ధుని కప్పగించుచున్నది. బాలుడు తనతో రమ్మని ఎంతయో ప్రార్థించుచున్న విధమున ఆయన చేలాంచలమును బట్టుకొని లాగుచున్నాడు. పిల్లవాడాడుకొను ఆటవస్తువులు ముందు దిగువభాగమున పడియున్నవి. వీటి నన్నిటినిబట్టి చూచినచో, నామె యశోధరయై యుండుననియు, కుఱ్ఱవాడు రాహులుడనియు, సిద్ధార్థుడు బుద్ధుడై వచ్చినపిదప ఇంటికి వచ్చి తొల్లింటిపదవి నాక్రమించి రాజపితృధర్మముల నిర్వర్తింపవలసినదని ఆయనను వారిరువురు ప్రార్థించుచుండిరనియు నూహింపవచ్చును. దీని దిగువనుగూడ మొదటి స్తంభము మీదవలెనే బొమ్మలు మూడువిభాగములలో గలవు. ఎడమ

తు. క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దినాటికి ఇది సంపూర్తిగ జీర్ణమయ్యి, నాశమును బొందియు సంతాప కరస్థితికివచ్చి, తుదకు సౌందర్యకళాభిజ్ఞులైన పాశ్చాత్యుల ద్వారముననే తన యస్తిత్వమును బయలుపఱుచుకొని, భిన్నాభిన్నములైన నిర్మాణ, శిల్పకళా శకలముల వలననే నేడు ప్రాచీనాంధ్రశిల్పకళాకుశలుర కళావిజ్ఞానమునకు స్మారకచిహ్నమై తనరారుచున్నది.

## అమరావతీ స్తూపము: వర్ణన

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటమున శ్రీయుత కానూరి వీరభద్రేశ్వరరావు గారు ఈ యమరావతీస్తూపము నిట్లు వర్ణించియున్నారు :

"ఈస్తూపరాజ మొకప్రాకారముచే పరివృత్తమై యుండెను. గుండ్రముగ నున్న అడుగుపట్టముమీద నీస్తూపము గోపురాకారమున గట్టబడెను. దీని చుట్టునున్న ప్రాకారము వలయాకారముగ నుండెను. స్తూపముయొక్క అడుగుపట్టము వ్యాసము 152½ అడుగులు గలిగి ఆరడుగుల యెత్తున నుండును. ప్రాకారముయొక్క పరిధము (చుట్టుకొలత) 803 అడుగులు1. ఈప్రాకారము 14 అడుగుల యెత్తు గలిగి చిత్తరువులు చెక్కబడిన నాపరాళ్లతో గట్టబడియుండెను. స్తూపమిటుకలతో గట్టబడి చిత్రవిచిత్రములైన నాపరాళ్లచే కూర్చబడెను. ఈనాపరాళ్లమీద నత్యంత శిల్పనైపుణ్యము జూపు చెక్కడపుపని చేయబడినది. అప్రతిమాన సౌందర్యమునందును, శిల్పకళావిన్యాసమునందును ఈస్తూప ప్రాకారముతో సరివచ్చునది హిందూదేశమున మరెచ్చటను గానరాదు. ఇది రమారమి పదియడుగుల యెత్తుగల నిలువు స్తంభములతో గట్టబడెను రెండు స్తంభము లొకదానికి నొకటి కలిపి పెట్టక కొంతయంతరముగ నిల్పబడి, మూడు అడ్డ స్తంభములతో (రాతి దూలములతో) కలుపబడినవి. ఇట్లు ద్వారములయొద్ద తప్ప ప్రాకారమంతయు స్తంభములతో గట్టబడెను; అనగా నిలువు స్తంభములలో సందులుచేసి వానిలో నడ్డరాతిదూలము లమర్చబడెను. ఈ స్తంభముల మీద సందు లేకుండ నీచివరనుండి యాచివరకును అంచు కట్టినట్లు మురుబండలు వేయబడెను...... ఈ నిలువుస్తంభములును, అడ్డదూలములును, పై అంచురాళ్లును రెండువైపుల చిత్రవిచిత్రములైన చెక్కడపుబనులతో సుశోభితములై యున్నవి. మొత్తముమీద నీప్రాకారమునందు 186 నిలువు స్తంభములును, 348 అడ్డదూలములును, 803 అడుగుల పొడవుగల పై యంచుశిలలును ఉండెనని లెక్క వేయబడినది. ఈప్రాకారమునకు నలువైపుల గొప్ప ద్వారము లున్నవి."

నాగార్జునాచార్యులవారిచే ధనకటక మహాచైత్యము చుట్టు నిర్మింపబడినదని ప్రసిద్ధిగాంచిన అత్యద్భుతచిత్రశిల్పకళానిలయ మైన ప్రాకారరేఖ ఇదియే. ఈ ప్రాకారమునకును, లోపలనున్న స్తూపపుచట్టమునకును మధ్యనున్న శ్రీవీధి (ఉత్సవమార్గము) 13 అడుగుల వెడల్పుననున్నది. ఈస్తూపములోని వలయాకృతిగల గోపురభాగము ఎత్తు 90 అడుగులు.

## చిత్రవివరణము

ఈ తొమ్మిదవ చిత్రములోని రెండు స్తంభములును ప్రస్తుతము బ్రిటిషుమ్యూజియములో నున్నవి. ఇవి ప్రాకారరేఖలోని మదురుబండలు తీసివేసిన స్తంభములు. మనకు గనబడునది స్తంభముల వెలుపలి వైపు దృశ్యము. ఎడమ వైపున నున్న స్తంభము నాగస్తంభము కాదగును. ఈ స్తంభము మీద చిత్రము లన్నిటిలో నాగమే ప్రధానస్థానము నాక్రమించి యున్నది. ఈ యైదుపడగల నాగమున కిరువంకలను పూజోపహారములతో నిరువురుస్త్రీలు మొసళ్లవంటి జంతువులమీద నిలుచుండియున్నారు. స్తంభమున కెగువభాగమునమధ్య చిన్న స్తూపము కలదు. దీనిని ఉభయ పార్శ్వములనేనుగులు పూజించుచున్నవి. దిగువభాగమున కుబ్జవిగ్రహములు ఆడుచుపాడుచు అత్యంతానందమును బొందుచున్నవి. కుడివైపునగనబడు స్తంభము స్తూపస్తంభము. స్తూపమే యిందుప్రధానస్థానము నాక్రమించినది. స్తూపముపైని ఛత్రములుకలవు. వీటిలో ఆఱు స్పష్టముగ గానవచ్చుచున్నవి. ఫెర్గూసన్ గారు వీటిసంఖ్య పదునొకండని తెలుపుచున్నారు. కొన్ని శిథిలములైనట్లు కనబడుచుండుటవలన మొత్తముమీద నివి 11 ఉండినను నుండవచ్చును. స్తూపమునకిరువైపుల ఒక పురుషుడును, స్త్రీయు నిలుచుండి, పైకెత్తినచేతులు మోడ్చి భక్తిపారవశ్యమున మ్రొక్కుచున్నారు. ఈ చిత్రములకు కుడి-యెడమవైపుల స్త్రీ-పురుషుల రెండు జంటలు—పూజాద్రవ్యములతో గావచ్చును—స్తూపారాధన కేతెంచుచున్నారు. వీరి కాళ్లక్రిందగూడ మొసలివంటి చిత్రములు కలవు. స్తంభమున కెగువ భాగమున బోధివృక్షము నారాధించుచు ఏనుగులును, మరి కొన్ని యితరజంతువులును కలవు. మొదటి స్తంభమువీదవలెనే యీ స్తంభము దిగువభాగమునగూడ గ్రుప్పింతలు కొట్టుచున్న కుబ్జగణముల ప్రతిమలు కలవు.

పదవ చిత్రమున ఎడమవైపున నున్న స్తంభము పాతిపోవుటచేతనో, మరియేకారణముననో, చెడిపోయి యుండుటచేత దానిమీద నున్నచిత్రములను స్పష్టముగ దెలిసికొనుటకు సాధ్యముగుటలేదు. స్తంభమున కెగువను రెండువిగ్రహములు పల్లెరమువంటి దానినో, లేక

1, కొందఱి యభిప్రాయము ప్రకారము మీ ప్రాకారపు చుట్టుకొలత 600 అడుగులే.

అటువంటి మరి యేవస్తువునో, పై కెత్తిపట్టుకొనినట్లు కాన్పించుచున్నది. ఆవస్తువులో ప్రాయికముగ అవశేషము(Relics) లో దేనో ఉన్నట్టులున్నవి. ఎవరో ఆఱుగురు ఆకసమున గాలిలో నెగురుచు పళ్లెరములో నున్న వస్తువులను ఆరాధింపబోవుచున్నట్లు చూపట్టును. దిగువభాగమున నిరువురుమనుష్యులు పైనుండి వచ్చుచున్న వస్తువును కాబోలు, పట్టుకొనబోవుచున్నట్లు కన్పడును.

ఇచ్చటగూడ ఆఱుగురు గాలిలో నెగురుచు తద్వస్తుపూజనార్థ మరుదెంచుచున్నట్లు కన్పించును. పరికించిచూచినచో, నివియన్నియు అవశేషములకు సంబంధించిన గాథాగా తోచును. కాని స్తంభము చెడిపోయి యుండుటచేత నీవిషయము నింతకన్న చక్కగ దెలిసికొన సాధ్యపడుట లేదు. కుడివైపుననున్న స్తంభముమీద ఇతర స్తంభములమీద వలెనే ఎగువభాగమున సంపూర్ణపద్మమును, దిగువభాగమున నర్ధపద్మాకృతియు చిత్రితములయినవి.

పదునొకండవ చిత్రమున మనకు గానబడుచున్న చిత్రములు రెండును ప్రాకారరేఖపైనుండు సురుగుబండ వెలుపలిభాగమున చిత్రితములయినవి. ఇందలి చిత్రములు కడు నేత్రానందకరములు. నాగశైలమున గల 'నవూనా' లో ఎడనెడ స్తూపములు, ధర్మచక్రములు, బోధివృక్షములు నున్నవి. స్తూపము బుద్ధనిర్వాణమునకుసంజ్ఞ. బుద్ధభగవానుడు తాను కనిపెట్టిన బౌద్ధధర్మమును మొట్టమొదటిపర్యాయము వారణాసిలో ప్రజలకు బోధించి తన ధర్మచక్రమును ప్రవర్తింపజేసినందున బౌద్ధశిల్పమున ధర్మచక్రము గురుతుగ నుండును. బౌద్ధసంఘమునకు బోధివృక్షమే చిహ్నము. పైసంకేతచిహ్నములుగాక పతనౌన్నత్యములు గలిగి తరంగపంక్తివలెనున్న మోకుతోరణ మొకటి మనుష్యులీడ్చుచున్నట్లు చిత్రింపబడినది. ఈస్తూపమున వచ్చు నీమోకుతోరణమునుగురించి 'విజ్ఞానసర్వస్వము'న నిట్లు వ్రాసియున్నారు: "ఈమోకుతోరణము జరీదారులతో పురివేయబడి కట్లుకట్టబడినట్లును, పలువిధములయిన లతలు చుట్టబడి అలలవలె ప్రేలాడదీయబడినట్లును, దండలుగా గ్రుచ్చిన పుష్పహారము తోరణములుగ నలంకరింపబడినట్లును, మోకంతయు నగిషీ చెక్కినట్లుండుటయేకాక ప్రతిదారునందును కొంచెము శ్రద్ధతో విలోకించినయెడల పలువిధములయిన చక్కదనపు పూజలు కన్పించును. అవి క్రిందికి వచ్చునప్పుడు వికసించినపద్మమును, దానిపైని దాగోబా, ధర్మచక్రము, గరుడుడు, వజ్రాసనము మొదలగు పూజార్హములైన చిత్రములు చెక్కబడియున్నవి. మోకును లాగుచున్న మనుష్యుల భుజములవద్దనున్న కట్టుమీద చూపబడిన శిల్పచాతుర్యమత్యద్భుతము. మొత్తముమీద నీ మోకుతోరణముమీద శిల్పకారుడు చూపిన కల్పనావైచిత్ర్యము కడుచోద్యము."

పండ్రెండవ చిత్రముననున్న చిత్రములన్నియు మదురుబండల వలెనే స్తంభములకు దిగువభాగముననున్న అంచుబండలమీది వెలుపలి చిత్రములు. ఇవి ఆనందమయప్రకృతికి ఉదాహరణములు గనున్నవి. ఎగువనున్న చిత్రమున ఒకకుర్రవాడు ఎద్దుతోకపట్టుకొనియున్నట్లు చూపబడినది. కాని, యది దిగువచిత్రములోని ఉరకలిడుచున్న వృషభమంత చక్కగ చిత్రితమయినట్లు కనబడదు. ఎద్దుమూపురేఖలు చక్కగ నున్నవి. ఈవృషభమునకు ముందు రెక్కలుగలిగిన చతుష్పాత్తులు చిత్రితములైనవి. దిగువనున్న చిత్రములందుగూడ సింహమువంటి జంతువును, ఏనుగును చూపబడినవి. ప్రక్కన రెండు బొమ్మలలోగూడ నిటువంటివానిలోనివలెనే, ఉద్రేకపూరితములైన గొప్పజంతువులను అల్పసాధనమైనతోకతో మఱుగుజ్జులైన కుర్రవాండ్రు స్వాధీనముచేసికొన ప్రయత్నించుటయే యిందలి విచిత్రము.

పదుమూడవచిత్రమున గాన్పించు చిత్రములు ప్రధానముగ బుద్ధునికి సంబంధించినవే. ఎడమవైపు స్తంభములోని వృత్తము (Medallion)న గుఱ్ఱముమీద స్వారిచేయుచున్న రాజొకడు కానవచ్చుచున్నాడు. ఆతని నెత్తిమీద ఎగువను రాజలాంఛనమైన ఛత్రము కలదు. అతని కుడియెడమపార్శ్వముల చామరములు వేయువారున్నారు. వెనుకను, ప్రక్కను పరివారమున్నది. ఆరాజకుమారుని శిరస్సుపై పరివేషముండుట చేత ఆతనిని ప్రపంచమునకు భవిష్యన్మోక్షప్రదాత యయిన సిద్ధార్థునిగ నూహింపవచ్చును. వృత్తమునకు దిగువనుగూడ కొన్ని బొమ్మలు కలవు. ఇవి మూడు విభాగముల(గళ్ల)లో చిత్రితములై యున్నవి. ఎడమవైపుననున్న మొదటివిభాగమునొక మనుష్యుడు అవశేషముల (Relics)ను మోసికొనిపోవుచున్నట్లు కలదు. వానిక్రింద నాగరాజొకడు ఒకపక్షముగ మోకరించియున్నరీతి నున్నాడు. మఱికొందఱు ఇతర భక్తులును గలరు. దీని తరువాతి విభాగమున సిద్ధార్థుడు పరివేషవిరాజితుడై సింహాసనము నలంకరించియున్నాడు. ఎవరో యొక రాయన పాదములను ముద్దుగొనుచున్నారు. మిగిలినవారు భక్తిగౌరవములు గదుర నిలువబడియున్నారు. సిద్ధార్థుని ప్రక్కను ఆతని గుఱ్ఱము (కంథకము) కలదు. కుడివైపుననున్న విభాగమున ధర్మచక్రమును, తదారాధకులును గాన్పించుచున్నారు. ఈ చిత్రములోని కుడివైపు స్తంభము ఎగువవృత్తముమీద సిద్ధార్థుడు బుద్ధుడై భిక్షుకవస్త్రములతోను, పరివేషముతోను చూపట్టుచున్నాడు. ఆతని కుడిప్రక్క ఈ చిత్రమునందలి యే యితర స్త్రీలకంటె గూడ సంపూర్ణముగ వస్త్రాలంకృతయై యున్న యొక స్త్రీయును, ఆమెదగ్గఱనే యొకబాలుడును గనబడుచున్నారు. ఈబాలు నామె బుద్ధునికప్పగించుచున్నది. బాలుడు తనతో రమ్మని ఎంతయో ప్రార్థించుచున్న విధమున ఆయన చేలాంచలమును బట్టుకొని లాగుచున్నాడు. పిల్లవాడాడుకొను ఆటవస్తువులు ముందు దిగువభాగమున పడియున్నవి. వీటి నన్నిటినిబట్టి చూచినచో, నామె యశోధరయై యుండుననియు, కుఱ్ఱవాడు రాహులుడనియు, సిద్ధార్థుడు బుద్ధుడై వచ్చినపిదప ఇంటికి వచ్చి తొల్లింటిపదవి నాక్రమించి రాజపితృధర్మముల నిర్వర్తింపవలసినదని ఆయనను వారిరువురు ప్రార్థించుచుండిరనియు నూహింపవచ్చును. దీని దిగువనుగూడ మొదటి స్తంభము మీదవలెనే బొమ్మలు మూడువిభాగములలో గలవు. ఎడమ

పై పున నున్న మొదటివిభాగమున పరిజనులచే బరివేష్టింపబడి రాజొక డున్నతాసనమున గూర్చుండియున్నాడు. ధనుర్ధరుడైన యొకబాలకుడు ఆయనకడకు వచ్చి ఏదియో విన్నవించుకొని తనతో రమ్మని కాచోలు అడుగుచున్నాడు. మధ్య విభాగమున స్త్రీలప్రలోభనములకు లొంగకుండ ఆరాజు వారి నెదుర్చుచున్నట్లు కలదు. మూడవ విభాగమున ఆయన భిక్షువసనములను ధరించి బోధివృక్షముక్రింద నాసీనుడై ప్రజలకు ధర్మము నుపదేశించుచున్నట్లు కానవచ్చును. ఇవి యన్నియుకూడ బుద్ధజీవితమునందలి కథలే కాదగును. కాని మూడవ విభాగమున బౌద్ధభిక్షువునకు పరివేషము లేకపోవుటచే నతడు బుద్ధుడు కాడనియు, ప్రాయికముగ నాతనికుమారుడగు రాహులుడనియు తోచెడిని. బౌద్ధగాథల ప్రకారము రాహులుడుగూడ నిరువదేండ్ల వయస్సుననే భిక్షుకత్వము నవలంబించి తండ్రి బోధవలన గొప్పశ్రమణకులలో నొక్కడయ్యెనని తెలియుచున్నది. రాహులుడును కానిచో ఆతడు ఎవరో యొకబోధిసత్త్వుడై యుండవలెను. రాయి పగిలిపోయినందున ఈ రెండు స్తంభముల మీది యెగువచిత్రము లేమిటో మనకు దెలియవచ్చుట లేదు.

పదునాలుగవ చిత్రమున గనబడు ఎగువ వృత్తమున నాగులస్తూపారాధనచిత్రితమైయున్నది. విశాలమైనట్టియు, చిత్రవిచిత్రాలంకృతమైనట్టియు నొకచాందినీక్రిందనున్న సింహాసనమున అవశేషముంచిన కరండమొకటి యున్నది. దానిని నాగరాజు తనపరిజనులతోగూడి పూజించుచున్నాడు. ఈచాందినీక్రింద నిలుచుండినవారిలో నాగరాజే మధ్యగనున్నాడు. అతనిపై నేడుపడగ లున్నవి. అతనికిరుపార్శ్వముల చామరములతో నిరువురు పరిచారకులు నిలువబడియున్నారు. చామరధరులప్రక్క నిరువురు చేతులు పైకెత్తిజోడించి నమస్కరించుచున్నారు. ఒకవేళ వారును నాగులైననై యుండవచ్చును. నాగరాజువెనుకనున్నవారి కెవ్వరికిని పడగలు లేవు; కాని ముందున్న పండ్రెండుగురు స్త్రీలకు శిరస్సులవెనుక నొక్కొక్కరికొక్కొక్క పడగ యున్నది. కరండమున్న సింహాసనమున కిరుపార్శ్వముల నిలువబడియున్న స్త్రీలతీర్పు అత్యంత సుందరమైనది. కుడివైపునున్న యీ సుందరులు తమకు దిగువనున్న యొక మాలినిస్కంధమునుండి పూమాలలను కరండ సమర్పణమునకేమో కొనుచున్నారు. దలదావంశము నందలి దంతకథనగాథనే విశ్వసించుచో, ప్రాయికముగ నీకరండమునందలి యవశేషము దంతమేమోయని యూహింపవచ్చును. క్రిందివృత్తములో నిరువురు ప్రముఖులు ఛత్రలాంఛనము లేని కారణమున వీరిని రాజు లనరాదేమో ఒకసోఫావంటి యాసనమున గూరుచుండి ముందున్న స్త్రీలు వినిపించు సంగీతవాద్యములను వినుచున్నారు. పదునెనమండుగురు స్త్రీలు ఈవిధమయిన గానవాద్యములందు ప్రవృత్తులయినట్లు కానవచ్చును. ఈచిత్రమునందలి యితివృత్తమేదియో తెలియవచ్చుటలేదు. ఈసంగీతపాటకులును, సోఫామీద కూరుచున్నవారునుగాక, కులీనలైన ముగ్గురుస్త్రీలు— కుడిప్రక్క నిరువురును, ఎడమప్రక్క నొక్కరును— ఉన్నతాసనములపై గూరుచుండియున్నారు. కడియములును, పూసలమొలనూళ్లును వారి ముఖ్యాభరణములు. కుడిప్రక్కనున్న యీసుందరులకు కుడివైపున నిరువురు బాలికలున్నారు. చిత్రములు చక్కగా నున్నవని యనుకొనుట తప్ప నిందలి గాథ ఏదియో మనకు దెలియవచ్చుటలేదు.

స్తూపముయొక్క ఏమాత్రము చెడిపోవని సంపూర్ణాకృతిని చూడవలయునన్న, పదునైదు పదునాఱు చిత్రములను చూడదగును. ఈరెండు చిత్రములలోని స్తూపములు అమరావతీ స్తూపపు అడుగు చట్రపు గోడలమీద చిత్రితములైనవి. ఇవి సంపూర్ణమైన అమరావతీ మహాస్తూపముయొక్క చిన్న నమూనాలు. ఈచిత్రములను జూచి భాగ్యదినములు చూచిననాటి సంపూర్ణ అమరావతీ స్తూపాకృతిని మనము మనోవీథిని గాంచవచ్చును.

అమరావతీ స్తూపమున కుండినట్టే చిత్రములోని స్తూపములకును ప్రాకారరేఖ యుండుట మనము చూడగలము. పటములలోని స్తూపముల ప్రాకారరేఖ నాలుగుచక్రముల ఎత్తు కలది. మహాచైత్య ప్రాకారరేఖ మూడుచక్రముల ఎత్తుకలది.[1]

ఈస్తూపచిత్రములలో ప్రాకారరేఖ పైయంచుగ నేర్పడిన ఎగువ మదురు బండలప్రక్కల ఒక్కొక్కప్పుడు జంతుచిత్రములును, ఒక్కొక్కప్పుడు తోరణచిత్రములును చిత్రితము లగుచుండును. ఈప్రాకారరేఖ లోపల, దానంతయెత్తువఱకు స్తూపము వంపుటొంపులు లేక నిట్టనిలువుగ నుండి గోడనంటి లేచు స్తంభముల(Pilasters)తో అలంకృతమై యుండును. వీటిమధ్య బౌద్ధమత చిహ్నములగు ధర్మచక్రము, బోధివృక్షము మొదలైన వుండును. వీటిపైని విభాగములు(Panels)గ నున్న రెండువరుసలలో శిల్పచిత్రము లుండును. క్రిందివరుసలో సాధారణముగ ఒంటిచిత్రములు గాని, చిహ్నములు గాని యుండును; కాని యొక్కొక్కప్పుడు సముదాయచిత్రము (Sculptural groups)లుండుటయు కలదు. పైవరుసలో ఎల్లప్పుడు చారిత్రకములైన సముదాయ చిత్రములుండును. వీటిలో బౌద్ధకథలనేకములు మనము గుర్తింపవచ్చును.

ఈవరుసల కింకను కొంచెము ఎత్తున నుండు వర్తులమైన గోపురము మీది వృత్తము (Medallion) లలో కూడ ఇతరస్థలముల వచ్చినగాథలే మరల మరల వచ్చుచుండును.

1. మూడుచక్రముల ఎత్తనగా: ప్రాకారరేఖలోని నిలువు స్తంభములకు మధ్యగనుండు అడ్డుదూలములు మూడుమాత్రమే కలవు. ఒక్కొక్క దూలము మీద ఒక్కొక్క చక్రముచొప్పున మూడుచక్రములు చిత్రింపబడుటచేత (చక్రపరిగణనపు కొలతను) ఆప్రాకారరేఖ మూడు చక్రముల ఎత్తని చెప్పబడినది. చిత్రములోని స్తూపముల ప్రాకారరేఖలో అడ్డుదూలములు కనబడుచుండక పోయినను, ప్రాకారము దిగువభాగమునుండి ఎగువభాగమువఱకు గనబడుచక్రములు నాలు గగుటచేత అది (చక్రపరిగణనపు కొలతను) నాలుగుచక్రముల ఎత్తని తెలుపబడినది.

శిల్పచిత్రములతో నింపబడి అలంకృతమైన ఈస్తూపములందలి విచిత్ర మేమనగా, స్తూపప్రధానచిత్రమున కెగువను కంబములవంటి అయిదు నిలువుకమ్ము లుండుటయే. ఈకమ్ముల దిగువభాగములు చతురస్రము (Square)గ నుండి, యొక్కొక్కప్పుడు 'ధర్మచక్ర', 'బోధివృక్ష', 'స్తూప'చిత్రములచే నలంకృతము లగుచుండును. ఈకమ్ములు ఎనిమిది పలకలుగ తీర్చినవి. వీటిశిరోభాగములు చిత్రోద్దీపితములైన చతురస్రములుగ నుండును. ఒకశాసనమున నివి "ఆర్యకఖంభే" (ఆర్యక స్తంభములు) అని పేర్కొనబడినవి. భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటశాల స్తూపములలో కూడ నివి గనబడుటచేతను, ఉత్తరహిందూస్థానమునందలి యేస్తూపములలోను ఇవి లేకపోవుటచేతను ఆంధ్రస్తూపముల కిది విశిష్ట లక్షణమని యూహింపవలసివచ్చుచున్నది. ఇవి మహాచైత్యము ప్రతిప్రక్కనునుండు స్తూపచిత్రములోని ప్రధానచిత్రమున కెగువనుండుటచేత మొత్తముమీద మన మిట్టివి ఇరువదికమ్ములను జూతుము. ఇవివేటికి సంజ్ఞలో తెలియరాదు. ఇవి వర్తమానకల్పములోని అయిదుగురు బుద్ధులకుగాని, లేక అయిదుగురు ధ్యానిబుద్ధులకుగాని, లేక పంచభూతములకుగాని గుర్తులు కావచ్చునని కొందరు ఊహించుచున్నారు. ఈకమ్ముల దిగువభాగముల మతచిహ్నములైన ధర్మచక్రాదులే కాక ఒక్కొక్కప్పుడు శాసనము లుండుటయు గలదు. వీటిలో మధ్యకమ్మపై సాధారణముగ స్తూపచిత్ర ముండును.

చత్రులపైన ఈగోపురముపైని శిఖరమువలె నొక పెట్టెను తీర్చెదరు. అందు బుద్ధావశేషము లున్నవని భావము.

అన్నిటికంటె పైని ఛత్రకేతన విరాజితమైన బోధివృక్షముండును. తాతిపలక సరియైన దరునెడల ఉభయపార్శ్వముల దేవ, యక్ష, గంధర్వాదులు ఆకాశమార్గమునవచ్చి ఆరాధించుచున్నట్లు చిత్రింపబడును.

ప్రధానచిత్రము వేఱువేఱు స్తూపములమీద వేఱువేఱువిధముగ నుండును. ౧౫వ చిత్రములోని స్తూపముమీది ప్రధానచిత్రము బుద్ధునిది. లోపలిభాగమున ఏడుపడగలతోను, వెలుపలిభాగమున పదునాలుగు పడగలతోను ఉన్న మహానాగముయొక్క చుట్టలమీద బుద్ధుడు కూర్చుండియున్నాడు. ఆయన ఇరుప్రక్కలను చామరములు వేయువారున్నారు. బుద్ధుని ముందున్న కొందఱు ఆయనకు నమస్కరించుచున్నారు. ౧౬వ చిత్రమునందలి స్తూపముమీది ప్రధానచిత్రమును బుద్ధుడేకాని, అతడు శాటీనివలెవాటుగా ధరించి కుడిచేయి కొంచెమెత్తి నిలుచుండియున్నట్లు చూపబడినది. ఆయన యెడమవైపున నుండి ఆయనను పూజించుచున్నవారు నాగులు. కుడిప్రక్కనున్నవారు దేశీయములైన యుడుపులను ధరించిన స్త్రీపురుషులు.

ప్రాకారరేఖ వెలుపల ద్వారమునకు ఇరుగడల పూజాద్రవ్యములను విక్రయించువారినుండియో, తీసికొనివచ్చువారినుండియో కొనుచున్నట్లు ఒకస్త్రీయో, పురుషుడో ఎల్లప్పుడు చిత్రింపబడుచుండును. ఈ పూజాద్రవ్యములను నెత్తిని బెట్టికొని అమ్మువారు, తీసికొని వచ్చువారు సాధారణముగ మఱుగుజ్జులే. ఈ చిత్రములకు తోడుగ ద్వారమునకు రెండుప్రక్కల కలశపాత్రకూడ జూపబడును.

పై నుడివినవన్నియు స్తూపముయొక్క సాధారణలక్షణములు. ఇక శిల్పి సిద్ధహస్తుడైనచో తననిష్కళంకభక్తిని, అసమానకళాప్రతిభను మూసను బెట్టి కరగించి పోతపోసి చిన్నచిన్నలతో, చికిలీపనివానితనముతో మెఱుగులు దిద్ది స్తూపమును నేత్రపర్వముగ, నిర్మించుననుటలో వింత యేమి కలదు?

ఒకటవ చిత్రమునందు ఒకమూల మలుపు స్తంభము కలదు. "ఇది మలుపుతిరిగి యుండుటచే రెండు స్తంభములుగ గానవచ్చుచున్నది. మూలమలుపువైపు చెక్కడమునందొకయర్ధకమలమును, రెండు పూర్ణకమలములును కనబడుచున్నవి. వీనిమీద నింకొక పూర్ణకమలమును, ఒక అర్ధకమలమును ఉండెనట. ఇది ద్వారమునకు దరిలియున్నవైపు. దీనికి ప్రక్క నిలువు స్తంభము మీది చెక్కడ మున్నది. ఇదియు పైభాగమున బగిలియున్నది. అడుగుభాగమున నొక యర్ధకమలము, దానిమీద మూడుపటములు, ఆపైని ఒక వృత్తము, అందులో గొన్నిపటములు గానవచ్చుచున్నవి. పైభాగమున గొన్నిపటములును, వానిమీద అర్ధకమలమును ఉండియుండును. వీని కన్నిటికిని క్రింద చిత్రముగ జెక్కబడిన యంచుకూడ గలదు.

"మధ్యవృత్తమునందలి ప్రతిమలలో గొన్ని పగిలిపోయినను, అందొక బౌద్ధబోధకుడు స్త్రీపురుషుల కేదియో బోధించుచున్నట్లును, వారందఱును భక్తిశ్రద్ధలతో వినుచున్నట్లును, వారిపైని దేవగంధర్వులు పూజాద్రవ్యములు గొనివచ్చి యర్పించుచున్నట్లును గానవచ్చుచున్నది. పైవృత్తమునకును క్రిందికమలమునకును నడుమనున్న పటములు మూడుగడ్లుగా విభజింపబడియున్నవి. మొదటిగడిలో నొక రాజు సింహాసనముమీద కూర్చుండినట్లును, ఒక యువకుడు భూమిమీద నాసనము వేసికొని కూర్చుండినట్లును, ఒకకేదు డాతని కేమియో చూపి వీరావేశసంభాషణము గావించుచున్నట్లును, రాజీసంభాషణము వినుచున్నట్లును జూపబడినది. రెండవగడిలో ఈ సంభాషణముయొక్క ఫలము చూపబడినది. రాజొక ఏనుగు నెక్కి తొందరగా శత్రువులమీదికి బోవుచున్నాడు. అతనివెంట నిద్దఱు స్త్రీలుమాత్ర మున్నారు. శస్త్రములుకూడ లేవు.

"అతనివెంట సైన్యము వచ్చుచున్నది. ఆకాశమునుండి దేవగంధర్వులు పుష్పమాలలు వేయుచున్నారు. మూడవగడిలో వాయువేగమున పరుగెడుచున్న యశ్వములనెక్కి శత్రువులు పాఱిపోవుచున్నట్లు చూపబడినది." (ఆంధ్ర విజ్ఞానసర్వస్వము, మూడవ సంపుటము.)

రెండవచిత్రము బుద్ధునిజన్మమున కించుక పూర్వవృత్తాంతమును దెలియజేయుచున్నది. ఇందు మూడువిభాగములు కలవు. మొదటి విభాగమున, బుద్ధుడు జన్మమెత్తుట కించుకముందు "తుషితస్వర్గము"న ఉచ్ఛ్రధ్వజ రాజమందిరమున దేవతలకు ధర్మముయొక్క అష్టోత్తరశత

మార్గములను బోధించుచున్నట్లు తెలుపు చిత్రము కలదు. రెండవది బుద్ధుని యవతారకథ— బుద్ధుడు వెల్లయేనుగు రూపమున తుషితస్వర్గము నుండి దిగివచ్చినట్లు బౌద్ధులు చెప్పెదరు. మనకిందు గాన్పించు వెల్లయేనుగు బుద్ధుడే— భూలోకమున జన్మింప నవతరించుచున్నాడు. ఆ శ్వేత గజమును కుబ్జగణములు మోయుచున్నారు. దేవగంధర్వులు పరివేష్టించి వచ్చుచున్నారు. ప్రభులాంఛనములైన వేత్రవంశ ఛత్రములను పట్టుకొని కొందరు ఆ వెల్లయేనుగు ముందు నడుచుచున్నారు. దివ్య నృత్త గీత వాద్యములు చెలరేగుచున్నవి. కొందరు ఆడుచున్నారు. కొందరు అభినయించుచు పాడుచున్నారు. మఱికొందరు జంత్రవాద్యములు వాయించుచున్నారు. జగద్వ్యాధానివారణ కార్యమునకై బుద్ధుడవతరించుచున్నాడని అంతయు నానందమే. మూడవవిభాగమున మాయాదేవి స్వప్నవృత్తాంతము తెల్పబడినది. శుద్ధోదనుని పట్టపుమహిషియైన మాయామహాదేవి పక్కనిశయ్యపై బరుండి నిద్రించుచున్నది ఆ మెత్తల్పము నాలుగుమూలల చతుర్దిశలను పాలించు దిక్పాలకులు నిలుచుండియున్నారు. పర్యంకమున కిటునటు ఆమె పరిజనము కొందరు కూర్చుండియున్నారు; కొందరు నిలుచుండియున్నారు. పర్యంకమున క్రిందనున్నవారిలో నిద్దరు రామెకు వీవోపు లిడుచున్నారు. స్వర్గమునుండి యొక వెల్లయేనుగు వచ్చి తన గర్భమున బ్రవేశించుచున్నట్లు ఆమె కలగాంచుచున్నది. మాయామహాదేవి స్వప్నము, బుద్ధునిజన్మము— వీటికి సంబంధించిన చిత్రములు అమరావతీస్తూపమున పెక్కుచోట్ల గలవు.

మూడవ చిత్రమున గనబడునవి ప్రాకార రేఖలోని అడ్డదూలములమీది వృత్తచిత్రములు. వేలువేలు విధములైన కల్పనలతో ఇందు "త్రిశూల" చిహ్నము చిత్రితమైనది. ఈ త్రిశూలము సాధారణముగ జ్వాలాస్తంభమునకు మకుటముగ నుండును. త్రిశూలాధిష్ఠితమైన యీ స్తంభము సాధారణముగ నొక సింహాసనము వెనుక నుండును. ఈ స్తంభమునకు కుడియెడమలవైపుల ఊర్ధ్వగతిని జ్వాలలు ప్రసరించుచున్నట్లు చూపుదురు. ఈ జ్వాలాస్తంభములు ఒక్క యమరావతిలో తక్క ఈ త్రిహిందూస్థానమునందలి స్తూపములలో నెచ్చటను గానరావు. అంతేకాక బౌద్ధకళ ప్రారంభకాలమున గూడ వీటి "అడాపొడా" ఎచ్చటను గానరాదు. అదివరకున్న చిత్రితమైన బౌద్ధ సంజ్ఞావళి(Symbols)కి అమరావతి ప్రత్యేకముగ కనిపెట్టి యొసంగిన విచిత్రోపాయమే యీ జ్వాలాస్తంభము. ఈ వృత్తమునందలి కుడివైపు ఎగువభాగము పాడగుటవలన అచ్చటనుండిన చిత్రవిశేషమేదియో మనకు దెలియవచ్చుట లేదు. వృత్తము మధ్యభాగమున త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము ముందు సింహాసనమున్నది. ఈ సింహాసనము మీద "అవశేష" పూర్ణములైన గుండ్రని కరండములో ఏవో యుంచబడినవి. ఇవి రెండుభాగములుగ గాన్పించుచున్నవి. క్రిందిది కరండము యొక్క యడుగుభాగమును, పైది తెఱచియుంచిన పైమూతయు నగునేమో. దీనిపై 'స్వస్తిక' చిహ్నము కలదు. దీనికి కుడివైపున బౌద్ధభిక్షువు లీకరండమునకు నమస్కరించుచున్నారు. సింహాసనమునకు దిగువ నొకవేదికపై బుద్ధభగవానుని శ్రీపాదములు కలవు. వాటికి ముందు వినమ్రులై యిరువురు స్త్రీలు ప్రణమిల్లుచున్నారు. సింహాసనమున క్రిందిభాగమున దేశీయములైన యుడుపులను ధరించిన యొక ప్రభువు తనకుమారుని కరండసమీపమునకు గొనివచ్చి దానికి 'మ్రొక్కుబడి' చెల్లించుచున్నాడు.

ఆతని వెనుకనున్నవారందరు ఆ రాజకుటుంబమునకు సంబంధించినవారు కావచ్చును. ఈ స్త్రీలు ధరించిన బంగారు జడలును, తలపూవులును, మువ్వలమొలనూళ్లును, హస్తాభరణవిశేషములును గమనింపదగినవి. మఱియొక్క విషయము. కుడివైపువనున్న బౌద్ధభిక్షువులు కుళ్లాయిలు ధరించియున్నారు. ఈ కుళ్లాయి యొక్క వెనుకవైపు దిగువభాగము ఎంత క్రిందికి దిగిన దానిని ధరించినవా డంతటి విద్యాధికుడట. అనగా విద్యాధికత ననుసరించి యా కుళ్లాయి వెనుకభాగము తగ్గుచు హెచ్చుచు నుండునని తెలిసికొనవలసియున్నది.

నాలుగవ చిత్రమునగూడ మధ్యసింహాసనమును, దానిమీద "అవశేష" కరండమో గ్రంథమో, అదియును, సింహాసనమునకు దిగువ వేదికను శ్రీపాదములును గలవు. దానివెనుక మూడవచిత్రమునందువలెనే జ్వాలాస్తంభము, త్రిశూలము కలవు. ఈ జ్వాలాస్తంభ, త్రిశూలములకెగువ ధర్మచక్రము కలదు. సాధారణముగా అమరావతీచిత్రములు వేటిలోను స్త్రీలు లేకపోలేదు; కాని యీ వృత్తచిత్రమున మాత్రము ఒక్క స్త్రీయైనను లేదు. ఆరాధకులందరును పురుషులే. తలకట్టుల ననుసరించియు, ఇతరలక్షణముల ననుసరించియు జూచినచో వారందరు నొక్కతెగవారుగ గనబడదురు. ఇక శ్రీపాదములకు రెండుప్రక్కల రెండుజింకలు చిత్రితమగుటయే యిందలి విచిత్రము.

ఆరవచిత్రము కూడ త్రిశూలచిత్రమునకు సంబంధించినదే. ఇచ్చటకూడ నొకసింహాసనమున్నది. దానిమీద అవశేషకరండము లేదు కాని శ్రీపాదములున్నవి. సింహాసనమునకు వెనుకప్రక్క త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము కలదు. ఈ త్రిశూలము బౌద్ధమతమునందేనికిగుర్తో ఎవ్వరును తృప్తికరముగ జెప్పియుండలేదు. త్రిశూలము, స్వస్తికము మొదలైనచిహ్నములు జున్నార్, భాజా, బెడ్సా, కుదా, కార్లీ మొదలైనగుహలలోని అత్యంతప్రాచీన శాసనముల ప్రారంభమునను, చివరను గానవచ్చుచుండుటచేత ఇవి కడుప్రాచీన కాలమునుండియు అదృష్టచిహ్నములుగ వాడుకలో నుండినట్లు కొందరు చెప్పుచున్నారు. త్రిశూలము బౌద్ధమతమునకు సంబంధించిన చిహ్నముకాదేమో యని కొందరు ఇదివఱలో సంశయించిరి కాని అమరావతీస్తూపచిత్రములలో నిది తరుచు గానవచ్చుచుండుటచేతను, మూడవచిత్రమున బౌద్ధభిక్షువులే దానికి నమస్కరించుచుండుటచేతను దానిని బౌద్ధమత చిహ్నముగానే పరిగణింపవలసి వచ్చినది.

ఈ యేడవచిత్రమున ఎగువభాగమునందలి ప్రధానారాధకులు నాగులు. సింహాసనమునకు కుడియెడమ ప్రక్కల తలయొకరు కూర్చుండి

యున్నారు. వీరిరువురికి తలమీద ఏడు పడగ లున్నవి. వీరిరువురి పార్శ్వముల తలమీద ఒంటిపడగగల స్త్రీలు ఇరువురున్నారు. జ్వాలాస్తంభమున కిరుగెలంకుల చామరగ్రాహు లిరువురున్నారు. వారికి తలమీద పడగలు లేవు. ఇతరపరిచారకులును కొందఱు కలరు కాని వారికిని పడగలు లేవు.

ఈవృత్తచిత్రము మధ్యభాగమున సింహాసనము మీద కూర్చున్నవాడు నాగరాజు. ఇతని తలమీద తొమ్మిదిపడగలు కలవు. ఇతని రాణు లిరువురు ఇతనికి చెరియొక వైపున సింహాసనముమీదనే కూర్చున్నారు. రాణులకు కూడ నెత్తిమీద చెఱియొకపడగ కలదు. సింహాసనమువెనుక నాగరాజునకు రెండువైపుల నాగకన్యకలు వీవనపులిడుచున్నారు. వారికిని తలమీద ఒక్కొక్కపడగ గలదు. వీవనపులిడువారు మాత్రమే కాక మరి యిరువురు నాగకన్యలు కుడివైపున సింహాసనము వెనుక నిలువబడియున్నారు. వీరికిని తలమీద పడగ కలదు. వీరును రాణులపరిజనమే కావచ్చును. వీరితోపాటే ఎడమవైపు మరియిరువురు పరిచారకులు నిలుచుండి యున్నారు. నెత్తిమీద వీరికి పడగలు లేవు. నాగరాజునకు ముందరమున ఇరుగడల నిరువురుస్త్రీలు—వీరికిని తలమీద పడగ యుండుటచేతవీరును నాగులే కావచ్చు—రెండువైపులనున్న చెల్లకొమ్మలను-కుడివైపున నున్నది ఎడమచేతితోను, ఎడమవైపునున్నది కుడిచేతితోను-పట్టుకొనియున్నారు. వీరిరువురికి పరిచారకులు కలరు. కుడివైపున్న పరిచారిక కుడిచేతితో పూవును, ఎడమచేతితో కొమ్మను పట్టుకొనియున్న స్త్రీకేదో పాత్రవంటి దందిచ్చుచున్నది. ఈమెకు నెత్తిమీద పడగగలదు. ఎడమవైపునున్న పరిచారకుడు పిడికలిగిన గుండ్రనివస్తువును దేనినో ఎడమవైపుకొమ్మను పట్టుకొని యున్న స్త్రీకందిచ్చుచున్నాడు. ఈస్త్రీ ముందొకయున్న తాసనము కలదు. దానిమీద నామె తనకుడిమోకాలు నానించికొని యున్నది. నాగరాజునకుముందు ఎడమవైపు మువ్వురు నాగకన్యకలు కూర్చుండియున్నారు. వారు పాటకురాండ్రో ఏమో! వీరందఱికి తలమీద పడగయున్నది. ఈచిత్రముల నన్నిటిని పరిశీలించినచో నాగజాతిస్త్రీకి తలమీద ఒక్కపడగయు, పురుషునికి పెక్కుపడగలు నుండునట్లు తోచును. కూర్చుండిన మువ్వురు నాగజాతిస్త్రీలకు ఎదురుగ కుడివైపున ఒకస్త్రీ నాట్యము చేయుచున్న విధమున నున్నది. ఆమెను వెనుకనుంచి యొక నాగకన్యక పట్టుకొనుచున్నది. ఈమె వెనుక బల్లమీద నేదిగనో యొక చిన్న పాత్రకలదు. అన్నిటికంటె దిగువభాగమున కమలములు, హంసలు, కలువలు మొదలైనవి కలవు.

ఈచిత్రమునందలి యితివృత్తమేదియో బోధపడుటలేదు. బౌద్ధవాఙ్మయము నింకను బాగుగ జదివినగాని యిట్టి యితివృత్తములు తెలియరావు కాని గాథలుమాత్రము బౌద్ధయుగమునకు సంబంధించినవే యని నిస్సంశయముగ జెప్పవచ్చును.

అమరావతీ స్తూపమున నాగులచిత్రము లనేకములు కలవు. పడగలులేనివారలు ఏజాతివారో తెలిసికొన సాధ్యముకాదు. బట్టకట్టులోను, జుట్టుకట్టులోను వారును, నాగులు నొక్కరీతినే యున్నారు. వీరందఱు నాగరాజులచే పరిపాలింపబడు వారగుదురేమో. ఈస్తూపచిత్రము లన్నిటిలో నాగులచిత్రములు ప్రధానములుగ గాన్పించుచుండుటచేత నాగులకును అమరావతీ స్తూపమునకును ఎక్కువ సంబంధ మున్నట్లు కనబడును. టిబెట్టు బౌద్ధగ్రంథముల ననుసరించి నాగార్జునాచార్యులవారు నాగలోకమునకు వెళ్లిగనియు, అచ్చటినుండియే కొన్నితంత్రములను వేటినో దీసికొని ధాన్యకటకమునకు వచ్చిరనియు ఏవో గ్రంథముల జదివిన జ్ఞాపకము. మహాయాన బౌద్ధముకూడ నొకవిధముగ తాంత్రికమే యని కొందఱందురు. ఏది యెట్లయినను ఈప్రాంతము నాగుల కునికిపట్టని కాని, ధాన్యకటకమునకు నాగులకు నెక్కువ సంబంధ ముండి యుండునని కాని, మహాదేవుని ప్రయత్నముల మూలమున ఈప్రాంతమున బౌద్ధమతము నవలంబించినవారలు ప్రధానముగ నాగులైయుండిరని కాని, నాగార్జునాచార్యులవారికిని నాగులకును కలదనుసంబంధమున నేదియో కొంత సత్యముండునని కాని విశ్వసింపవలసి యుండును.

ఇక ఐదవ చిత్రములోని చిత్రమును జూతము. ఒక పటమలో ఏనుగుపైన ఒకరాజు ముందుకూర్చున్నాడు. అతనివెనుక నిరువురుస్త్రీలు కూర్చున్నారు. వీరందఱును నదిని-కృష్ణయేమో-దాటుచున్నారు. పడవ ఒడ్డు చేరగనే రాజు వెనుక కూర్చున్నవారు క్రిందికి దిగి తమకొఱకు వేచియున్న యిరువురుస్త్రీలను కౌగిలించుకొనుచున్నారు. వేఱొకస్త్రీ రాజునకు నమస్కరించుచున్నది.

పడవకు దిగువభాగమున నొక యాసనమున నొక స్త్రీ కూర్చుండియున్నది. ఈమెకు ఎడమప్రక్క నిరువురు పరిచారిక లున్నారు. అందొకతె ఏదియో తినుబండారము కందిచ్చుచున్నది. రెండవది తన యెక్కించిన కడవలోనుండి ఆమెకు త్రాగ నిచ్చుటకై పానీయము నొక పాత్రలో నైకొనుచున్నది. ఆమెకు కుడిచేతిప్రక్క సంగీత, జంత్రవాద్యకుశలురైన స్త్రీలు కలరు. వారిలో నొకరు పిల్లనగ్రోవి వాయించుచున్నారు. మఱియొకరు 'సితారు'వంటి దానిని దేనినో మీటుచున్నారు. ఈ సంగీతపాటకుల కెగువను సింహాసనమున నాసీనులై యిరువురు స్త్రీలు కలరు. ఆరవ పటములోని దానివలెనే ఇందలి యితివృత్తముకూడ తెలియవచ్చుటలేదు. ఇప్పటికుకూడ మనము చిత్రముల సౌందర్యము నుపలక్షించి తనివి నొందవలసిన వారమే.

ఏడు, ఎనిమిది చిత్రములలోని గాథలును మనకు దెలియరానివే. అయినను ఎనిమిదవ చిత్రపటములోనిది నిజమున కొకగాథ కాదు. ఆపటమధ్యమున నొకడు బుద్ధుని దగ్ధావశేషము నొక పాత్రయందుంచి దాని నొకపల్లెరమునునిడి, దానిని నెత్తిపైబెట్టికొని యున్నాడు. స్త్రీ పురుషులో, లేక దేవతలును, అప్సరసలులో నలయాకార

ముగ నాయుకవేషధారి చుట్టు దిరుగుచు అత్యంతోత్సాహమునను, భక్త్యావేశమునను నృత్యము చేయుచున్నారు. పటమున స్త్రీలందఱు పల్లెరమునకు వెనుకతట్టునను, పురుషులందఱు ముందుతట్టునను గన్పించుచున్నారు. ఇదియే ఎనిమిదవ చిత్రమునందలి వృత్తాంతము.

ఏడవ చిత్రమున సింహాసనమున నొక మహానుభావుడు పరివేషవిరాజితుడై కూర్చున్నాడు. అతనికి చెరియొక ప్రక్క రెండు ఉన్నతాసనముల మీద అతని రాణులు కూర్చున్నారు. వీరికి ప్రక్కలను, ఎదురను వీరికి సంబంధించిన పరిజన మున్నారు. వీరికి దిగువభాగమున, ఎడమచేతివైపు గీతవాద్యాదులందు ప్రవృత్తలైన స్త్రీలు కలరు. వీరికి కుడిప్రక్క దిగువ కొందఱు నృత్యము చేయుచున్నారు. వీరి కెగువను, కుడిప్రక్కను స్త్రీలు కొందఱు కూర్చుండి యీవినోదమును తిలకించుచున్నారు. ఇంతవఱకే మనకు దెలియవచ్చునది. ఈచిత్రమునందలి యితివృత్తమేమో మనకు దెలియదు.

అమరావతీ స్తూపముమీద "బౌద్ధపురాణ గాథలే కాక ఆకాలపు రాజసభలును, పట్టణగ్రామ పరిసరములును, యుద్ధరంగములును, సముద్రప్రయాణములును, వేషేల, ఆకాలపు రాజకీయ, సాంఘికస్థితి యంతయు కన్నులకుగట్టినటు లతిమనోహరముగ చెక్కబడియున్నవి. ఇందుగల ప్రతివృత్తాంతమును, గాథయు బయస్కోపులోని పటములవలె నొకదాని తరువాత నొకటి వచ్చునట్టు పటములమీద వరుసగా చెక్కబడియున్నవి. ప్రతిపటమునందును శిల్పకౌశల మత్యద్భుతముగ నుండుటయే గాక జీవకళ లుట్టిపడుచుండును. ఈచిత్రపటములవలన హిందూదేశమునందు, ముఖ్యముగ నాంధ్రదేశమునందు వ్యాప్తిచెందిన బౌద్ధమతస్వరూపము పూర్తిగ దెలియవచ్చుచున్నది. వీనినుండి అప్పటికి జనులు బుద్ధు నొకయవతారముగ నెంచి పూజింప మొదలిడిరనియు, అతనినిగూర్చి పెక్కు పురాణ గాథ లల్లి వానిని నమ్ముచుండిరనియు మనము గ్రహింపవచ్చును." 1

ఇట్లు మనకు ఇతివృత్తములు తెలియరాని చిత్రములెన్నియో అమరావతీస్తూపమున చిత్రితములైనవి కలవు. వాటినన్నిటిని బాగుగ పరిశీలించి యితివృత్తములను నిర్ధారణచేసి లోకమునకు విశదీకరింపవలసియున్నది. క్రీస్తుశకము ప్రాథమిక శతాబ్దములలో బౌద్ధమతము ఆంధ్రదేశమున ప్రబలిననాడు ఆంధ్రుల యాచారవ్యవహారములను, దుస్తులను, ఆభరణాదికములను, సాంఘికములైన గాథలను - వీటినన్నిటిని దెలిసికొనుటకు అమరావతీ స్తూప మాంధ్రులకు పెన్నిధివంటిది. ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వము(Individuality)ను, ఆంధ్రుల ప్రతిభను నిర్ణయించి తెలిసికొనుటకు మనకుగల ప్రధానాధారములలో అమరావతీ స్తూప మొకటి.

1. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము.

వెల స్వల్పము! ఫల మధికము!!

# ప్రతాపకస్తూరిమాత్రలు.




దీనియందు కస్తూరి, గోరోజనం, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము మొదలగునవిచేర్చి తయారుచేయబడినవి. మిక్కిలి ఘాటుగలిగి సువాసనగా నుండును. తాంబూలములో గాని, విడిగా గాని 1-2 మాత్రలను పుచ్చుకొనిన మిక్కిలి రుచికరముగా నుండుటయేగాక అజీర్ణము, వాయువు, జలుబు, జ్వరము, దగ్గు, ఉబ్బసము, సన్నిపాతములు మాంద్యములు, చిన్నబిడ్డలరోగము, కలరా, ప్లేగు, జలదోషము మొదలగు అనేకవ్యాధులను ఖండించి బలమును, ఆరోగ్యమును కలిగించుటలో అత్యుత్తమమైనవి. బిడ్డలకు యీమాత్రలను అప్పుడప్పుడు వాడుచుండిన వాయువును, అజీర్ణమును, చేరనివ్వక చక్కగా పోషించుచుండును అనేక యోగ్యతాపత్రములు గలవు. ఇప్పుడు బజారులో విక్రయింపబడుచుండు పోకరకము మాత్రలుగాక శ్రేష్ఠమైనగుణముచే ప్రతివారును వీటనేకొని యుపయోగించుచున్నారు. మీరు బజారులలో కొనునప్పుడు ప్రతాప కస్తూరి మాత్రలే కావలయునని కోరుడు. వారివద్ద లేనిచో మాకే వ్రాసిన శ్రేష్ఠమైన మాత్రల సీసాలను ఈక్రిందిధరల ప్రకారం పంపుదుము, 250 మాత్రలసీసా 1-కి 0—4—0 పడజను సీసాలు, 2—8—0, 3 డజనులు (36 సీసాలు) 6—9—0 రు. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

## ఉచితము సంజీవితాయతు

(మంత్రించి అద్భుతమైనక్రియతో తయారుజేయబడినది)

విచిత్రశక్తిగల దీనిని ధరించుకొనిన, గొప్పవారి దయ, కార్యసిద్ధి, ధనలాభము, వ్యాపారవృద్ధి, న్యాయస్థలములో అనుకూలము, పరీక్షలలో జయము, ఉద్యోగము చేకూరుట, అదృష్టము మొదలైనవి కలుగును. ప్లేగు, కలరా, స్ఫోటకము సోకవు. కష్టములను, గండములను తొలగించును. ఆరోగ్యము, బలము, తెలివి, అందము నిచ్చును. ఇది అనేకులచే మెప్పుపొందినది. ప్రచురణ పోస్టుఖర్చులకై రూ 1 యు పంపిన సంజీవి తాయతు ఉచితముగా పంపబడును. వి. పి. గా పంపిన 1-8-0 యగును.

## ఇంద్రజాల మహేంద్రజాలము

ఈ గ్రంథములో జర్మనీగారడి, హస్తలాఘవము, ఆంగ్ల ఇంద్రజాలము, మంత్ర శాస్త్రము, భూతవైద్యము, యంత్రములు; చీట్లపేక తమాషాలు, వినోదవిద్యలు, మనుష్యుని మాయముచేయుట, మామిడిచెట్టును పుట్టించుట, జీవముతో సమాధియగుట, శరీరము లేని తలచేత మాట్లాడించుట, గాలిలో మనుష్యుని నిలుపుట మొదలగు విచిత్రములున్నవి. దీనిచే మేజిక్ చేయగలరు. వెల రూ. 4.

ఉపాధ్యాయుల చింతామణి! విద్యార్థుల నగ్రప్రసాదము!

పి. ఆర్. జనార్దనం నాయుడు, ఒంగోలు, (గుంటూరు జిల్లా.)

## చదువతగిన ప్రకటన

| | | రు. | అ. |
|---|---|---|---|
| (1) | ఆదభక్తవిజయము | 6 | 0 |
| (2) | భగవద్గీత టీకా తాత్పర్యము | 2 | 8 |
| (3) | రామ-కృష్ణ-కర్ణామృతము టీ॥ తా॥ ప్రతి 1-కి | 1 | 8 |
| (4) | భాగవతసారము | 1 | 8 |
| (5) | ముకుందమాల | 0 | 12 |
| (6) | సింహాసన పురాణకథలు_శంకరవిజయము ప్రతి 1-కి | 0 | 8 |
| (7) | భారతకథలు | 5 | 8 |
| (8) | ఆంధ్రనామసంగ్రహము | 0 | 12 |
| (9) | శంకరనారాయణ నిఘంటు—ఇంగ్లీషుకు తెలుగు | 8 | 0 |
| | డిటో తెలుగుకు ఇంగ్లీషు | 5 | 0 |
| (10) | రామకృష్ణపరమహంస ఉపదేశవాక్యములు | 0 | 12 |
| | డిటో ఇంగ్లీషు పాకెట్ సైజు | 1 | 0 |
| (11) | Macmillan's Eastern Tales English *or* Telugu Edition Each Sort | 3 | 9 |
| (12) | Longman's Indian Reading Book series (English *or* Telugu Edition) Each sort | 3 | 12 |
| (13) | Fountain Pens—Black bird | 3 | 12 |
| | Swan | 6 | 12 |

అడ్వాన్సు బంపని ఆర్డర్లు గమనించబడవు.

యస్. వేంకటరాయులు అండు సన్స్,
96, తంబుశెట్టి వీథి, మద్రాసు.

వెలస్వల్పము! ఫలమధికము!! పరీక్షించదగినది!!!

# నారసింహ లేహ్యము




దీనియందు బంగారు, వెండిరేకులు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, సాలామిశ్రీ సఫేదామిశ్రీ మొదలగు అనేకవిధములగు వస్తువులతో తయారుచేయబడియున్నది. ఇదిమిక్కిలి వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో అత్యుత్తమమయినది. మేహము, నిద్రలేమి, నిస్సత్తువ, శుక్లనష్టము, సంసార సౌఖ్యలోపము, మూత్రముతోపాటు శుక్లము పడుట, మొదలగువానిని నివారించును. పటుత్వమైన యింద్రియమును పుట్టించును. రక్తమును శుద్ధిపరచి వృద్ధిగావించును. అతిమూత్రమును నివారించును. వృద్ధులకైనను యౌవనమును బలమును, కాంతిని, సంసారసౌఖ్యమును, మిక్కుటమగు ధాతుపుష్టిని సంతానప్రాప్తిని గలిగించు వరప్రసాదము. అనేక యోగ్యతాపత్రములు వచ్చియున్నవి. 2 డబ్బీలు తెప్పించి పరీక్షించినవారలు మరలమరల తెప్పించుకొనుటయే దీని ప్రాశస్త్యమునకు ప్రబలసాక్ష్యము. 2 డబ్బీలు చాలును. 20 తులముల డబ్బీ రు 2—8—0 పోస్టేజి 0—6—0

(నోటు:— ఈ ప్రతి 20 తులముల లేహ్యమునందున్ను 3-12-0 లు విలువగల ¾ తులం లోహాభ్రకసిందూరమును కలిపి సేవించినయెడల మహోదరము మొదలగు రోగములను శీఘ్రముగా పోనడచుటయేకాక మిక్కుటమగు వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో సందియము లేదు)

20 తులముల లేహ్యము, లోహాభ్రకసిందూరము కలిపి రు 6—4—0 పోస్టేజి రు 0—6—0

ఒక్కలాభము:— పంపు డబ్బాల లేహ్యము ఏకకాలమందు తెప్పించుకొనినచో రు 1-కి 0—2—0 కమీషను తగ్గించి పంపెదము. అన్ని ఔషధములు గల మా క్యాటలాగు యుచితము.

పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజం—పెరిదేపి—నెల్లూరుజిల్లా.

చౌకధరలు! చౌకధరలు!!

## స్వయంశిక్షా సంస్కృత గ్రంథములు

తిపాఠాచార్లతో 1—8—0

న. స్వామినాథశాస్త్రికృతము.

తెలుగు లిపిలో తెలుగు అర్థములతో వ్రాయబడినవి.

అసలుధరలు

శబ్దరూపావళి 0 5 0; నీతికథాసంగ్రహము 0-12-0; బాలకాదంబరి (పద్యము) 0 6 0; లింగానుశాసనము 0 4 0; ధాతురూపచంద్రిక 0 4 0. ఈ అయిదున్ను ఒక్కసారిగా కొనువారికి ఇవి 1 0 0 కే ఇవ్వబడును.

Outlines of Sanskrit Grammar 1 8 0

అడ్రసు:—

ఎన్. ఎస్. నీలకంఠం
C/o
ఎన్. ఎస్. నరసింహం, ఎం. ఏ.,
ట్రయినింగు కాలేజి, రాజమండ్రి.

## శాస్త్రిస్ గనేరియా క్యూర్



అన్నివిధములయిన శగరోగములు, స్త్రీల బహిష్టు మొదలగు సకల మూత్ర వ్యాధులకు అత్యద్భుతముగా పనిచేయును.

పెద్ద సీసా 1-కి రు. 3.

పోస్టుఖర్చు ప్రత్యేకము.

వివరములకు నేడే వ్రాయుడు.

మా ఔషధములన్నియు రసవిషగంధకములు చేర్చక కేవలము, మూలికలు, భస్మములచే తయారగుచున్నవి.

**V. S. SASTRY & SONS.,**
**Chemists, Druggists and Opticians, Tenali. S. S.**

## నిగళబద్ధకవి

బొమ్మరాజు జానకిరామశర్మ గారు

(ఆత్మగతము)

క° సుకక పల్కఁగా "పడుపుఁగూడు" నరాంకితమంచు పోతరా
"జిసి"యని రోయుచుఁ హితధరేశులు "గస్తురి" "రోజువెచ్చముఁ"
విసువక యిచ్చువారుఁ జన నేఁగృతిమానుచు బొడ్డుపల్లిలోఁ
"బెసలుతిలల్" పొలాన వెదపెట్టితి నక్కట! సేద్యగాడనై.

సీ. గౌడడిండిమభట్టు కంచుఢక్కను వోలెఁ బగులఁగొట్టితి నట్టు వడినగడ్డ
సత్కథాబీజముల్ సంతరించినయట్లు విత్తించితిని పంటవిత్తనముల
దీనారటంకాలఁ దీర్థమాడినరీతి మంచపైనుంటి పశ్మముల వానఁ
దెలుఁగురాయండిచ్చు దివ్యకస్తూరినా చేపట్టి ముతిసితి చేనియెఱువు
పూలనమ్మిన యంగడిఁ బుద్ధిలేక, కట్టె లమ్మినరీతినిఁ గనకలేఖి
నిఁ వహించిన చేతనే గునపమంది, గట్లు విఱిచితి చేతులు కాయఁగాయ.

మ. గరిటెఁ నాకి వ్రతమ్మునుం జెఱచితిఁ గాకేమి యూనాఁడు భూ
వరులే న్నాదు దరిద్రదేవతను గూల్పఁ జాలకేపోయి రీ
ధరణి న్నమ్మిన "కృష్ణవేణి" కృప యింతఁ జూపి సర్వస్వముఁ
హరియించెఁ దురదృష్టునిఁ ధనికుఁ జేయఁ శక్యమే యెరికిఁ!

సీ. "ప్రాప్తమా లేశమే పదివే"లనుచు నమ్ము పోతరాజున కిది పోలెగాక
"అకఁటికిఁ నిను నమ్మ భారతి" యన్న పోతరాజున కిది పోలె గాక
"నమ్మెట్రవేటుల" నమ్మతింపని మేటి పోతరాజున కిది పోలుఁగాక
"పడుపుగూడు" భుజింపఁ బాలుపడని శుచి పోతరాజున కిది పోలుగాక
గీ. లేక ధనికుల సభలలో లేచి స్వర్ణ-కింకిణులు మ్రోయఁ గృతికన్యఁ గొంకులేక
యెలమి నర్తింపఁజేసిన ఖలమతికిని - సాధుకర్షకత విధికి సమ్మతంబె?

శా. లేరా! ముందునుఁ గల్గరా! కృతుల నీలీలఁ ధరాపాలురఁ
బేరుంజేర్చి నుతించు సత్కవులుగానీ యొక్క పాత్రమ్ము నేఁ
శ్రీరామాంకితమో! శివాంకితమునో జేయంగ వాంఛింతు ర
య్యారే! నే నటువంటి భాగ్యమునకైనా! నోచనైతిఁ గదా!

గీ. మహిపతులు మంత్రిజనులుఁ గోమట్లు శూద్రు-లౌర? వీరని వారని యనఁగ నేల?
"వీథి"నంగడియందున వెట్టి యెల్ల-వారి కమ్మితి పద్యముల్ పాపమనక.

గీ. ఏడునూరుల టంకమ్ము లిచ్చువఱకుఁ-గదలనీయఁడు కంసాలి కరణ మిపుఁడు
ఆకలికి నోర్వవలెనో! ఘోరావమాన-వహ్ని తాపము నోర్వంగవలెనో, అకట!

మ. గమికర్మీకృతనైకనీవృతుఁడనై గ్రామంబు గ్రామంబు బ
ల్భ్రమునుం గాలికి కట్టి తిర్గితిని తద్గ్రామంబులన్ జారిణీ
రమణీవర్ణన, లోభివర్ణనము నై రాశ్యంబులన్ గూర్చి ప
ద్యములం బాడితిఁగాని వేలుపులు లేరా? పద్య మీఁగూడదా?

గీ. నేలనాలుఁగుచెఱఁగుల నేలినట్టి - పృథ్వీపతులకుఁ జేతిజంబీరమైన
నే నిపుఁడు చేతు లిఱికించి నిగళమందు - కాపుఁ గరణాల సభలోనఁ గట్టువడితి.

సీ. వీరభద్రారెడ్డి విద్యాంసుఁడగునేమి! యాంధ్రనైషధకర్త యైన నేమి?
కవిరాజ బిరుదంబుఁ గల్గియుండిన నేమి? సార్వభౌమాభిఖ్య చాలినేమి?
విన్ననమంత్రికి విందనయిన నేమి భాస్కరుమైత్రిచేఁ బఱఁగ నేమి?
మైలారువిభుని ప్రేమముఁ జూఱఁగొన నేమి? డిండిమభట్టు గెల్చియును నేమి?
గీ. కాపుఁగరణాలఁ బాదరతులను లేచు - రచ్చమిట్టలదుమ్ములో వచ్చువారు
పోవువారును నూఱడింపులును సేయ-బండకాల్యాలఁ గొగిటఁ బట్టవలసె.

శా. తల్లీ! శారద! నీకు నావలసి మత్కావ్యప్రపంచమ్మునం
దెల్లన్ సుంతయు మేలుకల్గద! రవంతేన్ నీదు పుత్రాళికే
యుల్లాసంబునుఁ గల్గలేద! కలదే నీవేళ తద్భాగ్య సం
ధల్లాభంబున నేను ముక్తిపదముం బ్రాపింపఁగాఁ జేయవే!

గీ. ప్రభులకీర్తినిఁ జెల్పి నాప్రతిభఁ జూప-ధరణి నాకావ్య మాచంద్రతారకముగ
నుండునే నింక, నాకు లేకున్న దేమి!-యేను మృతజీవుఁడనె యాంధ్ర(?)విషయమందు.

గీ. శారదోపాసనారసాస్వాదసిద్ధు-లందునే నొకఁడను ప్రళయమునసైన
అభవుఁడ విముక్తమునువలె హరికీర్తి-లోకసుక్షేత్రమునను వెల్గుదును నేను.

మ. కలిదోషాహరణంబుఁగా నలుని యాఖ్యానంబు వర్ణించితిన్
విలసత్సూక్తుల కాశిఖండమునన్ విజ్ఞాళి మెప్పించితిన్
పలుకన్ నేర్చితి చక్రవర్తులను శైవక్షేత్రసంపత్తినిన్
బలుకుందోడయి వాణి రా దరిగితిన్ భాషాప్రపంచమ్మునన్

మ. కనియుం బెంచియుఁ బెద్దఁజేసి చనిరేకా నన్నయాదుల్ మహా
ఘను లావేళను దిక్కులేని నిను వేడ్కం జేరఁగాదీసి పా

వన రీతుల్ గతు లుల్లసిల్ల స్వసంభావ్యస్థితిం గూర్చినా
వని విశ్వాసమెయున్న నీకు దయరాదా! నాపయిన్ భారతీ!

'ఆంధ్రవాణి'

గీ. తనయ! నీసేవ నేనింత దాసనైతి-ఖండఖండాంతరములఁ గ్రాంచినాను
పరమ పుణ్యుండ వీవు నీ భవ్యకీర్తి - శాశ్వతము శాశ్వతమ్మును శాశ్వతమ్ము.

గీ. సకల కర్ణాటరాజులు మకుటరత్న-కాంతి నీపదములకడఁ గాన్క వెట్టి
రదియు నాకుఁ బ్రతిష్ఠగ నాత్మఁదలతు-అపగతవిభేదనై "త్వమేవాహ" మనుచు.

ఉ. పంకజగర్భ దేవు తలవాకిట నెన్నిదినాలు నేను ని
శ్శంకముగాఁ జరింతునో లసద్గతి నంతటిదాక నీవు మ
త్కింకరభావమొప్ప నవకీర్తిశరీరముతోఁ బునర్జను
స్సంకటముల్ దొలంగఁగఁ బ్రచారము సేయుము భావవీథులన్.

క. అన్నన్న? నీకు భవనిముక - మున్నదె? నీ చేతిభిక్ష యుర్వినిఁ గం "పె
ద్దన్న" మొదలుకొని గం తద్దన్న కవులనంతకుఁ బ్రస్తుతం బాంధ్రమునన్.

శా. నీసంపైనను నీదుచేయు దగులన్ శృంగారభూషానమూ
ల్లాసాపాదకహా సువర్ణమగుచున్ లాలిత్యముంగాంచఁ బె
ల్లాసం బొందియుఁ బశ్యతోహరులునై యాంధ్రానవన్ సత్కవుల్
నీసంపైనను సంగ్రహింప కెటులన్ వీడంగలారో! కవీ?

(అని యదృశ్య యగును.)

---

## ఈశ్వరా!

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

ఇంచుక హాయి వద్ది హరియింప జరాయుజ జలో నొక్కటన్
మించి యతింపుచుండు నటు మిత్తి గుటుక్కున గుక్క వేయగా
బొంచియు నుండు వెంట నిది బుద్ధి నెఱింగియు బామరుండు ని
శ్చంచలవృత్తి నీయెడల నల్పపు బత్తి నిసీ! మహేశ్వరా!

మంచితనంబు ధూర్తమతి బట్టుటకున్ జెడుదారినుండి మ
ళ్లించుట కెట్లు చాలునో హరీ హరి! యెన్నడు దొంగవాకిటన్

మంచము వేయు మందురు క్రమంబునఁ బెద్దలు సుద్దు లందురుఁ
గొంచెడివారి కేమిగతి గూర్చినవాడ వహో! మహేశ్వరా!

చంచల మీ సమస్తము నసారము సంసరణం బటంచు గు
ప్పించు విరాగవాక్యములు వేయివిధంబుల మాతృహత్యకే
గొంచెపు పైడి గూడ గను గొంచెము పిగ్గనుపెంచినన్ దృణా
భ్యాంచితకూప మట్టి ఘనవంచకు బారికి దప్పి యెట్లో వ
ర్తించు వివేకి దారి గనుతింపగబోలు దటో మహేశ్వరా!

సంచులకొద్ది విత్తమును జాతురిమై గడియింపనీ, మహా
వంచకబుద్ధి భూములు నపారముగా గొని యాక్రమింపనీ,
క్రించులు గూడి సంఘమును గ్రిందను మీదను జేయనీ, నుతుల్
గాంచి రహింపనీ, దొరలె గౌరవనీయు డటంచు మ్రొక్కనీ,
ఇంచుక లేక నీకరుణ యెట్లు తరించునయా, మహేశ్వరా

పంచి భుజించువాడే సుజనస్థితి కొంచియమైన; దప్పు యో
జించి యొనర్చినట్టిదియు చక్కని చక్కని కార్య; మొందు లా
లించి యొసంగునట్టిదియు యింపు భోసము; సిరులెల్ల న
గ్గించెడి జాలె కైత; యిది నిత్యము సత్యమురా, మహేశ్వరా!

# శ్రుతిలేని

అడివి బాపిరాజు గారు, బి. ఏ.

పాడకే నారాణి
పాడకే పాట,
పాటమాధుర్యాల ప్రాణాలు మరిగెనే,
పాడకే నారాణి పాడకే పాట.

రాగ మాలాపించి
వాగులా ప్రవహించి,
సుడితిరుగు గీతాలు సురిగిపోనీయకే,
పాడకే నారాణి పాడకే పాట.

కరవీర కోరకాల్
కదలి నీ పెదవులే
ప్రణయపద మంత్రాల బంధించె జీవనము
పాడకే నారాణి పాడకే పాట.

శ్రుతిలేని నాహృదికి
చతురగీతం బేల?
గతిరాని పాదాల కతుల నర్తనమేల?
పాడకే నారాణి పాడకే పాట.



చిత్రము ౧౫

# విభవ సంవత్సర విశేషములు

౧౯౨౮

మార్చి ౧౭. ఇందూరు హోల్కారు-నాన్సీమిల్లరుల వివాహము.

౨౧. శస్త్రనియమన (Disarmament) సమావేశము, జెనీవా.

ఏప్రిల్ ౧౫. జటప్రోలు రాజావారి మృతి.

౨౭. అఖిలభారత హిందూమహాసభ- అధ్యక్షులు-యన్. సి. కేల్కారుగారు.

౨౩. మగన్‌లాల్ గాంధీగారి మరణము.

౨౬. డా. సుధీంద్రబోసు దంపతులు అమెరికానుండి భారతదేశమునకు వచ్చి చేరుట.

మే ౧. బార్డోలీయందు శిస్తుపన్నుల నిరాకరణ సత్యాగ్రహ ప్రారంభము.

౨. బళ్లారి రాఘవాచారిగారు విదేశములకు వెడలుట.

౧౫. సకలాంధ్రకవి సమ్మేళనము-శ్రీమునిపట్టణము.

౧౯. సర్వపక్షసమావేశము-బొంబాయి.

౨౮. పుదుకోట మహారాజావారి మృతి.

౩౧ నిజాంరాష్ట్రాంధ్రసభలు-సూర్యాపేట(౩ దినములు)

జూన్ ౧౦. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి మృతి.

౧౨. పండిత గోపబంధుదాసుగారి మృతి.

౨౬. కోవెలమూడి గోపాలకృష్ణయ్యచౌదరిగారి మృతి.

౨౮. చల్లపల్లి రాజావారి మృతి.

జూలై ౧౩. ఆర్యవైశ్య మహాసభ-వాయల్పాడు.

౨౮. ఆంధ్రసభలు-గుంటూరు (౫ దినములు)

ఆగస్టు ౨. బార్డోలీకి గాంధీగారి ప్రయాణము.

౫. బార్డోలీ సత్యాగ్రహ పరిసమాప్తి.

౩౦. లక్నోయందు భారతస్వాతంత్ర్యసమితి స్థాపనము-స్థాపకులు: జవాహర్లాల్ నెహ్రూగారు.

సెప్టెంబరు ౧౨. సరోజినిదేవిగారి అమెరికా ప్రయాణము

౨౧. ప్రథమ అఖిల భారత రాష్ట్రీయ సహకారసంఘ మహాసభ-సిమ్లా.

౨౬. శ్రీరాజారామమోహనరాయల వర్ధంతి.

అక్టోబరు ౨. శ్రీగాంధీగారి ౬౦ వ జన్మదినము.

౬. 'హిందూ' ఆంగ్ల దినపత్రిక పంచాశద్వార్షికోత్సవము.

౧౯౨౮

౧౮. బర్కెన్‌హెడ్డుగారు ఇండియా మంత్రి పదవికి రాజీనామా నిచ్చుట.

౨౧. కాకినాడ ప్రాంతములు జలప్రళయము.

౨౨. శ్రీపిఠాపురము మహారాజావారు బ్రహ్మమతప్రచారమునకై ౧ లక్షరూపాయలు విరాళమొసగుట.

౨౩. ఇండియా మంత్రి పదవికి పీల్ ప్రభువుగారి నియామకము.

౨౫. లామెంబరగు గౌ|| యస్. ఆర్. దాసుగారి మృతి.

౨౯. అఖిలభారత సర్వీయ బ్రాహ్మణ మహాసభ-కాశీ.(౧౧ దినములు) అధ్యక్షులు- దర్భాంగ మహారాజాగారు.

౩౦. లజపతిరాయిగారికి పోలీసు లాఠీదెబ్బలు తగులుట.

నవంబరు ౩. అఖిలభారత కాంగ్రెసుసంఘ సమావేశము-ఢిల్లీ.

౫. బార్డోలీ సత్యాగ్రహ విచారణ ప్రారంభము.

౬. హెర్బర్టు హూవరుగారు అమెరికను ప్రజాస్వామిక ప్రభుత్వాధ్యక్షులుగ ఎన్నుకొనబడుట.

౧౦. జపానుచక్రవర్తి హిరోహిటోగారి పట్టాభిషేకము.

౧౬. లాలాలజపతిరాయిగారి మృతి.

౧౯. ౧౧వ ఆంధ్రరాష్ట్రీయ మహాసభ-నంద్యాల.

౨౦. అఖిలభారత ప్రాచ్యమహాసభ-లాహోరు అధ్యక్షులు డా. ఉల్వరుగారు.

౨౧. దక్షిణాఫ్రికా ఏజెంటు జనరలుగ కె. వి. రెడ్డినాయుడుగారి నియామకము.

౨౫. బొంబాయిరాష్ట్ర ప్రథమాంధ్ర సాంఘిక మహాసభ-కళ్యాణి. అధ్యక్షులు: వేమవరపు రామదాసుగారు.

౨౬. సర్. బ్రజేంద్రలాల్ మిత్తర్‌గారు, యస్. ఆర్. దాసుగారి స్థానమున లామెంబరుగ నియమింపబడుట.

(?) అఖిలభారత సాంఘిక మహాసభ-కలకత్తా. అధ్యక్షులు- యం. ఆర్. జయకర్‌గారు.

డిసెంబరు ౨ గుంటూరు, శారదా నికేతన పంచమ వార్షికోత్సవము.

౧౬. సర్ పానగల్ రాజాగారి మృతి.

౧౭. లాహోరునందు సాండర్సు హత్య,

౧౯. అఖిలభారత వాణిజ్య సంఘ మహాసభ-ఝరియా.

౧౯౨౯

డిసెంబరు ౧౯. ౪వ భారత తత్త్వశాస్త్ర మహాసభ - మదరాసు. అధ్యక్షులు-ఎ. బి. ధ్రువగారు (3 రోజులు)

౨౧. అఖిలభారత మహాసభా ప్రదర్శన ప్రారంభము కలకత్తా. ప్రారంభకులు: డా. అన్సారీగారు.

౨౨. అఖిలపక్ష సమావేశము, కలకత్తా.

౨౮. స్త్రీల సాంఘిక మహాసభ. అధ్యక్షురాలు-తిరువాన్కూరు జూనియరు రాణి.

౨౯. ౪3వ భారత జాతీయ మహాజన సభ - కలకత్తా. అధ్యక్షులు-మోతీలాల్ నెహ్రూగారు.

3౦. మితవాద మహాసభ - అలహాబాదు. అధ్యక్షులు-సర్. చిమన్‌లాల్ సెతల్‌వాడ్ గారు.

3౧. అఖిలపక్ష మహామ్మదీయ మహాసభ-ఢిల్లీ.

జనవరి ౧. అఖిలభారత పత్రికారచయితల మహాసభ - కలకత్తా అధ్యక్షులు-కె. నటరాజన్‌గారు.

౨. భారత ఆర్థిక మహాసభ-మైసూరు. అధ్యక్షులు-ప్రొఫెసరు వి. జి. కాలేగారు.

3. రాష్ట్రీతరాంధ్ర మహాసభ-ఖర్గపురము. అధ్యక్షులు-గా. హరిసర్వోత్తమరావుగారు.

౬. భారత మహిళా విద్యాసంస్కరణసభ-పాట్నా అధ్యక్షురాలు-మండీసంస్థానపు రాణి.

౧౪. అఫ్గను అమీరు అమనుల్లాగారి రాజ్యపరిత్యాగము.

౧౮. ౪ అమనుల్లాగారి ఖండహారు ప్రయాణము.

౨౧. ౧౧వ ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము - మచిలీపట్టణము.

౨౪. అసెంబ్లీలో లజపతిరాయిగారి స్థానమున దైవాన్ హంసరాజుగారి నియామకము.

ఫెబ్రువరి ౬. శ్రీబులుసు సాంబమూర్తిగారి ఎరెస్టు-బెజవాడ.

౧౯. చెన్నపురి పురపాలనసంఘమున సైమను కమిషను స్వాగత సంబంధముగు గందరగోళము.

౧౯. ఢిల్లీ యందు గా॥ పటేలుగారింట గాంధీగారికివిందు.

మార్చి ౪. విదేశవస్త్రముల దహనసందర్భమున గాంధీగారి ఎరస్టు. జామీనుపై విడుదల-కలకత్తా.

౫. గాంధీగారి రంగూను ప్రయాణము.

౧౯౨౯

౧౬. దేశమునందంతటను విదేశవస్త్రముల దహనసంస్కారము జరుగుట.

౧౯. గోషెన్‌ప్రభువు, ఇర్వినుగారి స్థానమున నూతన రాజప్రతినిధిగ నియమింపబడుట.

౨౧. బులుసు సాంబమూర్తిగారిని రాజమండ్రినుండి బళ్లారి చెరసాలకు మార్చుట.

౨౬. గాంధీమహాత్మునకు కలకత్తా కేసునందు ౧ రూ. జరిమానా విధించుట.

౨౮. మద్రాసురాష్ట్రీయ వర్ణాశ్రమధర్మసభ - మదరాసు. (3 దినములు)

3౦. వంగరాష్ట్ర మహాసభ - రంగపూరు. అధ్యక్షులు-సుభాషచంద్రబోసుగారు.

3౦. ౧౨వ అఖిలభారత హిందూమహాసభ - సూరతు. అధ్యక్షులు-రామానంద ఛటర్జిగారు.

3౦. ౨౦వ భారత మహమ్మదీయ సమితి సమావేశము-ఢిల్లీ. అధ్యక్షులు-జిన్నాగారు.

3౦. ౬వ సంయుక్తపరగణాల జాతీయ మితవాద మహాసభ-లక్నో. అధ్యక్షురాలు - అనీబిసెంటమ్మ.

ఏప్రిల్ ౧. కథియావాడు రాజకీయసభ-మోర్వి. అధ్యక్షులు-వల్లభాయిపటేలుగారు.

3. భారతదేశీయ తంతుకారక సంఘసభ - సబర్మతీ, అహమ్మదాబాదు.

౭. హైదరాబాదునకు మహాత్ముని రాక.

౭. ఇంగ్లండునుండి ఇండియాకు మొదటిపర్యాయము విమానముపై తపాలు వచ్చుట.

౭. రాజపాల్ ('రంగీలారసూల్' గ్రంథకర్త,)గారి హత్య.

౮. అసెంబ్లీ యందు బాంబులు పడుట.

౮. సహకారసంఘ శాసన రజతోత్సవము-చెన్నపురి.

౯. గాంధీమహాత్ముని ఆంధ్రదేశ సంచార ప్రారంభము, బెజవాడకు రాక.

౯. జే. యమ్. సేన్‌గుప్తగారు ౪వ తూరి కలకత్తా పురపాలక సంఘాధ్యక్షులగుట.